# FOREWORD

Mr. K. Satakopachary, M. A., B. L, of Cocanada is to be heartily congratulated on his excellent Telugu translation of H. G. Wells' **History of the World** with copious notes and a valuable introduction, which are intended to make the work interesting to the Telugu reader.

In modern democracies where the capacity for reading has far outrun the capacity for thinking, every one who endeavours to 'educate our masters' deserves our sympathy. Mr. H. G. Wells is one of the greatest teachers of our times. His book on the **History of the World** was for years one of the best sellers. He has written it not as a scholar, not as an Englishman with faith in the mission of his own country to give a lead to the world, but as a humanist, a citizen of the world delighting in the varied manifestations of the human mind and able to discover the common stuff underlying the diversity of people. At a time when nations are organising immorality as an instrument of political power, and behaving as victims of the herd instinct and traitors to humanity, it is good to be reminded of our membership of the human community and obligations to the human race. Mr. Wells

traces the general transformations of the structure of human society which, with many variations of method to suit time and place, is now trying to substitute interdependence for independence in political and economic, cultural and religious, relations.

History is significant change. It is the task of the historian to discern the significance, the meaning, the pressure of eternity on the events of time. For Wells, the meaning of history is the achievement of a world state, an international community, and his work is a contribution to the development of a world-conscience, a world-soul.

It is written in clear ringing prose which bears on every page evidence of the author's learning and imaginative sensibility, and endless command over facts and opinions. The Telugu public are immensely indebted to Mr. K. Satakopachary for giving them this great work.

**S. Radhakrishna.**

# ఉపోద్ఘాతము

హెచ్. జి. వెల్సుగారి ప్రపంచచరిత్రకు ఆంధ్రమున మంచియనువాదమును విపులమగు టిప్పణులను ప్రశస్తమగు భూమికను జేర్చి, ఆంధ్రపాఠకులకు రంజకముగ రచించిన శ్రీకో. శరగోపాచార్యులు, ఎం. ఎ., బి. యల్. హృదయపూర్వకముగ నభినందనీయుడు.

ఆధునిక ప్రజాసంస్థలందు పఠనశక్తియంత విరివిగా ఆలోచనశక్తి వ్యాపించుటలేదు. అట్టితరి మనయజమానులగు ప్రజలకు జ్ఞానము గల్గింప యత్నించువారియెడ సానుభూతి జూపనగు. హెచ్. జి. వెల్సుగారు నేటి బోధకశ్రేష్ఠులలో నొకరు. వారి 'ప్రపంచచరిత్ర' చాలయేండ్లు మిక్కుటముగ అమ్మినగ్రంథము. దాని నాయన పాండిత్యప్రదర్శనకును తన దేశమే ప్రపంచముకంతటికిని మార్గదర్శక మను ఆంగ్లేయ ధోరణితోనుగాక, విశ్వజనీనభావముతో మానవచిత్తవృత్తిలోని వికాసభేదముల కానందించుచు, ఆయావివిధజాతుల సామాన్యసత్వమును గనిపెట్టగల జగత్ కుటుంబిగనే వ్రాసినాడు. ఆయాజాతీయులు అవినీతిని తమరాజకీయబలమునకు సాధనముగా నేర్పర్చుచు, గతానుగతిక సూత్రమున మ్రగ్గి, మానవధర్మమునకు విద్రోహులై చరించుచున్న యీకాలమున మానవసంఘమందు మనసభ్యతను మానవజాతియెడ మనకుగల బాధ్యతలను జ్ఞప్తికితెచ్చుట మంచిది. దేశకాలోచితముగ

వివిధపద్ధతులఁ మారుచు, రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక, ధార్మిక సంబంధములందు ప్రత్యేకత్వ మంతరింపజేసి దానికిబదులు పరస్పరాధారమునే స్థాపించుటకు మానవసంఘ మిప్పుడు యత్నించుచున్నది. దానినిర్మాణమున గల్గు సాధారణపరిణామ మును వెల్సుగారు బాగుగ వివరించినారు.

విశిష్టపరిణామమే ఇతిహాసము. తద్విశేషమును, తదర్థ మును, కాలపరిమాణమందు శాశ్వతత్వచిహ్నమును గమనిం చుటయే చారిత్రకుని కర్తవ్యము. ప్రపంచమంతట నొకే ప్రజారాజ్యనిర్మాణమును, అంతర్జాతీయసంఘస్థాపనయునే ఇతి హాసభావ మని వెల్సుగారియూహ. విశ్వజనీనభావమును, జగదాత్మకత్వమును వ్యాప్తినొందించుట కాయనగ్రంథము మిగులసహకారియైనది.

ఈగ్రంథము స్వచ్ఛమగు ఉజ్వలశైలిని వ్రాయఁబడినది. గ్రంథకర్తపాండిత్యము, భావవైశద్యము, విషయములయెడ అభిప్రాయములయెడ వీరికిగల అనంతసామర్థ్యమును ఇందలి ప్రతిపుటయు వెల్లడించుచున్నది. ఇట్టియుద్గ్రంథమును దమకు లభింపజేసినందుకు శరణోపాచార్యులుకు ఆంధ్రులెల్లరు మిక్కిలి కృతజ్ఞులు.

సర్వేపల్లి రాధాకృష్ణ.

# చిత్రపటములు

నరులు మూడుజాతులలో గన్పడి సంచారులై పలుదిశలకు వ్యాపించిరి. వీరు శిలాలోహావస్తువులవాడుకను, పిదప జంతువులవేటను విల్లంబుల వాడుకను, పిమ్మట కృష్యాదులను నేర్చిరి. అంతట జనులలో సంఘీభావమును నాగరికతయు జ్ఞాన వికాసమును ఏర్పడినవి. ప్రత్నతత్వజ్ఞులు పరిశోధించి ఇట్లు నిరూపించినారు. ఈజీవవికాసము క్రమాగతము; దీని ఆయాపూర్వ యుగములకు శాస్త్రజ్ఞులు వేరువేరుపేరులు పెట్టినారు. వారి నిర్ణయప్రకారం తెలిన ఆయాయుగములపట్టీని అప్పటి క్రమ పరిణామమును దెల్పు జీవపరిణామవృక్షమును దిఙ్మాత్రంగా ఇందు గనపర్చినాను.

---

# ఆయా యుగముల పట్టిక.

(భూమికాలము సుమారు 200 కోట్ల యేండ్లు.)

| ఎన్నియేండ్లక్రింద | యుగము | అప్పటి భూలక్షణము, ముఖ్యజీవులు. |
|---|---|---|
| 200-130 కోట్లు | ఆరంభయుగము | (భూగోళము జలము ఏర్పడెను.) |
| 130-80 కోట్లు | అజీవయుగము | (అప్పటికి ప్రాణులు లేవేమో!) |
| 50 కోట్లు | పురాణజీవ యుగము | లోతులేని సముద్రములు |
| | 1. సిల్యూరియను | నాచు, నీటిక్రిములు, |
| | 2. డెవోనియను | సముద్రపుచేపలు (మత్స్యయుగము) |
| 20 కోట్లు | మధ్యజీవ యుగము | మొదటి నేలమొక్కలు కప్పలు, బల్లులు, తాబేళ్లు, (సర్పయుగము) |
| | 1. ఉభయ చరములు | (కర్బనకరములు.) |
| 8 కోట్లు | 2. సరీసృపములు | తుప్పలు, తాళ్లు, పాములు, మొసళ్లు, డినోసార్లు, గింజలచెట్లు. |
| 4 కోట్లు | నవజీవయుగము | మహాగిరులుపక్షులు (వరాహయుగము) సస్తనులు, గడ్డి, అడవిచెట్లు. |
| | ఆధునికయుగము | 1 నారసింహ యుగము |
| 2½ లక్షలు | i-2 హిమయుగము | కచ్ఛపప్రవానరులు, చింపాంజీ, గోరిల్లా, హీడల్బర్గు, ఉదయనరుడు. |
| 1 లక్ష | ii 2-3 ,, | నియాండర్తలరు |
| 50 వేలు | iii 3-4 ,, | గుహావాసులు, రోడేసియను |
| | నరయుగము | (క్రోమాగ్నను గ్రిమాల్టీలు వేట) |
| | పూర్వశిలా కాలం | వ్యవసాయారంభము, జాతరలు. |
| 30 వేలు | నవశిలా ,, | చక్కని పనిముట్లు, (గోధుమవర్ణులు) |
| 15 వేలు | సూర్యశిలా ,, | సుమేరియను ఆదులు నేటివరకు |
| 10, 8 వేలు | చారిత్రక ,, | నాగరికజనులు. |

ఈయంశములఁగూర్చి మన ప్రాచీనులభావముల గొంత గమనింతము. అవ్యక్తమగు సత్పదార్థమునుండియే వ్యక్తు లన్నియు అనుకూలతేజఃప్రసారకాలమున గలిగె ననిఁ[1], ఆప్రాణులు జలమందే ఆరంభించె ననిఁ[2], ఆ జీవకారణమగు మహాశక్తి అణువయ్యు విశ్వవ్యాపియై చైతన్యమిచ్చె ననియు[3], కాని దానియథార్థతత్వము మనకు దెలియదనియును[4] మన పూర్వులు వచించిరి.

ఇట్లు సృష్టిని నియమించు పరమాత్మశక్తి సర్వాంతర్యామి సర్వభూతసమము విశ్వరూపము నై యుండును.[5]

1. అవ్యక్తాద్ వ్యక్తయస్సర్వే ప్రభవంత్యహరాగమే (భ. గీ. 8-18)

2. సఇమాల్లోకా నసృజతాంభోమరీచిః...అధస్తాత్తా ఆపః...... ఆప ఏవపురుషం సముద్ధృత్యా మర్ఛయత్. (ఐ. ఉ. 1-1-3)

అపఏవ ససర్జాదౌ, తాసు వీర్యమథాసృజత్. (మ. స్మృ. 1-8)

3. అణోరణీయాన్ మహతోమహీయా నాత్మాఽస్యజంతోర్నిహితో గుహాయాం. (క. ఉ. 1-2-20)

నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానా మేకోబహూనాం...

(క. ఉ. 2-5-13)

4. యస్యామతం తస్యమతం, మతంయస్యనవేదసః

అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాతమవిజానతాం(కే. ఉ. 2-3)

5. స ఏవకాలో...పాశాంశ్ఛినత్తి (శ్వే. ఉ. 3-15)

"ఐతదాత్మ్యమిదం సర్వం——" (ఛాం. ఉ. 6-8.)

దివిసూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా, యదిభా స్సదృశీ సాస్యాత్ భాసస్తస్య మహాత్మనః (భ. గీ. 11-12)

ఆయాయుగములందు లోకోద్ధరణకై భగవంతు డవతార మెత్తె నని, అందు దశావతారములు ముఖ్యము లనియు, మన పూర్వుల భావము. వాని క్రమమును గమనించిన ప్రారంభదశ యందు అనగా వైజ్ఞానికుల పురాణజీవయుగమున కేవల జలచరమగు మత్స్యముగను, తరువాత (మధ్యజీవయుగమున) ఉభయచరమగు కూర్మముగను, అంతట (నవజీవయుగమున) స్తనము శిశుపోషకము పిండజము అగు వరాహముగను, పిమ్మట (ఆధునికయుగపు మొదటి రెండుహిమమధ్యయుగము లందు) కొంత తిర్యగ్జంతుస్వభావము కొంత నరలక్షణములు గల నరసింహాకారముగను, ఈశ్వరాంశ మీజగత్తునం దవతరించెనని తెలుసు. తరువాతనే నరావతారములు గల్గెను; ఆవరుసలోను విశేషముకలదు. ఆదిమనరులు మూడుజాతులు (శ్వేతహారితజాతి, గోధుమవర్ణము, నీలవర్ణము) అగుటను, వారు ప్రాచ్యోత్తర దక్షిణ పశ్చిమదిశలను జగత్తుఅంతటను వ్యాపించుటను, ఆదిమ నరులు సంచారిజాతులుగనుండుటను, వామనుని త్రివిక్రమత్వము త్రిలోకాక్రమణమును సూచించును (పూర్వశిలాకాలము). తరువాత పరశురాముడు కందమూలసంపాదకమగు లోహోప కరణ ముపయోగించుట, శ్రీరాముడు కోదండపాణియై వేట జీవనము కవసరమగు విల్లంబులతో నుండుట, ఆతరువాత వచ్చిన (బలరాముడు వ్యవసాయచిహ్నమగు నాగలిని), శ్రీకృష్ణుడు చక్రమును ధరించి గోపాలన జేయుట * (నవశిలా

* చక్రము యంత్రచిహ్నము, పూర్వము నూలువడుకు చక్రము మొదలు రకరకములబండ్లు, తుదకు విమానముల ఇంజనులకును చక్రసూత్ర మాధారము.

కాలము), ఆపిమ్మట నే జ్ఞానవికాసచిహ్నముగ బుద్ధుడవతరించుట' నరజాతి కిట్లు క్రమవికాసము గల్గెనని సూచించును; ముందు మనజగత్తు కింకను గొప్పపరిణామము కలుగనున్న దని రాబోవు కల్క్యవతారము సూచింపవచ్చును. ఆక్రమము వైజ్ఞానిక సిద్ధాంతక్రమమునకు సుమారుగ సరిపోవుట కేవలము కాక తాళీయ మన వీలులేదు.

ఇట్లు యుగయుగాలుగ జరిగిన జీవవికాసము, పరిణామము భూమిపై ప్రతివారిలోను లీనమై, ప్రత్యక్ష మగుచున్నవి. ప్రతిప్రాణియు తనజాతికన్న నీచములు పూర్వ యుగపువి అగు జీవులస్వరూపమును గర్భస్థదశలోనో అండ దశలోనో ముందుగా పొందియే, తరువాత క్రమముగా తనజాతిజంతువుగ పరిణమించును. ఇట్లు ప్రతి స్తనజంతువును పిండదశలో మత్స్యాకృతిని అంతట కూర్మసరీసృపాదిరూపము లను పొందియే తనజాతిస్వరూప మొందు నని వైజ్ఞానికులు గని పెట్టిరి. ఇట్లే మానవప్రాణియు తల్లిగర్భమున పిండంగా ఉన్న మొదటినెలలలో ఆరంభంలో ద్రవరూపంగా సూక్ష్మజీవిగను, అంతట మత్స్యాకారముగను ఏర్పడి, తరువాత అందు పరిణామము కలుగుచురాగా, చేపతిత్తులు వగైరాలు పోయి, చిన్న స్తనాకృతి నొంది, ఆపైన మేధాశక్తి బలపడి, అంతట ఒకవిధమగు వానరాకారము గల్గును. ఇట్లు కొన్నినెలలు పరిణామము కలిగినమీదటనే, నరరూపము సిద్ధించును. నర శిశువు జనించినతరువాతగూడ మొదట పరుండియేయుండి,

తరువాత క్రమముగ కూర్మవరాహాదులవలె ప్రాకుచు, అవ్యక్త ధ్వనుల జేయుచు, ఆతరువాతనే మాటల నేర్చి, కోతులవలె కొంచెముగ లేచి అడుగులు వేయనేర్చి, ఆపిమ్మట నరులరీతిని మాటాడుచు నడుచుచుండును. మనభూభారమంతను (నరులో దేవతలో కాక) మహామీనము ఆదిశేషుడు ఆదికూర్మము ఆది వరాహము దిగ్గజములునే మోయుచున్న వనుటలోగూడ యుగయుగములుగాను ప్రతినరవ్యక్తిలోను ఉండుజీవుల కాధార మట్లే యేర్పడె నని ఆవరుసనే ప్రాణులు వృద్ధియయ్యె ననిగూడ సూచితము కావచ్చును.

ఆయాజాతులనరులు వివిధదేశములకు వ్యాపించి వేరువేరుదేశీయు లైరి; వారిలో చాలమంది అసలు ఏకజాతీయులే, ఏకప్రాంతీయులే; ఈసంగతి వారి యంగనిర్మాణమువల్ల నే గాక, వారు మాట్లాడు భాషలసంబంధమువల్లను స్పష్టము. మన ఆర్యావర్త భాషలును పారసీ, రష్యను, యూరపులలోని ఇంగ్లీషు ఫ్రెంచి జర్మను మున్నగునవియు సన్నిహితములు, అసలు ఒకేభాషనుండి పరిణమించినవి - అని భాషాశాస్త్రజ్ఞులు నిర్ణయించినారు. ఇట్లే ద్రావిడభాషలలోను పరస్పరసంబంధము కలదు. వాని అన్యోన్యత ఇందు చేర్చిన పట్టికచే తెలియును.

# ముఖ్యమగు ఆర్యభాషలు



# ముఖ్యద్రావిడ భాషలు




| | | | |
|---|---|---|---|
| ముఖ్యసెమిటిక్ | శాఖలు: | హీబ్రూ, అరబ్బీ | భాషలు. |
| ముఖ్య మంగోలు | ,, | తుర్కీ, చీనా, జపాను | ,, |

(మూలార్యభాష మూలద్రావిడము పదిపండ్రెండువేలయేండ్లకుపూర్వము వాడుకలో నుండియుండును.) ఈ మూలార్యభాషకు, మూలద్రావిడముకు, సెమిటికు మంగోలియనుల మూలభాషలకును, అంతకుపూర్వము అన్యోన్యసంబంధ ముండియుండవచ్చు; అందునుగూర్చి నిర్ణయింప భాషాశాస్త్రజ్ఞు లింకను చర్చలు జరుపుచున్నారు.

మనప్రాచీనభారతపుఆర్యులు ద్రావిడులు గూడ చాల నాగరికులై యితరదేశములతో దూరవ్యాపారము చేయుచుండిరి. పురాతనరాజులు ఋషులు త్రివిష్టపాదులకు వెళ్ళి మరల భారతదేశము చేరుచుండినట్లు ఆర్షగ్రంథములందు తెల్పబడెను; క్రీ. పూ. 5, 6 శతాబ్దులందు భారతీయవిద్వాంసులు శిల్పులు పారసీకరాజ్యమం దుండినట్లును, అశోకవర్ధనుని కాలమున (క్రీ. పూ. 3-వ శతాబ్దిలో) అలెగ్జాండ్రియా సిరియా మున్నగుప్రాంతములందు చీనా శ్యామసింహళాబలి, సుమత్రా, జావా మున్నగు దూరప్రాచ్యదేశములందుగూడ బౌద్ధతత్వజ్ఞులు శిల్పులు హిందూసంస్కృతిని భారతీయశిల్పకళాదులను వ్యాపింపజేసినట్లును, మందిరశిలాచిత్రాది స్పష్టనిదర్శనములు నిల్చియున్నవి. (యూదదేశమున ఏసు బోధించిన క్రైస్తవమతముకు కొంతవరకు హిందూబౌద్ధసిద్ధాంతములాధారములని కొందరు ప్రాజ్ఞులగు విమర్శకుల అభిప్రాయము.) తరువాత కనిష్క శాతకర్ణి గుప్తరాజాదుల కాలమందును భారతీయులు తత్వశాస్త్రభౌతికవిజ్ఞానములందును శిల్పకళాపరిశ్రమలందునుగూడ ప్రవీణులై, వానిని దేశాంతరములకును వ్యాపింపజేసినారు; (ఈపద్ధతి అమెరికాకును ప్రసరించె నని

సూచన లున్నవి) అందుకు ఆప్రాంతములందు అనేకనిదర్శనములు గలవు. ఇట్లితరదేశీయులకన్న హెచ్చుగ శక్తివిజ్ఞానయుతులైనను, ప్రాచీనభారతీయులు ఇప్పటి ప్రబుద్ధులవలె స్వార్థపరులుగాక, తమవిజ్ఞానము నంతటను వెదజల్లి, లోకాస్సమస్తాస్సుఖినోభవంతు' అను విశ్వజనీనభావమునే గలిగియుండిరి. అప్పుడు మనదేశము ప్రాచీనప్రపంచమునకు నాయకమణిగ నుండెను.*

---

* మనప్రాచీన గ్రంథములలో కొన్నిచోట్ల సముద్రయానమేల నిషేధించిరని సందేహము కలుగవచ్చును. అనిషేధము మొదటి నుండి లేక, మధ్యకాలముననే [జపానీయులలోవలె] ఏర్పడెను. క్రీ. శ. 2, 3 శతాబ్దుల పిమ్మట అన్యదేశములందు అంటువ్యాధులు, సంచారిదళబాధ, అశాంతస్థితి, ప్రబలియుండెను. అవి వ్యాపింపకుండుట కానిర్ణయముజరిగియుండునేమో! సముద్రమున తుపానుల ప్రమాదమునప్పు డధికమైయుండవచ్చును. అప్పటి మనఋషులు న్యాయకర్తలై, దేశకాలావసరములబట్టి చర్చించి, తమయాచార వ్యవహారములను ధర్మశాస్త్రపు నియమములకూడ దేశహితకర మగునట్లు మార్చుచు వచ్చిరి.

"అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మ్యమప్యాచరేన్నతు, సముద్రయాత్రాస్వీకారః కమండలు విధారణం......ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యానాహుర్మనీషిణః. (బృహన్నారదీయము) అ. 22-12-16.

దత్తౌరసేతరేషాంతు పుత్రత్వేనపరిగ్రహః, శూద్రేషుదాసగోపాలకులమిత్రార్థసీరిణాం, భోజ్యాన్నతా గృహస్థస్య తీర్థసేవాతిదూరతః ..... ఇమానిలోకగుప్త్యర్థం కలేరాదౌమహాత్మభిః, నివర్తితాని కర్మాణి వ్యవస్థాపూర్వకం బుధైః, సమయశ్చాపిసాధూనాం ప్రమాణం వేదవద్భవేత్."
(ఆదిత్యపురాణవచనం)

ప్రాచీనభారతీయులు స్వదేశమందును అభిమానము వీడక భారతదేశమంతటను ఏకధర్మము, ఏకవిజ్ఞానము, ఏకనాగరికతగూడ వ్యాపింపజేసిరి; వివిధప్రాంతములకు తీర్థయాత్రల బ్రోత్సహించియు, గ్రంథాదుల మూలమునను దేశసంచారమును దేశపరిజ్ఞానమును ఆయాప్రాంతీయులమధ్య సమన్వయమును సానుభూతిని వృద్ధిచేసిరి. యూరపు ఉత్తరఅమెరికాలలో శ్వేతార్యజాతీయులు వ్యాపించినప్పు డాయాదేశముల ఆదిమజనుల నాయార్యులు నిర్దాక్షిణ్యముగ నశింపజేసిరని చరిత్రలవలన విశదము. మన భారతీయార్యు లట్లు చేయలేదు; ఆదిమజనులు ద్రావిడశాఖలు (వారలనాగరికతగూడ) దేశమున వ్యాపించెను; ఈనాగరికతలమధ్య వీలైనంతవరకు సంబంధము సమీకరణము కలుగజేయబడెను; ఇట్లు జాతీయతకును అంతర్జాతీయతకును సమన్వయము జరిగెను.

మన ప్రాచీనవిద్వాంసులు విశాలజ్ఞానానుభవములు లేని సంకుచితభావులను 'కూపకూర్మములు' అని నిరసించినారు. మధ్యకాలమందు సంకుచితత్వము ఏర్పడి, ఆపేరు ఈనాడు వారి వంశీయులకే వర్తించు నని కొందరు చెప్పుస్థితి కలిగినది. ఆయుదారభావము, జ్ఞానకాంక్ష, స్వతంత్రవిమర్శ, ప్రగతీచ్ఛయు మన పరాధీనకాలంలో క్రమంగా క్షీణించినవి; బాహ్యచిహ్నములే ప్రాముఖ్యమొందెను; సంకుచిత ప్రాంతీయభావములు, పరస్పర విభేదములును, ప్రబలినవి; వాటిని విదలించి పూర్వపు ఉన్నతిని ఏకీభావమును సాధింపవలెను. అందుకు ప్రపంచచరిత్రజ్ఞానము ఉపయోగించును. జగదుత్పత్తివికాసములయొక్కయు, ఆయా జాతులయొక్కయు చరిత్రమును గ్రహించుటచే జనుల మనో

భావములు హృదయమును వికాసమునొందును; జాతీయభావము విశ్వజనీనతయు కలుగును. ప్రస్తుత మున్నవిభేదము లెట్లు కలిగినవో తెలిసి, ఆయాజాతులమధ్య యథార్థముగ సంఘర్షముకవసరము లేదని, ఈ కనబడు విభేదములు బాహ్యములు తాత్కాలికములునే యని తెలియును. ప్రపంచచరిత్రను గ్రహించుట ముఖ్యముగా మనభారతీయులకు చాల నావశ్యకము. మనదేశము ఒకసంగ్రహ ప్రపంచము వంటిది. అందు ఫలవంతములగు నదీప్రాంతభూములు, విశేషవర్ష ప్రాంతములు, ఇసుకనేలలు, మరుభూములు, మహాటవులు, రాతినేలలు, పీఠభూములు, మహాపర్వతప్రాంతములు, ఉష్ణభాగములు, శీతలదేశములును గలవు; వివిధవృక్షాలు, రకరకముల పశుపక్షులేగాక నరులలోను ఆజానుబాహువులు, పొట్టిజాతులు, మహాశూరులు, భయస్వభావులు, కుశాగ్రబుద్ధులు, అమాయికులు, వ్యాపారకుశలురు, వేరువేరుజాతులవారును, కలరు; మహోన్నతమగు ఉపనిషన్మతమును, మూఢాచారములు, క్షుద్రదేవతల బలిమతములుగూడ ఒకదానిప్రక్క నొకటి వెలయుచున్నవి. ఆదిమజనులవి ద్రావిడులవి ఆర్యనాగరికతయు నేగాక, అన్యదేశీయసంస్థలుగూడ గలవు. ప్రపంచపు ముఖ్యమతములు ఇచ్చటనున్నవి. మరియు, ఆగర్భశ్రీమంతులతోబాటు నిరుపేదలగు బిచ్చగాండ్రును కలరు. ఇట్లు అన్నిరీతుల భౌతికసాంఘికస్థితులునుండుచోట వాని యుత్పత్తిక్రమము సంబంధములును తెలియుట పరస్పరానుకూల్యమునకు సహకారి యగును. ముఖ్యమతము లన్నింటికిని సంబంధము కలదని, వానిమూలసూత్రములొక్కరీతివే యని, కొన్ని చారిత్రక కారణములవలన ఆయాపర

పరస్థితుల కనుకూలముగ వేర్వేరుమతము లేర్పడె నని, వానిలో క్రమముగా దేశకాలానుసారముగ పరిణామము కలుగుచు వచ్చెననియు జగత్కథ తెల్పును; నిజముగా వీనిమధ్య విరోధ ముండ నవసరము లేదు. క్రిందటినూరేండ్లలో ఆధునికవిజ్ఞానము వలన ఇనుపదారులు, సముద్రనౌకలు, తంతివార్తలు, వార్తాపత్రికలు, వాయువిమానములు, గ్రామఫోనులు,సినీమాలు, రేడియో మున్నగుసౌకర్యము లేర్పడినవి; రాకపోకలును, భావప్రచారమును ఇతరదేశముల జూచుటకు క్రొత్తసదుపాయములు ఆవశ్యకతలును కలిగి, అవి నిర్విరోధంగా సాగుచున్నవి. పరస్పరసమావేశములు చాల హెచ్చినవి; అందువలన ఆర్థికసాంఘికరాజకీయవిషయములందును పరస్పరసంబంధము తప్పనిసరియగుచున్నది. అతిదూరమందలి ఏఅమెరికాలోనో జరుగు పరివర్తనమువల్లను మన ఆర్థికాదిపరిస్థితులును తారుమారగుచున్నవి. మానవుని కష్టసుఖము లొకేరీతివి. ఒకదేశము చిక్కులలో బడగనే, ఆబాధ లితరదేశములకును వ్యాపించుచున్నవి. కనుక అన్నిజాతులయొక్కయు, ముఖ్యదేశము లన్నిటియొక్కయు, ఇతిహాసపుముఖ్యాంశములను మనమందరమును గ్రహించి వాటి యనుభవమునుబట్టి మనము నేర్చుకొని బాగుపడవచ్చును. చరిత్రాభ్యాసము వేరొక గొప్పనీతినిగూడ తెల్పును. ఆత్మవిశ్వాసము గలిగి తమతోడిజనుల సంఘాభివృద్ధికై నిరంతరకృషి చేయు సాహసికజాతులే క్రమముగా వృద్ధికి వచ్చినారు. జనులందరు నీశ్వరాధీనులే యైనను, ప్రగతి స్వయంకృషిలేని మంద జాతులు క్షీణించుచున్నవి. ఇతిహాసమేగాక, పూర్వయుగముల జీవకోటిచరిత్రయు దీనిని దృఢపర్చును. దేశకాలానుకూలముగ

తమయభ్యాసాదుల మార్చుకొనని (మందములు అలసములు అగు) ప్రాణులు వృద్ధిచెందలేదు; నిరంతరము శ్రమపడుచు సందర్భోచితంగా వర్తించి ప్రగతిశీలమగుజాతులే అవసరమగు అంగజ్ఞానవృద్ధి నొంది యభివృద్ధిగాంచి చిరస్థాయులుగ వ్యాపించుచున్నవి.

జీవపరిణామపుచరిత్ర తెల్పు ఈనీతిని మనము మరువకూడదు. జీవజాతులన్నియు సకలభూతాంతర్యామియై అదృశ్యమగు మహాశక్తిచే చోదితములైనను, స్వయంకృషివలనే వృద్ధినొందును; మరియు, కేవల భౌతికబలమునే పెంచుకొని తమోగుణవంతములై క్రూరములై భీకరములై యుండిన మహాజగరములు డినోసార్లు మున్నగుపూర్వయుగముల వికృతజంతువులు క్రమంగా నశించి, వానిజాతులు నిశ్శేషమయినవి; పూర్వ మొకప్పుడు మనలోకమంతటికిని ముఖ్యజీవములై ప్రబలిన సరీసృపములిప్పుడు హీనస్థానమున నున్నవి. అట్లుగాక, శాంతంగా మనోబలమును అంతశ్శక్తిని, ప్రేమను, సహృదయతను, సంఘక్షేమపరతను వృద్ధిచేసుకొనిన జంతువులే కాలక్రమమున ఆయాయుగాంతములందలి ప్రళయములకు తాళి దాటగలిగి వృద్ధిగాంచినవి. అట్లు ఆత్మ మనశ్శక్తుల వృద్ధిచేసుకొనిన జీవులనుండియే వానరములు, ప్రస్తుతపు నరజాతులును కలిగెనని వైజ్ఞానికుల సిద్ధాంతము. మరియు జీవులు కొంతవరకు పరిసరములవల్లను తోడిప్రాణులవల్లను మారును. కనుక, మన పరిసరములను తోడిజీవులను బాగుచేయుట మనయాత్మాభివృద్ధికిని క్షేమకరము: అనగా సంఘక్షేమముకై నిష్కామకర్మ చేయుటవల్లనే నిశ్శ్రేయసము నొందుదుము. అట్లుగాక నిష్క్రియులముగనో

స్వార్థపరులముగనో యుండిన నిశ్శ్రేయస మొందలేము. అన్ని జీవులలోను వ్యాపించియున్న ఆత్మస్వభావ మొకటే; సర్వజాతు లందును సమబుద్ధి కల్గియుండువారే లోకమునకు క్షేమంకరు లగుదురు.

ప్రపంచచరిత్ర మాట యటుండ మన భారతదేశమును గూర్చియును ఇంతవరకు ఆంధ్రంలో సమగ్రేతిహాసము లేదు; విద్యార్థుల పుస్తకము లెన్నియో కలవు. ఇట్లే ఇంగ్లండు రష్యా అమెరికాసంయుక్తరాష్ట్రములు మున్నగు కొన్ని దేశముల గూర్చి విడివిడిగ చిన్నపుస్తకము లిటీవల వెలువడినవి. ఇట్టి ప్రత్యేకదేశచరిత్రలకును ఆయాసాంఘికశక్తుల పరిణామమును సామాన్యసమస్యలను దెలుపుచు పరస్పరసమన్వయమును సూచించు లోకేతిహాసమునకును భేదమున్నది. ఈరచన మూల భాగము హెర్బర్ట్ జార్జి వెల్సుగారి "షార్ట్ హిస్టరీ ఆఫ్ ది వరల్డ్" అను ఆంగ్లగ్రంథము కనువాదము. శ్రీ వెల్సుగారు జగద్విఖ్యాతులు; ఆంగ్లవాఙ్మయజ్ఞులందరు నీయనప్రతిభను వినియే యున్నారు. ఈయన 1866-లో జనించి, ఆక్సుఫర్డులో జంతుశాస్త్రమున పట్టపరీక్షనిచ్చి, ప్రకృతిశాస్త్రప్రవీణుడయ్యెను; కాని పత్రికాసంపాదనను గ్రంథరచనను వృత్తిగ జేసుకొనెను; చాల విచిత్రమగు ఆఖ్యాయికలను, సంఘవిమర్శలను, విజ్ఞానగ్రంథములను, రచించెను. ఆర్థికరాజకీయములం దీయన "రైట్ వింగ్ సోషలిస్టు" (=సామ్యవాదులలో మితవాది); ఆభావముల ప్రచారముకై 'వర్క్, వెల్త్ అండ్ హాపినెస్ ఆఫ్ మాన్ కైండ్' (=నరజాతిచర్య, సుఖసంపదలు) మున్నగు అనేకగ్రంథములు వ్రాసెను; తన నవలలద్వారాను జనులలో మూఢత్వమును

బోగొట్టి, విజ్ఞానరుచి గల్గించి, ఉదారభావములను విజ్ఞానమును వెదజల్లుటకు నైతికపరిణామము రాబోవు క్రొత్త విజ్ఞానా విష్కారములగూడ ముందుగ సూచించిన ప్రతిభాశాలి. వైజ్ఞానికాగ్రణులసాయము నొంది "ది ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ" అను విపులచరిత్రనుగూడ ఈయన రచించెను; కాని అది చాల వివరములతో నిండి, మామూలుచదువరులకు విసుగు గలిగించును. ఈ "షార్ట్ హిస్టరీ" క్లుప్తమై, సారరూపమై, సామాన్యపాఠకుల యుత్కంఠను తీర్చును.

వెల్సుగారి భావములవలె ఆయనశైలియు రమ్యమే; కాని గుంభితము, నిగూఢము అనువదింప నతికష్టము. ఇందు వినోదముకన్న విజ్ఞాన మెక్కువ ప్రధానము. కనుక అనువదించుటలో శైలి ధారాళతకన్న మూలవిషయాలను సరిగ వ్యక్తపర్చుటకే ముఖ్యముగ యత్నించిరి. ఇందు మామూలు రాజయుద్ధాదులకథయేగాక సంఘపరిణామాదులును సంగ్రహముగా వివరింపబడినవి.

ఇతిహాసము రెండువిధములు: ఆయారాజాదివ్యక్తుల వంశమును యుద్ధాదివృత్తాంతములను వరుసగా కార్యకారణ సంబంధములతో తెలుపుట సంప్రదాయపద్ధతి. అందుకు ప్రాధాన్య మీయక, ఆయాజనసంఘములస్థితిని వారిలో కాల క్రమమున జరిగిన పరిణామములను వివరించుచు, అందు కవసరమగునంతవరకే ఆయానాయకులచర్యల తెల్పుట వైజ్ఞానికపద్ధతి; ఇదియే యెక్కువ జ్ఞానదాయకము, ఉపయోగకరము. ఆంగ్లమునను ఈరీతి చరిత్రను మొదట వ్రాసినది వెల్సుగారే. మరియొకసంగతి: ఈగ్రంథమున భూమి యుత్పత్తిక్రమము,

అందు ఆయాయుగముల జీవవికాసము, క్రమంగా నరజాతి యావిర్భావము, అందేర్పడిన క్రమవికాసము, ఇప్పటి వైజ్ఞానిక సిద్ధాంతాల ప్రకారం వర్ణింపబడి, అంతట ప్రపంచజాతుల మామూలు ఇతిహాసము చెప్పబడినది. అనగా ఈరచనలో ఆయాస్థలములందు భూతత్త్వశాస్త్రము, జీవశాస్త్రము, ప్రాచీన నరశాస్త్రము, జాతిశాస్త్రము, సాంఘికతత్త్వము, మనశ్శాస్త్రము, సామ్యవాదము మొదలగువాని కొన్ని మూలసూత్రములును, మతసూత్రములును సందర్భోచితముగ మిళితమైనవి; ఇక ఇతిహాసభాగమున ఆయాకాలములందు ఆయాజాతులస్థితి, వారి సమ్మేళనమున నాగరికతలో కలిగిన మార్పులును, వివరింపబడినవి. దరిమిలాను ఆర్థికసాంఘికధార్మికరాజకీయస్థితు లన్నిటిలో గల్గిన పరిణామమును వాటి పరస్పరసంబంధమును సూచితములు. ఇందు ప్రాచీనమిశ్ర (= ఈజిప్టు) దేశము, సుమేరియా, అస్సీరియా, మొదలగువాటిసందర్భమున చెప్పిన గ్రామదేవతల గుడులు మతాధికారులు జంతుబలులు మొదలగుపరిస్థితులు మనదేశపు పూర్వపు ఆదిమద్రావిడజాతులలోను ఉండెను; అవి యిప్పటికిని అక్కడక్కడ ముఖ్యంగా నిమ్నజాతులందు నిల్చియున్నవి; అవి మన ఆర్యనాగరికతనుగూడ కొంత మార్చినవి. కనుక ఆవిషయాలు వెల్సుగా రిందు సూచించిన "దేవసమన్వయము"ను కొంతవరకు మన మతాచారములకును వర్తించునవే. తక్కినచరిత్రలవలెగాక, ఇందు బుద్ధుడు క్రీస్తు మహమ్మదు మొదలగు మతప్రవర్తకుల సిద్ధాంతములగూర్చియు చెప్పబడినది. మతంలో ఉదారదీక్షగలవారు రాజకీయముగను స్వాతంత్ర్యభావులగుదు రని సూచింపబడినది. మూలగ్రంథమున సహజంగా

క్రైస్తవసిద్ధాంతములకు ఆమతపరిణామమునకు ప్రాముఖ్య మిచ్చినారు. చరిత్రమున మతమునకును స్థానమున్నది. ప్రపంచము భౌతికమే కాదు. పంచభూతతన్మాత్రలకు బుద్ధి అహంకారము మూల మని వీటికన్నిటికి ఆత్మమూల మని హిందూమతసిద్ధాంతము. భౌతికపరమాణువులు స్వతంత్రపదార్థములు కావు. అవియు అతిసూక్ష్మములు, దుర్గ్రాహ్యములు, దుర్భేద్యములు అగు తేజఃపుంజముల భౌతికమూర్తులే; ఈపరమాణువుల అంగములగు ఎలెక్ట్రానులు ప్రోటనులు మొదలగువాటి మూలాధారశక్తి అవ్యక్తచిత్స్వరూపపుదే; విశ్వమూలాధారము భౌతికముకాక మానసికము ఆధ్యాత్మికమునే యగుననియు, ఇటీవల ఎడ్డింగ్టన్ సర్ జేమ్సు జీన్సు మొదలగు వైజ్ఞానికోత్తములు నిర్ణయించినారు. ఆయాకాలముల సాంఘికాధ్యాత్మిక పరిణామములచే రాజకీయచరిత్రయు చాలవరకు మారుచుండును. ఇట్లే వ్యక్తులలోను శరీరమునకు మనస్సునకు హృదయమునకు పరస్పరసంబంధము చాల గలదు. ఇంతేగాక, సృష్టిలో మొదట భౌతికముగ బలీయములయ్యు తీవ్రములై నిదానము లేని క్రూరసరీసృపాదులనుండి నిదానము ఆలోచన గల పక్షి జంతుజాతులు అంతట సూక్ష్మబుద్ధులు దాక్షిణ్యవంతములు అగు వానరాదులు విశేషమానసికాత్మికశక్తులు గల నరజాతియు ఏర్పడి ప్రబలినవి; కనుక, సృష్టిలో జ్ఞానమునకు ఆత్మశక్తికి ఇక ముందు ప్రాధాన్యము హెచ్చునని తోచును. మరియు ఆయా మతములచే భౌతికచరిత్రప్రవాహమునగూడ ప్రత్యక్షముగ మార్పులు గల్గినవి. కనుక జ్ఞానమతములకును చరిత్రమున దగు స్థాన ముండవలె.

మూలమువలె నీపుస్తకమును ఒకచిన్న సంపుటముగనే వ్రాయబూనితిని. అనువాదమున మూలాంగ్లగ్రంథములోని అంశములు మార్చలేదు. ఆంగ్లపాఠకులకు ప్రసిద్ధములై మూలమున వివరము లీయని కొన్ని నదీనగరాదు లెట్టివో ఏప్రాంతపువో అట్టిసందర్భములు తెలియుట కావశ్యకమగు వివరముల జేర్చినాను. వెల్సుగారు మూలమును కొంతవరకు పాశ్చాత్య దృక్పథముతో (ఆంగ్లపాఠకులకై) వ్రాసిరి; † కనుక ఆపాఠకులకు యుక్తమని తోచినవిషయములకే ప్రాధాన్య మిచ్చిరి.

లోకచరిత్రను ఒకేసంపుటముగ వ్రాయునప్పుడు ఆయా ప్రత్యేకదేశముల చారిత్రకవిశేషము లన్నిటిని తృప్తికరంగా వ్రాయవీలుండదు. ఈపుస్తకమందు ఏప్రత్యేకదేశమునుగూర్చియు పూర్తియైనచరిత్ర యుండదు. ఐనను అంతర్జాతీయసమస్యల గ్రహించుటకును, ప్రపంచచరిత్ర సమన్వయము తెలుసుకొనుటకును కావలయు ఆయాపాశ్చాత్యదేశముల ముఖ్యవృత్తాంతాలు చేర్పబడినవి. కాని, అట్టివే భారతసంబంధులగు కొన్ని ముఖ్యాంశాలు వెల్సుగారి మూలాంగ్లమున లేవు. ఆలోపములు బోగొట్టుటకై మూలమునలేని కొన్నివిషయా లిందు చేర్చినాను. ఇట్టివి భారతీయుల కావశ్యకములు. కనుక, పూర్వయుగము లందు మనప్రాంతపు భౌతికస్థితి, భారతదేశపు ప్రాచీననాగరికత, ప్రపంచమునకు ఋగ్వేదప్రాముఖ్యము. సనాతన హిందూమతము

---

† ఇందు కొన్ని అధ్యాయముల జదువునపుడు పాఠకు లీసంగతిని జ్ఞప్తిలో నుంచుకోవలెను. 'బైజంటైను' (=కాన్స్టాంటినోపిలుప్రాంతపు) సామ్రాజ్యము, యూదపారసీకాదిదేశములు తూర్పురాజ్యము లని తరుచు వ్రాసినారు. అవి మనదేశమునకు నిజముగ పడమరగనేయున్నను, యూరపుప్రాంతమునకు తూర్పుగ నున్నందున అట్లు వ్రాయబడినది.

నుండి బౌద్ధమతము కలిగినరీతి, ఈ రెంటికిని యూదక్రైస్తవమత సిద్ధాంతములతో గల సంబంధము, వైదికద్రావిడాది పూర్వనాగరికతలమిశ్రణఫలితము, దేవసమన్వయము,హిందూముస్లిం మతాచార భేదము,మనదేశపు ముఖ్యేతిహాసవిషయములు, ఆర్థికక్రాంతి ఫలము, నవ్యసంఘుస్థితి, ఆధునికసమస్యలు, ఇట్టివాటినిగూర్చి అవసరమైనచోట్ల సందర్భోచితముగ సంగ్రహపు టిప్పణుల జేర్చితిని. ఇది భారతదేశచరిత్ర కాదు. కనుక ప్రపంచచరిత్రలో నుండదగిన పరిణామకరమగు ముఖ్యాంశములనే దీనిలో జేర్చినాను. ఈటిప్పణులను మూలానువాదపు మధ్యనే చేర్చక వెల్సుగారిభావములతో మిశ్రణలేకుండుటకై పాదటిప్పణిపద్ధతిని పెట్టినాను. ముఖ్యమైనవాటి నాయాఅధ్యాయాంతములందు వ్రాసినాను. పాఠకులు వాని నుచితసందర్భములందు సమన్వయము చేసుకొనప్రార్థన. టిప్పణులలోని యంశములు ఆచార్య రాధాకృష్ణ, ప్రఫుల్లచంద్రరాయ్, రాధాకుముదముఖర్జీ, బ్రజేంద్రనాథసీల్, జవాహర్లాలు మున్నగు సుప్రసిద్ధవిద్వాంసులు వెల్లడించినవే. వీలైనంతవరకు మార్గనల్‌గారి సంస్కృత వాఙ్మయచరిత్రము విన్సెంటు స్మిత్తుగారి "ఎర్లీహిస్టరీ" 'ఆక్సుఫర్డుహిస్టరీ' మున్నగుదేశచరిత్రములు ప్రభుత్వప్రకటితమగు "ఇంపీరియల్ గెజటీర్ ఆఫ్ ఇండియా" జనాభారిపోర్టు మొదలగు (సర్వప్రమాణమగు) గ్రంథాలలో దెల్పినవానినే వ్రాసినాను. కొన్నిటిని ప్రభుత్వపుపురాతత్వవేత్తలు మొదలగువారి (పత్రికలలో ప్రచురితమై) ఉపన్యాసములనుండియు గ్రహించితిని. (సందర్భముల సమన్వయమునకై కొన్ని ఆంధ్రచారిత్రక విషయములగూడ జేర్చినాను). ఈరచనల అంశాలేవియు వెల్సు

గారివికావు; కనుక వాటిబాధ్యత నాదేగాని వెల్సుగారిదికాదు. కొన్నిచోట్ల (ఉ॥ మహమ్మదువారితత్వము) వెల్సుగారి భావములను విమర్శించినాను.

ఇందు చాల పారిభాషికపదముల వాడవలసివచ్చినది. ఆంధ్రంలో తగు వైజ్ఞానికనిఘంటు వింతవరకు లేకయు, ఆపదములకు వాడుకలో తగు స్థైర్యమేర్పడకయు, అట్టి భావముల దెల్పుటలో లేఖకులకును పాఠకులకును చిక్కు కలుగుచున్నది; వీలైనంతవరకు వాడుకలో నున్న పదములనే వాడినను, కొన్నిచోట్ల కొత్తపదముల నుపయోగించినాను. కొన్ని వాడుకలోనున్నపదమును సందిగ్ధముగ నున్నవి. ఒకే వైజ్ఞానికభావముకు రెండుపదముల వాడుటయు కలదు. ఉ॥ "జియాలజి" అనుటకు భూగర్భశాస్త్ర మని ఆంధ్రమున ధారాళమగు వాడుక కలదు. కాని 'జియాలజీ'లో భూగర్భమునుగూర్చియేగాక భూమిపైనున్న శిలలు కొండలు మొదలగు వానినిగూడ పరిశోధించుట భూతత్వము తెలుసుకొనుటయు ముఖ్యాంశము; (పైనున్న పటలము శోధించుటేగాని, వేల కొలది మైళ్ళలోతుగల నిజమైన భూగర్భమును పరిశోధించుట ఇంకను సాధ్యముకాదు. అయోమయమగు ఈగోళగర్భపు నిజస్థితినిగూర్చి ఇంకను ఏమియు తెలియదు); మరియు శబ్దార్థమునుబట్టి ఖనిజశాస్త్రమును భూగర్భశాస్త్రమే; అందుచే భూగర్భపదముకవ్యాప్తి అతివ్యాప్తి రెండునుకన్పడును. కనుక 'జియాలజిస్టు'కు 'భూగర్భశాస్త్రజ్ఞుడు' కన్న 'భూతత్వజ్ఞుడు' అనుటే యుక్త మని తోచినది. 'ఎస్ట్రానమీ'అనుటకు 'ఖగోళశాస్త్రము' 'జ్యోతిశ్శాస్త్రము' అనుపదములు తెలుగులో

వాడుచున్నారు. జ్యోతిశ్శాస్త్రమనుట శబ్దార్థమునకు సరియై సంస్కృతం హిందీ బెంగాలి మొదలగు ఆర్యభాషలందలి వాడుకకును సరిపోవును. 'జామెట్రీ'కి 'క్షేత్రగణితము' కన్న 'జ్యామితి' అనునది యెక్కువ సవ్యమని తోచును. పాశ్చాత్యుల భాష లన్నిటిలోవలె మనభాషలలోను ఒకేరీతి పారిభాషిక పదము లుండుట మంచిది. కనుక, ఇదివరలో ధారాళముగ ప్రచారములోనున్న పదముల విడువకుండనే పై రెండవరకపు సులభపదములగూడ అచ్చటచ్చట వాడితిని; ఈపద్ధతినే చరిత్రకు ఇతిహాస మని, హిందూదేశముకు భారతదేశ మని, ఇట్లే ఇతర విషయములందును రెండువిధములగు పదములును ఇందు జేరినవి. మనదేశభాషలన్నిటిలోను పారిభాషికవిషయములకు చాలవరకు సంస్కృతపదములనేవాడుచున్నారు (ఉర్దులోతప్ప).

కాని, సంస్కృతమున అనేకార్థములగు అట్టిపదములలో కొన్నిటిని బంగాళి హింది మున్నగు ఆర్యావర్తభాషలలో నొకయర్థమునను, తెనుగులో నింకొకయర్థమునను, వాడుట కలదు.* 'బాకీ' మున్నగు కొన్ని కేవల హిందూస్థానీ పదములు ఆయాభాషలలో వేర్వేరు అర్థములలో వాడ బడుచున్నవి. ఈసమస్యనుగూర్చి భాషాభిజ్ఞులును విద్యాసంస్థలును తగుశ్రద్ధ వహించినట్లు తోచదు. * ఈ 25 సం॥ లలో

---

* ఈ విషయము కుదాహరణ: ఉద్యోగ, వ్యాఖ్యాన, ఉపన్యాస, విశ్వాస, రాష్ట్ర, మత, ధర్మ, ఇతిహాస, ఆగ్రహ, బాష్ప, సంసార, వ్యవసాయ, శిక్షా, ఇత్యాదిపదములెన్నిరో సంస్కృతము హిందీలలో నొక యర్థమునను తెలుగులో నింకొకయర్థమునను వాడుచున్నారు. (దేశాదులపేర్లలో గూడ ఇట్టిభేదములుగలవు. ఈజిప్టుకు హిందూస్థానీలో 'మిశ్ర' దేశమని అలెగ్జాండరుకు 'సికిందర్' అని వాడుదురు.

హిందీకి మనప్రాంతమందు వ్యాప్తి హెచ్చినది. ఉభయభాషాభిజ్ఞులు కొందరిటీవల కొన్ని పదములను రెండవ యర్థమందుగూడ ఆంధ్రమున వాడుచున్నారు. ఒకేపదమును ఆంధ్రమందును ఆర్యభాషలందును వాడుటలో అర్థవిభేదము సాధ్యమైనంత వరకు తొలగించుట ఉభయభాషలవృద్ధి సామరస్యములకు అవసరము. ఈసమస్యను ఆయాభాషాసంస్థలు లేక పరిషత్తు ప్రతినిధులు భారతీయభాషాపరిషత్తుగా నేర్పడియో, లేక అంతర్విశ్వవిద్యాలయసమితి (ఇంటర్ యూనివర్సిటీస్ బోర్డు) వారో, పరిష్కరింపదగును. అందుచే పరస్పరసమావేశమును, భాషాసామరస్యమును గ్రంథముల తర్జుమాకును సౌకర్యము హెచ్చును.

నేడు ఆంధ్రమున శైలియు సమస్యగైనది. గ్రాంథిక వ్యావహారికముల రెంటికి నాదరమున్నను 'వ్యావహారికము'కు వ్యాప్తి హెచ్చుచున్నది. అది సహజమే. కానివాడుకభాషరచన లలో రుచిభేదమునుబట్టియు ప్రాంతభేదమునుబట్టియు చాల భేదము లేర్పడుచున్నవి; మన నిజాం ఆంధ్రసోదరులు, బళ్ళారి ప్రాంతమువారు, గంజాంప్రాంతమువారును తాము మాటాడు రీతినే స్థిరవాఙ్మయపుగ్రంథములను వ్రాయుచో ఈ విభేదములు హెచ్చి, కొన్నిశతాబ్దములలో ఆంధ్రము వేర్వేరుభాషల వలె గన్పట్టవచ్చును. ఇందు భాష సుబోధముగ నుండునట్లు యత్నించితి. శకటరేఫార్ధానుస్వారాదులను గమనింపలేదు; విసంధుల స్వేచ్ఛతో వాడితిని; (కేవలము వ్యవహారసిద్ధపదములు గూడ కొన్ని ఇందుచేరినవి); అన్యభాషాపదముల విసర్జింపలేదు. (ద్రావిడకుటుంబికమగు తెనుగుకు అసలులో ఒకవిధముగ

సంస్కృతపదములును అన్యభాషవే.) 'సాలు' మామూలు, తయారు, రోజు, ఖాళీ, అమలు, వగైరా, నకలు, మున్నగు హిందూస్థానీపదము లిందు వచ్చినవి. కొన్ని చారిత్రకకారణ ములచే నట్టివి మనవాడుకలో కలసిపోయి దేశ్యసమములై నిల్చియున్నవి. (కొన్ని శతాబ్దములు మన పైనధికారులై యుండిన గోలకొండ నిజాంరాజ్యపు ప్రజలలో సుమారు సగముమంది అనగా 75 లక్షలమంది ఆంధ్రులే; వారు తమ తెలుగులో నూటికి 70 వరకు వీనినే వాడుచున్నారు.) ఈపద ములు హిందీ బంగాళీ మున్నగు ఆర్యభాషల వాఙ్మయము లందును దేశ్యములుగ వాడుకలో నున్నవి. ఆంధ్రవాఙ్మయ మందును అట్టివానికి నిషేధము లేకుండుటే మంచిదనితోచును. సౌకర్యముసుబట్టి బ్యాంకు, స్కూలు, రోడ్డు, స్టీమరు మున్నగు వాడుకలో ఉన్న ఆంగ్లపదములును, ఆంధ్రపారిభాషికములతో పాటు (పాఠకులకు దెలియదగిన) ఆంగ్లపర్యాయములును గూడ చేర్చబడినవి. (ఉ॥ మేమలు, ఫాసిలు, రిపబ్లికు). యూరపు లోని నరదేశనగరాది వ్యక్తినామములిందు వందలకొలదిగలవు; వానిని ఆంధ్రలిపిలోనే వ్రాసితిని. ఆంగ్లమందును వీని యుచ్చా రణలో చాల అభిప్రాయభేదములు గలవు. (ఉ॥ సిరాక్యూసు, సైరాక్యూసు). మరియు 'తాటాకు'లో మధ్య అచ్చువలె 'ఆ'కు 'ఏ'కు మధ్యరీతి ఉచ్చారణగలపదము లిందు చాలగలవు; వానికి కొంతవరకు క్రింద'___'అనుగుర్తు నుంచితిని (ఉ॥ఆథెన్సు, బాబరు, పారిసు.) ఇంగ్లీషు 'ఎఫ్' 'జడ్' ఉచ్చారణగల కొన్ని పదముల ధ్వనికై కొన్నిటికి క్రింద చుక్కను ఉంచితిని (ఉ॥ ఫా్రిన్సు, ఆఫ్రికా, ఫ.నీషను, జండవస్తా, నెబూకెడ్నజ్జార్).

మూలగ్రంథపుచివరనున్న ముఖ్యవృత్తాంతకాలక్రమసూచితో బాటు అదనముగ మరికొన్నిముఖ్యాంశములుగూడ ఇందు చేర్చబడినవి. మూలమునకును టిప్పణికిని భేదము తెలియుటకై టిప్పణుల ముందు '‡ *' వంటిగుర్తు నుంచి, టిప్పణిసంగతులు మూలముకన్న చిన్నఅచ్చులో ముద్రించినాను. ఆయాకాలపు భూపరిస్థితులను, జాతుల వ్యాప్తిని, చరిత్రాంశములను, తెలుపు మూలములోని పటము లిందు తెలుగుపేర్లతో వ్రాసిచేర్చినాను; ప్రాచీనభారత దేశపటమును జీవులక్రమవికాసమును ఆయాయు గములందు కలిగినపరిణామముల దెల్పువృక్షమును పట్టికను మన ముఖ్యభాషాకుటుంబములపట్టికను అదనముగ నిచ్చినాను. ఇందలి పటములన్నిటికి శ్రీదేశోద్ధారక విశ్వదాత నాగేశ్వరరావు పంతులుగారు సహజౌదార్యముతో బ్లాకులను ఆంధ్రపత్రికా లయమున చక్కగ తయారుచేయించి నాకుచితముగ నిప్పించి సహాయముచేసిరి; వారి కెంతయు కృతజ్ఞుడను. ప్రపంచపు ఆయాదేశముల తారతమ్యస్థితి సులభముగ పాఠకులకు గోచ రించుటకై ముఖ్యదేశముల పరిమితి, జన సంఖ్య, ఆర్థికారోగ్య విద్యాదులస్థితి తెల్పుపట్టికలుగూడ జాతార్ అండ్ బెరి మున్నగువారి ఆర్థిక గ్రంథములనుండియు, ప్రభుత్వప్రచురిత పుస్తకాదులనుండియు, ప్రసిద్ధ వార్షిక ప్రచురములనుండియు, శ్రీ.ది. వెం. శివరావుగారి "భారతదేశ స్థితిగతులు" సాయము తోను నాకు దొరికినంతవరకు తయారుచేసి గ్రంథాంతమున జేర్చితిని. ఆపట్టీలవలన ఆయావిషయములందు మనదేశపు ప్రస్తుతస్థితియు పురోఽభివృద్ధి కవకాశమును గోచరించును.

టిప్పణిలోని ముఖ్యాంశములు చాల గ్రంథములనుండి గ్రహించి నందున ప్రత్యేకముగ ప్రమాణముల నుదహరింపలేదు.

మూలమును తర్జుమాచేయుటలోను ఈపుస్తకపుశైలి లోను అనేకలోపము లున్నవి; మరియు టిప్పణులలోని కొన్ని విషయాలు వివాదాస్పదములగుటచే, వానినిగూర్చి చాలమంది కభిప్రాయ భేదముండవచ్చును. అట్టిలోపములను సహృదయులు చూపినచో వారికి కృతజ్ఞుడను. ఈపుస్తకమును వ్రాయ నారంభించినది మొదలు అనువాదము, అంశముల నేకరించుట, సాఫు వ్రాయుట, పటములు గీయుట, ప్రూఫులు దిద్దుట మున్నగు అన్నిపనులలోను చి॥ ప్రతివాది భయంకర పార్థసారథి, బి. ఎ., బి. కామ్.,ఎల్. ఎల్. బి. పూర్తిగ సహాయముచేసెను. ఈయను వాదముచేసి ప్రచురించుట కనుమతినొసగిన వెల్సుగారికిని అందు కొడంబడికను తెప్పించి నన్ను ప్రోత్సహించిన శ్రీ ఎం. వి. వి. కె. రంగాచార్యులు, బి. ఏ. గారికిని కృతజ్ఞుడను.

కాకినాడ,
1—7—1935

కొ. శ.

# రెండవకూర్పుకు భూమిక

జీవవికాసకథను ప్రపంచచరిత్రమును గూర్చిన పుస్తక మొకటి ఆంధ్రములో నుండుట యవసరమని తోచి, 1935-లో ఈ 'జగత్కథ'ను ప్రచురించితిని. ఆభావము దృఢపడినది. ఆంధ్రమహాజనులు దీని కుచితస్వాగతమిచ్చినారు. మరియు,ఆంధ్ర మద్రాసు విశ్వవిద్యాలయముల పాఠ్యనిర్ణేతలు దీనిలోని కొన్నిభాగములు బి. ఏ. పరీక్షకు పాఠ్యముగ జేసినారు; ఆ విద్వద్వరేణ్యుల యాదరమున కెంతయు కృతజ్ఞుడను.

దీనికిప్పుడు పునర్ముద్రణ కలిగినది. టిప్పణుల నీసారి వృద్ధి జేయవచ్చునని ఇదివరలో ననుకొంటిని; కాని అట్లు జరుగలేదు. రెండవకూర్పు అవసరమని నాకు ఈవేసవిలో హఠాత్తుగ తెలిసినది. పుస్తకప్రతులను విద్యార్థులకు సకాలములో అందచేయవలెను. మరియు ఈసమయములోనే నెహ్రూచరిత్రకు రెండవ కూర్పును 'గాంధిచరిత్ర'ను వ్రాసి ప్రచురించుట జరిగినది. కార్యాంతర ముండుటేగాక, ఇందలి ముఖ్యభాగములు బి. ఏ. పరీక్షకు పాఠ్యములగుటవలన విశేషపుమార్పులు చేయుట యుచితమును కాదు కనుక, ఈరెండవకూర్పులో హెచ్చు మార్పులు చేయలేదు.

శైలి క్లిష్టముగనున్నచోట్ల భావము స్ఫుటముగ తెలియుటకై ఈకూర్పులోను మూలములోను టిప్పణులలోను వాక్యములశైలిని కొంత సులభపర్చినాను; మొదటికూర్పులో బడిన తప్పుల నిందుసవరించినాను. పారిభాషికపదములలో మూటినిమాత్రము మార్చినాను. 'నెబ్యులా' అనుటకు 'తేజో మేఘము'కు బదులు 'నీహారము' అని, 'సోషలిజమ్'కు 'సాంఘిక వాదము'కు బదులు 'సామ్యవాదము' అని, 'కమ్యూనిజమ్'కు 'సామ్యవాదము'కు బదులు 'సంఘస్వామ్యము' అనియు మార్చి

నాను. వాటికి భావార్థమునుబట్టి చూచిన ఈ మార్పు అవసరము కాదనియే నాకు తోచినది. కాని ఇటీవల పెద్దలుకూడ ఈ (మార్పు) పదములనే ఆయర్థములందు వాడుచున్నారు. వాఙ్మయమందును మామూలువాడుకలోనుగూడ ఓకేరీతిపదములు వాడుట మంచిది. పారిభాషికపదముల కిది యెక్కువ అవసరము. కనుక, ఇందాపదముల నట్లు మార్చినాను.

ఈమూడేండ్లలోను చాలదేశముల రాజకీయపరిస్థితులును కొంతవరకు ఆర్థికస్థితిగతులునుకూడ చాల మార్పులను జెందినవి. అందువలన అత్యవసరమైన క్రొత్తసంగతులను టిప్పణులలోను వృత్తాంతముల కాలసూచికలోను చేర్చినాను.

చారిత్రక కాలపు జీవజాతుల గూర్చిన చిత్రపటములిప్పుడు తెలుగుపుస్తకములలోను దొరకుచున్నవి. కాని పూర్వయుగములందలి పరిణామకాలపుస్థితిని దెల్పు చిత్రములుపదు. కనుక నీహారము, పూర్వయుగముల చెట్లు, మత్స్యములు వగైరా కొన్ని విచిత్రప్రాణుల చిత్రములను దయారు చేయించి ఇందు చేర్చినాను. వీటితో పోల్చుటవలన మన నేటి గుఱ్ఱములు గజములు నరులు ఈపూర్వజంతువులద్వారా క్రమపరిణామమున వికాసమొందిన సంగతి కొంతవరకు స్ఫురించును. హింసాధోరణి లోకమంతటను కార్చిచ్చువలె వ్యాపించి చికాకుపర్చుచున్న యీరోజులలో అందరును ముఖ్యముగ గ్రహింపదగిన అహింసాసిద్ధాంతమునకు చారిత్రకకాలమందు మొదటిప్రవర్తకుడై లోకోత్తరుడైన శ్రీగౌతమబుద్ధుని చిత్రమును ఇందు చేర్చబడినది.

ప్రపంచచరిత్రము నభ్యసించుట కవసరము నానాటికిని హెచ్చుచున్నది. లోకమందాయాప్రాంతముల ప్రయాణసౌక

ర్యములు హెచ్చి, దేశకాలావధి తగ్గుచున్నది. (ఇటీవల ఒక అమెరికనువైమానికుడు భూగోళమంతటిని 3½ రోజులలో చుట్టి తిరిగిరాగలిగెను; యూరపుకు అమెరికాకు మధ్య దీర్ఘ ప్రయాణము జరుపవలసిన అట్లాంటికు మహాసముద్రము నింకొక వైమానికుడు 13½ గంటలలో దాటెనట. ఇంగ్లండునుండి మన దేశమునకు రెండురోజులలోపుననే విమానము వచ్చుచున్నది. 'రేడియో' గ్రామములకును వ్యాపించుచున్నది. 'టెలెవిజ'ను గూడ ఏర్పడినది). ఇట్లు ఆయాదేశములమధ్య భౌతికసంబంధమును హెచ్చుచున్నది. తద్వారా ఆర్థికసాంఘికరాజకీయసంబంధములును హెచ్చినవి. ఒకదేశపు పరిస్థితులు మార్పులు తక్కిన దేశములవారును గ్రహింపకతీరదు; చారిత్రకముగను ప్రస్తుత స్థితికిని విభేదములకును కారణములేవో, మన మిప్పుడు వినుకొత్తసిద్ధాంతము లెందుచే గల్గినవో గూడ మనము అవగాహన చేసుకోవలెను. అప్పుడే మన ప్రస్తుతసమస్య లెట్లు పరిష్కరింపవచ్చునో సహేతుకముగ తెలుసుకొందుము. కనుకనే ఇటీవల అబిసీనియా స్పెయిను చీనా ఆస్ట్రియా వగైరా ప్రాంతములందేర్పడిన విప్లవములు నిజముగ అంతర్జాతీయస్పృహగలవి మనకును సంబంధించినవి అని నాయకులు చెప్పుచున్నారు. కనుక చరిత్రగ్రహణము కవసరము హెచ్చినది. ఆవిషయము లన్నిటిని గ్రహించి, అందుల ముఖ్యసూత్రములను మనదేశపు పరిస్థితుల కనుకూలముగ మార్చి సమన్వయముచేసుకొనుట మన దేశీయులందరి ధర్మము.

కాకినాడ,
29-7-38.

కా. శ.

# మూడవ ముద్రణకు భూమిక

'జగత్కథ' 2-వ ముద్రణ 1938 సం॥ లో జరిగి, 2 ఏండ్లలో ఆప్రతులు ఖర్చు అయినవి. పిమ్మట ఆతరుణంలో మరల ముద్రించుటకు చాల అంతరాయములు కలిగినవి. ప్రఖ్యాతాంధ్ర ప్రకాశకులగు శ్రీవావిళ్లవారి సౌజన్యముతో, ఈ పుస్తకముకు పునర్ముద్రణ మిప్పుడు కలిగినది: వారి కెంతయు కృతజ్ఞుడను.

ఈ 15 సం॥ లలో ప్రపంచవృత్తాంతములు బహువేగముతో నడచినవి. రెండవప్రపంచయుద్ధము (1939-45) లోకస్వరూపమును మార్చివేసినది. తత్ఫలితంగా జర్మనీ, జపానులు పరాజయంతో క్రుంగినవి. కాని ఆజాతు లెంత దెబ్బతిన్నను, ఉద్యమశీలురు గనుక, నిరంతరకృషితో కోలుకొనుచున్నారు. ముసోలినీపతనంతో ఇటలీప్రాభవ మణగినది. హిట్లరు 'జాత్యహంకారపుసిద్ధాంతము'ను, ముసోలినీ 'ఫాసిజము'ను, జపాను 'భౌతికబలోద్ధత్యము'ను భంగమొందుట సంతోషకరమే. కాని, ఒకపక్షంవారివల్లనే యుద్ధబీజము లేర్పడె ననుటకు వీలులేదు; కనుక, మన మహాభారతయుద్ధంలోవలె, ఇక్కడను, విజేతలకును ఈశ్వరుడు కొంత గర్వభంగం కల్పించెను. రష్యాకు అపరిమిత నష్టము కలిగినది. 'లోకోత్తర' మనుకొన్న బ్రిటిషుసామ్రాజ్యము చాల దెబ్బతిన్నది. లోకంలో ఆర్థికరాజకీయాలలో ఇంతవరకు తమ కుండిన అగ్రస్థానము బ్రిటిషువారినుండి జారి అమెరికా వశమయినది; సరే. ఇక తాము అమెరికాకు ఆర్థికంగా దాసులు గాకుండ తప్పించుకొనుటకును బ్రిటిషువారింకను ముప్పుతిప్పలు బడుచున్నారు. ఇక ఫ్రెంచి డచ్చిసామ్రాజ్యముల దుర్దశ

బ్రిటిషుకన్నను హీనంగా ఉన్నది. అన్ని విధముల 'అగ్రగాము' లైన అమెరికావారును పైకి విజయోత్సాహవశులైనను యాంత్రికంగా మహోన్నతస్థితికి వచ్చి, అద్భుతాయుధబల సంపన్నులైనను, 'కమ్యూనిస్టు'భయంతో విహ్వాలురై, తటస్థ దేశాలనుగూడ తమలో కొందరినిసహా అనుమానించుచు, మనశ్శాంతిలేక చికాకుపడుచున్నారు. తృతీయప్రపంచయుద్ధము త్వరలో రావచ్చునని చాలమంది యాందోళనపడి, తమ సర్వ శక్తులను యుద్ధసన్నద్ధత కుపయోగించుచున్నారు. ఇవి రాజస ప్రవృత్తికి నైతికదారిద్ర్యమునకును సూచకములు. పుంజపతి తత్వముకు కమ్యూనిజముకు మధ్య చెలరేగు శీతలయుద్ధము ఉష్ణయుద్ధంగా మారకపోవుటకు భారతీయనేతృత్వమున నేర్ప డిన తటస్థసిద్ధాంతమే కొంత కారణమయినది. గాంధీమహాత్ముడు ప్రతిపాదించిన అహింసాశయము ననుసరిస్తేనే ప్రపంచజనులు మహావిధ్వంసమునుండి రక్షితు లగుదు ని ధీమంతులు తలచు చున్నారు.

ఈ 15 ఏండ్లలో గత మహాయుద్ధంవల్లను దానిఫలితం గాను అన్నిముఖ్యదేశాలలోను క్రొత్తపరిస్థితు లేర్పడినవి. చీనాలో అద్భుతవిప్లవము వచ్చి, 'ప్రజాస్వామ్యప్రభుత్వ' మధి కారముకు వచ్చినది. కాని దానికి అమెరికాతో కలతలవల్ల ఆందోళన యేర్పడినది. యుద్ధాంతమున భారతదేశము స్వతంత్ర మగుట గొప్పవిశేషమేకాని, మన ముద్దేశించినట్లుకాక, దేశవిభ జన గల్గి, పాకిస్తాను మనదేశముకు ప్రతికూలధోరణిలో నుండుట శోచనీయము. ఇందుచే ఉభయదేశాలకు గల్గుహానిని ఇప్పటి పాకిస్తానుప్రధాని మహమ్మదాలీ గుర్తించి, ఆనుకూల్య

పద్ధతికి యత్నించుట సుగుణము. స్వతంత్రములయిన యితర దేశాలలోను చిక్కుగల కొత్తసమస్య లెన్నియో వచ్చినవి. ఈపుస్తకపు రెండవముద్రణతరువాత వచ్చిన యీచారిత్రక పరిణామములు ఆధునికకాలపువే యైనను, విషయపూర్తికై వాటినిగూడ ఇందులో (సంగ్రహంగానే) 12 కొత్త అధ్యాయములలో చేర్చినాను. మూలకర్తయగు వెల్సుగారు వృద్ధులై, జబ్బుపడి, కొద్దియేండ్లక్రిందట మరణించినారు. ఈ కొత్త యధ్యాయాలలోని అంశములబాధ్యత నాచేగాని మూల కర్తకు వాటితో సంబంధములేదు.

ఇట్లే 1938 సం॥ నుండి దరిమిలాయేండ్లలో జరిగిన ముఖ్య వృత్తాంతములను 1-వ అనుబంధపు తుదను ఈముద్రణలో చేర్చినాను. 2-వ అనుబంధంలో యిచ్చిన 'ప్రపంచపరిస్థితులు' అన బడుపట్టీలఅంశాలు గత 15 సం॥ ల పరిణామమునుబట్టి మార్చి చాలవరకు మరల వ్రాయుట జరిగినది. వీటిలో కొన్నిటికి పూర్తిఆధారములు ప్రామాణికమైనవి కొత్తవి దొరకనందున, కొన్నిటి అంకెలను ఉజ్జాయింపుగనే వేయవలసివచ్చినది. ముద్రణజరుగు సమయానకు నేను దూరస్థలంలో కార్యాంతర ములందుండుచు, ఇప్పటికే ఆలస్యము కలిగినందున, తొందరగ వ్రాయుట యయినది. అందువల్ల కొన్నిలోపము లేర్పడుట సహజము. ఇందుగల లోపములకు పాఠకమహాశయులు క్షమింతురని కోరుకున్నాను

కాకినాడ,
9-5-53. }

కొ. శఠకోపం.

# 1. విశ్వములో భూలోకప్రస్థానము

మనజగత్తు పూర్వప్రస్థితి ఇంకను పూర్తిగ తెలియదు. రెండుశతాబ్దుల క్రిందటివారికి గడచిన మూడువేలయేండ్లగూర్చియే చరిత్ర తెలిసెను. అంతకుపూర్వపువృత్తాంతాలకు గాథలు ఊహలునే ఆధారమయ్యెను. చాలచోట్ల నాగరికులును ఈప్రపంచము క్రీ. పూ. 4004- వయేట హఠాత్తుగా సృజింపబడెనని నమ్మి, అట్లు బోధించిరి. అది ఆసాలు వేసవినా, శరదృతువునా, అని మాత్రము విద్వాంసులు చర్చించిరి. వారు † హీబ్రూబైబిలులో వాక్యాలకు కేవలశబ్దార్థమునే గ్రహించి, అందుపై మూఢనిర్ణయముల జేసినందున ఈపొరబ్రమలు కలిగెను. మతబోధకు లట్టిభావముల జాలకాలముక్రిందనే వదలినారు. మనమున్న యీవిశ్వ మతిదీర్ఘకాలమునుండి యున్నది. (అది యనాదియు కావచ్చు.) ఒకగదిలో చివరలందు ఎదురెదురుగ నద్దముల బెట్టిన, ప్రతిబింబములుగల్గి, ఆగది యనంత మని భ్రమ

---

† 'హీబ్రూ' యూదదేశపు ప్రాచీనభాష. ఏసుక్రీస్తు యూదజాతీయుడు, యూదదేశమందే తన మతమును స్థాపించెను. కనుక బైబిలంతయు మొదట హీబ్రూలోనే రచింపబడెను. ప్రపంచ మిట్లు హఠాత్తుగ నిటీవలనే సృజింపబడె నను భావము యూద క్రైస్తవ మహమ్మదీయులలోనే పూర్వముండెను. అనేకయుగములనుండి కల్పాలనుండియు ప్రపంచము కలదనియే ప్రాచీనహిందువులు, బౌద్ధులు నమ్మినారు. హిందువుల వైదికకార్యముల ఆరంభంలో సంకల్ప మంత్రములోగూడ ఈసనాతనత్వము అనుదినము జ్ఞప్తికి తేబడుచుండును.

కలుగును; అ.., ప్రపంచపు బాహ్యాదృశ్యము కొంత మాయగ తోచును. కా.. మన మున్న జగ మారేడువేలయేండ్లనుండి మాత్ర ము.. ట కేవలము నిరాధారము.

భూ.. ..ళప్రాయమై నారింజపండువలె కొంచె మది మినట్లుండును. ..వ్యాసము దాదాపు 8000 మైళ్లు. అది గోళరూప ము.. ..నుండి ధీమంతులకు రమారమి 2500 యేండ్ల నుండియు దె.. ..ను. కాని అంతకుపూర్వికులు అది బల్లపరుపను కొనిరి. భూ.. గ్రహనక్షత్రములతో నుండు సంబంధమును గూర్చి, అ.. అనేకవిచిత్రభావము లుండెను. భూమి వ్యాసము, భూమధ్యరేఖకన్న ధ్రువములయొద్ద 24 మైళ్లు తక్కువ. భూ.. ..న అక్షముపై 24 గంటల కొకసారి తనచుట్టు తిరుగును; .. ..రాత్రిం బవళ్లు వరుసగ కలుగుచుండును. కొంచెము కో.. ..గుకక్షలో, భూమి సాలుకొకసారి సూర్యుని చుట్టి వచ్చు..: (ఈమార్గమే దాని క్రాంతివృత్తము.) దానికి సూర్యు డతి.. ..మైనపుడు 915 లక్షలమైళ్లు, అతిదూర మైనపుడు .. ..క్షలమైళ్లును, దూర ముండును.

చంద్రు.. భూమికన్న చాల చిన్న; అది సుమారు 2,39,000 మైళ్లదూరమున భూమిని చుట్టివచ్చుచుండును. భూచంద్రులేకాక, బుధుడు 360 లక్షలమైళ్లదూరమున, శుక్రుడు 670 లక్షలమైళ్లదూరమున, మఱియు భూవృత్తమున కావల (అల్పగ్రహకూటముకాక) అంగారక, బృహస్పతి, శని, అరుణ, వరుణులు వరుసగా సుమారు 1410 లక్షలు, 4830లక్షలు, 8860 లక్షలు, 17,820లక్షలు, 27,930లక్షలు మైళ్లదూరమునుండి సూర్యునిచుట్టు దిరుగుచుండును. ఈకోట్ల కొలది మైళ్లదూరము

మనకు దురవగాహము. ఈగ్రహములన్నిటిని చిన్న స్కేలు (=పరిమాణము)లో భావించిన, ఆదూరము సులభముగ బోధపడును.

భూమినంత నొక అంగుళపువ్యాసముగల చిన్నబంతిగా నెంచిన, అప్పుడు సూర్యుడు 9 అడుగులవ్యాసము గలగోళముగ 323 గజముల (అనగా నాల్గైదు నిముసముల నడకపట్టు 1/5 మైలు) దూరమున ఉన్నట్లగును. అప్పుడు చంద్రుడు మనభూమికి $2\frac{1}{2}$ అడుగులదూరమున, ఒకచిన్న బఠానిగింజంత యుండును. సూర్యునికి వరుసగా 125, 250 గజములదూరమున, (భూసూర్యులమధ్య) బుధుడు, శుక్రుడు నుండును. ఇక వీటి వెలుపల చుట్టుపట్ల ఖాళీగనుండును; భూమికి ఆవల 175 అడుగులదూరమున అంగారకుడు, దాదాపు మైలుదూరమున ఒక అడుగు వ్యాసముతో బృహస్పతి, ఇంక కొంచెము చిన్నదిగ రెండుమైళ్లదూరమున శని, నాల్గుమైళ్లదూరమున యూరేనసు (అరుణుడు), ఆఱుమైళ్లదూరమున నెప్ట్యూను (వరుణుడు) నుండును. వీటికావల (ఈస్కేలుప్రకారం) వేలకొలది మైళ్ల వరకు చిన్న నలుసులు, ఎగయు పల్చని ఆవిరి పొగయు తప్ప, అంతయు శూన్యముగ గన్పడును. అతిసమీపమగు నక్షత్రము ఈపరిమాణముపైన భూమికి నలుబదివేలమైళ్ల దూరమందుండును.

జీవనాటకపు రంగస్థల మెంతవిశాలమో, ఈపై యంకెలచే గొంతవరకు తెలియును. అంతసువిశాలమైన మహావిశ్వమంతటిలోను, నిశ్చయముగా ప్రాణు లుండుట మనభూతల విషయంలోనే తెలియును. భూతలముకు భూగర్భమధ్యముకు

మధ్యనున్న 4000 మైళ్ళదూరములో, పైనుండి సుమారు మూడుమైళ్ళలోతువరకును, వాయుమండలములో నయిదుమైళ్ళ యెత్తువరకును మాత్రమే ప్రాణులున్నవి. మిగిలిన అనంతవిశ్వమును నిర్జీవమై, శుద్ధశూన్యముగ నున్నట్లు గన్పట్టును.

మహాసముద్రమున 5 మైళ్ళలోతుమాత్రము గమనింపగలము. ఇప్పుడు గాలియోడలపైన ఆకాశమున దాదాపు 20 మైళ్ళయెత్తుకుమాత్రం పోవచ్చు. 5 మైళ్ళయెత్తున కేపక్షియు వెళ్ళలేదు; గాలియోడలనంటి చిన్నపక్షులు పురుగులు పైకి పోవుచో, ఆయెత్తులోపుగనే యవి స్పృహతప్పి క్రిందబడును.*

---

*విమానములపై సుమారు 50 మైళ్ళయెత్తుకు నిటీవల కొందరు (ముఖ్యంగా రష్యనులు అమెరికనులు) శ్రమపడి వెళ్ళగలుగుచున్నారు. అంతకన్న ఎత్తునకు వెళ్లుట దుర్ఘటము. ఇతరగోళములతో ఏరీతినైన వార్తలను సంజ్ఞలను బంపుటకు, గ్రహించుటకునుగూడ ఇంకను సాధ్యపడుటలేదు. మిగిలిన విశ్వమంతయుం నిర్జీవముగ గన్పడు ననుటలో ఇంకెక్కడను ప్రాణం లుండ వీలులేదనుటకు వీలులేదు. భూమి కావల అనంతమహావిశ్వమందు ప్రాణిచిహ్నములు మనకు గన్పడకపోవుట మన యల్పజ్ఞతను మాత్రం సూచించును. మనకు సమీపగ్రహమగు అంగారకునందే నరులున్నారని లేరని, చర్చ జరుగుచు, ఇంకను సరిగా తేలలేదు; పైనచెప్పినవికాక, ఇంకను సుమారు 2400 అల్పగ్రహములు, వరుణున కావల "ప్లూటో" అను ఇంకొక గ్రహమునుగూడ, మన సౌరకుటుంబములోనే కలవు; ఈసౌరగ్రహముల స్థితినిగూర్చియు, మన కింకను స్పష్టముగా దెలియదు. నక్షత్రములలో అనేకములు మన సూర్యగోళముకన్నను చాల పెద్దవి. సూర్యునివంటివి ఇంకను పెద్దవి సుమారు మూడువేలకోట్ల మహాగోళములు కలవని బలీయమగు దూరదర్శనిద్వారా లెక్కించబడినవి. అవి అసంభావ్యదూరమున నున్నందు

మనకు పెక్కులి చిన్నవిగ గన్పడును. వాటికిని మన సూర్యునకు బుధ
శుక్రభూమ్యాదు లున్నట్లు సంచారిగ్రహములు (వాటికి మన చంద్రునపోలు
ఉపగ్రహములును) ఉండవచ్చు. మన కతిదూరమగు ఖగోళకాంతి మన
భూమిని చేరుటకు 14 కోట్లయేండ్లు పట్టునట. (కాంతి సెకండుకు అనగా
క్షణమునకు 1,86,000 మైళ్ళచొప్పున విద్యుద్వేగమున బోవుచుండును.)
మన కతిసమీపములైన నక్షత్రములుకూడ అర్బుదములకొలది మైళ్ళదూర
మందున్నవి. ఇందునుబట్టి మనకు గోచరించు విశ్వ మెంత విశాలమైనదో
యూహింపవలెను. ఇదియంతయుం బలీయమగు దూరదర్శినికి దృశ్యమగునది.
దానికిని అందనిది ఇంకను మూడురెట్లు మహావిశ్వముండునని జ్యోతిశ్శాస్త్రజ్ఞు
లలో అగ్రేసరులగు ఈన్స్టీను జీన్సు మహోదయులు తెలిపినారు. ఈనిర్వ
చనము "పాదోఽస్యవిశ్వాభూతాని...త్రిపాదూర్ధ్వఉదైత్ పురుషః"
(ఋ. సం. 10-వ మండలం) అను పురుషసూక్తవచనమును జ్ఞప్తికి
దెచ్చును. ఇట్లే పదార్థముల సూక్ష్మతయుం దుర్గ్రాహ్యము. పరమాణువు
సూక్ష్మతమం అభేద్యం అనుకొంటిమి. కాని అదికూడ అనేక సూక్ష్మతరపదార్థా
లతో సంఘటితమై ఒకగ్రహకుటుంబమును బోలినదని యిటీవల దెలియవచ్చి
నది. ఒక్కొక్క పరమాణువులోని సూక్ష్మతమపదార్థాలలోపలను, అర్బుదాల
కొలదిమైళ్ళదూరమున మహావిశ్వములో చరించు మహాలోకములచుట్టును
కూడ ఏదో అప్రమేయమగు దివ్యశక్తి వ్యాపించి, వాని స్థానములందుండున
ట్లాకర్షించి, నియమించి యుంచుచున్నది. అప్రమేయమగు ఏకేంద్రము
నుండియో విశ్వకిరణములు (కాస్మిక్ రేస్) ఈమహావిశ్వమంతట లోలోపల
ప్రసరించియున్నవని ఇప్పుడే వెల్లడియగుచున్నది. "తమేవభాంత మనుభాతి
సర్వం, తస్యభాసా విశ్వమిదం విభాతి" (శ్వే. ఉ. 6-14) అశక్తిస్వభావ
మెట్టిదో, ఎట్లుకలుగునో. ఎందుండివచ్చుచున్నదో, వైజ్ఞానికులకింకను తెలియ
లేదు. ఈశక్తి "అణో రణీయాన్ మహతో మహీయాన్" (క. ఉ. 2-20)
అనియుం "యస్మాత్పరం నాపరమస్తికించిత్; యస్మాన్నాణీయో నజ్యాయోఽ

సికశ్చిత్” (శ్వే. ఉ. 3-9) అనియుం వేలకొలదియేండ్లక్రిందట ఋషులు వర్ణించిన సర్వాంతర్యామియగు పరమాత్మకు సంబంధించినదేమో! ఇట్లు విశ్వమంతటిలోను చిన్మాత్రశక్తి లీనమై వ్యాపించియున్న దని ఊహింప వచ్చును. (కొన్నిచోట్ల కొన్నిలోకములు క్షీణించుచుండ, మరికొన్ని క్రొత్త లోకము లేర్పడుచున్నవి. ఇట్లు ఆయాప్రాంతములందు సృష్టి స్థితి లయముల రూపమున పరిణామము నిరంతరము కలుగుచున్నది.) అట్టిచో, వేర్వేరు పరిస్థితులుగల లెక్కలేనన్ని గోళములు అర్బుదములకొలది మైళ్లదూరమున నుండ, దిక్కాలమితి లేని యీ మహావిశ్వ మంతటిలోను, మనభూమిలోదప్ప ఇంకెక్కడను జీవములు లేవని యెట్లనగలము? మనగోళపు పరిస్థితులున్న నే ప్రాణు లుండు ననుటకును వీలులేదు. మరియు, మనభూలోకమందే అతిశీతల స్థలములందు, అత్యుష్ణప్రదేశములందు, వాయుమధ్యమునందు, సముద్రములో మైళ్లకొలదిలోతునగూడ. ఆదేశకాలములబట్టి ఆయాపరిస్థితులకువీలగు విశిష్ట దేహములుగల చిత్రవిచిత్ర మగు వివిధప్రాణులు కలవు. ఇప్పుడు భూమిపై లేని అద్భుతప్రాణులు పూర్వయుగములందు అప్పటిస్థితికి తగినట్లు భూమిపై నుండినట్లుగ స్పష్టమైన నిదర్శనములు కలవు. ఇట్లే గోళాంతరములందును ఉండ వచ్చును. సృష్టివైచిత్ర్య మత్యద్భుతము.



7 అ.



దీప్తనీహారము



నీహారము (ప్రక్కదృశ్యము; క్రిందిభాగము చల్లబడినది.)

# 2. జగత్కాలము

మనభూమి ఎప్పు డేరీతి జనించినదో, వైజ్ఞానికులు 50 ఏండ్ల నుండి చక్కగ విమర్శించుచున్నారు. ఈక్లిష్టగణిత పరిశోధనల నిందు వివరింప వీలులేదు. భౌతికజ్యోతిశ్శాస్త్రము లింకను కౌమారావస్థలోనే యున్నవి. మన మింకను సూచనలతోనే తృప్తిపొందవలెను. మనభూమి వయఃకాలపు అంచనా క్రమముగా హెచ్చుచున్నది. భూమి సూర్యునిచుట్టు తిరుగు ప్రత్యేకగ్రహముగా నేర్పడి, 200 కోట్లయేండ్లు దాటియుండును; ఇంకను హెచ్చుకావచ్చును. ఈకాలపరిమితి మనకు కేవల మగ్రాహ్యము.

ఇప్పటికల్పమున కింకనుపూర్వపు ఆదిలో మనభూమి సూర్యుడు, సౌరకుటుంబము అంతయు కలసి, అంతరాళమున మిశ్రితమై, పల్చని మహాపదార్థముగా వ్యాపించియుండును. మహాకాశమం దక్కడక్కడ ఇప్పటికి నట్టికాంతిమంతమగు వస్తుసంచయము ఏదో కేంద్రముచుట్టు తిరుగుచు మబ్బువలె గన్పట్టుట దూరదర్శిని యంత్రముద్వారా కనబడును. దానిని 'నెబ్యులా' అనగా నీహారము అందురు. మన సూర్యుడు గ్రహములుగూడ పూర్వ మొకప్పు డీరీతినే లఘుద్రవ్యపుంజముగనుండ, క్రమముగా అందు కొన్ని భాగములు అసలు కేంద్రమునుండి తీగతీగలుగ విచ్చివిడిపోయి, దూరమై, దేనికది వేరుగా ఘనీభవించి, క్రమముగా ఇప్పటిరూపుల నొందియుండునని,

చాలమంది జ్యోతిశ్శాస్త్రజ్ఞుల భావన. ఇట్లనేక కల్పములుగా ఘనీభావము జరిగినమీదట, చివరకు (మనము పైనపేర్కొన్న ఈకల్పాదికి) మన భూమి, చంద్రుడు తమతమ వ్యక్తిత్వమును బొందియుండును. గ్రహము లిప్పటికంటె నప్పుడు సూర్యుని కింకను దగ్గరనుండి, ఇంతకన్న నతివేగముగ సూర్యునిచుట్టివచ్చు చుండెను. వాటి పైభాగము లుజ్జ్వలమైయుండెను; అంతరిక్ష మందు సూర్యతేజ మత్యుగ్రముగ నుండెను. ఆయాదికాలపు భూమి యత్యుష్ణమై, ఉక్కుగరగించు కొలిమినో అగ్నిపర్వతపు 'లావా' ద్రవమునో పోలియుండెను. అంపలి లోహగంధ కాదులు నత్యుష్ణమున వాయురూపముగ నుండెను. అప్పటికి జల మగుపడదు. ఇక భూగర్భపు శిలావస్తువులన్నియు దగ్ధములై మహాద్రవముగ నుడుకుచుండెను. అంతరిక్షమున ఆగ్నేయాస్త్రములబోలు మేఘము లావరించెను. మనోవేగమున బరువెత్తు అప్పటి సూర్యచంద్రుల మహాతేజ మతిశీఘ్రముగ నన్ని దిశలను వ్యాపించియుండును.

ఇట్లు యుగములు గడచినకొలది, ఆయాగ్నేయలోకపు టుగ్రతేజము తగ్గుచుండ, ఆవిరి వస్తువులు చల్లబడి వర్షింప, వాతావరణము కొంత తేలికయయ్యెను. భూతలమును క్రమముగా ద్రవస్థితివీడి, ఘనీభవించెను. ఈరీతిగ శిల*లేర్పడి వెంటనే అప్పటి మహాద్రవసముద్రమున మునిగి, భూగర్భగతములగును. అప్పటికి సూర్యచంద్రులు వెనుకటికన్న

* 'శిల' అను పదమును ఇచటను ఇకముందును 'రాయి' అనియే గాక, గట్టిపడిన మట్టి గంధకము లోహము మొదలగు ఘనపదార్థములు అనియు భావము.

భూమికి దూరమై చిన్నవగుచుండె; అంతరిక్షమున వాని సంచారవేగమును తగ్గియుండును. చంద్రబింబము గ్రహముల కన్న చాల చిన్నది; కనుక, చంద్రకాంతితీవ్రత బొత్తుగాతగ్గెను. గ్రహణకాలములందును పూర్ణిమలందును చంద్రుడు సూర్య కాంతి నరికట్టి, భూమిపై ప్రసరింపజేయుచు నుండెను.

ఇట్లు యుగములు గడచినమీదట, పృథివి క్రమముగా మన ప్రస్తుతభువిగా నేర్పడినది. ఆవిరి చల్లగాలికి మేఘాకృతి నొందె; భూమిపై నీటివర్షము పడనారంభించెను. ఇంకను వేల కొలది యేండ్లవరకు, నీరు చాలవరకావిరిగనే యాకాశమందుం డెను; కాని క్రమంగా అక్కడక్కడ శిలలపై వెన్నీటిసెల యేళ్లు ప్రవహించుచుండెను; ఈనీరును వాటితోవచ్చు వండ్రును పల్లపుభాగములలో జేర, గుంటలు సరస్సులు నేర్పడియుండును.

ఇట్లేర్పడిన భూమిపైన తుదకు నరుడునిల్చి సంచరింపదగు స్థితి గల్గియుండును. మన మాకాలమును భూమికి రాగల్గి యుండిన, అప్పటి కింకను మట్టినేల వృక్షజాతియు లేక, కేవల మాగ్నేయశిలలపై నిల్చియుందుము. అంతరిక్షమున మనము కని విని యెరుగని తుపాను, ఝంఝామారుతములు, ఊహాతీత మగువర్షసంపాతమును, మనపై భీకరంగా చెలరేగియుండును. ఈయాసారనిర్ఝరములు మనప్రక్కలను శిలల వండ్రుతో లోయలగుండ ప్రవహించుచు, సెలయేళ్లై కూలంకషముగ బారుచు, ఆమొదటి సముద్రముల జేరి, తాము తెచ్చిన భూసా రము నందు జేర్చుచుండును. గొప్ప సూర్యబింబము చలించు చున్నట్లు మేఘములగుండ ప్రత్యక్షముగ వ్యక్తమగుచుండెను. ఆసూర్యచంద్రుల సంచారముతో రోజుకు రెండుసార్లు ఆటు

పోటులు, భూకంపము, భూమిడుత్క్షేపము రూపంగా కలుగు చుండి యుండును. ఇప్పటివలెగాక, అప్పటి చంద్రబింబము రాత్రులందు తనచుట్టు తిరుగుట దృశ్యమై, తనరెండవభాగ మును గనబడియుండును.

ఇట్లు భూమి వయస్సు గడచినకొలది దినపరిమాణము వృద్ధియయ్యెను; రానురాను సూర్యుడు దూర మగుచు, ఆ దుర్భరమగు కాంతితీక్ష్ణత తగ్గుచుండెను; చంద్రగతియు మంద గించెను. తుషానువర్షములయుద్రేకము తగ్గి, ఆయాసంభసము ద్రములనీరు వృద్ధియగుచు, భూతలముపై వ్యాపించి, క్రమంగా ఇప్పటి మహాసముద్రాకృతి నొందియుండును. కాని అప్పటి కింకను భూమిమీద జీవస్వరూప మంకురించలేదు. నదీసముద్ర లును నిర్జీవములు; శిలలును వంధ్యములు*.

*ఆకాలమున కింకను భూతలము సరిగా గట్టిపడలేదు. సూర్యచంద్రు లిప్పటికన్న భూమికి చాలదగ్గరమై, వాటి ఆకర్షణబల మధికముగ నుండెను. అందుచే భూస్థలికే ప్రతిదినము చలనము ఉత్క్షేపము కలుగుచుండియుండును. ఇప్పుడో ద్రవపదార్థమగు సముద్రములుమాత్రం దాదాపు అట్టిఆకర్షణగల్గి, ఆటుపోట్లుండుచున్నవి.

ఈభూలోకము ప్రత్యేకవస్తువై యిప్పటికి సుమారు 200 కోట్ల యేండ్లై యుండునని పైనచెప్పినది ఆధునిక వైజ్ఞానికుల సిద్ధాంతప్రకారము. మన ప్రాచీనభారతీయుల లెక్కప్రకారము చూతము. ఇప్పుడీకల్పములో 6 మన్వంతరములు గడచి, 7-వ దానిలో. 28 వ మహాయుగము జరుగు చున్నది. ఆప్రకారము ప్రతిమహాయుగములో—

| | | |
|---|---|---|
| కృతయుగముకు | 1728000 | ఏండ్లు |
| త్రేతా ,, | 1296000 | ,, |
| ద్వాపర ,, | 864000 | ,, |
| కలి ,, | 432000 | ,, |
| చతుర్యుగము అనగా ఒక మహాయుగముకు | 4320000 | ,, |
| | 71 | ,, |
| మన్వంతరము అనగా 71 మహాయుగములు | 306720000 | ,, |
| | 6 | |
| ఇప్పటికారు మన్వంతరములు గడచి, ఏడవదగు వైవస్వత మన్వంతరమున ఉన్నాము. కనుక 6 మన్వంతరములకు | 1840320000 | ఏండ్లు |
| ఈ 7-వ మన్వంతరములో గడచిన 27 మహాయుగములకు | 116640000 | ,, |
| ఈ 28వమహాయుగములోకృత త్రేతాద్వాపరయుగములకు | 3888000 | ,, |
| ఈకలియుగములో ఇప్పటికయినవి | 5035 | ,, |
| మొత్తం ఈకల్పంలో అయినయేండ్లు | 1995845035 | |

ఇట్లు మనప్రాచీనార్యసంప్రదాయపు లెక్కప్రకారము ఈ కల్పారంభకాలము మనభూమికి ప్రత్యేకవ్యక్తిత్వమేర్పడుటకు వైజ్ఞానికులు చెప్పిన కాలముకు సుమారుగ సరిపోవును. భూమియేర్పడి ఈ 200 కోట్ల ఏండ్ల కన్నను చాల హెచ్చుకాలమై యుండునని కొందరు ప్రతిభావంతులగు భౌతికజ్యోతిశ్శాస్త్రజ్ఞులు భావించుచున్నారు. అట్లగుచో, భూమి ఆరంభించి

అనేకకల్పములు కావచ్చు. భూమి ఉత్పత్తిక్రమము ఈయధ్యాయమున సుప్రసిద్ధమగు 'నెబ్యులార్' (నీహార) సిద్ధాంతమునుబట్టి చెప్పబడినది. నీహారములు లఘువై యుష్ణముగ నుండును. వానిచుట్టు నతిశీతముగనుండును; కనుక నీహార మతిస్వల్పకాలముననే తనయుష్ణమంతను గోల్పోయి, అంధకారబంధురమగును; చాలబలువగు మనభూమి సూర్యుడుమున్నగు మహాగోళము లారీతిగ నేర్పడి యుండవు అని కొందరిమతము. ఆరంభస్థితిలోనే భూమిపైన హిమ మావరించి నట్లు చిహ్నములు కలవు; కనుక భూతలము అత్యుష్ణతనుండి క్రమక్రమంగానే చల్లబడుచువచ్చియుండదని వీ రందురు. సూర్యగోళపుసమీపంలోదానిచుట్టు నర్బుదములకొలది యుల్కలు సదా తిరుగుచుండును. ఇట్టియుల్కలు మహాకాశమందంతట నుండు నని తోచును; భూమిపైనప్రతిరాత్రియు ఉల్కలనేకములు పడుచుండుట మనకు కనబడును. ఈయుల్కలపదార్థము ఇనుపగనులలోని పొడివలె(చాలవర కినుముగ కొంచెముగ నిక్కెలు, మట్టి, నీరు, వాయువు వగైరాలు కలసియు) ఉండును. భూమిలోపలిభాగము నిట్టిఇనుమేయైయుండునని భూమి తూనికవగైరాలచే దేలినది. దానిపైన మట్టిలోనగునవి యున్నసంగతి యందరు నెరిగినదే. సూర్యగోళమును ఉల్కాపదార్థమయమై యుండును; దానిచుట్టు తిరుగు కోట్లకొలదియుల్కలు నీహారములమధ్యనో, దిగంతరాళపు ఇతరపదార్థములలోనో, తగుల్కొనియుండును; లేక సూర్యగోళపు పైభాగము మహోష్ణముచే ప్రేలి అక్కడియుల్కలు దూరముగ నెగురగొట్టబడియుండును; లేదా ఏదైన బలీయమైనమహానక్షత్రము సూర్యగోళసమీపముగ బోయినప్పుడు, దాని యాకర్షణబలముచే, ఆయుల్కలలో కొన్నికోట్లు సూర్యపరిధినుండి యావలకు దూరముగ లాగబడియుండును; ఇట్లు సూర్యునినుండి యావలబడిన యుల్కాసమూహము వేగముగ తిరుగుటలో సంఘర్షోష్ణముచే కరిగిపెద్దముద్దకాగా, అందలి లోహపదార్థము బరువుచే లోనికి దిగి, సుమారు 7900 మైళ్ల వ్యాసముగల గోళముగ భూమిలో నేర్ప

డెను. అందుపైన సుమారు రేబది మైళ్ల లోపు మాత్రమే మందముగల పటలము కల్గి శిలలు మట్టియు నేర్పడి యుండునని, నీరును గాలియు లోహశిలాదుల కన్న చాలలఘువగుటచే పైకి తేలియున్నవనియు వీరి యూహ. ఇదియే 'మీటి యరైట్' [ఉల్కా] సిద్ధాంత మనబడును. చంద్రుడును ఇట్లే భూమిలో నొక పెద్దముక్క [బహుశః ఇప్పటి శాంతమహాసముద్ర ప్రాంతపుది] చెదిరి దూరముగ పోవుటలో నేర్పడి. అప్పటినుండి భూమి యొక్క యాకర్షణబల ముచే దానిచుట్టు తిరుగుచున్నదనియు వీరు చెప్పుదురు.

భూమికన్న సూర్యుడే చాల ప్రాచీనుడు; కొన్ని నక్షత్రగోళము లింకను పూర్వపువట; కనుక మనభూమి యేర్పడుటకుపూర్వమును అనేక కల్పములనుండి విశ్వమున సృష్టిస్థితిలయములు జరుగుచునే వచ్చినవి. సూర్యతేజ మొకప్పు డింకను చాలాయుగ్రముగ నుండెనని, విశ్వకర్మ యా యుగ్రతను తగ్గించెననియు, మనలో నొక యైతిహ్యము కలదు.

ఇట్లు భూమి యేర్పడిన కొంతకాలమునకు అందు జీవారంభము కలిగెను. ఈపురాతన ప్రాణుల క్రమపరిణామపుచరిత్ర అతిప్రాచీనములగు శిలాజీవముల శేషము(ఫాసిలు)లవల్లనే తెలియవచ్చెనని ముందు తెలుపబడును. ఆ శిలాజీవము లన నేమియో తెలుసుకొందము. ఈ మొదటి మన్వంతరాల లోని పూర్వయుగముల చరాచర ప్రాణులు కొన్ని హిమ భూకంపాది ప్రమాదములకు లోనై హఠాత్తుగ మట్టిపగై రాలచే గప్పబడుచుండును. వాయుమండలంలో చేరు ధూళియేగాక, అంతరిక్షమందుండి వేలకొలది యుల్కలు ప్రతిదినమును భూతలముపై బడుచుండుటవల్లను, అగ్నిపర్వతాల నుండి పడు శిలాద్రవములవల్లను, ఇతరకారణాలవల్లను, మనభూస్థలము క్రమంగా పెరుగుచువచ్చినది. (అట్టియుల్కాపాతము నేటికిని ఆకాశమున రాత్రివేళల మనము గమనింపవచ్చును.) పూర్వయుగముల విచిత్రప్రాణుల దేహము లీమట్టిపగై రాలక్రింద పడి, అణగి ఘనీభవించి వాటిలో నిమిడి,

శిలాధాతువులుగ నేర్పడెను. కేవలం పూర్వయుగముల జీవజాలములం బొత్తుగ క్రిందిపొరలలోను, ఆపిమ్మటియుగములవి వాటిపై పొరలలోను, ఇట్లు వరుసగ లగ్నములై యుండుట సహజము. అట్లణగి నశించిన తరుమృగాదుల కళేబరాలోని మృదుపదార్థములు కొంతకాలముకు పూర్తిగా అంతరించును; కాని వాటిస్కంధములు, ఎముకలు, పళ్ళు మొదలగు దృఢభాగములు మాత్రం నిల్చియుండును. అయితే, వేలకొలదియేండ్లు అవి గాలి వెలుతురు లేక, నానాటికి పైబడియుండు బరువుచే నణగిపోయి. సూక్ష్మరూపములై, వివర్ణములై, వికృతాకారమొందును. (ఉ. పూర్వయుగములందలి మహావృక్షశేషములే ఇప్పటి గనులలోని నేలబొగ్గుగమారినవి.) ఇట్టిపురాతనశిలలను బలీయమగు సూక్ష్మదర్శనియంత్రములద్వారా పరీక్షించిన, ఆయాయుగములం దేర్పడిన పొరలును, అందిమిడియున్న పురాతనప్రాణుల దేహశేషములును గోచరించును. ఈలక్షలకొలది యేండ్లమధ్యను అనేకప్రకృతిశక్తులును ఇతరకారణములును ఈశిలలలోని పొరలసహజస్థితిని కొంత మార్చుచుండును; విశేషశాస్త్రజ్ఞానము అనుభవమును కలిగి నిరంతరము వస్తుపరీక్షచేయువారే ఆపరిణామక్రమమును సరిగా గ్రహింపగలుగుదురు. ఆదేహశేషములవల్లనేగాక, అప్పటి ప్రాణుల చలనముచే నేలపై నేర్పడు చిహ్నములబట్టియు, అప్పటికొన్ని విశేషముల గ్రహింపవచ్చును.

# 3. జీవారంభము

ఘనీభవించిన మహాశిలల పొరలందు పురాతనజీవుల దేహావశేషము లుండును; వాటిపరీక్షచే నరులకు పూర్వముండిన జీవులసంగతి మన కిప్పుడు తెలిసినది. పురాతనమగు డిప్పలలో, రాతిపలకలలో, గులకరాళ్లలో, ఇసుకరాళ్లలోను, జంతువుల నరములు, పైడిప్పలు, తిత్తులు, కాడలు, పళ్లు, పాదచిహ్నములు, సంఘర్షణము మొదలగు జీవచిహ్నము లిమిడియుండును. మొదటివానలచే నేర్పడినయానవాళ్లు, అప్పటి సముద్రముల పోటు, కెరటముల రేఖలుగూడ ఇందు కుపయోగించును. ఈమహాశిలలపొరలలో కనబడిన విశేషములవలననే, మన భూమిపూర్వచరిత్రను నిర్మించినారు. అణగియున్న యీశిలల పొర దొంతలవరుసగానుండక, నలిగి, వంకరయై, చెదరి,విరూపమై, చాలసారులు లూటీపాలై తగులబెట్టిన గ్రంథాలయపు పత్రముల వలె మిశ్రితమై, విచ్ఛిన్నమై యుండును. అందుచే సమర్థులగు పరిశోధకు లనేకులు తమ యావజ్జీవముశ్రమపడి వీటిచరిత్రను కనుగొని సరిచేసి సమకూర్చినారు. ఈశిలాచిహ్నములందు 160 కోట్ల యేండ్లి స్థితి యిమిడియున్నదని నిర్ణయింపబడినది.

మొట్టమొదటిశిలలలో జీవచిహ్న లేమియు లేవు; కనుక వానికి 'అజీవశిల' లని భూతత్వజ్ఞులు పేరిడిరి. ఉత్తర అమెరికాలో నిట్టిమహాశిలలు కలవు. ఈ శిలల దళసరినిబట్టి అట్టివేర్పడుటకు మొత్తము భూచిహ్నకాలమగు 160 కోట్ల వత్సరములలో సగము పట్టియుండును. అనగా ధరాసముద్రములు విడిగా

ఏర్పడినతరువాత జరిగిన మన్వంతరములందు దగ్ధకాలపుచిహ్నములలో జీవు లుండినట్లు కనబడదు. ఈశిలలలో తరంగరేఖలు, వర్షపాతచిహ్నములునే కలవు. కాని ప్రాణులుండిన సూచనలేదు. తరువాత జీవచిహ్నములువచ్చి, క్రమముగా అవి వధికమగును. ఆ ప్రథమ ప్రాణుల కాలమునకు "పురాణజీవ యుగ"మని భూతత్వజ్ఞులు పేరిడినారు. ప్రథమజీవు లనదగిన అల్పప్రాణుల దేహాశేషము, డిప్పలు, సముద్రపు మొక్కల కాడలు, బొడిపెలు, నాచు, సముద్ర క్రిమి శేషాదులును అప్పటివి.

ఆయుగమున ప్రాకుచు వలయాకారముగ దొర్లు కొన్ని చీడపురుగులు పుట్టెను. తరువాత కొన్ని లక్షలయేండ్లకా మొదటి ప్రాణులకన్న హెచ్చువేగబలములుగల సముద్రపుతేళ్లు బయలుదేరినవి. ఇవియు నంతగ పెద్దవికావు. వీనిలో చాల పెద్దవి తొమ్మిదడుగుల పొడవువి. అప్పటికి భూతలమున వృక్షజంతుజాతులేవియు లేవు. నీటిలోగూడ ఇంకను చేపలున్నగు వెన్నెముకగల జంతువులు లేవు. ఆ ప్రాణులచిహ్నములు లోతులేని నీళ్ళనుండి, ఆటుపోట్లు కలుగుస్థలములనుండి దొరికినవి. శిలల గుంటలందు పాతగోతులలోను నిలువయున్న నీటిచుక్కను సూక్ష్మదర్శినితో పరీక్షించితిమా, అందు గోచరించు ప్రాణులును పైనజెప్పిన ప్రాణులును ఒకేజాతివని తెలియును; పరిమాణంలో మాత్రం భేద ముండును.

అయినను మనభూమిపై మొదటనుండిన ప్రాణుల రకాలుకొన్ని ఈపురాణజీవశిలలలో కన్పడవు. ఎముకలు డిప్పల వంటి దృఢపదార్థముల దేహాలు బురదనేలను సంచరించునప్పుడడుగులయానవాలు పడునంత బలువైనవి, తప్ప, తక్కినప్రాణుల

చిహ్నము లేవియు శిలాపరీక్షచే లభింపవు. ఇప్పటిజీవరాసులలో మృదుశరీరమేగల లక్షలకొలది చిన్న జంతుజాతులు కలవు. అట్టి జంతువులచిహ్నము భావివైజ్ఞానికులకు మిగులదు. పూర్వయుగములందును, మృదుదేహాలగు జంతుజాతులెన్నియో భూమిపై జీవించి వృద్ధియై గతించియుండును; కాని వాటి స్థిరచిహ్నము లేవియు భువిపైన మిగులలేదు. అజీవయుగమను ఆదికాలపు గాఢసముద్రముల వెచ్చనినీటిలో ఎముక డిప్పలు లేని మెత్తమెత్తని రకరకముల చిన్నపురుగులు మొలకలు జీవించి, తీవ్రాతపపు తీరములవెంట వ్యాపించియుండును. ఈకాలపు మనబ్యాంకుల లెక్కలవల్ల ఇప్పటిప్రజలందరిస్థితి తెలియదు; ఆబ్యాంకురికార్డులో వ్యవహారంకలవారి విషయము మాత్రమే తెలియును. అట్లే అప్పటినేలపై డిప్పలు సున్నపుగుల్లలవంటి స్థిరచిహ్నములు శేషించిన జంతుజాతుల సంగతిమాత్రమే మన కిపుడు తెలియ వీలగును.

ఇట్టిస్థిరచిహ్నములుగల దృఢశిలలకన్నను ప్రాచీనములగు శిలలు కొన్ని కలవు. వీనిలోని బొగ్గులు దృఢముగనుండక విచ్చిపోయియున్నవి. మనకు తెలియని కొన్నిజీవు లాబొగ్గులను శిలలుగాకుండునట్లు వేరుచేసియుండునని కొందరు ప్రామాణికుల భావము.*

---

*అజీవయుగపు అతిపురాతనశిలలు మన దక్షిణభారతదేశమందు వింధ్యమందుగూడ అచ్చటచ్చట (ముఖ్యంగా నెల్లూరుప్రాంతపు మైకాప్రదేశము, ఉత్తరార్కాటు కోయంబత్తూరులలోని కొన్నిశిలాస్థలులు, ధార్వారు, బళ్ళారి, కోలారులలోనికొన్నిలోహస్థలులు), కలవు. ఇవి భూమిలో సుమారు 20,000 అడుగుల లోతుననుండును. కొన్ని కడపరాళ్ళ

జగత్కథ—2

శిలలు వింధ్యపర్వతపు లోభాగము నిట్టివే. వీనియంతపురాతనము కాకపోయి నను కర్నూలులోగూడ కొన్ని అజీవకాలపుశిలలు కలవట. హిమాలయములం దజీవశిలలు అరుదు. తరువాత మనదేశమందు కలిగిన పురాణజీవ శిలాస్థలు లన్నిటిలో అతిప్రాచీనములు, పంజాబులో ఉప్పుగనులయొద్దను, తరువాతివి కాశ్మీరమందును గలవందురు. సముద్రమం దెన్నియో పురాణజీవశిలలు కలవు. మద్రాసువద్ద నిట్టివి ఇటీవల కొన్ని బయలుపడినవి; అందు వేయిరకముల చిహ్నములు కలవట. నర్మదాసాగరసంగమస్థలమందు నిట్టిపూర్వపు నీటి జంతువుల చిహ్నములు కలవు.

# 4. మత్స్యయుగము

సృష్టి కొన్ని వేలయేండ్ల క్రిందటనే ఆరంభించె ననుకొన్నప్పుడు, ఇప్పుడు మన కగుపడు వృక్షజంతుజాతు లిట్టిరూపములతోనే అప్పుడొక్కసారిగా ఉదయించినవని కొందరు తలచిరి. కాని ప్రాచీనశిలలలోని చిహ్నముల గనిపెట్టి పరిశోధించిన మీదట, చాలజీవజాతులు చిరకాలమునుండి క్రమముగా మారుచు వృద్ధినొందుచు వచ్చినవని తోచెను; మన కాజ్ఞానము వృద్ధియైనపిదప, భూమిపైనున్న వృక్షజంతుజాతులన్నియు అసలులో అజీవకాల మను కల్పాదినుండి, అదృశ్యమై అతి సూక్ష్మమగు చిత్పదార్థములై, మొదటి అత్యల్పప్రాణులుగ నుండి, అంతట కొద్దికొద్దిగ అవిచ్ఛిన్నముగ మారుచు, వృద్ధి బొందుచు, నూతనాకృతులదాల్చుచు, (యుగములకొలది గడచినమీదట) తుదకిప్పటిస్థితికి వచ్చినవని తేలినది. ఇదియే పరిణామసిద్ధాంతము, జీవవికాససిద్ధాంతము అనబడును. భూమి వయఃకాలసమస్యవలెనే, ఈజీవవికాససమస్యనుగూర్చియు చాల తీవ్రచర్చ జరిగెను. క్రైస్తవ, యూద, మహమ్మదీయమతముల మూలసిద్ధాంతముల కీపరిణామసిద్ధాంతము వ్యతిరిక్తమని వెనుక భావించిరి; అది యిప్పుడు పోయినది. జీవకోటికంతకు నొకటే మూలాధార మని క్రైస్తవకాతలికు, ప్రొటెస్టాంటు, యూద, మహమ్మదీయమతస్థుల పూర్వాచారపరులు నిప్పు డంగీకరించినారు. జీవజాతి యేదియు మనభూమిపై హఠాత్తుగా నవతరింపలేదు; పూర్వ మన్వంతరములందు జలాశయతీరములయొద్ద

దృష్టికి గోచరంకాని జిగురువంటి చేతనములు మొదటనుదయించి, వాటినుండి వివిధప్రాణులు క్రమంగా ఉత్పన్నమై, రూపాంతరములబొందుచు వృద్ధినొంది, కాలక్రమమున ప్రస్తుతశారీరక, మానసిక, నైతికశక్తుల నొందినవి.

ఆయాజీవివ్యక్తుల సముదాయమే ప్రాణికోటి యనబడును. అచేతనములగు మట్టిముద్దలు, కేవలస్ఫటికాదులును జీవులలో చేరవు. ఇతరవస్తువుల తమలోకి హరించి జీర్ణించుకొనుట, మరల ప్రాణుల బుట్టించుట జీవలక్షణము. అనగా ప్రాణులు తినును, కనును. వానిలోనుండి పుట్టువ్యక్తులు చాలవరకు వానిని పోలును, కాని కొంతవరకు భేదించును. వ్యక్తికిని దానిశిశువుకును చాలవరకు స్వజాతిసామ్య ముండును; కాని వానిమధ్య కొంత వ్యక్తిభేదము నుండును. ఈసూత్రము ప్రాణికోటికంతకును వర్తించును.

ఇట్లు శిశువులకు తమ జనకజీవులతో పోలిక యేలకలుగునో, తిరుగ వానిమధ్య కొంతభేద మేలనో, ప్రకృతిశాస్త్రజ్ఞులింకను నిరూపింప లేకున్నారు. అయితే పిల్లలమధ్యపోలిక భేదము కూడ నుండుటబట్టి, ఆయాప్రాణుల పరిసరములు మారినపు డెల్ల తదనుగుణముగ ఆవ్యక్తులలో కొంతమార్పు కల్గుచుండునని (సిద్ధాంతముచేగాక) అనుభవముచే గ్రహింపవచ్చు. ఆయాకాలపు ప్రాణులలో కొన్నింటి గుణగణములప్పటిపరిస్థితుల కనుకూలముగను, కొన్నిటివి వ్యతిరేకముగను ఉండును. అనుకూలప్రాణు లితరములకన్న చాలకాలము జీవించి, చాల క్రొత్తవ్యక్తుల బుట్టించును. ఇట్లు తరములు గడచినకొలది ఆజాతిసామాన్యస్థితి మారుచు, వృద్ధియగు

చుండును. ఈ "నిసర్గవరణము" వైజ్ఞానికసూత్రముకాక, ఉత్పత్తి రీతినిబట్టియు అందు వ్యక్తిభేదము లుండుటబట్టియు ఊహచే తేలినది. వైజ్ఞానికుల కింకను తెలియని కొన్నిప్రకృతిశక్తులు జీవజాతుల బోషింపుచు నశింపజేయుచుండును. కాని జీవితపద్ధతి తెలిసిన ప్రతిభీమంతుడును లోకపుప్రాణులందనాదిగం నీనిసర్గ వరణపుపద్ధతి కలదని యంగీకరింపవలె.

ప్రాణులయారంభ మెట్లైనదని వైజ్ఞానికులు మనో హర రాద్ధాంతముల జేయుచున్నారు. ఈసమస్యతత్త్వముగాని, అందుకు తృప్తికరసమాధానముకాని, ఇప్పటికిని ఏర్పడలేదు. బహుశః ఎండ వెలుగు గల వెచ్చని లోతులేని ఉప్పునీటనో బురదలోనో, ఇసుకలోనో జీవము ప్రారంభించి, అక్కడనుండి తీరస్థలములకువచ్చి క్రమముగ విశాలజలములలోనికి వ్యాపించి యుండునని ఇంచుమించుగా ప్రామాణికు లందరును నిశ్చ యించినారు.

ప్రపంచారంభమున ఆటుపోట్లు ప్రవాహములు ఉద్రిక్త ములై యుండెను. కొన్ని ప్రాణులు గట్టుపై బడి యెండియు, కొన్ని సముద్రపు టడుగుకు మునిగి వెలుతురు గాలి దొరక కయు చచ్చెను. కాని చిన్నచిన్నజీవులు వేరుపారి వృద్ధియగు టకుకూడ, అప్పటి పురాతనపరిస్థితులు వీలుగనే యుండినవి. స్వస్థలము తప్పినను వెంటనే నశింపకుండ, అంగరక్షణకు చర్మ మును డిప్పలును ఏర్పడ వీలుండెను. రుచిశక్తి యెంతమాత్ర మేర్పడినను, జీవులాహార మాస్వాదింపగల్గెను; కాంతి గ్రహించు శక్తిరాగానే సముద్రగర్భములనుండి గుహలనుండి చొచ్చుకొని యీవలకు బయలుదేరుచుండెను; తీవ్రతాపమునుండి కొంత

లోతునీళ్ళకు పోవుటకును, చాలా యవకాశముండెను. మొదట శరీరముల కేర్పడిన డిప్పలు, చర్మకవచములు, శత్రువులనుండి రక్షింపలేకపోయినను, ఎండదెబ్బనుండి రక్షణకు పనికివచ్చెను. తరువాత కొద్దికాలముననే పండ్లు, గోళ్లుకూడ బయలుదేరెను. నీటితేళ్లే చిరకాలమువరకిదివరలో ముఖ్యజంతువులుగనుండెను. పిమ్మట పురాణజీవశిలలలో 'సిలూర్యియను' అనునొకభాగమున ఆ మొదటిజీవులకన్న నెక్కువ ఈతశక్తి, కండ్లు, పండ్లును, కలిగిన ఒకకొత్తజీవజాతి కనబడును. ఈశిలలు 50 కోట్లసంవత్సరముల క్రిందటివని భూతత్వజ్ఞులనేకులిప్పుడుతలచుచున్నారు. ఈ ప్రాణులే మనకు తెలిసియున్న వెన్నెముకగల జంతువులలో మొదటివి. ఇదియే మత్స్యజాతి కారంభము.

తరువాతి వగు 'డెవోనియను' శిలలలో చేపలు చాల కలవు. అవి విస్తరించియుండుటచే ఆ కాలమును 'మత్స్య యుగ' మందురు. ఇప్పటి మరచేపలును మహామీనముల బోలినవియు, ఇప్పుడదృశ్యమైన కొన్ని విచిత్రపురాణమత్స్యములును అప్పుడు నీటిలో నీది విజృంభించుచు, పైకెగురుచు, నాచులో దూరుచు, ఒక దాని నొకటి తినుచు, నీటికి జీవకళ నిచ్చుచుండెను. ప్రస్తుతపు మానమునుబట్టి యీ మీనములంతగొప్పవికావు; తరచు రెండుమూడడుగుల పొడుగుండెను.

మత్స్యము లసలేజాతినుండి పుట్టెనో భూగర్భశాస్త్రముచే తెలియుటలేదు. అంతకు పూర్వపుప్రాణుల కివి ప్రత్యక్షముగ సంబంధింపవు. ఇప్పటి చేపగ్రుడ్ల బరీక్షించియు ఇతర విధములను, జంతుశాస్త్రజ్ఞులు మత్స్యోత్పత్తి మూలమును గూర్చి విచిత్రసిద్ధాంతము దెల్పిరి. మృదుదేహులై నీటిలో



మత్స్యయుగపు సముద్రజీవులు.
('డెవోనియను' శిలలలోని జీవశేషములు.)

నీదు కొన్ని క్షుద్రజంతువుల ముఖభాగమున, పండ్లవంటి దృఢ పదార్థము లేర్పడి, వాటినుండి తరువాత మత్స్యములు కలిగి యుండును. కొన్నిరకముల చేపలకు పైన క్రిందనుండుపండ్లు పెదవులద్వారా బయటకువచ్చి, సరాసరి నీటి శరీరమంతయు పొలుసు పొలుసుగ నావరించి కొంతకాలమునకు వెన్నెముకగ పరిణమించును. ఇవియే మొదటి వంశాస్థిక (= వెన్నెముకగల) జంతువులుగ పరిణమించియుండును *

---

*జీవారంభ మెటుల గలిగె ననునది సృష్టిలో నొక మహాసమస్య. సృష్ట్యారంభము కొన్నివేలయేండ్లక్రిందనే కలిగెనని నమ్మిన ప్రాచీనక్రైస్తవులు, యూదులు, ప్రాచీనయవనులు మొదలగ వారీసమస్యనుసరిగాచర్చించియుండరు. అట్లుగాక, ఇప్పటి వైజ్ఞానికులవలె మన ప్రాచీనభారతీయులును ఈసమస్య నుత్సాహముతో విమర్శించిరి. కాని వారిలోను ఏకాభిప్రాయము కలిగినటుల తోచదు. సృష్ట్యాదినిగూర్చి మనపూర్వికులభావము ఇప్పటి పరిణామసిద్ధాంతమును సమీపించును. దృశ్యములగు చిదచిత్తులన్నిటిలోను ఆత్మపదార్థము లీనమై యుండునని, ఆత్మనుండియే ఋద్ధ్యాదులద్వారా క్రమంగా ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివియు కలిగెనని, వేదఋషులభావము. "తస్మాద్వా ఏతస్మా దాత్మ న ఆకాశ స్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ", (తైత్తి. ఉ. ఆనందవల్లి) "ఏతస్మాత్ ......ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ" (ముం. ఉ...... 2-1-3) అసత్తునుండి సత్పదార్థము కలిగెనని ఒకసిద్ధాంతమును, సత్తునుండియే సత్తు కలిగెను, అసలు మూలప్రకృతియు సత్పదార్థమే. అని ఇంకొకసిద్ధాంతమును ప్రాచీనభారతీయులలో నుండె నని తోచును.

"అసద్వా ఇద మగ్ర ఆసీత్, తతో వై సదజాయత" (తైత్తి. ఉ. అ. 7)' సదేవ సౌమ్యేదమగ్ర ఆసీదేక మేవాద్వితీయం, తద్ధైక ఆహుః అసదే వేద మగ్రఆసీత్'......(ఛాం. ఉ. 6-2)

జగత్కారణమగు అవ్యక్తస్వరూపము సత్, అసత్ అను భేదము లేనిదను సిద్ధాంత మీక్రిందివాటిలో గలదు. "నాసదాసీన్నో సదాసీత్త దానీం......" (ఋ. సం. 10 మం. అ. 11. ఋ. 2.) "సదసచ్చాహ మర్జున (భ- గీ. అ 9. శ్లో- 19.) త్వమక్షరం సదసత్తత్పరం యత్ (గీత. 11-37)

'న సత్తన్నాసదుచ్యతే' గీత. 13-13.

నిర్జీవము లని మనము సాధారణంగా ఎంచు శిలాలోహాదివస్తువులలో గూడ లీనమై యొకవిధమగు జీవ ముండవచ్చును. 'నిర్జీవ' వస్తువులగూర్చి సామాన్యముగ నుండుభావము తప్పని మనప్రాచీను లనిరి. ఆధునిక వైజ్ఞానిక ప్రముఖులలో నొకడగు కీర్తిశేషుడు శ్రీ జగదీశచంద్రవసు గారు 'ది లివింగ్ అండ్ ది నాన్లివింగ్' మొదలగు తన యుద్గ్రంథములందు ప్రకృతిశాస్త్ర పరిశోధనలద్వారానే ఇట్లు నిరూపించిరి. ఇట్లు అనాదిగ లోన లీనమైయున్న అంతశ్శక్తియే క్రమముగా అనుకూలసందర్భములందు వికసించి వ్యక్తిజీవు లేర్పడెనని తోచును. సూర్యునిలో జీవోత్పత్తి నిచ్చుశక్తి కలదనియు, సూర్యునిలో సృష్టిస్థితికర్తయగు దేవుడు లీనుడై మనకు గోచరించు ననియుం తెలుపు వేదవాక్యమును సంధ్యావందనంలో రోజూ స్మరింతురు. "నమస్స వితే జగదేక చక్షుషే జగత్ప్రసూతి స్థితినాశహేతవే, త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే విరించినారాయణ శంకరాత్మనే." కాళిదాసును లోకమునకు చేతనశక్తి సూర్యునివల్ల కల్గునని ఒకచక్కని ఉపమలో ఉదహరించినాడు. 'యతస్త్వ యాజ్ఞానమశేషమాత్రం లోకేనచైతన్యమి వోష్ణరశ్మే' (రఘువంశం. 5-వ సర్గ.) సూర్యుడే మన భూమిపైగల జీవమునకు శక్తికిని మూలాధారమని ఇప్పటి వైజ్ఞానికులును అంగీకరింతురు.

# 5. రొంపికాలము (కూర్మయుగము-1)

మత్స్యయుగమందు స్థలభాగమున ప్రాణులు లేనట్లు తోచును. అప్పటినేల శిలయో ఊషరస్థలియో అయి, సూర్య తప్తము వర్షపరిషితముగ నుండినది. క్షేత్ర మేర్పడుట కవసర మగు క్రిమిజాతియు, నేలను భేదించు తృణాంకురములును, ఇంకను భువిపై లేనందున, ఇంకను క్షేత్ర మేర్పడ లేదు; నాచు లేదు. నీటనే ప్రాణులుండెను.

ఈవంధ్యశిలలపై శీతోష్ణస్థితులెంతయో మారుచుం డెను. ఇంతలకాలము లతిక్లిష్టములు. భూమి క్రాంతి వృత్తపు ఆకారము, భూచలనపు ధ్రువములస్థానమును, భూఖం డముల రూపును, క్రమముగ మారెను. సూర్యతాపమును కొంతతగ్గియుండును. అందుల ఫలితముగ భూమిపైన చాల కాలము కొన్ని భాగములందు చలి, మంచు, వ్యాపించినవి. మరల కొన్నిలక్షలయేండ్లు వెచ్చని భోగ్యస్థితిగల్గినది. ఈ లోగా భూమిలోపలిభాగమును మారుచుండెను. కొన్ని లక్షల యేండ్లు భూగర్భమున తాపోద్రేకముగల్గి, అచ్చటిశిలాద్రవము లగ్నిపర్వతపు జ్వాలలతో పైకెగసెను. కొత్తకొండలు భూభాగ ములు నేర్పడెను, కొన్ని చోట్ల సముద్రముల లోతు హెచ్చెను; కొన్నిగిరులింకను పెరుగజొచ్చినవి. భూగర్భములోని పరిణా మముచే భూతలాకృతియు, అందుచే భూమిపైన శీతోష్ణస్థితియు మారినవి; ఈ ప్రళయాంతమున కొంత స్తిమితపడెను; పొగ మంచు వాన కలుగుచు, క్రమంగా ప్రవాహములు హెచ్చెను;

ఆ ప్రవాహాలలో జేరి, కొండమట్టి వండుగా సముద్రమునకు చేరెను; అందువల్ల కొన్ని సముద్రభాగములు మెరకయ్యె, అచ్చటి హెచ్చునీరు మరియొకవైపు పల్లపుభూమికి ప్రసరింప జొచ్చెను. ఇట్లనేకవిధముల మెరకపల్లములు మారుచుండెను. భూమిపైభాగము గట్టిపడినప్పటినుండి భూమి క్రమముగానే చల్లబడుచుండెనని పాఠకులు తలవకూడదు. భూపటలము కొంతచల్లనై పెంకువలె నేర్పడగనే భూమధ్యభాగపు శీతోష్ణస్థితికి పైనున్నస్థితితో సంబంధము పోయినది. 'అజీవయుగ' మను కల్పాదినే భూమిపై హిమప్రళయము కలిగినట్లు చిహ్నములు కలవు.

మత్స్యయుగాంతముకు లోతులేని సముద్రములు సరస్సులు నేర్పడెను. అప్పటికి, ప్రాణికోటి జలభాగమునుండి స్థలప్రదేశముకు విరివిగా వ్యాపింపదొడగెను. వీనిలో కొన్ని అప్పటికి కొన్ని లక్షలయేండ్లముందే మారుమూలలమాత్రమెట్లోయుండెను. కాని విరివిగావ్యాపించుట కప్పుడే వీలుకలిగెను.

ముందుగా తరుజాతి, దానివెంట కొలదిలోనే జంతుజాతి, నేలపైకి వ్యాపించియుండును. ఇదివరలోనీళ్ళే మొక్కల తలలను ఎండకెదురుగా పైకితేల్చియుంచెను. ఇప్పుడు నీటిపట్టులేకుండ మొక్కలు భూతలముపై నిల్చి తలయెత్తుకొనుటెట్లు, మఱియు ప్రక్కల నీరులేనందున, పాదములక్రింద నున్న భూమిలోనిబురద నీరు తనదేహనాళములలోనికి పైకి తెచ్చుకొనుటెట్లు, అనుసమస్యలు గలిగెను. మొక్కలలోపల నంతటను తిత్తులవంటి గట్టికాడలేర్పడి. అందుచేమొక్కలునిలిచియుండుటకును, వాటినాళములద్వారా నీరు తీసుకొనుటకును



కర్బనకరయుగపు మొక్కలు, వృక్షములు.

(ఇవే తరువాత ఖనిజములైనవి.)

వీలై, ఈరెండుసమస్యలును పరిష్కారమయ్యెను. ఆ కాలపు శిలాచిహ్నములలో నిట్టికాడలుగల మురుగునేలలోని మొక్కల శేషములు చాలగ గన్పట్టును. వీటిలో కొన్నివృక్షములు, కొన్ని తుప్పలువగైరాలును గలవు. వీటివెనుక నొక్కొక్క యుగము గడచినకొలది, అనేకజాతుల జంతుజాలములు నీటి నుండి భూస్థలి కెగబ్రాకినవి. అందు గొన్ని శతపదములు, కొన్ని సహస్రపదములు; కొన్ని ఆదిమజాతిపురుగులు; పీతలకు సముద్రపుతేళ్ళకు సంబంధించినవికొన్ని క్రమంగా మొట్టమొదటి సాలిపురుగులును మెట్టతేళ్ళును అయినవి; అంతట వంశాస్థికములు కలిగెను.

కొన్ని మొదటికీటములు చాల పెద్దవి. ఆ కాలపు రాతి సపుటీగలలో కొన్నిటికి 29 అంగుళముల వెడల్పు రెక్కలుండెను. ఈ క్రొత్త ప్రాణుల కాపరిస్థితుల కనుగుణమగు అభ్యాసము కలిగినది. ఇదివరలోని జంతువులు నీటిలో జేరిన గాలినే పీల్చుకొనెను. ఇప్పటికిని జలచరము లన్నియు నట్లే చేయుచున్నవిగదా! కాని స్థలచరములు కాజొచ్చినజంతువులకు వలయుతడి నాజంతువులు తామే సంపాదించుకొనవీలు కలిగెను. ఊపిరితిత్తులలో తడిలేనివా రూపిరియాడక మరణింతురు. వీటిద్వారా గాలి రక్తములో ప్రవేశించుట కూపిరితిత్తులలో కొంతతడి యుండుట యవసరము. ఈపువ్వారల తడిని కాపాడుటకై వాటిపై పొరలేర్పడెను. కొన్నిటికి క్రొత్తరకపుతిత్తులు అనగా శరీరంలోనే తడి లాగుకొని భద్రపరచుకొను శ్వాసకోశా లేర్పడెను. ఇట్లు క్రొత్తస్థితితో సమన్వయము కల్గెను. పురాతనపుచేపల పువ్వారలు మెట్టగాలి పీల్చుట

కుపయోగింపవు. ఆపువ్వారలు స్థలచరములలో శ్వాసకోశ ముగా పరిణమించెను.

కప్పలు, బల్లులు మొదలగు ఉభయచరములు జల చరములుగా పుట్టి, పువ్వారలద్వారా గాలి పీల్చుకొను చుండును; కొంతకాలమునకు చేపల యీతతిత్తిబోలు సంచి వీటి మెడక్రింద నేర్పడి, అందు శ్వాసకోశ మేర్పడును. ఈలోగా మొదటిపువ్వారలు రాలి, ఆకన్నములు పూడి పోయి, కర్ణరంధ్రమునిమిత్త మొక్కద్వారమే మిగిలియుం డును. ఈస్థితికి వచ్చినజంతువు నేలపై గాలినే పీల్చును; కాని యిది కాన్పుకు గ్రుడ్లుపెట్టుటకై నీటిలోనికి పోవలెను.

ఆమురుగు (సూక్ష్మ) యుగపు (శ్వాసశక్తి వెన్నె ముకగల) క్రిమికీటకములు మొలకలు ఉభయత్ర ఉండునవి. చాలవర కివి యిప్పటి సూక్ష్మజాతివి. ఇందులో కొన్ని పెద్దవి. ఇవి భూచరములయినను చెమ్మనేలనే యుండవలెను. అప్పటి వృక్షములు నిట్టివే. వీని కింకను మెట్టపై వర్ధోటకముతోను మంచుతడితోను మొలకలెత్తగలగింజలుగాని ఫలములుగాని లేవు; వానిపుప్పొడి నీటనే పడి అంచే మొలకలెత్తవలెను.

ఇట్లు ప్రాణులశరీరమున సందర్భోచితముగ మార్పులు కలుగు విచిత్రపరిణామమును గూర్చి 'కంపారటివ్ అనాటమీ,' అనబడు సర్వజీవాంగవిజ్ఞానమువలన రమ్యముగ తెలియును. ప్రాణులన్నియు అసలు జలసంబంధులే. (చేపలు మొదలు మనుష్యునివరకున్న వంశాస్థికజంతువులకు, గ్రుడ్డుగానో, గర్భస్థ పిండముగానో, ఉన్నపుడు చేపపువ్వార లుండును. తరువాత నవి పిల్ల పుట్టులోగా వానియంగములనుండి హరించిపోవును.)

జలచరములగు చేపలనేత్రములకు రెప్పలు లేక, నీటిస్పర్శయే యుండును; భూచరములైన పెద్దజంతువులలో ఆకండ్లకు ఎండనుండి రక్షించురెప్పలు తడిని భద్రపఱచు పొరలు నేర్పడును. గాలిలోనిధ్వని మందము; అందుచే స్థలచరములకు చెవిగూబ యవసర మయ్యెను. ఇట్లే దేహమందలి యింద్రియము లన్నిటిలోను పరిసరముల కనుగుణమగు పరిణామము లేర్పడెను. ఆ 'కర్బనకర'యుగపు ఉభయచరప్రాణులు మెట్టగాలి పీల్చగల్గినను, అవి కొన్నుకు నీటిపై నాధారపడి, మురుగుస్థలము లందు, తీరములందు, నీళ్ళలో గట్టుదగ్గరను మాత్రమే వసించుచుండెను.అప్పటికొండలు, మెట్టలు ఇంకను నిర్జీవముగనుండెను.*

* అన్ని జంతువులు పుట్టుటకు ముందు తమతల్లులగర్భమందు కొంత కాలముండును. కొన్ని పక్ష్యాదులు కొంతకాలముకు గ్రుడ్లుగ నుద్భవించి, కొద్ది రోజులలో పొదిగి, శిశువు లగును. మిగిలిన పెద్దజంతువులును నరులును గర్భమందే చాలనెలలు పిండరూపముగ నుండును. ఈ అండపిండములను వైజ్ఞానికులు సూక్ష్మదర్శనిద్వారా పరీక్షించి చూడగా, అవి మొదట అత్యల్పజీవులుగ, అంతట మత్స్యాంగకములుగ తరువాత కూర్మాదిరూపములుగ క్రమముగా మారుచు, తుదకు స్వజాతియాకారము నొందునని తేలినది మన మనుష్యప్రాణులు నిట్లే గర్భస్థపిండములుగా నున్నప్పు డీయాకారము లన్నిటిని, అంతట నొకరీతి కోతిరూపును పొందిన తరువాతనే, నరశిశువుగా నేర్పడును. ఐతే, ఇవియన్నియు పిండస్థితిలో గర్భమందే కల్గినందున మన కాసంగతి తెలియదు. ఈపూర్వపరిణామములు ప్రతివ్యక్తికిని జనించుపూర్వము తప్పక కలుగుచుండును. అనగా సృష్టిలో మనభూమిపైన యుగములకొలదినుండి కలుగుచున్న జీవపరిణామము ఆయా ముఖ్యజాతుల ప్రతివ్యక్తి ఉత్పత్తిలోను ప్రతిబింబిత మగును. జీవపరిణామసిద్ధాంతము తథ్యమే అనుట కిదియు నొక నిదర్శనము. ఇట్లు పిండోత్పత్తినుంచి శిశుజననమువరకు జరుగు క్రమపరిణామమును తెలియజేయు శాస్త్రమును 'ఎంబ్రియాలజీ' (=పిండశాస్త్రము) అందురు.

# 6. సరీసృపయుగము

## (కూర్మయుగము-2)

ఆకర్బనకరయుగపు సమృద్ధప్రాణుల కంతట నొక నిర్జల ప్రళయదశ కలిగెను. అప్పటి శిలాధాతువుల పైపొరలలో జీవరాశి చిహ్నములు లేవు; అవి వట్టి యిసుకరాళ్లే. అప్పుడు శీతోష్ణస్థితి తారుమారై, కొంతకాలం హిమ మావరించి, అతి శీతలముగ నుండెను. అంతట, చాలస్థలములం దాముదగు నేలల చెట్లన్నియు నశించి, భూమిలో ఇసుకరాళ్లతో కప్పబడి, అణగిపోయి క్రమముగా ఖనిజములైనవి. ఇప్పుడు లోకమందున్న రాక్షసిబొగ్గుగనులలో చాలభాగ మట్లేర్పడినదే.*

కాని యిట్టి యుగసంధులందే, ఆకష్టము లనుభవించు ప్రాణికోటిలో తీవ్రపరిణామము నవ్యదశ సంభవించుచుండును. నూతనమన్వంతరమున వెచ్చదనము అధికము తిరుగ భూతలమున సమకూడ, క్రొత్తజాతుల జంతువులు వృక్షములు జనించెను. ఆకాలపు శిలలందలి దేహావశేషముల బరీక్షించినచో, అప్పటివంశాస్థిక జంతువులు పెట్టిన గ్రుడ్లు ఇదివరలోని వాటివలె చిరుకప్పలవలె నీటిలో కొంత కాల ముండకయే, శిశువు పుట్టగానే నేలపై స్వతంత్రముగ జీవింపదగు అంగము లేర్పడినట్లు కన్పడును. అవి పుట్టినప్పటికే

---

* మన దేశపు పర్వతములన్నిటిలో ప్రాచీనములగు హారావళి పర్వతములు, రాణిగంజి, సింగరేణి, మొదలగు బొగ్గుగనులస్థలములును అట్లే యేర్పడినవందురు.

పువ్వారలుపోయి, ఆకన్నములు గర్భమందే పూడిపోవును. చిరుకప్పల యవస్థలేని యాక్రాంత్తజాతిజంతువులే 'సరీసృపములు.' ఆకాలమందే చెట్లకు గింజ లేర్పడి, సరస్సురొంపి యవసరముపోయి, ఇతరస్థలములందు రాలినను, అవి మొలకలెత్తెను. అప్పటి కింకను నేలపై గడ్డి మొలచుట, మొక్కలు పుష్పించుట లేదు. కాని తాడిజాతివగు కొన్ని యుష్ణదేశపు మొక్కలు బయలుదేరినవి. అడవితుప్పలు పురుగులు చాల నుండినవి. అప్పటి కింకను తేనెటీగలు సీతాకోకచిలుకలు లేకున్నను, పేడపురుగు లుండినవి. అనగా, ఈప్రళయకాలమందే స్థలార్హమగు వివిధప్రాణు లారంభించినవి. పరిస్థితులు అనుకూలంకాగా, అవి వృద్ధిగా వ్యాపించెను. యుగములు గడచి, పరిస్థితులు మారి, భూమిలో నగణ్యమగు కంపములు చలనములు కలుగుచుండెను. వీటికితోడు భూమిక్రాంతివృత్తములోను దానికిని భూధ్రువమునకునువంపులలోను మార్పులు గల్గి చాలచోట్ల వాతావరణ ముష్ణమయ్యెను. ఈయుగము మొత్తం 20 కోట్ల యేండ్లుండియుండును. ఇది 'మధ్యజీవయుగ' మనబడును. దీనికి పూర్వపువగు 'ఆజీవయుగము,' 'పురాణజీవయుగము' రెండును కలసి 140 కోట్లయేండ్లకాల ముండెను. ఈమధ్యజీవయుగమున వివిధసరీసృపములు అసంఖ్యాకంగా వ్యాపించెను. కనుక దీనిని 'సరీసృపయుగ' మందుము. ఈయుగము గతించి యిప్పటికి సుమారు 8 కోట్లవత్సరము లైనవి. ఈమధ్యజీవయుగము తరువాత నవజీవయుగము,' ఆపిమ్మట మన ఆధునికయుగమును వచ్చినవి.

మన ప్రస్తుతకాలంలో సర్పజాతుల రకములు, వాని వ్యాప్తి చాల తక్కువ. (అంతకును పూర్వపు ఉభయచర జాతికన్న, సరీసృపసంఖ్య ఇపుడు హెచ్చుగనే యున్నది.) మనము చూచు పాములు, మొసళ్లు, తాబేళ్లు, కూర్మజాతులు, బల్లులుకూడ ఈ సరీసృపజాతిలోనివే. ఈజాతిజంతువు లన్నిటికిని సాలుపాడుగున వేడియుండవలె. ఇవి చలికి తాళ లేవు. పూర్వపు మధ్యజీవయుగమందుండిన సరీసృపములు నిట్లే యుండెను. అప్పటి జంతువులు వృక్షములుకూడ వేడిలోనే పెరిగెను, మంచుకు నిలువలేకుండెను. కాని అంతకుపూర్వపు ప్రాణుల కవసరమైన బురద రొంపి అక్కరలేక, ఇవి మెట్ట కలవాటు పడెను. ప్రస్తుతమున్నవేగాక, ఈయుగపు సరీసృప ములలో ఇంకను క్రొత్తరకములు, కొన్ని చాల పెద్దవియు ఉండినవి; మహాకూర్మములు, దీర్ఘమకరములు, బల్లులు, కాల సర్పములునేగాక, ప్రస్తుతమందులేని కొన్ని యద్భుతజంతువులు నుండెను. 'డినోసారు' లను తక్షకజాతియు, ఇతరభీకరమృగ ములును ఉండినవి. మఱియు ఆకాలమున పల్లములందు రెల్లు, తుప్పలు చాలబయలుదేరినవి. తృణాహారులగు సరీసృపము లును పుట్టి, అందు దూరి క్రమముగ చాలవృద్ధి నొందినవి. వీనిలో కొన్ని తక్కినస్థలచరములకన్న పెద్దవై, తిమింగిలము లంతయుండెను. 'డిప్లొడొకస్ కార్నెగై' అనునవి 84 అడుగుల పొడ వుండినవి; 'జిగాంటసారసు' జాతి 100 అడుగుల వరకు నుండెను. వీనిని భక్షించుమాంసాహారులగు 'డినోసారులు' కూడ అట్టిదీర్ఘకాయములే; వీనిలోని 'టిరన్నొసారస్' అను



మధ్యయుగపు మహామీనము (కంకాళశేషము.)



మధ్యజీవయుగపు ' డిప్లడోకసుఫాసిలు '

రకపు సరీసృపము లన్నిటికన్న భీకర మని చాల గ్రంథములలో వర్ణింపబడినది.

ఈమహాజంతువు లీ 'మధ్యజీవయుగ'పు శాద్వలముల దినుచు వేటాడుచుండె; ఇంకొకతెగవి ముఖాంగములవద్ద గబ్బిలముల కుండురీతి యంగముకలవై, పురుగులపై కెగురుచు, కొమ్మలపై వ్రాలుచు నుండినవి. ఇవియే 'టెరోడాక్టిలులు; వెన్నెముక గల్గి యెగుర నేర్చిన మొదటిపతంగజాతి యిదియే.

కొన్ని సరీసృపములు సముద్రము జేరినవి. ఇందు 'ఇక్తియోసార్లు', 'మొసాసార్లు', 'ప్లెసియోసార్లు' అను మూడు రకము లుండెను. అందులో గొన్ని ప్రస్తుతపు తిమింగలములంత యుండెను. 'ప్లెసియోసార్' తెగజంతువు లిప్పు డెచ్చటను లేవు. ఇవి బలిష్ఠములు, మహాకాయములు; నీటిలో నీదుచు, చవిటినేలలోను మెరకనీటిక్రిందను నడువ వీలగు తెడ్లవంటి పాదములు, అల్పశిరస్సు, దీర్ఘకంఠము కలిగియుండినవి. ఇవి హంసలవలె నీటిపై నీదుచునే ఆహారము గొనెడివో, లేక నీటిలో నణగియుండి ఆదారినిబోవు మత్స్యాదుల భక్షించుచుండెడివో తెలియదు. 'ఇక్తియోసార్లు' సముద్రమందు ధారాళముగ దిరుగుచుండె నని తోచును.

మధ్యజీవయుగపు స్థలచరము లిట్లు వృద్ధినై, అంతకు పూర్వపుజంతువులకన్న బలము శక్తి వేగము గల్గి, దీర్ఘకాయములై యుండెను. జలరంగమున నింతటియభివృద్ధి లేకున్నను,

అచ్చటను ప్రాణులు బృందములుగా వృద్ధిగాంచినవి. శంఖాకృతి డిప్పలుగల 'అమనైట్' అను ఒకజాతి జంతువులు 'పురాణజీవ' యుగమున బొడసూపి, ఈయుగమున వృద్ధియై, లోతులేని నీళ్ళలో విశేషముగా నుండినవి. ఈజాతిజంతువు లిప్పు డసలే లేవు. కాని యుష్ణదేశములం దిప్పు డున్నసన్నని నత్తలు మున్నగునవి వానిని కొంతవరకు బోలియుండును. మరియు చేపలలో నింతకు పూర్వ ముండిన డిప్పలు పంటివంటి చెక్కలు గలవిపోయి, ఈయుగమున చక్కనిపొలుసులు గల మత్స్యము లుదయించి, వృద్ధినొందెను; ఈజాతివి నేటివరకు విశేషముగా వ్యాపించియున్నవి.*

---

* ఆకాలమున మనభారతదేశమును ఇప్పటికన్న చాల భీకరమగు మృగములతో అనేకజాతుల క్రూరసరీసృపములతో నిండియుండినట్లు కనబడును. అప్పటికి దక్షిణహిందూదేశము ఆఫ్రికాఖండముతోను ఆగ్నేయదిశ దీవులతోను కలసి ఏకఖండమై యుండెను. యూరపు మొదలగు నితర ప్రాంతములందు ఆర్యావర్తమందు కన్న మనప్రాంతమం దుష్ణము అధికము. అందుచే నిచటి సర్పజాతులు చాల హెచ్చువి, చాల రకములవి, ఎక్కువ అపాయకరములుగ నున్నవి. మరియు హిందూమహాసముద్రమందు, నదులందును, మొసళ్లు విషసర్పములు ఇప్పటికిని చాల కలవు. పూర్వము వాసుకి, తక్షకుడు, మున్నగు బలీయమగు అద్భుతసర్పములుండినట్లును, భూమికి ఆదిశేషుడను సర్పమే ఆధారమైనట్లును, మన ఆర్యులలో ఐతిహ్యముకలదు. ద్రావిడజాతులు (అందు ముఖ్యముగా దక్షిణార్యులు) సర్పముల విశేషముగ పూజింతురు. దక్షిణదేశపు సామాన్యపు గుళ్లలో చాలచోట్ల ప్రాకారమంతటను లోపలనుగూడ నాగవిగ్రహము లనేకములు గలవు. నాగులచవితినాడు నాగ

పూజచేయు మామూలు మన ప్రాంతమునగూడ నున్నది. మానవసంచార మారంభించినమీదట అర్జునుని ఖాండవదహనము జనమేజయుసర్పయాగము మొదలగు సమయములం దనేక మహాసర్పములు అజగరములు ప్రత్యేకప్రయత్నములచే చంపబడినవి. అయినను ప్రపంచమం దిప్పటి అన్నిసర్పజాతులును భారతదేశమం దిప్పుడును కలవు. మన దేశమున మాత్రము స్తనజాతులకన్న సరీసృపముల సంఖ్యయే యిప్పటికిని హెచ్చుగా నున్న దనిపించును. 1933–34-వ ఏట మన దేశమున పాముకాటుచేతనే అయిదులక్షలపైగా జనులు చనిపోయిరి. ప్రస్తుతం మన్యపుప్రదేశాలు హెచ్చుగ నున్నవి. అవి వెల్లడియైన కొలది నరసంచారము హెచ్చి, సరీసృపాలసంఖ్య తగ్గవచ్చును.



# 7. మొదటిపక్షులు, మొదటిస్తనులు

## (వరాహయుగము-1.)

మధ్యజీవయుగపు తృణసమృద్ధిని సరీసృపబృంహములగూర్చియు తెలుసుకొంటిమి. ఆ 'డినోసారు'లు నగాగ్రములందు చవుడు నేలలందు ప్రబలియుండ, 'టెరోడాక్టిలు'లు అప్పటి (పూవులేని) తరుగుల్మములపై కీటాదుల వేటాడ, వాటి ఘీంకారములతో మహారణ్యములు ప్రతిధ్వనించియుండును. ఆసమృద్ధజీవకోటిలో మూలనున్న కొన్ని మాత్రము నూతనశక్తు లలవర్చుకొని, సహనశీలము లైనవి. కొంతకాలమున కెండ మందమై భూతలపరిస్థితులు మారినను, ఈ జాతి జంతువులు నశింపక, నూతనపరిస్థితులకు సరిపెట్టుకోగల్గెను.

డినోసారులలో గంతులువేయు కొన్ని పొట్టిజంతువులు ఆహారాదులకై పెద్దజంతువులతో పోటీపడునపుడును, శత్రుజంతువులు వెంబడించునపుడును, చల్లని ఉన్నతగిరుల పైకిని నీటిమీదికిని పోవుచుండెను; లేనిచో నశింపవలసియుండెను. అట్టి బాధలో కొన్ని జంతుజాతులు కొట్టుకొనుటలో వాటికి కొత్తరకపు పొలుసు లేర్పడెను. అవి క్రమముగ పొడవగుచు, ఈకల యాకార మొందినవి; ఈ యీక లొకదానిపై నొకటి దట్టముగా నుండుచు, తక్కిన సరీసృపముల చర్మముకన్న చక్కగా శరీరోష్ణమును గాపాడెను. అందుచే నవి సరీసృప



'కివి' (ఇప్పటికిని న్యూజీలండులోఁ నున్నది.)

ములు తాళలేని శీతలదేశములలోగూడ నుండగల్గి, ఆస్థలము లందు వసింపదొడగెను. ఆకాలముననే కొన్నిటికి తమగ్రుడ్ల విషయమై యెక్కువశ్రద్ధ గలిగియుండును. సరీసృపములు తమ గ్రుడ్ల నశ్రద్ధతో విడుచును. ఆగ్రుడ్లు యెండకు గాలికి పొదుగ వలసియుండును. కాని ఈనూతనజాతి తమగ్రుడ్లను కాపాడుచు, వాటిని తమ శరీరోష్ణముచే వెచ్చజేయ నేర్చెను. చల్లని వాతావరణమున కీప్రాణులశరీరములలో గూడ మార్పులు కలిగి, అవి క్రమముగా నుష్ణరక్తములై, స్వేచ్ఛావిహారులగు పక్షి జాతిగా నేర్పడెను. మొట్టమొదటి పక్షులు చేపలదిను సముద్ర పక్షులు; వాటియుపాంగములు రెక్కలుగా నుండక, తెడ్లను బోలె, 'పెంగ్విన్' జాతివివలె నుండె ననియు తోచును. న్యూజీలండులోని (చిన్న యీకలుమాత్రము గల) 'కివి' అను పురాతనజాతిపక్షి మామూలుగా నెగురలేదు. అది పక్షి వంశవృద్ధి కాదు. పక్షుల శరీరపరిణామములో రెక్కలకన్న యీకలే ముందుగా వచ్చెను; కాని యీకలువచ్చిన తరువాత వాటిని విప్పుచుండుటచే, క్రమముగా తప్పక రెక్కలేర్పడును. శిలాధాతువులలోని యొకపక్షి దేహశేషమును పరీక్షింపగా, దానికి సరీసృపములకుండు దవుడ, పండ్లు, పొడుగు తోకయు, పక్షిరెక్కలు గూడ నుండెను. అట్టిజంతువు మధ్య జీవయుగమందలి టెరోడాక్టిలునుండి తన్ను రక్షించుకొనగలిగి యుండును. అయితే, అప్పుడు పక్షుల సంఖ్యయు వాటిరకములును చాల తక్కువ. అప్పటిదేశమున కిప్పటినరుడు పోగల్గెనేని, అతడు రోజులకొలది తిరిగినను, పక్షిస్వరూపమే కంట బడి యుండదు. ఆరెల్లుమబ్బులలో టెరోడాక్టిలులు మొలకలచిగు

ళ్లలో కీటకములును మాత్రము సమృద్ధిగా కనబడియుండును. వానికి 'మేమలు'లు (అనగా పాలిచ్చి శిశువులను పోషించుకొను స్తనజంతువులు) గన్పడియుండవు; పక్షిజాతి యుదయించుటకు కొన్ని లక్షలయేండ్లు ముందే స్తనులు పుట్టెను; కాని, అప్పటికవి చిన్నవై మారుమూలల నుండుటచే, వాటి నాతడు గమనించియుండడు.

ప్రథమపక్షులవలెనే, మొదటిస్తనులు జీవితపుపోరు వల్లను ఘర్షణవల్లను, కష్టజీవనమునకు శీతలదేశవాసమునకు అలవడుటలో, అట్లు పరిణమించియుండును. వాటికిని మొదట పైపొరలు గద్దకలపు యీకలవలె నేర్పడి, శరీరోష్ణమును కాపాడగా, క్రమముగా అవయవములలో మార్పులు గల్గి, రక్తము వెచ్చనై, అవి స్వేచ్ఛగా సంచరింపగల్గెను. విహంగములు, ఘటించినను, ఆవికాసస్వరూప మొకటియే; ఈకలకు బదులు వీటికి రోమము లుద్భవించెను. గ్రుడ్లనుపెట్టి పక్షించి పొదుగుటకు బదులు ఈజంతువులు తమసంతానమును అంగనిష్పత్తి యగువరకు, తమదేహమందే యుంచుకొని, వాటిలో కొన్ని జీవిప్రసవులై, కనినతరువాతగూడ ఆశిశువును గాపాడి, పోషింప దొడగినవి. *'మేమలు'లలో దాదాపు అన్నిటికిని స్తనములేర్పడి అవి శిశుపోషకములయ్యెను. ఈమేమలుజాతులన్నిటిలో రెండు రకములకుమాత్రమే సరియగు స్తనములు లేవు. అవి గ్రుడ్లు పెట్టి తమశిశువుల తమచర్మములోపల నేర్పడు నొకవిధమగు

* అనగా సరీసృపజాతివలె అండజములుకాక, ఈ 'మేమలు' జాతివి సాధారణముగా పిండజములు. ఇవి సస్తనులై తమశిశువుల దేహములను పోషించి పెంచుటయేగాక, వాటికి మనోవికాసమును ప్రేమను కల్గించును

బలకరరసము నిచ్చిపోషించును; బొతుముక్కుగల 'ప్లాటిపసు', 'ఎచిడ్నా'యు ఇట్లు చేయుచున్నవి. 'ఎచిడ్నా' అనునది తోలు గ్రుడ్లుపెట్టి, తనకడుపులో నొక సంచిలో నుంచుకొని, అవి పొదుగువరకు వాటిని వెచ్చబెట్టుచు కాపాడును. మధ్య జీవయుగమున రోజులు వారములు తిరిగినను పక్షులు కనబడనట్లే స్థూలదృష్టికి సర్పములును కన్పడియుండవు. పక్షులును సర్పములును గూడ ఆయుగపు ప్రాణులలో కేవల మల్పములు నీచములు అని స్థూలదృష్టికి తోచుచుండెను. ఈసరీసృపయుగము సుమారు 8 కోట్లవత్సరము లుండెనని తోచును. ఆకాలపు పరిస్థితులను నరు లెవరైన గమనించినచో ఆవస్తుసమృద్ధి, చక్కని యెండ, చురుకుగా సర్వత్ర వ్యాపించుచు నెగురు గౌళులు, బలీయములగు డినోసారులును, భద్రముగ శాశ్వతముగ నుండి పోవు నని తలచియుండెదరు. కాని ఈనిత్యత్వాభాసముకు విశ్వ లీనమగు గూఢప్రవృత్తితోను, అప్రమేయమగు విశ్వశక్తుల తోను సంఘర్షణ కలిగి ఆప్రాణులు క్షీణింపజొచ్చెను. వేలకొలది యేండ్లు గడచుచురాగా, పరిస్థితులు కొంతకాల మట్లేయుండి నట్లున్నను, మన కగ్రాహ్యమగు క్లిష్టపరిస్థితులు కొత్తగా నేర్పడెను. కొండలు సముద్రములు మారి, భూతలస్వరూ పమే మార్పుచెందెను. ఈమధ్య జీవయుగము చాల కాలము వృద్ధినొందినను, యుగాంతము రాగా ప్రళయ చిహ్నములు కలిగినవి. ఆభౌతికవిపర్యయముచే నూతన పరిస్థితులు కలిగి అప్పటి ప్రాణికోటి జీవితము దుర్భర మయ్యెను. అల్పదుర్గాలను వినాశమునుండి రక్షించుకొనుటకై, 'అమ్మనైటు'లు మొదలగు అప్పటి కొన్ని ప్రాణిజాతుల

అవయవములందు, ఆ స్థితిగతుల కనుకూల మగునటుల చిత్రవిచిత్రమైన మార్పులు కలిగెను. స్థిరపరిస్థితులందు నూతనపద్ధతుల యవసర ముండదు; అంతశ్శక్తులు పైకిరాక అణగియుండును; అప్పుడు సామాన్యప్రాణులును వృద్ధినొందు చునే యుండును. కాని నూతన పరిస్థితులు రాగానే, సామాన్యప్రాణులు నశించిపోయి, అంతశ్శక్తి గలవిమాత్ర మాగండము దాటి, పరిసరానురూపమగు రూపస్వభావముల నొందును.

ఆకాలపు శిలాధాతువులం దెట్టి ప్రాణిచిహ్నములును కన్పడవు. అప్పటి జీవచారిత్రపు సామాన్యలక్షణములు కూడ ఏమియు తెలియుటలేదు. ఆ స్థితి కొన్నిలక్షలయేం డ్లుండి యుండును. ఆతెర తొలగగానే గోచరించుజీవకోటిని పరిశీలింప, అంతయు నూతనరంగముగ నున్నది. సరీసృపయుగము గతించెను. ఆ డినోసార్లు, ప్లెసియోసార్లు, ఇక్తియోసార్లు మొదలగు మహాబలములగు చిత్రవిచిత్రజాతు లన్నియు పూర్తిగ నశించి, అదృశ్యములై, వాటిసంతతి లేకుండ బోయెను. మహా శీతము వాటిని చంపివేసెను; ఆ జంతువులు సరిగ పరిణామింపలేక, ఆ క్లిష్టపరిస్థితులకు తాళలేక పూర్తిగ నశించెను. తరువాత భూమిపై కలిగిన నూతనరంగమున వెనుకటికన్న దృఢతరములగు క్రొత్తచరాచరజాతు లుదయించెను. ఈ నవయుగారంభమున ధరారంగ మింకను నిస్తేజమై నిరుత్సాహకరమై యుండెను. ఇదివరలోని మహాతాళములన్నియు పోగా, వీటిస్థానే వచ్చిన క్రొత్తతాళ్లు శీతకాలపు మంచుచే నశింపకుండుటకై, తమ యాకుల రాల్ప మొదలిడెను. మొక్కలకు, చెట్లకు,

పువ్వులు కలుగ నారంభించెను. ఇదివరలోని భీకర సరీసృప ములకు బదులు రకరకములగు పక్షులు, స్తనజంతువులు నావిర్భవించెను. *

* ఆ యుగసంధియందు హిమప్రళయము, భయంకర భూకంపము, అగ్నిపర్వత ప్రకోపమునుకూడ, మన దేశమునను కలిగినట్లు నిదర్శనములు కలవు. అప్పటికి ముందుగా మన తూర్పుకనుమలును, తరువాత సహ్యాద్రియు, ఏర్పడెను. గోదావరీతీరమున 'కోటమావెలి' శిలలలో అప్పటికి హిమప్రళయ ముచే చనిపోయిన అనేక మత్స్యసరీసృపముల 'ఫాసిలు'లు కనబడినవి. అగ్ని పర్వతములద్వారా భూమిలోనుండి 'లావా' యనబడు కరగిన శిలాముల మహా ప్రవాహము దక్కనునంతను ముంచివేసెను. అంతవరకు ఆఫ్రికాతో కలసి యేకఖండముగానుండిన దక్షిణహిందూదేశమునకు ఆఫ్రికాకు తూర్పుదిశద్వీ పాలకు మధ్యనుండిన భూస్థలులు సముద్రములోనికి దించుకొనిపోయెను; అట్టిగట్లు సముద్రములోపున నిప్పటికిని గలవు. మాల్దీవు అండమానుదీవులు మన భూభాగమునుండి అప్పుడేవీడెను. తరువాత నీసమయమందు మన దేశపు ఉత్తర భూభాగములోనుండి యెగసి కొంత్రమడతలు పడగా, హిమాలయపర్వతము లీసమ యముననే ఏర్పడెను. పంజాబుప్రాంతమందుగూడ ననేకభూకంపములు కలిగెను. అంతకుపూర్వము హిమాలయప్రాంతములకు వింధ్యపర్వతములకు నేల సంబంధములేక, పడమటివైపున రాజపుతానా సముద్రము, తూర్పున నొక సముద్రము నుండెను. ఈభూప్రకోపపుఫలితముగా నీ రెండుసముద్రములును వెనుకకు పోయి, భూతలము పైకి తేలెను. రాజపుత్రస్థానమునకు మధ్యనున్న యెడారియు కచ్ఛిప్రాంతమును ఈసముద్రపు యిసుకభూములే; ఇట్లా ప్రాంతమంతటను భూమి యేర్పడి, దక్కను ఉత్తరదేశము కలసిపోయెను. ఒకప్పుడు భూకంపముచే కొన్నిస్థలములు జలగతము లగుచుండెను. ఈ కలియుగారంభమున పశ్చిమతీరపుద్వారక సముద్రగత మైనట్లు ఐతిహ్యము

కలదు. సింధుదేశము ఆస లిట్టియెడారియైనను దానిపైన హిమాలయములనుండి సింధునదివండుపడుచుండుటచే, క్రమముగా ఫలవంత మగుచున్నది. హిమాలయములలో పుట్టి పూర్వపురాజపుత్ర సముద్రమున పడుచుండిన సరస్వతీనది ఇప్పుడు క్రొత్తగా నేర్పడిన యెడారిలో హరించిపోయినది; అది అంతర్వాహిని యని యిప్పటికిని హిందూసంప్రదాయము. ఇట్లేర్పడిన ఆర్యావర్తపు యిసుకనేల, హిమాలయములందలి పూర్వపు అగ్నిపర్వతములలోనుండి వచ్చు 'లావా ద్రవము' పడియు, గంగా యమునానదులు హిమాలయపర్వతమునుండి సతతము తెచ్చి నింపు భూసారపువండు చేరియు ఇప్పుడుర్వరమయినది. మహోద్యానమనదగు వంగదేశపు భూసారము గంగా యమునా బ్రహ్మపుత్రా నదులు హిమాలయములనుండి తెచ్చువండు ఇట్లు శతాబ్దులకొలది సముద్రపుటిసుకపైన పడుచుండుటచే నేర్పడినదే. మధ్యహిమాలయములలోని కైలాసపు ప్రక్క మానససరోవరప్రాంతమునందు, సంతతహిమపాతముచే నాకాశమునుండి మహాగంగ మేరుగిరిసమీపమున దిగుచున్నట్లుండును; ఆప్రాంతమందే సింధు, గంగా, బ్రహ్మపుత్రానదులు మూడును సమీపమందే పుట్టును; కాని. సింధునది పడమరగను, బ్రహ్మపుత్ర తూర్పుగను, గంగయు కైలాససమీపమున నుత్పన్నయైన యమునయు దక్షిణముగను వేరుదారులబట్టి, వేర్వేరు ప్రాంతములను చాలదూరమున భారతదేశమందు ప్రవేశించి, మన ఆర్యావర్తపు ఆయా ప్రాంతములను వండుతోను శుద్ధోదకముతోను నింపుచు, అచటి ప్రాంతముల నత్యంత ఫలవంతములు గావించి, అందుల కోట్లకొలదిజనుల కమితోపకారులై, విలసిల్లుచున్నవి. ఇంతేకాక, బ్రహ్మ (బర్మా) దేశపు ఐరావతీనది, శ్యామ (సయాం)దేశపు మోకాంగు, చీనాసంపదకంతకు ముఖ్యాధారమై కోట్లకొలది జనులబోషించుచున్న ఆదేశపు ప్రధాననదులగు 'హోయాంగ్ హో' 'యాంగ్ ట్సికియాంగ్'లు మొదలగు ఆసియాఖండపు పావనమహానదులకు, హిమాలయ పర్వతములే ఉత్పత్తిస్థానము. ఈనగాధిరాజము ప్రపంచపుకొండలన్నిటిలో అత్యున్నతము అసమానమగు ప్రకృతిశోభగల కాశ్మీరాదిదేశములకు మానసాది సరోవరములకు, కైలాసగౌరీశంకరాది శిఖరాదులకును ఆలవాలము; ఆదలి

బదరీకేదారాదులు పూర్వము మహర్షులకు ఆర్యవైదికసంస్కృతికిని ఆశ్రయములు. ఆప్రాంతములు ప్రాచీనార్యులచే దేవభూమి లని యెంచబడుచుండెను. అయితే, భూమివయఃకాలమునుబట్టి చూచినచో ఈమహాపర్వతము అంతగా ప్రాచీనము కాదు; అది రాజపుత్రస్థానమందున్న ఆరావళీపర్వతములకేగాక, మన తూర్పు పడమటికనుమలకు వింధ్యపర్వతములకుగూడ, తరువాతనే యేర్పడినదని భూతత్త్వజ్ఞుల యభిప్రాయము. ఈహిమాలయపర్వతపుమడత లేర్పడిన తరువాత, దానిలోపలిభాగ మింకను పూర్తిగా కుదుటబడలేదు; దానిలోపల అనేక పరిణామములును, పూర్వపశ్చిమాగ్రములందు అగ్నిపర్వత ప్రకోపమును, ఇంకనుకలుగుచునే యున్నవి. ఆప్రాంతమునకు దాని కంటియున్న అస్సాము, నేపాలు, ఉత్తరబీహారులలోను పెద్దభూకంపము లిప్పటికిని కల్గుచున్నవి; 12-6-1897 వ తేదీని అస్సాములో కలిగిన తీవ్రభూకంపమును 4-4-1905 వ తేదీని సుమారు 20 వేల మందికి ప్రాణహాని కలిగించిన కాంగ్రా భూకంపమునే గాక చాల చిల్లర భూకంపములచేగూడ, మార్పులు కలుగుచున్నవి. హిమాలయపాదముక్రిందటి మార్పులవల్లను. చిరకాలమునుండి పర్వతములనుండి వచ్చిపడు వండు ఇంతవరకు సరిగా గట్టిపడక, ఇప్పుడు కుదుటపడుటవల్లను, హిమాలయములకు దక్షిణమున నంటియున్న నేపాళములోను, ఉత్తరబీహారులో ఇట్లే 15-1-1934-వ తేదీని మరొక గొప్పభూకంపము కలిగి, చాల జనులు చనిపోయి, భవనములు కూలినవి; ఆభూతలము చిలికి, మైళ్లకొలది భూగర్భపు ఇసుక ద్రవపదార్థములు పైకి వచ్చి, సాగుభూముల మట్టమంతయు తారుమారై, కల్లోలము కలిగించెను. బెలూచిస్థానపుక్వెట్టాలోను 1936 లో నింకొక గొప్ప భూకంపము కలిగి, చాల నష్టము గల్గినది. వింధ్యాద్రియు, ఇంకను దక్షిణముగనున్న కొండలును భూమియు, మిక్కిలియు ప్రాచీనములు; మధ్యజీవయుగమందే అచట అగ్నిపర్వత ప్రకోపములు లావాప్రవాహములు పూర్తియై, దాని అడుగుభాగమంతయు రాతివలె గట్టిపడి స్థిరమైనందున, మనప్రాంతములో భూకంపప్రమాదమును అగ్నిపర్వతబాధయు లేవు. ఉత్తరపుభూకంపాలస్పర్శలుతప్ప మనకు నష్ట మేమియు గలుగలేదు.

# 8. సప్తనయుగము (వరాహయుగము_2)

'నవజీవయుగ' మను ఆనూతనమహాయుగ మారంభించినప్పుడు, భూమిఉత్తేజమును అగ్నిపర్వత ప్రకోపమును చాల హెచ్చెను. ఆకాలమందే ఆసియాఖండపు హిమాలయ పర్వతములు, యూరపులోని ఆల్ప్సుగిరులు, ఉత్తరఅమెరికాలో వెన్నెముకవలె నేర్పడిన 'రాకీసు' కొండలు, దక్షిణ అమెరికాలోని 'ఆండీసు' నగములును, భూమిపై భాగమున కుబికి యేర్పడినవి. ఇప్పటి మనభూఖండములకు మహాసముద్రములకు గల రూపరేఖ లాకాలమం దేర్పడెను; భూతలముకు సుమారు ఇప్పటిస్వరూపము వచ్చెను. ఈ నవజీవయుగ మారంభించి యిప్పటికి 4 మొదలు 8 కోట్ల యేండ్లై యుండును.

అప్పటికి ప్రపంచ మింకను చాల చల్లగనే యుండి, తరువాత వెచ్చబడజొచ్చెను. అంతట క్రమముగా జీవకోటి వృద్ధియయ్యెను; తరువాత చిరకాలముకు తిరుగ క్లిష్టపరిస్థితు లుదయించి, అతిశీతమగు హిమయుగములు కలిగినవి; వాని నుండి మనప్రపంచ మిటీవలనే బయటపడినది.

శీతోష్ణస్థితులిట్లు తారుమారగుచుండుటకు కారణము లింకను మనకు సరిగా తెలియవు. అందుచే ముందెట్టి మార్పులు కానున్నవో, ముందు మనకు సూర్యతేజము హెచ్చునో, లేక హిమయుగము తిరుగ మనభూమి నెదుర్కొనునో, అగ్నిపర్వతములు భూకంపములు ప్రకోపించునో,

తగ్గునో, ఇట్టిసమస్యలు పరిష్కరింప దగు శాస్త్రపరిజ్ఞాన మింకను మనకు చాలదు.

ఈమన్వంతరమందే తృణజాతు లంకురించి, భూమిపై పశువుల మేతకు పచ్చిక యేర్పడెను. పాలిచ్చుజంతువులు కలిగి, ఈతృణముల మేయుచు వృద్ధి కాజొచ్చినవి. ఇంతలో నాజంతువుల దిని జీవించు మాంసాహారు లుద్భవించెను.

తుప్పలను కీటకాదులను దిని, వెనుకటియుగములో జీవించి చాలవరకు నశించిన సరీసృపజంతువులకును, ఈ నూతన జంతువులకును స్వరూపభేద మంతగా లేదని, పూర్వపు దినోసారులకు ఈస్తనులకు, పూర్వపు టెరోడాక్టిలులకు ఈపక్ష్యాదులకు భే మతిస్వల్ప మని స్థూలదృష్టికి తోప వచ్చును. కాని, ఈపోలిక కేవల బాహ్యమే; విశ్వమందు ప్రాణులు అనంతముగ, అవిచ్ఛిన్నముగ, వివిధరూపములతో కలుగుచున్నవి; సృష్టి సర్వదా వృద్ధియగుచున్నది. భూమి పూర్వస్థితి ఎన్నడు నొకేరీతిని లేదు. అందుచే సంపూర్ణసామ్య మెచటను లేదు. మధ్యజీవయుగపు ప్రాణులకును ఈ నవజీవ యుగపుప్రాణులకును గల సామ్యముకన్న భేదమే చాల అధికము.

ముఖ్యముగ ఈ రెండుకాలముల ప్రాణులకు మనఃప్రవృత్తిలో భేదముకలదు. ఈక్రొత్తయుగపుస్తనులు,కొంతవరకప్పటి పక్షులును, తమపిల్లలవిసర్జింపక, వానితో సంపర్కము కలిగియుండెను. సరీసృపములు సాధారణముగా తమగ్రుడ్లను విడిచి తమ దారిని పోవును. ఆగ్రుడ్లు తమంతటతామే పొదిగి, పిల్లలు కావలె. సరీసృపశిశువునకు తల్లిదండ్రులగూర్చి తెలియదు;

దానిజ్ఞానము స్వానుభవముతోనే ఆరంభమై తనతోనే అంతరించును. తనశిశువులకు లభింపదు; అది తోడిజంతువులతో సంప్రదించుట, వాని ననుకరించి వానివల్ల విషయాలు నేర్చుకొని కలసి పనిచేయుటయు, ఉండదు. అది యేకాకిజంతువు. అట్లుగాక స్తనులకు, పక్షులకు తమశిశువుల పోషణము ముఖ్యలక్షణము. వానిపిల్లలు శైశవమునుండి తమతల్లిదండ్రుల ననుకరించి, వానిచేష్టలను చర్యలను గ్రహించును; వానిధ్వనుల గనిపెట్టి జాగ్రత్తపడుచు, వానితో కలసి మెలసి పనిచేయును; పరస్పరసహాయముతో, ఒకదాని కొకటి లోబడియుండును. ప్రపంచమున బోధ్యజాతిజీవులు నవజీవయుగమందే మొదలిడెను.

నవజీవయుగపు మొదటిస్తనుల మెదడు, అంతకు వెనుకటిమాంసభక్షకడినోసారుల మెదటికన్న, అంతగా ప్రశస్తము కాదు; కాని ముందువచ్చు శిలాధాతువుల బరీక్షించినకొలదిని, అన్నిస్తనులలో సామాన్యముగా మెదటిబలము చాల వృద్ధియగుచుండినట్లు కనబడును. ఆయుగారంభమందే ఖడ్గమృగమువంటి జంతువు లుండెను. ఆకాలమందే యుండిన ‘టిటానోథెరియం’ అను మహామృగము చర్యలలో ఖడ్గమృగమును బోలియుండెను. అది ప్రారంభదశ; దానిమస్తిష్క మిప్పటి ఖడ్గమృగముల మెదటి పదవవంతువరకు తీసిపోవును.

మొదటిస్తనులు తమశిశువులకు పాలియగనే, వానిని విడుచుచుండెను. కాని తల్లి శిశువులు పరస్పరభావముల గ్రహించి కలసియుండుట లాభకర మని అవి క్రమముగా గ్రహించియుండును; తరువాత వచ్చు స్తనులు మందలుగా తిరుగుచు, పరస్పరచర్యల గమనించుచు, ఒకొక్కదానికి కలుగు

ప్రమాణములను, వాని చేష్టాశబ్దములబట్టి కనిపెట్టుచుండినట్లు తోచును. ఈబుద్ధివికాసము వెనుకటియుగపు వంశాస్థికజంతువులలో లేదు. సరీసృపములు చేపలుకూడ బృందములుగా నుండుట, గ్రుడ్ల నొకచోటనే పొదిగి ఏకస్థలమందుండుటయు, కలదు; నిజమే, కాని సస్తనుల సంఘీభావమునకు కారణము పరస్పరప్రీతి; కేవల బాహ్యసంపర్కమే కాదు.

సరీసృపప్రపంచమునకు మనసస్తనులకు గల యీ ముఖ్య భేదమును గ్రహింపవలె. సరీసృపముల తీవ్రత, తృష్ణ, వాటి భయక్రోధములు, మన యూహాల కతీతములు. వాటియుద్దేశము లేక భావచోదితములు సహజోద్రేకరూపములు; మన సస్తనుల యుద్దేశము లట్లుండక, మిశ్రితములై అనేకసందర్భముల చర్చచే నేర్పడుచుండును. సస్తనజంతువులకు పక్షులకు కొంతవరకు మనవలెనే నివాసము, సానుభూతి, సాంఘికబుద్ధియు నుండును. సాధారణముగ అట్టిజంతువులతో మనము సంబంధము పెట్టుకోవచ్చును; బాధ కలుగుచో అరచియు, ముఖాది చేష్టలచేతను అవి మన సానుభూతిని పొందును. మనభావముల గ్రహించి లోబడి మనతోనుండునట్లు వానిని పెంచి, మనవిషయమున నిగ్రహశక్తులు కలిగించి, నేర్పవచ్చును. 'నవజీవయుగ' చిహ్నమగు యీనూతనచిత్తవికాసముచే వ్యక్తులలో పరస్పర సహాయము, సంరక్షింపు మొదలిడెను. ఈ పరిణామము రాబోవు మానవజాతి సాంఘికాభివృద్ధికి పూర్వరంగము.

ఈ నవజీవయుగము గడచినకొలదిని, అప్పటి చరాచరప్రాణుల కిప్పటివానితో పోలిక యెక్కువగుచు వచ్చినది. ఇప్పటి ప్రాణులతో పోలికలేని వికృతరూపమగు 'ఇంటాథె

రస్' మున్నగు అప్పటి క్రూరమహామృగములు నశించిపోయెను కొన్ని పూర్వమృగముల స్వరూపము క్రమముగ మారగా, అందుండి యిప్పటి గుఱ్ఱములు, నీటిగుఱ్ఱములు, ఒంటెలు, ఏనుగులు, దుప్పులు, కుక్కలు, సింహములు, పులిజాతులు కలిగినవి. గుఱ్ఱము క్రమముగా పరిణామ మొందిన విధము అప్పటి శిలాధాతువులచే బాగుగ తెలియును. నవజీవయుగారంభపు 'టాపిర్'జాతి మృగము క్రమముగా మారి గుఱ్ఱ మేర్పడెను; ఆ స్వరూపములన్నిటి చిహ్నములు దొరికెను. ఇట్లే 'లామా' జంతువులకును ఒంటెలకును జరిగిన పరిణామక్రమమును దెలిసినది.*

---

* భూమి పరిస్థితిలోను శీతోష్ణస్థితిలోను ఆయాయుగాంతములందు ఇట్లు విపర్యయము కలిగి, తరువాతవచ్చు యుగస్థితి అంతకు వెనుకటిస్థితికన్న వేరుగానుండుటకు, భూచరిత్ర మేకరీతిగా జరుగకపోవుటకును, సౌరమండలములోని స్థితి కొంతకారణమే; అదియుం బాగుగ తెలియదు; కాని ఇంకను వేరే ముఖ్యకారణములుండును; కనుకనే ముందుస్థితి యెట్లుండునో గ్రహించుటకు మన విజ్ఞాన ముపయోగించుటలేదు. భూమి తాను గిరగిరతిరుగుచు సూర్యుని చుట్టి వచ్చుటతో, సాలుకొకసారి సౌరమండలపు అన్నిభాగములను చుట్టి వచ్చుచున్నాము. ఇంతేగాక, సూర్యుడును స్థిరుడు స్వతంత్రుడు కాడు; తన పరివారమగు మనభూమి అంగారకుడు మొదలగు గ్రహములతో సహా సూర్యుడును, మహాకాశమందలి 'గలక్టిక్ సిస్టం' అనబడు విచిత్రమహాచక్రములో చరించును; ఈయద్భుతచక్రములో సూర్యునివంటివి ఇంకను లక్షలకొలది నక్షత్రగోళములు పరస్పరాకర్షణగలిగి, అగణ్యావేగముతో తిరుగుచుండును. సూర్యుడు సౌరకుటుంబపు గ్రహములతో సహా అవశముగ విశ్వములో అద్భుద





నవజీవయుగపు అశ్వజాతుల ఫాసిలులు.
(వీటినుండి ఇప్పటిగుఱ్ఱము లేర్పడినవి.)

ములకొలది మైళ్లదూరమం దున్న యేదో కేంద్రమువైపు అమితవేగముతో పోవుచున్నవి. (ఈగమనవేగము సెకండుకు అనగా క్షణముకు 200 మైళ్లుండు ననియు, అద్భుతవిస్తృతిగల ఈబ్రహ్మాండమున సూర్యు డొకసారి ఇట్లు చుట్టి స్వస్థలముకు వచ్చుటకు 25 కోట్లయేండ్లు పట్టు ననియు, సర్ జేమ్సుజీన్సుగారి అభిప్రాయము). ఈచక్రగతిచే సూర్యునితోబాటు మనభూమియు అట్టి మనోవేగముతో విశ్వపు క్రొత్తప్రాంతములకు పోవుచున్నది. ఇట్లు పోవు చుండగా, కొంతకాలముకు అప్రాంతముల నూతనపరిసరములవల్లను, ఇతర మహాగోళముల సామీప్యముననను, సూర్యునిలోను, భూమివాతావరణమందును, భూమిలోపలనుగూడ క్రొత్తపరిస్థితులు కలిగి, అందలి జీవకోటి స్థితిగతులు మారవచ్చు; ఆ క్రొత్తపరిస్థితిచే నూతనయుగము కలుగవచ్చు. ఈఅద్భుత మహా చక్రగతితో దీనిని నియమించి నడుపు మహాకేంద్రపుసామీప్యమో, అప్రాం తపు మరియొక మహాశక్తియో, మన వాతావరణస్థితిని మార్చి, భూమిపై జీవ శక్తిని వృద్ధిచేయవచ్చును. ఆప్రభావమున ఒక్కొక యుగము దాటినకొలది క్రమముగా వెనుకటికన్న హెచ్చుమేధాబలమును అంతశ్శక్తియుం గల క్రొత్త ప్రాణిజాతు లుదయించుచున్న వని తోచును. ఇట్లా ప్రభావమునవెనుకటియుగ ముల మృగజాతికన్న ఎక్కువజ్ఞానము నైతిక శక్తిగల నరజాతి ఈయుగమున కలిగినట్లే భావియుగములందు సృష్టివికాసమున ఇంతకన్న హెచ్చు నైతిక మానసికశక్తులు కలిగి మన కిప్పు డద్భుతముగ తోచుదేవజాతులు మన భూమి పైన కలుగునేమో.

# 9. వానరయుగము

జీవశాస్త్రజ్ఞులు ఈస్తనజాతిని కొన్ని శాఖలుగా విభజించిరి. వీటిలో 'ప్రైమేటు' లగ్రగణ్యములు ఈ ప్రథమ శాఖలో 'లెమూరు'లు, కోతులు, తోకలేని వానరములు, మనుష్య కోటియు, చేరును. ఈవిభజన ఆజంతువుల దేహాంగసామ్యమును బట్టియే చేయబడినది; అప్పటికి వాటిమనస్తత్వముల బరిగణింప లేదు. ఈ ప్రథమశాఖ యెందుండి వచ్చెనో, పురాతనశిలాది పరీక్షచే తేలుట లేదు. ఈ శాఖలోని లెమూరుకోతు లరణ్యములలోను, కొండముచ్చులు రాతిస్థలములందును వసించును. ఈ జంతువులు హఠాత్తుగా అణగి శిలాదులందు కప్పబడిపోవుట చాల అరుదు; ఈజాతిని తక్కినజాతు లంత హెచ్చుగాను లేవు; అందుచే వీటి దేహశేషములు భూగర్భమున జిక్కి శిలాధాతువులలో జేరి మన పరీక్షకు దొరకుట కష్టము. గుఱ్ఱములు, ఒంటెలు మొదలగు జంతువుల దేహశేషములు దొరకిన్ని వీటివి దొరకలేదు. కాని ఈ శాఖపురాతనవానరములు లేమూరులు నవజీవయుగారంభమందే (అనగా 4 కోట్లఏండ్ల క్రిందనే) ఆరంభించెను; వాని మెదడును,అంగవిస్పష్టతయు లోటుగా నుండినవి; అవి నేటి ఆజాతికి తీసిపోవును.

ఆ నవజీవయుగపు సంకులప్రాణిలోకమును చివరకు క్షీణించెను. కూర్మయుగపు మహాజంతువుల గతియే వీటికిని కలిగినది. ఇంకొకసారి మనప్రపంచము హిమప్రళయనుపాలై, చల్లబడిపోయెను; తిరుగ కొంత వెచ్చనై, మరల చల్లబడెను. వెనుకటి యుష్ణకాలపునాచులో తిరుగుచుండిన నీటిగుఱ్ఱములు, ఇతరమృగముల వేటాడిన ఖడ్గదంష్ట్రలగు భీకరశార్దూలములును, ఆహిమప్రళయమున చాలవరకు నశించెను. రోమావృత దేహ

51 అ.



'మామత్తు' (నవజీవయుగపు ఈజంతువునుండి
ఇప్పటి యేనుగ పరిణమించినది.)

లగు నొకజాతి ఖడ్గమృగములు, 'మామతు'లు, శీతదేశపు వృష భములు, ధవళమృగములును మాత్రము, ఈశైత్యాహతికి నిలువగలిగెను. క్రమముగా శతాబ్దములు గడచి, ఆర్క్టిటిక్ ప్రాంతపు మంచుగడ్డ లుత్తరమునుండి దక్షిణముగా జరిగి వ్యాపించి ఇంగ్లండులో థేమ్సునదివరకు, అమెరికాలో ఓహియోవరకును,* వచ్చినవి. తరువాత కొంతకాలము వెచ్చగా నుండును,తిరుగ ఆయాదేశములు తీవ్రశిశిరము లగుచువచ్చెను.

ఇట్లు మధ్యమధ్య వచ్చుచుండిన ఈ శిశిరకాలము లను ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ హిమయుగము లనియు, వాటిమధ్యనుండిన వెచ్చని కాలములను 'ఇంటర్ గ్లేషల్ పీరియడ్' అనగా హిమమధ్యయుగము లనియు, భూతత్వజ్ఞులు చెప్పెదరు. మన భూమిపైన ఆ హిమాఘాతముల చిహ్నము లింకను కలవు. మొదటి హిమయుగము ఆరులక్షల వత్సరములకు పూర్వమును,నాల్గవది 50,000 యేండ్ల క్రిందటను, కలిగెను. ఈ దీర్ఘ శీతకాలమందలి పరమహిమయుగమునందే మొదటి నరాకృతి జీవు లవతరించిరి.

నవజీవయుగమధ్యమందును, దవడలు, కాలినరములు కలిగి, తోకలేక, కొంత నరచిహ్నములు గలకోతు లుండెను. కాని, ఈ హిమయుగములు వచ్చినపుడే బాగానరులపోలిక గల వానరజాతి జనించె నని, ఆకాలపు పనిముట్లనుబట్టి తేలును. యూరపుఖండమున, 10 లక్షలు మొదలు 5 లక్షలలోపు ఏండ్లక్రిందటివి కొన్ని పూర్వపురాళ్లు (పనిముట్లుగాను,

* అనగా ఆ హద్దు మనఆసియాలో ఉత్తర హిమాలయముల ప్రాంతముకు సరిపోవచ్చును.

ఆయుధములుగాను, ఎవరో చెక్కినవి) కలవు. ఈవస్తువులను 'ఏయొలిత్తు'లు అనగా ఉదయశిల లందురు. యూరపులో వీటిని ర్మాతల దేహశేషము లిప్పుడు లేవు. ఆయుపకరణములే మిగిలినవి. నరులుకాక, సూక్ష్మబుద్ధి గలవానరములే వాటిని నిర్మించియుం డును. జావాద్వీపములోని 'ట్రినిల్' అనుచోట ఆకాలపు పురాతనవస్తుశేషములలో నొక 'నరవానరకపాల' మున్నది; దానికి పండ్లు, ఎముకలు, కోతుల మెదటికన్న పెద్ద మెదడును, కలవు. ఈజాతిజీవులు నిలిచి నడచినట్లును చిహ్నము లున్నవి. 'గచ్ఛన్నరవానరు' లనబడు ఉదయశిలానిర్మాతలగు ఈజాతి జీవుల కూర్చి సమాలోచన కీఅస్థిపుంజముమాత్రము మనకు మిగిలినది.

ఇక రమారమి $2\frac{1}{2}$ లక్షల యేండ్ల క్రిందటికి వచ్చిన తరువాతనే, నరులబోలు జీవులచిహ్నములు మనకు మరల కనబడును. అవి వెనుకటివానికన్న నెక్కువ వృద్ధిపొందినవి; అప్పటి నిముట్లు ఉదయశిలలకంటె చక్కనివి, సూచ్చు పనితనము గలవి, ఇప్పటి, మనుష్యనిర్మితములకన్న పెద్దవి. (జర్మనీప్రాంతపు) 'హీడిల్ బర్గు' పురమునొద్ద నొక యిసుకగుంటలో, ఆకాలపు (గడ్డములేనిది) దవుడయెముక యొకటి దొరకినది. ఇది నరులదానికన్న చాల బరువుగా సన్నముగా నున్నది; కనుక ఇందు నాలుక తిరిగి విస్పష్టముగా మాటాడుటకు వీలు కలిగియుండదు. దీనినిబట్టి ఆకాలమున మననరులకన్న బలీయులై, నరతుల్యులు రోమావృతులు నగు నారసింహజాతివా రుండిరని వైజ్ఞానికు లూహించుచున్నారు. ఈజాతికి "హీడిల్ బర్గు నరు"లందురు. ఈదవుడనరము మనకు వినోదావేశముల గలిగించును. దీనినిచూచిన, అప్పటిపురుషుల యాకారమును

52 అ.



పితకాంథ్రోపసు (=గచ్ఛన్నరవానరుడు)



హీడిల్బర్గునరుడు

మసిపట్టిన యుద్ధముద్వారా చూచిన ట్లుండును. అప్పటి చల్లనిమహాగహనములలో ఖడ్గదంష్ట్రములగు అఘోరశార్దూలముల నోటినుండి తప్పించుకొన నిడుములబడుచు, ఈ'హీడిల్బర్గునరు' డానిబిడారణ్యపుమధ్యను రోమావృతఖడ్గమృగములకు బెదురుచు తిరిగియుండును. ఇంతకన్న నితనిగూర్చి తెలియదు; కాని యీతడు ఛేదించి తయారుచేసిన పనిముట్లుమాత్రము నిల్చియున్నవి. ఆంగ్లదేశమున సస్సెక్సులోని 'పిల్టుడౌను'వద్ద నింకను చమత్కారమగుజంతు శేషములు కలవు. ఇవి 'హీడిల్బర్గు'యెముకకన్న పూర్వపు వని కొందరు తలచిరి. కాని, ఇవి ఒకలక్ష లక్షున్నరయేండ్లవే యని తోచును; దీనికపాలము వానరముల పుర్రెకన్న చాల పెద్దది; దీనివద్ద చింపాంజినిబోలు దౌడయెముక దొరకెను; అది దీనిదగునో, కాదో తెలియదు; ప్రక్కనొక్క యేనుగయెముక గబ్బిలపురూపుగ నేర్పుతో చెక్కి, అందులో నొకకన్నముగూడ దొలిచియున్నది. దీనిపై దుప్పితోడ శల్యమొకటి అమర్చియున్నది. ఇ ట్లెముకలలో రంధ్రము గావించిన దెట్టిజంతువు? వైజ్ఞానికులు దీనికి 'ఇయాంథ్రపస్' అనగా 'ఉదయనరుడు' అని పేరిడిరి. ఇది 'హీడిల్బర్గు' వానరునికిని తోకలేని కోతులకు గూడ భిన్నము; ఇట్టిది మరియొకటి దొరకలేదు; చకిముకి రాయివంటి రా శిలలతో వీరుచేసిన చక్కని పనిముట్లు మాత్రము భూమిపైన మట్టిలోను, కంకరనేలలోను, లక్షయేండ్లుగా వ్యాపించియున్నవి. ఇందు 'ఉదయశిల'లేకాక కత్తులు, చేతిగొడ్డళ్లు, బల్లెములు, విసరివేయు రాళ్లు, ప్రాచీనవస్తుశోధకులకు దొరకినవి. ఇప్పుడు మనము నరజాతిని సమీపించితిమి. నరుని బోలియు యథార్థనరుడుగాని 'నియాండర్తలరు' అను ఇంకొక

విచిత్రజాతిని రాబోవు అధ్యాయమున గమనించెదము. మన నరజాతివా రీ'హీడిల్‌బర్గ' వానరునుండిగాని, 'ఇయాన్త్రొపసు' నుండిగాని, స్వతంత్రముగ జనించిరని వైజ్ఞానికులు చెప్పరు. వీనికి నరులతో చాలపోలికమాత్ర మున్నది.*

---

* పూర్వముండిన కొన్ని విచిత్ర జంతువులు అప్పటిశీతోష్ణపరిస్థితి హఠాత్తున తీవ్రముగా మారగానే నశించిపోవుట సహజము; మనదేశమునను 'మామతు'లబోలు తెల్లని దీర్ఘవక్రదంతములుగల గజజాతియు, భీకర మహాజగరములు, రౌద్రమగు శరభాదులును పూర్వ ముండినవి; ఇప్పుడు లేవు. పూర్వము హిమాలయాదులందు ధారాళముగ సంచరించి మృగరాజగు సింహమును మన దేశమున నశించిపోయినట్లే; గుజరాతులో మాత్రము స్వల్పముగ కలదని వాడుక. పూర్వము పశ్చిమహిమాలయములందును అస్సాములోను తోకలేనికోతు లుండినట్లు శిలాధాతువులలో నిదర్శనములు కలవు. ఇవి ఆఫ్రికాలోనున్న చింపాంజీగొరిల్లాలను మలయప్రాంతమందలి 'ఒరాంగుటాంగు'ను చాలవరకు బోలియుండును. వాతావరణమున నిట్లు తీవ్రముగ కలుగుమార్పులకు సరుదుకొనలేక అట్టి పూర్వజంతువులు నశించినవి. ఏనను, అత్యుష్ణస్థలములందు వివిధప్రాణులున్నట్లే, అతిశీతస్థలములగు ధ్రువప్రాంతములయొద్దను విశాలభూఖండములలో ఆప్రాంతముల కనుకూలమగు శరీరనిర్మాణముగల చిత్రవిచిత్ర జంతువులు కలవు. దక్షిణధ్రువప్రాంతమందు గొప్ప భూభాగములు, అందులో లోహాదిసంపత్తియు గల వనియు, అసముద్రమందు ఇదివర కెన్నడును లోకమున లేని మహాకాయము గల యొక తిమింగలజాతి అక్కడి నాచును క్షుద్ర జంతువులను దిని బ్రతుకుచున్నదనియు, ఇటీవలనే కనుగొనబడినది. సముద్రపుఅడుగునను కాంతియుతములగు విచిత్ర జంతువులు కలవు. ఆయాదేశకాలపరిస్థితుల కనుకూలమగు శరీరములతో అన్ని ప్రాంతములందును జీవకోటి వ్యాపించియుండుటే భూమిపైన అనుభవసిద్ధము.

# 10. నియాండర్తలర్, రొడీసియను నరయుగము

## (నారసింహాయుగము)

నాల్గవ హిమయుగపు అనగా నలుబది యేబది వేల యేండ్ల క్రిందటి ఒక నరసముని దేహశేషములనుబట్టి, ఆతడు నిజముగా నరుడే యని ఇటీవలివరకు తలచిరి; దాని పుర్రెలు, శల్యములు, దాని పనిముట్లును దొరకినవి. ఆ జంతువు నిప్పు గూడ చేసుకొని, చలిబాధ లేకుండ గుహాలలో వసించెను. అది జంతుచర్మముల గూడ ధరించి, మనవలె కుడిచేతి యల వాటును కలిగియుండెనని తోచును.

కాని యిదియు నిజమైన మనుష్యజాతి కాదని జాతి శాస్త్రజ్ఞులు నిర్ణయించినారు. ఇది ప్రథమశాఖలోని వేరొక యుపశాఖ; వీని దౌడలు బలువై బాగుగ ముందునకు వచ్చి యుండును; లలాటము దిగి, పెట్టమా కనుబొమలు కలవు. మన బొటనవ్రేళ్లతోవలె వానితో మిగిలిన వ్రేళ్లను నొక్కి పట్ట వీలులేదు. వీని కంఠనిర్మాణమునుబట్టి వెనుకకు మెడ వంచి పైకి చూడవీలు లేదు. అవి తల ముందుకు, క్రిందికి వంచుకొని యుండును. వాటిగడ్డము లేని దౌడ నరములు నరులవాటివలె గాక "హైడిల్బర్గ" శల్యముల బోలియున్నవి; పండ్లలోను చాల భేదము కలదు; దౌడపండ్లు మనదౌడపండ్లకన్న కిష్టతరముగ నున్నవి. వానికి మనకుండు కోరపండ్లు, అట్టిదంతము

లును లేవు; పుఱ్ఱె వైశాల్యము మనలోవలె నున్నను, వాని మెదడు వెనుక పెద్దదిగను, ముందర చిన్నదిగను ఉన్నది; దాని నిర్మాణమును వేరు. అవి నరజాతిజనకములు కావు; వాని మన శ్శరీరములు నరులవానికన్న వేరు; ఆప్రాణు లిప్పుడు లేవు. వాని పుఱ్ఱెలు, శల్యములు, 'నియాండర్తల్'లోను ఇతరస్థలము లందును దొరకినవి. అందుచే వీనికి 'నియాండర్తల్' నరులని పేరు కలిగినది. ఈరకపువారు యూరపులో చాలశతాబ్దముల వర కుండియుందురు.

అప్పుడు మన ప్రపంచపు శీతోష్ణస్థితి భూఖండవిభజన ఇప్పటికన్న కొంత భిన్నము. యూరపుఖండమున మంచు గడ్డలు (లండనువద్దనున్న) థేమ్సునదివరకును జర్మనీ మధ్యకును, రష్యాలోనికి నావరించియుండినవి. ఆంగ్లభూమి ఫ్రాన్సుతో కలసి, మధ్యను జలము లేకయుండెను. అప్పటికి మధ్యధరా సముద్రమును, ఎఱ్ఱసముద్రమును మైదానపులోయలుగ నుండి నవి. వీనిలో లోతైనచోట్లమాత్రము సరస్సు లేర్పడియుండ వచ్చును. ప్రస్తుతపు నల్లసముద్రమునుండి దక్షిణరష్యాగుండ మధ్యఆసియా లోపలివరకు, వేరొక గొప్ప భూమధ్యసముద్ర ముండినది; స్పెయినును, యూరపు దక్షిణభాగముగూడ అతిశీత లముగ నుండెను. ఉత్తరఆఫ్రికాకు వచ్చినపుడుమాత్రము, సమ శీతోష్ణముగ నుండెను. అప్పటి దక్షిణయూరపులో (చిన్న మొక్క లెగల) చల్లని మైదానములయందు, రోమావృతములగు 'మామత్' ఖడ్గమృగము, మహాఋషభములు, తెల్లదుప్పులు వేసవిలో ఉత్తరమునకు శీతకాలమున నింకను దక్షిణమునకును, వచ్చి పోవుచుండెను.

చతుర్థ హిమయుగాంతమున యూరపు పశ్చిమఆసియాల దృశ్యము

(సుమారు 50,000 ఏండ్ల క్రితము.)



ఇట్టిపరిస్థితులలో 'నియాండర్తలు నరుడు' చిన్నమృగముల జంపియు, కందమూలఫలముల గొనియు ఎట్లో జీవించుచుండెను; వానిచదునైన క్లిష్టదంతములబట్టిచూడ, శాకాహారియై మూలములను మొలకలను హెచ్చుగా తిని నములుచుండె నని తోచును. కాని వానిగుహాలలో మహామృగముల కొవ్వుగల పెద్దయెముకలు కొవ్వునిమిత్తమై పగులగొట్టబడియున్నవి. ఆక్రూరజంతువుల నెదుర్కొని చంపలేక, ఏనదిమూలనో నక్కియుండి బల్లెములతో పొడిచియో, వాటిదారిలో గోతుల ద్రవ్వి పడవేయించి చంపియో, లేక భీకరమృగములు తమలో పోరాడి కొన్ని చనిపోగా వెనుకనుండి నక్కవలె చేరి ఆశవముల వసగుహాలలోనికి గొంపోయియో, అతడు వాటిని తినియుండును; లేక చిరకాలము శాకాహారియయ్యు, దుర్భరశీతలపరిస్థితులందు జంతుమాంసముకోరి వానిని జంపి తినియుండవచ్చును.

రోమావృతుడై భీకరుడగు ఈనారసింహుడు, నిల్చి నడచుటకు కాళ్లు చేతులుగూడ నుపయోగించెను; ఒంటరిగనో చిన్నకుటుంబముగనో సంచరించియుండును; ఇతనికుండిన దౌడతో మనుష్యులవలె మాటాడ వీలులేదు.

వేలకొలదియేం డ్లీనారసింహజాతియే శ్రేష్ఠజాతిగనుండెను. తరువాత 30 లేక 35 వేల యేండ్లక్రిందట, శీతోష్ణస్థితి బాగుపడెను; అంతట దక్షిణమునుండి, అంతకన్న జ్ఞానవంతులు సంభాషణశీలురు పరస్పర సహకారులు నగు ఇతర శాఖవారు వచ్చి, వీరిని గుహాదులనుండి లేవగొట్టిరి. ఉభయజాతుల కొకేరీతి యాహారము కనుకను పోటీ యధికమైయుండును. ఆక్రొత్తవారు దక్షిణపువారో తూర్పువారో గాని, 'నియాండ

ర్తలరు'ల వెంబడించి, రూపుమాపిరి. వారు నరజాతివారే; వారి మెదడు, బొటనవ్రేళ్లు, మెడలు, పండ్లు కేవలము మనయవయవముల పోలియున్నవి. 'క్రొమాగ్నను' వద్దను, 'గ్రిమాల్టు' వద్దను కనపడిన వీరి యస్థిపంజరములే ఇప్పుడున్న ప్రథమ నరశేషములు; ఈరీతిగా శిలాశేషములందు మనజాతిస్పర్శ కలిగినది; ఇకనుండి మానవచరిత్ర ప్రారంభించినది.

అప్పటి కింకను శీతముగ నున్నను, ప్రస్తుతపు ప్రపంచమునకు కొంతపోలిక కల్గినది; హిమయుగకాలపు మంచు మరల తగ్గినది; ఫ్రాన్సు స్పెయినుదేశములం దుండిన ధవళహరిణములు పోయినవి. ఆస్థలములు తృణసస్యయుతములైనకొలదిని, ఆప్రాంతములందు అశ్వబృందములు వ్యాపించెను. ఇదివరలో నుండిన 'మామత్' మృగము ఉత్తరప్రాంతములకు తొలగి, క్రమముగా క్షీణించిపోయినవి.

శుద్ధనరజాతి భూమిపైన మొదట నేప్రాంతమున జనించెనో తెలియదు. దక్షిణాఫ్రికాలోని 'బ్రోకెన్‌హిల్' అనుచోట విచిత్రమగు పుర్రె, కపాలశకలములు 1921 వేసవిలో దొరికినవి. ఇవి యిదివరలోని 'నియాండర్తలరు' లకును శుద్ధమనుజులకును మధ్యగకమగు నొక మూడవజాతివి. మెదడు నియాండర్తలరుదానికన్న ముందర పెద్దదిగను, వెనుకటిభాగము చిన్నదిగను ఉండి, మనవాటిని పోలియున్నది; ఆకపాలమును మనదానివలెనే వెన్నెముకపై సరిగా నిలచియున్నది; పండ్లు, ఎముకలు, నరులరీతిగనే యున్నవి; కాని, మొగము పెద్దకనుబొమలుగల్గి నడునెత్తినుండి రోమపంక్తితో కోతిరూపుగ నుండియుండును. ఈ 'రొడీసియను' నరుడు 'నియాండర్తలరు'నికన్న శుద్ధనరు

నెక్కువ పోలియుండును. ఈ 'రొడీసియను' శాఖగాక నరవానర జాతులమధ్య నింక నెన్నియో ఉపశాఖలు(హిమయుగారంభము మొదలీ మధ్యభాగమున) కలిగియుండవచ్చును. శుద్ధనరుడు వీరందరికిని వారసుడై, వీరి వినాశకుడును అయ్యెను. ఈ 'రొడీసియను' కపాలమును మిక్కిలి పురాతనము కాదేమో; ఇప్పటికింకను దీని సరియగు కాలము నిర్ధారణకాలేదు. ఈ యుప నరజాతి దక్షిణాఫ్రికాలో నిటీవలివరకును నశింపక మిగిలి యుండవచ్చును.

—

# 11. నరజాతియారంభము

## (పాషాణయుగము)

వైజ్ఞానికుల కిప్పటికి తెలిసినంతవరకు శుద్ధనరుల మొదటి చిహ్నము పడమటియూరపులో (అందు ముఖ్యముగ ఫ్రాన్సు స్పెయినులలో) దొరకినవి. ఈ రెండు దేశములలో (ప్రధానముగ స్పెయినులో) 30 వేలయేండ్ల క్రిందటి నరులశల్యములు ఆయుధములు, రేఖలుచెక్కి తయారుచేసిన ఎముకలు, శిలాచిత్రములును కనబడినవి.

ఇంకను అనేకపరిశోధకులు అన్నిజాతుల పురాతన వస్తువులను పూర్తిగ పరీక్షించవలెను; ప్రపంచమందు పురాతత్వజ్ఞు లింకను ప్రవేశింపని ఇతరదేశములలోగూడ పరీక్షలు జరుగవలెను. అప్పుడు ఇంకను చాల నాధారములు దొరకును. ఇప్పు డున్నవి బహుస్వల్పము. ఈవిమర్శలింకను ప్రారంభదశలోనే యున్నవి. ఆఫ్రికా ఆసియాలలో చాలభాగము లింతవరకు విజ్ఞు లెవరును చూచి పరిశోధింపలేదు; కొన్నిప్రదేశముల కింకను వెళ్లనేలేదు. అందుచే నరజాతి పశ్చిమయూరపులోనే ఆరంభించె నని నిశ్చయించుట పొరపాటు. అన్నిటికన్న ప్రాచీనములగు నరదేహచిహ్నములు ఆసియా ఆఫ్రికాలలోను, ఇప్పుడు సముద్రమగ్నములైయున్న ప్రాంతములందును ఉండవచ్చును. ఒక్కపన్నుమాత్రమే తప్ప ప్రథమశాఖజీవులు అనగా తోకలేని కోతులు మహావానరులు, నియాండర్తలీయులు, ప్రథమనరులు అమెరికాలో నుండిన చిహ్నమేమియు దొరకలేదు. అందుచే

నిచట అమెరికా పేరెత్తలేదు. పూర్వార్థలోకమందే యీజాతి యంతయు నుదయించెను. పూర్వము బెహారింగుజలసంధివద్ద భూభాగ ముండెను; దాని (ఆసియాలో ఆగ్నేయమూల)నుండి నడచి, పూర్వశిలాయుగాంతపునరులు అమెరికాఖండములోనికి ప్రవేశించియుందురు. యూరపులోని యీ మొదటినరజాతిలో ఆనాటికే అధమము రెండు ముఖ్యశాఖ లుండినట్లు కనపడును. వీరిలో నొకశాఖవా రున్నతకాయులు; వీరి మెదడు పెద్దది; వీరిలో నొక స్త్రీపుర్రె ఇప్పటి మామూలు మనుష్యుల కపాలముకన్న పెద్దది. ఒక పురుషుని కంకాళపుఎత్తు ఆరడుగుల పైగా నున్నది. వీరి శరీరాకారము ఉత్తరఅమెరికా ఇండియనుల బోలియున్నది. ఈనరదేహశేషములలో మొదటివి 'క్రోమగ్నను' అనుచోట దొరకినందున ఈశాఖనరులకు 'క్రోమగ్నన్డు'లని పేరిడిరి. వీ రనాగరికులైనను, ఉన్నత్తులై యుందురు. 'గ్రిమాల్డ్ గుహ'లోని రెండవజాతివారు నీగ్రోజాతివారు ఇప్పటి ఆఫ్రికను 'బుష్మనులు' 'హాటెంటాటు'లు ఈ శాఖవారు. మనకు తెలిసియున్న ప్రారంభదశలోనే మనుష్యులట్లు రెండు · భిన్నజాతులవారుగా నుండుట చిత్రము; వీరిలో మొదటిశాఖ ప్రపంచపు తూర్పు ఉత్తరభాగముల నుండి వచ్చి రని గోధుమవన్నెవా రని, రెండవశాఖవారు దక్షిణమధ్య ప్రాంతములవారు నల్లనివా రని, ఊహింతురు. కాని, అట్లు నిర్ణయింపదగుఆధారము లేదు. సుమారు 40 వేలయేండ్ల క్రిందట నుండిన యీ అనాగరకులు నత్తగుల్లలతో కంఠహారముల జేసికొనిరి; దేహమున పచ్చలు పొడుచుకొనిరి; అస్థిమూర్తులను శిలావిగ్రహములను తయారు

చేసుకొనిరి. వానిపైనను, చక్కని రాతినేలలపైనను వారు చెక్కిన విగ్రహాదిచిత్రములు వికృతములుగ నున్నవి; వానిలో నేర్పు పనితనము మాత్రము గలవు. వీరి యుపకరణములు 'నియాండర్తలరు'ల వానికన్న చిన్నవై, రకరకములుగా నున్నవి. వా రప్పటికి పచ్చికబయళ్ల చరించు గడ్డముగల అశ్వములను, అడవిదున్నలను వేటాడి జీవించుచుండిరి. వారు 'మామత్తు' లను రోమావృత గజముల మనోహరచిత్రముల లిఖించిరి. ఒక సందిగ్ధచిత్రమును బట్టిజూడ వాని నీనరులు మాటువేసి చంపినట్లు తోచును.

వా రీటెలతోను రాళ్లతోను వేటాడిరి; కాని విలువిద్య అలవడినట్లు లేదు. అప్పటి కింకను వారు జంతువుల మచ్చికచేయు టయు లేదేమో! వారికి కుక్కలు లేవు. కళ్లెము పెట్టినట్లుండు గుఱ్ఱమునకు చర్మము చుట్టినట్లు కొన్నిచిత్రములు కలవు; కాని ఆదేశకాలముల గుఱ్ఱములు నరవాహనము లగుటకు వీలుండదు. అవి పెంపుడువైనను, వానిని వెంటదీసికొని పోయియుందురు; జంతుక్షీరము త్రాగు ప్రకృతివిరుద్ధాభ్యాసముకూడ వారికింకను కలిగియుండదు. వారు గృహముల నిర్మింపక, చర్మములతో డేరాలు వేసుకొని యుందురు; మట్టిబొమ్మలు చేసికొన్నను, కుండలు చేసుకొనుటలేదు; పచనపాత్రలు లేనందున వంట యింకను లేదో, లేక, అగ్నిలోనే వేపుచుండిరో! వారికి వ్యవసాయము, గంప లల్లుట, బట్టలనేత తెలియదు. చర్మము బొచ్చు తప్ప, వేరు దేహాచ్ఛాదన లేదు.

ఈజాతివారు యూరపుమైదానములలో నిట్లు రమారమి మూరుశతాబ్దు లుండె, ఇంతలో శీతోష్ణస్థితి మారగా, ఆస్థలముల

విడచిరి. శతాబ్దములు గడచినకొలది ఎండ వాన హెచ్చు చుండెను. ధవళహరిణములు, వీని వెనుక కారెనుములు గుఱ్ఱములును ఈశాన్యప్రాంతములకు పోయెను. మైదానములందు మహారణ్యము లేర్పడి, ఈజంతువులకుబదులు ఎఱ్ఱదుప్పులు వచ్చినవి. క్రొత్తపరిస్థితులలో క్రొత్తపనిముట్లు వాడుకలోనికి వచ్చెను. నదులందును, సరస్సులందును, నరులు ముఖ్యముగా చేపల బట్టుచుండిరి. శల్యములతో చక్కని పనిముట్లు చేయబడెను. ఆ కాలపు యెముకలసూదులు తరువాత 'రినస్సెన్సు' * కాలమువరకున్న వాటికన్నను ప్రశస్తములు; అట్టిసూదులు రోమనులకుగూడ నెన్నడును లేవు అని 'డిమోర్టిలెట్టు' చెప్పి యున్నాడు.

రమారమి 15 లేక 20 వేల యేండ్ల క్రింద దక్షిణ స్పెయినులోని కొక నూతనశాఖ మనుష్యులు ప్రవేశించిరి. శిలాతలములపైన వారు చిత్రించిన చమత్కారచిత్రము లిప్పటికి నున్నవి. ఈ బొమ్మలున్న "మాసెడ్ అజిల్" అను గుహానుబట్టి వారిని 'అజలియను' లనుచున్నాము. వీరు ధనుర్ధరులు; శిరములం దీకల ధరించిరి. చిత్రలేఖనమే గాక సంకేతచిత్రముల గూడ వ్రాయుచుండిరి; మనిషిని సూచించుటకు పెద్ద నిలువుగీత, రెండు మూడు చిన్న అడ్డుగీతలును, లిఖించిరి. చిహ్నము లి ట్లారంభించిన వని తోచును. ఒక తేనెపట్టున కిద్దరు మనుజులు పొగ బెట్టుచున్నటు లొకచిత్రము గలదు.

---

* యూరపులో క్రీ. త. మొదటి మూడుశతాబ్దము లైనపిదప విజ్ఞానము శిల్పకళ క్షీణించినవి. తరువాత 16-వ శతాబ్దముననే పునర్వికాసము కలిగెను ఈపునర్వికాసమునే యూరపుచరిత్రలో 'రినస్సెన్సు' అందురు.

వీని పనిముట్లు చెక్కిన రాతివగుటచే వీరిది 'పూర్వ శిలాయుగ' మని చెప్పుచున్నాము. సుమారు 10, 12 వేల యేండ్లక్రిందట, యూరపున కింకొక క్రొత్తజాతి వచ్చెను. ఈ క్రొత్తమనుష్యులు పనిముట్లను చెక్కి, వానిని సూరి, నునుపుచేసెడివారు. వీరు వ్యవసాయ మారంభించిరి. ఇట్లు 'నవశిలాయుగము' మొదలిడినది.

మారుమూల ఆస్ట్రేలియాఖండమునకు దక్షిణమున నున్న టాస్మేనియాద్వీపములో అత్యంతహీనమగు మనశ్శరీరములు గల ఒక అనాగరకజాతివారు నూరేండ్ల క్రిందటివర కుండిరి. ఈ జాతివారెవరు నేటివలె యూరపులో లేరు. భూతలపు మార్పులచేత ఇతరులతో నీ టాస్మేనియనులకు రాకపోకలు లేక, వీరియాచారాదు లాస్థితిలోనే నిల్చిపోయినవి. వీరు వృద్ధియగుటకు బదులు క్షీణింపజొచ్చిరి. యూరపియను అన్వేషకులకు వీరు కనబడుసరికి వీరు నత్తలను నీచజంతువులను బట్టి తినుచు, గృహములులేక చెట్లక్రిందను తిప్పలమీదను వసించుచు, హీనస్థితిలో నుండిరి. వీరు మనుష్యజాతివారే. కాని ప్రథమనరజాతి కుండినంతయు హస్తనైపుణ్యము వీరికి లేదు.*

* నరజాతి మొదట ఏప్రాంతమం దుండెనో తెలియనట్లే, మొదటి నరజాతి యెట్లుండెనో నిర్ణయించుటయు కష్టమే. మనదేశపు నేపాళము మున్నగు కొన్ని హిమాలయప్రాంతము లందు, ఇంక చాల ఇతర ప్రదేశము లందును, ఇంకను పరిశోధనలు జరుగలేదు. చారిత్రికకాలమునకు వేలకొలది యేండ్లక్రిందటను జనసంచార ముండినట్లు దక్షిణభారతదేశపు (తిరునల్వేలి జిల్లాలోని) అడిచనల్లూరు, మద్రాసుపురప్రాంతము, హిమాలయప్రాంతము,

సింధుతీరము, మొదలగుచోట్లను దొరకిన ప్రాచీనశిలాయుగపు విచిత్ర వస్తువులు సూచించును. అతిపురాతనకాలమునుండి పశ్చిమపంజాబుప్రాంతమున మనుష్యజాతి యుండినట్లు కొన్నినిదర్శనములు కనబడినవి. ఆప్రాంతమున పరిశోధనలు జరిగించుట కొరక అమెరికను పురాతత్త్వవేత్త ఇటీవల మనభారత దేశమునకు వచ్చెను. మనదేశమున ఈపరిశోధన లిప్పుడే ఆరంభమైనవి. పూర్వము నరజాతి ఆరంభకాలమువరకు ఆఫ్రికాకు మన దక్షిణభారత దేశమునకు భూసంబంధ ముండెను. ఆ యారంభకాలపు మరుగుజ్జుమనుష్యులు ఆఫ్రికాలో నుండినట్లు చిహ్నములు కలవు. ఆఫ్రికాలోని యాప్రాణుల బోలునవి మనదేశమందును కలవట. సస్తనజాతులు పక్షులు ఆరంభమున చాల చిన్నవిగ నుండినట్లే, మొదటి నరజాతి వారిశరీరములు అల్పములుగనే ఉండి యుండును. అట్టిచో ఈ ఆదిమనరకాలమును 'వామనయుగ' మని చెప్ప వచ్చును.



# 12. ఆదిమజ్ఞానము

ఆదిమజనులు ఊడ్పులు కోతలు లేక, వేటతోనే కాలము గడపిరి. అట్టివారి ఆలోచనలు విచిత్రములై యుండును; అవి లిఖితము కానందున నవి కేవల మూహ్యములు.

వైజ్ఞానికులు శ్రమపడి వానిని అనేకాధారములపైన నిర్ణయించిరి. చిన్నపిల్లల భావములు అహంకారయుతములు; అవి సాంఘికజీవితపు అవసరములబట్టి నిస్తబ్ధములై మారుచు, మిశ్రితము లగుచుండును. ఈసంగతిని క్రొత్తగాచర్చించి తెలుపునది 'సైకో-ఎనాలిసిస్' అనబడు భావపరిశీలనశాస్త్రము. దాని వలన ఆదిమజనుల సాంఘికచరిత్రనుగూర్చి కొన్నివిషయాలు తెలిసినవి. అక్కడక్కడ మిగిలియున్న ఇప్పటి వన్యజనుల భావములను వారి యభ్యాసాచారములను చూచియు కొన్ని టిని గ్రహింతుము; ఆధునిక నాగరికులలోను పూర్వపు మూఢ విశ్వాసములు, కొన్ని గాథలును, పూర్వకథలునుగూడ అనుశ్రుత ముగా వచ్చుచున్నవి. అవియు ఆదిమజనుల మనోభావము లెట్లుండెనో సూచించును. ఆధునికకాలము సమీపించినకొలది మనకున్న కొన్ని పురాతనచిత్రములు, శిలావిగ్రహములు, సాంకేతికచిహ్నములుగూడ, అప్పటి జనుల చిత్తవృత్తి యెట్లుండెనో, వారి కేపదార్థములిష్టమో, తెలియజేయును.

ఆదిమజనులు మనలోపిల్లలవలె ఊహాలచే విషయముల దమ మనస్సులో చిత్రించుకొనిరి. ఇప్పుడు పిల్లలు, అజ్ఞానులు, చేయునట్లే, వారు వస్తువుల యాకారముల మనస్సున భావించి,

ఊహించి, అందునుబట్టి చరించుచుండిరి. ఇట్లు కొంతకాలమైన మీదటనే, నరులకు విచక్షణ జ్ఞానము కలిగియుండును. మూడు వేలయేండ్లక్రిందటివరకు నరులలో నట్టి జ్ఞానశక్తిప్రముఖమై యుండదు. ఇప్పటికిని సామాన్యజనులు ఊహకు ఉద్రేకమునకు లోనై ఏకొద్దిమందియో నిర్ణయించుభావము ననుసరింతురు. పూర్వకాలపు స్తనజంతువులు మొదట చిన్నకుటుంబములుగా నుండి క్రమముగా మందలుగా నేర్పడెను. అట్లే ఆదిమజనులు మొదట చిన్నకుటుంబములుగానే యుండియుందురు. వారు తమసహజగుణమగు అహంభావమును లోబర్చుకొని, నిగ్రహయుతులు కావలసివచ్చెను. వయస్సువచ్చినతరువాత గూడ పితృభక్తి కనుబరచవలసియుండెను. తమపడుచుపిల్లవాండ్రపై సహజముగా కలుగు అసూయను ముసలివాండ్రు తగ్గించుకొనవలసి యుండెను. పిల్లలు తల్లిబోధనలోను రక్షణలోను ఉండుట సహజమే; కాని యౌవనముఁరాగానే తమతల్లిదండ్రుల నదలి స్వతంత్రముగ జీవింపవలెనని తోచును; ఆబుద్ధి మాని, ఏకాకిజీవనము నష్టకరమని వారు గ్రహించిరి. అందుచే యువకులు తల్లిదండ్రులతో ఏకకుటుంబముగనే యుండజొచ్చిరి; ఇట్లుక్రమముగా జనులలో సాంఘికజీవన మారంభించెను. ఇప్పటి వనచరుల 'టాబూ' లను ఆచారనియమములు చాలవరకిట్టి సాంఘికావసరములచే నేర్పడిన దని 'జే. జే. ఆట్కిన్సను' అను ప్రతిభాశాలి యగు నరతత్వజ్ఞుడు తన 'ప్రైమల్‌లా' యను గ్రంథమున వివరించెను. ఆతనినిర్ణయము, తరువాత మనఃపరిశీలన శాస్త్రజ్ఞుల సవిమర్శసిద్ధాంతములకు సరిపోయి, అందుచే దృఢపడెను.

పెద్దలపై నేర్పడు భయభక్తులు ఆదిమజనుల స్వప్న మందును ధ్యానమందును వృద్ధియై, క్రమముగా బలప డును; అట్లవి క్రమముగా ఆదిమనరుల మతమునకు గ్రామ దేవతల పూజకు మూలకారణ మయ్యె నని కొందరు మేధా వుల యూహ. ప్రజోపకారులై అద్భుతశక్తియుతులైనవారి యందు, ఆదిమజనులు భయభక్తులతో నుండిరి. ఆశూరులు మరణించినతరువాతగూడ, కలలో జ్ఞప్తి వచ్చుచుండుటచే, ఆభయభక్తులు వృద్ధియై, మహావీరు డగు తమనాయకుడు చనిపోలేదనియు, ఐహికజీవితము మాత్రమే త్యజించి, దూరస్థల మున ఇంతకంటె అధికశక్తితో అదృశ్యుడుగ నున్నాడనియు, వారు సహజముగ నమ్మిరి. పిల్లలస్వప్నభ్రాంతి, భయములు, పెద్దలకుగలుగు వానికన్న స్థిరముగాను స్ఫుటముగాను ఉండును. ఆదిజనులమనస్సును మనచిన్నపిల్లల మనస్సువలె నుండెను. ఇది గాక మృగజాతిసహవాసముచే, అట్టియుద్దేశములు ప్రతీకార బుద్ధులు జంతువులకు నుండున నియు, వానిలోను తమకు మిత్రులు శత్రువులు అగు అధిదేవతలుందు రనియు, వారికి తోచి యుండును. విచిత్ర వికృతాకారములగు శిలలు, కర్రమొద్దులు, విచిత్రవృక్షములవంటివి, విశిష్టములుగాను భావగుంభితములు గాను తోచి, విరోధిగానో యిష్టముగానో కనబడును; వానిని గూర్చి కలలు ఊహలు కలిగి, అంతట వానినిగూర్చి కథలు గాథలు ఏర్పడును. ప్రాచీనశిలాయుగపు మనుష్యులకెక్కువ నమ్మిక కల్గియుండును. ఈసంగతులు బాల్యమున ఊహ హెచ్చుగ నుండినవారు గ్రహింపగలరు. జను లట్టిగాథలలో గొన్నింటిని జ్ఞప్తియం దుంచుకొని, మరలమరల చెప్పుచుందురు.

స్త్రీలు తమపిల్లలకుకథలను జెప్పుచుండుటచే అవిఅనుశ్రుతములై, ఐతిహ్యముగ నేర్పడును. ఊహగల పిల్లలనేకులు తమ కిష్టమగు బొమ్మనో మృగమునో నరసమప్రాణినో కథానాయకునిగ నెంచి, కథల నూహించి చెప్పుచుందురు. ఆదిమనరులు నిట్లేచేయుచు, తమకథానాయకుడు యథార్థమైనవాడే యని విశ్వసించి యుందురు. మనకుతెలిసిన ఆదిమజనులందరిలో మొదటివారు వాచాలు రని తోచును. వా రీవిషయమున 'నియాండర్తలు' వారికన్న భిన్నులు సౌకర్యవంతులుగ నుండిరి. నియాండర్తలీయులు కేవలము మూగవారు. ఆదిమనరులు కొన్నిమాటలు చెప్పుచు, అందుకు సంజ్ఞలను తోడుజేసుకొనియుందురు.

అడవిమనుష్యులకును కొంతకార్యకారణజ్ఞాన ముండెను; కాని దానికి తగువిచక్షణలేక, వారొకకార్యమును, దాని యథార్థకారణము విడచి, మరియొకదానితో ముడిపెట్టుచుండిరి. "ఇట్లుచేయుము, అట్లగును"అని ఆతడనును; "మీ రొకశిశువున కొకకాయ నిచ్చినమీచట, ఆశిశువు చనిపోవును", "వీరశత్రుని గుండెల దినిన, బలముగలుగును"; ఇట్లెక్కడనైన నొకసారి కాకతాళీయముగ జరుగవచ్చు; కాని ఎప్పుడును అట్లే జరుగు నను భావము సరి కాదు. అడవిజనులకుండు ఈ ఊహ భ్రమయే కాని, ప్రమ కాదు. అది విచక్షణజనితము కాక, తరచు తప్పిపోవును; అది తర్కశాస్త్రసిద్ధము కాదు.

ఇట్టివానిలో చాలవరకు సరియైన కార్యకారణ సంబంధములు గ్రహించుట కష్టముకాదు. కొన్నిటిలో అనుభవముచే భ్రాంతితొలగును. కాని జీవితప్రధాన మగు సమస్యలకు వారు యత్నముపై కొన్నివిచిత్ర దృఢవిశ్వాసముల నేర్పర్చుకొనిరి

అట్టివి సరికావనుటకు ప్రత్యక్ష నిదర్శనమున్నగాని అవి తొలగవు. తమకాహారమగు జంతువులు మత్స్యములు సమృద్ధిగా దొరుకుట ఆదిమ జనుల కవసరము. అట్టి కార్యానుకూలతకై, అనేకమంత్రములు, తాయెత్తులు, శకునములు, ఇత్యాదులందు వారికి దృఢవిశ్వాస ముండెను. వ్యాధి, మరణములు అడవిజనులకు ముఖ్యసమస్యలే. దేశమం దంటువ్యాధులు వ్యాపించి యనేకులు చనిపోవుదురు; చాలమంది ప్రత్యక్ష కారణములు లేకయే దుర్బలులగుదురు. అట్టిస్థితిలో ఆదిమ జనులకు చిత్తవిక్షోభము, ఆతురత, వ్యాకులత, కలుగు చుండెను; స్వప్నాదులచే దేనిమీదనో అపోహలుకలిగి, వారు పిల్లలవలె భయస్థులై ఏజంతువో మనుష్యుడో కాపాడవలె నని యపేక్షించిరి. వారిలో అనుభవ స్థైర్యయుతులైనవారు ఇతరులకు బోధకులు నాయకులు నైరి. కొన్నిచిహ్నములు శకునములు శుభ ప్రదము లని, కొన్ని హానికరములని, నిర్ణయించు మంత్ర తంత్రజ్ఞులు వైద్యనిపుణులు కులగురువు లైరి. ఈనాయకులు స్వప్న ఫలితములను భవిష్యత్తును చెప్పుచు, దుర్నిమిత్తముల దోషముల బోగొట్టి యదృష్టలాభము గల్గించుటకై, క్లిష్టమంత్రతంత్రముల నేర్పర్చుచుండిరి. ఆదిమమతమునందు ఆచారానుష్ఠానములే ప్రధానములు; కాని అందు యథార్థధార్మికభావము లేదు. అప్పటి మతగురువులు స్వచ్ఛందము అనుభవసిద్ధములగు సూత్రములనే విధించుచుండిరి.*

---

* అనాగరికదేశములం దిప్పటికిని పైనచెప్పినభావములు ప్రబలియున్నవి; అవి వారి సాంఘిక ధార్మికవిషయములందు ముఖ్యముగ నున్నవి. ఇతరనాగరికదేశములందు చాలవర కివి యిప్పుడు తగ్గినవి. కాని మనభారత

దేశమందిప్పటికిని కొందరిలో అట్టిభావములు వ్యాపించియున్నవి. ఆర్యులు వచ్చునప్పటికే, ఆదిమజనులు ద్రావిడులు కలసి చిరకాల ముండిరి; అందుచే ద్రావిడు లందరిలోను ఆదిమజనుల నమ్మికలు, భావములు పూర్తిగా వ్యాపించి నవి; ఈ మిశ్రితద్రావిడనాగరికత భౌతికముగా ఉచ్చదశలో నుండెను. ఆర్యులనాగరికత దీనిని తొలగింపక, అందుకొన్నిమార్పుల మాత్రము కావించెను. తాయెత్తులవిశ్వాసము, శిలలందును కర్రదిమ్మలందును చెట్లయందును మనగ్రామములలో అజ్ఞానులకుండు మూఢభయభక్తులు, దయ్యములభీతి అందఱెరిగినవే. మంత్రశాస్త్రములందలి కొన్నిభావములు శత్రుసంహారమునకై చేయు మంత్రోచ్చాటనలు, అభిచారహోమాదులుకూడ, ఇట్టివే. అధర్వవేదమందలి చాలమంత్రతంత్రములం దీభావములు ప్రాముఖ్యము వహించుట చిత్రము. (అధర్వసంహిత చాల ప్రాచీనమే; ప్రాచీనార్యులలోకూడ క్రింది తరగతులలో కొంతవర కీభావములు మొదటనుండి యుండెనేమో! చాలవరకు ఆదిమద్రావిడనాగరికత యొక్క సంపర్కప్రభావముకూడ ఈగ్రంథమం దున్నదని విమర్శకుల' అభిప్రాయము. ఇతరనాగరికదేశములలోవలె గాక, మన దేశమున నూటికి 90 మందికి అక్షరజ్ఞానముకూడ లేదు. తక్కిన 10%లో కూడ నిజమగు విద్యావంతులు చాల తక్కువ; కనుక ఇట్టి అజ్ఞాన మూఢ భావములు మనదేశమందలి కొందరిలో (ముఖ్యముగా మాలమాదిగలవంటి నిమ్నజాతులలోను కోయలు మొదలగు ఆటవికులలోను) చాల ప్రబలమై, అనేక దురాచారము లింకను మనజాతిలో నిల్చియున్నవి. ఆభావములు ఆచారములు వారితో సాంఘికసంపర్కము గలవారికిని వ్యాపించును. కొందరు విద్యావంతులలోకూడ అక్కడక్కడ ఇట్టిభావములు నేటికిని లేకపోలేదు.

---

# 13. కృష్యారంభము

ప్రపంచమున వ్యవసాయ మారంభమై స్థిరపడిన విధము గూర్చి, 50 యేండ్లనుండి చాల పరిశోధన చర్చ జరిగెను; కాని ఇంతవరకు అది సరిగా తేలలేదు. క్రీ. పూ. 12 వేలు 15 వేలు ఏండ్లమధ్యను 'అజీలియను' జనులు స్పెయినుదక్షిణమం దుండిరి; అంతకు వెనుకటిమృగయు లీశాన్యసీమలకు దొలగుచుండిరి; అప్పుడు పశ్చిమ ఆసియాఖండమందో ఉత్తరఆఫ్రికాలోనో, ఇప్పటి మధ్యధరాసముద్రముగా నున్న అప్పటి లోయలందో, ఆ ప్రాంతప్రజనులు వ్యవసాయమును జంతువులమచ్చికను ఆరంభించిరని తలపవచ్చును. అంతకు పూర్వపుమృగయుల చెక్కుడు రాళ్లనేగాక, నునుపుచేసిన రాతి పనిముట్లనుగూడ నీరు వాడుచుండిరి. గంప లల్లుట, నారపోగులతో ముతుకపంచెలనేయుట, మోటుపకపు కుండలజేయుట కూడ, వారు నేర్చుకొనిరి.

ఇప్పుడు మానవసంస్కృతిలో నొకనూతనశక మారంభమైనది. ప్రాచీనశిలాయుగపు పూర్వార్ధమగు ఉదయ శిలాకాలము, ఉత్తరార్ధమగు ఆదిమనరకాలము, అనగా "గ్రిమాల్డీ"లు "క్రోమాగ్నన్లు" లు "అజీలియనులు" అనబడువారి తరువాత కలిగిన ఆనవశిలాయుగపు జనులు ప్రపంచమందలి వెచ్చనిదేశములందు వ్యాపించిరి. వారభ్యసించిన కళలు, వారు పెంచిన వృక్షములు, జంతువులు, ఇతర ప్రాంతములందుగూడ వ్యాపించినవి. క్రీ. పూ. 10 వేల యేండ్లక్రిందటి లోకు లీనవ శిలానాగరికతలోనుండిరి.

భూమి గుండ్రదనము నిస్సందేహ మని ఆధునికులకు దోచునట్లే, నేల దున్ని విత్తనములు చల్లి, కోత కోసి, నూర్చుట, పిండివిసరుట, సహజకార్యము లని మనకు తోచును. వ్యవసాయము చేయకుండు టేమని మనవా రడుగవచ్చును. కాని మనకంత విశదము సహజము అని తోచునట్టి ఇవి 20 వేల యేండ్లక్రిందటి ఆదిమజనులకట్లు తోచలేదు. తమయత్నములలో అనవసరశ్రమ పొరబాట్లు పడుచు, వానిని కష్టముతో సవరించుకొనుచునే, వారు చివరకు కృతకృత్యులైరి. వారు మధ్యధరాప్రాంతపు టడవిలో సహజముగా పండిన గోధుమల పిండిగా నలుగగొట్టి దానిని భక్షింప నేర్చియుందురు. తరువాత కొంతకాలమునకే గింజలు జల్లి, పండించనేర్చిరి. ఇట్లా ప్రథమనరులు కోతకు తరువాతనే విత్తులజల్లిరి.

ప్రపంచమంతటను విత్తుట కోత యుండిన ప్రతిస్థలమందును, అప్పుడు యాగము, అందు జీవహింస నరమేధముగూడ, జరిగియుండుట గమనింపవలెను. ఈ రెంటికినిగల విచిత్రసంబంధమును దానికారణమును సర్. జే. జి. ఫ్రేజరుగారు 'గోల్డెన్ బవ్' అను తమ యుద్గ్రంథమున జక్కగ విమర్శించిరి. పిల్లలవలె కలగనుచు గాథల నూహించు ఆదిమనరులు తమఊహాలచే అట్టి సంబంధము నేర్చిరి. దాని కార్యకారణభావము మనకు స్పష్టము కాదు. కాని నవశిలాయుగపు ప్రాచీననరులు విత్తులుజల్లు కాలము వచ్చినపుడెల్ల నరబలి నిచ్చుచుండిరి; మరియు, ఏపనికి మాలిన వానినో గాక, చాలమాన్యుడు పూజ్యుడునగు యువకునే బలియిచ్చెదువారు. వానిని యజ్ఞార్థపు దేవాంశిక ప్రభు

వుగా భావించి, జ్ఞానులనబడినవారు వారియాచార ప్రకారము కర్మకాండతో నాయువకునో యువతినో బలియిచ్చుచుండిరి.

ఆదిమజనులకు ఋతుజ్ఞానము లేదు; వ్యవసాయమునకు ఆయజ్ఞమునకు తరుణము దెలియుట కష్టమైయుండును. ఆకాలపు నరులకు ఏడాది యన లెక్క తెలియదేమో! మొదటికాలక్రమ నిర్ణయము చాంద్రమానపు నెలలప్రకారమే జరిగెను. బైబిలు లోని ప్రాచీను లేర్పరచిన వత్సరములు చాంద్రమానపువని తోచును. బాబిలోనియనుజాతివారి పంచాంగమున, చంద్ర గతిని యేడాదిని పదమూడు నెలలుగా విభజించి, విత్తుజల్లు కాలము నిర్ణయించిరని తోచును. పంచాంగనిర్ణయమున చాంద్రమానసంబంధ మిప్పటికిని కలదు. ఏసుక్రీస్తును కొరత వేసిన దినమునకును, ఆయన పునరుద్ధరణ దినమునకును, క్రైస్తవులు సాలీనాజరుపు పండుగలిప్పటికిని చంద్రగతిప్రకారమే జరుపుట విచిత్రము. అందుచే నవి ప్రతిసాలున నొకేతేదీని రాక చంద్రగతినిబట్టి మారుచుండును.

మొట్టమొదటి నేవ్యదార్లు నక్షత్రస్థానముల గమనించిరని చెప్పలేము. దిక్కులుతెలియుటకు నక్షత్రస్థానములు సహ కారులు; కనుక, సంచారశీలురగు గోపాలకులు నక్షత్రముల మొదట గమనించియుందురు. అయితే నక్షత్రస్థానములబట్టి ఋతువుల నిర్ణయింపవచ్చునని తెలియగానే, వ్యవసాయమునకు నక్షత్రముల ఉపయోగము బోధపడియుండును. ఫలానా ముఖ్యనక్షత్రము ఫలానా దిక్కుగ నున్నపుడు విత్తుల జల్లు నప్పటి యజ్ఞముకావలెనని స్థిరపరచిరి. ఆ నక్షత్రపూజలు ఆదిమ నరులలో నారంభించుట సహజమే. మఱియు నీ నవ శిలాయుగ

మున నక్షత్రజ్ఞానముకల్గి ఆబలివిధి తెలిసినవాడు ప్రముఖుడై, తక్కినవారికి సహజనాయకు డగుచు వచ్చెను.

మైల, అపరిశుద్ధత, ప్రమాదకరములు; శుద్ధికవసరమగు పద్ధతుల నేర్పరచుటకు, వారిలో జ్ఞానులనబడువారు ఉద్యుక్తులైరి. మొదటినుండిమాంత్రికులలోను గురువులలోను పురుషులు స్త్రీలు కూడ నుండిరి. మొట్టమొదటిగురువులు ముఖ్యముగా సంప్రదాయజ్ఞులేకాని, ఆధ్యాత్మికజ్ఞానులు కారు. కేవల అనుభవ జ్ఞానులు కారు. కేవల అనుభవజ్ఞానము, నిర్దుష్టముగ నుండదు; ఆజ్ఞానమును గురువులు గూఢముగ నుంచుచుండిరి. అయినను ఆ గురువు లప్పటి సాంఘికావసరముల కుపయోగించుచుండిరి.

సుమారు 12 లేక 15 వేల యేండ్లక్రిందట, పూర్వార్ధ ప్రపంచమున జలాతపసమృద్ధిగల ప్రాంతముల 'నవశిలా' యుగ జనులు తమ పూజారులు నియమించు మతాచారములతో వ్యాపించుచు, అచ్చటిభూముల వ్యవసాయముచేయుచు, గ్రామములను చిన్నపురములను నిర్మించుకొని, తరుచు ఆపురముల రక్షణకై ప్రాకారములు కట్టుకొనుచుండిరి. కొంతకాలము గడచి వారిసంఘములసమావేశములు జరిగినపుడు, పరస్పరము సంప్రదింపులు జరుగుచుండెను. ఈ మొదటి కర్షకుల సంస్కృతికి 'హెలియోలితిక్' (సూర్యశిల) నాగరికత అని ఎలియట్ స్మిత్, రీవర్సులు పేరిడిరి. ఆ పే రీజనుల కంతయుక్తముగా లేదు; కాని వైజ్ఞానికు లంతకన్న యుక్తతరమగు పదమును నిర్ణయించువరకు, దీనినే వాడుచుందుము. మధ్యధరాసముద్ర ప్రాంతముననో, పశ్చిమ ఆసియాలోనో, ఉత్పన్నమైన యీ నాగరికత కాలక్రమమున తూర్పుకును, శాంతమహాసముద్రపు

దీవులలోనికిని, వ్యాపించినది. ఇది ఉత్తర ప్రాంతములనుండి అమెరికాలోనికి వచ్చి, అంతకుముందే ఆసియానుండి ముందు వచ్చిన వనచరులతో కలసిపోయి యుండును.

ఈ గోధుమవర్ణులగు "సూర్యశిలా" జాతివారు వెల్లిన ప్రతిస్థలమునను, వారి ఆచారవ్యవహారములు వ్యాపించెను. వీనిలో కొన్ని విచిత్రమైన వెట్లుపుట్టెనో, మన శాస్త్రజ్ఞులు వివరింపవలె. వారు పిరమిడ్లను సూచ్యగ్రమందిరములను, గొప్ప దిబ్బలను, గట్టిరి; మహాపాషాణములతో వలయముల నేర్పరచిరి, వీటిని జ్యోతిశ్శాస్త్రపరీక్షకై చేసియుండవచ్చును. వారు సాధారణముగ తమమృతుల శరీరములన్నిటిని తైలాదు లందుంచి, భద్రపరచెడివారు. వీరిలో పచ్చపొడుచుటయు, సున్నతిచేయుటయు, ఉండెను. శిశువు జనించగానే తండ్రి దాని ప్రక్కలో పరుండెడు "కోవాడె" అను ఆచారముగూడ వీరిలో యుండెను. వీరిలో 'స్వస్తిక' అను అదృష్టచిహ్నవస్తు వుండెడిది.

వీరిఆచారవ్యవహారము లెంతవరకు వ్యాపించెనో, గుర్తు వేసి చూపినచో (ఇంగ్లాండులోని) 'స్టోనుహెంజి' స్పెయిను దేశము ప్రపంచములోని సమశీతోష్ణపు ప్రదేశములు దాదాపు అన్నియు, అనగా అమెరికాలోని 'మెక్సికో' 'పెరూ' దేశముల వరకు నిండు చేరును. ఆఫ్రికాలో భూమధ్యరేఖకు పక్షిణ ప్రాంతమును, మధ్య యూరపులోని, ఉత్తరభాగమును, ఉత్తర ఆసియాయు, చేరవు. అందు వేరు సంస్కృతిగలవా రుండిరి. *

---

* సూర్యశిలానాగరికత, గోధుమపంటలు, చిరకాలముక్రిందనే భారతదేశపు పశ్చిమభాగపు గాంధారప్రాంతమున నుండిన నిదర్శనములు గలవు ఆది మొదట ఏదేశమం దారంభించెనో లేక భారతదేశమందును పశ్చిమ

మందును వేరువేరుగా ఏకకాలమందే ఆరంభించెనో, ఇంకను నిర్ణయము కాలేదు. మనదేశమందును ప్రాచీనకాలమున చంద్రగతినిబట్టియే కాల నిర్ణయము చేసుకొనుచుండిన నిదర్శనములు గలవు. నేటికిని మన ఆంధ్ర కన్నడ దేశములందు చాంద్రమానమే వాడుకలో నున్నది. విత్తులుచల్లుట ఊడ్పులు వగైరాలకు మృగశిరకార్తి మొదలగు పేర్లతో నక్షత్రగతినిబట్టి కాల నిర్ణయముచేయుట అనుశ్రుతముగ జరుగుచున్నది.

విత్తులుచల్లుకాలమందు కోతలలోను మంచిపంటలకై నరబలి నిచ్చు పద్ధతి మన భారతదేశములోను ఓఢ్రప్రాంతపు ఖోండులు మొదలగు అడవి కొండ జనులలో ఇటీవలివర కుండెను. ఇప్పటికిని ఆ యా ఋతువులందు పోలేరమ్మ ముత్యాలమ్మ గంగానమ్మమున్నగు ఆయా గ్రామదేవతలకు నిమ్నజాతుల వారు చేయు ఉత్సవములందు దున్నలు మేకలు చంపబడును; అందు జంతు బలి ప్రధానము. మనప్రాంతములందు మాలమాదిగలు చేయు 'పోతురాజు ఉత్సవము'లలోను నీలగిరిప్రాంతపు 'బడగ'లు మొదలగు వన్యజనులఉత్సవము లందును ఇట్టివి కలవు. జీవహింసలేకుండ ఊడ్పులలోను నూర్పులలోను పండుగచేసుకొనుట ఆర్యులలోను ఉన్న దని, కర్కాటక మకర సంక్రమణ ములు ప్రారంభమున ఇందుకే ఉద్దేశించినవై యుండు నని, కొందరి ఊహ. కాని వాటికి పంటలతో సంబంధము ప్రధానముకాక, సూర్యగతిలోను అయనములోను మార్పును సూచించుటే ముఖ్యోద్దేశము కావచ్చు.

# 14. ఆదిమ 'నవశిలా' నాగరికత

క్రీ. పూ. 10 వేల సంవత్సరముల క్రిందటికి భూమిపరిస్థితి దాదాపు ఇప్పటిరీతికి వచ్చినది. స్పెయినుకుదక్షిణాగ్రమం దున్న జిబ్రాల్టరు ప్రాంతపు సన్నని భూప్రదేశమును సముద్రపు నీరు అప్పటికి ఛేదించినందున జలసంధియేర్పడి, సముద్రపు నీరు మధ్యధరాతలపు లోయలలో వ్యాపించి, ప్రస్తుతపు మధ్యధరాసముద్ర మేర్పడినది. కాస్పియనుసముద్ర మింకను చాల పెద్దదిగ నుండి, కాకససుపర్వతముల కుత్తరమున, ఇప్పటి నల్లసముద్రముతో కలసిపోయియుండును. ఈ సముద్రము చుట్టునుండిన (మధ్యఆసియాలో నిప్పు డెడారిగా నున్న) దేశము లప్పుడు ఫలవంతమై, వాసయోగ్యమై యుండెను. సామాన్యముగా అప్పటినేల యెక్కువ తేమగా ఫలవంతమై యుండెను. యూరపులోని రష్యాయం దిప్పటికన్న సరస్సులు మురుగుడు స్థలములు హెచ్చుగా నుండెను. అప్పటి కింకను ఆసియా అమెరికాలు ఉత్తరభాగమున కలసియేయుండి, బెహిరింగు జలసంధి ఏర్పడ లేదని తోచును.

ప్రస్తుతపురీతినే నరజాతులలో భేద మప్పుడుగూడ నుండినది. తృణకాష్టజలసమృద్ధిగల సమశీతోష్ణ దేశములందును, తీరస్థలములందును, "సూర్యశిలా" సంస్కృతిగల యూగోధుమవర్ణులు వ్యాపించిరి. మధ్యధరాప్రాంతమం దిప్పుడున్న ఐబీరియనులు, బెర్బర్లు. ఈజిప్షనులు (=మిశ్రదేశీయులు) ఆగ్నేయాసియాలోని భారతదేశపు ద్రావిడులు వగైరాలు,

సుమత్రా, జావా, బోర్నియో మొదలగు బృహద్భారతవాసులును, ఫిలిప్పైను మొదలగు. శాంతమహాసముద్రపు ద్వీపవాసులు, మయోరీలు కూడ నీ మహాజాతిశాఖలవారే. ఈగోధుమవర్ణులనుండివిడిపోయి, ఇంతకన్నకొంత తెల్లనై నీలికండ్లుగల, ఒకశాఖవారుత్తరయూరపుమధ్య అడవులలో గలరు. వీరిని నార్డిక్ (=ఆర్య) జాతీయు లనెదరు. ఆసియాఖండపు ఈశాన్యదేశమందు (వామనేత్రములు, ఊర్ధ్వచుబుకము, స్వర్ణదేహచ్ఛాయ, దీర్ఘశ్యామశిరోజములుగల) మంగోలియను జాతివారుండిరి. దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, దక్షిణాసియాలలోను, ఉష్ణదేశ ద్వీపములందును నీగ్రోజాతీయు లుండిరి. ఆఫ్రికా మధ్యప్రాంతమున అప్పటికే జాతిసాంకర్యము కలిగెను; ఆఫ్రికాలో చాలమంది గోధుమ వర్ణపు ఉత్తరజాతికి శ్యామవర్ణపు నీగ్రోజాతికి మిశ్రితులుగా నున్నారు.

నరులలో స్త్రీ పురుషులు భిన్నజాతీయులును పరస్పర సంయోగము కలిగి, నిరాటంకముగ సంతానము గనవచ్చును; అది ప్రకృతిసిద్ధము. ఆకాశమున మబ్బులు విడిపోయి తిరుగ కలియునట్లు, మనుష్యజాతులును కాలక్రమమున వీడి, మరల సమావేశమై, మిశ్రితు లగుచుందురు. మానవజాతులు శాఖలుగా వీడినను, వృక్షశాఖలవలె తిరుగ కలియ వీలులేకపోదు. వీలైనప్పుడు భిన్నజాతులుకూడ కలుసుకొని, సంకరమగుచుందురు. ఈ సంగతి మనస్సునం దుంటే, అనేక భ్రమలు దురభిమానములు తొలగును. జనులు 'జాతి' శబ్దము నపార్థముగా నశ్రద్ధతో నుపయోగించుచు, అందుపై విపరీతమగు తరగతుల నేర్పరచుచు, 'బ్రిటిషు' జాతి, 'యూరపియను' జాతి ఇట్లను

చుందురు. యూరపులో రమారమి అన్నిజాతులును గోధుమ, చామనచాయ, తెలుపు, మంగోలియనుజాత్యంశముల సాంకర్యము గల మిశ్రజాతివారే.

ఇట్లు నరులు వ్యాపించుటలో నవశిలాయుగమున కొందరు మంగోలియనులు ప్రథమమున అమెరికాకు వెళ్ళిరి. వీరు బహుశః ఉత్తరమందలి బెహిరింగు జలసంధిప్రాంతమున బ్రవేశించి, అక్కడనుండి అమెరికాలో దక్షిణముగా వ్యాపించి యుందురు; ఉత్తరమున అచ్చటి తెల్లదుప్పులను, దక్షిణమున కారెనుముల మందలను గాంచిరి; దక్షిణఅమెరికా చేరునప్పటి కచ్చట భీమకాయములగు 'గ్లిప్టొడన్' అను నఖమృగములను, 'మెగథెరియం'అను వికృతాకారములు, భీకరజాతులను జూచిరి. ఈ మెగథెరియం పెద్దదైనను మందమగుటచే దీనిని వీరు కడతేర్చియుందురు.

ఈ అమెరికనులలో చాలమంది సంచారశీలురై వేటాడుచు, నవశిలాయుగపు సంస్కృతిలోనే యుండిరి; మెక్సికో యూకటన్ పెరూ దేశములందు స్థిరవాసముతో వ్యవసాయము కల్గినది. అందుచే పూర్వార్ధప్రపంచములోవలె నిచ్చటను క్రీ. పూ. 1000 సంవత్సరముల క్రిందట, వ్యవసాయనాగరికత వ్యాపించినది. అంతకుపూర్వము మన పూర్వార్ధగోళమందువలె నిచ్చటగూడ విత్తులుచల్లుడు కోతకాలములందు నరబలి యుండెను; అయితే మనప్రాంతములం దీనరమేధాది దురాచారములు క్రమముగా క్షీణించి, వాటిస్థానే యితరపద్ధతులు వచ్చెను. అమెరికాలో మాత్ర మీనరబలు లప్పుడింకను హెచ్చెను; వాటికర్మకాండయు పెరిగినది. నాగరికులై సాంప్రదాయికులైన

ఈ అమెరికనుల పైన గురువులు పెత్తనము చలాయించుచుండిరి. ఈజాతిరాజులును సేనానులును తీవ్రమతభావములకు శకునములకు బద్ధులైరి.

వీరిగురువులు జ్యోతిర్గణితమున జాలవివరముల సరిగా గ్రహించిరి. బాబిలోనియనులకన్నను కాలనిర్ణయము వీరి కెక్కువ బాగుగా తెలియును. అందు యూకటనులో విచిత్రము చాలక్లిష్టమునగు 'మయలిపి' అను వ్రాత ఉండెను. ప్రజ్ఞావంతులగు వీరిగురువు లతిక్లిష్టముగా పంచాంగము గుణించి యీలిపిలో వ్రాసియుందురు. క్రీ..త. 700 సం॥ 800 సం॥ ఆప్రాంతమున ఈమయనాగరికత ఉచ్చదశలో నుండెను.* వీరిశిలాచిత్రణము శిల్పసామర్థ్యము మనోహరమై, ఆధునికులను ముగ్ధులుగ జేసెను. కాని యీచిత్రవుల క్లిష్టసాంకేతికభావములు విపరీతములు, సంభ్రమకరములు; మన పూర్వార్థగోళమందిట్టి వెక్కడను లేవు; ప్రాచీనహిందూదేశీయుల చిత్తరువులకు మాత్రము వీటితో గొంతపోలిక యుండును. ఎక్కడజూచినను అల్లిబిల్లిగ నల్లిన యీకలును క్లిష్టముగ మెలికలు వేసిన సర్పములును వీనిలో గన్పడుచుండును. ఈమయలిపిలోని కొన్ని శిలాశాసనములు (యూరపులోని యితర లిఖితములకన్న) పిచ్చిఆస్పత్రులలోని పిచ్చివారు అతిశ్రమతో గీసినవాని నెక్కువ పోలియుండును. ఈ 'మయ' మనస్సు మన ప్రాచ్యార్థలోకుల

*భారతదేశమునగూడ మయుండను అసుర(రాక్షస) శిల్పి యుండెనని, అతడు నిర్మించిన అద్భుతభవనమందే పాండవులు రాజసూయయాగము చేసిరని, ఆభవనవైచిత్రికి రాజరాజగు దుర్యోధనుడుగూడ దిగ్భ్రమచెంది అసూయావిష్టుడయ్యెనని భారతకథ.

మనస్సుకు భిన్నము; వారి భావములును వక్రములు. ఈపూర్వపు అమెరికనులనాగరికత వక్ర మనుటకు వారు విశేష నరహత్యల జేయుటయు నిదర్శనము; ముఖ్యముగు మెక్సికను నాగరికతలో. నరబలి, జాతరలు విపరీతముగ నుండెను. సాలీనా వేలకొలది మనుజులను జీవించియుండగనే ఖండించి బలియిచ్చుచుండిరి; ఆ దారుణ చర్యలచ్చటి విచిత్రగురువులకు నిత్యకృత్యము లైనవి. సాంఘికసమయములందు, జాతీయోత్సవములందు గూడ ఇట్టి ఘోరహత్య ముఖ్యచర్యగా నుండెను.

ఈసంఘమందలి సామాన్యుల నిత్యజీవనము ఇతరుల జీవనమువలెనే యుండెను. వీరి మృత్పాత్రనిర్మాణము, నేత, రంగులు వేయుట, చాల బాగుగనే యుండినవి. వీరు మయాక్షరముల రాతిపై జెక్కుటయేగాక, చర్మములు మొదలగు వానిపైన వ్రాసి చిత్రించుచుండిరి. యూరపు అమెరికాలలోని అనేక చిత్రవస్తుశాలలలో ఈ నిగూఢమయలిపిలో నున్న వస్తువు లెన్నియో కలవు. వీటిలోని తారీఖులుతప్ప ఇంకేవియు మనకు బోధపడవు. పెరూదేశమునను ఇట్టివ్రాత యారంభమైనది. కాని యింతలో దారములు ముడివేయుపద్ధతి రాగనే యాగిపోయినది; దారపుముడులచే సంగతుల దెలుపుపద్ధతి కొన్ని వేలయేండ్లక్రింద చీనాలో నుండినది. ఈపూర్వ అమెరికనుల నాగరికతవంటిది మన ప్రాచ్యార్యులలోక మందింతకన్న 3, 4 వేల యేండ్లక్రిందనే అనగా క్రీ. పూ. 4 లేక 5 వేలయేండ్లయప్పు డుండెను. ఇచ్చటను గుళ్లు, అందు జాతరలు, జ్యోతిష్కులగు పూజారుల ప్రాబల్యము నుండినవి. కాని మన పూర్వార్యలోకపు సంస్కృతులు మిశ్రితములై, ఆయానాగరికతవారు పరస్పరము

సంగతుల నేర్చి వృద్ధినొందుటచే, ఆధునికనాగరికత కలిగినది. అమెరికాలో మాత్రము ఆదిమవికృతస్థితి అట్లేయుండి, ప్రత్యేక లోకముగా నుండిపోయెను. యూరపియను లమెరికాకు వెళ్లు వరకు, అక్కడి పెరూసంగతి మెక్సికోవారి కసలే తెలియదు; పెరూవారి ముఖ్యాహారమగు బంగాళాదుంపలసంగతి మెక్సికోవారు రెఱుగరు. తరతరములుగా వారట్లు జీవించుచు తమ దేవతల [illegible] విభ్రాంతులై, బలులనిచ్చుచు, జీవనము గడుపుచు [illegible]. ఆమయశిల్పమున మంచి చమత్కృతి అందమును కల[illegible].

వా రావేశముతో యుద్ధము లొనర్చిరి. అతివృష్టి, అనావృష్టి, [illegible]అంటువ్యాధులు, ఆరోగ్యస్థితి, కాలక్రమమున గల్గినవి. అప్పుట గురువులు క్లిష్టగణితములతో పంచాంగముల గణించుచు యజ్ఞములు కర్మకాండ వృద్ధి చేయుచుండిరి. కాని యథార్థాభివృద్ధి యేమియు వారిలో లేకపోయెను.

---

† అమెరికనుల యీపూర్వసంస్కృతిలో కొంత విశిష్టత కలదు. మహా[illegible]లు, అద్భుతశిల్పశక్తి, సుందరచిత్రకళలు, సుసజ్జితప్రాసాదాలు విపుల[illegible]యాలు. చాలవరకవి ప్రాచీన భారతీయుల సంస్కృతిని బోలియున్నవి. [illegible] జ్యోతిర్విజ్ఞానము, తాంత్రికరేఖాదిచిత్రములును అసలు భారతీయము[illegible] [illegible] మహాశిల్పి భారతదేశములోని అసుర ప్రముఖుడు అద్భుత [illegible] తాను విజ్ఞుడుగ ప్రఖ్యాతిగాంచెను. ఇదిగాక. అక్కడి పూర్వనాగరి[illegible]నులును, మనభారతదేశమునుండియే బృహద్భారత ద్వీపములద్వారా [illegible]ట్లు మతసంప్రదాయములు ముఖవర్చస్సు కూడ ఇట్లు స్ఫురింప [illegible], శ్రీ చమనలాలుగారు తమ 'హిందు అమెరికా' అను పెద్ద ఆంగ్ల గ్ర[illegible]లో వివరించినారు.

# 15. సుమేరియా, మిశ్రదేశము, లేఖనము

పశ్చిమార్ధగోళము (అనగా అమెరికా) కన్న, పూర్వార్ధ లోకమెక్కువ విశాలము. మరియు అందవాంతర భేదములు చాల కలవు. (అమెరికాలోని) పెరూ దేశస్థితిని సమీపించు నాగరికత, ఆసియాఖండములోని ఫలవంతములగు అనేక దేశములందు ముఖ్యముగా ఈజిప్టుదేశపు నైలునదీతీరమందు క్రీ. పూ. ఆరేడువేల యేండ్ల క్రిందనే యుండినది. ఆకాలమున ఉత్తరపర్షియా, పశ్చిమతుర్కస్థానము, దక్షిణఅరేబియా దేశము లిప్పటికన్న చాల ఫలవంతముగ నుండినవి. ఈ ప్రాంతములందు చాల పురాతనకాలముననుజను లుండినట్లు నిదర్శనములు కలవు. దక్షిణమున మెసొపొటేమియాలోను ఈజిప్టు అనబడు మిశ్రదేశములో మాత్రము, ఇతరదేశములకన్న ముందే నగరములు దేవాలయములు, మంచిపద్ధతులతో పల్లపు వ్యవసాయము, కొంత నాగరికస్థితియు ఉండినవి. ఆకాలమున యూఫ్రిటీస్ టైగ్రీసునదులు వేరువేరుగానే పారసీకసముద్రములోనికి ప్రవహించుచుండెను. ఈరెండునదుల మధ్యదేశమందు సుమేరియనులు తమ ప్రథమనగరముల నిర్మించుకొనిరి. ఆకాలము నిర్ణయించుట కష్టము; కాని సుమారాకాలమందే ఈజిప్టుచరిత్ర ప్రారంభించెను.

ఈసుమేరియనులు దీర్ఘనాసికులు, గోధుమవర్ణులు; వీరిలిపి యిప్పుడు కొంత బోధపడి, వీరిభాష తెలిసినది. వీరు కంచువాడుక కనిపెట్టిరి; పచ్చియిటుకలతో ఉన్నతగోపురములగు దేవాలయముల నిర్మించిరి. వీరు ప్రశస్తమగు రేవడి

మట్టిపై వ్రాయుటచే, వీరిశాసనాదు లిప్పటికిని భద్రముగా నిల్చియున్నవి. వీరికి పశువులు, గొఱ్ఱెలు మేకలు గాడిదలు నుండినవి; కాని గుఱ్ఱములు లేవు. వీరు బల్లెములు చర్మపు డాలు ధరించి, దృఢవ్యూహములతో పదాతులుగనే యుద్ధము చేయుచుండిరి. వీరివస్త్రములు ఉన్నివి; వీరు తలకు క్షౌరము చేసుకొనుచుండిరి.

ప్రతిసుమేరియను పురమును ఒక ప్రత్యేకరాజ్యమై యుండెను. దానికి వేరే పురదేవత గురువులు నుండిరి; కాని ఒకప్పుడొక నగరపువారు తక్కినవాటిని జయించి ఆపౌరులనుండి పన్నులు వసూలుచేయుచుండిరి. సుమేరియనుల 'ఎరక్' పురరాజ్య మొక సామ్రాజ్యముగా నుండినట్లు, 'నిప్పూరు'లోని పురాణశాసన మొకటి తెలుపుచున్నది; ఇదే లిఖితనిదర్శనముగల ప్రథమసామ్రాజ్యము. ఈరాజ్యపు చక్రవర్తి పారసీకసింధుశాఖ మొదలు ఎఱ్ఱసముద్రమువరకు పాలించెను.

ప్రప్రథమపు వ్రాత చిత్రవస్తువుల రూపముగీసి వాటికి సంజ్ఞ లిచ్చుటతో ఆరంభించినది. నవశిలాయుగమునకు పూర్వమే మనుష్యులు వ్రాయ మొదలిడిరి. ఇదివరలో చెప్పిన 'అజీలియను' శిలల చిత్తరువులలో ఈపద్ధతిసూచన కలదు; వాటిలో చాలవఱకు వేటలు, దండయాత్రలు చిత్రించిరి. ఇందు చాలవరకు నరులవిగ్రహములు పూర్తిగా లిఖించిరి; కాని కొన్నిటిలో లేఖకులు తల, కాళ్లు, చేతులు, వివరముగా చిత్రింపక, మనిషి అని తెలుపుటకు ఒక నిలువుగీతను దానిపై అడ్డుగ ఒకటి రెండు చిన్నగీతలును గీసిరి.

దీనినుండి చిత్రలిపి యేర్పడుట సులభమయ్యెను. రేవటి మట్టిలో కర్రతో వ్రాయుటచే, సుమేరియావారి మట్టిఅక్షరముల ఆకారము కొంతకాలమునకు అసలు వస్తువుల పోలిక లేకుండపోయినది. కాని ఈజిప్టుజనులు గోడలపైనను, ఒక విధమగు బెరడుపైనను చిత్రించిరి. అందు ఆవస్తువులపోలిక నిల్చియున్నది. సుమేరియాలో వ్రాతలో కట్టుగంటముల నాట్లు కోణాకారముగ నుండుటచే సుమేరియను వ్రాతకు 'కునిఫారం వ్రాత'లని పేరువచ్చినది.

తరువాత చిత్రాక్షరములను ఆచిత్రముల అసలువస్తువులకేగాక, ఆమాదిరి యితరవస్తువులకుగూడ వాడిరి. అంతట లేఖనపద్ధతి సులభమయ్యెను; కొన్ని చిత్ర లేఖనస్థలములం దిప్పటికి నట్లు చేయుదురు. అది పిల్లలకు ప్రీతికరము. 'శిబిర' మనుటకు డేరాను, గంటను చిత్రించిరి ; దానినిబట్టి మరొకపదమును గ్రహించగానే పిల్ల లానందింతురు. ఈ సుమేరియనుభాషలో విడియక్షరములుగాక, కొన్నిహల్లులు ఒకయచ్చుతో కలసిపోయి ఏకాక్షరముగా భావింపబడుచు, అమెరికాఖండపు ఇండియనుభాషలవలె నున్నవి; ఈరీతిని ఆభాషలో సంగతులు వ్రాసి భావముల దెలుపుట సులభమయ్యెను. ఈజిప్టువ్రాతయు ఈరీతినే వృద్ధియైనది. ఇట్లు సంయుక్తాక్షరముల నొకేయక్షరముగ వాడు యితరజాతులవారీ చిత్రాక్షరలిపిలో కొన్నిపిల్లైనమార్పుల జేసిరి. సుమేరియనులు'కునిఫారం' ఈజిప్టుదేశీయుల'హీరాగ్లిఫిక్సు' ( = గురులిపి) వీటి సాంకర్యమున ఆధునిక ప్రపంచపు అక్షరమాల లేర్పడెను. చీనాదేశమందు మరొక చిత్రలిపి యేర్పడి

నది; కాని, అక్కడ నేటికిని ప్రత్యేక మొకధ్వని కొకయక్షర ముండుస్థితి రాలేదు.

లిపిజ్ఞానము మానవసంఘాభివృద్ధికి చాల ముఖ్యము. లిపిచే జనుల నిబంధనలు ఏర్పాట్లు న్యాయశాస్త్ర నియమమును నిబద్ధములై, చిరస్థాయి యైనవి. ఒక్కొక్కనగరమే రాజ్యముగ నుండక, రాజ్యము విస్తరించి వ్యాపించుటకును, లిపి సహాయక మాయెను. అవిచ్ఛిన్నమగు చారిత్రకజ్ఞానము కలుగను వీల య్యెను. గుర్వాజ్ఞయు రాజశాసనమును వారిదృష్టిమేరకే గాక, దూరస్థలములకును వ్యాపించి, వారియనంతరముగూడ నిల్చును. ప్రాచీనసుమేరియాలో పాలకులు, రాజవంశీయులు, వర్తకు లును, తమముద్రలను మనోహరముగ చెక్కించుకొని, తమ రేవటిపత్రములపైన ఆసీళ్లను ముద్రించుచుండిరి. ఆరువేల యేండ్ల క్రిందటనే అప్పటినాగరికులలో అచ్చుపద్ధతి సమీపించెను. ఆమట్టి ఆరగానే గట్టిపడి స్థిరమైనది. మెసపొటేమియాలో చాలకాల మిట్లు ఉత్తరములు, శాసనములు, పత్రములు, జమా ఖర్చులెక్కలు మొదలగునవి గట్టియిటుకలపైన పెంకులపైన లిఖింపబడినవి; కనుక, ఆవిషయాలను తెలిసికొనగల్గినాము. పూర్వకాలమందే సుమేరియా ఈజిప్టుదేశీయులకు కంచు, రాగి, బంగారము, వెండియు తెలిసియుండినవి. ఇను మప్పుడు ప్రియమగు విచిత్రపదార్థముగ నుండెను. ఆదేశముల ప్రాచీన పౌరుల దినచర్య లోకేరీతిగ నుండియుండును. పశువులు, గాడిదలు, మచ్చికగ్గాయె యుండుట తప్ప, ఇతరవిషయము లందు అప్పటి సామాన్యజీవనము అమెరికాలో తరువాత 3, 4 వేలయేండ్లవర కుండిన 'మయ' పురములరీతినే ఉండి

యుండును. శాంత పరిస్థితులు కలిగి, జను లుత్సవదినములు తప్ప తక్కిన రోజులం దూడ్పులు కోతలు వగైరాలు చేసుకొనుచుండిరి. వారికి నాణెములు లేవు; అప్పుడు వాటి యవసరమును లేదు. అప్పటి స్వల్పవ్యాపారము సాటాబేరముచే జరిగెను. చాల నాస్తిగల రాజులు ప్రభువులు మాత్రము తమ వ్యాపారావసరముల నిమిత్తమై వెండి బంగారుకడ్డీలను రత్నాదులను వాడుకొనుచుండిరి. అప్పటిజీవితమున దేవాలయమునకు ప్రాముఖ్య ముండెను; సుమేరియాలోని దేవాలయముల దీర్ఘ గోపురముల పైకప్పునుండి నక్షత్రపరీక్ష చేయుచుండిరి. ఈజిప్టులో ఆలయములు అంతస్తులు లేక మహాభవనములుగ నుండెడివి. సుమేరియాలో గురువే యధికారియై, ఇతరు లందరికంటె ముఖ్యుడు సర్వోత్తముడుగ భావింపబడెను. ఈజిప్టుదేశమున మాత్రము గురువులకన్న రాజే అధికుడు; అతనిని దేవుని యవతార మని భావించి, 'ఫారో' యనగా దేవరా జని పిల్చుచుండిరి. ఆకాలపు ప్రపంచమున నంతగా మార్పులు లేవు. ఆ దేశములందు వెచ్చదనము హెచ్చుచుండెను. జనులు కష్టజీవులై, సంప్రదాయబద్ధులైయుండిరి. ఆ దేశములలోని కితరదేశీయు లంతగా వచ్చుచో చిక్కుపడుచుండిరి.

సంప్రదాయప్రకారము జీవితనిబంధనల నేర్పఱచుచు, గురువులు ఆకాశమందు నక్షత్రస్థానమునుబట్టి విత్తుల జల్లు కార్తిని, యాగాదుల ముహూర్తములను, శకునములను గమనించి కలల కర్థము చెప్పుచుండిరి. సామాన్యులు భూత భవిష్యత్తుల దలపెట్టక, తమపనుల జేసికొనుచు, ప్రేమ సుఖము లనుభవించి పోవుచుండిరి. కొందరురాజులు మంచి

వారే. ఈజిప్టులో 90 సం॥లు పాలించిన '2-వ పెపి' అట్టివాడే. ఒక్కొకరాజు అధికారవాంఛావేశము గల్గి, తన రాజ్యపు యువకులను, పొరుగు పురరాజ్యములపై యుద్ధము దోపిడులు చేయుటకై యోధులుగా బంపుచుండెను; లేక వారిచే నిర్బంధపుకూలి చేయించి, మహాభవనముల గట్టించుచుండెను. 'గిజె' వద్దనున్న ఉచ్ఛశిఖరములగు గోరీ కట్టడములు కట్టించిన ఈ చియోప్సు, మిసరినస్, చెఫ్రీన్' గా 'రిట్టివారే; కట్టడము లన్నిటిలో పెద్దది 450 అడుగుల యెత్తుండును; అందలి రాళ్ళ సగటుబరువు 48,83,000 టన్ను లుండును. అందుల సామగ్రులన్నిటిని నైలునదిద్వారా పడవలలో తెప్పించి ముఖ్యముగా ప్రజల కాయకష్టము మూలముననే, ఆస్థలము లందుంచి కట్టించిరి. ఒక మహాయుద్ధమువలన గలుగు శ్రమకన్న, ఈకట్టడములు గట్టుటచే నాదేశీయుల కెక్కువ శ్రమాయాసములు కల్గియుండును.*

---

* (అద్భుతమగు మహాభవనములు చాలపూర్వము మన భారతదేశము నందును నిర్మింపబడి కాలక్రమమున శిథిలములై, భూమిలో కప్పబడి పోయెను; అట్టివి శ్రమసాధ్యములు, నిజమే; కాని యుద్ధశ్రమవలన హత్యలు జనులకు దేశమునకు అపారమగు నష్టము, రక్తపాతము కలుగును. కట్టడములవలన అట్టినష్టములు లేకుండుటేగాక, వాటికై రాజద్రవ్యము వెచ్చింపబడి, చాల మంది ప్రజలకు జీవనోపాధి యేర్పడును)

సుమేరియా యీజిప్టుదేశీయుల 'కునిఫారు' 'హీరాగ్లిఫక్' లిపుల నుండియే, పాశ్చాత్యదేశముల ఇంగ్లీషు మొదలగు భాషలకుపయోగించు రోమను లిపి వగైరా లేర్పడినవి (రోమనులిపి యూరపు, అమెరికా, ఆస్ట్రేలియా, మున్నగు ఖండములలో చాలవరకు వ్యాపించియున్నది.)

మనభారతీయ లిపు లెట్లు వచ్చెనో సందిగ్ధముగ నేయున్నది. 'కునిఫారం' రోమను, ఫారసీ (ఉర్దు), మొదలగు పాశ్చాత్యలిపులన్నిటిలోను 26 అక్షర ములే యున్నవి; (అరవముతప్ప మిగిలిన) మనభారతీయలిపులన్నిటిలోను సుమారు 46 అక్షరము లున్నవి. వాటివరుస గుణితపుపద్ధతులును వేరు. గురుముఖమునుండియే విద్యాభ్యాసముచేయుట వేదకాలమునుండి మనకు సంప్రదాయము: కనుక అందు లిపిప్రశంసలేదు. అంతమాత్రమున ప్రాచీన కాలంలో మనదేశమున లిపి లేదనుటకు వీలులేదు. ఆర్యులు మొదటి వ్రాత కుపయోగించిన భూర్జపత్రముల 'భూర్జ' సంబంధికశబ్దములే యూరపియను ట్యూటను భాషలలో నున్నవి (గ్రంథము అను అర్థపు 'బుక్' పదము 'భూర్జ'కు సంబంధించినదే). అందుచే భారతీయార్యులు యూరపుఆర్యులు విడునప్పటికే ఆర్యులకు వ్రాత యుండె నని ఉభయశాఖలు వ్రాతకు భూర్జ పత్రాలువాడుచుండి రని, సూచితమగును. క్రీ. పూ. సుమారు ఏడవశతాబ్ద మందుండిన పాణిని ముని రచించిన అష్టాధ్యాయి అద్భుతసూత్రరచన లిపివాడ కుండ అట్టి దేర్పడుట అసాధ్యము. ఆనాటికి చాలపూర్వమే, మన 46 అక్ష రములు శాస్త్రీయముగ నమర్పబడి, మనదేశమున బాగుగ అమలులోనుండి నటుల పాణిని ఉదాహరించిన ప్రమాణాలు, 'మాహేశ్వరసూత్రము'ల వల్లను స్పష్టము. పాణినికినిపూర్వము, శాకల్యశాకటాయనాదుల వ్యాకరణములు ప్రాచ్యోదీచ్యాదుల వేరువేరుసిద్ధాంతములుగూడ నుండినవి. అప్పటికి యవన లిపియు నీదేశమున తెలిసియుండి అది 'యవనానీ' అనబడినట్లు, "ఇంద్ర వరుణ................యవన మాతులాచార్యాణామానుక్." (పా. అ 4-1-49) అనుసూత్రమువలనను, "యవనాల్లిప్యాం" అనువరరుచి వార్తి కమువలనను, స్పష్టము. అప్పటికే చాలశాస్త్రములం దేర్పడిన అద్భుతసూత్ర వాఙ్మయము లిపిలేకుండ కుదరదు. క్రీ. పూ. 3-వ శతాబ్దపు 'అశోక' శిలా శాసనములు, మనదేశపు ఆయాప్రాంతపు వేరువేరు లిపులలో వ్రాయబడినవి. సుమేరియాలోవలెగాక మనదేశమున మొదటినుండియు సులభముగా శిథిల మగు భూర్జపత్రములు తాటియాకులుమాత్రము వ్రాతకువాడుటచే, అంతకు

పూర్వము లిఖిత గ్రంథములు నశించిపోయినవి, ఇటీవల సింధుతీరపు మహేంజదలో, హారప్పప్రాంతపు ప్రాచీనశిథిలాలలో క్రీ. పూ. సుమారు నాలుగైదు వేల యేండ్లక్రిందట వాడుకలో నుండిన లిపులు బయట పడినవి. వాటినిబోధపర్చుకొను కృషి జరుగుచున్నది. మన పూర్వపులిపులలో గాంధార (ఇప్పటి అఫ్గనుదేశం)మందు వాడుచుండిన 'ఖరోష్టి' తప్ప తక్కిన ప్రాంతములందలి 'బ్రాహ్మి' లిపి యెడమవైనుండి కుడివైపునకే వ్రాయబడెను. ఈబ్రాహ్మిలిపియొక్క ఉత్తరశాఖనుండి గుజరాతి దేవనాగరి బంగాళీ మొదలగు ఉత్తరభారతలిపులును, దక్షిణశాఖనుండి కన్నడము తెలుగు మొదలగునవియు, ఏర్పడినవి. ఉర్దుతప్ప మిగిలిన భారతీయలిపులన్నియు బ్రాహ్మినుండియే కలిగెను. ఓఢ్రులు, ఆంధ్రులు, కన్నడులు మొదలగువారు భూర్జపత్రముకు ఈకకలముకు బదులు తాటాకును గంటమును వాడుటచే వ్రాతలో తాటాకు పగులకుండుటకై వీరి లిపులలో అడ్డుగీతలు చాలతక్కువగను గుండ్రదనము చాలఎక్కువగను ఏర్పడె నందురు. దేవనాగరి అనబడు నాగరలిపిని గుజరాతి, బంగాళీ, మొదలగు లిపులు చాలవరకును, ఆంధ్రము ఓఢ్రము మొదలగునవి కొంతవరకును, పోలియున్నవి. మరియు దేశమున మొత్తముమీద నాగరలిపినే హిందీ మహారాష్ట్రములకును చాలవరకు సంస్కృతమునకు వాడుచున్నందున, దానివ్యాప్తి తక్కినవాటికన్న చాల హెచ్చు. ఉర్దూలిపి (అరబి పెర్షియను లిపి) మహమ్మదీయులకాలమందు మనకు విరివిగా వాడుకలోనికి వచ్చినది.

యూరపుఖండపుదేశాలలో అనేకజాతులు అనేకభాషలు నున్నను, సుమారు ఖండమంతటను అమెరికాలోను, లిపి మాత్ర మొక్కరీతిదే. మనదేశమేకరాజ్యమయినను హిందీ బంగాళీ తెలుగు అరవము కన్నడము మొదలగు ఆయాప్రాంతీయభాషలకు వేరు వేరులిపులను వాడుదురు. అట్లు మనదేశపు పొరుగుభాషల నేర్చుకొనుట కెక్కువశ్రమపడవలె అందువల్ల దేశీయులలో పరస్పరసమావేశమున కాటంకము కలుగును. ఏకలిపి యేర్పడితే ఈశ్రమ తగ్గును.



# 16. ఆదిమ సంచారులు

క్రీ. పూ. 6 వేలు 3 వేలు ఏండ్లమధ్యను మెసొపొటేమియా ఈజిప్టు మొదలగుదేశములందు జనులు వ్యవసాయమారంభించి, పురరాజ్యముల స్థాపించిరి. నీటిపారుదల సకాలపు పంట వీలగుచోట్ల, సందిగ్ధము శ్రమయుతమునగు వేట సంచారముమాని, జనులు స్థిరజీవన మవలంబించిరి. ఆసియామైనరులోని టైగ్రీసునది పైభాగమునందు, అస్సీరియనులు పురముల నిర్మించిరి. అచ్చటను మధ్యధరాప్రాంతమందును ఉండిన జనులు, నాగరికులైరి. ఈకాలమున భారతదేశమందును చీనాలోను అనుకూలస్థలములందు నాగరికత వ్యాపించెను. యూరపులో గూడ మత్స్యసమృద్ధిగల సరస్తీరములందు వేటాడియు, చేపలబట్టియు జనులు జీవించిరి; కాని అచటినేల యింకను కర్కశమై, గహనములవల్లనో జలములేకనో, స్థిరవాసమున కయోగ్యమై యుండెను; ఋతువులు స్థిరముగాక యుండెను. కనుక, జనులు తమ యల్పపరిజ్ఞానముతోను స్వల్పోపకరణములతోను స్థిరవాసము చేయ లేకుండిరి.

అట్టిచోట్ల ఆకాలపుజనులకు జంతువు లుండుచోట్ల వేటయు, పచ్చికయుండుచోట్ల పశుపాలమును, శరణ్యములయ్యెను. మృగయావృత్తినుండి గోపాలవృత్తి క్రమముగనే వచ్చియుండును. అడవులలో పశువులను (ఆసియాలో అశ్వములను) వెంబడించు జనుల కాజంతువులు తమ సొత్తను భావము కలిగెను; వారు తమవాటిని మైదానములందు పట్టి

కట్టియుంచి యుపయోగించుచు, వృకాది క్రూరమృగముల బారి నుండి గాపాడుచుండిరి.

ఇట్లు నదీప్రాంతములందు కృషిసంస్కృతి వ్యాపించిన ఆ యాదికాలముననే, శీతల మరుభూములనుండి ఉష్ణశాద్వలస్థలమునకు, మరియొక సంచారజాతి బయలుదేరెను. కృషీవలుల కన్న సంచారులు సాధారణముగ నెక్కువ దృఢదేహులు. వారి సంతానోత్పత్తి, జనసంఖ్యయు, తక్కువ; వారికి స్థిరమగు గుడులు లేవు; పూజారుల ప్రాబల్యము లేదు; సామానులు పరికరములు తక్కువ. అంతమాత్రమున వారిసంస్కృతి కర్షకులస్థితి కన్న హీనము కాదు. స్వైరవిహారముచే వారిలో స్వేచ్ఛ, ఆత్మవిశ్వాసము, లోకానుభవమును హెచ్చెను. వారినాయకుని అధికారము హెచ్చుగా నుండెను; కాని వారారోగ్యవంతులు; కనుక వైద్యుల ప్రాబల్య ముండియుండదు.

ఈసంచారశీలురు స్థిరవాసులపురమునకు వచ్చినను తిరుగ నితరస్థలములకు బోవుచు, చిత్రవిచిత్రజనుల జూచుచు, ఇతరజనులతో బోరి, వ్యూహముల బన్ని పచ్చికబయళ్ళను వశపఱచుకొనుచుండిరి. శైలాదులగుండ నిరంతరము సంచరించువారికి క్షేత్రవాసులకన్న ఖనిజలోహజ్ఞాన మధికము; కనుక సంచారులే కంచులోహముల దయారుచేయుటను మొదట కనిపెట్టియుందురు. లోహపుపాడినుండి చేసిన యినుప పనిముట్లు మధ్యయూరపులో నాగరికులు లేనిచోట్లనేదొరకినవి.

అయితే స్థిరవాసులకు వస్త్రములు, పాత్రలు వగైరా నిత్యోపయోగములగు వస్తువులును చాలనుండెను. ఇట్లు వ్యాపించిన యీ భిన్నసంఘములమధ్య కొంతవ్యాపారము

కొంతసంఘర్షమును తప్పదయ్యెను. ముఖ్యముగా సుమేరియాలో సమీపమందే వ్యవసాయభూములును ఎడారులును సరిహద్దుగ నుండుటచే సంచారులగుంపు లాసాగుభూముల ప్రక్కను దిగి, చోరీ, వ్యవసాయము, (మఱియు జిప్సీజాతివారిప్పటికిని జేయుచున్నట్లు) ఒకప్పుడు లోహపాత్ర పరిశ్రమను గూడ, చేయుచుండిరి.

కోళ్ళింకను మచ్చిక కానందున, వారికి పెట్టలు దొరకలేదు. ఈకోళ్లు అసలు హిందూదేశాటవులలోనుండి క్రీ. పూ. 1000 ఆప్రాంతమున మచ్చిక కానారంభించినవి. భారతీయులు లోహవస్తువులను, తోళ్ళను, అమూల్యరత్నాదులను సరఫరాచేసిరి. మృగయులు బాగుచేయని తోళ్ళను దెచ్చెడివారు; వాటికి బదులుగ అద్దములు, గాజు వస్తువులు పాత్రలు, దుస్తులు మొదలగు తయారువస్తువుల నీసంచారిజనులు గొనిపోయెడివారు.

సుమేరియా యీజిప్టులలో నిట్లు ప్రథమనాగరికత వ్యాపించెను; ఆకాలమున ముఖ్యముగా మూడుసంచారిజాతులస్థలము లుండెను. యూరపులోని దూరపు టడవులందు వేట పశుపాలన చేయు అనాగరకులగు ఒకజాతి నుంచరార్య లుండిరి. క్రీ. పూ. 1500 లకు పూర్వము ఈజాతిని గూర్చి యప్పటినాగరికులకు తెలియదు. తూర్పు ఆసియాలో హూణులు మంగోలియనుజాతులు అశ్వారూఢులై, వేసవిలో కొన్ని చాలదూరప్రాంతములకును సంచరించుచుండిరి. ఆర్యజాతికి హూణజాతికిమధ్యను, అప్పటి రష్యాలోని మురుగుస్థలములు విశాలమగు కాస్పియనుసముద్రము నుండెను. అందుచే,

ఈరెండుజాతుల కప్పుడు సమావేశము కలిగియుండదు. అప్పటికి రష్యా చాలవరకు జలావృతమై యుండెను; సిరియా అరేబియాలలోని యెడారులు క్రమముగ నింకను నిర్జలములయ్యెను; అంతట, అందలి గోధుమవర్ణులగు 'సెమిటిక్' జనులు తమ మేకలు, గొఱ్ఱెలు, గాడిదలు పచ్చికబయళ్లుండు ప్రాంతములకు తోలుకొనిపోవుచుండిరి. ఈ సెమిటికు గొల్లలును 'ఎలమైటు' అనబడు దక్షిణపర్షియాలోని నీగ్రో జాతివారును ఆదిమనాగరికుల ప్రాంతమునకు ప్రథమమున వచ్చిన సంచారిజాతులు; వీరు వ్యాపారము, దాడికూడ చేయవచ్చిరి. చివరకు వీరినాయకులు కొందరు దేశముల జయింపనారంభించిరి. క్రీ. పూ. 2750 ప్రాంతమున 'సార్గను' అను గొప్ప సెమిటికునాయకు డొకడు సుమేరియా ప్రాంతమును జయించి, పారసీక సింధుశాఖ మొదలు మధ్యధరాతీర ప్రాంతమువరకున్న దేశముల కన్నిటి కధికారి యాయెను. చదువు నాగరికత లేని యితనిపరివారమువారగు 'అక్కేడియనులు' సుమేరియనులలిపిని నేర్చుకొని, తమరాజకీయములకును, విద్యావిషయములకును. సుమేరియనుల నియమించుకొనిరి. తరువాత రెండుశతాబ్దముల కాసామ్రాజ్యము క్షీణింప, 'ఎలమైటు' జాతివారు విజృంభించిరి. ఆపైన 'అమురైట్ల'ను వేరొక సెమిటికుజాతివారు క్రమక్రమముగా సుమేరియా కధికారులై, యూఫ్రెటీసు నదీముఖము నొద్ద అప్పటికి చిన్నపురమగు 'బాబిలను'ను తమ రాజధానిగా జేసికొనిరి. వారిరాజ్యము మొదటి బాబిలనుసామ్రాజ్య మనబడుచున్నది. క్రీ. పూ. 2100 ప్రాంతమున ఈరాజ్యమును 'హమ్మురబి చక్రవర్తి' బలపరచి, కొన్ని చట్టముల నేర్పఱచెను.

ఇవియే చరిత్రలో మనకు తెలిసియున్న మొదటిచట్టములు. నైలునదీప్రాంతపు యిరుకులోయలు మెసపొటేమియాయంత సులభముగా సంచారిజాతుల పాలబడలేదు; కాని 'హమ్మురబి' పాలనకాలమందే యీజిప్టునుగూడ సెమిటికులు జయించిరి. అందు గోపరాజులు అని అర్థమిచ్చు 'హిక్సోస్'ల రాజవంశ మేర్పడినది. పూర్వపు ఈజిప్టురాజులకు 'ఫారో' లని పేరుగలదు. ఈహిక్సోస్ రాజ్యము కొన్ని శతాబ్దములుండెను. ఈజాతివా రెన్నడును ఈజిప్టువారి ఆచారభాషాదు లభ్యసింపలేదు, ఈజిప్టు జనులు హిక్సోస్ వారి ననాగరికులగు విదేశీయులుగ నెంచుచు, చివరకు క్రీ. పూ. 1600 ప్రాంతమున తిరుగబడి, వారిని తమ దేశమునుండి తరిమివేసిరి.

సుమేరియాలో సెమిటికుజాతివారు స్థిరులై, ఆదేశీయు లలో కలసిపోయిరి; బాబిలనుసామ్రాజ్యమున సెమిటికువారి వేషభాషలే వ్యాపించెను.



# 17. మొదటిసాగరికులు

ప్రథమ సాగరనౌకలు సుమారు 25 లేక 30 వేల యేండ్లక్రిందట ప్రపంచమున ప్రారంభమై యుండును. నవశిలాయుగారంభమునకే జనులు చర్మపు తిత్తులతోనో, మొద్దుల సాయముననో తెప్ప లిప్పుచు, నీటిపై తిరుగుట మొదలిడిరి. ఈజిప్టు సుమేరియాదేశములందు గంపవలె అల్లి చర్మముకప్పులోను చొప్పతాటితోను బిగించిన పడవలు మొదటినుండి వాడుకలో నుండెను; అట్టి పడవ లిప్పటికిని ఆ దేశములందును ఐర్లండులోను, వేల్సులోనుగూడ, కలవు. సీలు అను మహాతిమింగలపు చర్మముతో చేసిన పడవలతో, అమెరికా ఆసియాలమధ్య నున్న బెహిరింగు జలసంధిపైన, మనుజు లిప్పటికిని దాటుచున్నారు. క్రమముగా ఉపకరణములు బాగుపడి, పెద్దగుల్లదుంగలు వాడుకలోనికి వచ్చెను. తరువాత సహజముగ పడవలును, ఆపైన నోడలును, నిర్మింపబడినవి. ప్రపంచమంతటను జలప్రళయగాథ మధ్యధరాతలపు సముద్రవ్యాప్తిని సూచించునట్లే, 'నోవా' పడవగాథ పురాతనకాలపు నౌకానిర్మాణమును జ్ఞాపిక గావచ్చు.

ఈజిప్టులో పిరమిడులు కట్టుటకు పూర్వమే ఎట్లుసముద్రమునైనను, క్రీ. పూ. 7 వేలయేండ్లకే పారసీక సింధుశాఖలోను మధ్యధరా ప్రాంతమందును, నావ లుండినవి. ఇవి చాలవరకు పల్లెవాండ్ర నావలే; కొన్ని వ్యాపారనావలు, కొన్ని

యోడ దొంగలవియు నుండెను. మొట్టమొదటి సముద్ర నావికులు సహజముగ వీలైనచోట్ల దోపిడి చేయుచు, అందుకు వీలు కానిచోట్ల వ్యాపారము చేయుచుండియుందురు.

ఈ మొట్టమొదటి నావికులు స్థలమధ్యపు సముద్రములపైనే చరించుచుండిరి. అందొకప్పుడు గాలి వీవకను, తరుచు యెదురుగాలులనను సముద్రయానము మందమై, మొదట తీరము వెంటనే జరుగుచుండెను. పెద్దపెద్ద కొయ్యలు మాస్తులు కలిగి మహాసముద్రము దాటిపోగల నావ లిటీవల 4 శతాబ్దములు క్రిందనే యేర్పడి, వాడుకలోనికి వచ్చినవి. పూర్వపు ఓడలను తీరమువెంట లాగుచు, తుపాను పొడగట్టగనే రేవుకు చేర్పవలసియుండెను. ఈపడవలు బాగుచేయబడి, పెద్ద నౌక లగుచున్నను. ఇంతలో యుద్ధపుబందీలు బానిసలై, ఆ యోడలలో పనిచేయ మొదలిడిరి.

సిరియా అరేబియా ప్రాంతములందు సెమిటిక సంచారి జాతివారు ప్రవేశించి సుమేరియాను జయించి, అందు మొదటి అక్కేడియనుసామ్రాజ్యమును, తరువాత మొదటి బాబిలోని యనుసామ్రాజ్యమును, స్థాపించిరిగదా! ఈ సెమిటికులే పశ్చిమ ప్రాంతమున సముద్రయాత్ర చేయుచు, మధ్యధరాసముద్రపు తూర్పుతీరములందు టైర్, సిడన్ మొదలగు రేవుపట్టణముల బాగుగా స్థాపించిరి. బాబిలనులో హమ్మురబి పాలించునప్పటి కీసెమిటికులు వర్తకులుగ యాత్రికులుగ వలసజనులుగను వెళ్ళి, మధ్యధరాసముద్రము కన్ని వైపులను వ్యాపించిరి. నాగరికులగు నీసెమిటికువారికి 'ఫినీషను' లని పేరు; వారు స్వేయుచు దేశము వచ్చి, అంతంతకు పూర్వ ముండిన 'ఐబీరియను, బాస్కు' జాతు

లను ఆదేశమధ్యమునకు నెట్టి, జిబ్రాల్టరుజలసంధిద్వారా తీరస్థలము లన్నిటిపైన దాడి సల్పుచుండిరి. ఉత్తరాఫ్రికాతీరము లందు వీరు స్థాపించిన వలసపట్టణములలో ముఖ్యమైనది 'కార్తేజి'; దీనినిగూర్చి ముస్ముందు చెప్పబడును.

కాని మధ్యధరానావికులలో ఫనీషనులే మొదటి వారు కారు. ఆ సముద్రతీరములందును ద్వీపములందును, అప్పటికే అనేకపురములను మహానగరములను, పశ్చిమ ప్రాంతపు 'బాస్కు'లు, దక్షిణప్రాంతమందలి 'బెర్బర్లు', 'ఈజియనులు', మిశ్రదేశీయులు, వగైరాలు స్థాపించిరి; వీరందరును భాషాకర్మాదులందు సన్నిహితులైన ఒకేజాతివారు. వీరు తరువాత మనచరిత్రలోనికి వచ్చెడు గ్రీకులకన్న పూర్వులై, గ్రీసు ఆసియామైనరుప్రాంతము లందుగూడ 'మైసీని, ట్రాయ్' మొదలగుపురములగట్టిరి; మఱియు 'క్రీట్ ద్వీప' మందలి 'నోసస్' అనుచోట నొకమహానగరము కూడ నిర్మించిరి.

పురాతత్వజ్ఞులచటి ప్రాచీనశిథిలముల నీయర్థశతాబ్దిలో త్రవ్వించి పరిశోధించి, ఆయీజియనుప్రాంతపు జనుల వ్యాప్తిని నాగరికతను గ్రహించిరి; నోసస్ పూర్తిగా శోధింపబడినది. ఆస్థానమున తిరుగ మరియొకపుర మేర్పడ లేదు. కనుక, నోసస్‌నగరపు శిథిలములిప్పటికిని నిల్చి, ఆ విస్మృతనాగరికతను గూర్చి మనకు తిరిగి తెలియుటకు ముఖ్యాధారమైనవి.

నోసను యీజిప్టులచరిత్ర అతిప్రాచీనము; క్రీ. పూ. 400 ప్రాంతమున, ఈ రెండుదేశములును సముద్రముపై తీవ్రముగా వ్యాపారము సాగించుచుండెను. క్రీ. పూ. 2500 నాటికి,

అనగా మొదటిసార్గను ప్రభువు హమ్మురబీచక్రవర్తి వీరి మధ్య కాలమున క్రీటునాగరికత అత్యుచ్ఛదశలో నుండెను.

నోససుకు ఒకనగర మనుటకంటె, అది క్రీటునురాజులయొక్కయు, ఆతని ప్రజలయొక్కయు, మహాప్రసాద మనదగును; దానిచుట్టును అప్పుడు కోటలేదు; తరువాత ఫినీషనులు బలవంతులైనమీదటను, క్రొత్తగా ఓడదొంగలుగావచ్చు గ్రీకుల బాధలవలనను, ఈ క్రీటు ప్రాసాదమగు 'నోసను'నకు ప్రాకారము కట్టబడెను. ఈజిప్టురాజులకు 'ఫారో'వలె ఈ క్రీటురాజులకు 'మినోస్' అను బిరుదుండెను. ఆతని ప్రాసాదములోనికి (ఇతరుల కప్పటి కలభ్యములగు) నీటిప్రవాహము, స్నానపుగదులు, మొదలగు సదుపాయములుండెను; అందు పెద్ద యుత్సవప్రదర్శనములును జరుగుచుండెను. స్పెయినుదేశమం దిప్పటికి జరుగు ఋషభయుద్ధము అప్పటి క్రీటులో జరుగుచుండెను. ఆ యోధుల దుస్తులలోగూడ పోలికయుండెను; దేహపరిశ్రమాలయములుండెను. ఆస్త్రీలదుస్తు లిప్పటిస్త్రీలదుస్తులరీతినేయుండెను. వారు రవికలను కుచ్చులదుస్తులను ధరించుచుండిరి. ఈ క్రీటనుల కలశములు, బట్టలు, రాతికట్టడములు, చిత్తరువులు, నగలు, దంతపు సామానులు, లోహములు, చమ్కాపనులు ఇట్టివి తరచు అతి మనోహరములై యుండెను. వారి వ్రాత మన కింకను బోధపడుట లేదు. ఈసుందరనాగరకత యిట్లు సుమారు రెండువేలయేండ్లు గడచెను. క్రీ. పూ. 2000 యేండ్ల ప్రాంతమున నోససులోను, బాబిలనులోను, జనులు నాగరికులై, ప్రదర్శనములను ధార్మికోత్సవములను చూచుచుండిరి; బానిసలు ఇంటిచాకిరిని, కార్మికదాసులు నౌకరీని చేయుచుండ క్రీటనుపౌరులు ఆనందించుచుండిరి. చక్కని

యెండ నిర్మలాకాశముగల ఆ క్రీటువాసులకు జీవనము చాల భద్రముగ దోచియుండును. అర్ధనాగరికమై గోపరాజపాలితమగు ఈజిప్టు దీనియెదుట దినదీపమును బోలియుండెను. రాజకీయముగ, సెమిటికు జాతివారు ఈజిప్టును బాబిలనునుగూడ పాలించుచు, టైగ్రిసు ఉత్తరభాగమున 'నినేవా నగరము' నిర్మించి పశ్చిమమున హెర్క్యులీసు స్తంభము లనబడిన జిబ్రాల్టర్ జలసంధివరకును నావలపై బోవుచు, ఆ దూర దేశ తీరములందు తమ వలసపురముల నిర్మించిరి. నోససులో కొందరు బుద్ధిశాలురగు మహాశిల్పులు నుండియుండిరి. 'డేడలస్' అను క్రీటుసు విశ్వకర్మ యొక్క డోక విమానమును కల్పించినట్లు, అది చివరకు చెడిపోయి సముద్రములో బడినట్లు, తరువాత గ్రీకులు కొన్ని గాథల చెప్పుచుండిరి. అది గ్లైడర్లనబడు చిన్న విమాన జాతివేమో! నోససులోని అప్పటి జీవితమునకు మన ప్రస్తుత జీవితమునకు గల సామ్యభేదముల గమనింతము. క్రీ. పూ. 2500 కు పూర్వమందిన క్రీటుసుమహాశయులకు ఇనుము ఆకాశమునుండి విచిత్రముగ పడు వ్యర్థవస్తువుగా తోచెను. ఇనుము ఉల్కల నుండి యెన్నడో పడుటయేగాని, అప్పటి కింకను గనులలోనుండి త్రవ్వి తయారుచేయుట లేదు. ప్రస్తుతపు జీవితమో సర్వత్ర అయఃప్రధానమై యున్నది. క్రీటునులకు గుఱ్ఱము విచిత్ర పౌరాణికమృగ మని, నల్లసముద్రమున కావలి శీతదేశమం దుండు గార్ధభ విశేష మని, తోచియుండును. ఈజియను గ్రీసు ఆసియామైనరులు మాత్రమే వీరి నాగరికప్రపంచము. ఈ దేశములందలి లిడియనులు, కేరియనులు, ట్రోజనులు ఒకేవిధ భాషల గలిగియుండిరి. స్పెయిను ఉత్తరాఫ్రికాలోని ఫనీష

నులు, ఈజియనులు, క్రీటనులకు దూరస్థులు. ఇటలీ అప్పటి కింకను నిబిడారణ్యమయమై, నిర్జనమై యుండెను. (గోధుమవర్ణు లగు ఎట్రుస్కనులు ఆసియామైనరునుండి అక్కడికి కింకను వెళ్ల లేదు.) ఈ క్రీటను పౌరుడు తన రేవుకు వెళ్లినపుడు ధవళ సుందర దేహులై నీలనేత్రులగు విచిత్రదాసజనుల జూచి యుండవచ్చు; ఆ బానిసలభాష క్రీటనులకు బోధపడియుండదు. వారు నల్లసముద్ర పుటావలి అనాగరికవనచరులని తోచియుం డును. కాని యీ నూతనజనులు ముందు మనము చర్చింప బోవు ఆర్యజాతీయులు; వారి విచిత్రభాషనుండియే సంస్కృ తము, పారసీకము, గ్రీకు, లాటిను, జర్మను, ఇంగ్లీషు మొదలగు ప్రపంచమందలి ముఖ్యభాషలు పరిణమించి ఏర్పడినవి. నోసను ఉచ్చదశలో నున్నపుడు, అచ్చట నిట్లు క్రీటనులు బుద్ధికుశలురై, ఉత్సాహులై, సుఖులై యుండిరి; కాని క్రీ. పూ. 1400 ప్రాంతమున హఠాత్తుగ నేదో విపత్తు కలిగి, వారి మినాస్ ప్రాసాదమంతయు నిర్మూలమయ్యెను. అప్పటినుండి అందు పుర మేర్పడలేదు; జను లచ్చట తిరుగ ఇండ్లుకట్టి వాసము చేయలేదు. ఈవినాశ మెట్లు తటస్థించెనో మనకు తెలియదు. పరిశోధకు లచ్చటి ప్రాచీనవస్తువుల బరీక్షింప, ఆపదార్థములు చెదరియుండి కొంత దోపిడిచిహ్నములు, అగ్నిప్రమాద చిహ్న ములుగూడ, కానబడుచున్నవి. ఇవిగాక ప్రధ్వంసకమగు భూకంపమును కలిగినట్లు తోచును. ఈనోసస్ వినాశమును ప్రకృతియే జరిగించెనో, లేక భూకంపనష్టమును గ్రీకులు పూర్తి చేసిరో తెలియదు.*

---

* పురాతనకాలమున పాశ్చాత్యదేశములందుండినట్లే మనదేశమందును చిన్ననావలుండెను. 'పుట్టి' అను పేరుతో చిన్ననావలిప్పటికిని మన దక్షిణ

హిందూదేశమునగూడ అచ్చటచ్చట వాడుకలోనున్నవి. 'పుట్టి మునుగుట' అనగా ప్రమాదము అనుఅర్థమున కాయాచారమే కారణమై యుండును.

మనభారతదేశమందును, చుట్టుపట్లు ద్వీపములందును, ఆర్యజాతికాక నీల గోధుమవర్ణులగు కొన్నియితరజాతులవారు చారిత్రకకాలమునకు కొలదివేల యేండ్లపూర్వమే యుండిరి. దస్యులను నల్లజాతివారుండిరని, వారార్యులతో తరచుపోరాడుచుండి రని, ఆర్యుల పరస్పర కలహములలో వారు పాల్గొనుచుండిరని, ఋగ్వేదసంహితలోనే వివరింపబడినది, వారార్యులుకారని తోచును. శ్రీరాముని కాలమున, వానరులని రాక్షసులని మధ్యదక్షిణదేశములందు రెండు వేరుజాతులవారుండిరిగదా? వీరు నరజాతివారే; వానరులు ద్రావిడులపూర్వికులు, రాక్షసులు ఇంకొక ఆదిమజాతివారు, అని కొందరనుచున్నారు. రాక్షసులు నల్లవారు, బలిష్ఠులు, వికృతభీకరరూపులు, మహాకాయులు, నిశాచరులు, నరభక్షకులు, పచ్చిమాంసము దినువారు, మాయోపాయులుగ నుండిరి. దక్షిణమున వీరిప్రాబల్య మధికముగ నుండెను; ఇట్టివా రిప్పుడీ దేశములో లేరు; మధ్య ఆఫ్రికాలోను (హాటెంటాటులు), బోర్నియో మున్నగు కొన్ని ప్రాచ్యదీవులలోను, ఉన్నారు. నీగ్రోలు వారిని కొంత పోలియుందురు. పూర్వము మన దక్షిణదేశమునకు ఈద్వీపములతోను అఫ్రికాతోను భూసంపర్క మునుండెను. వారు నౌకాయానదక్షులు. ఈయాదిమద్రావిడజాతులవారి కాప్రాంతములతో రాకపోక లధికముగ నుండెను. ఆమధ్యభూతలములు భూకంపాదులచే క్రమముగా సముద్రములోనికి దించుకొనిపోయి, భూసంబంధము తగ్గిపోయెను. (తూర్పుదీవులందును జపానుదీవులందునుగూడ అగ్నిపర్వతప్రకోపముచేతను భూకంపములవలనను ఆప్రాంతముల భూస్వరూపము చరిత్రకాలమందును ఇప్పటికినిగూడ మారుచునేయున్నది. సుమా రరువదేండ్లక్రిందటనే ప్రాచ్యదీవులలోని 'క్రకటవ్' అనుద్వీపమున గొప్పఅగ్నిపర్వతప్రకోపమును వందల కొలది మైళ్లవరకు మహాకల్లోలమును కలిగి ఆద్వీపమే మూడువంతులు కనబడ

కుండ మునిగిపోయెను. సముద్రమధ్యమందీరీతిని దూరమునకనబడిన అగ్నిజ్వాలలనే 'బడబానల' మని పూర్వులనుచుండిరేమో తెలియదు. ఆభూసంపర్కము పోయినతరువాతగూడ. మనదేశములకును ఆప్రాంతములకును సముద్రనౌకలపై రాకపోకలు జరుగుచునే యుండెను. మన ఆదిమజాతివారికి ప్రత్యేకభాషలు నుండెను. ఆభాషాకుటుంబమునకు 'ముండా' భాష లనిపేరు. ఇప్పటి కొండజాతులు ఆటవికులు వాడు విచిత్రభాషలలో కొన్ని ఈభాషాకుటుంబములోనివే. నేటికిని వీరివేషములు ఆచారములుగూడ విచిత్రములు. ఇప్పటి కారు వేలయేండ్లకు చాలపూర్వమే మనదేశమందు ఆర్యేతరులకు వ్యవసాయము నాగరికతయు, మయనాగరికతనుగూర్చి లోగడచెప్పిన ప్రత్యేకచిహ్నములును ఉండినవి ఆదిమజాతియు ద్రావిడజాతియు చాలకాలముక్రిందటనే కొంతవరకు మిశ్రితులైరి. వారు నగరములను మహాప్రాసాదములనుగూడ కట్టుచుండిరి. సింధునదీతీరమున ఇటీవల పురాతత్త్వజ్ఞులు కనిపెట్టిన 'హరప్ప' 'మహేంజదరో' శిథిలములు సుమా రారువేలయేండ్ల కింకను పూర్వపువి ఇవి ఆర్యులవి కావని చాలమంది పరిశోధకుల యభిప్రాయము. ఆజనులు నాగరికసౌకర్యములలో నొప్పుచుండిరి. 'నోసను', నాగరికతగూర్చి పైనచెప్పిన విశేషములన్నియు ప్రత్యేకలిపి గూడ ఈహరప్పమహేంజదరో లో నుండెను; మహేంజదరో గూడ అగ్నిప్రమాదముకో భూకంపముకోలోనై హఠాత్తుగ నేనశించియుండును. అప్పటి భారతదేశమునగూడ నౌకలు విచిత్రవిమానము లుండినట్లు ప్రాచీన సంస్కృతపాలీగ్రంథములబట్టి కనబడును. వీటి నిర్మాణమును వీటిలోని రకములనుకూడ కొన్ని ప్రాచీనశిల్పగ్రంథములలో సూచింపబడినవి. మహేంజదరో కాలముకన్న నింకను చాలప్రాచీనులు మనదేశపు కొన్నిప్రాంతములం దుండినట్లు నిదర్శనములు గలవు. మధ్యధరాప్రాంతము సుమేరియా యీజిప్టులప్రాంతములకన్న పూర్వమే గాంధారదేశమున గోధుమపంట విశేషముగ నుండినటుల జీవరసాయనశాస్త్రజ్ఞులగు డా॥ హాల్డేను

గారు తలచుచున్నారు. దక్షిణహిందూదేశమందుగూడ ఆర్యేతరులగు ఆదిమద్రావిడుల నాగరికత పురాతనకాలముననే వ్యాపించియున్నటుల ఇటీవల 'ఆడిచనల్లూరు' వద్దను మద్రాసురాష్ట్రములోని యితరస్థములందును భూమిలోపల దొరకిన శిథిలములును సూచించుచున్నవి. ఈ యాదిమ ద్రావిడులను సుమేరియా బాబిలను రోము ఆఫ్రికా మొదలగు దూర దేశములతో సముద్రముపైన విశేషవ్యాపార ముండెను. ఈ ద్రావిడులకు 'శెన్‌దమిళ్' అనబడు పూర్వపు అరవమున స్వతంత్రమగు ప్రాచీనవాఙ్మయము నుండెను.

ఇట్టిస్థితిలో ఆర్యులు ఋగ్వేదకాలమునుండి, అగస్త్యభరద్వాజ పరశురామాదుల నాయకత్వమున క్రమముగా వింధ్యగిరికి దక్షిణప్రాంతపు ప్రదేశములందుగూడ ఆశ్రమములను వలసస్థానములను ఏర్పఱచుకొని చివరకు మహాభారతయుద్ధకాలమును పూర్వమే భారతదేశమంతటను వ్యాపించిరి. మొదట ఆర్యులకు ఆప్రాంతీయులకు మధ్య తీవ్రసంఘర్షణము జరిగినను, కాలక్రమమున ఈజాతులన్నిటిమధ్య పరస్పరసంబంధ మధిక మయ్యెను. మహర్షులకాలమునగూడ జాతిమిశ్రణము కలిగినట్లు మహాభారతాదులందు సూచనలు కలవు. క్రమముగా ఆర్యనాగరికత ద్రావిడాదులలోను, ద్రావిడాదినాగరికత ఆర్యులలోను వ్యాపించి, ప్రస్తుతపు (మిశ్రిత) భారతీయనాగరికత యేర్పడెను. విపులదేవాలయనిర్మాణము, విగ్రహారాధనము, స్త్రీదేవతాపూజ మొదలగునవి వేదసంహితలు మొదలగు ఆర్యుల అతిప్రాచీన గ్రంథములం దెక్కడను ఉదహరింప బడలేదు. ఈసంస్థలును, తాంత్రికవిజ్ఞానము, కృషిలో ప్రత్యేకకౌశలము, శిల్పసామర్థ్యము, మహోదధియాత్రాపద్ధతి, కొన్నివివాహపద్ధతులు మొదలగునవి ద్రావిడులనుండి ఆర్యులలోనికి వ్యాపించియుండు నందురు. శివపూజ, వృషభసర్పాదులపూజగూడ, ఆదిమద్రావిడజాతుల నుండియే ఆర్యులకును

వచ్చె ననియు, కొందరు విమర్శకులు తలచుచున్నారు. (వేదసంహితలందు మొదటి ఉపనిషత్తులయందు రుద్రప్రశంస యున్నను, శివలింగపూజ ఆరుద్రునికి శివునిస్వరూపము శివశంకరాదినామములుగూడ అందు ఆరదు.) ఆంధ్రద్రావిడదేశములం దప్పటికి శైవమతము బాగుగవ్యాపించి యుండెను. ఇట్లే ఆర్యుల ఆచారములు మతము ద్రావిడులలోను వ్యాపించెను; కాని యుత్తరమధ్యదేశములవలె గాక, మనప్రాంతమందును కేవల దక్షిణదేశమందును, ద్రావిడభాషలు, ఆసంప్రదాయము, మేనరికము దౌహిత్రభాగినేయాదిదత్తత, ఇల్లరికము, రాక్షసవివాహము మొదలగు ప్రత్యేకద్రావిడాచారము లిప్పటికిని నిల్చి, ఆచారసిద్ధముగ అంగీకరింపబడియున్నవి. గ్రామదేవతాపూజలు అమ్మవారిజాతరలలో జంతుబలులు వీటిలో నిమ్నజాతులు (వారితో సంపర్కముగల మధ్యజాతివారు కొంతవరకును) పాల్గొనుచుందురు. దక్షిణపు బ్రాహ్మణులలోమాత్ర మస్పృశ్యుల సమీపింపకుండుట, దృష్టిదోషము, కొన్ని శాకముల వర్జించుట మున్నగు తీవ్రాచారము లున్నవి; కాని, ఇచటి నిమ్నజాతులలోను కొండజాతులలోను ఆర్యనాగరికత యిప్పటికిని స్వల్పము. ఆంధ్రదేశ మీ రెంటికిని మధ్య నుండుటచే మనప్రాంతమున ఆర్యద్రావిడనాగరికతలు విశేషముగ మిశ్రితములై యున్నవి చారిత్రకకాలము వచ్చునప్పటికే భారతీయులనాగరికత ఇట్లు మిశ్రితమై దేశమంతటను స్థిరపడి, అప్పటి భారతీయుల నౌకాయానవ్యాపారాదులచే అన్యదేశములకుగూడ వ్యాపించెను.



# 18. ఈజిప్టు, బాబిలను, అస్సీరియా

సెమిటికు గోపరాజుల యధికారమునకు మిశ్రదేశీయు లెన్నడును విధేయతతో సమ్మతింపలేదు. క్రీ. పూ. 1600 ప్రాంతమున నొక తీవ్ర జాతీయోద్యమము బయలుదేరి, ఆవిదేశీయుల వెడలగొట్టెను. అంతట నచట (ఈజిప్టులో) కొత్తనాగరికత ప్రారంభించెను. ఈశకమును ఈజిప్టు చారిత్రకులు "నవసామ్రాజ్య" మని చెప్పుదురు. హిస్కోసు దండయాత్రకు పూర్వము విచ్ఛిన్నమైయుండిన ఈజిప్టు ఇప్పు డైకమత్యము గలదాయెను. పరిపాలకులపైన జరిగిన విప్లవమును యుద్ధోత్సాహము ప్రబలెను. 'ఫారో' చక్రవర్తులు దండయాత్ర లారంభించిరి. హిస్కోసు తెచ్చిన రణాశ్వములును యుద్ధరథములునుగూడ వీరికి దొరికెను. '3-వ థాథ్మిస్' '3-వ ఎమెనాఫిస్' రాజుల క్రింద ఈజిప్టు సామ్రాజ్య మాసియాలో యూఫ్రిటీసు నదీతీరమునకు వ్యాపించెను.

అంతవరకు సంపర్కము లేకుండిన మెసపొటేమియా నాగరికతకును, నైలు ప్రాంతపు(ఈజిప్టు)నాగరితకును,సంఘర్షణము ప్రారంభించెను. మొదట యీజిప్టే పైచేయిగా నుండెను. 17-వ రాజవంశమున "థాథ్మిస్," "3-వ ఎమెనాఫిస్" రాజులును, "4-వ ఎమెనాఫిస్" "హాతసు" అను మహారాణియు, పాలించిరి. 19-వ రాజవంశమున "రెండవ రమేశస్" 67 సం॥లు రాజ్యముచేసి, ఈజిప్టును మహోచ్ఛదశకు తెచ్చెను. ఈ "రమేశస్" బైబిలుచరిత్రలో మోసెస్‌కు సంబంధించిన "ఫారో" అని కొందరి తలంపు.

అవాంతరకాలమందు ఈజిప్టులో క్లిష్టస్థితి కలుగుచుండెను. ఒకసారి సిరియనులువచ్చి యాక్రమింప, తరువాత దక్షిణము (మధ్యఆఫ్రికా) నుండి "ఎతియోపియనులు" వచ్చి ఈజిప్టును జయించిరి. మెసపొటేమియాలో బాబిలనురాజులు పాలించుచుండిరి; తరువాత హిట్టైట్లును, అంతట డెమాస్కసునగరపు సిరియనులును, తాత్కాలికముగనుచ్ఛదశకు వచ్చిరి. నినేవానగరమొక్కపుడితరులచే జయింపబడెను; మరియొక్కపుడచ్చటి అస్సీరియనులు బాబిలనును బాలించి, ఈజిప్టుపైగూడ దండయాత్రలు సలిపిరి. ఇట్లు మిశ్రదేశసేనలు, ఆసియామైనరు, సిరియా, మెసపొటేమియాలలోని వివిధసెమిటికు రాజ్యసేనలు, దాడులకై వచ్చిపోవుచుండెను. వారిసేనల కప్పుడు యుద్ధరథాశ్వములు నుండెను. అప్పటికి గుఱ్ఱములను మధ్యఆసియానుండి యీ ప్రాచీననాగరికదేశములకు రప్పించి, యుద్ధములకును గౌరవకార్యములకును వాడుచుండిరి.

ఆకాలమందు నినేవానగరవిజేత, "మితన్నీ పురరాజు" అగు "తుష్రట్టా ప్రభువు", బాబిలనును జయించిన అస్సీరియా రాజగు మొదటి "తిగ్లత్ పిలేసరు" మొదలగు మహారాజులు నుండిరి; చివర కస్సీరియను లందరికన్న నధికబలిష్ఠులైరి. వీరి "3-వ తిగ్లత్ పిలేసరు" రాజు క్రీ. పూ. 745 వ సం॥ మున బాబిలనును జయించి, నూతనసామ్రాజ్యమును స్థాపించెను. అప్పటి నుత్తరప్రాంతములనుండి నాగరకదేశమున ఇనుము కూడ వాడుకకువచ్చెను; ఆర్మీనియనుల పూర్వికులగు "హిట్టైటు" జాతివారు ఇనుమును మొదట దెచ్చుకొని అస్సీరియనుల కందజేసిరి. నీచస్థితినుండి వచ్చిన అస్సీరియను విజేతయగు

"రెండవసార్గను" తన సేనల కినుపయాంయుధముల నిచ్చెను. ఇట్లు, అయోమయాంయుధములతో రక్తపాత మొనర్చుపద్ధతి నస్సీరియనులే ప్రారంభించిరి. ఈసార్గనుపుత్రు డగు "సెనా చెరిబు" తనసేనలను ఈజిప్టు సరిహద్దులకు నడిపించి, అచ్చో శత్రుబలముచేగాక, ప్లేగువ్యాధిచే నోడెను. సెనాచెరిబు పౌత్రు డగు "అస్సర్బానిపాల్" క్రీ. పూ. 670 లో ఈజిప్టును జయించెను. (చారిత్రకు లితనిని "సర్దనపాల"సను గ్రీకునామమున గూడ వ్యవహరింతురు.) కాని ఈజిప్టు అప్పటికే 'ఎతియోపియను'ల పాలైమై, పరాధీనమై యుండెను. 'సర్దనపాలను' విజయముచే, ఈజిప్టునకొక పరరాజుపోయి, మరియొకడు వచ్చెను. ఈ వేయేండ్ల దీర్ఘకాలములకు అప్పటి రాజకీయస్థితి దెలుపు చిత్రపటముల వెంటవెంటనే తీయుచుండినచో, అప్పటి యీజిప్టు రాజ్యము, సూక్ష్మదర్శని యంత్రపుపరీక్షలో అతి సూక్ష్మజీవుల వలె, హెచ్చుచు తగ్గుచు కనబడియుండును. బాబిలను, అస్సీరియను, హిట్టైటు, సిరియను, సెమిటికు రాజ్యములు వృద్ధియగుచు, క్షీణించుచు, ఒకదాని నొకటి మ్రింగుచు, తిరుగ క్రక్కివేయుచు, కొట్లాటలను చూచియుందుము. ఆసియామైనరుకు పశ్చిమమున "సార్డిస్ నగరము" రాజధానిగాగల "లిడియా" "కారియా" మొదలగు ఈజియను రాజ్యము లుండెను. క్రీ. పూ. 1200 కో, అతరువాతనో యీలోగానో, ఈ ప్రాచీనరంగములోనికి ఈశాన్య వాయవ్యములనుండి క్రొత్తజాతులువచ్చెను. ఈనవీనవనచరులు ఇనుపయాంయుధముల ధరించి, అశ్వరథములతో ఉత్తర ప్రాంతములనుండి వచ్చి ఈజియనుసెమిటికు నాగరకజాతులకు ప్రమాదము కల్గించుచుండిరి. ఈజాతి వివిధ

శాఖీయులందరు నొకేయార్య భాషను, ప్రాంతీయ స్వల్ప భేదములతో మాట్లాడుచుండిరి.

వీరిలో నల్లసముద్రము కాస్పియను సముద్రముల ఈశాన్య ప్రాంతములచుట్టును మీడులు పెర్షియనులు చేరుచుండిరి. (అప్పటి 'సితియను'లు 'సార్మేషియను'లు కూడ ఆజాతివా రని భ్రమకల్గెను.) ఈశాన్యమునుండి యో వాయవ్యమునుండి యో ఆర్మీనియనులును, సముద్రప్రాంతమునకు వాయవ్యమునుండి బాల్కను ద్వీపకల్పమునుండి సిమ్మిరియనులు, ఫ్రిజియనులు, హెల్లెనిక్ (గ్రీకు) జాతివారును వచ్చిరి. ఈ ఆర్యులు పూర్వపశ్చిమదిశల పురములను దోపిడిచేసి కొల్లగొట్టుచుండిరి. వీరందరు సామాన్య లక్షణములు పోలికలు గల్గి, దోపిడులచే జీవించుచు గోపాలకజాతివారై యుండిరి; వారిలో ప్రాచ్యదేశీయులింకను పైపై దోపిడగాండ్రై యున్నను, పశ్చిమమున పట్టణముల నాక్రమించి, నాగరికులగు ఈజియనుల వెడలనడచిరి. ఈయొత్తిడివల్ల ఈజియనులు (ఆర్యుల కంటెకుండ) కొత్త దేశములకు వలసపోయిరి; కొందరు నైలుడెల్టాలో వసింప యత్నించి, మిశ్ర దేశీయులచే తరుమబడిరి. 'ఎట్రుస్కను' లను మఱికొందరు (ఆసియామైనరునుండి నౌకలపైన వచ్చి) మధ్య యిటలీ దేశపు నిబిడారణ్యములలో రాజ్యము స్థాపించిరి. మఱి కొందరు మధ్యధరాసముద్రపు నైర్రుతి దిక్కున నగరముల నిర్మించి, తరువాత చరిత్రలో 'ఫిలిస్టైను'లని ప్రసిద్ధి చెందిరి.

పూర్వపు నాగరిక దేశములపై నీరీతి దాడివచ్చిన యీయార్యులగురించి ముందు వివరింపబడును. క్రీ. పూ. 1600-600 మధ్య ఉత్తరపగహానములనుండి క్రమముగా నిరంత

రము వ్యాపించు ఈ యార్యఝంఝానిలమువల్ల ప్రాచీన నాగరికలోకులు సంక్షోభమొందుచు అన్యత్ర వలసపోయి రని మాత్ర మిందు గమనింపుడు.

ఆకాలమున పసీపను ఫిలిస్టైను తీరముల వెనుకనున్న కొండలందలి, 'హీబ్రూ' లను సెమిటికులు అప్పుడే కొంత కొంత ప్రసిద్ధికి వచ్చిరి; వారినిగూర్చి ముస్ముందు కొంత చెప్పెదము; వారు తరువాత బైబిలు అను ప్రసిద్ధమైన జ్ఞానదాయకమగు చరిత్రగ్రంథమును రచించిరి.

క్రీ. పూ. 600 వరకును మెసపొటేమియా ఈజిప్టు లలో ఆర్యుల రాకచే విశేషముగు మార్పులు గలుగలేదు. గ్రీకులముందు ఈజియనులు పరుపెత్తుట, నోసస్ విధ్వంసము, ఈజిప్టు బాబిలన్ ప్రజలకు దూరదేశపుకలహాముగ దోచి యుండును. ఈ మొదటినాగరికరాజ్యములలో అనేక రాజ వంశములు వచ్చుచు పోవుచున్నను, నానాటికి అభివృద్ధి మాత్ర మత్యల్పము; నరుల జీవితపద్ధతి అట్లే యుండెను. అత్యంత ప్రాచీనములగు పిరమిడులకుదోడు (అప్పటికే యీపిర మిడులు నిర్మింపబడి 2000 ఏండ్లు దాటి, నేటిప్రజలకువలె యాత్రాస్థలములుగనుండెను.) ఈజిప్టులో విశేషించి, 17, 19 వ రాజవంశముల కాలములో నూతనముగు అద్భుతభవనములను గూడ నిర్మించిరి. 'కార్నక్' 'లక్సార్' దేవాలయము లీనాటివే. నినేవాలోని గొప్ప దేవాలయములు, మనుష్యశిరస్సును రెక్కలుగల వృషభములు, రాజులు, రథములు, సింహాపువేటలు మొదలగువాటి ఇప్పుడున్న ప్రతిమలును క్రీ. పూ. 1600-600 మధ్యకాలమున నిర్మించినవే. బాబిలను వైభవము చాలవర

కాలపు దే. మెసపొటేమియానుండియు, ఈజిప్టు నుండియు, ఈ కాలపువ్యాపారపులెక్కలు కథలు కావ్యములు ఉత్తర ప్రత్యుత్తరములు వ్యవహార గ్రంథములు మనకు దొరికినవి. బాబిలను ఈజిప్టులోని 'థీబ్సు' మొదలగు నగరములందలి శ్రీమంతులగు ప్రముఖులు రమారమి ప్రస్తుతపుధనికులంత నాగరికులై సుఖులై యుండిరి. అట్టివారు అలంకృతమై పరికరయుత మగు సుందరభవనములందు సర్వసంస్కారములతో క్రమజీవనము జేయుచు, సుందరాభరణములను అమూల్యవస్త్రములను ధరించి, విందులు ఉత్సవములు గల్గి, ఆతిథ్య కాలములందు సంగీత నాట్య ప్రదర్శనము చేయుచు, సమర్థసేవకులు గలిగి, దంతవైద్యులయుపచారము లందుచుసుండిరి. వారు విశేషదీర్ఘ యాత్రలు చేయకున్నను నైలు యూఫ్రిటీసునదులపై వేసవిలో నౌకావిహార మొనర్చుచుండిరి; బరువుమోతకు గాడిదల నుపయోగించిరి. అప్పటి కింకను గుఱ్ఱముల యుద్ధరథములకును రాజకీయోత్సవములకును మాత్రమే ఉపయోగించుచుండిరి; కంచరగాడిద లింకను క్రొత్త; ఒంటెలు మెసపొటేమియాలో నున్నను, ఈజిప్టున కింకను రాలేదు. ఇనుపపాత్ర లతిస్వల్పముగ నుండెను. రాగి, కంచు ముఖ్యలోహములు; చక్కనినార, దూది, ఉన్నిబట్టలు వీరికి దెలిసియుండెను; పట్టులేదు. చక్కని రంగుటద్దము లుండినను అద్దపుపనిముట్లు స్వల్పము. సాదా యద్దములు, సులోచనపు అద్దములు నప్పటికి లేవు. ఆజనులకు దంతములకు బంగారపు కట్టైగాని, నాసికలపై సులోచనములుగాని లేవు. అప్పుడు నాణెములును లేవు. ప్రాచీనథీబ్సు బాబిలనుజీవితమునకును, ఆధునిక జీవితమునకును, అది యొక ముఖ్య భేదము; వ్యాపారము చాల వరకు వినిమయము (అనగా సాటా) మూలముగనే జరుగు

చుండెను. ఈజిప్టుకన్న బాబిలను ఎక్కువ సిరితో నుండెను. వస్తువులుకొనుట కక్కడ వెండిబంగారుకడ్డీలను ముద్దలను ఉపయోగించుచుండిరి. నాణెముల వాడుకకుపూర్వము కొందరు సాహుకార్లు వెండి బంగారుముద్దలపైన వాటితూనిక తమపేరు ముద్రించి వాడుచుండిరి. వాటిని అమూల్యరత్నాదులను తమ యావశ్యకవస్తువులను కొనుటకును, అమ్మకమునకును వర్తకులు ప్రయాణికులు తమతో నుంచుకొని వాడుచుండిరి. నౌకర్లు పనివాండ్రు చాలవరకు బానిసలే. వారికి సొమ్మీయక వస్తువులే యిచ్చుచుండిరి. సొమ్ముచలామణి వ్యాపించినకొలదిని, బానిసపద్ధతి అంతరించెను; ప్రాచీననగరరాజ్యములకు ఇప్పటివారు ఏయచేసినచో, కోడిపెట్టలు కోడిగ్రుడ్లు అచట దొరకెడివి కావు; బాబిలనునగరము నేటి ఫ్రెంచివంటవాని కసంతృప్తిగ నుండెడిది. ఈరెండువస్తువులును (ఆఖరు అస్సీరియను రాజ్యము ఆసుమారున) ప్రాచ్యదేశములనుండి వచ్చెను. ఇతరవిషయము లందువలెనే మతవిషయములందుగూడ నాగరికత బాగుపడెను. నరబలులు చాలకాలముక్రిందనే నశించెను; నరులస్థానే పిష్టపశువులను జంతువులను ఉపయోగించుచు వచ్చిరి. కాని ఫనీషనులు అందు ముఖ్యముగా ఆఫ్రికాలో వారిముఖ్యస్థానమగు 'కార్థేజ్' పురవాసులు, నరమేధము లొనరించిరని వదంతికలదు. ప్రాచీనకాలమున నొక మహానాయకుడు పోయినపుడు, పరలోకమున సుపచారముకు లోటులేకుండుటకై, వానిభార్యలను బానిసలను యాగబలిగా నిచ్చి, ఆతనిబల్లెములను ధనుర్బాణములను ఆసమాధిపైన విరిచి పడవేయుఆచార ముండెను. ఈజిప్టులో నా దురాచారపు శేషముగ మృతులతోబాటు చిన్నబొమ్మరింట్లు, డుకాణము, నౌకర్లు, పశువులు వీటియాకారములను

మాత్రము తయారుచేసి, ఆబొమ్మలను పోయినవారితో బాటు కప్పివేయుచుండిరి. వీటిని మన మిప్పుడు చూడగా సుమారు 3000 సంవత్సరములకు పూర్వకాలమునాటి యీప్రాచీనజనుల జీవితసంస్కృతులు తెలియుచున్నవి.

ఉత్తరాటవులనుండి మైదానములనుండి ఆర్యజాతీయులు వచ్చి వ్యాపించునప్పటికి, హిందూదేశమందును, చీనాలోను, ఈరీతినే నాగరికత వ్యాపించుచుండెను. ఈ రెండుదేశము లందలి విశాల నదీప్రాంతములందును వ్యవసాయము, గోధుమ వన్నపుజనులు స్థాపించిన పట్టణరాజ్యములును, వృద్ధియగుచుండి నవి. కాని మెసొపొటేమియా యీజిప్టులలో జరిగినంత శీఘ్రముగా భారతదేశమున ఈరాజ్యములు వ్యాపించి పరస్ప రము సమావేశమైనట్లు తోచదు. వారిది ప్రాచీనసుమేరియను అమెరికాలలోని మయనాగరికత నెక్కువగా బోలియుండెను. చీనుల ప్రాచీనచరిత్ర గాథామయమైయున్నది. అందలి యథార్థ చరిత్రభాగమును విడదీసి, చీనావిద్వాంసులు ఆధునికపద్ధతులపై పునర్నిర్మాణము చేయవలెను. ఆకాలమున చీనా హిందూ దేశములన్ను కొంచె మున్నతస్థితిలో నుండెనేమో! ఈజిప్టు దేశపు 17-వ రాజవంశము సరిపోవుకాలమున, చీనాదేశ మున "షాంగ్ చక్రవర్తులు" మతగురువులుగ నుండిరి. ఆసా మ్రాజ్యము సామంతరాజ్యయుతమై శిథిలమైయుండెను. ఆయా ఋతువులందు యాగములజేయుట యీప్రాచీనచక్రవర్తుల ముఖ్యధర్మముగా నుండెను. "షాంగు"వంశమునాటి చక్కని కంచుపాత్ర లిప్పటికిని గలవు. వాటి అందమును పనితనమును జూడ అప్పటికే (చాల శతాబ్దములనుండియు) ఆప్రజలు నాగరికులుగా నుండి రని మనము గ్రహింపవలెను.

# 19. ఆదిమార్యులు

నాలుగువేల యేండ్ల క్రిందట అనగా క్రీ. పూ. 2000 లకు పూర్వము యూరపులో మధ్య ఆగ్నేయభాగములును మధ్య ఆసియాయు, ఇప్పటికన్న నెక్కువ వెచ్చనై, సస్య సమృద్ధి కలిగియుండెను. ఈ ప్రాంతములందు ముఖ్యముగ సుందర దేహులు నీలనేత్రులు నగు 'నార్డికు జనులు' సంచరించుచుండిరి. వీరు రైనునది మొదలు కాస్పియను సముద్రమువరకు యావత్ప్రదేశమందుండిరి; వీరందరును కొద్ది ప్రాంతీయ భేదములతో నొకేభాష మాట్లాడుచు, పరస్పర సంబంధము కలిగియుండిరి; వీరే ఆర్యులు. అప్పటికి వీరల్పసంఖ్యాకులై యుందురు. 'హమ్మురబి' పాలితులగు బాబిలనువారికిగాని, ప్రాచీన నాగరికులై విదేశీయుల పాలనలో బడిన మిశ్రదేశీయులకుగాని, ఈ ఆర్యజాతీయు లుండినట్లే తెలియదు.

ఈ యార్యులు తరువాత ప్రపంచమున చాల ముఖ్యులైరి. వీరి మొదట మృగసంకులస్థలములందును, వనభూమి బాగుచేసియు జీవించుచుండిరి. అప్పటికి వీరి కశ్వములు లేవు; పశువులుమాత్ర ముండినవి. వీరు తరుచు సంచారము చేయుచు, తమ డేరాలను తక్కిన సామానులను మోటయెడ్ల బండ్లలో వేసుకొని వెళ్లుచుండిరి; కొంతకాల మొకచోటనే నివాసమేర్పరచుకొన్నపుడు చెట్లకొమ్మలతోను, మట్టితోను, గుడిసెల గట్టుకొని యుందురు; తమ మృతనాయకులశరీరములను నీలగోధుమవర్ణులవలె ఖననము చేయక దహనమే చేయుచుండిరి.

ఆ దగ్ధశేషము నొస్థలమున నొక మట్టుగిన్నెలో బెట్టి, దానిపై గుండ్రగ నొక రాతిదిబ్బను గట్టుచుండిరి. ఉత్తర యూరపులో నిప్పటికిని ఈ గుండ్రగోరిదిబ్బ లున్నవి. వీరికి పూర్వముండిన నీలగోధుమవర్ణులు తమ మృతుల దేహముకు ఖననమే చేసి, భూమిలో అధిష్ఠించినట్లుంచి అందుపైన పొడుగుదిబ్బల గట్టుటచే వాటిని పొడుగుగోరి లనుచున్నారు. ఆదిమార్యు లెడ్లతో భూమి దున్ని, గోధుమ పండించిరి; కాని కోతలు కాగనే, అక్కడనుండి మరియొక ప్రాంతమునకు పోవుచుండిరి. వీరికి కంచు ప్రథమమునుండి యుండెను; తరువాత వీరు క్రీ. పూ. 1500 ప్రాంతమున ఇనుము కరగించుట నేర్చియుందురు. సుమారాసమయముననే వీరు గుఱ్ఱములను సంపాదించిరి; మొదట వానిచే సామానులుమాత్రము మోయించిరి. మధ్యధరా ప్రాంతీయుల కున్నట్లు వీరి సంఘము గుడులచుట్టు నేర్పడినది కాదు. వీరి ప్రధానపురుషులు నాయకులే కాని, గురువులు కారు. దైవాంశ రాజాంశములకన్న ఉన్నతకులోత్పత్తియే వీరికి గౌరవార్హమయ్యెను; మొదటినుండియు తమజాతిలో కొందరు కులీనులను నాయకులుగా మన్నించుచుండిరి.

వీరికి వాగ్ధోరణి అధికము; తమసంచారములలో తరుచు విందులు మధుపానము జేయుచు, తమకవులు గాయకులు జెప్పు కావ్యగీతముల వినుచుండిరి. నాగరికజాతులతో కలుసుకొనువరకు వీరికి లేఖనము తెలియదు. గాయకులే వీరి వాఙ్మయమును జ్ఞప్తితో భద్రపరచుచుండిరి. ఆనందగీతముల బాడి, వానిని మననము చేయుటచే వీరిభాషకు చక్కని మాధుర్య మేర్పడినది. ఆర్యభాష లితరభాషలకన్న నెక్కువ

ప్రశస్తమగుటకు గొంతవరకిది కారణము. ప్రతి ఆర్యజాతి కవులు తమపూర్వగాథల హృద్గతము చేయుచుండిరి. అవి వేద ములు మహాకావ్యములు మొదలగు పేర్లతో బరగుచున్నవి.

ఈజనుల సాంఘికజీవనమునకు వీరి నాయకజనులభవనము ముఖ్యస్థానముగ నుండెను. ఈజనులు కొంతకాలము మకాము చేయుచోట్ల తమ నాయకునికి మాత్రము కలపతో గొప్ప విశాలమందిరము గట్టుచుండిరి. పశ్వాదులకై కొన్నిగుడిసెలు సాలలు వ్యవసాయపుపాకలుగూడ నుండెను; కాని సామాన్య జనులకు (సాధారణముగ) యీనాయకుల గృహాంగణమే ముఖ్యసమావేశ స్థానమై యుండెను. అందరు నక్కడనే కలసి భుజించి, ఆగాయక కవుల గీతములు విని, వారి చర్య లలోను ఆటపాటలలోను పాల్గొనుచుండిరి. నాయకుడు అతనిభార్య మున్నగువారు కొంచె మున్నతస్థలమందో సొంతే యంత స్తునను విశ్రమింప, మిగిలిన సంఘుజనులందరు వీనైనచోట్ల నిండ్రించుచుండిరి. ఇప్పటికిని హిందూదేశమున జను లట్లుం డుట కలదు. ఆయుధములు, ఆభరణములు, పనిముట్లు మొద లగు ఆయావ్యక్తుల ప్రత్యేకవస్తువులుతప్ప,పశువులు భూములు బీళ్ళు మున్నగునవన్నియు జనులందరికి జెంది, వారితరఫున నాయకుని యాజమాన్యమున నుండెను. అడవులు నదులు జనుల సొత్తుగాక, ప్రకృతిలో భాగమై యుండినవి.

మెసపొటేమియాలోను నైలునదీతీరమందును నాగరికత వృద్ధినొందిన కాలమున మధ్యయూరపులో పశ్చిమ మధ్య ఆసియాప్రాంతములో ఆర్యు లీరీతిగనుండి వ్యాపించుచు,సూర్య శిలానాగరికులపై నంతటను క్రీ. పూ. వేయేండ్లకు పూర్వ

మందో త్తిడి జేయుచుండిరి. వారు ఫ్రాన్సు బ్రిటను స్పెయిను దేశములలోనికి రెండుతెగలుగా వెళ్లిరి. మొదటితెగవారు కంచు ఆయుధములు కలిగి, బ్రిటను ఐర్లండు దేశములను చేరిరి; వారచ్చటబ్రిటనీలోని'కార్నే'లో మహాశిలతో జ్ఞాపకచిహ్నములను ఇంగ్లండులో 'స్టోనుహెంజి'ని 'అవెబరి'ని నిర్మించిన ఆ దేశపు పూర్వవాసుల గొంత వరకు వశపర్చుకొని, మిగిలిన వారిని నిర్మూలముచేసిరి. ఈతెగ ఆర్యులకు 'గొయిడెలిక్ కెల్టు' లని పేరు. వీరి కత్యంత సన్నిహితులై బహుశః ఇతరులతో మిశ్రితులైన రెండవతెగవా రాంగ్లదేశమున కిసుము దెచ్చిరి. వీరిని 'బ్రితోనిక కెల్టు' లందురు. వీరినుండియే ఆంగ్లదేశపు 'వేల్సు' జనుల 'వెల్షు'భాష వచ్చినది.

ఇట్టి కెల్టిక జాతివారే కొందరు దక్షిణముగ స్పెయిను లోనికి దూరి, ఆ దేశీయులగు సూక్ష్మశిలాజాతి బాస్కులతోను, తీరవాసులగు ఫనీషనులతోను కలసుకొనిరి. వీరిసంబంధులగు ఇటాలియను ఆర్య లప్పటికింకను మహాగహనమైన ఇటలీద్వీపకల్పములోనికి ప్రవేశించుచుండిరి. వీరంతటను విజయులే కాలేదు. క్రీ. పూ. 8-వ శతాబ్దిలో ఇటలీలో టైబరునదియొద్ద వ్యాపారస్థలమగు రోమునగరపు లాటిను ఆర్యులు ఎట్రస్కను జాతిపాలకుల క్రింద నుండిరి. కొందరార్యులు తూర్పుప్రాంతములందును దక్షిణముగాను ఒత్తిడిచేసి క్రీ. పూ. వేయేండ్ల కన్న నింకను చాల పూర్వమే హిమాలయపు పడమటి కొండ కనుమలద్వారా ఉత్తరభారతదేశములోనికి వచ్చిరి. వీ రిట్లు ఆదేశము ప్రవేశించగా, అప్పటికుండిన నీలగోధుమవర్ణులగు

ద్రావిడుల సంస్కృతితో వారికి సంబంధము కలిగెను; దానినుండి ఆర్యులు చాల నేర్చుకొనిరి.

ఈఆర్యులలో కొంద రితరశాఖలవారు మధ్యఆసియా లోని మహాపర్వతములమీంద నుండి ఇంకను తూర్పునకు వ్యాపించినట్లు కనబడును. తూర్పుతుర్కిస్థానములో నిప్పటికిని నీలనేత్రులగు తెల్లవారు కలరు. కాని, వారిపుడు మంగోలియను భాషల మాటాడుచున్నారు.

నల్లసముద్రము కాస్పియను సముద్రము మధ్యనుండిన హిట్టైటుజనులు క్రీ. పూ. వేయేండ్లకే ఆర్యులగు ఆర్మీనీయు లతో కలసిపోయిరి. అప్పటికి అస్సీరియను బాబిలోనియను జాతులను ఈశాన్యదిశవైపున సితియనులు మీడులు పార సీకులు మొదలగు మహాశూరులగు ఆర్యప్రత్యర్థు లెదుర్కొను చుండిరి.

కాని ప్రాచీననాగరికుల మధ్యప్రదేశములోనికి ఆర్యులు ప్రథమమున ప్రవేశించిన స్థలము బాల్కను ద్వీపకల్పము; క్రీ. పూ. 1000 కి చాల పూర్వమే వీరు దక్షిణమున ఆసియా మైనరుదేశము దాటి వచ్చిరి. మొదట వచ్చిన తెగలలో ఫ్రిజి యనులు ముఖ్యులు; వీరితరువాత అయోలికు, అయోనియను (యవన), డోరియను అను గ్రీకుతెగలవారు వరుసగా వచ్చిరి. గ్రీసులోను ఆప్రాంతపుదీవులందును అంటియుండిన ప్రాచీన యీజియను నాగరికతను క్రీ. పూ. 1000 నాటికే, యీ ఆర్య జాతీయులు స్వరూపనాశము గావించి, తుడిచిపెట్టిరి. ఈజి యనుల 'మైసిని' 'టీరిన్స్' నగరములు ధ్వంసముచేయబడినవి. నోసను నామావశిష్టమైనది. గ్రీకుఆర్యులు క్రీ. పూ. 1000 కు

పూర్వమే సముద్రయాన మారంభించి, క్రీటు రోడ్సులలో నివాసముల నేర్పఱచి సిసిలీద్వీపమందును దక్షిణఇటలీలోనుగూడ (అంతకుపూర్వము ఫనీషనులు మధ్యధరాసముద్రము చుట్టును వ్యాపారపట్టణముల గట్టినట్లే) తాముసు వలసనగరముల నిర్మించిరి.

ఈరీతిగా మూడవ తిగ్లతిఫిలేసరు రెండవసార్గను సన్దన పాలసు రాజులు అస్సీరియాను పాలించుచు, బాబిలను సిరియా ఈజిప్టు రాజులతో పోరుచున్నప్పుడే, ఆర్యజనులు నాగరకపద్ధతుల నేర్చుకొని, వాటినిమార్చి, ఇటలీ గ్రీసు ఉత్తరపర్షియాలలో వృద్ధిచేయుచుండిరి. క్రీ. పూ. ౧-వ శతాబ్దము మొదలు ఆఱుశతాబ్దములలో ఈఆర్యజాతీయులు క్రమముగా శౌర్యోత్సాహములతో వ్యాపించుచు, చివరకు సెమిటికు యీజియను యీజిప్టుల పూర్వనాగరికలోకమంతను వశపఱచుకొనిరి. ఆర్య లీకార్యమున పైకి సంపూర్ణవిజయులైరి; కాని తరువాతగూడ వారికిని సెమిటికు మిశ్రదేశీయులకును భావములోను, పద్ధతులలోను మాత్రము చారిత్రక కాలమంతయు (నేటికినిగూడ) సంఘర్షము జరుగుచునేయున్నది.*

---

* ఒకేభాష మాట్లాడువారు విశాలదేశమున వ్యాపించియున్నప్పుడు, ఆభాషలో ప్రాంతీయభేదము లుండును; కొండలు, మరుభూములు మొదలగు ఆటంకములచే వారిలో సమావేశము రాకపోకలు తగ్గినప్పుడా భేదములు హెచ్చును. ఆయాప్రాంతీయులు వేర్వేరుదేశములకు పోయినప్పుడు, ఆ యాశీతోష్ణపరిస్థితులు ఆప్రాంతీయవాసులభాషలతో సంపర్కము జాతిమిశ్రణము మొదలగు కారణములచే ఆప్రాంతీయభేదములు విస్తరించి, కొన్నిశతాబ్దముల కా భాషాభేదము లధికముకాగా, అవి వేరువేరుభాషలుగ నేర్పడును.

అయినను వాటి పరస్పరసంబంధమునుబట్టి అవియన్నియుం ఏకకుటుంబపువే యనియు, పూర్వ మొకేజాతి ఒకేభాష కలవారే విడిపోయి ఆయాదూరదేశములకు వ్యాపించి భిన్నభాషికులైనట్లును మనము గ్రహింపవచ్చును. ఇప్పటి ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను, స్పానిషు, ఇటాలియను, గ్రీకు, రష్యను, ఆర్మీనియను వీటిపూర్వకాలభాషలు ప్రాచీనపారసీకము, మనసంస్కృతము, పాలీ, ఇప్పటి మనదేశపుహిందీ, మహారాష్ట్రము, గుజరాతి, బంగాళీ, ఓఢ్రము వీటి పూర్వస్థితిలో ఒకేభాషయై సుమారైదారువేల యేండ్లక్రిందట ఆ "ఇండో యూరపియను" మూలభాషనుండి పరిణమించిన వని భాషాశాస్త్రజ్ఞులు నిర్ణయించినారు. ఈభాషలన్నిటిలోను, ముఖ్యమైన సర్వనామములు అంకెల పేర్లు నిత్యోపయోగములోని వాడుకశబ్దములు క్రియలు ఇత్యాదులను పోల్చినచో చాలవరకొకేరీతి నుండును; వాటికి సన్నిహితసంబంధము కల దని స్పష్టమగును; ఈపైన చెప్పిన వన్నియుం ఆర్యభాషలే. 18, 19 శతాబ్దములందు యూరోపియనులుమనసంస్కృతమును (అందు ముఖ్యముగా ఋగ్వేదసంహితను) అభ్యసించినమీదట, ఆర్యులందరు ఏకజాతీయులు ఏకభాషికులు అనుసిద్ధాంతమును, తౌలికభాషాశాస్త్రమును ఏర్పడెను; ఆర్యావర్తమున హింది, బంగాళీ, గుజరాతి, మహారాష్ట్రము మొదలగునవి వేదకాలపు జనుల వాడుక సంస్కృతమునుండి, క్రమముగా ఆయాప్రాంతశాఖలగు ప్రాకృతములద్వారా పరిణామమొంది ప్రత్యేకభాషలుగా ఏర్పడెను ఇట్లే మనదేశమున ఆర్యప్రదేశముకు చాల పూర్వమే ఒకమూల ద్రవిడభాష యుండి, దానిసంతతిగ ఇప్పటి ఆంధ్రము, అరవము, కన్నడము. మళయాళము మొదలగున వేర్పడి, చివరకు వేర్వేరుభాష లైనవి. (అరవమునుండి మళయాళము, పశ్చిమహిందీనుండి గుజరాతి, తూర్పుహిందీనుండి బంగాళీ ఇటీవల సుమారు మూడువందలయేండ్లక్రిందనే విడి వేరుభాషలైనవి.) ఆంధ్రము పురాతనకాలమందే తక్కిన వాటినుండి విడిపోయెను; సుమారు 25 వందలయేండ్లపైనుండి ఆది ప్రాకృతసంస్కృ

తాది ఆర్యభాషలతో ప్రత్యక్షసంపర్కము కలిగియున్నది; అందుచే దాని ద్రావిడ స్వరూపము చాలవరకు మారినది. 'ఈసంగతులన్నియు భాషాశాస్త్రముచే స్పష్టమైనవి. ఈ మూలార్యభాషకు మూలద్రావిడమునకును (ఇంకను చాలపూర్వమున) సంబంధ ముండియుండు నని కొందరి యభిప్రాయము.

ప్రాచీనార్యులగుఱించిన శ్రీవెల్సుగారివర్ణనము కొంతవరకు గ్రీకుల ఎపిక్కులనబడు 'ఒడిస్సీ' 'ఇలియడు' అనురెండు మహాకావ్యములందలి సంగతులపై నాధారపడిన దని తోచును. వీటికన్న భారతీయార్యుల ఋగ్వేదసంహిత అత్యంతప్రాచీనము; వేదవాక్యములబట్టి చూడగా, ఆప్రాచీనకాలముననే భారతీయార్యులు సంచారిపద్ధతులు చాలవరకు వదలి, స్థిరజీవనమునకు వ్యవసాయాదులకు అలవడి, చక్కని నాగరికత కలిగి, పాశ్చాత్యులకన్న ఎక్కువ యాధ్యాత్మికజ్ఞానము కలిగియుండినటుల కనబడును. వేదముల గాయకసంబంధము సామగానముచే స్పష్టము.

ఆర్యుల ఆదిమస్థలము మధ్యఆసియా యని, బాల్టికుప్రాంతము అని స్కాండినేవియా యని, రష్యాఆగ్నేయమూల యని విమర్శకులు చెరి యొకవిధముగా చెప్పెదురు. ఆర్యులు యూరపునుండి తూర్పుగా వచ్చినట్లు నిదర్శనములు లేవు. భారతదేశమున ఆర్యులు నాలుగువేలయేండ్లపైనుండి వసించినట్లు స్పష్టనిదర్శనములు కలవు. అప్పటికి యూరపులో ఆర్యులు నివాసముగా నున్నటుల ఇతిహాసమున కనబడదు. అప్పుడు రష్యాలో విశేషభాగమును, మధ్యఆసియాలో చాలవరకును జలమయముగనో, మురుగుడునేలగనో ఉండెను. అందుచే యూరపునుండి ఆర్యులు వచ్చి రనుటకు వీలులేదు; ఆర్యులు ఉత్తర ధ్రువప్రాంతములనుండి వచ్చిరని శ్రీతిలకుగారు "ఆర్కిటిక్ హోం ఆఫ్ ది ఆర్యన్స్" అను గ్రంథమున వ్రాసిరి కాని, ఇటీవల కొందరు విద్వాంసులు ఆర్యులమూలస్థలము భారతదేశపు వాయవ్యదిశలోని హిమాలయప్రాంతమే యని భావించిరి. ఇతరార్యుల 'ఒడిస్సీ' 'ఇలియడు' మున్నగు గ్రంథములకన్న అధికప్రాచీనమగు

ఋగ్వేదసంహిత క్రీ. పూ. రెండువేలేండ్ల క్రిందటనే ఏర్పడియుండవలె నని చాలమంది ప్రామాణికులు నిర్ణయించినారు. అది యింకను చాల పూర్వపు దని కొంద రందురు: భారతీయార్యులలో నొకశాఖయును ఇరానుఆర్యులును చాల కాలము కలసి ఇరుగుపొరుగుగా గాంధారదేశప్రాంతము (ఇప్పటి ఆఫ్ఘన్ స్థానములోని ఖాందహారు) కావల నుండగా, ఈ రెండు తెగలమధ్య కలహము సంభవించెను. (ఇదియే సురాసురయుద్ధ మని ప్రాచీనవాఙ్మయమున చెప్పబడె నందురు )అంతట ఇరానువారు పారసీకమువైపునకు,భారతీయార్యులు సింధునది దాటి తూర్పునకు వ్యాపించిరట; వీరే క్రమముగా గంగాయమునా తీరములకు వచ్చి రని కొందరును, ఇంకొక తెగఆర్యులు ఉత్తరమువైపు హిమాలయముల దాటి, బదరీకేదారప్రాంతమునుండియో, నేపాళప్రాంతమునుండియో దక్షిణముగా కోసల మగధ పాంచాలదేశములకు వ్యాపించినట్లు కొందరును తెలుపుచున్నారు. మొత్తముమీద భారతీయార్యులు హిమాలయమధ్యమున చాలకాలము వసించినట్లు, వారు దానిని తరువాత దేవభూమి యని పిల్చుచు ఆ ప్రాంతము నతిపవిత్రముగా నుంచినట్లును కన్పడును. ఆకాలపు హిమాలయములందు ఇప్పుడున్నంత విపరీతపు చలి అంతమాచును లేదు. కైలాస మేరు మానససరోవరాదులు హిమాలయములమధ్యనే యున్నవి. ఋగ్వేదమున మనోహరముగ జేయబడిన ప్రకృతివర్ణన చాలవరకు హిమాలయపరిస్థితులకు సింధునదికి సరిపోవును; గాంధార మధ్యహిమాలయములు, ఉత్తరకాశ్మీర ప్రాంతమున కలిసిపోవును; కాశ్మీరము ప్రపంచమం దప్రతిమప్రకృతిసౌందర్యము కలదని, అచ్చట స్త్రీపురుషులును అత్యంతసుందరులని, పాశ్చాత్యులును ఎంచుచున్నారు. మధ్యఆసియాకు చాలసమీపమగు ఉత్తరకాశ్మీరప్రాంతమే భారతీయార్యుల ఆదిమస్థలమేమో తెలియదు. ఇరాను ఆర్యుల వేద మనదగు 'జండ్ అవస్థా' అను ప్రాచీనగ్రంథములు భాషయందును విషయాలందును చాలవరకు మనఋగ్వేదము ననుకరించును. వేదములం దనేకవృత్తాంతాలను

తమకలహములను, సోమపానమును, మనోభావములను, భారతీయార్యఋషులు నిష్కపటముగ తెలిపిరి; కాని, వారిపూర్వు లన్యదేశములనుండి హిమాలయ ప్రాంతములను భారతదేశమునకు వచ్చినట్లు వేదములం దెక్కడను సూచింపబడలేదు. మనభారతదేశమునకు హిందూదేశ మను పే రార్యులుగాని ద్రావిడులుగాని పెట్టినదికాదు. పారసీకాది పాశ్చాత్యులు తామువచ్చునప్పుడీదేశపు మొదట సింధునది తగులుటచే, అచ్చటివారి నా పేర పిల్చుచుండిరి. (పూర్వ పారసీకభాషలో 'స' కు 'హ' కారముచ్చరించుట వాడుక); ఇట్లు 'హిందూ' శబ్దము వచ్చెను. గ్రీకులు మొదలగు యూరపియనులనోట "హిందు" శబ్దమే "ఇండాయి" "ఇండియా" అని మారెను. మనుస్మృతికాలమునకు ఈదేశము భరతఖండ మని, అది భారతవర్ష ములో నొకభాగ మని, వింధ్యహిమాచల మధ్యభాగము (అనగా ఉత్తరహిందూదేశము) ఆర్యావర్త మనబడెను. అప్పటికి ఆంధ్రద్రావిడదేశములు దక్షిణాపథమనబడెను;అందు ఆర్యులకు అప్పటికి ప్రాబల్యము కలిగియుండ దని తోచును.

ఆర్యులు ప్రాచీననాగరికులమధ్య ప్రవేశించుట మొదటిసారి బాల్కనులలో జరిగిన దను వెల్సుగారిభావము యూరపు విషయమునమాత్రం నిజమే; కాని, అంతకు చాలపూర్వమే మనదేశంలో ఆర్య ద్రావిడసంబంమేర్పడినది.



# 20. కడపటి బాబిలను రాజ్యము - డెరయసు రాజ్యము

'3-వ తిగ్లతుపిలెసరు, 2-వ సార్గను' రాజుల క్రింద అస్సీరియా రాజ్యము బలీయమయ్యెను గదా! ఈ రెండవ రాజు అసలుపేరు 'సార్గను' కాదు. ఐనను ఆ బాబిలను ప్రజలకు అంతకు రెండువేలేండ్ల క్రిందటనే చక్రవర్తియైన అక్కేడియ నగు '1-వ సార్గను' పేరుతో బాబిలను జనుల సానుభూతి సంపాదించుటకై అతడా 'సార్గను' పేరు వహించెను. బాబిలను నగరము పరరాజవశమైనను, విజేతల అసలు రాజధానికన్న పెద్దదై, ప్రధానమై యుండెను. ఆనగరదేవతయగు 'బెల్ మార్దుకు'ను, అచ్చటి వర్తకులను, గురువులను ఆదరింపవలసి యుండెను. శత్రువులు పురముల బట్టుకొన్నప్పుడు దోపిడిచేసి, అందలి జనుల చంపివేయు మోటురోజులు మెసొపొటేమియాలో క్రీ. పూ. 8-వ శతాబ్దమునాటికి చాల పూర్వమే గతించెను. విజేతలు ఓడినజనులను మంచిచే తృప్తిపఱచి, వారి సానుభూతిని పొంద యత్నించిరి. సార్గను తరువాత సుమారు 150 యేండ్లవరకీ నూతన అస్సీరియను సామ్రాజ్యము నిలిచి యుండెను. ఈ వంశపు 'అస్సుర్బానిపాలు' ఈజిప్టు దక్షిణభాగమును వశపఱచుకొనెను.

కాని తరువాత శీఘ్రమే అస్సీరియా రాజ్యము కుంగెను. ఈజిప్టుదేశము 'మొదటి సమేటికను' అను ఫారో

నాయకత్వమున పరరాజుల బారద్రోలి, '2-వ నెకో' క్రింద సిరియానుగూడ జయింపయత్నించెను. ఆసమయమున కస్సీరియా వారు తమ పొరుగు విరోధులతో పోరుచుండి, 'నెకో' దాడి నెదుర్కొనలేకపోయిరి; మెసొపొటేమియా ఆగ్నేయ మూలనుండి వచ్చిన సెమిటికుజాతీయులగు చాల్డియనులతోను, ఈశాన్యపు పర్షియనులతోను, ఆర్య 'మీడు' జాతులవారి తోను కలసి, నినేవాపై దాడివెడలి, 'నెకో' క్రీ. పూ. 606 లో ఆపట్టణము నాక్రమించెను.

అస్సీరియా విజయలాభము నందరు పంచుకొనిరి. ఉత్తరమున 'సియక్సారస్' ఆధిపత్యమున నినేవా చేర్చి భారత దేశపు సరిహద్దువరకున్న మీడియనుసామ్రాజ్యము ('ఎక్బటనా' రాజధానితో) ఏర్పడెను. దీనికి దక్షిణమున "నెబూకడ్ నెజ్జారు" సార్వభౌముని కాలమున గొప్ప యైశ్వర్యాధికారముల సంపాదించిన నూతన చాల్డియను సామ్రాజ్యము. ఇదే రెండవబాబిలోనియను సామ్రాజ్యము. అప్పుడు బాబిలను సామ్రాజ్యములో మహోత్కృష్టమగు అంత్యదినము లారంభమాయెను. కొంతకాల మీ రెండు సామ్రాజ్యముల మధ్యను శాంతి ప్రబలెను; నెబూకడ్ నెజ్జారు కుమార్తెను సియక్సారస్ వివాహమాడెను.

ఇంతలో రెండవనెకో సిరియాను సులభముగా జయించుచుండెను. అతడు క్రీ. పూ. 608లో 'మెగిడ్డో' యుద్ధమున యూదరాజగు 'జోషియా' నోడించి చంపి, యూఫ్రెటీసు ప్రాంతములకు వ్యాపించెను; కాని అచట క్షీణమగు అస్సీరియాను బదులు, పునరుజ్జీవితమగు బాబిలను వారి నెదుర్కొనెను.



క్రీ. పూ. 600 నాటి మీడియను, రెండవ బాబిలోనియను (చాల్డియను) సామ్రాజ్యములు

ఆచాల్డి యనువీరులు 'నెకో' నోడించి, ఈజిప్టును తరిమిరి. బాబిలనురాజ్యము ప్రాచీన యీజిప్టు సరిహద్దులవరకు విస్తరించెను.

ఈ రెండవబాబిలను సామ్రాజ్యము క్రీ. పూ. 606-539 వరకు, అస్థిరముగనే వృద్ధిజెందుచుండెను. ఉత్తరమున బలీయము దృఢము నగు మీడియను సామ్రాజ్యముతో మిత్రముగ నున్నంతవర కది ప్రబలెను. ఈ 67 ఏండ్లలోను ఆప్రాచీన నగరమున జీవితము విద్యగూడ అభివృద్ధిజెందెను.

అస్సీరియను రాజులకాలమందు (విశేషించి స్సర్దనుపాలను కాలములో) బాబిలనులో చాల జ్ఞానాభివృద్ధి కలిగెను. స్సర్దనుపాలను అస్సీరియ నైనను, బాబిలను జాతీయుడయ్యెను. ప్రాచీన సుమేరియాదినములనుండియు, మెసొపొటేమియాలో వ్రాత కుపయోగించిన మట్టిపెళ్లలపైన లిఖించిరి; ఆగ్రంథముల నతడు భాండారముగ నేర్పఱచెను. దానినిపుడు త్రవ్వి పైకెత్తిరి. అది యిప్పుడు ప్రపంచమందలి చారిత్రకవస్తువులన్నిటిలో బహుశః చాల విలువగలది.

బాబిలను చక్రవర్తులలో చాల్డియనువంశపు తుదిరాజగు'నబోనిడస్' ఇంకను చాలవిద్యాసక్తి గలవాడై ప్రాచీన పరిశోధనను ప్రోత్సహించెను; మొదటిసార్గను అభిషేకకాలము నిర్ణయించి, ఆసంగతి శాసనములో లెక్కించి చిరస్థాయిగా జేసెను. కాని, అతని సామ్రాజ్యములో విభేద చిహ్నములెక్కుడుగా నుండెను. ప్రాంతీయదేవత లన్నిటిని బాబిలను నగరమునకు తెచ్చి, వీటికాలముల నిర్మించి, సామ్రాజ్యమును కేంద్రీకరించుట కాతడు యత్నించెను. (దరిమిలాను రోమనులు

ఈ యుక్తినే జేసి జయమొందిరి.) కాని, బాబిలనులో ప్రధాన దైవమగు 'బెల్‌మార్డకు' పూజారు లసూయావిష్టులై, నబోనిడసుకు బదులు మఱియొక రాజుకై వెదకి, తమప్రక్కనున్న మీడియనుపారసీకచక్రవర్తియగు సైరసు నాహ్వానించిరి; అప్పటికే,ఇతడు తూర్పున ఆసియామైనరులోని లిడియారాజు శ్రీమంతుడు నగు 'క్రోయిససు'ను జయించి, ప్రసిద్ధు డయ్యెను. సైరసు బాబిలనుపై దాడివెడలి, పురప్రాకారమువెలుపల యుద్ధము చేసెను. నగరద్వారము లాతనికై తెరువబడెను; (క్రీ. పూ. 538) యుద్ధము లేకయే, ఆతనిసైనికులు నగరము జొరగల్గిరి; యువరాజు నబోనిడస్‌కుమారుడు అగు "బెల్‌శజ్జార్" ఆ సమయమున విందు లారగించుచుండ, ఒకహస్త మగుపించి గోడపై ఆగ్నేయాక్షరములతో "మెనె, మెనె, టెకెల్, ఉఫర్సిన్" అను గూఢపదముల వ్రాసినట్లును, యువరాజు కబురంపగా, ఈ గుప్తవిషయము చదువవచ్చిన "డేనియల"ను ప్రవక్త దానికి "దైవము నీసామ్రాజ్యము లెక్కించి స్వస్తిచెప్పెను; తుల తూచగా నీవు తేలిపోతివి; నీరాజ్యము మీడులకు పర్షియనులకు నీయబడినది" అని అర్థము చెప్పినట్లును, బైబిలులో కలదు. బహుశః బెల్‌మార్డక్ పూజారుల కీవ్రాత గురించి తెలిసి యుండవచ్చును. ఆరాత్రియే బెల్‌శజ్జారు చంపబడినట్లు బైబిలు చెప్పుచున్నది. నబోనిడసు ఖైదీయయ్యెను; బెల్‌మార్డక్ పూజలు నిరాటంకముగా జరిగెను; శాంతముగ పట్టణ మాక్రమింపబడెను.

ఇట్లు బాబిలను మీడియనుసామ్రాజ్యములు గలసెను; సైరసుకుమారుడగు "కేంబిసిస్" యీజిప్టుసు వశపరచు

కొనెను. కేంబిసిస్ పిచ్చియెత్తి హఠాత్తుగా మృతుడయ్యెను. అంతట సైరసు ముఖ్యమంత్రులలో నొకడగు హిస్టాస్‌పెస్ పుత్రుడు మొదటిడెరయసు రాజయ్యెను.

ఈడెరయసుపాలనలోని పారసీకరాజ్యము ప్రాచీననాగరికలోకమంచు ఆర్యుల నూతనసామ్రాజ్యములలో మొదటిది; ప్రపంచపు సామ్రాజ్యములన్నిటిలో అప్పటికి గొప్పది. అందులో ఆసియా మైనరంతయు, సిరియా, ప్రాచీనఅస్సీరియా, బాబిలను సామ్రాజ్యములును, ఈజిప్టు, కాకసస్ కాస్పియను ప్రాంతములు, మీడియా, పర్షియా దేశములును చేరెను; హిందూదేశమున సింధునదివరకును వ్యాపించెను; అప్పటి కచట గుఱ్ఱపుస్వారి, రథయానము, చక్కనిరోడ్లు నుండుటచే అంతటిసామ్రాజ్యము సాధ్యమాయెను. అంతవరకు ఎడారులలో శీఘ్రప్రయాణమునకు సరఫరాలకు గాడిదలు, ఎద్దులు, ఒంటెలునే ఉపయోగింపబడినవి. పర్షియను సార్వభౌములు తమ సామ్రాజ్యరక్షణకై పెద్దరస్తాల నిర్మించి, రాజచారులకును అనుమతయాత్రికులకును ప్రతిమజిలీలో అంచెగుఱ్ఱముల సిద్ధముగ నుంచుచుండిరి. దీనికి దోడు నాణెములవాడుక మొదలిడి పరస్పరసంబంధమునకు వర్తకమునకు సహాయమయ్యెను. కాని, ఈ విశాలసామ్రాజ్యమునకు రాజధానిగ నుండు గౌరవము బాబిలనుకు లభింపలేదు. బెల్‌మార్డక్ పూజారులు తమద్రోహముచే తుద కేమియు లాభము పొందలేకపోయిరి. బాబిలను ఇంకను ముఖ్యముగ నున్నను క్షీణింపజొచ్చెను. ఆ నూతనసామ్రాజ్యమందు పెర్సిపోలిసు ఎక్బటనాలు ముఖ్యపట్టణము లై యుండెను. 'సుసా

పురి' రాజధానిగ నుండెను. నినేవా యెన్నడో త్యజింపబడి జీర్ణమగుచుండెను.*

---

* డెరయసుసామ్రాజ్య మన్నిటికన్న విశాలమే; కాని అది మొదటి ఆర్యసామ్రాజ్యమే నా? భారతదేశపు ఆర్యావర్తమున అప్పటికి చాల పూర్వము వేదకాలమునుండియు కురు పాంచాల కోసల మగధాదులు సింధునదికి పడమట మద్రగాంధారరాజ్యములును ఉండెను. ఇందు ముఖ్యముగ మాంధాత, హరిశ్చంద్ర, దిలీపాదిచక్రవర్తులు ఇతరరాజ్యములగూడ జయించి వరుసగ సామ్రాజ్యముల స్థాపించినట్లు కనబడును. శ్రీరామపాలనమున దక్షిణభారతదేశపాలకులగు సుగ్రీవాదులు లంకాధిపతియగు విభీషణుడు గూడ సామంతులు కాగా, భారతదేశమంతటను ఆర్యసామ్రాజ్యము వ్యాపించెను. కొందరు కురువంశరాజులును రాజరాజులై, ఇతరరాజ్యములపైగూడ నధికారము వహించిరి. అప్పటి భరతఖండమున ఇప్పటి బెలూచిస్థానము మధ్యహిమాలయప్రాంతము గూడ చేరియుండెను. ఇవి ఆర్యసామ్రాజ్యములే; డెరయసు కాలముకు పూర్వపువే.

---

# 21. యూదుల పూర్వ కథ

మన మిప్పుడు సెమిటికుజాతిలోని 'హీబ్రూ' లను యూదులగూర్చి చెప్పుకొందము. వీ రంతగా ప్రబలురు గారు; కాని తరువాత ప్రపంచచరిత్రము వీరివలన మారినది. వీరు క్రీ. పూ. 1000 కు చాల పూర్వమే 'జూడియా' అను యూదు దేశమున నుండిరి. అప్పటికే 'జెరూసలెం' వారి ముఖ్యపట్టణము. వారిచరిత్ర వారి దేశమునకు దక్షిణమందలి ఈజిప్టు, ఉత్తర మున సిరియా అస్సీరియా బాబిలనుల కనుబంధమై యుండెను. ఈ ఉత్తరరాజ్యములకు నీజిప్టుకు నిది ముఖ్యమగు రహదారిగా నుండెను. క్రైస్తవ ప్రపంచమున 'ఓల్డ్ టెస్టమెంటు' (ప్రాత నిబంధన) అనబడు హీబ్రూభాషబైబిలు యూదులు రచించినదే. అందు ప్రపంచవర్ణనము, అప్పటి చట్టములు, చరిత్రవివర ములు, సువార్తలు, జ్ఞానబోధక కథలు, రాజకీయవక్తృతయు కలవు. ఇవి యూదులకు ప్రాముఖ్య మిచ్చెను. ఈవాఙ్మయము క్రీ. పూ. 4, 6 శతాబ్దులం దుత్పన్నమై, బాబిలనులో ప్రథమ పర్యాయ మొక గ్రంథముగ నేర్పడెను; మీడు పారసీక చాల్డి యను జాతులవారితో అస్సీరియనులు తమస్వత్వ రక్షణకై పోరాడుచుండ, ఈజిప్టు 'ఫారో' అగు రెండవ 'నెకో' అస్సీరి యను సామ్రాజ్యముపై దాడివెడలెను గదా! అప్పుడు యూదు ప్రభువగు జోసియా అతని నెదిర్చి పరాజితుడై, క్రీ. పూ. 608-వ యేట 'మెగిడ్డో' వద్ద హతుడయ్యెను; జూడియా యీజిప్టుకు సామంతరాజ్య మయ్యెను. తరువాత బాబిలనులోని నూతన చాల్డియను పాలకు డగు 'నెబూకడ్

నెజ్జరు' నెకోను తిరుగ యీజిప్టునకు తరిమెను. అత డంతట 'జెరూసలెం'లో దుర్బల రాజులను తోలుబొమ్మలవలె నుంచి యూదుల బాలింప యత్నించెను. కాని, అట్లు జరుగక బాబిలనులో నీతని యుద్యోగులను యూదులు చంపివేసిరి. చిర కాలమునుండి యీజిప్టు నుత్తర రాజ్యములపై పురికొల్పి తగవులు పెట్టుచున్న యీ యూదుల రాజ్యము నణప నిశ్చయించి అతడు జెరూసలెమును పట్టుకొని దగ్ధముచేసి, అందలి ప్రజలను ఖైదీలుగా బాబిలనుకు గొనిపోయెను.

క్రీ. పూ. 538 లో 'సైరసు' బాబిలనును పట్టుకొని ఈ స్థితిలోని యూదులందరిని చేర్చి వారిస్వదేశమున కంపి, 'జెరూసలెము'లో వారి గుడిని పునప్రాకారమును, తిరుగ గట్టుకొనిచ్చెను. అంత వరకు యూదు లైకమత్యమును నాగరికతయు అంతగా లేక విద్యాహీనులై యుండిరి. బైబిలు గ్రంథపు పురాతనభాగముల బఠించినట్లు వారి చరిత్రలో నెచ్చటను చెప్పలేదు. ఆ గ్రంథములగూర్చి ప్రథమ ప్రశంస 'జోషువా' కాలమందే కల్గెను. బాబిలనులో దాస్యమందుండి నపుడు వారిలో నాగరికత ఐకమత్యము కలిగినవి. తిరుగ స్వదేశముకు వచ్చునప్పటికి వారికి వాఙ్మయజ్ఞానము, ఆత్మవిజ్ఞానము, రాజకీయపరిజ్ఞానమును కల్గెను.

అప్పటికి వారిబైబిలులో 'పెంటటుక్' (ప్రాతనిబంధనలోని మొదటి పంచాధ్యాయి)మాత్ర ముండెను. దాని దరిమిలా భాగములు అప్పటికి విడిగ నుండియుండును. క్రానికిల్స్ (గాథలు) సామ్స్ (సువార్తలు) ప్రావెర్బ్స్ (సామెతలు) అనున విట్టివే.

బైబిలుగ్రంథారంభములోని సృష్టివివరణము, ఆదాము ఈవులు, జలప్రళయము మున్నగు వివరములు బాబిలనులోని అప్పటి గాథలరీతినే యున్నవి. సెమిటికుజాతులంపరిభావము లట్టే యుండె నని తోచును. ఇట్టే మోసెసు సాంసనుల కథలు సుమేరియా బాబిలనులలోను ఉండినవి. కాని, అబ్రహాముకథ మొదలు తరువాత భాగము ముఖ్యముగా యూదులకే సంబంధించినది. బాబిలనులో హమ్మురబి 'రాజు' కాలముననే సెమిటికు జనుల గురువగు అబ్రహాము జీవించియుండును. ఆతని సంచారము, వంశచరిత్ర, వారీజిప్టులో నెట్లు శ్రైదీభైనదియు, బైబిలులోని 'బుక్ ఆఫ్ జెనిసిస్' (=సృష్టిక్రమభాగము) లో చదువరులు చూడవచ్చును. అతడు కనానులో ప్రయాణముచేసెను. సంపన్న పురములతో నొప్పు సుందర దేశమును అతనికి ఆతనివంశమునకు అబ్రహాందేవుడు వాగ్దత్తముచేసె నని బైబిలులో కథ కలదు.

ఈజిప్టులో దీర్ఘప్రవాసులై, మోసెస్‌నాయకత్వమున నలుబదేండ్లరణ్యవాసముచేసి అబ్రహాంవంశీయులు పండ్రెండు తెగలై, అరేబియాయెడారులనుండి తూర్పుగా వచ్చి కనాను దేశముపై దండయాత్ర సలిపిరి. ఇది క్రీ. పూ. 1600—1300 యేండ్లమధ్య జరిగియుండును. ఈకథ సరిగా తెలియుటకు మోసెసును గూర్చిగాని, కనానును గూర్చిగాని, ఈజిప్టుదేశపు లిఖితాధారము లేవియు లేవు. కాని వారి వాగ్దత్తములలో కొన్నికొండనేలలు తప్ప నింకేమియు వారికి వశమైనట్లు కన బడదు. సముద్రప్రాంత మప్పటికి కనానులో జేరక, ఈజియను తెగవారగు ఫిలిస్టైనుల వశమైయుండెను. వారినగరములగు

'గాజా, గాత్, అష్డాడ్, అస్కలన్, జోప్పా' లు యూదుల ముట్టడి నెదుర్కొని గెల్చెను. తరువాత కొన్నితరములవరకు అబ్రహాంవంశీయు లాకొండనేలలందు ఫిలిస్టైనులతోను, ప్రక్క నున్న మోబైట్లు మిాడియనైటు వగైరాలతోను సర్వదా తగవులు పడుచు, నామరూపములు లేకుండిరి. ఆతగవులు, అపజయములు బైబిలులోని 'బుక్ ఆఫ్ జడ్జెస్'లో నిష్కపట ముగ వర్ణింపబడియున్నవి. ఆకాలమున చాలవరకు వారు తమ పెద్ద లెన్నుకొనిన ధర్మాధికారులచే పాలింపబడుచుండిరి; కాని వారు చివరకు క్రీ. పూ. 1000 ప్రాంతమున తమ్ము యుద్ధమున నడుపుటకు 'సాలు'ను రాజుగా నెన్నుకొనిరి. ఆతని నాయకత్వ మునగూడ విశేషలాభము గలుగలేదు. 'గిల్బొకొండ'వద్ద యుద్ధములో 'సాలు' ఫిలిస్టైనుల బాణవర్షముకు గురియై హతుడాయెను. ఆతని కవచము ఫిలిస్టైనుల కామదేవాలయ మున బెట్టబడెను; ఆతనిశరీరము 'బెత్షాన్‌పుర' ప్రాకారమున మేకులుకొట్టి యుంచబడెను.

ఆతనితరువాత రాజైన 'డేవిడు' ఎక్కువ జాగ్రత్తగలిగి, 'సాలు'కన్న కొంత జయము పొందెను. అప్పుడు యూదులకు గొంత యైశ్వర్యము గలిగినది. డేవిడు మహామేధావి. ప్రజ్ఞా వంతుడునగు 'హీరాం'అను 'టైరు'రాజుతో మైత్రిచేసుకొనెను. హీరాము (యూదుల కొండదేశముద్వారా) ఎఱ్ఱసముద్రముకు వ్యాపార మేర్పఱచుకో దలచెను. ఆకాలమున, ఈజిప్టులో నశాంతి ప్రబలియు, ఇతరకారణములచేతను, ఆమార్గమున ఫనీ షనులకు ఇదివరలోవలె వ్యాపారపు రహదారి లేకుండెను. హీరాంరాజు డేవిడుతోను అతనికుమారుడు వారసుడు నగు

సాలమనుతోను మైత్రిగలిగి, వారికి సహాయముచేసి, జెరూస లెంపుక ప్రాసాదము దేవాలయము ప్రాకారము పునరుద్ధరించెను. ఆ మైత్రిచే దారిపెట్టుకొని హీరాము ఎఱ్ఱసముద్రమున నౌకల నేర్పర్చుకొని, జెరూసలెంద్వారా దక్షిణముకు ఉత్తరముకు విశేషముగా వర్తకము సాగించెను. అందుచే సాలమను తనప్రజల కైశ్వర్యమును ఉన్నతిని సంపాదించి ఈజిప్టు రాజపుత్రిని వివాహమాడెను. కాని అత్యుచ్ఛదశలో గూడ అతడొకపురపు సామంతరాజే; ఆయధికారమైనను తాత్కాలికమే. అతడు పోయిన కొద్దియేండ్లకే, ఈజిప్టులోని 22-వ రాజవంశపు మొదటిఫారో యగు "షిషాకు" జెరూసలెమును పట్టుకొని అందలి వస్తువులను చాలవరకు హరించెను. సాలమను విభవముగూర్చి బైబిలులో రాజకథాగ్రంథమున వ్రాసిన వివరములు పరిమిలా లేఖకులు స్వదేశాభిమానముచే జేర్చిన అతిశయోక్తి వర్ణనలని కొందరాక్షేపించిరి. కాని బైబిలులోని వర్ణనలన్నను ఆవిభవము అధికముకాదని తెలియగలదు. ఆగ్రంథమందిచ్చిన కొత్తలనుబట్టి, "సాలమను" దేవాలయము ఇప్పటి యూరపురముల చిన్న చెర్చిలో నిమిడిపోవును. సాలమను తరువాత రాజైన "ఆహాబు" అస్సీరియనుసేనకు రెండువేలరథముల బంపెనని ఒక అస్సీరియను గోపురపు శాసనమందున్నది. ఇందునుబట్టి సాలమను కుండినట్లు బైబిలులో వర్ణించిన మొత్తం 14 వందల రథము లల్పములేయని తోచును. మరియు సాలమను తన పటాటోపముకై విశేషద్రవ్యము ఖర్చుపెట్టుచు, ప్రజలపై దుర్భరమగు పన్నుల విధించి, వారిచే వెట్టిచాకిరీ చేయించుకొనుచుండెనని, బైబిలువ్రాతలబట్టి స్పష్ట

పడుచున్నది. సాలమను పోగానే ఆరాజ్యపు ఉత్తరభాగము జెరూసెలంనుండి విడిపోయి 'ఇస్రయిలు' అను ప్రత్యేకరాజ్యమయ్యెను.యూదజనుల మైశ్వర్యము అల్పకాలమే యుండెను. హీరాం కాలముచేయగనే జెరూసలెముకు తైరురాజ్యపు సహాయము పోయెను. ఈజిప్టు తిరుగ బలీయమయ్యెను. యూదరాజ్యము "ఇస్రయిలు" "జూడా" అని విడెను; ఆ రెండు చిన్నరాజ్యములు ఉత్తరదిశను మొదట సిరియా తరువాత అస్సీరియా బాబిలను రాజ్యములు, దక్షిణమున ఈజిప్టు, వాటిమధ్య ఒత్తిడిచే నలిగి, తరచు ఓడుచుండెను. ఆ దేశీయులు, పాలకులు గూడ అనాగరికులే. క్రీ. పూ. 721లో ఇస్రయిలు రాజ్యము అస్సీరియనులచే నిర్మూలితమై, అచ్చటి యూదులు ఖైదీలైరి. తరువాత వారిస్థితి యెట్లుండెనో తెలియదు. రెండవదగు 'జూడా దేశము' కొంత ప్రతిఘటించినను, క్రీ. పూ. 604 లో దానికిని ఇస్రయిలుగతియే పట్టెను. బైబిలులో న్యాయపతుల కాలమునుండి యూదులచరిత్రనుగూర్చి వ్రాసిన కొన్నివివరము లతిశయోక్తులే కాని, ముఖ్యచారిత్రక విషయములు యథార్థము లని గతశతాబ్దిలో ఈజిప్టు అస్సీరియా బాబిలను లలో జరిగిన పురాతత్వపరిశోధనచే దృఢమయినది.

యూదులకు బాబిలనులో చరిత్రజ్ఞానమును సంప్రదాయజ్ఞానమును గలిగెను; వారు 'సైరసు' ఆజ్ఞపైన జెరూసలెముకు మరలివచ్చునప్పటికి వెనుకటి మాంద్యము కలహములు పోయి సంస్కారము నొందిరి; ముందు చెప్పబోవు మతప్రవక్త లిందుకు చాలవరకు కారకులైరి. ఈప్రవక్తల యుదయముచే మానవసంఘపువికాసంలో నవ్యజ్యోతి కలిగెను.

# 22. యూదులగురువులు, ప్రవక్తలు

అస్సీరియా బాబిలనుల పతనముతో సెమిటికుజాతులకు విపత్తు లారంభించెను. క్రీ. పూ. 7-వ శతాబ్దిలోని స్థితినిబట్టి, నాగరిక లోకమంతయు సెమిటికురాజుల యధీనమగునట్లుండెను. అస్సీరియాచక్రవర్తు లీజిప్టునుగూడ జయించిరి; బాబిలను సిరియనుజనులతోబాటు, సెమిటికుజాతివా రొకేరీతిభాషల మాటాడుచు, ప్రపంచవ్యాపారమంతయు జరుపుచుండిరి. ఫనీషనుతీరమున మాతృస్థానము వహించిన 'టైరు' 'సిడను' పురముల ప్రజలు స్పెయిను సిసిలీ ఆఫ్రికాలలో నింకను పెద్దపురముల స్థాపించిరి. క్రీ.పూ. 8-వ శతాబ్దముక్రితమే వీరుస్థాపించిన 'కార్తేజీ నగరము', 10 లక్షలకు పైజనసంఖ్య కలదై, కొంత కాలం మహత్తరమై యుండెను. ఆరాజ్యపునావలు ఇంగ్లండు దాటి అట్లాంటిక్ మహాసముద్రములోనికి పోవుచుండెను. అవి 'మడీరా ద్వీపముల' గూడ చేరియుండవచ్చును. సాలమను సహకారముతో ఎర్రసముద్రమున 'హీరాం రాజు' నౌకల గట్టించి, వాటితో అరేబియాతోను, బహుశః భారతదేశము తోను, వ్యాపారము జరిగించెను. 'నెకో' రాజు కాలమున గొందరు ఫనీషనుయాత్రికులు ఆఫ్రికాఖండము నంతను చుట్టి వచ్చిరి. అప్పటికి ఆర్యజను లింకను అనాగరికులు; వీరిలో గ్రీకులు తమధాటిచే నశించిన నాగరికతకు బదులు నూతన నాగరికత స్థాపించుచుండిరి. మీడులు మధ్యఆసియాలో మహా శూరులని ఒక అస్సీరియను లేఖనములో నున్నది. కాని, క్రీ.పూ.

3-వ శతాబ్దములోగానే ఆర్యజాతు లంతట విజృంభింతు రని సెమిటికు లందరు సామంతులయిరో, పూర్తిగ చెడిపోయిరో పరాధీనులగుదురని, క్రీ. పూ. 800 లో నెవ రూహించియుందురు? ఒక ఉత్తర అరేబియాలో తప్ప మిగిలిన అన్ని దేశములందును సెమిటికువారు మొదటిసార్గనుకు అక్కేడియనులకు పూర్వముండిన తమ ప్రాచీన పద్ధతుల మార్చుకొని సుమేరియాను జయించునట్లుండెరి. ఉత్తర అరేబియాలో మాత్రము బెడోయినులు తమ సంచారజీవనము విడనాడకుండిరి. ఈ అరబుబెడోయిను లెన్నడును ఆర్యులకు వశపడలేదు. ఈ 5 సంకుల శతాబ్దులలోను పరాధీనులయిపోయిన సెమిటికు లందరిలో, పారసీకరాజగు సైరసు లోగడ జెరూసలెము కంపెన యూదులు మాత్రము బాబిలనులో తమ బైబిలువాఙ్మయమును భద్రపఱచుకొని, ఆసంప్రదాయమును ఐక్యమును నిలుపుకొనిరి. యూదులు బైబిలు సృష్టాత లనుటకంటె బైబిలే యూదుల నిర్మాణకారకమనుట సత్యము. అందలి కొన్ని ముఖ్యభావములు అచ్చటి యితరుల భావములకన్న నధికోదాత్తములు; గత 2500 సంllలు కూడ తమకెన్ని నష్టకష్టములు గలిగినను యూదు లాముఖ్యభావముల విడువలేదు.

'దేవుడు నరులు నిర్మింపని స్వర్గదేవాలయవాసి, అదృశ్యుడై భూమిపై ధర్మము పాలించును' అనుట యీయూదుల ముఖ్యభావము. ఇతరజాతు లందరు తమతమ జాతుల గుడివిగ్రహములపై నాధారపడిరి; ఆ విగ్రహమును గుడిని ధ్వంసముచేయగనే ఆ దేవతయు నశించుచుండెను. కాని దేవు

డంతరిక్షమందు గురువులకు బలియజ్ఞములకు అతీతుడను యూదులభావము నూతనము. అబ్రహాం భావించిన యీ దేవుడు యూదులను స్వజనులుగ జేసి, జెరూసలెమును వీరికి తిరుగ అందజేసి, దానిని ప్రపంచపు ధార్మికరాజధానిగ జేయుననని యూదులు నమ్మిరి; ఈవిశ్వాసము వారి కున్నతాదర్శ మిచ్చెను. బాబిలనునుండి వారు జెరూసలెముకు చేరినపుడు వారందరికీభావము కలిగెను.

ఈ కల్లోలకాలమున ఏకభాషా జాతీయు లయ్యు భిన్నాచార సాంప్రదాయులైన యీ బాబిలనువాసులు సిరియనులు, పిరిమిలాను అనేకఫనీషనులును ఉత్తేజకమైన యీ నూతనభావముద్వారా సంఘైక్యాదుల నొంద నాశించిరి. టైర్, సిడన్, కార్తేజ్ నగరి, స్పెయినునందలి ఫనీషనుపురములును క్షీణించినమీదట 'ఫనీషను' లు అనామకులైనను ఆస్థలము లందును, జెరూసలెంలోను యూదసంఘములు వ్యాపించెను. వీరికందరికి బైబిలుపఠనముద్వారా ఏకమతపు కట్టుబాటు కలిగెను. పేరకు జెరూసలెం రాజధానియైనను, బైబిలే వారి ముఖ్యరాజధాని (అనగా భావకేంద్రము). ఇట్టిసంగతి చరిత్రమున నూతనము; చాలకాలముక్రిందనే అనగా సుమేరియనులు చిత్రాక్షరములనుండి లేఖనకళను నేర్చుకొన్నప్పుడే ఇందుకు బీజ మేర్పడినది. రాజు గుడి బంధము లేని యూదుల పరిస్థితి నూతనము; క్రీ. త. 70 కి జెరూసలెమే విచ్ఛిన్నమై పోయెను. భిన్నప్రకృతులు గల వీరందరకు బైబిలుగ్రంథమే యేకబంధమయ్యెను. యూదుల యీమానసికైక్యము గురువులు నేతల నుద్దేశించి యేర్పఱచినది కాదు. ఈయూదుల

వ్యాప్తిచే ప్రపంచమున సంఘీభావము నూతనమానవత్వము గూడ గలిగెను. సాలమనుకాలమున యూదులుకూడ ఇతర జాతులవలె రాజాస్థానమును గుడిని ఆశ్రయించి, గురువులచే నియమితులై, జయాశగల రాజు నడుపు చిన్న సంఘముగా నుండిరి. కాని, అప్పుడును ప్రవక్త రాబోవుచిహ్నము లుండెను. యూదులలో కష్టము లధికమైనకొలదిని, ఈ ప్రవక్తల ప్రాముఖ్యము హెచ్చెను.

ఈ ప్రవక్త లెవరు? వీరు భిన్నకుటుంబములవారు; 'ఎజికియల్' పురోహితుడు, కులీనుడు; 'ఆమస్' గోపాలకుడు, అజచర్మధారి. కాని "చిల్లరగ్రామదేవతలందు విశ్వాస ముంచక, ధర్మరూపుడగు దేవునే నమ్మి, ఆ దేవునికే విధేయులు గావలె" నని వీరందరి బోధన. వీరాజ్ఞాపత్రధారులు; అభిషిక్తులు కారు. "దేవవాణి నాకు గోచరించిన" దనుటయే వీరిమంత్రము. వీరికి తీవ్రరాజకీయభావ ముండెను. పతితజనులను ఈజిప్టుపైనను, అస్సీరియాపైనను వీరు పురికొల్పుచుండిరి. పూజారుల యలసత్వమును, రాజుల పాపచర్యలను నిరసించిరి; సాంఘికాభివృద్ధికిని కొందరు ప్రయత్నించిరి. "ధనికులు బీదల పీడించి నిరాధారులజేయుటను, స్వార్థముకై దుబారా వ్యయముల జరిగించుటను, అన్యదేశీయుల దుర్వ్యయములను దురభ్యాసములను అనుసరించుటను, యీ అబ్రహాము దేవుడగు జెహోవా ద్వేషించును; ఆదేశమును దండించును." అని వీరు బోధించిరి.

ఈ ప్రవచనములు లిఖితములై వ్యాపించెను; యూదులందరు వాని నభ్యసించిరి; గుళ్ళు రాజాస్థానము రాజు ఈ సంస్థల లక్ష్యపెట్టక, ఈ ప్రవక్తలు ధర్మమే జయించు నను భావ

మును ప్రజల కుపదేశించి, వారినందు కభిముఖుల జేసిరి. మానవ చరిత్రలో వీరివిశేష మిదే. ముస్ముందు ప్రపంచమంతయు నేకేశ్వరభావముతో ఏకమై శాంతమై మహోన్నతమగు నని ఈ ప్రవక్తలు ఘోషించిరి. వారియాధిక్యమిందులోనే కలదు. ప్రవక్తలందరికి నీతియుదారత లేదు; కొందరికి ద్వేషము, పరమతమం దసహనము, అల్పబుద్ధియు నుండిన సూచనలు కలవు. అయినను మన మానవజాతికి బంధకములుగా నుండిన జంతుబలిని యాగములకర్మకాండను భావదాస్యమును ఖండించి, మానవ స్వాతంత్ర్యము నైతికజీవనము నుత్కృష్టము లని బోధించి, వీరాకాలమున నూతనశక్తి గలిగించిరి.*

---

* ఆశతాబ్దులందు భారతదేశీయులు భారుకచ్ఛము (బ్రోచి) మొదలగు రేవుస్థలములనుండియు, నేలపై పారసీకము ద్వారాను, యవనదేశముతో వ్యాపారము సాగించుచుండిరి. యవనభాషయు కొందరు భారతీయులకు తెలిసియుండెను.

పైనచెప్పిన విగ్రహపూజ జంతుబలిసంగతులు ఇతరజాతుల విగ్రహదేవతలకు అప్పటి ఆదేశముల దేవతారాధనమునకునే గాక, భారతదేశమున గూడ ఆదిమదేశీయులద్వారా వ్యాపించి నిమ్నజాతులలో గ్రామములందు జరుగు అమ్మవారు మున్నగు క్షుద్రదేవతలపూజకును, కాష్టలోష్టములకును వర్తించును; కాని వేదమతమునకు వర్తించదు. బైబిలంతటికన్న చాల పూర్వమగు వేదములందును, పిమ్మటి గీతలలో వేదాంతసూత్రములందుగూడ దేవాలయ విగ్రహముల ప్రశంసయే లేదు. అప్పటి ఋషులెవరును గుళ్ళలోనే దేవులున్నట్లు, ఒక్కొక్క ప్రాంతమునకు ప్రత్యేకపుదేవు డున్నట్లును, భావింపలేదు. మఱియు, యూదులు క్రైస్తవులు తలచినట్లు దేవుఁ డంతరిక్షమం దెచ్చటనో ఉన్నా డను భావముగూడ తప్పనియు, దేవుడు విశ్వమంతటను సర్వభూతములలోపలను

కూడ ఉన్నాడనియే హిందూమతసిద్ధాంతము. దేవాలయాలలో పూజాసమయమందును ప్రతిరోజును 'సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం। విశ్వం నారాయణం దేవం అక్షరం పరమంపదం .''అనెడు మహోదాత్తభావములు గల మంత్రపుష్పంతోనే ధ్యానింతురు హిందూమతము వ్యక్తిస్థాపితము కాదు అది తక్కినమతములకన్న ఎంతో విశాలము. యూదక్రైస్తవ మతములోనున్న ధర్మ దేవతాసూత్రము పశ్చిమఆసియాకు యూరపుకు నూతనమే; కాని అప్పటికి పూర్వమే మన వేదములందు ఆ సూత్రము స్పష్టముగా నిర్దేశింపబడినది. "సత్యంవద, ధర్మంచర..............ధర్మాన్న ప్రమదితవ్యం" (తై. ఉ. శిక్షావల్లి) "ఏతస్మాజ్జాయతే...... ..ఖం వాయుర్జ్యోతిరాపః......") (ముం. ఉ. 2-1-3) అగ్నిర్మూర్ధా......(ముం. ఉ. 3-4) మున్నగు వేదవచనముల జూడుడు. మఱియు "ఏకోవశీసర్వభూతాంతరాత్మా..."(క. ఉ. 2-5-3) "ఏకో దేవః......సర్వభూతా .." (శ్వే. ఉ. 6-11) మొదలగు వేదవచనములలో దేవుడాకాశమందేగాక సర్వభూతములందును ఒక్కడై వ్యాపించియున్నాడని, యూదప్రవక్తలకు చాలపూర్వమే ప్రపంచమున ప్రథమపర్యాయము తెలుపబడెను. క్రీస్తు పుట్టుటకు చాలశతాబ్దములముందే అనేక హిందూబౌద్ధవిద్వాంసులు సింధుగాంధారప్రాంతమునుండి "పారసీకదేశమును బాబిలను యూదదేశప్రాంతములకును వెళ్లియుండిరి. వేదమతములోని సిద్ధాంతములు ఆయాదేశమందలి జ్ఞానవంతులకు తెలిసి, క్రైస్తవమతసిద్ధాంతము లేర్పడుటకు సహాయకము లయ్యెనని, కొందరు విమర్శకుల అభిప్రాయము. ధార్మికభావములందును వ్యాపారమందును, అప్పుడు క్రైస్తవమతము జనించిన దేశములకు భారతదేశమును మధ్య గట్టిసంబంధ ముండెను.

ఈ అధ్యాయమున చెప్పిన బలులు మూఢవిశ్వాసముతో దేవతల క్రోధశాంతి కని చేయు బలుల నుద్దేశించినవి. మనదేశమందును ఆదిమద్రావిడజాతు లట్టిబలుల నిచ్చుచుండిరి; ఇప్పటికిని కొంతవర కట్టిబలులు జాతరలు నిమ్న

జాతులలో కలవు. వేదవిహితమగు యజ్ఞము అట్లుగాక, ఆత్మార్పణసిద్ధాంత ముపై ఆధారపడినది. వేదయజ్ఞములలోను జంతుహింస కొంచెముండెను; కాని అది భీతివలనను అభిచారబుద్ధితోను చేయునదికాదు; సంతోషముతో స్వార్థ రాహిత్యముతో ఈశ్వరార్పణ రూపముగా లోకసేవ చేయుసిద్ధాంతము కది సూచకము. అప్పటికి ఆర్యబ్రాహ్మణులు ఇంకను మాంసాహారము త్యజింపలేదు. తరువాత గంగా యమునా ప్రాంతవాసపుకాలమున, జంతుయజ్ఞమును జీన బుద్ధాదులు తీవ్రముగ గర్హించిరి; జీవహింస ఉపనిషత్తులయందును, తరువాత భగవద్గీతాదులందునుగూడ, నిరసింపబడినది. కాని, కేవల శాకాహారులగు ఈకాలపు బ్రాహ్మణులు వేదవిహిత మను భావముతో యాగముల జీవ హింసాయుతముగ చేయుట సత్యమా? అందుకు శ్రోత్రియబ్రాహ్మణులు జరిగించు జీవహింస ఆర్యమతోచితమేనా?



# 23. గ్రీకులు

క్రీ. పూ. సుమారు 960 ప్రాంతపు సాలొమోనుకు తరువాత ఇస్రెయిలు జూడా అను యూదుల విభక్తరాజ్యములు క్షీణించుచుండెను; బాబిలనులో దాసులైన యూదులు తమ నూతనసంప్రదాయ మారంభించుచుండిరి. బుద్ధివికాసమిచ్చు గ్రీకుసంస్కృతియు నప్పుడే యుదయించుచుండెను. నిత్యుడు సర్వవ్యాపి ధర్మస్వరూపుడు నగు దేవునికే జనులు నైతికముగ బాధ్యులను ప్రత్యక్షసంబంధమును యూదప్రవక్తలు నిర్ణయించు చుండిరి; గ్రీకు తత్వజ్ఞులు నరుల మనస్సులకు తార్కికచర్చాపద్ధతి నలవరచుచుండిరి. ఈ గ్రీకు లార్యశాఖీయులు; వీరు క్రీ. పూ. 1000 కి కొన్ని శతాబ్దులు పూర్వమే ఈజియనుల పురములలోనికి ద్వీపములలోనికి ప్రవేశించిరి. థాద్మెసు' అను ఫారో యూఫ్రటీసునది కావలి ప్రాంతమును జయించి, అక్కడ గజదళమును మొదట నెదుర్కొనెను; అప్పటికే గ్రీకులు దక్షిణదిశకు బయలుదేరియుందురు. ఆరోజులలో మెసొపొటేమియాలో గజములు, గ్రీసులో సింహములు నుండినవి.

నోసను దగ్ధమగుటకు గ్రీకుధాటి కారణము కావచ్చును. ఐతే 'మినాసు'ను గూర్చియు, ఆయన ప్రాసాదమగు లేబిరిన్తును గూర్చియు, క్రీటనుల కళానైపుణ్యమును గూర్చియు, కథ లున్నను వారిని గ్రీకులు జయించినట్లు, గ్రీకుగాథలేవియు లేవు. ఇతరార్యులలోవలెనే గ్రీకులలోగూడ కవులు గాయ

కులు నుండిరి. సాంఘికసమావేశములందు వీరి గానాదులు ముఖ్యమయ్యెను. కొన్ని గ్రీకుతెగలవారు కలసి, ఆసియామైనరులో ట్రాయ్‌నగరమును ముట్టడించి పట్టుకొని కొల్లగొనిన విధమును 'ఇలియడ్' కావ్యములోను, 'ట్రాయ్'నుండి తన స్వంతద్వీపమునకు వచ్చునపు డాయనకు కలిగిన యాత్రానుభవములను 'ఒడెస్సె' కావ్యములోను, గ్రీకుగాయకకవులు, వర్ణించిరి. క్రీ. పూ. 7, 8, శతాబ్దములలో తమసమీప నాగరికులనుండి అక్షరమాలను గ్రీకులు నేర్చుకొనిరి; ఆమీదట ఈ రెండు యితిహాసకావ్యములు వ్రాయబడినవి. కాని, అంతకు చాలపూర్వమే యివి ముఖస్థముగ నుండియుండును. ఆంగ్లాంధ కవియగు మిల్టను 'పారడైజ్‌లాస్టు'ను రచించినట్లు, హోమరను నొక యంధకవి యారెండు గ్రంథములను రచించె నని కొంత కాలము భావింపబడెను. అట్టికవి వ్యక్తి యొకడుండెనో లేదో, ఉన్నను గ్రంథ మాతడే రచించెనో, లేక అప్పటికి వాడుకలో నున్నదానినే సవరించి లిఖితముచేసెనో, అనిపండిత వర్యులు వినోదచర్చల జేయుచున్నారు. క్రీ. పూ. 8-వ శతాబ్దమున గ్రీకుజాతిజను లందరిలో నీ రెండుయితిహాసములు వ్యాపించి, అందుచే తా మొకేజాతివారు, ఇతరుల పరజాతివారు అను భావము గల్గుచుండెను. ఏకభాష ఏకవాఙ్మయము గలిగి ఆచార వ్యవహారయుద్ధాదులం దేకాదర్శము అన్యోన్యత గలిగిన గ్రీకుల సంఘీభావ మిందుచే వృద్ధియయినది.

గ్రీకుల కప్పటి కినుము తెలియదు; లేఖనశక్తిలేదు. వా రనాగరికులుగ నుండినట్లే ఆ మహాకావ్యములు సూచించును. మొదట తమచే నాశమొందిన ఈజియనుపురముల ప్రదేశము

లందు కు గ్రామములందు వారు తమనాయకుల కొలువుకూట ముచుట్టును వసించుచుండిరి. తరువాత తమపురములచుట్టు ప్రాకారముల గట్టి, తాము జయించిన జనులనుండి దేవాలయ పద్ధతినిగూడ అలవర్చుకొనిరి. ప్రాచీననాగరికులపురములాయా జనుల గుడులచుట్టును క్రమముగా కట్టబడి, తరువాత ప్రాకారపుగోడ చేర్చబడుచుండె నందురు; కాని గ్రీకులపుర ములలో మాత్రము ఆలయముకన్న ప్రాకారమే ముందేర్పడు చుండెను. వారు వ్యాపారము చేయుచుండిరి; వలసపోవుచుండిరి. క్రీ. పూ. 7-వ శతాబ్దివర కుండిన ఈజియనునగరములును వాటి నాగరికతయు అంతరించెను; వాటికి బదులు గ్రీసులోను ఆ ప్రాంతపు ద్వీపములలోను క్రొత్తపురములు బయలుదేరెను. వీటిలో ముఖ్యమైనవి 'ఆథెన్సు, స్పార్టా, కోరిస్తు, థీబ్సు, సామోస్, మైలిటస్'; నల్లసముద్రపుతీరము పొడుగునను, ఇటలీ సిసిలీలలోగూడ అప్పటికి గ్రీకునగరము లేర్పడెను. ఇటలీ దేశపు పాదభాగమును మహాగ్రీసు (మగ్నాగ్రీషియా) అనుచుండిరి. ఫ్రాన్సుదేశమందలి మార్సెల్సు నగరమును, అంతకుపూర్వ మాస్థలమం దుండిన ఫసీసనుపురస్థానమును, గ్రీకులే కట్టిరి. పెద్దమైదానముగా నుండి యూఫ్రటీసు నైలువంటి మహానదీ ప్రయాణసౌకర్యము గలదేశము లొకే పాలకునిక్రింద ఏకరాజ్యముగా నుండుట సహజము. ఈజిప్టు పురములు, సుమేరియానగరములు ఇట్లేకరాజ్యపద్ధతిలో నుండినవి. కాని, గ్రీకునగరములు కొండలోయలలోను ద్వీపములందును చెదిరియుండెను. గ్రీసు 'మహాగ్రీస'నబడు దక్షిణాగ్రముగూడ, పర్వతమయములు; గ్రీకుల ధోరణియు

నిట్టిదే. వారి చరిత్రారంభమునాటికే వారు చిన్న విడిరాజ్య ములలో నుండుచు ఏకీభావము లేకుండిరి. వారిలో కొంత జాతిభేదము నుండినది; అయోనియను (యవన), అయోలికు, డోరికు అను గ్రీకుల మూడుశాఖలలో నొక్కొక శాఖవారు కొన్ని వేరునగరములం దుండిరి. కొన్నిటిలో కొందరు గ్రీకులు మధ్యధరాప్రాంతపు పూర్వజాతివారు కలిసియుండిరి. కొన్ని టిలో అచ్చటి పరాధీనజనులపై కొందరు గ్రీకువీరు లధికారులై యుండిరి.

స్పార్టానగరమందలి 'హిలట్లు' ఇట్టి బానిసలే; కొన్ని పట్టణములందలి ప్రాచీనార్యకుటుంబములు ఇతరసంబంధము లేని కులీనవంశములుగా నేర్పడినవి; కొన్నిటిలో ఆర్యజాతీయు లందరును ప్రజాసత్తాకపద్ధతిలో నుండిరి. కొన్నిటిలో ఎన్నిక రాజులు, వంశపారంపర్యరాజులును, కొన్నిటిలో బలవంత ముగ ఆక్రమణచేసిన రాజులు, సర్వాధికారులగు నియంతలు నుండిరి.

ఈ గ్రీకురాజ్యములు విడిగా నుండుట కచ్చటి భౌతిక స్థితి ముఖ్యకారణము. అందలి పెద్దరాజ్యములు కూడ చాల యింగ్లీషుజిల్లాలకన్నను చిన్నవి; అందేరాజ్యపు జనసంఖ్యయు సుమారు 3 లక్షల దాటి యుండదేమో! అందులో చాల పట్టణము లేబదివేల లోపువి. ఆయాపౌరులు పరస్పరాభి మానులై ఏకోద్యమపరులైనను, ఆనగరము లేకరాజ్యములో కలసిపోవు ధోరణి లేదు. వ్యాపారము వృద్ధియైనకొలది, ఆయాపురములవారు పరస్పరము సంధులు సమాఖ్యలు చేసి కొనుచుండిరి. చిన్నపురములు రక్షణకై పెద్దవాని నాశ్ర

యించెను. ఆవాఙ్మయసంప్రదాయమును నాలుగేండ్ల కొకసారి 'ఒలింపియా' అనుచోట గ్రీకు లందరు కలసి పోటీయాటలు జరుపుటయు, గ్రీకురాజ్యము లన్నిటికిని సంఘీభావము కలిగించెను. వారిలో వారికి తగవులు యుద్ధములు లేకపోలేదు; అయితే యుద్ధమందు క్రూరత అనాగరికత తగ్గియుండెను. వ్యాయామ వినోదములకు వచ్చిపోవు యాత్రికుల కపుడు యుద్ధప్రమాదము లేకుండ యుద్ధవిరామ ముండెను. కాలము గడచినకొలది ఏకసంస్కృతిభావము, ఒలింపికు ఆటలో పాల్గొనుటయు హెచ్చెను; చివరకు గ్రీకురాజ్యము లన్నియు వీటితో సంబంధించిన 'ఎపిరస్' 'మాసిడోనియా' రాజ్యములును ఆ యాటల పోటీలలో పాల్గొనుచుండెను.

క్రీ. పూ. 6, 7-వ శతాబ్దులందు గ్రీకులవ్యాపారము ప్రాబల్యము వారినాగరికత గూడ వృద్ధియైనవి. వారిజీవితము ఈజియనులు నదీప్రాంతీయులదానికన్న కొంత భిన్నమై యుండెను. గ్రీకులకును దేవాలయము లుండినవి; కాని ఆగురువులకు వెనుకటి గురువులవలె సర్వాధికారము లేదు. గ్రీకులకు నాయకులు యజమానికుటుంబములు నుండినను, దైవాంశ రాజపద్ధతిచే గల్గు ఆడంబరము లేదు. వారిసంఘమున కొన్ని 'కులీనకుటుంబము'లుండి, వారిలో నొకరినొకరు యుక్తస్థితిలో నుంచెడివారు; వారి 'ప్రజాప్రభుత్వము' గూడ కులీన, కుటుంబముల ప్రభుత్వమే. సామాన్యసభలలో ప్రతిపౌరుడును వచ్చి సార్వజనికవిషయచర్చలలో పాల్గొనవచ్చును. కాని, ఈనాటి ప్రజాసత్తాకప్రభుత్వమున ప్రతినరునకు ఎన్నిక యధికారమున్నటుల గ్రీకుప్రజాప్రభుత్వములో ప్రతినరు

నికిని హక్కుండుటలేదు. చాల గ్రీకుప్రజారాజ్యములందు, కొన్నివందలో వేలో మాత్రం పౌరసత్వపుహక్కు గలవారుండిరి; వేలకొలది బానిసలు దాస్యవిముక్తులు వగైరాలు రాజ్యాంగసంబంధము లేకుండిరి. గ్రీసులో సాధారణముగా ముఖ్యవిషయములు కొందరు 'సమర్థుల' వశముగా నుండెను. జనసామాన్యమునకు ప్రముఖనాయకులే రాజులు పాలకులు అగుచుండిరి; వారు 'ఫారో' 'మినోస్'లవలె, మెసొపొటేమియా రాజులవలె దైవాంశికులను భావము లేదు. ఆర్యేతరులలోవలె గాక, గ్రీకులమనోభావములందు పరిపాలనక్రమమందు నూతనస్వేచ్ఛ యుండెను. ఉత్తరాటవుల సంచారకాలమం దార్యుల కుండిన స్వాతంత్ర్యధోరణి గ్రీకునగరములందు నుండెను. ఈయార్యులే చారిత్రకకాలమున ప్రజలే తమ్ము పాలించుకొనుపద్ధతి నారంభించిరి.

అనాగరకయుద్ధములు వదలునప్పటికి గ్రీకులలో విచక్షణజ్ఞానము కలిగినది. వారిలో మతగురువు లున్నను, గ్రీకులు స్వయముగా జ్ఞానార్జన చేయుచు, జ్ఞానము నితరులకు బోధించి గ్రంథస్థము జేయుచు ప్రాణిస్వభావమునుగూర్చియు చర్చించుచుండిరి. ఇట్టి సమస్యల నిదివరలో తమకు తోచినట్లు గురువులును రాజులును సెలవిచ్చుటయేగాని, సామాన్యజనులు చర్చించుటలేదు. క్రీ.పూ. 6-వ శతాబ్దముననే,అనగా ఈసయ్య బాబిలనులో భవిష్యత్తును గురించి బోధించుకాలముననే, మైలిటసునగరపు 'థేల్సు', 'అనక్జిమాండరు' 'ఎఫిసను' నగరపు 'హిరాక్లిటసు' మొదలగు పరిశీలకులు ప్రపంచస్వభావము వానియుత్పత్తి భవిష్యత్తు మొదలగు సమస్యలగూర్చి

యుక్తితో స్వతంత్రముగ విమర్శించిరి. సృష్టిస్థితివిషయమైన గ్రీకులచర్చలగూర్చి ముందు చెప్పబడును. క్రీ. పూ. 6-వ శతాబ్దమునుండి యుండిన గ్రీకువిమర్శకులే ప్రపంచమున మొదటి జ్ఞానాభిమానులు, తత్వజ్ఞులు. మానవచరిత్రములో క్రీ. పూ. 6-వ శతాబ్దము చాల ముఖ్యము. అప్పుడు సృష్టిస్వభావమును గూర్చి, విశ్వమందు నరునిస్థానమునుగూర్చియు, పరిశోధన యారంభించెను. యూదప్రవక్తయగు ఈసయ్య తనగంభీర సందేశము నిచ్చెను. ఆసమయముననే భారతదేశమున గౌతమ బుద్ధుడు తన నూతనోపదేశమును, చీనాలో 'కన్ఫూషియసు'ను 'లోత్సే' యును తమ క్రొత్తసిద్ధాంతములను, ప్రచురించిరి. గ్రీసులోని ఆథెన్సు మొదలు ఆసియాచివరనున్న శాంతమహా సముద్రము వరకు అంతటను నరులమనస్సులలో నూతనవికాసము కలిగినది.*

---

*గ్రీకుశాఖలలో అయోనియనులది ప్రఖ్యాతినది. ప్రాచీనగ్రీకులలో సంస్కృతికి ప్రసిద్ధికెక్కిన ఆథెన్సురాజ్యవాసు లయోనియనులే. ఇట్టివిద్వాంసులు జ్ఞానులు కొందరు అలెగ్జాండరుతోను తరువాతను భారతదేశమునకువచ్చి, ఇచ్చటిపండితులతో ప్రసంగించి జ్ఞానార్జనచేసి మరలిపోయిరి. ఈ అయోని యనులబట్టి పూర్వపుగ్రీకులు, ఆ ప్రక్కవారుగూడ పూర్వపుసంస్కృత గ్రంథములందు 'యవను' లనబడుచుండిరి; వారిలిపి 'యవనాని' యనబడెను. తరువాత మధ్యకాలమునుండి యవనశబ్దము ముసల్మానులకు అరబ్బులకును వాడబడుచున్నది.

ఆర్యులస్వతంత్రాలోచన స్వాతంత్ర్యేచ్ఛ ప్రాచీనభారతీయార్యుల చరిత్రమునగూడ కనబడుచున్నది. భారతదేశమునగూడ కొన్నిప్రాంతములందు రాజకత్వపద్ధతితోను, అదిలేకుండను, ప్రాచీనకాలమున ప్రజాప్రతినిధులు పాలించుచుండిన సూచనలు కలవు.

క్రీ. పూ. 6-వ శతాబ్ది మొదలు గ్రీకులు కొంత వైజ్ఞానికభావములను భారతీయార్యులనుండి గ్రహించియుందురు. ఆ కాలమున భారతవర్షమనబడు బృహద్భారతదేశము పారసీకప్రాంతమువరకు నుండెను. సింధునదియుత్తరప్రాంతమందలి 'తక్షశిల' గాంధారదేశపు 'పుష్కలావతి'యు విశ్వవిద్యాలయములుగ నుండెను. అచ్చటి భారతీయవిజ్ఞానులనుండి గణితతత్త్వశాస్త్రాదుల నూతనరహస్యములను యవనాది పాశ్చాత్యులు గ్రహించిరి. దశాంకము (=డెసిమలు) కొన్ని జ్యామితిసిద్ధాంతములు, ప్రస్తుతపు అంకెలును, భారతీయులనుండియే పాశ్చాత్యులు గ్రహించిరి. వైద్యవిద్యగూడ అప్పుడు భారతదేశమున చాల వృద్ధిలో నుండెను. మరికొంత చతురంగపుఆట, కొన్ని వాఙ్మయవిషయములు, పంచతంత్రాదికథలు ఇచ్చటినుండియే పారసీకమునకు, అందుండి యూరపునకును వ్యాపించినవి. మరియు గ్రీకులలో జ్ఞానాభిమానము తత్త్వజ్ఞానము ఆరంభించుటకు చాలశతాబ్దములపూర్వమే వేదకాలమందు, మనదేశమందలి ఆర్యవిద్వాంసులు సృష్టిస్వరూపము దానియుత్పత్తి మొదలగు అనేక సమస్యల నెత్తి, వాటిని సమర్థతతో చర్చించిరి. అనేకతత్త్వవిషయములగూర్చి ఋషులు తమ స్వతంత్రాభిప్రాయముల వివరించిరి. [ఉ. "నాసదాసీన్నో సదాసీత్తదానీం నాసీద్రజో నో వ్యోమాపరో యత్; కిమావరీవః కుహకస్య శర్మన్నంభః కిమాసీద్గహనం గభీరం; ..సో అంగవేద యదివా న వేద"(ఋ. సం. మం. 10-1[illegible]-2). "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే .....పతయోరయీణాం." (ఋ. సం. మం 10-[illegible]0-10) "కోయమాత్మేతి ...."(తై. ఉ. 2-6); "కేనేషితం పతతి ప్రేషితం......" (కే. ఉ. 1-1)

"స్వభావ మేకే కవయో వదంతి......" శ్వే. ఉ. 6-1)

"అస్యలోకస్యకాగతి......" (ఛాం—ఉ. 6-9)

ఇట్టి అనేకవేదప్రకరణములందున్నరీతిని అప్పటి మరియేప్రాచీనవాఙ్మయమునందును అధ్యాత్మతత్త్వవిషయములు చర్చింపబడలేదు. సృష్టిస్వభావమునుగూర్చి భౌతికశాస్త్రములగుర్చిగూడ ప్రాచీనభారతీయులు విమర్శించిరి. ప్రధాన ఉపనిషత్తులేగాక షడ్దర్శనములుగూడ క్రీస్తుకు పూర్వము పదవ

శతాబ్దము ప్రాంతముననే ఏర్పడెను. ఇందు సేశ్వరమతములగు యోగన్యాయ వైశేషిక వేదాంతదర్శనములకేగాక, ఈశ్వరప్రసక్తి పెట్టుకోని పూర్వమీమాంసకు సాంఖ్యమునకు గూడ ప్రమాణస్థానమిచ్చుట భారతీయుల చర్చాస్వాతంత్ర్యమును సూచించును.

"ఒడిస్సీ, ఇలియడు" వలెనే వాటికన్న ప్రాచీనతరములగు మన వేద సంహితలు ఉపనిషత్తులు మొదలగు వాఙ్మయము నేవ్యక్తులు రచించిరో నిర్ధారణలేదు. ఇవి అపౌరుషేయములని కొందరి సంప్రదాయము. వేదసంహితలలోని కొన్నికొన్ని భాగములు వసిష్ఠుడు విశ్వామిత్రుడు మొదలగు వేరువేరు ఋషులకు గోచరించెనని ఐతిహ్యము. కొన్ని ఆధ్యాత్మికవిషయములు ఆరుణియాజ్ఞవల్క్యాది ప్రాచీనమహర్షులు తమతమ శిష్యుల కుపదేశించిన ట్లాయా ఉపనిషత్తులందు చెప్పబడినది. కొంతకాలమునకు వ్యాసమహర్షి వేదము లన్నిటిని విభజించి వాటికి సరియగు క్రమ మేర్పరచుటచే, ఆయనకు వేదవ్యాసుడని పేరు కలిగెనందురు; ఈయన చాలగ్రంథములుకూడ రచించె నందురు. ఇప్పటి బ్రహ్మ (= వేదాంత) సూత్రములను, విపులగ్రంథమగు మహాభారతమును అష్టాదశపురాణములను గూడ, వ్యాసుడు రచించె నని ప్రస్తుతమున్న మహాభారతమునందు వ్యాసునిచర్యలేగాక ఆయనవంశీయులచర్యలు వారిశిష్యుల భావములు గూడ వివరింపబడినవి అనేకవిషయాలయందు పరస్పరభిన్నాభిప్రాయములు గల్గి భిన్నకాలికములగు వీటినన్నిటిని ఒకరే రచించిరనుటయు భావ్యముగా తోపదు. వేర్వేరు కాలములందు 'వ్యాస' నామము కలవారనేకు లుండిరేమో తెలియదు. శ్రీమద్రామాయణగ్రంథమును వాల్మీకిమహర్షియే రచియించె నని ప్రసిద్ధి. కాలక్రమమున అందు కొన్ని ప్రక్షిప్తశ్లోకములు చేరియుండు నని విమర్శకుల యభిప్రాయము.

# 24. గ్రీకు పారసీక యుద్ధములు

ఇట్లు గ్రీసుపురములలోను, దక్షిణయిటలీలోను, ఆసియామైనరులోను గ్రీకులు స్వతంత్రవిజ్ఞానాన్వేషులై యుండ, జెరూసలెంలోను బాబిలనులోను తుదిహీబ్రూప్రవక్తలు నర జాతికి భావస్వాతంత్ర్యము గల్గించుచుండ, పారసీకులు మీడులు అను ధీరనాగరికులగు ఆర్యులు అప్పటిసామ్రాజ్యములం దెల్ల విశాలమగు "పారసీకసామ్రాజ్యము"ను స్థాపించుచుండిరి. సైరసు పాలనమున బాబిలనును చాల నాగరికమగు "లిడియా"యు పారసీకసామ్రాజ్యమున జేరెను; మధ్యధరా సముద్రపు తూర్పుతీరమందున్న ఫనీషను నగరములును, ఆసియామైనరులోని గ్రీకుపురములన్నియు వీరి సామంత రాజ్యము లైనవి. 'కాంబిసెను' ఈజిప్టును వశపరచుకొనెను. ఈపారసీకసార్వభౌములలో మూడనవాడు మీడువంశీయుడు నగు మొదటిడెరయసు (క్రీ. పూ. 521) అప్పటి నాగరికలోక మంతటికి పాలకుడైనట్లుండెను. అతనియుద్యోగులు రాజాజ్ఞ లతో డార్డెనల్సు మొదలు సింధునదివరకును ఈజిప్టుమొదలు మధ్యఆసియా వరకును తిరుగుచుండిరి.

యూరపులోని గ్రీకులు, ఇటలీ కార్తేజి సిసిలీ స్పెయి నులలోని ఫనీషనురాజ్యములును, పారసీకసామ్రాజ్యమున జేర లేదు; కాని వారు దానిని గౌరవించిరి; దక్షిణరష్యా మధ్యఆసి యాలలోని ప్రాచ్యార్యులగు సిథియనుల దండులు మాత్రము ఈశాన్యపు సరిహద్దులపై తరచు దండెత్తుచు బాధించుచుండిరి

ఈ విశాలరాజ్యపు ప్రజలందరును పారసీకులు కారు; దీనివిజేతలగు కొలదిమంది పారసీకులు; మిగిలినవారందరు ఆయాదేశములవారే. అందు పారసీ రాజకీయభాష యైనది. వర్తకము క్రయవిక్రయవ్యవహారములు ఇంకను విశేషముగా సెమిటికు పద్ధతులవే; మధ్యధరాసముద్రమున పూర్వమువలె టైరుసిడను పురములే ముఖ్యమగు రేవుపట్టణములై యుండెను. సెమిటికు నౌకలే సముద్రమునై దిరుగుచుండెను. ఈ సెమిటికువర్తకులు కోస్తాప్రయాణము చేయుచో, హిబ్రూమతగ్రంథాధారపు సమానధర్మములు, మనోభావములు, ఆచారములును అక్కడ కనబడెను. ఈసామ్రాజ్యమున గ్రీకులు వ్యాపింపదొడగిరి. సముద్రమున గ్రీకులు సెమిటికులతో పోటీచేయుచు, తమ తీక్ష్ణబుద్ధిచే మంచియుద్యోగు లగుచుండిరి.

మొదటిడెరయసు యూరపుదాడికి సితియనులు కారణము. సితియనురౌతుల స్వస్థలమగు దక్షిణరష్యా నతడు చేరదలచెను. పెద్దసైన్యములతో (యూరపును హద్దగు) బాస్పరస్ దాటి, బల్గేరియాద్వారా డాన్యూబ్ నదిజేరి, నౌకలపై నానదినిదాటి, ఉత్తరప్రాంతము జొచ్చెను; కాని, అతని సైనికులు పదాతులు; సితియను అశ్వికు లాసేనచుట్టు కాచి, సామగ్రినందనీయక, తీవ్రయుద్ధముచేయక, ఒంటిజనుల బాధించుచు, ఆతనిసైన్యమును చికాకుపరిచిరి. డెరయసు విధిలేక వెనుకబట్టెను. తానుమాత్రము రాజధానియగు 'సుసా'కు మరలిపోయి, కొంతసైన్యమును థ్రేసు మాసిడోనియాలలో వదలెను. మాసిడోనియా ఆసేనకు లొంగెను. కాని డెరయసు ఓటమిజూచి, ఆసియాలోని గ్రీకుపురరాజ్యములు తిరుగ

బడెను; యూరపులోని గ్రీకులు నందు జేరిరి. డెరయసు యూరపులోని గ్రీకుల నణప నిశ్చయించి, ఫనీషను నౌకల తోడ్పాటుతో ఆద్వీపముల నరుసగా పట్టుకొని, తుదకు (క్రీ. పూ. 490) ఆథెన్సునగరముపై బడెను. ఆసియామైనరు తూర్పు మధ్యధరా ప్రాంతముల రేవుపట్టణములనుండి, గొప్ప నౌకాదళము వచ్చి ఆథెన్సు కుత్తరమున మారథనువద్ద సైన్యముల దింపెను. కాని, ఆసైనికులచట ఆథెన్సుపౌరులచే పూర్తిగ నోడింపబడిరి.

అప్పు డొకచిత్రము జరిగెను. అంతవరకు గ్రీసులో ఆథెన్సుకు స్పార్టా విరోధి; కాని అప్పుడు గ్రీకులు మోటు విదేశీయుల బానిసలు గాకుండ కాపాడు మని ఆథెన్సుస్పార్టాకు దూత నంపెను. మహావేగముతో నాదూత నాటుదారిని రెండు దినములలో నూరుమైళ్ళకుపైగా పరుగిడి స్పార్టా చేరెను. అట్లే స్పార్టను లుదారులై మూడుదినములలో తమ సైన్యమాథెన్సు చేర్చిరి. కాని అప్పటికే పారసీకు లోడిరి. పారసీకనౌకాదళ మాసియాకు మరలిపోయెను. గ్రీసుపైని పారసీకుల మొదటి దండయాత్ర ఈరీతిని ముగిసెను.

రెండవది మిక్కిలి తీవ్రమైనది. మారథను పరాజయము వినినతరువాత డెరయసు మరణించెను. ఆతనిపుత్రుడు వారసు అయిన 'క్సర్ క్సెసు' నాలుగేండ్లతిదీక్షతో నక్షౌహిణుల సిద్ధపరచెను. కొంతకాల మీభయముచే గ్రీకులందరు నేకమైరి. ప్రపంచమందప్పటి సైన్యములందెల్ల క్సర్ క్సెసుసైన్యము చాల పెద్దది. కాని అందు సంఘటన లేదు. క్రీ. పూ. 480 లో ఆసైన్యము నౌకలపై డార్డెనల్సు దాటి తీరమువెంట నడచెను; సామగ్రితో నౌకాదళముకూడ వచ్చెను. 'థర్మాఫిలే' అను

కనుమసందునొద్ద సుమారు 1400 మంది స్పార్టనువీరు లా మహా వాహిని నెదుర్కొని, అరికట్టి, భీషణసమర మొనర్చి, ఆరణరంగమున పూర్తిగా హతులైరి; కాని శత్రుసైన్యము కపారనష్టము గలిగెను. హతశేషులగు క్సర్క్సెను సైనికులు దెబ్బలు తినియు, థీబ్సు ఆథెన్సులపై బడిరి. థీబ్సుజనులు లొంగిపోయి, సంధి యొనర్చుకొనిరి. ఆథెన్సుప్రజలు పురమువదలి పారిపోగా, ఆనగరము తగులబెట్టబడెను.

ఇట్లు గ్రీసులంతయు క్సర్క్సెసు హస్తముల జిక్కినట్లుండెను. కాని, హఠాత్తుగా గ్రీకుల కింకొకవిజయము లభించెను. పారసీకనౌకాదళమున మూడవవంతు కూడలేని గ్రీకు నౌకాదళము 'సలమిస్' అఖాతమున పారసీకనౌకల నెదుర్కొని వానిని ధ్వంసమొనరించెను. అంతట క్సర్క్సెసు సైన్యములకు సాధనసామగ్రి సరఫరా ఆగిపోయెను; అతడు భీతిచెంది, తనసైన్యమున అర్థభాగముతో ఆసియాకు మరలిపోయెను. మిగిలినసైన్యము (క్రీ. పూ. 479) ప్లటియావద్ద మరల నోడెను. చెదిరిన పారసీకనౌకలు గ్రీకులచే తరుమబడి, ఆసియామైనరులోని 'మైకేలు' వద్ద ధ్వస్తమయ్యెను.

పారసీకప్రమాద మంతటితో నంతరించెను. ఆసియాలోని గ్రీకుపట్టణములు చాలవరకు స్వాతంత్ర్యము లాయెను. ఈ విషయమంతయు విరళముగ రసపుష్టితో హెరొడొటస్ వర్ణించి, ప్రథమచారిత్రకగ్రంథము వ్రాసెను. హెరొడొటస్ క్రీ. పూ. 484 ప్రాంతమున ఆసియామైనరులోని యవననగరమగు 'హెలికార్నససు'లో జనించెను; పరిజ్ఞానముకై బాబిలను ఈజిప్టు మున్నగు ప్రదేశములను స్వయంగా దర్శించెను. మైకేలు

యుద్ధానంతరము పర్షియా అంతఃకలహముచే అల్లకల్లోలమున బడెను. క్రీ. పూ. 465 లో, క్సర్క్సెసు చంపబడెను. ఈజిప్టు సిరియా మీడియాలలో విప్లవములు బయలుదేరి, ఆ సామ్రాజ్యము విచ్ఛిన్నమాయెను. హెరోడోటస్ తన చరిత్రలో పర్షియాదౌర్బల్యమును వివరించి, గ్రీకులందరు కలసి పర్షియాను జయింపవలె నని ప్రచారముచేసెను. 'అరిష్టాగొరస'నువాడప్పటికి తెలిసియున్న ప్రపంచపు పటముతో స్పార్టాచేరి, అచ్చటి వారితో నిట్లు చెప్పిన ట్లందు వ్రాయబడెను:

"ఈ మోటు విదేశీయులు శూరులు కారు. మీరో మహాయోధులు ......వెండి, బంగారము, కంచు, విలువగల అల్లికవస్తులు, జంతువులు, బానిసలు మొదలగు వారి అద్భుత సంపత్తు మీరు పూనుకొంటే మీ వశమగును."*

---

* అప్పుడు పారసీకసామ్రాజ్యమున చేరియుండిన గాంధారులు మున్నగు కొద్దిమంది భారతీయులుగూడ పారసీకవాహినిలో జేరియుండి రని కొందరు తెల్పిరి. కొన్ని పారసీకప్రాంతములును ముఖ్యముగ భారతదేశమును ఆమూల్యపదార్థములకు యూరపులో చాల ప్రసిద్ధమైయుండెను. ఆగ్రీకులు తమకు విదేశీయులగువారిని 'బార్బేరియ'నులు అనుచు, తమ నాగరికతయే అత్యుత్తమ మని తలచిరి; ఆసంప్రదాయమున యూరపియనులకు 'బార్బేరియను' శబ్దము 'విదేశీయులు' అనియే గాక, 'మోటు అనార్యులు' అనియుం సూచకమయ్యెను. ఇట్లే మనవారు పాశ్చాత్యులను 'యవనులు మ్లేచ్ఛులు హూణులు' అనుచుండిరి; మహమ్మదీయులు ఇతరులను 'కాఫరు' లనుచుండిరి; ఆపదము లన్నిటిలోను క్రమముగా కొంతనీచత్వధ్వని ఏర్పడెను.

# 25. గ్రీసు విభవము

పర్షియా దాడితొలగినపైన, ఒకటిన్నర శతాబ్దములు గ్రీకునాగరికత యుచ్చస్థితిలో నుండెను; ఆకాలములో క్రీ.పూ. 431 మొదలు 404 వరకు "పెలపనీషను యుద్ధము"న, ఆథెన్సు స్పార్టా మొదలగు గ్రీకురాజ్యములు ఆధిపత్యముకై పరస్పరము కలహించెను. క్రీ. పూ. 338 లో ఉత్తర ప్రాంతపు మాసిడోనియాదేశీయులు గ్రీసును జయించిరి; కాని యీకాలమందే గ్రీకుల జ్ఞానవికాసమును శిల్పకళాకౌశలమును వృద్ధియై, భావిమానవజాతికి ప్రబోధమిచ్చెను.

ఈజ్ఞానవికాసమునకు నాయకమణి ఆథెన్సునగరము. క్రీ. పూ. 466 మొదలు ,428 వరకు ముప్పదియేండ్లపైకాలము ఆథెన్సు పాలకుడు మహావీరుడు ఉదారుడునగు పెరికిల్సు పారసీకనాశితమగు ఆనగరమును మరల నిర్మించెను. ఇప్పటికిని తమ సుందరశిథిలములచే ఆథెన్సుకు కీర్తినిచ్చు పూర్వభవనము లీతడు కట్టించినవే; ఇట్లు సమర్థులగు వాస్తుశిల్పులను వాస్తుశిల్పులద్వారా భౌతికముగనే గాక, గొప్ప సాహితికులను తత్వశాస్త్రజ్ఞులను బోధలకును ప్రోత్సహించి, అక్కడ జ్ఞానాభివృద్ధికి కూడ కారకు డయ్యెను. క్రీ.పూ. 438-వ యేట, హెరొడొటస్ ఈపురముకువచ్చి అచ్చట చరిత్రను లిఖించెను. అనక్జాగొరసు ఇచ్చటకువచ్చి, సూర్యగోళములకు నక్షత్రములకు వైజ్ఞానికవివరణల నారంభించెను. అయస్కిలసు సొఫొకిల్సు యూరిపిడిసులు వరుసగా గ్రీకునాటకసాహిత్యమును మనోహరము ఓజోయు

తము జేసి, ఉన్నతికి దెచ్చిరి. పెలపనీసను యుద్ధమువల్లను రాజకీయ కలహములచేతను గ్రీసులో శాంతి చెడినను, ఆథెన్సులో పెరికిల్సు తరువాతకూడ జ్ఞానాభివృద్ధి యగుచునేయుండెను. రాజకీయస్థితి మలినమైనను, బుద్ధివికాసము కించను చురుకు గలిగెను. పెరికిల్సుకు చాలపూర్వమే మనస్స్వాతంత్ర్యప్రియులగు గ్రీకులసంస్థలు తర్కమునకు ప్రాముఖ్యము నిచ్చెను. తీర్పుచేయు అధికారము రాజుది గురువులదిగాక, సభికులది ప్రజా నాయకులదియు నైయుండెను. వక్తృత్వము వాదశక్తి ప్రవీణలక్షణామై యుండెను. యువకుల కీకళలు నేర్ప, 'సోఫిస్టు'లను తార్కికులు బయలుదేరిరి. తగు విషయజ్ఞానము లేక విపులచర్చ జరుపవీలులేదు; కనుక, వాగ్ధోరణితోబాటు విషయజ్ఞానము కూడ వృద్ధినొందెను. ఈసోఫిస్టులు చేయు కృషిచే, వాదయుక్తి, ప్రామాణ్యము, తర్కపద్ధతులు శైలి, వీటినిగూర్చి సహజముగ తీవ్రవిమర్శ జరిగెను; కాని, అర్భాటము హెచ్చెను. పెరికిల్సు తరువాత ఆథెన్సులో నుండిన సోక్రటీసుపండితుడు ఈసోఫిస్టుల పిసండ వాదముల విమర్శించి ప్రసిద్ధుడయ్యెను. కొంతమంది ధీ యువకులు సోక్రటీసుకు శిష్యులైరి. జనుల భ్రమపెట్టెనను నేరము మోపి, క్రీ.పూ. 399-వ యేట, సోక్రటీసుకు మరణశిక్ష విధించిరి; అథెన్సులో 'నాగరికత'గా ఆయనచే తనయింట మిత్రులమధ్య విషము ప్రాశించి, ఆశిక్ష నమలుజరిపిరి. కాని జనుల 'భ్రమ' పోలేదు; ఆయన శిష్యులద్వారా ఆబోధలు వ్యాపించెను. వీరిలో ముఖ్యుడగు 'ప్లాటో' (క్రీ పూ. 427 మొదలు, 347 వరకు) 'అకాడమీ' అను కళాలయములో తత్వశాస్త్రము బోధించెను. ఆయన చేసిన రెండుబోధ

లలో మొదటిది నరుల మనఃప్రవృత్తుల మూలసూత్రముల విమర్శించుట; రెండవది రాజకీయ సంస్థలవిమర్శ; మన సంఘము లన్నిటికన్న ప్రశస్తమగు ఆదర్శసంఘస్థితిని చిత్రించి యీాయన 'ఉటోపియా' ను రచించెను. అది యీావిషయమును గూర్చిన మొదటి గ్రంథము. ఇంతవరకు సాంఘిక కులాచారముల మాటాడక శిరసావహించు జనుల కిందుచే నూతన ధైర్య సాహసములు కలిగెను. "మీాకు తగు ధైర్యసాహసము లున్న చో, చాలవరకు మీాకున్న సాంఘికరాజకీయ బాధలన్నియు మీారు వారింప వీ లగునవే. మీాసామర్థ్యమును మీా రెఱుగరు. కాని మీారు నిశ్చితులై కార్యశూరులైతే, ఇంతకన్న చక్కగా మీారు జీవింపవచ్చును" అని 'ప్లాటో' జనులకు విశదపరచెను; ఇట్టి యుపదేశ మప్పటి ప్రజలకు బోధపడలేదు. ప్రజాస్వాతంత్ర్య ప్రక్రింద కులీనులపాలనను సూచించు "రిపబ్లిక్" అను గ్రంథము నంతకుముందే ప్లాటో రచించెను; ఇట్టియుపాతో రాజ్యమునకు న్యాయనిబంధనల నిర్ణయింప 'లాజ్' అను గ్రంథమును చివర వ్రాసెను; కాని, అది పూర్తి కాలేదు. ప్లాటో అనంతర మాతని శిష్యుడగు 'అరిస్టాటిల్' తార్కికరాజకీయ కృతుల విమర్శను సాగించెను. ఆయన మాసిడోనియాలోని 'స్టగీరా' నుండివచ్చి, 'లిసియం'లో బోధించుచుండెను. ఆయనతండ్రి మాసిడోని యాలో ఆస్థానవైద్యుడు; (మహావిజేతకాబోవు) అక్కడి యువ రాజగు అలెగ్జాండరుకు అరిస్టాటిలు కొంతకాలము గురువు. ఈను మానవపద్ధతులను గూర్చి అరిస్టాటిలు రచించిన గ్రంథము తర్క శాస్త్రము నుచ్ఛస్థితికి తెచ్చినది. తరువాత 15 శతాబ్దుల సమస్య లట్టే యుండెను; మధ్యకాలపండితు లంతట వాటిని చర్చింప

నారంభించిరి. ప్లాటోవలె "ఉటోపియా"లను రచింపక, అరిస్టాటిలు 'నరు లింకను విజ్ఞానులైనగాని తమభావిస్థితిని నియమించుకొనలే' రని కనిపెట్టెను. అందుచే నతడు శాస్త్రీయజ్ఞానమును క్రమపద్ధతితో సంపాదింపదొడగెను; యథార్థసంగతుల గ్రహింప బరిశోధకుల బంపెను. అతడు జీవప్రకృతిచరితము రాజకీయశాస్త్రముగూడ ప్రారంభించెను. "లిసియం"వద్ద ఆయన శిష్యులు
158 వేరువేరు రాజ్యముల రాజ్యాంగనిర్మాణముల బరీక్షించి, వాటితారతమ్యముల చర్చించిరి. క్రీ. పూ. 4-వ శతాబ్దియందే మన ఆధునికవిమర్శకుల బోలువా రుండిరి. పిల్లల యాలోచనవలెను స్వప్నసంగతులవలె నుండిన ఆదిమాలోచకులపద్ధతులు పోయి, జీవితసమస్యలగూర్చి శిష్ట విమర్శ లిట్లువచ్చెను. అంతకు వెనుకటి మాయిక వికృతదేవతలవిగ్రహములు, సాంకేతికచిహ్నములు, కులశేషులు, మనోవికారబంధము లన్నియు నిందతో పూర్తిగా తొలగెను; క్రమపద్ధతులపైన స్వతంత్రచర్చ మొదలిడెను. ఉత్తరారణ్యములనుండి వచ్చిన ఈనవీనుల స్వతంత్రమనోభావము గుహల గాఢాంధకారమును భేదించి వెలుగు నిచ్చెను.

—

# 26. అలెగ్జాండరు సామ్రాజ్యము

క్రీ. పూ. 431-404 వరకు 'పెలపనీషను యుద్ధము'న గ్రీకులు నష్ట మొందుచుండ, వారి కుత్తరమందలి 'మాసిడోనియను'లు బలీయులై నాగరికు లగుచుండిరి. మాసిడోనియా వారి భాష గ్రీకుకు సంబంధించినదే. ఒలింపిక ఆటలలో మాసిడోనియనులును చాలసార్లు పోటీచేసిరి. క్రీ.పూ. 359-వ యేట 'ఫిలిప్' అను శూరు డీచిన్న రాజ్యప్రభువయ్యెను. అతడు సామ్రాజ్యకాంక్షి; ఇదివరలో గ్రీసులో పట్టుబడి బందీగా, అచ్చటి గ్రీకువిద్యను చక్కగా నభ్యసించెను. గ్రీసు లేకీభవించినచో ఆసియాను జయింపవచ్చు నను (హెరొడోటస్ విశదీకరించిన) భావము నాత డక్కడ గ్రహించియుండును. అతడు ముందుగా తనరాజ్యమును సేనను చక్కబెట్టుకొనెను. అప్పటికి వేయేండ్లనుండి అశ్వికరథములు, వాటికి తోడుగ పదాతులును, యుద్ధములందు జయసాధనములుగ నుండెను. అశ్వికులు యుద్ధములందు పాల్గొన్నను, అంతవరకు వారు క్రమశిక్ష సంఘటన లేక, యుద్ధమున అప్రధానులైరి. ఫిలిపు పదాతిజను లొకరినంటి యొకరుగ దట్టమైనదళము సమర్చి, వారి ప్రక్కలను అశ్వికదళాలు యుక్తితోను క్రమశిక్షతోను పోరునట్లు తయారుచేసెను. ఇతడు ఇతనికుమారుడు అలెగ్జాండరును పెట్టిన వ్యూహపద్ధతులలో అశ్వికదళపు ముట్టడియే ముఖ్యము. ఎదుటను దట్టని పదాతిదళము శత్రుసేనతో పోరుచుండ, ప్రక్కలనుండి గుఱ్ఱపుపటాలము శత్రువులయశ్వముల దరిమి, శత్రుపదాతులను ప్రక్కలనుండి.

వెనుకనుండి ముట్టడింతురు. మరియు, వీరిసేనలోని ధనుర్ధరులు తమబాణములతో శత్రువుల రథాశ్వములను గురిపెట్టి చంపుదురు; అంతట శత్రురథములు వ్యర్థమై, దళములును చెదురును.

ఈనూతనసేనతో ఫిలిపు థెసలీగుండ గ్రీసువరకు తన రాజ్యమును విస్తరింపజేసెను. అతడు క్రీ. పూ. 338 నందు 'చరోనియా'వద్ద ఆథెన్సుతోను వారి మిత్రరాజ్యములతోను యుద్ధముచేసెను; అంతట గ్రీసంతయు అతని పాదాక్రాంతమాయెను. చివరకు హెరోడోటసు ఆశాస్వప్నము ఫలించెను; గ్రీకు మాసిడోనియా ప్రముఖులసమితి యేర్పడి పారసీక దేశముపై దాడిచేయ నిశ్చయించిరి; అందుకు ఫిలిపును సర్వసేనానిగా నియమించిరి. అతని సేనాముఖము, క్రీ. పూ. 336-వ యేట డార్డెనెల్సు జలసంధి దాటి, ఆసియాలోనికి ప్రవేశించెను. కాని ఫిలిపు ఆ జయప్రాప్తి లేకుండగనే హత్యచేయబడెను. ఫిలిపు ద్వితీయవివాహము చేసికొనెను; అందు కీర్ష్యవహించి, ప్రథమభార్యయగు అలెగ్జాండరుతల్లి యీహత్యను జేయించి యుండును.

ఫిలిపు తన కుమారుని విద్యావిషయమై ప్రత్యేక శ్రద్ధ వహించెను. అప్పటి తత్వజ్ఞులలో శ్రేష్ఠుడగు అరిస్టాటిలు నా బాలునికి గురువుగ నేర్పఱచెను;తన భావములను యుద్ధానుభవములను అలెగ్జాండరుకు స్వయముగ నేర్పుచు, అతనితో చర్చించుచుండెను. చరోనియాయుద్ధమున అప్పటికి 18 యేండ్ల బాలుడయ్యు, అలెగ్జాండరే అచ్చట అశ్వదళనాయకుడై యుండెను. అందువల్లనే తాను రాజగునప్పటి కిరువదేండ్ల యువ

కుడే గైనను, తన తండ్రి యుద్దేశించిన పారసీక దండయాత్ర నాతఁడు వెంటనే ప్రారంభింపగల్గెను.

మాసిడోనియాలోను గ్రీసులోను అలెగ్జాండరు అధికారస్థాపనకు మొదటిరెండేండ్లు పట్టెను; అంత నతఁడు క్రీ. పూ. 334 లో ఆసియాలోనికి ప్రవేశించి, "గ్రానికసు" వద్ద సుమారు తన సేన యంతయున్న పారసీకసేన నోడించి, ఆసియామైనరులో కొన్ని పురముల స్వాధీనపరచుకొనెను. రేవుపట్టణములగు టైర్ సిడోనుల నౌకాదళములును సముద్రాధికారమును అప్పటికి పారసీకులవశమం దుండెను. కనుక, అతఁడు ముందుగా తీర నగరముల లోబరచుకొని, తన రక్షక సేనల నందుంచెను; అచ్చట రేవుపట్టణమేదైన పారసీకులవశమం దుండినచో, స్వదేశముతో సముద్రముపై తన రాకపోకలను వా రరికట్టియుందురు. క్రీ. పూ. 333 న ఇస్ససు వద్ద, మూడవ డెరయసు అను పారసీక రాజు నడపిన నానాజాతి సంకులమగు మహాసేన నలెగ్జాండ రోడించెను. ఆపారసీకసేన $1\frac{1}{2}$ శతాబ్దముల క్రింద గ్రీసుకువచ్చిన 'క్సర్క్సెసు' అక్షౌహిణివలె సంఘటన లేనిదై యుండెను; యుద్ధ ప్రసక్తిలేని రాజసభికులు, అంతఃపురస్త్రీలు, అనుచరులును గూడ అందుండిరి. యుద్ధసమయమున వారిరక్షణ పారసీకసేనకు మరింత భారమయ్యెను. 'సిడను' వెంటనే లొంగెను; కాని 'టైరుపుర' మలెగ్జాండరును పట్టుదలతో నెదిరించి, చివరకు సంకులరణమున బట్టువడి, దోపిడియై, విధ్వస్తమయ్యెను. "గాజానగరము"ను ముట్టడిపైన పట్టువడెను. క్రీ. పూ. 332 చివరకు, అలెగ్జాండరు విజయియై, ఈజిప్టు ప్రవేశించి ఆదేశ పాలనను పారసీకులనుండి వశపఱచుకొనెను.

మిశ్ర దేశీయులు తనపై తిరుగుబాటు చేయకుండ, భూమిసముద్రాలనుండి అందుబాటై తనకులోబడు స్థలములందు, 'అలెగ్జాండ్రెట్టా' 'అలెగ్జాండ్రియా' అను రెండు నగరముల నీజిప్టులో నలెగ్జాండరు కట్టించెను. పశ్చిమ మధ్యధరా ప్రాంతములందలి ఫినీషను యూదవర్తకు లాప్రదేశముల వదలి, ఈ నూతననగరములందు నిండిరి; ఆ పశ్చిమ రాజ్యవ్యాపారమంతయు నీ నగరములకు జేరెను. క్రీ. పూ. 331 లో అలెగ్జాండరీజిప్టునుండి, అంతకుపూర్వపు 'తూత్మొసు, రామెసెస్, నెకో' రాజులవలె, బాబిలనుపై జైత్రయాత్రకు బయలుదేరెను. అయితే, ఈయన టైరుపురముద్వారా వెళ్లెను. అప్పటికి విస్మృతమైన 'నినేవా' పురపు శిథిలసమీపమున 'ఆర్బెలా' వద్ద డెరయసు నతడెదుర్కొని, మహాయుద్ధముజేసెను. అందు పారసీకుల రథములదాడి నిరుపయోగమైనది; నానాజాతి సంకులమగు వారిసేనలు మాసిడోనియనుల అశ్వదళముల పార్శ్వపు ముట్టడికి తాళక చెదరెను; అంతట ఎదుటనున్న గ్రీకు కాల్బలముచే పారసీకులు పూర్తిగ నోడింపబడిరి. పలాయితులలో డెరయసే ముందై, ఇంక శత్రువు నెదుర్చుటకు యత్నింపక, ఉత్తరముగా మీడుల దేశములోనికి పోయెను. అప్పటి కింకను గొప్పదై సుప్రసిద్ధముగు బాబిలనును, అచ్చటినుండి తరువాత 'సుసా' 'పెర్సిపోలి'పురములను అంతట అలెగ్జాండరు ప్రవేశించెను. అచ్చట ఉత్సవము మద్యపానము జరిగి, అందు రాజరాజగు డెరయసుప్రాసాదము దగ్ధము చేయబడెను.

అంతట అలెగ్జాండరు మధ్యఆసియాలో పారసీక

మొదట ఉత్తరముగా పోయి డెరయసును వెంబడించి, ఉదయ వేళ నాతని నందుకొనెను; ఆలోగా డెరయసు అనుచరులే తమ రాజును హత్యచేసిరి. గ్రీకు సేనాముఖము వచ్చునప్పటికి జీవించి యున్నను, అలెగ్జాండరు చేరునప్పటి కాతడు చనిపోయెను. అలెగ్జాండ రంతట కాస్పియను సముద్రముచుట్టి పశ్చిమతుర్కిస్థానపు కొండలు దాటి, దక్షిణముగ వచ్చి, 'హీరటు నగరము'ను స్థాపించి, ఆఫ్ఘనిస్థానములోని కాబూలుకు వచ్చి, అచ్చటనుండి ఖైబరు కనుమలగుండ భారతదేశము చేరెను. అచ్చట పంజాబులో రాజగు 'పోరసు' అను పురుషోత్తమునితో సింధునదీతీరమున నొక మహాయుద్ధము జరిగెను; ఈ రణరంగమున ప్రథమ పర్యాయము మాసిడోనియనులు గజదళము నెదుర్కొని, గెల్చిరి. తరువాత నతడు నౌకలపై సింధునదీముఖద్వారము వరకు వెళ్ళి, బెలూచిస్థానపు తీరము వెంట వెనుకకుబోయి, క్రీ. పూ. 324-వ యేట అనగా ఆరేండ్లకు, తిరుగ 'సుసానగరి' చేరెను. అంత నాత డామహాసామ్రాజ్యమునకు బలస్థైర్యముల జేకూర్ప యత్నించెను; తన నూతనప్రజల యనురాగము సంపాదించుటకై పారసీకరాజవేషములను పగిడీని అతడు ధరించెను; అందుచే మాసిడోనియను లసూయ వహించి చిక్కు పెట్టిరి; మాసిడోనియను సేనానులకు ఆప్రాంతపు పారసీక బాబిలను స్త్రీలకు మధ్య వివాహములు జరిపి, ప్రాచ్యపాశ్చాత్య సంయోగము గలిగింప నాతడు యత్నించెను. కాని యిట్లు సామ్రాజ్యైక్యము గలుగదగువర కతడు జీవింపలేదు; బాబిలను నగరమున విశేష మధుపానముచేసి జ్వరపీడితుడై, క్రీ. పూ. 323 లో మరణించెను.

వెంటనే, ఆమహాసామ్రాజ్యము విచ్ఛిన్నమైపోయెను. ఆతని సేనానులలో 'సెల్యూకస్' అందలి ప్రాచ్యసామ్రాజ్యమును (అనగా సింధునది మొదలు ఎఫెససువరకు) దేశమంతను స్వాధీనమందుంచుకొనెను; 'టాలమీ' అను సేనాని యీజిప్టును వశపరచుకొనెను; 'ఆంటిగోనసు' మాసిడోనియా ప్రభువయ్యెను. ఆ మహాసామ్రాజ్యపు ఇతర ప్రదేశములు, స్థిరపాలన లేక, ఆయా ప్రాంతపు సాహసికుల హస్తగతమగుచుండెను. ఇంతలో, ఉత్తర ప్రాంతములనుండి విదేశీయుల దాడు లారంభమై, క్రమముగా ముట్టడులు వృద్ధియయ్యెను. చివరకు రోమను ప్రజాప్రభుత్వపు పాలకులు పశ్చిమదిశనుండి వచ్చి ఇందొకొక ప్రాంతమును జయించి వశపరుచుకొని, ఒక స్థిరసామ్రాజ్యమును స్థాపించిరి.

# 27. అలెగ్జాండ్రియా కళాలయము, గ్రంథాలయము

అలెగ్జాండరుకు పూర్వమే, పారసీక రాజ్యములందు చాలచోట్ల గ్రీకులు వర్తకులుగను శిల్పులుగను ఉద్యోగులు గను జీతపు యోధులుగను వ్యాపించిరి. క్సర్ క్సెసును అనంతరము కలిగిన రాజ్యాధికారపు కొట్లాటలలో, ప్రత్యాపేక్షతో పది వేల గ్రీకుసైనికుల జట్టొకటి 'జెనఫన్' నాయకత్వమున పని చేసిరి; వారు బాబిలనునుండి ఆసియాలోని గ్రీకునగరములకు మరలివచ్చుటను గూర్చి, "రిట్రీట్ ఆఫ్ ది టెన్ తౌజండ్" అను కావ్యము నాసేనాని స్వయముగ రచించెను; ఇదే సేనాని స్వర చితమగు మొదటి యుద్ధకథ. కాని అలెగ్జాండరు విజయమొంది, ఆయనసామ్రాజ్యము నతని అనంతరం గ్రీకుసేనానులు పంచు కొనగనే, ఆప్రాంతములందు గ్రీకువారి వేషభాషలును సంస్కృతియు బాగుగ వ్యాపించెను. ఈగ్రీకు వ్యాప్తిచిహ్న ములు దూరస్థములగు మధ్యఆసియాలోను, హిందూదేశపు ఈశాన్యప్రాంతమున గూడ కన్పడుచున్నవి. భారతీయ కళా పరిణామమునను గ్రీకుల కళాస్పర్శ కనబడును.

చాల శతాబ్దములవరకు ఆథెన్సే గ్రీకుకళలకు సంస్కృ తికి నాయకమణిగ నుండెను. క్రీ. త. 529 వరకు అనగా రమారమి వేయేండ్లు, అచ్చట విద్యాలయములుండెను. కాని కొంతకాలముకు అలెగ్జాండరు స్థాపించిన క్రొత్తవ్యాపారస్థాన

మగు అలెగ్జాండ్రియాయే విజ్ఞానకృషికి కేంద్రమయ్యెను. అక్కడ గ్రీకుసేనాని యగు టాలమీయాస్థానమున గ్రీకుభాషనే మాట్లాడుచుండిరి. అంతకుపూర్వ మీటాలమీ అలెగ్జాండరు కాంతరంగికుడై, అరిస్టాటిలు భావముల బాగుగ గ్రహించి యుండెను; అందుచే నితడు విజ్ఞానపరిశోధనల బహుసమర్థతతో సాగించెను. అలెగ్జాండరు యుద్ధములగూర్చిన యాతనిగ్రంథము ఖిలమైపోయెను.

అరిస్టాటిలు జరిగించిన శాస్త్రీయచర్చలకై, అలెగ్జాండరు కొద్దిగ ద్రవ్యసహాయము చేసెను; కాని విజ్ఞానసహాయమునకై టాలమీ స్థిరనిధి నేర్పర్చి, దాని నలెగ్జాండ్రియాలో కళాలయముకు కళాదేవతలకును దత్తముచేసెను. రెండుమూడు తరములవర కీనగరమున చక్కని వైజ్ఞానిక పరిశోధనలు జరిగెను. అచ్చటి వైజ్ఞానిక ప్రముఖులలో 'యూక్లిడు జ్యామితి' అనగా క్షేత్రగణితము రచించెను; 'ఎరటస్థనిసు' భూపరిమాణమును ఏబదిమైళ్ళ వ్యాసపుభేదముతో నిర్ణయింపగలిగెను; 'అపలోనియసు' సూచ్యగ్రవస్తువులగూర్చి లిఖించెను; 'హిప్పార్కసు' ఆకాశపునక్షత్రపటమును సూచీ పత్రమును ప్రథమమున రచించెను. "హెరో" ఆవిరియంత్రపు పద్ధతిని మొదట కనిపెట్టెను. అప్పుడే సిరాకూస్యునుండి అచ్చటికి సుప్రసిద్ధ పదార్థవిజ్ఞానవేత్తయగు "ఆర్కిమిడిసు" వచ్చి, తరుచు అచ్చట పరిశోధన సలుపుచుండెను. గ్రీకులలో జీవాంగవిభాగజ్ఞుడగు హెరోఫిలసు, జీవ్యంగశస్త్రచికిత్స గూడ చేసెడివా డని చెప్పెదరు.

మొదటి రెండవ టాలమీలకాలమున జరిగినంతటి విజ్ఞానాభివృద్ధి తిరుగ క్రీ. శ. 16-వ శతాబ్దమువరకు జరుగలేదు.

కాని ఆయభివృద్ధి చిరస్థాయికాక, మరొకతరముమాత్రముండెను; అంతత్వరలో నది క్షీణించుటకు కారణము లనేకములు. ఆకళాలయము రాజస్థాపితమై, అందుల పండితులందరును రాజాదరణపైనే ఆధారపడవలసివచ్చెను. అరిస్టాటిలుకు విధేయమిత్రుడగు మొదటి టాలమీ దాని నాదరించెను. కాని, కొన్నితరములైనంతట ఆరాజవంశీయులు ఈజిప్టుమతగురువులకు లోనై, ఆవిజ్ఞానార్జనను ఉపేక్షించి పరిశోధన పద్ధతిని నిల్పుచేసిరి. ఆకళాలయ మారంభమైన ఒక శతాబ్దముకే, పరిశోధన నిల్చిపోయెను. మొదటిటాలమీ అలెగ్జాండ్రియాలో శాస్త్రీయ విద్యల కాలవాలమగు గ్రంథాలయమును గూడ స్థాపించెను. అందలి గ్రంథములకు నకలు ప్రతులగూడ వ్రాసి అమ్ముచుండిరి. అందుచే ననేకలేఖకు లందు పనిచేయుచుండిరి. ఇప్పటి మనవిజ్ఞానాభివృద్ధి కీరీతిగా అప్పుడు అంకురార్పణ కలిగినది. ఆకళాలయ గ్రంథాలయముల స్థాపనము మానవచరిత్రపు ముఖ్యాంశాలలో నొకటి; అది ఆధునికేతిహాసమునకు ఆరంభకము.

మఱియు, ఆపరిశోధనకును జ్ఞానవ్యాప్తికిని గొప్ప ప్రతిబంధకము లుండెను; అప్పటి వైజ్ఞానికులకు వర్తకులతోను, శిల్పులతోను, సాంఘికసంబంధము లేకుండెను. అద్దపువస్తువులు లోహవస్తువులు చేయు శిల్పులతో వైజ్ఞానికులకు ఆవిషయమున సంప్రతింపులు లేకుండెను. చిత్రవిచిత్రములగు రంగుల గాజుపూసలను డబ్బీలనేగాని, అప్పటి గాజుపనివాండ్రు "ప్లారెంటైసుప్లాస్కు" (అనగా ఉష్ణరక్షకములగు సీసాలు), "లెన్సు" (అనగా దుర్భిణిఅద్దము) ఇట్టివానిని చేయలేదు. సాదాఅద్దము మంచి దని వారికి తోచలేదు; లోహకారు డాయుధములను

నగలనేగాని, సున్నితమగు త్రాసుల నెన్నడును చేయలేదు. శాస్త్రజ్ఞులు పరమాణువులనుగూర్చి పదార్థతత్వముగూర్చి దీర్ఘా లోచనలను జేయుటేగాని, నిత్య కృత్యముల కుపయోగించు ఎనామలురంగు తయారు మొదలగువానినిగూర్చి వారి కనుభవము లేకుండెను. కనుక ఆకాలపు అలెగ్జాండ్రియావారు సూక్ష్మదర్శని యంత్రములగాని, రసాయనశాస్త్రముగాని, కనిపెట్టలేదు. ఆవిరియంత్రముని కనిపెట్టిన "హెరో" ఆయంత్రమును పంపులకుగాని ఓడలకుగాని ఉపయోగించలేదు; అది నిరుపయోగమయ్యెను. ఒకవైద్యము తప్ప నితరాంశములందు వైజ్ఞానికావిష్కారములను జనులకు నిత్యోపయోగకర మగు పనుల కుపయోగించనందున, జనుల కందు శ్రద్ధలేక, విజ్ఞానాభివృద్ధికి తగుప్రోత్సాహము లేకుండెను. ఇట్లు మొదటి రెండవ కాలమిాలతరువాత జ్ఞానవికాసముకు సహాయములేక ఆకళాలయపు ఆవిష్కారములు పురాతనగ్రంథములందే నిలచి పోయెను. 'రినసన్స' న్నబడు 16-వ శతాబ్దపు పునర్వికాసమువలన ఆవిజ్ఞానము కుజ్జీవము కలిగి, అప్పుడు జనసామాన్యమునకు దానివాసన తగిలెను.

ఆగ్రంథాలయమున క్రొత్తపుస్తకములు దయారుచేయు విధమును బాగుపడలేదు. పేలికలనుండి పొందికగా కాగితములు చేయుట ప్రాచీనజనులకు తెలియదు. కాగితములను ప్రప్రథమమున చీనావారు తయారుచేసిరి; అప్రజ్ఞ క్రీ. త. 9-వ శతాబ్దమువరకు పాశ్చాత్యులకు చేరక, తోళ్లు పెపైరస్‌బెరడు చెక్కలను మాత్రమే వ్రాత కుపయోగించిరి. వీటిముక్కలను చుట్టుటకును, తీసి చదువుకొనుటకును, చాలచిక్కుగా నుండెను.

అందుచే పత్రములను అచ్చు పుస్తకములను తయారుచేయ వీలులేకపోయెను. పూర్వశిలాయుగపుకాలముననే, జనులకు అచ్చువేయుటగూర్చి తెలిసియుండెను; ప్రాచీనసుమేరియాలో ముద్రిక లుండినవి. కాని, సమృద్ధిగా కాగితములు లేనందున అచ్చువలన జనులకు లాభము లేకపోయినది. ప్రతులువ్రాయు లేఖకులును అచ్చుపద్ధతికి వ్యతిరేకులై యుందురు. అలెగ్జాండ్రియాలో గ్రంథములు చాల ప్రియముగ నుండెను. అందువల్ల కొద్దిమంది శ్రీమంతులును ప్రబలురును తప్ప మిగిలిన ప్రాచీనులలో జ్ఞానవ్యాప్తి లేక పోయెను. మొదటి యిద్దరి టాలమీలవద్ద నుండిన తత్వజ్ఞుల సంబంధికులను దప్ప మిగిలినవారికి ఆ జ్ఞాన రశ్మి సోక లేదు; అది బాహ్యప్రపంచమునకు తెలియలేదు. మసిబారిన లాంతరుదీపమువలె లోలోపల ఆగిపోయినది. ముందు వైజ్ఞానికవిద్యలో సంపూర్ణపరివర్తనము గలిగించు బీజ మప్పుడు నాటబడిన దని తెలియక, మిగిలినవారందరు పూర్వపద్ధతినే సంచరించుచుండిరి. ఈలోగా అలెగ్జాండ్రియాయే ఒక మూఢవిశ్వాసపు అంధకారము పాల బడెను.* తరువాత వేయేండ్ల వరకు అరిస్టాటిలు నాటిన బీజము లీనముగనే యుండెను. దరిమిలాను మొలకరించి కొన్ని శతాబ్దములలో ఆధునికజ్ఞానముగను భావములుగను పరిణమించెను; అవి ఇప్పుడు మానవ జీవితమునంతను మార్చివేసినవి.

క్రీ. పూ. 3-వ శతాబ్దములో అలెగ్జాండ్రియాలోనే గాక, ఇతరనగరములలోను ప్రతిభావంతులు జ్ఞానవ్యాప్తి

---

* ఏడవశతాబ్దమున అరబ్బులు అలెగ్జాండ్రియాలోని ప్రసిద్ధగ్రంథాలయమును తగలబెట్టి రను ఆరోపణ ఈవాక్యమున సూచిత మని తోచును.

జేయుచుండిరి. సిసిలీద్వీపములోని సిరాక్యూసు అను గ్రీకు నగరమున విద్యాజ్ఞానము లభివృద్ధిలో నుండెను. ఆసియా మైనరులోని 'ఫెర్గమం' అనుచోట నొక పెద్ద గ్రంథాలయము నుండెను. కాని యీయవనరాజ్యమున కుత్తర దేశీయుల దాడిచే ముప్పు కలిగెను. ఇదివరలో గ్రీకు ఫ్రిజియను మాసి డోనియను జనుల పూర్వీకులు వచ్చిన మార్గముననే, 'గాలు' లను ఆర్యజాతినూతనవన్యజనులు దాడి వెడలి, అనేక పుర ములు ముట్టడించి ధ్వంసముచేసిరి. వీరి వెనుక ఇటలీనుండి 'రోమనుల'ను మరియొకతెగ విజృంభించి, డెరయసు అలెగ్జాండ రుల మహాసామ్రాజ్యపు పశ్చిమార్ధభాగమును తమ స్వాధీనము చేసుకొనిరి. వారు సమర్థులు న్యాయశాస్త్రనిపుణులు ఐనను విజ్ఞాన కళాశాలలందు వారి కభిరుచి లేదు. మరియు మధ్యఆశియా నుండి 'పార్థియనుల'ను అశ్వారూఢు లగు సైనికులు చాప హస్తులై సెల్యూకసుపాలించిన రాజ్యముపై క్రొత్తగా దాడి వెడ లిరి. వారు క్రీ. పూ. 3-వశతాబ్దియందు 'పెర్సిపోలి' 'సూసా' నగరములనుండి పాలింపబడు గ్రీకు పారసీక సామ్రాజ్యము నాక్రమించి, పూర్వదేశములకు పాశ్చాత్యదేశములతో సంబం ధము విడగొట్టిరి. మరియు ఈసమయమున స్ఫురద్రూపులై ఆర్యభాషికులగు నార్డికుజాతివారేగాక, ఈశాన్య ప్రాంతము నుండి స్వర్ణదేహచ్ఛాయ నీలశిరోజములు గల్గిన మంగోలియను భాషికులగు కొందరు సంచారిజాతివారుగూడ రాదొడగిరి. ఈజనులగూర్చి ముందు వివరింపబడును. *

---

* గ్రీకులనుండి కొన్నివిషయములు భారతీయులు గ్రహించినట్లే, భారతీయవిద్వాంసులనుండియు గ్రీకులు చాల విషయముల గ్రహించి రని

టాలమీ మొదలగు గ్రీకు ప్రముఖులే స్పష్టపరచిరి. ఈ యుభయజాతుల వైజ్ఞానికులమధ్య అలెగ్జాండరుకు పూర్వమును, తరువాతనుగూడ తరుచు పరస్పరసమావేశము కలిగి, అందుచే నుభయజాతుల శాస్త్రవిజ్ఞానము వృద్ధియయ్యెను. అయితే భారతీయుల ప్రాచీనవైజ్ఞానికగ్రంథములు తరువాత చాలవరకు నశించుటచేత, అప్పటి వైజ్ఞానికాభివృద్ధిస్థితిని సరిగా నిర్ణయింప సాధ్య మగుటలేదు. తక్షశిలావిశ్వ విద్యాలయము అలెగ్జాండ్రియాకు పూర్వమే మహోచ్ఛ్రదశయం దుండెను.

ఇట్లు పాశ్చాత్యుల ప్రాచీన నాగరికత వివరింపబడినది; ఇక 28-వ అధ్యాయమున భారతదేశపు బుద్ధుని జీవితచర్యలు సిద్ధాంతరహస్యములు చెప్పబడును. వాటిని గ్రహించుటకు ముందుగ అప్పటికి మనదేశస్థితి యెట్లుండెనో, క్లుప్తముగ గమనింపదగును.

ఆర్యజాతీయుల ముఖ్య ప్రాచీనగ్రంథమగు మన వేదవాఙ్మయము నుండి వారి పరిస్థితి, సంస్కృతి, దాని ప్రపంచమునకు కలిగిన లాభములు, ప్రపంచమున అవాఙ్మయపు స్థానమునుగూడ, సూక్ష్మముగ గమనింపవచ్చును. ఆర్యజాతులందరి వాఙ్మయములలో ఋగ్వేదసంహితయే అత్యంత ప్రాచీనము, విశిష్టము, ప్రధానము; మరియు నీవేదమంత్రము లిన్ని వేలయేండ్ల నుండి యెట్టిమార్పులు కలుగకుండ, పదక్రమముల యేర్పాటుతో భద్రముగ కాపాడబడి, అందలి భావము గ్రహించుటకు శిక్షానిరుక్తాది వేదాంగములుగూడ వ్రాయబడినవి. కనుక గ్రీకు లాటిను మొదలగు ఇతరార్యజాతుల 'ఇలియడ్, ఒడెస్సె' మొదలగు వాఙ్మయగ్రంథములకన్న, ఋగ్వేద సంహితయందే. ప్రథమార్యజాతియొక్క మూలభాష, వారి ప్రవృత్తి, భావములు, ఆచారములు బాగుగా గోచరించును. కనుక, అసలు ఆర్యజాతియొక్క యథాస్థితి ఋగ్వేదమువలననే చక్కగా తెలియును. మరియు ఆర్యభాష ఋగ్వేదభాషయందే విశేషపరిణామములేని సహజస్థితిలో నుండుటచే, దాని

భాషను ఇతరార్యభాషలతో పోలిక విస్పష్టముగ నున్నది. గ్రీకు లాటిను ఇంగ్లీషు సంస్కృతము మొదలగు భాషల పరస్పర సంబంధమును, భాష లన్నియు కాలక్రమమున వృద్ధినొంది పరిణామ మొందురీతులను తెలియ జేయు శాస్త్రమగు 'కంపారటివ్ ఫిలాలజి, అను తౌలిక భాషాశాస్త్రము సంస్కృత సహాయమువలన (ముఖ్యముగ ఋగ్వేదమువలన)నే యేర్పడెను. మరియు ఆదిమజనుల ధార్మిక భావములు ఎట్లు అంకురించి వృద్ధియగు చుండునో, సాదృశ్యాదులచేతను, ఉత్ప్రేక్షారూపకాదులచేతను అందుల గూర్చిన కవివర్ణన లెట్లు కాలక్రమమున మార్పుచెంది ఐతిహ్యము లేర్పడునో, తెలియజేయు 'కంపారటివ్ మిథాలజీ, అను తౌలిక గాథాశాస్త్రమును గూడ, ఋగ్వేదసంహితనుబట్టియే 'మాక్సుముల్లరు' మొదలగు పాశ్చాత్య విద్వాంసు లేర్పరచిరి. పాశ్చాత్యగ్రంథములలోవలె గాక, ఋగ్వేదసంహిత లోని ఈ కథలు గాథలు నిష్కపటమగు సహజశైలిలో, అందలి యథార్థ భావములు పూర్తిగ మరుగుపడకుండగనే కనబడుచున్నవి. (యాస్కకుమా రిలాదులగ్రంథము లీగాథల యుద్దేశములను కొంతవరకు తెల్పుచున్నవి); వీటి సహాయముచే పాశ్చాత్యులు హోమరు మొదలగువారి తమ మూల గ్రంథముల గాథల భావములగూడ సమన్వయముచేసి, గ్రహింపగలిగిరి. ఇంతేగాక మతవిషయమున వాయువు అగ్ని ఆకాశము (ద్యౌః) జలము (వరుణుడు) సూర్యుడు (మిత్రుడు) మొదలగు ప్రకృతివస్తువుల తేజస్సును మొదట వేర్వేరుగ ఈశ్వరులుగ భావించి, తరువాత వీటియన్నిటి అంత ర్యామి యగు పరమేశ్వరు డొక్కడే యనియు, అట్టి పరమాత్మ విశ్వమంత టను వ్యాపించియుండు ననియు, జీవేశ్వరులకు ప్రకృతి ఆత్మలకు సన్నిహిత సంబంధమున్న దనియు ఇట్టి ధార్మికభావములు, విమర్శలు, వాటిలో క్రమ పరిణామము, ప్రపంచపు ప్రాచీన వాఙ్మయములలో నెల్ల మన వేదసంహిత లందు ఉపనిషత్తులయందు మాత్రమే విశదపడును. ఇట్లే అప్పటి ఆర్యేతరుల

భావము లెట్లుండెనో వాటిని ఆర్యవిద్వాంసు లెట్లు అన్వయించిరో, ఆదిమ తంత్ర భేషజములుగూడ అధర్వవేదమున తెలియనగును. (అధర్వసంహిత లోని విషయములు కొంతవరకు ఆదిమద్రావిడ సంపర్కమున వారిభావముల ద్యోతనచేయుచు రచింపబడిన వని చాలమంది విమర్శకుల అభిప్రాయము) ఈ సిద్ధాంతములచే నూతనముగ నేర్పడిన "కంపారటివ్ రిలిజియన్" అను తౌలిక మతశాస్త్రముగూడ మన వేదములందలి విశిష్టాంశముల గ్రహించుట వలననే (19-వ శతాబ్దమున) ఉత్పన్నమైనది. ఆధ్యాత్మిక విషయముల గూర్చి యితరదేశముల ప్రాచీనార్యుల స్వతంత్ర గ్రంథములలో స్పష్టభావము లేవియు లేవు. ఇతరదేశార్యులు ప్రపంచమునకు ప్రత్యేకమతము నీయలేదు. సరిగదా, తాము చిరకాలముక్రిందనే అన్యజాతీయము అన్యదేశీయము అగుక్రైస్తవమతమును (కొందరు మహమ్మదీయమతమును) అవలంబించిరి. ఒక్కభారతీయార్యులే మొదటినుండి ఆధ్యాత్మికవిషయములందు స్వతంత్ర కృషిచేసి, స్థైర్యము ప్రత్యేకవ్యక్తిత్వము గల హిందూసనాతన ధర్మమును స్థాపించి, దానిని అయిదువేలయేండ్లనుండి పోషించుటయేగాక, ప్రపంచ చరిత్రలో విశేషపరిణామము గావించిరి. మరియు ఇప్పుడును ప్రపంచపు ముఖ్య మతములలో నొకటియగు బౌద్ధమతస్థాపనకు గూడ కారకులైరి.

క్రీ. పూ. 3000, 2000 ఆ ప్రాంతమువరకు ముఖ్యముగా సింధునది కాశ్మీరప్రాంతములందే, ఈ ఆర్యు లుండిరి. అప్పటికే ఉన్నతదశలో నుండి, ఆదిమజాతివారితో మిశ్రితులై, నాగరికులగు ద్రావిడులు మన దేశమంతటను వ్యాపించియుండిరి. క్రీ. పూ. 1000 నాటికి, ఆర్యులును వారిభాషయు ఆర్యావర్తమంతయు వ్యాపించిరి; మరియు, అగస్త్య పరశురామాదుల నాయకత్వమున సాహసికులగు కొందరార్యులు ఆశ్రమముల ద్వారా దక్షిణదేశమునగూడ ఆర్యసంస్కృతిని శిల్పకళలను వ్యాపింపజేయుచుండిరి. అయినను ఆర్యద్రావిడసంఘర్షమునను ఇతరకారణములవల్లను ప్రాచీ

నార్యమతమందు కాలక్రమమున చాలపరిణామముకలుగుచుండెను. ఋగ్వేద సంహితలోని ఆయామండలముల ద్రష్టలగు విశ్వామిత్ర వసిష్ఠాదుల ఆయా ఋక్కుల వివరములనుబట్టి, ఆఋషిసత్తములు లౌకికవిషయములందును ముఖ్యముగా తమ సంఘక్షేమమందును చాలశ్రద్ధవహించుచు, తమ రాజులకు సంఘములకు తోడ్పడుచుండినటుల గన్పడును. గాయత్రీమంత్రమును మొదట కనిపెట్టిన విశ్వామిత్రుడు క్షాత్రమందును సాహసమందును మరి యెవరికిని తీసిపోలేదు. వా రార్యేతరులలోను తమసంస్కృతిని శ్రద్ధతో వ్యాపింపజేసిరి. అప్పటియార్యులమధ్య జన్మచేకులాచారభేదములుగాని, వారిలో అంతర్వివాహము అంతర్భోజనములు నిషేధించుటగాని ఇంకను కనబడదు. సంఘమందు సమన్వయభావ మధికముగ నుండెను. అప్పటిభారతీయార్యులు హిమాలయముల అద్భుత ప్రకృతిదృశ్యములందు ఈశ్వరుని చిద్విలాసము ననుభవించుచు, ఈశ్వరుని ప్రేమతో నారాధించుచు, తమజాతియొక్క ప్రపంచముయొక్క భావి అభివృద్ధియందు విశ్వాసము కలిగి, ఉత్సాహ సాహసపూరితులు ఆనందాన్వితులునై, లోకాభ్యుదయమును అపేక్షించుచు, ప్రకృతిరహస్యములనుగూడ గ్రహించుచుండినట్లు కనబడును. పరమహిమయుతమగు ఆగిరిసానువుల ఆశ్రమములందు విధికృతముగ వారు మాంసభోజనము సోమపానముగూడ చేయుచు, యజ్ఞాదుల నిర్వర్తించుచు, నిత్యాగ్నిహోత్రముల నుంచుకొనుచుండిరి. బదరికాశ్రమము నైమిశాదులును పురాణవిద్యాకేంద్రములుగ నుండెను. తరువాత యజుర్వేదము ఆయా బ్రాహ్మణములు ఆరణ్యకములు ఏర్పడినకాలమునకు, ఆర్యులు కోసల విదేహ కురుపాంచాలాది దేశములందుండినట్లును, యాజ్ఞవల్క్యాది జ్ఞానాన్వేషణపరులు కొందరు ఆధ్యాత్మికవిషయములందును జ్యోతిశ్శాస్త్రాదులందును ప్రత్యేకపరిశోధనలు సల్పుచుండినట్లును కన్పడును. అప్పటికి మొదట ఇక్ష్వాకు హరిశ్చంద్ర సగర దిలీప శ్రీరామాదులక్రింద కోసలరాజ్యమును, తరువాత

మహాభారతయుద్ధకాలమున కురుపాంచాలరాజ్యమును, హస్తినాపురాది నగరములును ప్రధానముగ నుండెను. కోసలరాజ్యము వృద్ధిలో నుండిన శ్రీరాములకాలముననే మిథిలాధిపతి యగు జనకుడు పాలించిన విదేహరాజ్య మాధ్యాత్మిక పరిశోధనకు ప్రసిద్ధికెక్కియుండెను. జనకుడును ఆయనగురువగు యాజ్ఞవల్క్యుడును జ్ఞానులయ్యు, మహాకర్మయోగులుగను లోకసేవచేయు చుండిరి. బ్రాహ్మణముల తరువాత వచ్చిన సూత్రవాఙ్మయకాలమునను, శిక్షావ్యాకరణ జ్యోతిశ్శాస్త్రాది వేదాంతగ్రంథములే కాక, షడ్దర్శనముల మూలగ్రంథములుగూడ రచింపబడి, తత్వశాస్త్ర మున్నతదశకు వచ్చెను. చర్చలు సాగుచుండగే, విద్వాంసులలో ఆయాపక్షములవారిమధ్య నభిప్రాయ భేదములు కలిగెను. వేదాంత(ఉత్తరమీమాంస) శాస్త్రజ్ఞులు వేదసంహిత లందలిమిత్రవరుణాగ్ని వాయ్వాదులచేత నుద్బోధింపబడిన యీశ్వరు డొకడే యుండురు; అందు కొందరు ఈశ్వరుడు నిర్గుణుడనియు, జీవేశ్వరు లొక్కటే యనియు, ప్రకృతి సత్పదార్థము కాదనియు. ఎవనిమట్టుకు వాడు ప్రతినరుడు జ్ఞానియై కర్మలను త్యజించి, ఈశ్వరానుభవము గల్గి వీలైనంతవెంటనే ఐహిక సంబంధము లేకుండ జేసికొనవలె ననిరి; (ఇదియే అద్వైతసిద్ధాంతము.) ప్రకృతి సత్పదార్థమే యనియు, ఈశ్వరుడు చిదచిత్తులకన్న వేరేకాని వాటి కంత ర్యామియై యుండు ననియు, ఆయన సగుణు డనియు కేవల జ్ఞానార్జనమేగాక, ప్రసన్నులై నరులు ఈశ్వరప్రీత్యర్థమై లోకహితకర మగు కర్మలను జేయుచునే యుండవలె ననియు, వేదాంతులలోనే బోధాయనాది ఋషులు దక్షిణమందాళ్వారమును భావించిరి; (ఇది విశిష్టాద్వైతము). వీరిలో కొందరు వేదాంతులు, జీవుడు ఈశ్వరునికి సేవకతుల్యుడని, భక్తియే ముఖ్య నిశ్రేయస సాధనమని భావించిరి; (ఇది ద్వైతము). ఈసిద్ధాంతములనే తరువాత వేయేండ్లు పైగా దాటినతరువాత, వేర్వేరుగ దక్షిణభారతదేశపు శంకరరామానుజ మధ్వాచార్యులు మరల ప్రత్యేకమతసిద్ధాంతములుగ ప్రతిపాదించిరి. ఈ ఆధ్యాత్మికభావము లతిగూఢము లగుటచే సామాన్యజనులకు అందుకొత్తగా

ఆర్యసంపర్కముకలిగిన ద్రావిడజాతులవారికి అవి వెంటనే బోధపడకపోవుట, ఆచరణకు వీలుగాకుండుట సహజమే. ఇక పూర్వమీమాంసవారు 'జ్ఞానము'ను వెనుకకు నెట్టి, యజుర్వేదమందలి యజ్ఞములందు వర్ణించిన ప్రకారము కర్మకాండలు చేయుటవలననే అపూర్వమనబడు నొకవిశేషము (అందుచే మోక్షమును) కలుగునని, ఈశ్వరప్రశంసయు అందులతత్త్వచర్చయు అవశ్యకం కావని వాదించి, కేవల కర్మఠులైరి. ఈమతమును జైమిని యుపపాదించెను. వేదకాలపుపరిస్థితులు సన్నివేశముకూడ మారి, ఇప్పు డార్యులకు మాంసాశన మద్యపానాదులు నిషేధింపబడినవి. అయినను, వేదముల శబ్దములనే కానిఅందలితాత్పర్యమును ఉద్దేశమును వీరు గ్రహింపరైరి. కణాదస్థాపితమగు వైశేషికమతమున ప్రకృతివస్తువులతత్త్వనిరూపణము, అందు ముఖ్యముగా'అణు' సిద్ధాంతము, చర్చింపబడెను; కాని దాని యథార్థరహస్యమును గ్రహించుట కష్టసాధ్యమయ్యెను. (పరమాణువును భేదించి దాని యథార్థమును పూర్తిగా గ్రహించి దానిని వశమొనర్చుకొని అందలి అమితశక్తిని లౌకికములకు వినియోగించుట కిప్పటి ప్రకృతిశాస్త్రజ్ఞులు విశేషముగ పరిశోధనలజేసి కొంత ఇటీవల గ్రహించినారు. గౌతమప్రతిపాదితమగు న్యాయదర్శనమున తర్కవాదమే ప్రధానము; కేవలతర్కవాదముచేతనే ఈశ్వర నిరూపణము చేయుట మోక్షముసాధించుట దుస్సాధ్య మని సామాన్యులకు తోచును. పాతంజల మను యోగశాస్త్రమున శరీరమును ఇంద్రియములను నరుడువశమొనర్చుకొని, ఆరోగ్యవంతుడై, నిగ్రహియై, అందుచే నైతికకర్మను ఆత్మసాక్షాత్కారమును సులభసాధ్యమగు నటుల చేయుట కర్తవ్యము; కాని యోగాభ్యాసమున శరీరబలమును సంపాదించుటయో లేక శరీరశోషణమో ముఖ్యాదర్శ మనియు, అందుచేతనే గొప్ప ప్రయోజనము కలుగు ననియు, దరిమిలాను కొందరుజను లపోహపడజొచ్చిరి. ప్రకృతి ప్రత్యేక స్థిర పదార్థమే యనియు, పృథివ్యప్తేజో వాయ్వాకాశాదులు అందలి యంత

ర్భేదము లనియు, లోకమునకనబడు అనేకవిధములగు భౌతిక మానసిక పరిణామములన్నియు ప్రకృతివేగాని పురుషునికి వాటిస్పర్శ యుండ దనియు, పురుషుడు వాటిని గమనించు సాక్షిమాత్రమే యనియు, కర్మఫలములను మనోదేహములు పొందుచుండు ననియు, యథార్థజ్ఞానము పురుషుడు పొందుట నిశ్శ్రేయసమున కావశ్యక మనియు, సాంఖ్యదర్శన సిద్ధాంతము; ఇది. కపిల మహర్షి ప్రతిపాదితము. ఇందు ఈశ్వరు డున్నా డనిగాని, లే డనికాని, నిరూపణ యుండదు. ఆనిరూపణయావశ్యకము కాదని, నైతికవర్తనమే ప్రధాన మని, కపిలునిభావమైయుండును. తక్కిన వేదాంతయోగవైశేషికదర్శనముల కీశ్వరప్రతిపాదనసిద్ధాంతము ముఖ్యము. ప్రాచీనభారతదేశమున జాబాలి చార్వాకాదులు కేవలనాస్తికవాదులుగూడ నుండిరి.

క్రీ. పూ. 6-వ శతాబ్దమువారికున్న యీభిన్నసిద్ధాంతముల విశేషములను భేదములను సామాన్యజనులు గ్రహింపలేకైరి. దేశకాలములకు ప్రస్తుతస్థితికి వీలుగ ఆచరణలో మార్పు కావలసివచ్చెను. అప్పటికి జనులభాష మారినను వేయేండ్లక్రిందటి వేదభాషలోనే మతబోధజరుగుచుండెను; అది జనులకు, అందుముఖ్యముగా ప్రాకృతభాషయే తెలిసిన జన సామాన్యమునకు, ఆర్యేతరభాషికులగు ద్రావిడజాతులకును, సుబోధము కాకపోయెను. వారి సంప్రదాయములు భిన్నములు; దేశమున యుద్ధములు కలహములు అధికమై, ఏకీభావము లేక, జనులు ఎవరియిష్టము వారిది వారు వర్తించుచుండిరి; నైతికాదర్శము పోయెను. ఇట్లు సంఘము చెడిపోవనారంభించెను. ముఖ్యముగా జనులలో విభేదములు తొలగించి, తత్త్వశాస్త్రక్లిష్టతలేకుండ నైతికమగు ఆదర్శజీవితము దేశభాషలో బోధించు మార్గదర్శకుడు జనింపవలసివచ్చెను.

అట్టి పరిస్థితిలో క్రీ. పూ. 6 వ శతాబ్దమున ఆదర్శజీవనమునకు వినుతికెక్కిన శ్రీరామవంశీయులగు కోసలరాజులకు సామంతులై ప్రజా ప్రతినిధులుగ ఎన్నుకొనబడి పాలించు శాక్యుల వంశమున (ఇప్పటి నేపాళ

రాజ్యసమీపమున) బుట్టి, కార్యతత్పరతకు స్వార్థరాహిత్యమునకు పేరొంది మొదట విదేహనామమున జనకునిచేతను, తరువాత ఆర్యేతరులగు జరాసంధాదులచేతను, పాలితమై ఆర్యానార్యజాతుల సమ్మేళనముకల మగధ రాజ్యమున పెరిగిన బుద్ధుడే ఈకార్యమును నిర్వహించుట తగియున్నది.

అప్పటికి శిశునాగవంశీయుడగు బింబిసారుడును, ఆతనియనంతర మాతనికుమారుడగు అజాతశత్రువును, మగధరాజ్యమునకు రాజులై, 'రాజగృహ' నగరమునుండి పాలించుచుండిరి. మహాభారతకాలమున మగధ రాజధానియగు గిరివ్రజపురము దానియభేద్యముగుకోటయు బుద్ధుని కాలమునకు ప్రాధాన్యముగోల్పోయి శిథిలమైనటులు తోచును.

ఈ ఆర్యనాగరికతకుముందే, ఈదేశమున వేరేయితరజాతులు, వారి నాగరికతగూడ, ఉండెను గదా! వారిస్థితి కొంత గమనింతము. నీలవర్ణులగు కోలేరియనులు లేక కోలులనబడు ఆదిమజనులు గోధుమవర్ణులగు ద్రావిడజాతి, ఈరెండు జాతులు కొంతవరకు పూర్వమే మిశ్రితులైరి. (ఆర్యులు వ్యాపించిన కొలది) వీరిలో కొందరు వింధ్యగిరివంటి కొండలలోనికి అప్పటిదండకాటవి మొదలగు భయానకారణ్యములలోనికి మస్యప్రదేశములలోనికిని పోయి, స్వతంత్రులుగానే యుండిరి. కొందరార్యపాలన మంగీకరించిరి. ఆదిజనులలోను మరి కొందరు సాంఘికంగా ఆర్యాధికార మంగీకరించుకున్నను వెల్లడిప్రాంతాల లోనే ప్రత్యేకగ్రామములందు నివసించుచుండి రనియు, వారికి అస్పృశ్య తకువగా నుండె ననియు, వారిసంతతివారే పిమ్మట అస్పృశ్యులనబడు మాల, మాదిగ, పరయ, హోళియ, మహాల్, మెహతర్, భంగీ ఇత్యాదినామముల హరిజను లనియు, కొందరి యభిప్రాయము. వారు బ్రాహ్మణీశూద్రసంకరజాతి పతితజాతి యనుటకన్న నిదియే ఎక్కువతృప్తికరము. చరిత్రకాలమునకు పూర్వమే గాంధారము ఇప్పటి (ఆఫ్ఘనిస్థానము) మొదలు కామరూపము (అస్సాము) వరకు ఉత్తరహిందూస్థానమంతటను ఆర్యరాజ్యములు పింపబడి,స్థా

అచ్చటి సంస్కృత ప్రాకృతముల శాఖలగు శౌరసేని, మాగధి, అర్ధమాగధి, సౌరాష్ట్రి, ఇత్యాదులును, వాటిఅపభ్రంశములనుండి చివరకు ఇప్పటిహిందీ బెంగాలీ, ఓఢ్రము, మహారాష్ట్రము, గుజరాతీ ఇత్యాదులును కలిగినవి; అట్లే దక్షిణదేశపు ఆంధ్రద్రావిడుల ఆంధ్రచోళ పాండ్య కేరళ రాజ్యము లందలి ద్రావిడభాషకు ఆర్యభాషాసంపర్కము క్రమముగా గలిగి, అందును ప్రాంతీయభేదము లేర్పడి, చివరకు ప్రస్తుతపు ఆంధ్రము, అరవము, కన్నడము, మళయాళము, ఇత్యాదు లేర్పడినవి. ఆంధ్రభాషకు మూలము సంస్కృత ములే యని సాంప్రదాయికు లందురు. కాని ఆంధ్రము అసలు ద్రావిడ కుటుంబములోనిది అని భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయము. అయితే, చరిత్ర కాలముకు చాల పూర్వమే ఆంధ్రము దక్షిణ ద్రావిడమునుండి విడి శాలి వాహనాదుల పాలనమున ఆర్యభాషలతో అధికసంబంధము కలదై, సంస్కృత ప్రాకృతముల దత్తపుత్రికగా పెరిఁగినది. ఇప్పటి ఆంధ్రమందు చాలవరకు సర్వనామములు అంకెలపేర్లు నిత్యావసరములపేర్లగు పాలు ఉప్పు తల కాలు అన్న పిల్ల ఇత్యాదులు ద్రావిడపదములే అయినను, మొత్తము మీద ప్రస్తుతాంధ్రములో నూటికి 70-కి పైగా సంస్కృత ప్రాకృత సంబంధ మైనవే ఈద్రావిడ భాషా కుటుంబమంతయు సంస్కృత ప్రాకృత భవమే అని, ఈకుటుంబపు ఉత్తర శాఖయగు ఆంధ్రంలో సంస్కృత శబ్దాలేగాక, పైశాచి మున్నగు కొన్ని ప్రాకృత శబ్దాలు (కొద్ది మార్పులతో), హెచ్చుగ చేరి యుండుట ఇందుకు నిదర్శనమని, ఇటీవల నొక వాదము కలిగినది. ఇది చమ త్కారమైనది. పైశాచిలో ద్రావిడ పదాలు చేరియుండెను. మరియు ఆంధ్రంలో ప్రాకృత పదాలు యుండుటకువేరు కారణా లున్నవిగదా. ఆంధ్ర జాతి ఆర్యులే అనిగాని ఆర్యేతరు లనికాని, నిర్ణయించుట కష్టము. భాషను బట్టియే అనార్యద్రావిడు లనుటకు వీలు లేదు. ఆర్యభాషికులైనను బెంగాలీ వారు శరీరనిర్మాణమునుబట్టి ద్రవిడ మంగోలుజాతి మిశ్రితు లని నిర్ణయింపబడి

నది. మొత్తముమీద ఆంధ్రులు (చాలవరకితరులును) ఆర్యద్రావిడాది మిశ్రితు లని చెప్పవచ్చును. ఆంధ్రదేశపు వేంగి కళింగ చాళుక్య రాజ్యములు ఆర్య ద్రావిడ రాజ్యములమధ్యనుండి ఉభయ సంపర్కము కలిగియుండెను. ప్రాచీన కాలమున హిందూస్థానమందు హిమాలయప్రాంతమందు గూడ చాల తెగల జనులుండినట్లును, 6-వ శతాబ్దపు అమరసింహుని నిఘంటువులోని "విద్యాధరోప్సరోయక్ష రక్షోగంధర్వకిన్నరాః । పిశాచోగుహ్యకస్సిద్ధో భూతోమీ దేవయోనయః" అనుశ్లోకమువగైరాలు సూచించును. వీరందరు ఆర్యులో కారో తెలియదు. చారిత్రక కాలమున అంతర్జాతి వివాహముల నిషేధ మధిక మయినను అంతకుముందే అనులోమాది వివాహములవలనను, కొన్ని తెగలు ఇతర ప్రాంతములకు పోవుటవలనను, ఇతర కారణములవల్లను, వసిష్ఠవ్యాసాది మహర్షులకాలమందే జాతిమిశ్రణము కలిగినట్లు భారతాదులవల్లనే కనుపడును. ఇట్లు బుద్ధుడు జనించు కాలమునకు ఆర్యద్రావిడాదుల సంస్కృతి నాగరికత మిశ్రితమైనవి: మరియు, కొంతవరకు జాతులుగూడ కలసిపోయెను. గౌతమబుద్ధుడు జనించునప్పటికి భారతదేశపుస్థితి యిట్లుండినది.

# 28. గౌతమబుద్ధుని జీవితము

మహాప్రవక్తయగు గౌతమబుద్ధుడు ఆసియాఖండమంతటను మతధర్మములను భావములను పరివర్తనచేసెను. ఆసంగతి తెలుపుట కిప్పుడు మనకథలో మూడుశతాబ్దములు వెనుకకు వెళ్లవలసియున్నది. బాబిలనునందు యూదులలో ఈసయ్య ప్రవచనమును ఎఫిససులో పదార్థపరిశోధనమును జరిగినప్పుడే, భారతదేశమందలి వారాణసీనగరమున శ్రీబుద్ధమహోదయుడు తనశిష్యుల కుపదేశించుచుండెను. ఇట్లు క్రీ. పూ. 6-వ శతాబ్దిలో నీయుగపురుషులు పరస్పర సంపర్కములేకయే వేర్వేరు దేశములందొకేసారి యవతరించి బోధించుట ఆశ్చర్యకరము. ఆకాలమం దన్ని ప్రాంతములందును నూతనమనోవికాసము ధైర్యము నావిర్భవించెను. చీనాలోగూడ నట్లే జరిగె నని ముందు తెలియగలదు. అన్ని ప్రాంతములందును రాజులు గురువులు నడిపించు జీవహింసాయుతయాగముల సంప్రదాయముల నుండి జనులు మేల్కొని, తీవ్రస్వతంత్ర జ్ఞాన మన్వేషింపదొడగిరి. 20,000 యేండ్ల బాల్యదశ అంతటితో గతించి, మానవ జాతికి యువకత్వ మంకురించెను.

భారతదేశపు ప్రాచీనచరిత్ర యిప్పటికిని చాలసందిగ్ధముగ నున్నది. క్రీ. పూ. రెండువేలేండ్ల ప్రాంతమునందో మరియెప్పుడో, ఆర్యులలో నొకశాఖవారు వాయవ్యదిశనుండి, హిందూదేశము ప్రవేశించిరి. వీ రొకేతరంగముగ వచ్చిరో, లేక వేరు వేరు తెగలుగా దండెత్తిరో, తెలియదు; కాని వారిభాష

సాంప్రదాయము ఉత్తరహిందూదేశ మంతయు, వ్యాపించెను; ఆర్యభాషలలో వీరి ప్రత్యేకశాఖయే సంస్కృతము. ఈయార్యులు హిందూదేశములో ప్రవేశించునప్పటికి, అచ్చటి సింధు గంగా నదీ తీరములందుగూడ ఆర్యులకన్న మహావైభవము కలిగి, ఉత్సాహశక్తియందు మాత్రమార్యులకు తీసిపోవు, నీల గోధుమవర్ణులగు వేరుజనులు వసించుచుండిరి. గ్రీకు ఆర్యులును పారసీకార్యులును ఆయాప్రాంతపు పురాతనజనులతో బాగుగ కలసిపోయిరి; కాని, భారతీయార్యులు హిందూదేశపు ఆదిమజనులతో నట్లు కలసిపోక, ప్రత్యేకముగ నుండినట్లు కనబడును. భారతదేశపు ప్రాచీనచరిత్ర మనకు గోచరించు నాటికే, భారతీయులు కొన్ని తెగలుగా విడిరి; కులభేదములుగూడ ఏర్పడెను. ఈ తెగల జనులు పరస్పర భోజనములును అంతర్వివాహములును చేయనందున, చరిత్రకాలపు ఆరంభమునుండియు వారిలో జాతి భేదము స్థిరమైనిల్చినది. ఇట్టినిర్బంధములులేక స్వేచ్ఛగా వివాహమాడుచు సంయోగమొందు యూరపియనులకు, మంగోలియనులకు, భారతీయులతో నీకారణమున ఆచారాదులందు భేదము కలిగినది. భారతజాతిలో నిట్టి నియమములవలన కులభేదములు చాల ఏర్పడియున్నవి.

గౌతమబుద్ధు డనబడిన యీసిద్ధార్థుడు హిమాలయ గిరులకు దక్షిణప్రాంతపు చిన్న రాజకుమారుడు;* ఆరాజపుత్రుడు తన 20వయేట సమీపబంధువగు యశోధరను వివాహమాడెను. ఆయన తనకౌమారమున మృగయాది వినోదముల ననుభవించి,

*సిద్ధార్థుడు నేపాళదేశసమీపపు లుంబినియొద్ద శాక్యవంశీయుడగు శుద్ధోదనునికి మాయాదేవీగర్భమున జనించెను.

తనరాజోద్యానము లందును, సుందరారామములందును సస్యస మృద్ధిగల క్షేత్రములందును విహరించుచుండెను. ఇట్లు మహా నంద పరిస్థితులలో జీవితము గడుపుచుండగా, ఆయనహృదయ మున నొకగొప్ప యసంతృప్తి జనించెను; కార్యశూరుడు కుశా గ్రబుద్ధియునగు ఆతడాందోళనమున బడెను. తనప్రస్తుతజీవితము యథార్థమైనది కాదని, అమూల్యజీవితమునట్లు వ్యర్థముగ గడు పుచున్నట్లును, ఆయనకు స్ఫురించెను. నరదేహములు వ్యాధు లకు మత్యువుకు లోనగుచుండుట తప్పదు. భౌతికసుఖము లన్నియు తాత్కాలికములు, సందిగ్ధములు, అసంతృప్తికర ములు; అని గౌతముని విశాలహృదయమునకు విదితమయ్యెను. ఆయన ఇట్లు పరితపించుచు, దేశసంచారులగు సన్యాసులలో నొకనితో సహవాసముచేసెను. భారతదేశమున నిట్టిసన్యాసు లనేకులు తిరుగుచు, తమదైనిక జీవనమును అనేక నియమముల ప్రకారము నడుపుకొనుచు, ఆధ్యాత్మిక చర్చలందు ధ్యానత పస్సులందు కాలము వినియోగించుచుండిరి, వారు జీవితరహస్య మును తథ్యస్థితిని గ్రహింప యత్నించుచుందు రని వాడుక. తాను నట్లే చేయవలెనని గౌతముడు దృఢనిశ్చయుడై అందుకై తదేకధ్యానము చేయుచుండెను. ఈస్థితిలో ఆయనభార్య ప్రసవించి, ప్రథమపుత్రుడు జనించెను; ఈవార్త విని 'ఇదియొక నూతనబంధము; దీనిని ఛేదింపవలెను' అని గౌతముడు భావిం చెను. స్వగ్రామమునకు తిరుగ వచ్చుసరికి తాను నూత్నబంధక మని యెంచుచున్న రాజపుత్రజననముకై జనులందరు మహో త్సవము జేయుచు, విందులలో నృత్యనాట్యములందు మగ్ను లైయుండిరి. గౌతము డర్ధరాత్రమున మేల్కాంచి, తనభవనము

అగ్నిపరీతమయ్యె నని విన్నమనుష్యునివలె దారుణపరితాపము పాలాయెను. ఇంద్రియసౌఖ్యపూరితము నిరాధారము నిరుద్దేశము అగు ఆజీవితపద్ధతిని తత్క్షణమే విడువ నిశ్చయించి, ఆయన వెంటనే లేచి తనభార్య యంతఃపురమునొద్దకు నిశ్శబ్దముగ వెళ్ళి అచ్చట చిన్నదీపకాంతిని పుష్పాలంకృతశయ్యపై చిన్న శిశువును అంసములమధ్య నిడికొని సుఖనిద్ర చెందు భార్యను జూచెను; విడిచి పోవుటకుముం దాశిశువు నొక్కసారి తనచేత నెత్తుకొని కడసారి కౌగలింపవలె నని ఆయనకు సహజావేశము కలిగెను. కాని భార్య వెంటనే మేల్కొను ననుభయముచే నట్లు చేయక, దృఢహృదయుడై గౌతము డచటినుండి మరలి, రాజమందిరమును పురమునువీడి, భారతీయాకాశపు నిండువెన్నెలలో బయలుదేరి అశ్వారూఢుడై చనెను; ఆ రాత్రి చాల దూరము పోయి, ఉదయమునకు తనరాజ్యపు సరిహద్దుల దాటి, గౌతము డొకనదీసైకతస్థలమున దిగి, తన సుకేశములను చేతిఖడ్గముతో ఛేదించి, శరీరాభరణముల నన్నిటిని తీసి, వాటిని తన అశ్వమును ఖడ్గమును గూడ అటనుండి స్వగృహమునకు బంపివైచెను. అంతట బయదేరి పోవుచు, సిద్ధార్థు డొకజీర్ణవస్త్రధారిని కలుసుకొని అమూల్యమగు తనదుస్తుల వాని కిచ్చి, వాని చిరుగుగుడ్డల ధరించి, లౌకికబంధము విసర్జించి, దక్షిణాభిముఖుడై జ్ఞానాన్వేషణకై బయలుదేరెను. అతడు వింధ్యపాదములవద్ద ఋషులు సన్యాసులు నున్నయాశ్రమము చేరెను; అచట తపస్వులగు కొందరుమును లాగిరిగుహాలలో నుండి అవసరమగు ఆహారాదులకై పురములోనికి బోయి, అచ్చట తమ వదకు వచ్చువారి కాశువుగా హితబోధచేయుచు, కాలక్షేపము

చేయుచుండిరి. గౌతము డాకాలపు తత్వవేదాంతశాస్త్రము లన్నిటి నభ్యసించి, అందు ప్రవీణు డాయెను; కాని అందలి సిద్ధాంతము లాయన కుశాగ్రబుద్ధికి తృప్తి కల్గింపలేదు. తీవ్రతపస్సు నిద్రాహారత్యాగము ఆవేదన జ్ఞానశక్తుల నిచ్చు నని, భారతీయులు నమ్ముచుందురు. దానిని గౌతముడు స్వయంగా పరీక్షించుటకై అయిదుగురు సహచరులతో నొక వనములోనికి బోయి, అచ్చట నుపవసించుచు తీవ్రముగ ధ్యానించుచుండెను. "ఆకాశవితానమున వ్రేలాడు మహాఘంటానినాదము" వలె సిద్ధార్థుని కీర్తి అంతటను వ్యాపించెను. కాని అందుచే యథార్థజ్ఞాన మాయనకు లభింపలేదు. ఒకరోజున ఆనీరసస్థితిలో సిద్ధార్థు డిటునటు నడచుచుండి, హఠాత్తుగా నేలపై బడి స్మృతి దప్పెను. తనకు తిరుగ జ్ఞప్తి కలుగునప్పటికి, ఆశోషణపద్ధతు లన్నియు మాయికములు అస్వాభావికములు అసంగతములు అని, అది సత్యమగు జ్ఞానమార్గము కాదని, ఆయనకు వ్యక్తమయ్యెను; అంతట మామూలు ఆహారము తెప్పుని, ఆయన తన ఘోరతపమును శరీరమనశ్శోషణను నిలిపివేసెను; సహచరు లది చూచి విభ్రాంతులైరి. అరోగిశరీరముతోనే మనోబలమును వృద్ధిచేసికొనుచు సత్యజ్ఞానసంపాదన చేయదగు నని ఆయన పూర్తిగా గ్రహించెను. ఆ దేశకాలభావన కీనూతనసిద్ధాంతము విచిత్రముగ నుండెను. అందుచే సిద్ధార్థునిశిష్యు లాతనిని త్యజించి, విచారముతో కాశికి పోయిరి. గౌతముడుమాత్ర మేకాకిగా సంచరించెను. ఏదైన క్లిష్టసమస్య మనస్సుకు తట్టి క్రమక్రమముగనే బోధపడుచున్నను, ఆ సంగతి అవగాహన యగుచున్న సంగతి కొంతకాలము తెలియకనే ఉండును;



గౌతమబుద్ధుడు (టిబెత్తులో దొరికిన ఇత్తడివిగ్రహము.)

పూర్తిగ నది పరిష్కారమైనపుడు, హఠాత్తుగా భాసురకాంతిచే వికసించినట్లుగా సంపూర్ణజ్ఞానోదయము గలిగి, తటాలున విజయము నొందిన ట్లగును; గౌతమున కిట్లే తటస్థించెను. అత డొక నదీతీరమున నొకమహావృక్షముక్రింద భుజింపబోవు చుండ, తన జ్ఞానచక్షువు కాదివ్యదృష్టి హఠాత్తుగా కలిగెను. జీవితరహస్యమంతయు ఆయనకు స్పష్టముగా గోచరించిన ట్లాయెను; అట్లు రాత్రి తీవ్రధ్యానము చేయుచు బుద్ధుడై, అచ్చటనుండి ఆయన లేచి, తనకు ప్రత్యక్షమైన నూతన జ్ఞానము నితరులకు బోధింప నుద్యుక్తు డయ్యెను.

బుద్ధు డచ్చటినుండి కాశికి వెళ్ళి, తన పూర్వశిష్యుల గలుసుకొని వారి కానూతనవిజ్ఞానము బోధించెను. వారాణసి యొద్ద ఒక యారామమున వారందరు పర్ణశాల నేర్పఱచుకొని అచ్చటకు జ్ఞానార్థులై వచ్చు జనులందరికి బోధించుచుండిరి. (ఆతోట ఇప్పుడు 'కింగ్స్ డియర్ పార్కు' అనబడుచున్నది.) 'నాకు సంపూర్ణసౌఖ్య మెందుచేత లేదు?' అని ఆయనకు కౌమారదశయందు కలిగిన ప్రశ్నయే ఆయనబోధలో ప్రారంభవిషయము; ఈ ప్రశ్న ప్రతివానికిని హృదయశోధన కరము. థేల్సు, హిరాక్లిటస్ అను గ్రీకుతత్వజ్ఞులు సృష్టిసమస్యం చర్చించుచో జేసిన విమర్శలు కేవల బాహ్య వినోద కారులు; అందు ఆత్మజ్ఞానము శూన్యము; ఇట్లే యూదులు అచ్చటి మహాప్రవక్తలు చేసిన నీతిబోధలును ఆత్మవిజ్ఞానము లేనివి; వాటికిని శ్రీబుద్ధమహాోదయుని బోధకును చాల భేదము కలదు. భారతీయబోధకు డగు బుద్ధు డాత్మను మఱువక, ఆత్మపై తనజ్ఞానమును కేంద్రీకరించి, అహంభావమును నశింప

జేయ యత్నించెను. జనుల బాధలన్నియు వారి దురాశాపేక్షల వలననే కలుగుచున్న వనియు, కామలోభాదుల నరుడు జయించు వరకు జీవితము బాధామయమై శోకాంతముగనే ఉండు ననియు బుద్ధు డుపదేశించెను.

ఈకామము మూడుపద్ధతులుగ నుండును; ఈమూడును దోషభూయిష్ఠములే; జిహ్వాచాపల్యము, ధనాశ, ఇంద్రియ లోలత్వము మొదటితరగతివి ; రెండవది అహంకృతి యుతము; వ్యక్తుల అమృతత్వాపేక్ష, ఆత్మలాభముకొరకు భౌతికాధిపత్యముకొరకు గలుగు లోభము, మొదలగునవి మూడవతరగతిలో చేరును. వివిధరూపమగు ఈకామ గుణము పూర్తిగా జయించిననే జీవితపుబాధలును ఆశాభం గములును పోవును. అట్లు పూర్తిగా కామము జితమై అహం భావము తొలగినమీదట ఆత్మకు సహజమగు శాంతి నిశ్శ్రేయ సము కలుగును; ఇదియే నిర్వాణము; బుద్ధుని యుపదేశసార మిదే. ఈయుపదేశ మతి సూక్ష్మము, ఆధ్యాత్మికభావాన్వితము. స్వకీయానుభవముచే నిర్భయముగా యుక్తముగా వస్తువుల విమర్శింపవలె నను గ్రీకుల బోధలవలెను, దైవభీతికలిగి ధర్మకా ర్యముల చేయవలె నను యూదుల సిద్ధాంతమువలెను, అదిసుల భగ్రాహ్యము కాకుండెను. ఆయుపదేశ మత్యున్నతము, చాల సూక్ష్మము; గౌతముని స్వంత శిష్యులకుగూడ సరిగా తెలిసియుం డదు. అట్టిస్థితిలో బుద్ధుని ప్రత్యక్ష సంబంధము బోధ తొలగిన వెంటనే, అది యపార్థముపాలై విశిష్టత చెడెను; అందు ఆశ్చ ర్యములేదు. మధ్యమధ్య చిరకాలము కొకసారి జ్ఞానధర్మములు భూమిపై నొకప్రత్యేక పురుషునిలో నవతరించి వ్యాపించు

ననియు, బుద్ధుడట్టియవతారమూర్తి యనియు,అప్పటిజనులలో నమ్మిక యుండెను. గౌతముడే బుద్ధుడు (బోధిసత్త్వుడు) అని, ఆయనయే చిట్టచివరి బుద్ధుడని గౌతముని శిష్యులు ప్రకటించిరి. కాని ఆయన తన కట్టిబిరుదును అంగీకరించినట్లు నిదర్శనము లేదు. ఆయన చనిపోగనే ఆయననుగూర్చి అనేక చిత్ర విచిత్ర గాథలు బయలుదేరెను. మానవహృదయ మెన్నడును నైతిక కృషికన్న అద్భుతకథలవల్లనే అధికముగ నాకర్షింపబడును. అందుచే గౌతమబుద్ధు డత్యద్భుతమూర్తి అయ్యెను.

అందువల్ల ప్రపంచముకు యథార్థలాభమే కలిగెను. నిర్వాణ మతిసూక్ష్మము, అత్యున్నతము నై జనసామాన్యమున కగోచరమైనది; మానవజాతికి సహజముగు అద్భుతకథాకల్పనముచే గౌతముని సాధుజీవితములోని స్వచ్ఛత కప్పబడినది; కాని గౌతమబుద్ధుడు బోధించిన అష్టమార్గములను, జీవితమున కాతడేర్పరచిన ఆర్యపద్ధతి భావములను జనులు కొంతవరకు గ్రహించిరి. పరిశుద్ధహృదయము మనోవాక్కాయములందు సద్వర్తనము నిరాడంబరము నిష్కపటమునగు నీతివర్తనము ముఖ్యములని బుద్ధుడుపదేశించెను. అందుచే ఔదార్యమునకు పరోపకారమునకు అహంభావహీనతకు ప్రాముఖ్యము గలిగెను; మానవుల అంతరాత్మకు త్తేజనము కలిగెను. *

---

* బుద్ధుడు స్వతంత్రమతము స్థాపించుటకుగాక, హిందూమత సంప్రదాయములం దప్పటికి వ్యాపించిన కొన్నిదురాచారముల దొలగించి, సంస్కరింపజేసి, పరిశుద్ధసనాతనధర్మము వ్యాపింపజేయుటకే యత్నించెను. జీవహింస విడువవలెనని, సత్యాహింసలు ధర్మము భూతదయ ప్రధానము లని మానవుని ఇంద్రియనిగ్రహమువలనను యుక్తమగు నైతికజీవితమువలనను లోక

హితకరమగు సద్వర్తనమువలనను మాత్రము మోక్షము కలుగునని అతడు చేసిన ఉపదేశములు హిందూమతములోనివే; కాని అప్పటికి వేదవిహిత మను విశ్వాసముచే ఒకమూల జీవహింసాయుతయాగములను కొందరు చేయుచుండ, కర్మసన్యాస మవసర మను బుద్ధితో సర్వకర్మత్యాగులై సన్యాసధర్మము కపార్థము గావించి కొందరు ఆత్మహానిచేయుచుండిరి; అందుచే బుద్ధుడు ధర్మమును తిరుగ బోధింపవలసివచ్చెను. ఆయన ఉపదేశమాహాత్మ్యమును తరువాత భారతీయులు కొన్ని శతాబ్దములు గ్రహించిరి; భగవంతుని దశావతారములలో ఆయన నొకనిగ భావించిరి. కపిలమహర్షి స్థాపితమగు సాంఖ్యసిద్ధాంతమే బుద్ధమతమునకు మూలాధారము.

కేవలజ్ఞానములో తృప్తినొందక, లోకహిత కర్మ విడువక చేయవలె నని బుద్ధుడు చేసిన బోధనయు హిందూగ్రంథవిహితమే.

"కుర్వన్నేవేహ కర్మాణి
జిజీవిషేచ్ఛతంసమాః" } (ఈ. ఉ. 3-2)

"తస్మాదసక్త స్సతతం కార్యం కర్మసమాచర" (భ. గీ. 3-39)

"కుర్యాద్విద్వాన్‌తథాఽ సక్తః చికీర్షుర్లోకసంగ్రహం" (భ.గీ.3-25)

ప్రజాసామాన్యమునకు అరు బుద్ధుడు అప్పటి సామాన్యజనులభాష యగు 'పాలి' యను ప్రాకృతమందే బోధనల జేసెను

స్వార్థమునకై చేయుకార్యము అనగా 'కామ్య కర్మ' విడుచుటయే నిజమగు సన్యాస మనియు, ఫలాపేక్ష విడుచుటే త్యాగ మనియు, గీతలో వ్యక్తము చేయబడినది. "కామ్యానాం కర్మణాం న్యాసం సన్యాసం కవయో విదుః, సర్వకర్మఫలత్యాగం ప్రాహుః త్యాగం మనీషిణః," (భ. గీ. అ. 18. శ్లో-2) కాని చాలమంది హిందువులాభావమును గ్రహింపక, జ్ఞానమును స్వీయ మోక్షమునే వాంఛనీయము లని భావించుసంగతి నిజము.

సర్వభూతసమత్వము ఆత్మజ్ఞానము ఇంద్రియనిగ్రహము అనుమూడును మోక్షమున కవసరము లను బుద్ధునిసిద్ధాంతము వేదములందును గీతలందును

నిరూపింపబడెను. "యస్తుసర్వాణిభూతాని ఆత్మన్యేవాను పశ్యతి, సర్వభూతేషు చాత్మానం తతోనవిజుగుప్సతే" (ఈ. శా. ఉ. 1-6)

"ఆత్మావా అరేద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిది ధ్యాసితవ్యః" (బృ. ఉ. 4)

"ఏషోఽణు రాత్మా చేతసావేదితవ్యః......"(ముం. ఉ. 3-1-9)

"ఉత్తిష్ఠతజాగ్రత...క్షురస్యధారానిశితా దురత్యయా......" (క. ఉ. 1-3-13)

"విజ్ఞానసారథిర్యస్తుమనః ప్రగ్రహవాన్నరః। సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదం" (క. ఉ. 3-9)

"నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే" (భ. గీ. 4-38)

"ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్............" (భ. గీ. 6-5)

"కామఏషక్రోధఏష......" (భ. గీ. 3-37)

"జహిశత్రుం మహాబాహో కామరూపం దురాసదం" (భ. గీ. 3-43)

"తాంయోగమితిమన్యంతే స్థిరామింద్రియధారణాం" (క. ఉ. 6-11)

"ఇంద్రియస్యేంద్రియ......" (భ. గీ. 3-34)

'అహంకారం బలందర్పం......" (భ. గీ. 16-18-19)

భగవద్గీతలో యుక్తాహారముకూడ విధింపబడినది. అట్టి సాత్వికాహారము "ఆయుఃసత్వబలారోగ్యసుఖప్రీతి వివర్ధనాః,

రస్యాఃస్నిగ్ధా స్థిరాహృద్యా ఆహారాస్సాత్వికప్రియాః" అని వివరింపబడినది. (భ. గీ. 17-7)

అప్పుడప్పుడు అవతారములు కలుగుచుండు నను భావము "యదా యదా హిధర్మస్య.....ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే." (భ. గీ. 4-7, 8) అను సుప్రసిద్ధగీతాశ్లోకములందు వ్యక్తము చేయబడినవి.

మనభారతదేశమందు అప్పుడును ఈనాటికిని శరీరమన శ్శోషణముచే యోగ సమాధిని మోక్షమును సంపాదింపవచ్చు ననుభావ మున్నసంగతి. అట్టిది మనసంఘమునకు హానికర మగుచున్నమాటయు సత్యమే. కాని బుద్ధుఁడను గ్రహించిన సిద్ధాంతము సనాతనహిందూమతమునసే లేదనుటకు వీలు లేదు. నరులు విషయలోలురు కాఁగూడదు, కాని శరీరమనస్సుల గృశింపజేయను కూడ దని, ఆత్మజ్ఞానావసరమగు సన్యాసము అనగా కర్మత్యాగము కాక ఫలేచ్ఛాత్యాగ మనియు గీతాదులందు చాలచోట్ల స్పష్టము చేయబడినది.

"నాత్యశ్నతస్తు యోగోస్తి నచైకాంత మనశ్నతః, నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున." (భ. గీ. 6-16)

"యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు, యుక్తస్వప్నావబోధస్య యోగోభవతి దుఃఖహా." (భ. గీ. 6-17)

"కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామమచేతసః, మాంచైవాన్తశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్." (భ. గీ. 17-6)



# 29. అశోకచక్రవర్తి

ఆత్మవశీకరణమే మానవునికి నిశ్శ్రేయససాధన మను గౌతమముని యుదారగంభీరోపదేశము లాయనతరువాత కొన్ని తరములవరకు లోకమం దంతగా వ్యాపింప లేదు. అంతట లోకోత్తరుడగు నశోకమహారాజు హృదయము నాయుత్తమభావము లాకర్షించెను. అలెగ్జాండరు చక్రవర్తి భారతదేశమువరకు వచ్చి సింధునదీతీరమున పోరసురాజుతో యుద్ధము చేసియుండెను గదా! ఆరోజులలో మౌర్యవంశీయు డగు చంద్రగుప్త డను శూరుడు అలెగ్జాండరు మకాముకు వచ్చి, హిందూస్థానమంతను జయింపు మని అలెగ్జాండరుకు సూచించె నని గ్రీకుచారిత్రకులు వ్రాసిరి. కాని మాసిడోనియనులు తమకు నూతనమగు నాప్రదేశమునకు పోవ నిరాకరించిరి; కనుక అలెగ్జాండ రాయత్నము చేయలేదు. తరువాత క్రీ. పూ. 321 లో చంద్రగుప్తుడు యవనసహాయము లేకనే కొందరు కొండజాతివారి సాయముతో తనయభిలాషను సిద్ధింప జేసుకొని, ఉత్తరభారతమందొక సామ్రాజ్యమును తానే స్థాపించెను. తరువాత క్రీ. పూ. 303 లో చంద్రగుప్తుడు పంజాబుపాలకు డగు సెల్యూకసు రాజుపై దండయాత్ర సలిపి, అతని నోడించి, భారతదేశమున యవనాధికారము రూపుమాపెను. చంద్రగుప్తుని పుత్త్రుడా మౌర్యసామ్రాజ్యమును విస్తరింపజేసెను. చంద్రగుప్తుని పౌత్త్రుడగు అశోకచక్రవర్తి క్రీ. పూ. 264లో రాజ్యాధిపతియై, ఇప్పటి ఆఫ్ఘనిస్థానము మొదలు మద్రాసు రాష్ట్రమువర కున్న

తనసామ్రాజ్యము పాలించుచుండెను. సంప్రదాయప్రకార
మత డాసామ్రాజ్యము విస్తరింపజేసి భారతదేశమంతనుజయించి
ఏకచ్ఛత్రాధిపతి కావలచెను. అందుకై మద్రాసురాష్ట్రపు
ఈశాన్యమందున్న కళింగప్రాంతమును క్రీ. పూ. 255-వ యేట
ముట్టడించి అందు పూర్తిగ జయమునొందెను. కాని, అందు
యుద్ధముల భయానక స్థితులు ఈతిబాధలును ఆయన స్వయ
ముగ గమనించెను; లోకమందలి యితరరాజులవలెగాక,
ఈమహానుభావుడు ప్రజలబాధలను సహింపక, అప్పటినుండి
సమరసంపర్కము లేకుండ జేసికొనెను; తరువాత శాంతివ్యాపక
ములగు బౌద్ధమతసిద్ధాంతముల నవలంబించి అశోకుడు 'ఇక
ముందు ధార్మికవిజయమే యథార్థజయ మని' స్పష్టపరచెను.
లోకోత్తరచక్రవర్తి యగు అశోకుని 28 ఏండ్ల శాంతిసుఖప్రద
మగు పరిపాలనమువంటిది క్లేశయుతమగు ఈమానవచరిత్రమం
దెచ్చటను లేదు. అశోకుడు భారతీయుల నీటివసతికై అనేక
వాపీకూపతటాకములు త్రవ్వించెను; మార్గములవెంట ఛాయా
వృక్షముల నాటించెను; ప్రజాసౌఖ్యముకై దేశమంతటను
వైద్యశాలలను, ఆరామములను, ఓషధులతోటలనుగూడ నెల
కొల్పెను; మరియు ఆదిమజనులను పరాధీనజాతులను రక్షించు
టకై ఒకప్రత్యేక మంత్రిక్రింద రాజ్యాంగశాఖ నేర్పరచెను;
స్త్రీవిద్యాభివృద్ధికై చాల సదుపాయముల జేసెను; బౌద్ధగురువుల
కును మతసంస్థలకును అనేక దానధర్మముల జేయుటయేగాక,
బౌద్ధధర్మపు వాఙ్మయమును సరిగా గ్రహించి విమర్శించుటకు
సమర్థులగు శ్రమణకుల నియమించెను; భారతీయ మతప్రవర్త
లలో ముఖ్యుడగు బుద్ధుని యనంతరము ఆయన విధించిన

పరిశుద్ధబుద్ధసిద్ధాంతములలోనికి తరువాత అనేక మూఢవిశ్వాసములు దురాచారములును వ్యాపించెను; వాటిని తొలగించుటకై అశోకుడు తగుయత్నముల జేసెను. ఇంతేకాక, కాశ్మీరమునకు పర్షియాకు సింహళమునకు మిశ్రదేశపుఅలెగ్జాండ్రియా ఇత్యాదులకును అశోకుడు శుద్ధబౌద్ధధర్మపుబోధకై ప్రచారకుల నంపెను. కాని, ప్రపంచరాజు లందరిలో నత్యుత్తముడగు అశోకుని యుదారాశయముల నాయనయనంతర మమలుజరుపగలవారు, తగుసంధులును లేకపోయెను. ఆయన పోయిన శతాబ్దమునకే, ఆయనపాలనలో నేర్పరచిన ఘనకార్యములు నామావశేషమై, భారతదేశమున కలహము విస్తరించి, ప్రజలు దుస్థితిపాలు గాజొచ్చిరి. హిందూసంఘమందు బ్రాహ్మణుల కుత్తమస్థానము ప్రత్యేకాధికారము నుండెను; వారు మతబోధకులు. సాంఘికలోపములను బౌద్ధులు బహిరంగముగ వెలిపుచ్చుచుండిరి; ఆ బౌద్ధుల బోధలకు వారు వ్యతిరేకులై, క్రమముగా బౌద్ధుల పలుకుబడిని బలమును క్షీణింపజేసిరి. పురాణదేవతా పూజలును, అసంఖ్యాకములగు జాతికులముల పద్ధతియు, హైందవులలో తిరుగ వ్యాపించెను; పూర్వముకన్న కులాచారనిబంధన లింకను తీవ్రములై క్లిష్టములయ్యెను. చాలశతాబ్దములవరకు హిందూ బౌద్ధమతము లొకదానిప్రక్క నొకటి వృద్ధిచెందుచుండెను; కాని చివరకు బౌద్ధమతము భారతదేశమున క్షీణించెను. దానిస్థానమున సాంప్రదాయిక హిందూమతమే చాల అంతర్విభాగములతో దేశమంతటను వ్యాపించెను. హిందూదేశమునకు బయట వర్ణవ్యవస్థలేని దేశములందు మాత్రము బౌద్ధమతము క్రమముగా వ్యాపించెను. ఇప్పటికిని,

చీనా, సయాం, బర్మా, జపాను దేశములందు బౌద్ధమతమే ముఖ్య మతము.*

---

* మౌర్యరాజ్యస్థాపకుడగు చంద్రగుప్తుడు మహావీరుడై ఆర్యావర్తము నంతను స్వతంత్రముగ జయించుటయేగాక, రాజ్యతంత్రమునంతను చాల సమర్థుడై నడపెను. చాణక్యుడతని ముఖ్యమంత్రి యని ఆతడే అర్థనీతిగ్రంథమును రచించె నని, సుప్రసిద్ధవైయాకరణి యగు కాత్యాయనుడును సుమారా కాలపువాడే యని ప్రతీతి. చంద్రగుప్తుని కాలమున ఆర్యావర్త మేకసామ్రాజ్య మయ్యెను; అతని పరిపాలనమును చాల చక్కగ నుండెను; అప్పుడు మన భారతదేశ మున్నతదశలోనుండి నాగరికమై సుభిక్షమై యుండె నని ప్రజలు చాలసుఖులై యుండిరని, అతని యాస్థానపుగ్రీకురాయబారి యగు మెగాస్థనీసు తనగ్రంథమున వ్రాసినాడు; ఆమగధసామ్రాజ్యపు రాజధాని యగు పాటలీపుత్రము (ప్రస్తుతపు పాట్నా) మహానగరమై సర్వసంపత్కళా సమృద్ధమై యుండెను. రాజ్యాంగపు వివిధశాఖలు సమర్థతతో నడుపబడుచు ప్రజాహితకరముగ నిర్వర్తింపబడుచుండెను. అతని పౌత్రుడగు అశోకుడు తన తండ్రి పాలనమందే తాను గాంధారము పంజాబుప్రాంతము జయించి, తక్షశిలానగరమున రాజప్రతినిధిగా నుండి, విశేషానుభవము సంపాదించి, తరువాత చక్రవర్తి యయ్యెను. అతడు దండయాత్ర చేసి జయించిన కళింగదేశ మిప్పటి ఓఢ్రదేశపు దక్షిణభాగమును ఆంధ్రదేశపు విశాఖ గోదావరిజిల్లాలకును సరిపోవును. అశోక చక్రవర్తి హృదయ పరివర్తనము, అందుచే ఆయన సర్వోత్తమ పాలకుడై సతని బౌద్ధమతమును మన విజ్ఞానమును దేశాంతరములందు గూడ వ్యాపింపజేసి ప్రపంచమునకు మహోపకారి యగుటయు, మన ప్రాంతముపై దండయాత్ర సందర్భముననే కలుగుటయు గమనింపదగును.

అశోకుని కాలమున భారతీయులు సిరియా చీనా మొదలగు దూర దేశములందుగూడ బౌద్ధమతమునేగాక, అభివృద్ధమైన భారతీయ తత్వ

విజ్ఞానశాస్త్రమును మనవాఙ్మయమును శిల్పకళలనుగూడ ఆయాదేశములందు వ్యాపింపజేసిరి. అశోకుని వంశీయులు అంత సమర్థులు కానందున, మౌర్య సామ్రాజ్యము క్షీణించి, ఆవంశజులు మగధరాజ్యమును కొన్ని ప్రాంతీయ రాజ్యములను మాత్రము పాలించుచుండిరి. క్రీ. పూ. 185 లో రాజసేనాని యగు పుష్యమిత్రుడు మగధాధిపతియై శుంగవంశము స్థాపించెను. (క్రీ. పూ. 73 లో ఖారవేలుని క్రింద కళింగరాజ్యము మరల స్వతంత్రమై బలీయ మయ్యెను.) 75 లో కాణ్వబ్రాహ్మణుడగు వసుదేవుడు (శుంగరాజమంత్రి) రాజయ్యెను. ఈ కాణ్వవంశపువారి క్రింద మగధరాజ్యము క్రీ. పూ. 28 వరకుండి, అంత్రట ఆంధ్రరాజుల హస్తగతమయ్యెను. అశోకుని కాలమందు సామంతపాలకులై యుండిన ఆంధ్రరాజు లాతని యనంతరమే స్వతంత్రులైరి. (అప్పటిరాజు శ్రీముఖుడు.) తరువాత రాజగు కృష్ణు డాంధ్రరాజ్యమును మహారాష్ట్రదేశమునకుగూడ వ్యాపింపజేసెను. శాతకర్ణి యను ఆనువంశిక బిరుదము వహించిన యీయాంధ్రరాజులు క్రీ. పూ. 27 ఆప్రాంతమున కాణ్వరాజు నోడించి, మగధరాజ్యమునుగూడ ఆంధ్రసామ్రాజ్యమున జేర్చిరి. వీరిలో ముఖ్యుడగు శాలివాహనుడు (క్రీ. శ. 78) నూతనశకకర్తయై వాఙ్మయప్రోత్సాహకు డయ్యె నని ప్రతీతి. ఆసామ్రాజ్యమున ప్రాకృత భాషికములగు ఉత్తర పశ్చిమరాజ్యములు ప్రాధాన్యమువహించినందున, ఆత డాప్రాకృతవాఙ్మయమును వృద్ధినొందించినటుల కనబడును. అసలు ద్రావిడ భాషాకుటుంబములోని దగు మనయాంధ్రభాష ఆకాలమునుండియు సంస్కృత ప్రాకృతపదభరితమై కొంత సంస్కృతసంప్రదాయ మవలంబించి, సంస్కృత మును తన మాతృభాషగ నెంచుకొనెను. ఆ సామ్రాజ్యమునాటికి తెలు గులో ప్రత్యేక వాఙ్మయ మేర్పడిన నిదర్శనములు లేవు. క్రీ. శ. రెండవశతాబ్దపు మొదటనుండి పాలించిన ఆంధ్రచక్రవర్తియగు గౌతమీపుత్ర శాతకర్ణి విదేశీయులగు 'క్షహరాతు'ల రాజవంశమును 119 ప్రాంతమున నిర్మూలమొనర్చి, ఘూర్జర మాళవ కొంకణదేశములగూడ జయించెను. ఈతని

కుమారుడగు పులుమాయియుం యజ్ఞశ్రీయు తరువాత ఆంధ్రచక్రవర్తులలో ముఖ్యులు. క్రీ. శ. 225 ఆ ప్రాంతమున ఈఆంధ్రసామ్రాజ్యము క్షీణించి అంతమొందెను. ఈ యాంధ్రరాజులందరు మొదట శివపూజకులై సనాతనులుగనే యుండిరి; కాని, బౌద్ధమతసంస్థలకు తమ రాజ్యమంతటను చాల దానధర్మములు చేసి ఆమతమును చాల ప్రోత్సహించిరి. అంతకుపూర్వము శైవులైన ఆంధ్రదేశీయు లనేకు లప్పుడు బౌద్ధమతస్థులైరి. మొదట బౌద్ధధర్మము హిందూమతపు (సంస్కరణ) శాఖగనే భావింపబడెను. ఆయాంధ్రసామ్రాజ్యపు రాజధానియగు ధాన్యకటకము (బెజవాడకు 17 మైళ్లదూర మందలి) ధరణికోట యని కొందరు, అమరావతి యని కొందరు, బెజవాడయే యని కొందరును, చెప్పుదురు. మచిలీపట్నము (బందరు) కురంగపురము (కోరంగి) మొదలగు అప్పటి గొప్ప నౌకాస్థానములగుండ ఆంధ్రులును, భారుకచ్ఛ (బ్రోచి) పురాదులనుండి పశ్చిమభారతీయులును, తామ్రపర్ణి తీరాదులనుండి యరవవారును, తామ్రలిప్త్యాదులనుండి వంగీయులును, సింహళ శ్యామ (సయాం) బ్రహ్మదేశము (బర్మా)లతోను బాలీ సుమిత్రా యవద్వీపము (జావా) లతోను తూర్పుఆఫ్రికాతోను విశేష సముద్రవ్యాపారము చేసిరి; ఆప్రాంతమందును హిందూబౌద్ధమతములు విశేషముగ నప్పుడు వ్యాపించెను. అప్పుడు మన భారతీయులు నౌకానిర్మాణమునందును, మహాసముద్రముపై వెళ్ళి విదేశవ్యాపారము చేయుటలోను, విదేశముల కాకర్షకములగు అనేకవస్తువుల దయారుచేయుటలోను, చాల ప్రజ్ఞావంతులై యుండిరి. అప్పుడు మన యమరావతిలో నిర్మితములైన అత్యద్భుతశిల్పకళ గల స్తూపచైత్యాది బౌద్ధమందిరములలో ముఖ్యభాగము లిటీవల లండను మద్రాసు మ్యూజియములకు చేర్చబడినవి. ఇప్పుడు మిగిలియున్న అమరావతీ శిథిలశేషములును అప్పటి ఆంధ్రశిల్పకళానైపుణ్యమును కొంతవరకు తెల్పును. జైనమతముకూడ కొంతవర కిందు వ్యాపించిన సూచనలు కలవు. మనదేశపు

ఇతరప్రాంతములవలె ఆంధ్రరాష్ట్రమునుండియు బౌద్ధజైనమతములు క్రమముగా తొలగిపోయినవి శాంతి గాంభీర్యమూర్తులగు బౌద్ధజైన శిలాప్రతిమలుమాత్ర మిప్పటికిని పూర్వపు బౌద్ధజైనమత వ్యాప్తికి నిదర్శకముగ ఆంధ్రదేశమం దనేకస్థలములందు మిగిలియున్నవి. జైనమత మిప్పటికిని పశ్చిమప్రాంతంలో కొంత మిగిలియున్నది.

అశోకుని యనంతరమిట్లే వాయవ్యప్రాంతపు రాష్ట్రములు గూడ స్వతంత్రము లయ్యెను. అలెగ్జాండరు సేనానులనుండి చంద్రగుప్తునిచే శ్రమతో జయింపబడి అశోకునిచేగూడ శ్రద్ధాదరములతో పాలింపబడిన పంజాబు గాంధారాది రాష్ట్రములు మరల పరదేశీయులగు 'ఇండో సితియను' లను కుషానువంశీయులగు మిళిందాదిరాజుల పాలనమున బడెను. ఇంతలో 'యూచీ'లను సంచారిజాతిచే నొత్తిడినొందిన 'శకు'లను తెగవారు, మధ్య ఆసియానుండి వాయవ్యమూల నీప్రాంతముల జొరబడి, పంజాబులోని తక్షశిల యొద్దను, యమునాతీరపు మధురలోను, మాళవమందును, చిన్న రాజ్యముల స్థాపించిరి. వారు పారసీకపు పార్థియనుల సామంతులని తెలియుటకు, శాత్రపులను నామము వహించినను త్వరలోనే స్వతంత్ర భారతీయ రాజులుగ నేర్పడిరి. వీరిలో ముఖ్యుడగు కనిష్కుడు కొందరి యభిప్రాయ ప్రకారము క్రీ. శ. 75, మరికొందరి ప్రకారము క్రీ. శ. 120 ఆ ప్రాంతమున, పురుషపురము (పెషావరు)ను రాజధానిగా జేసికొని, అపశ్చిమరాష్ట్రము పాలించుటయే గాక, కాశ్మీరమును జయించి, మాళవ పాంచాలాది దేశముల పైన గూడ కొంతయధికారము కలిగియుండి, చీనావారి తుర్కీస్థానమున చాల భాగముగూడ జయించెను; ఈ మహనీయుని కాలమున భారతదేశీయులు రోమకసామ్రాజ్యముతోను చీనాసామ్రాజ్యముతోను వ్యాపార సంస్కృతు లందు విశేషసంపర్కము కలిగియుండిరి. భారతీయకళలను విజ్ఞానమును అశోకుని కాలమందువలె వీ రితరదేశములకు వ్యాపింపజేసిరి. తక్షశిలావిశ్వవిద్యాలయ మతని పోషణలో నింకను వృద్ధినొందెను. చరకుడు మొదలగు ప్రసిద్ధ

వైద్యులు బౌద్ధపండితుడగు అశ్వఘోషుడు మొదలగువారి ద్వారా పాటలీపుత్రమునుండి వివిధవిద్యలు పాలీసంస్కృతవాఙ్మయములు వృద్ధిగావింపబడెను. కనిష్కుడు బౌద్ధమతవ్యాప్తికి చాల ప్రోత్సాహమిచ్చి, తానును బౌద్ధమత మవలంబించెను; బౌద్ధమఠము లనేకముల గట్టించి, వాటిపోషణకై చాలఆస్తి నిచ్చెను. సుప్రసిద్ధమగు గాంధారశిల్పశిలాచిత్రములు, అప్పటి దివ్యభవనములును అతని శిల్పకళాభిమానమును స్పష్టపరుచుచున్నవి. క్రీ. శ. 160 ఆప్రాంతమున నాతడు కాలముచేసెను. అతని వంశీయులు సమర్థులు కారు; ఆసామ్రాజ్య మాతని యనంతరము క్షీణించిపోయెను. క్రీ. శ. రెండవ మూడవ శతాబ్దములందు యూరపు ఆసియాల క్షోభపెట్టిన మహామారి అంటువ్యాధి హిందూదేశమునుగూడ కొంత పీడించియుండవచ్చును. 3-వ శతాబ్దిలో నిచ్చట స్థిరరాజ్యము లుండినటుల లేదు. ఆంధ్రరాజులనుండి స్వతంత్రత నొంది మగధరాజ్యము నాలుగవ శతాబ్దమున చంద్రగుప్తుడను గుప్తవంశపు రాజు (308) క్రింద మరల నుచ్చదశకు వచ్చెను. ఈతని కుమారుడగు సముద్రగుప్తుడు అలెగ్జాండరు నెపోలియనులబోలు చక్రవర్తి యయ్యెను. బాల్యముననే వసుబంధు డను బౌద్ధవిద్వాంసునియొద్ద చక్కగా విద్యల నభ్యసించి రాజుకాగానే (సుమారు 331) అతడు తనరాజ్యమును సర్వవిధముల వృద్ధిచేసెను. సంస్కృతచంపూరచయితయగు హరిసేను డీతని యాస్థాన పండితుడే. సముద్రగుప్తుని భారతజైత్రయాత్ర వివరములకు కొన్ని యాధారములు కలవు. ముందుగా గంగా యమునా ప్రాంతభాగముల నతడు దృఢపరుచుకొని, అంతట దక్షిణకోసల రాజ్యమును పశ్చిమవంగమును జయించి, మహానదీతీరమున కళింగాధిపతియగు మహేంద్రు నోడించి, అతని రాజధానియగు పిష్టపురము (ఇప్పటి పిఠాపురము)ను పట్టుకొనెను. అంత నాతడు వేంగి (ఇప్పటి ఏలూరు సమీపము) రాజును కంచిరాజగు విష్ణు గోపుని జయించి, అటనుండి మరలి పశ్చిమప్రాంతమును మహారాష్ట్రమును వశము జేసుకొని, 350 ప్రాంతమున పాటలీపుత్రము చేరెను. ఈరాజ్యపు పడమటివాగుద్ద

యమునకావల చిరకాలమునుండి యుండిన అనేక స్వతంత్ర ప్రజాతంత్ర రాజ్యములు మాత్రము ప్రజాస్వామికములుగనే నిల్చెను. ఈచక్రవర్తి (అశోకునివలె) ఇతరదేశముల రాజులతో రాయబారముల నేర్పరచుకొనెను; సంగీత సాహిత్యాదుల వృద్ధినొందించెను. గుప్తరాజుల కాలమున చీనా తిబెత్తుదేశములకు సంస్కృతపండితులు వ్యాపించి,ఆదేశముల వాఙ్మయముల వృద్ధిజేసిరి.వాటి అసలు సంస్కృతగ్రంథము లిప్పుడెక్కడను లేవు; కాని వాటి తర్జుమాలు కొన్ని అచ్చట నిప్పటికిని గలవు. సముద్రముపైగూడ పరమార్థాది మహాపండితులు కొందరు శిల్పకళాప్రవీణులు కొందరు చీనాకు ఇతరప్రాంతములకు వెళ్లిరి. ఆ కాలమందే బ్రహ్మ (బర్మా), కాంభోజ (కాంబోడియా), శ్యామ (సయాం) దేశములకు బాలి, బోర్నియో, ఫిలిప్పైన్సు, సువర్ణద్వీప (సుమిత్రా)యవద్వీప (జావా) సింహళాదులకు భారతీయనాగరికత వ్యాపించి, అచ్చటి మనోవికాసమునకు సంస్కృతికి చాలయుత్తేజన మిచ్చెను. 5,6,7,శతాబ్దులందే బౌద్ధమతమును ఆకళావిజ్ఞానములును చీనానుండి కొరియాకు జపానుకు కూడ వ్యాపింపజేయబడెను. అప్పటి భారతీయుల కోస్తావ్యాపార మధికముగ నుండెను. 375 ప్రాంతమున సముద్రగుప్తుని కుమారుడగు రెండవచంద్రగుప్తుడు రాజై, ఆసామ్రాజ్యమును మాళవ ఘూర్జరదేశముల సముద్రతీరమువరకును విస్తరింపజేసి, విక్రమాదిత్య బిరుదము వహించెను. పాశ్చాత్యదేశములతోను, ఇతర ప్రాంతములతోను గుప్త సామ్రాజ్యమునకు విశేష వ్యాపారాభివృద్ధి కలిగెను; పశ్చిమ ప్రాంతపు శకవంశము నశించి, ఆరాజ్యమును గుప్తసామ్రాజ్యమున జేరెను. చంద్రగుప్త విక్రమాదిత్యుడు 413లో చనిపోగా, అతని కుమారుడగు 1-వ కుమారగుప్తుడు, తరువాత స్కంధగుప్తుడు, అతని యనంతరము 2-వ కుమారగుప్తుడు, మొదలగు గుప్తవంశీయు లాసామ్రాజ్యమును 6-వ శతాబ్దమువరకు పాలించిరి. ఈ గుప్తసామ్రాజ్యమున ఆర్థికసంపత్తి, వాఙ్మయము, విజ్ఞానము, శిల్పకళలు కూడ భారతదేశమున చాల వృద్ధినొందెను.

సంస్కృతమహాకవులలో భాసు డప్పటికి కొంచెము పూర్వుడై యుండును. ఇప్పటి రూపుతో రామాయణ మహాభారతములును ముఖ్యమైన స్మృతిగ్రంథములును అప్పటికే యేర్పడియుండును. కాని మూడవ శతాబ్దపు హరిసేనుడు, కవిసార్వభౌముడగు కాళిదాసు మొదలగువారును, పిమ్మటి ఆర్యభటవరాహమిహిరాది జ్యోతిశాస్త్రజ్ఞులును ఈగుప్తకాలపువారై యుందురు. మన సంస్కృత పురాణ వాఙ్మయముగూడ ఈ కాలముననే యుత్పన్నమై యుండును. ఈగుప్తులు నలాందా బౌద్ధవిశ్వవిద్యాలయమునకు ఇతర బౌద్ధ సంస్థలకు సహాయ మొనర్చిరి; కాని, వీరు చాలవరకు హిందూ సనాతన మతస్థులగుటచే, హిందూదేవాలయముల గట్టించి, సంస్కృతవిద్యను విశేషముగ పోషించిరి. బౌద్ధులు సనాతనహిందువులు ఇంకను మిత్రులుగనే యుండిరి. పరస్పరము మతముల మార్చుకొనుచుండిరి. దక్కనులోని అజంతాగుహలలోను, బొంబాయివద్ద 'ఎలెఫెంటా దీవి'లోను, సాంచి ఎల్లోరా కార్లె మొదలగుప్రాంతములందును, అప్పటికి నిల్చియున్న మహాస్థూపములు, చైత్యములు, విహారములు మన అమరావతిశిథిలములు, అప్పటి అద్భుతశిల్పకళావ్యాప్తిని హిందూబౌద్ధమత చిత్రములేక ప్రాంతమందే నెలకొల్పబడుచుండిన సంగతిని వ్యక్తీకరించును.

మనదేశమున బౌద్ధమతము క్షీణించుటకు కొద్దిమంది అగు బ్రాహ్మణుల ప్రభావమేకాక యితరకారణములు నుండెను. అవి గుప్తసామ్రాజ్యమునాటికే కొంచెముగా అంకురించెను. కనిష్కుని కాలముననే బుద్ధుని దేవునిగ భావించి, బుద్ధుని మూలసిద్ధాంతములకు భిన్నముగ బుద్ధవిగ్రహముల బూజింప నారంభించిరి. బౌద్ధుల చైత్యవిహారమఠాదులకు విశేషైశ్వర్యము ఆస్తియుం నేర్పడి, క్రమముగా బౌద్ధసన్యాసులలో అలసత విషయ లోలత్వము నధికమయ్యెను; బుద్ధుని పరిశుద్ధబోధలు మరపుకులోబడెను. ఆయన చెప్పిన భూతదయకు అహింసాసిద్ధాంతముకు విపరీతార్థముల గల్పించిరి; చీమలను దోమలను చంప

కుండుట ప్రధానముగ నెంచిరి, గాని లోటిమానవుల క్షేమమును గాపాడి సంఘాభివృద్ధికై పాటుపడుట శ్రమణకసన్యాసులయొక్కయు ముఖ్యధర్మ మను సిద్ధాంతము మరచిరి. బౌద్ధమతము భారతదేశమున క్రమముగా తన వ్యక్తిత్వమును గోల్పోయెను. బౌద్ధులలో దురాచారములు వ్యాపించియున్న సమయమందే, పూర్వ మీమాంసాచార్యుడగు కుమారిలభట్టుడు, శ్రీ శంకరాచార్యులవారు, తరువాత 11 వ శతాబ్దమున రామానుజాచార్యులవారు హిందూమత పునరుద్ధరణ చేసిరి. ఆర్యహిందువుల భారత రామాయణాదులు దేశభాషలలోని కనువదింపబడెను. ద్రావిడుల భావముల కనుకూలముగను వారి కాకర్షకముగను ఉండునట్లు, ప్రాచీనార్య మతమున తగుమార్పులు కలిగి, పౌరాణిక హిందూమత మేర్పడెను. బౌద్ధమతాచారకులం దప్పుడు ప్రబల ముగనున్న లోపములబట్టి, బౌద్ధమతమును హిందూ ప్రచారకులు ఖండించిరి. ఆస్థితిలో, మహమ్మదీయులు వచ్చి తమకు కేవల వ్యతిరేక సిద్ధాంతములుగల బౌద్ధుల బాధించి రూపుమాపిరి; వారిమతముల నిర్మూలించిరి.

గుప్త చక్రవర్తుల తరువాత, మిహిరకులుని ఆధిపత్యమున హూణులు భారతదేశము ప్రవేశించి, చాలక్రూరకార్యములు చేసిరి; మాళవ రాజగు యశోధర్ముడు మొదలగువారి క్రింద హిందూసేనలు కలసి, 528 ప్రాంతమున వతని నోడించిరి; తరువాత నైన హూణులబాధ వెంటనే పూర్తిగా వదలలేదు. కాని 7-వ శతాబ్దమున స్థానేశ్వర (కురుక్షేత్ర)పు అధిపతియగు హర్షవర్థనుడు (606-648) కాన్యకుబ్జపురము (కనోజ్) రాజధానిగా నుంచుకొని, ఆర్యావర్తమంతయుంజయించి, పాలించెను. ఈయన పాలనసమయమందు భారత యాత్రచేసి గ్రంథము వ్రాసిన 'హుయనుత్సాంగు' వల్లను, ఈయన ఆస్థానకవి 'కాదంబరీ' కర్త అగు భట్టబాణుడు వ్రాసిన హర్షచరిత మను సంస్కృత గద్య కావ్యమువలనను, చాల వివరములు తెలిసినవి. ఈతనికాలమున దేశము సుభిక్షమై జనులు విద్యావంతులై యుండిరి. అనేక ధర్మశాలలు ప్రయాణసౌక

ర్యములు కల్పింపబడెను హర్షుడు స్వయముగా విద్వాంసుడై సంస్కృతవిద్య ప్రోత్సహించుటయేగాక, సంస్కృతమున స్వయముగ నాటకముల రచియించె నని ప్రతీతి ఈతడు హిందూ బౌద్ధమతముల సమానముగా నాదరించెను; తరువాత బౌద్ధమతస్థుడయ్యెను హర్షుడు పశ్చిమచాళుక్యరాజగు 2-వ పులకేశిపై చేసిన దండయాత్రలో మాత్ర మోడిపోయెను. చాళుక్యుడగు ఈ రెండవపులకేశి బలీయుడై, మహారాష్ట్ర ఘూర్జరదేశముల నేకాక దక్షిణదేశ ప్రాంతముల గూడ జయించి, తన సోదరుడగు కుబ్జవిష్ణువర్ధుని మన ఆంధ్ర దేశపు యువరాజుగా జేయగా, అప్పటి (611) నుండి ఈ తూర్పు చాళుక్యు లాంధ్రదేశము పాలించిరి.

హర్షుని అనంతర మతని వంశీకులు సమర్థులుకాక, ఆసామ్రాజ్య మంత టితో అంతమొందెను. 10-వ శతాబ్దమున ఆంధ్రరాజగు విష్ణువర్ధుని రాజధాని మొదట పిఠాపురమం దుండినను, తరువాత వేంగికి మార్చబడెను. ఈ వంశీయుడగు రాజరాజనరేంద్రుని(1022-1062) కాలముకుముందే, రాజమహేంద్రపరము రాజధాని యయ్యెను. ఈ రాజపుంగవుడు నన్నయభట్టును పోషించి, అతనిచే ఆంధ్రమహాభారతాదులు వ్రాయించి, ఆంధ్రవాఙ్మయము కుత్తేజనమిచ్చెను. ఈ వంశీయులు తమకు దక్షిణమందలి ప్రతాపవంతులగు చోళరాజులతో సంబంధము కలిగియుండి, ఒకప్పుడు వారి మిత్రులుగను, ఒకప్పుడు శత్రువులుగను ఉండుచు వచ్చిరి.

దరిమిలా పశ్చిమచాళుక్యులలో ముఖ్యుడగు 6-వ విక్రమాదిత్యుడు (1076-1127) మహారాష్ట్రదేశములోని తన రాజధాని యగు కళ్యాణనగరమునుండి పాలించుచు, చాలరాజ్యముల జయించి బలీయుండగు చక్రవర్తియై, ఆంధ్రదేశముపైన గూడ అధికారము వహించియుండెను. ఈయన మహా పండితుల బోషించెను. ఈచక్రవర్తి కుపదేశకుడగు విజ్ఞానేశ్వరయతి యాజ్ఞవల్క్యస్మృతికి వ్యాఖ్యానముగ రచించిన మితాక్షరమను ధర్మశాస్త్రగ్రంథము

మనప్రాంతమందే గాక, వంగదేశము తప్ప మిగిలిన భారతదేశమంతటను, పరమప్రమాణముగ సంగీరింపబడియున్నది. ఇప్పటి 'హిందూలా'కు కూడ అది ముఖ్యాధారముగ అమలులోనున్నది. అప్పటికే సింధుదేశమందును భారత దేశపు వాయవ్య ప్రాంతమందును పశ్చిమమునుండి మహమ్మదీయుల దాడి అప్పు డప్పుడు కలుగుచుండెను. మహమ్మదు ఘజ్నీ కేవల దండయాత్రకు వచ్చి నప్పుడే భారతీయ రాజులలో ఐకమత్యము పోయి, అసూయ అంతఃకలహ ములు చాల హెచ్చుగా నుండెను. స్వదేశ స్వాతంత్ర్య రక్షణకై దేహళీ (ఢిల్లీ) అజ్మీరు ప్రాంతపు రాజగు పృథ్వీరాజు మహమ్మదుగోరీతో పోరుచుం డగా, పృథ్వీరాజుకు మామ కాన్యకుబ్జరాజు నగు జయచంద్రుడు గోరీకే సహా యము చేసెను. ఆయుద్ధమున పృథ్వీరాజు హతుడై, ఆప్రాంత మాఫ్ఘనుల స్వాధీనమయ్యెను. కాని మరుసంవత్సరము మహమ్మదుగోరీ జయచంద్రుని పైకే దాడివెడలి అతని నోడించి, అతని రాజధానిని కూడ స్వాధీనపర్చుకొనెను. ఇట్లార్యావర్తము తన పూర్వపు ఏకీభావము గోల్పోయి, 12-వ శతాబ్దమున ఆఫ్ఘను రాజులగు మహమ్మదీయుల పాలనమునకు వచ్చెను.

# 30. కన్ఫ్యూషియసు - లౌత్సే

మానవజాతి యువకదశ ప్రారంభించిన క్రీ. పూ. 6-వ శతాబ్దిలోనే కన్ఫ్యూషియసు లౌత్సే అను చీనా ప్రవక్తలు జీవించియుండిరి.

ఈచరిత్ర గ్రంథముప నింతవరకు చీనాదేశపు పూర్వ చరిత్రను గూర్చి ఏమియు సరిగా జెప్పియుండలేదు. చీనాదేశపు ప్రాచీనకాలస్థితి యింకను దుర్గ్రాహ్యముగ నున్నది. గత శతాబ్దిలో యూరపువాసులు తమప్రాంతపు ప్రాచీనస్థితిగతుల గూర్చి చేసినట్లే నూతనచీనాజనులలోని పరిశోధకులు, పురాతత్వజ్ఞులును గూడ, తమ ఆదిమస్థితిని గూర్చి చక్కగా పరిశోధింప వలసియున్నది. ఆ దేశపు మహానదీప్రాంతములందు ఉదయశిలాయుగపు సంస్కృతిచిహ్నము లున్నవి; వాటితో చీనుల పురాన్వ నాగరికత ఆరంభించెను. ఈజిప్టు సుమేరియాలలోని నాగరికతా చిహ్నములే చీనాలోను ఉండినట్లు తోచును. అచ్చటను ఆయా ఋతుకాలములందు జంతుబలి నిచ్చుచు, యాగము చేయుచు, పూజారులును మతాధికారులగు రాజులును పాలింప, గుడుల చుట్టును జనులు గ్రామములు గట్టుకొనియుండిరి. అప్పటి చీనుల పౌరజీవితము 6, 7 వేలయేండ్ల క్రిందటి సుమేరియా ఈజిప్టులలో వలెను, మధ్యఅమెరికాలో వేయేండ్లక్రిందటి 'మయ' సంస్కృతిరీతిగను ఉండెను. చీనాలో నరమేధము పూర్వమెప్పుడైన నుండినను, చారిత్రకాలమునాటికే అది పోయి, దాని స్థాన

మున జంతుబలియే యుండెను. క్రీ. పూ. వేయేండ్లక్రిందనే చీనాలో చిత్రాక్షరలిపి వాడుకలో నుండెను. యూరపు పశ్చిమ ఆసియాలలోని సంఘములకు ఉత్తరప్రాంతపు మరుభూముల సంచారిజాతులతో సంఘర్షణ కలిగినట్లే, చీనాదేశపు ఆదిమ నాగరికులపైకి చీనాకుత్తరస్థులగు సంచారిజనులు దండెత్తుచుండిరి. ఆఉత్తరప్రాంతజను లొకే వేషభాషలు కలిగి, హూణ మంగోలు తురుష్క తార్తార్ అనిచరిత్రప్రసిద్ధిచెందిన వేర్వేరు తెగలకు జెందియుండిరి. ఉత్తరయూరపు మధ్యఆసియాలలోని నార్డిక (ఆర్య)జాతులవలెనే, పరస్పరము కలియుచు మారుచు, విడిపోవుచు, మరల మిశ్రితులౌచుండి, ఏకస్వభావులై యుండిరి. ఈమంగోలులకు ఆర్యజనులకన్న ముందుగనే గుఱ్ఱములుండెను. క్రీ. పూ. 1000 తరిమిలాను, వీరు (మంగోలియాలోని) ఆల్టాయి కొండప్రాంతములందు ఇనుము కరిగింప నేర్చియుండిరు. మరియు పాశ్చాత్యసంచారిజనులవలెనే, ఈ ప్రాచ్యసంచారి జాతులును కొంతరాజకీయైక్యము కలిగి, ఆయాప్రాంతముల స్థిరవాసి నాగరికులపై దాడివెడలి జయించి, ఆ యా దేశము లందు నూతననాగరికత కలిగించియుండురు.

యూరపుఖండపు ప్రథమనాగరికత ఆర్యులది కాదు; పశ్చిమాసియాలో మొదటిది సెమిటికువారిదని కాదు; అట్లే చీనాదేశపు ఆదినాగరికత మంగోలియనులది కాక, నీలగోధుమ వర్ణులదై ఈజిప్టు సుమేరియాల సంస్కృతిని, హిందూదేశపు ద్రావిడనాగరికతను పోలియుండెను. చారిత్రకాలమునాటికే ఉత్తరదేశజనులు చీనాలో దండయాత్రలు సలుపుటచే, అందు జాతిమిశ్రణము కలిగియుండును. క్రీ. పూ. 1750 ప్రాంతము

నాటికే చీనాలో చిన్నచిన్న రాజ్యములు స్వతంత్రపురములు నేర్పడెను. ఆ చిల్లరరాజులు చీనాచక్రవర్తి ఈశ్వరసుతు డని గురూత్తము డని భావించుచు, కప్పముల గట్టుచు, సామంతులుగ నుండిరి. ఆ చక్రవర్తుల "షాంగ్" రాజవంశము క్రీ. పూ. 1125 లో నంతరించెను; హిందూదేశమున అశోకుడును మిశ్రదేశమున 'టాలమీలు'ను ఏలినకాలమువరకు చీనాలో "చౌ" రాజవంశము పాలించెను. ఈదీర్ఘకాలములో చీనాదేశము ఛిన్నభిన్నమయ్యెను; హూణులు దేశముజొచ్చి, అందు కొన్ని చిన్నరాజ్యముల స్థాపించిరి. సామంతరాజులు చక్రవర్తికి కప్పముగట్టుటకూడ మాని, స్వతంత్రులైరి. క్రీ. పూ. 6-వ శతాబ్దమున చీనాలో ఐదారువేల స్వతంత్రరాజ్యము లుండె నని ఒక ప్రామాణికు డుపహరించెను. చీనులు తమగ్రంథములందీకాలమును "కల్లోలయుగ" మని పేర్కొనిరి. కాని, ఈయుగముననే జ్ఞానోచ్ఛ్రయమును, కొన్ని ప్రాంతములందు కళావికాసము నాగరికతయు, గ్రీకులమైలిటసు ఆథెన్సు పెర్గమం మాసిడోనియాలందువలె చీనాలోను చాలస్థలములందు వృద్ధినొందెను. అప్పటి చీనాపరిస్థితులగూర్చి మనకు స్పష్టమగువివరములు తెలియనందున అందునుగూర్చి కేవలము సంధిగ్ధముగనే వ్రాయవలసివచ్చినది.

అంతఃకలహామగ్నమగు గ్రీసులో తత్వజ్ఞులును పరాధీనమై క్షీణించిన యూదదేశమున మతప్రవక్తలు నుండినట్లే ఈ యశాంతసమయమున చీనాలో వేదాంతులు ఉపదేశకులు నుండిరి. ఈయన్నిటియందును ఆందోళనవలన కొందరు జ్ఞానవంతుల బుద్ధికుత్తేజన కల్గినటుల దోచును. "కన్ఫ్యూషియసు"

చీనాలో "లు" అను చిన్నరాజ్యమున కులీనవంశజుడగు అధికారియై యుండెను. చీనాలో అప్పుడుండిన అరాజకమును అల్లరులును ఆయనకు హృదయావేదన కల్గించెను. అందుచే సత్పరిపాలనము ఉత్తమజీవనము స్థాపింప గొన్ని యాదర్శనిబంధనల నిర్ణయించెను; వాటి నమలుజరుపదగిన ప్రభువు లభింపలేదు; రాజు దొరకినచోట రాజావలంబులకుట్రలు విఘ్నకరమయ్యెను. తరువాత $1\frac{1}{2}$ శతాబ్దికి గ్రీసులో ప్లాటోకూడ అట్టిరాజుకై తిరిగి సిసిలీద్వీపమందలి సిరాక్యూసు ప్రభువగు డయానిససుకు కొంతకాలము సలహాదారగుట వినోదకరము. కన్ఫ్యూషియసు నిరాశుడై, 'నన్ను మంత్రిగాచేసుకొను ప్రాజ్ఞప్రభువు దొరుకలేదు; నాకు కాలము సమీపించినది' అనుచు చని పోయెను. ఆత డిట్లుధైర్యమొంది పోయినను, ఆయుపదేశము లధిక శక్తియుతములై, జనుల ప్రవృత్తిలో గొప్ప పరిణామము కల్గించెను. చీనాలో జ్ఞాను లుపదేశత్రయముగా భావించువాటిలో నిది యొకటి, బుద్ధుని దొకటి, లోత్సేది మూడవది. ప్రతివాడు ఉత్తమకులీనవర్తనము కలిగియుండవలె ననుటయే కన్ఫ్యూషియసు ఉపదేశసారాంశము. గౌతము డహంకార రాహిత్యముకు శాంతికి, గ్రీకుతత్వజ్ఞులు బాహ్య వస్తు జ్ఞానముకు, యూదులు ధర్మముకును, ప్రాముఖ్య మిచ్చిరి గదా! ఇట్లే కన్ఫ్యూషియసు వ్యక్తుల సద్వర్తనము ప్రధానముగా నెంచెను. మహోపదేశకులందరిలో నీతడే యెక్కువ సంఘక్షేమాభిమాని; ప్రపంచపు బాధలను దుఃఖములను దొలగించుటయే ముఖ్యముగా నెంచి, జనుల నుదారులుగ జేయుటకై, ఆతడు ప్రతివ్యక్తియు నౌదార్యసద్గుణోపేతు డగు

నట్లు చేయ యత్నించెను; వ్యక్తి ప్రవర్తన కసంఖ్యాకసూత్రము లను, జీవితసంపర్కము లన్నిటికి నుచితనియమములను విధించెను. సత్ప్రవర్తనము సంఘక్షేమపరాయణత నియమయుతజీవితము ఉత్తరచీను లాదర్శముగ నెంచుట గ్రహించి ఆతడు వాటినే బలపరచి అందుకు స్థిరరూప మిచ్చెను.

'లోత్సే' 'చా' రాజవంశ పాలనలో రాజకీయగ్రంథాలయమున చాలకాలము నియంత; అతని బోధలు కన్ఫ్యూషియసు ఉపదేశముకన్న నెక్కువ గూఢము సందిగ్ధము అస్పష్టముగ నున్నవి. ఐహికసౌఖ్యములతోను, అధికారముతోను నిమిత్తములేకుండ పూర్వకాలపు ఆచరణనిరాడంబరజీవిత మవలంబింపవలె నని ఆతని భావన. ఆయన వ్రాసియుంచిన గ్రంథములు సూత్రశైలిలో సంక్షిప్తముగ గూఢముగనున్నవి. గౌతమబుద్ధుని యుపదేశములకువలె నీతనిగ్రంథములకును విపరీతార్థములు చేయబడి, కల్పితగాథలు వచ్చి ఆతనియనుచరులలో అనేక విచిత్రాచారములు, మూఢవిశ్వాసములు గూడ వ్యాపించెను. భారతదేశమందువలెనే చీనాలోను మానవజాతి శైశవదశయందు, మాంత్రికులందు అద్భుతగాథలందును సహజవిశ్వాస ముండెను. అది ప్రపంచమందలి నూతనవిజ్ఞానమును నిరోధించి అనూతనభావములను పూర్వపు విచిత్ర మూఢాచారములచే కప్పివేసెను. చీనాలో నిప్పుడున్న బౌద్ధ మతములోను లోత్సే బోధించిన "తవో" మతములోను, శ్రమణకులు (సన్యాసులు)ను దేవాలయము మతగురువులు ప్రధానులు. భావమున పూర్తిగా గాకున్నను, బాహ్యలక్షణమం దీమతములు యాగప్రధానములగు ప్రాచీనమిశ్రసుమే

రియామతములరీతినే యున్నవి. కన్ఫ్యూషియసుమతము మాత్రము ఇంత మూఢాచారమిళితము గాక, సులభగ్రాహ్యమై సరళమై యున్నది; కనుక, అది యంతగా పరివర్తితము కాలేదు.

"హోయాంగ్‌హో" నదీప్రాంతమగు ఉత్తరచీనాలో కన్ఫ్యూషియసుభావములే వ్యాపించెను. "యాంగ్‌టిసీకియాంగ్" నదీప్రాంతపు దక్షిణచీనాలో తవోమతము వ్యాపించెను. ఉత్తరదేశీయులు అధికారమయ నిష్కపట ప్రాచీనాచారపక్షులు; వీరి ముఖ్యనగరము "పెకిన్". దక్షిణదేశీయులు కళాసక్తులు, విచక్షణయుతులు, స్వేచ్ఛావిహారులు; వీరి ప్రధానపురము "నాంకిన్"; ఈ రెండుశాఖలమధ్య ఇప్పటికిని సంఘర్షము జరుగుచునే యున్నది.

చీనాలో కల్లోలకాలమందలి అంతఃకలహములు క్రీ. పూ. 6-వ శతాబ్దమున మిక్కిలి తీవ్రమై, "చౌ" రాజవంశము మిక్కిలి బలహీనమై గౌరవము గోల్పోయెను; అంతట లోకేశ్వరుడు దానిని రాజకీయసంబంధములను గూడ వదలుకొనిపోయెను.

ఆ కాలపు చీనాలో మూడురాజ్యములు విశేషాధికారము గలిగి, పేరునకు సామంతరాజ్యములై యుండెను. వీటిలో 'త్సి', 'త్సిన్' అను రెండును ఉత్తరచీనాలోనివి; 'చు' అను యాంగ్ట్సీనదీప్రాంతపురాజ్యము విశేషసైనికబలము గలిగియుండెను. చివరకు 'త్సి' 'త్సిన్' అను రాజ్యములు కలసి 'చు' రాజ్యమును జయించి, చీనాలో యుద్ధము మాన్పి శాంతి నెలకొల్పెను. 'త్సి' రాజ్యము మిగిలిన రాజ్యములకన్న మిక్కిలి బలవంతమై యుండెను. చివరకు (భారతదేశమున

అశోకుడు పాలించుకాలమున) చీనాలో 'త్సిన్' రాజు 'చౌ' చక్రవర్తియొక్క యజ్ఞకలశముల బట్టుకొని, ఆతని యజ్ఞధర్మములను తానే వహించెను. ఆయనకుమారుడగు షాంగ్టిరాజు క్రీ. పూ. 246 లో రాజై, 220 లో చక్రవర్తి ఆయెను. ఆయనయే చీనాచారిత్రకథలందు మొదటి విశ్వచక్రవర్తి యని చెప్పబడెను. షాంగ్టిరాజు అలెగ్జాండరుకన్న నెక్కువ యదృష్టవంతుడై, 36 సం॥లు చక్రవర్తిగా పాలించెను. ఈప్రతిభావంతుని రాజ్యమున చీనుల కైశ్వర్యము ఐకమత్యము కలిగెను; నూతన శకము ప్రారంభమాయెను. ఉత్తరమరుభూములనుండి దాడి వచ్చిన హూణజాతులను ఆయన తీవ్రయుద్ధమున నిరోధించెను; వారందరు చొరబడకుండ హద్దు నేర్పరచుట కిచీనారాజు తన సామ్రాజ్యపు ఉత్తరసరిహద్దు పొడుగున 'గ్రేట్ వాల్' అనబడు అతి దీర్ఘమగు మహాప్రాకారమును నిర్మింపనారంభించెను.*

* "షాంగ్టి" యాస్థానమునకు అశోకుడు శాంతిరాయబారులను 18 మంది బౌద్ధాచార్యులను బంపెను; వా రాచక్రవర్తి యనుమతి నొంది, చీనాదేశమున బౌద్ధమతమును భారతీయ నాగరికతను వ్యాపింపజేసిరి. అంతటినుండి బౌద్ధమతము భారతీయ విజ్ఞాన వాఙ్మయములు జనులలో విశేషముగ వ్యాపించి వారి ఆధ్యాత్మికస్థితిలోను విజ్ఞానములోను సంపూర్ణ పరివర్తనము గావించెను.

ఉత్తరచీనులకును మధ్యదక్షిణ చీనులకును ధోరణిలోను కొంతవరకు తత్వములోను విభేద ముండుట కనిపెట్టి వీటిని తమ దుష్ప్రచారముచే ప్రోత్సహించి జపానుపాలకు లిటీవల చీనాజనులను యుద్ధముద్వారా తిప్పలు పెట్టిరి. ఇది ముందు వివరింపబడును.

# 31. రోముకథారంభము

భారతదేశపు వాయవ్యదిశనున్న మహాపర్వత పంక్తుల వలనను మధ్యఆసియా కొండలవల్లను, ఆప్రాంతపు దేశములు పరస్పరము విడియున్నను, వాటినాగరికత మొత్తముమీద నొకరీతినే పరిణమించినది. మొట్టమొదట,అప్పటినదీప్రాంతముల వెచ్చనిదేశములందు కొన్ని వేల యేండ్లవరకు 'సూర్యశిలా' సంస్కృతియే వ్యాపించెను; ఆప్రాంతములందు గుహల పద్ధతి యుండెను; ఆ రాజులకు మతాధికార ముండెను. వారు యాగ సంప్రదాయముల నములు జరుపుచుండిరి. అంతట ఋతుకాల ములందు గడ్డి మాత్రము మొలుచు ఉత్తరప్రదేశమునుండి, సంచారిజనులు దాడివచ్చి కాపురము లేర్పరచుకొని, అచ్చటి ఆదిమజనులలో తమ సంప్రదాయములను, తరుచు తమ భాషనుగూడ, ప్రాంతీయభేదములతో వ్యాపింపజేసి, ఆప్రాంత ములను వశపర్చుకొనిరి. మెసపొటేమియాలో ముందుగా ఎల మైట్లు, సెమిటికు తెగవారును, తరువాత ఆర్యజాతి మీడులు, పారసీకులు, గ్రీకులును, భారతదేశమున ఆర్యభాషీయులును ఇట్లు పరివర్తనము కల్గించిరి. ఈజిప్టులో ఇతరజాతుల మిశ్రణము తక్కువనైు మతగురువుల అధికారము హెచ్చినది. చీనాలో హూణులు వచ్చి దేశీయులలో కలియుచుండిరి; మరల క్రొత్త తెగ హూణులు వచ్చుచుండిరి. గ్రీసు ఉత్తరభారతములందు ఆర్యులును, చీనాలో మంగోలియనులును, మెసెపొటేమి యాలో సెమిటికులు ఆర్యులును వసించుచు, అచ్చట తమ తమ

నాగరికతను వ్యాపింపజేసిరి. ఆ సంచారిజాతులు కొంత వినాశము కల్గించినను ఆ చోట్ల స్వతంత్ర విమర్శజ్ఞానమును నూతనమనో భావములను వ్యాపింపజేసిరి. ఆయా ప్రదేశములందు చిరకాలానుగతమైన మూఢవిశ్వాసముల నరికట్టి వారు దేవాలయములలోకి నూతనప్రభను వ్యాపింపజేసిరి; దేవాంశ మతాధికారము లేకుండ లోకనాయకులనే వారు తమ రాజులుగ నేర్పరచుకొనిరి.

అప్పటివరకు బలీయములై యుండిన ప్రాచీన సంప్రదాయములు క్రీ. పూ. 6-వ శతాబ్దినుండి సడలి, స్వతంత్ర విమర్శ పద్ధతి ఏర్పడినది; అప్పటినుండి మానవజాతి లోక్రమముగా విశేషాభివృద్ధి కలిగెను. చదువుట వ్రాయుట జనులలో వ్యాపించెను. పాలకులు శ్రీమంతులు విద్య నేర్చుచుండిరి. జ్ఞానము మతగురువుల దాటి, ఇతరులకును వ్యాపించెను. రస్తాలు అశ్వోపయోగాదులు హెచ్చినకొలది ప్రయాణమును కొంత వ్యాపారమును వృద్ధిఆయెను; కొత్తగా నాణెముల చలామణి వచ్చి వ్యాపార వ్యాప్తికి తోడ్పడెను.

ఇప్పుడు మనము చీనానుండి మధ్యధరాసముద్రపు పశ్చిమమునకు దృష్టిని మార్చి చూతము. ఈరంగస్థలమున ముస్ముందు ముఖ్యపాత్ర ధరింపనున్న నగర మొకటి బయలు దేరెను. అదియే రోము. మనచరిత్రలో నింతవరకు ఇటలీ దేశముగూర్చి అంతగా నేమియు చెప్పలేదు. క్రీ. పూ. 1000 కి పూర్వ మా దేశము గిరిగహనమయమై యుండెను. జనులు మిక్కిలి కొద్ది. ఈద్వీపకల్పములో నార్యభాషీయులు చొచ్చి గ్రామములను పురములను నిర్మించుకొనిరి. దక్షిణాగ్రమున

గ్రీకులుగచ్చి. వలసయుండిరి. అచ్చటి 'పేప్యము' శిథిలము లాప్రాచీన గ్రీకురాజ్యసంపత్తును సూచించును. ఈజియనుజాతి సంబంధులగు ఎట్రస్కనులను ఆర్యేతరజాతివా రాద్వీపకల్ప మధ్యమం దధికారులై, ఇతరప్రాంతములవలెగాక ఇచ్చటి ఆర్యుల బాలించుచుండిరి. చరిత్రకాల మారంభించు నరికి, 'రోము' టైబరునదిపై నొక పాటిరేవునద్ద వ్యాపారము చేయు చిన్నపురము; ఆ పౌరులు ఆర్యభాషానుటుంబపు 'లాటెను' మాటాడుచు, ఎట్రస్కనుల పాలనలో నుండిరి. క్రీ. పూ. 753-వ యేట, అనగా ఒలింపికు ఆటల యారంభమునకు 23 ఏండ్ల తరువాతను, ఫనీషనుల కార్తేజినగర మేర్పడిన అర్థ శతాబ్దికి, రోమునగర మేర్పడె నని ప్రాచీన కథలందు గలదు. కాని రోములోని చత్వరస్థల మిటీవల త్రవ్వగా అందు కనబడిన ఎట్రస్కనుగోరీలు క్రీ. పూ. 753 కు కూడ పూర్వపువి.

విశిష్టకాలమగు క్రీ. పూ. 6-వ శతాబ్దిలోని 510 లో ఎట్రస్కనులు తరిమివేయబడి, ఆర్య రోమనులలో పెట్రీషను లనబడు కులీనులు "ప్లెబియను" లనబడు జనసామాన్యముపై నధికారులైరి; ఇట్లు రోము స్వతంత్ర ప్రజారాజ్యమై, అచ్చటి గ్రీకు ప్రజారాజ్యములను పోలెను. రోమనులభాషమాత్రము లాటెను. అంతట కొన్ని శతాబ్దములవరకు రోమనురాజ్యాంగ మున ప్లెబియనులు స్వతంత్రులై అధికారయుతు లగుటకై, తీవ్రముగ కులీనులతో పోరాడిరి. ఇట్టిపోరాటము గ్రీకుల లోను కొన్నిచోట్ల జరిగెను. చివరకు ప్లెబియనులు ప్రతిబంధ ముల క్రమముగాదాటి, కులీనులతో సమమగుహక్కుల బొంద గలిగిరి. రోమపౌరత్వపుహక్కు లీ యుభయకక్షులకు గల్గెను.

ఈపోరాట మిట్లుండగనే రోమకరాజ్యాధికార మన్యదేశము లకు వ్యాపించెను. ఈరాజ్యవ్యాప్తి క్రీ. పూ. 5-వ శతాబ్దిలో మొదలిడెను. అంతవరకు రోమనులు ఎట్రుస్కనులతో యుద్ధములు చేయుచు, తరుచు ఓడుచువచ్చిరి. రోమునకు కొద్దిమైళ్లలో నుండిన, 'విసై' అను ఎట్రుస్కనుపురమును రోమనులు పట్టుకో లేకపోయిరి. కాని క్రీ. పూ. 474-వ యేట ఎట్రుస్కనుల నౌకాసేన దక్షిణమున సిసిలీయందలి సిరాక్యూసువాసులగు గ్రీకులచే ధ్వంసముచేయబడెను. ఉత్తరమున గాలులను ఆర్య జాతీయులు వచ్చి వారిపై బడిరి; అంతట ఎట్రుస్కనులు చరిత్ర నుండి అదృశ్యులైరి. అప్పుడు వెయిపురము రోమనుల వశ మయ్యెను. గాలులు రోమును ఆక్రమించి, దానిని క్రీ. పూ. 390 లో ముట్టడించిరి. కాని, అందలి 'కాపిటల్' అను అసలు కోటను పట్టుకొనలేనైరి; రాత్రివేళ దానిని హఠాత్తుగ బట్టు టకు గూఢయత్నము చేసిరి; కాని అప్పుడే బాతులు ధ్వని చేయగా వెల్లడియై, వ్యర్థమాయెను. చివరకు కొంతలంచము పుచ్చుకొని, గాలులు ఉత్తరయిటలీకి మరలిపోయిరి. గాలులదాడి తప్పిపోగానే రోమనులు శౌర్యముదెచ్చుకొని, ఎట్రుస్కను ప్రాంతముల జయించి, ఆర్నో మొదలు నేపిల్సు వరకున్న మధ్యయిటలీనంతను క్రీ. పూ. 300 లోగా వశపరచుకొనిరి. మాసిడోనియాలోను గ్రీసులోను ఫిలిప్అధికారము బలమై తరువాత అలెగ్జాండరుచక్రవర్తి ఈజిప్టుసింధుప్రాంతములకు వ్యాపించుసమయమందే, రోమనులు, తమ తూర్పువైపు నాగరికలోకమున ప్రబలులైరి. తమకుత్తరమందున్న వీర యోధులగు గాలులు తిరుగ తమపైకి రాకుండ, ఆసరిహద్దున

రోమనులు కోటలపంక్తిని కోటపురములను నిర్మించిరి. దక్షిణమందు (అనగా సిసిలీలోను ఇటలీ పాదాగ్రమందును) 'టారంటం' మొదలగు గ్రీకురాజ్యములు రోమనులకు భయపడుచు, ఈ నూతనవిజేతలనుండి రక్షించుకొనను సత్వరసహాయ మపేక్షించుచుండినవి.

అలెగ్జాండరు సామ్రాజ్యము ఖండఖండములై, అతని సేనానుల పాలబడినప్పుడు అతని బంధువగు పిర్రస్ అను సాహసి యొకడు ఇటలీపాదమున (అడ్రియాటిక్ సముద్ర తీరపు) ఎపిరస్‌నగరము వశపరచుకొనెను. మాసిడోనియాలో ఫిలిప్‌వలెనే ఇటలీప్రాంతపు గ్రీకురాజ్యములకు తాను నాయకుడుగా తలచి అతడు సమర్థమగు సేనను సిద్ధముచేసెను. గ్రీకు కాల్బలము, థెసలీనుండి మాసిడోనియనురీతి అశ్వికదళము, మరియు యుద్ధార్హములగు 20 గజములను గూడ సమకూర్చి పిర్రసు ఇటలీపై వెడలి, క్రీ. పూ. 280 లో 'హిరాక్లియా' వద్దను, 279 లో 'ఆస్క్యులము' వద్దను, రెండు మహాయుద్ధములలో రోమనుల నోడించి, వారిను త్తరముకు తరిమెను; అంత నతడు సిసిలీవైపు మరలెను. అందుచే రోమనులకన్న బలీయులగు ఆ కాలపు మహత్తరమగు 'కార్తేజ' అను ఫనీషను నగరపు జనులతో నతనికి తగవువచ్చెను. కార్తేజ కతిసమీపమగు సిసిలీద్వీపము నొకశూరుడు ముట్టడించుట కార్తేజివారికిష్టముకాదు. తమమాతృస్థానమగు టైరునగరమున కలెగ్జాండరు దాడిచే గలిగిన దుర్దశసంగతి కార్తేజపౌరులకు విదితమే. కనుక విడువక పిర్రసుతో పోరాడుచుండు మని రోమనుల ప్రోత్సహించుచు, వీరు తమ నావలు తోడుపంపిరి; మరియు పిర్రసుకు

గ్రీసునుండి సముద్రముపై సాయమురాకుండ నరికట్టిరి. అంతట నేపిల్సునకు రోమునకు మధ్య 'బెనివెంటం' వద్ద జరిగిన యుద్ధమున రోమనులు పిర్రసు నోడించిరి. ఇంతలో గాలులు మరల దాడి నారంభించిరి; రోమనుల సరిహద్దుకోటలు దుర్భేద్యములుగ నుండుటచే వారు ఇల్లీరియా (అనగా ప్రస్తుతపు సెర్వియా ఆల్బేనియాల)లో నుండి, మాసిడోనియాకును, పిర్రసుస్వగ్రామమైన యెపిరసుపైకిని వచ్చిరి. రోమనులచే నోడి కార్తేజివారి యాటంకము కలిగి గ్రీసుతో సముద్రసంపర్కము గోల్పోయి, పైగా స్వగ్రామమునే గాలులదాడినుండి రక్షింపవలసివచ్చి పిర్రసు తనజైత్రయాత్రను మానుకొని క్రీ. పూ. 275 లో స్వస్థలమునకు మరలిపోయెను. అందుపై రోమను అధికారము ఇటలీ దక్షిణమున మెస్సీనాజలసంధి వరకును వ్యాపించెను. ఈజలసంధి కావలిదగు సిసిలీలోని మెస్సీనా అను గ్రీకుపురము కొలదికాలముక్రింద కొందరోడదొంగలవశ మయ్యెను. దాదాపు సిసిలీద్వీప మంతటి కిదివరకే ప్రభువులై సిరాక్యూసు ప్రభువునకు మిత్రులైన కార్తేజివారు ఈ యోడదొంగలను క్రీ. పూ. 270 లో తరిమివేసి, మెస్సీనాలో తమ రక్షకసేన నుంచిరి. ఈ యోడదొంగలంతట రోము సహాయ మపేక్షింపగా, రోమను లిందు కిష్టపడిరి. ఈరీతిని మెస్సీనాజలసంధి కొకవైపు వ్యాపారకుశలురగు కార్తేజివీరులు, రెండవవైపు విజయులైన రోమనులు తారసిల్లి యుద్ధసన్నద్ధులై తలపడిరి.

---

# 32. రోము, కార్తేజి

రోము కార్తేజీల మహాసమరము క్రీ. పూ. 264 లో నారంభించెను. ఇదియే "ప్యూనికుయుద్ధము." ఆసాలున భారత దేశమునందు (ఇపుడు బీహారనబడెడు) మగధరాజ్యమున అశోక చక్రవర్తి పాలింపనారంభించెను. అప్పటికి చీనాలో ష్వాంగ్-టి3 రాజు చిన్న శిశువు. అలెగ్జాండ్రియాలోని కళాలయమున వైజ్ఞానికకృషి యింకను జరుగుచునేయుండెను. అనాగరికులగు గాలులాసియామైనరులో పెర్గమమ్‌నుండి పన్ను రాబట్టుచుండిరి. ప్రపంచమందలి వివిధప్రాంతములమధ్య దూరము దుస్తరమై యుండెను. కనుక స్పెయిను ఇటలీ ఉత్తరఆఫ్రికా పశ్చిమ మధ్యధరా ప్రాంతములందు సెమెటికుల అంత్యరాజ్యమగు కార్తేజికిని, ఆర్యులగు రోమనులకున్ను అప్పుడు $1\frac{1}{2}$ శతాబ్దములు ఘోరసమరము జరిగినను, మిగిలినప్రపంచమునకు దూరపు సందిగ్ధవదంతులే వినబడియుండును. ఆయుద్ధములచే గలిగిన సమస్య లిప్పటికిని ప్రపంచము కాందోళన కల్గించుచున్నవి. ఆ యుద్ధాంతమున కార్తేజిపై రోము సంపూర్ణవిజయ మొందెను. కాని ఆర్య సెమెటికుల ఈసంఘర్షము తరువాత కొంతకాలమునకు క్రైస్తవ యూదసంఘర్షముగా పరిణమించెను. వీటిఫలితములవలనను, సంప్రదాయముల అపార్థములవలనను చాల నుద్రేకము గల్గెను; అది తరువాత కొంత క్షీణించినను, నేటికిని ఆ కలహాంకురములు సంఘర్షములు నశింపక ప్రమాదస్థితిని గలుగ జేయుచున్నవి.

మొదటిప్యూనికుయుద్ధము మెస్సీనా ఓడరేవుంగల తగువుకై క్రీ. పూ. 264 లో ప్రారంభమైనది; అది సిరాక్యూసునగరపు గ్రీకురాజ్యముతప్ప మిగిలిన యావత్తు సిసిలీ దేశముకొరకు జరిగినది. కార్తేజివారికి అప్పటికి బలవత్తరమై అయిదేసి వరుసలు కూర్చిన గొప్పయుద్ధనావలు సముద్రసౌకర్యము నుండెను; అంతకు రెండుశతాబ్దములు పూర్వము సలమిస్ యుద్ధమునాటికి యుద్ధనావలకు మూడేసితెడ్లుమాత్ర ముండినవి. రోమనుల కిప్పటికి నౌకానుభవము లేదు; కాని వా రద్భుత కృషితో కార్తేజివారికన్న ఎక్కువయోడల గట్టి, వాటిని గ్రీకునావికులచే నడిపించిరి. మరియు రోమనులు క్రొత్తగా పెద్దకొక్కెములు గల ఇనుపలంగరులు పెద్దపెద్ద పలకలు తెచ్చి పెట్టి, నౌకానైపుణ్యములేని లోపమును దీర్చివేసిరి. కార్తేజి వారు రోమను ఓడలు పగులగొట్టుటకును తెడ్లను కత్తిరించి వేయుటకును సమీపింపగానే, రోమనులు తమపెద్దయినుపలంగరులను కార్తేజివారి నావలపై విసరివేయుచుండిరి; వాటి కొక్కెములలో కార్తేజినావలు తగుల్కొనును; ఆనావలను గొలుసులతో తమయోడలవద్దకులాగుకొని, రోమనులుతమపెద్ద పలకలమీదుగా కార్తేజినావలపై బడిరి. (ఇందుచే జలయుద్ధము స్థలయుద్ధముగా మారెను.) క్రీ. పూ. 260 లో 'మైలే' లోను, 256 లో 'ఎక్నమసు'వద్దను కార్తేజివారిట్లు పూర్తిగ నోడింపబడిరి. రోమను లంతట కార్తేజివద్ద నేలపై దిగగా, వారిని మొదట కార్తేజివారు నిరోధించిరి; కాని తరువాత 'పానొర్మొ' యొద్ద యుద్ధములో, కార్తేజివారిని రోమనులు పూర్తిగా నోడించి, అందు 104 ఏనుగుల బట్టుకొని వానితో

రోములో విజయోత్సవమును జరిపిరి. తరువాత రోమనులు రెండుసారు లోడినను తిరుగ తేలుకొని, చివరకు క్రీ. పూ. 241 లో ఎగేషియను ద్వీపములయొద్ద యుద్ధములో కార్తేజి నౌకాదళమును వారు పూర్తిగ నోడించిరి; అంతట కార్తేజి వారు బలముడిగి, సంధికోరిరి. అందుపైన, సిరాక్యూస్ రాజ్యముగాక మిగిలిన యావత్తు సిసిలీ రోమనుల కిచ్చివేయబడెను. తరువాత నుభయులలోను గృహకల్లోలములు కలిగి, రోము కార్తేజీలకు 22 ఏండ్లు పరస్పరయుద్ధము లేకుండెను. ఇటలీలో గాలులు దక్షిణముగా రోముపై దాడివచ్చి, టెలమన్ వద్ద నోడింపబడిరి. కాని, ఈలోగా రోమనులు భయవశులై తమ దేవతలకు నరబలినిగూడ ఇచ్చిరి. రోమనులంతట ఆల్ప్సుకొండల వరకు గాలులనదరిమి, ఎడ్రియాటిక్ సముద్రతీరమున ఇల్లీరియా వరకు తమరాజ్యము స్థాపించిరి. కార్తేజినగరమున అంతఃకలహములు, కార్తేజి వశమందుండిన సర్డినియా కార్సికాలందు తిరుగుబాటును గలెను; అందుచే రోమనులవలె కార్తేజివారికి వెనుకటి శక్తి చేకూరలేదు. తిరుగబడిన యీ రెండుద్వీపములను రోమను లకారణముగ నాక్రమించి అన్యాయముగ తమ సామ్రాజ్యమున గలుపుకొనిరి. ఈ అసహ్యచర్యచే కార్తేజి వారు రోషపూరితులై, స్పెయినులో తమరాజ్యమున కుత్తరపు సరిహద్దగు ఈబ్రోనదిని దాటి, క్రీ. పూ. 'హానిబల్' అను యువకసేనానితో రోమకరాజ్యముపై దాడికి బయలుదేరిరి. అద్భుతప్రతిభుడగు నీ 'హానిబల్' సేనాని స్పెయినునుండి తన కార్తేజి సేనతో ఆల్ప్సుకొండల నెట్లో దాటి, ఇటలీలో ప్రవేశించి గాలులను రోమనులపై పురికొల్పి, ఈ రెండవ పూ్యనికు

యుద్ధమును ఇటలీలోనే పదునైదేండ్లు సాగించెను; 'ట్రాసిమిర్ సరస్సు'వద్దను 'కేనే' వద్దను అతడు రోమునుసేనలను పూర్తిగ నోడించి, వారికి విశేషనష్టము గలుగజేసెను. ఇటలీలో నాప్రచండ సమరమున రోమును సేన యేదియు నావీరుని యెదుట నిలిచి యాంథాంటి నెదుర్కొనలేకుండెను. కాని ఒక రోమును సేన సముద్రముపై ఫ్రాన్సులోని 'మార్సైలు పురము'వద్ద దిగి హానిబలుకు స్పెయినుకు రాకపోకల నరికట్టెను. కోటముట్టడికి వలయుపరికరములు లేనందున హానిబలు రోము నగరిని బట్టుకొనలేకపోయెను. ఇంతలో కార్తేజివారి స్వదేశములో. 'న్యూమిడియను' లను తెగవారు తిరుగబడిరి; మరియు ఒక రోమునుసేన సముద్రము దాటి వెళ్లి ఆఫ్రికాలో దిగి, కార్తేజినే ముట్టడించెను; అంతట, కార్తేజివారి కాత్మరక్షణ కావలసివచ్చెను. హానిబలు వెనుకకు పోయెను. ఆ నగరము నొద్ద క్రీ. పూ. 202 లో జరిగిన 'జామా యుద్ధము'న, జ్యేష్ఠ 'సిపియో ఆఫ్రికానసు' నడిపిన రోమునుసేనలచే హానిబలు తన జీవితమందు ప్రథమపరాజయ మొందెను. అంతటితో రెండవ ప్యూనికుయుద్ధ మంతమయ్యెను; ఆసంధిచే కార్తేజివారు తమ స్పెయిను రాజ్యమును యావత్తు నౌకాదళమును చాల ద్రవ్యమును రోమనులకు నష్టపరిహారముగా నిచ్చుకొనిరి; అంతే గాక తమ నాయకుడగు 'హానిబలు'ను కసితీర్చుకొనుటకై రోమనుల కొప్పగింప నంగీకరించిరి; కాని 'హానిబలు' ఎట్లో తప్పించుకొని, ఆసియాకు పారిపోయి తరువాత కొంత కాలముకు తన నిర్దయశత్రువులగు రోమనుల పాలబడకుండ విషముద్రావి మరణించెను. అంతట సర్వమును గోల్పోయి

నిర్వీర్యమైన కార్తేజియు, రోమును 56 ఏండ్లు సంధిని పాలించెను. ఇంతలో చెదిరిపోయి తగవులు పడుచుండిన గ్రీసును గూడ రోమనులు తమసామ్రాజ్యమున గలుపుకొని ఆసియా మైనరులోనికి దండయాత్రచేసి అచ్చటి 'లిడియా దేశ'మందలి 'మెగ్నిషియా' వద్ద సెల్యూకసు వంశీయుడగు 'మూడవ ఆంటి యోకసు' నోడించిరి. అప్పటి నుండి టాలమీలపాలన క్రింద నున్న ఈజిప్టు, పెర్గమం చాలవరకు ఆసియామైనరు, వానిలోని చిన్నచిన్న రాజ్యములును రోమనులకు మిత్రులనువేర సామంత రాజ్యము లాయెను.

పరాజితులై దుర్బలులైన కార్తేజివా రింతలో తమ పూర్వశక్తిని మెల్లగా జేకూర్చుకొనుచుండిరి. దానిని సహింపక రోమనులు క్రోధపరవశులై లేనిపోనికారణముల గల్పించి క్రీ. పూ. 146 లో కార్తేజిని ముట్టడించిరి. కార్తేజి సుహా ధైర్యసాహసములతో చాలకాల మెదిర్చినది. కాని క్రీ. పూ. 146 లో పట్టుబడి ధ్వంసము చేయబడెను. రోమను లానగర వీథులలో జొరబడి కంటబడినవారినందరిని ఆరుదినములు ఘోర హత్యచేసిరి. 2½ లక్షల జనసంఖ్యగల అమ్మహానగరపుకోట రోమనులకు స్వాధీన మగునప్పటిక అందు 50 వేలమంది మిగిలిరి. వారిని రోమనులు బానిసలుగా అమ్మివేసి, ఆనగరమును భస్మావశేషముచేసి దగ్ధమై నల్లబడిననేలనుగూడ దున్ని అందుపైరు చల్లిరి.

ఈవిధమున మూడవ ప్యూనికుయుద్ధ మంతమొందెను. అయిదుశతాబ్దులు వృద్ధిలో నుండిన సెమిటికు రాజ్యము లన్ని టిలో సెల్యూకసువంశీయులనుండి విమోచనమొంది స్వదేశీయు

లగు మక్కేబియన్ వంశీయులపాలనలోనుండిన 'జూడియా' అను చిన్నయూదదేశముమాత్రము స్వతంత్రపరిపాలనక్రింద మిగిలినది. అప్పటికి వారి బైబిలుగ్రంథము పూర్తియై, యూదుల ప్రస్తుత ప్రత్యేక సంప్రదాయ ముద్భవించుచుండెను. వీరిసంబంధులగు కార్తేజివారు ఫనీషనులు మున్నగువారు ఏకభాషికులగుటచే, ఉత్సాహకరమగు ఆబైబిలు వాఙ్మయధోరణిలో యూదులతో నేకాభిప్రాయులై యుండిరి. అప్పటిప్రపంచమున చాలవరకు వర్తకము, పెట్టుబడి, వడ్డీవ్యాపారము' వారే సాగించుచుండిరి. సెమిటికుజాతి అణచబడినను నశింపలేదు.

జెరూసలేము యూదమతస్థుల కేంద్రముగానున్నను, వారిసంస్కృతి కెప్పుడును చిహ్నమే. అది క్రీ. పూ. 65 లో రోమనులపాలబడి, కొంతకాలము అర్ధస్వాతంత్ర్యముప సంస్థ ముగానుండి, తిరుగబడి, క్రీ.త. 70లో తీవ్రయుద్ధమున రోమనులచే పట్టుబడెను. అందలి దేవాలయము నాశముచేయబడెను. క్రీ. త. 132 లో మరియొక విప్లవము జరిగి, ఆనగరము మట్టము చేయబడెను. ప్రస్తుతపు జెరూసలెంపురము తరువాత రోమనుల యాజమాన్యమున తిరుగ కట్టబడినది. అందలి పూర్వదేవాలయస్థలమున వారు "జ్యూపిటర్ కాపిటోలినస"ను రోమక దేవుని కొరక గుడికట్టించి, ఆపురములోనికి యూదులు రాకుండ నిషేధించిరి.



# 33. రోమకసామ్రాజ్యవృద్ధి

క్రీ. పూ. మొదటి రెండు శతాబ్దములందు రోమనులే పాశ్చాత్యలోకమున ప్రముఖులుగా నుండిరి; వీరి రాజ్యమునకును అంతకు పూర్వపు నాగరికసామ్రాజ్యములకును అనేక విషయాలలో భేదము గలదు.

రోమకరాజ్యమున కొంతకాలమువరకు రాజు లేడు. ఈరాజ్యము జయశీలుడగు నొక మహానాయకుడు స్థాపించినది కాదు. ప్రజాస్వామ్యాకసామ్రాజ్యము లంతకు పూర్వము నుండినవి. పెరికిల్సుకాలమున కొన్ని మిత్రసామంతరాజ్యములపైన ఆథెన్సువా రధికారులై యుండిరి. ఇట్లే రోముతో తీవ్రయుద్ధ మారంభించు కాలమునకు సర్డీనియా, కార్సికా, మొరాకో, అల్జీయర్సు, టూన్యునిస్ దేశములపైనను స్పెయిన్ సిసిలీలలో చాలవరకును, కార్తేజివారు పాలించుచుండిరి. కాని యంతటితో నశింపక మార్పునొందుచు వచ్చిన మొదటి ప్రజాసత్తాకరాజ్యము రోమనులదే.

ఈనూతనరాజ్యపు కేంద్రము మెసపొటేమియా ఈజిప్టు ప్రాంతముల ప్రాచీనసామ్రాజ్యస్థలములకు పశ్చిమమున దూరమందుండెను; ఆప్రాంతముల నూతనరాజ్యములను రోమనులు నాగరికతలోనికి తేగల్గిరి.

రోమనుల యధికారము మొరాకోను స్పెయినుకు వ్యాపించుటయేగాక, వాయవ్యదిశలోని ఫ్రాన్సు, బెల్జియము దేశములకును, ఇంగ్లాండుకును, మఱియు ఈశాన్యమున హంగ

రీకి దక్షిణ రష్యాదేశమువరకును గూడ విస్తరించెను. అయితే దక్షిణ ఆసియాయును పర్షియాయును రోము కతిదూరములు; కనుక రోమను లాప్రాంతమం దధికారము చేయలేదు. రోమక సామ్రాజ్యమున ఆర్యజాతివా రనేకు లుండిరి. కొలదికాలము ననే గ్రీకులోకమంతయు నందు జేరెను. వెనుకటి సామ్రాజ్యంలోకంటె ఇందులో సెమిటికుజాతీయులు చాల తక్కువ.

పారసీ గ్రీకురాజ్యముల కతిశీఘ్రముగ గలిగిన దుర వస్థలో పడక, రోమకరాజ్య మనేక శతాబ్దములు వృద్ధినొందెను. మీడుపారసీకరాజు లొకతరములోనే బాబిలను నాగరికతలో నిమగ్నులై, రాజరాజబిరుదము వహించి దేవాలయాధికారమును గురుత్వమును తమపై బెట్టుకొనిరి; అలెగ్జాండరును అతని మతగురువులు నారీతినే ఆప్రాంతీయసంస్కృతిలో బడిరి. సెల్యూకసువంశీయులును నెబూకడ్ నెజ్జారునే యనుకరించిరి; సుమేరియనులను జయించిన సెమిటికుపాలకులవలనే పీ పంప రును తమతమ ప్రాంతీయ నాగరికతలో లీనులైరి; కాని రోమనులుమాత్రము తమ కేంద్రమునుండియే పాలించుచు, కొన్ని శతాబ్దములవరకు తమ ప్రాచీనన్యాయశాస్త్రమునే అనుసరించిరి. క్రీ. పూ. 2, 3-వశతాబ్దముల క్రింద తమ తోడిజాతివారగు గ్రీకుల మనోభావములు మాత్రమే రోమనుల కలవడెను. ఆర్యపద్ధతిని సామ్రాజ్యపాలనను మొదట రోమనులే జరిగించిరి. ఈనూతనపద్ధతి ఆర్యుల ప్రజాతంత్రరాజ్యమును విస్తరింప జేసెను.

ప్రత్యేక ధాన్యదేవతల యాలయముచుట్టు పెరుగు రాజధానీనగరమున వ్యక్తివిజేతలు పాలించు పూర్వపుపద్ధతి

రోముకు వర్తింపదు. గ్రీకుదేవతలవలె రోమనుదేవతలును మానవప్రకృతి గలిగి అమృతత్వమును బొందినవారు. పెట్రీషియనుకులీనులు కొందరు భగవదవతారముగ భావింపబడిరి. రోమనులకును జంతుబలి గల యజ్ఞములును, ఒకప్పు డరిష్టకాలమందు నరబలి నిచ్చుటగూడ ఉండెను; దీనిని వీరు ధూర్తప్రసన్నులగు ఎట్రుస్కనులనుండి గ్రహించి యుందురు. కాని రోమకరాజ్యము ఉన్నతదశలో నుండునపుడు గుణులు గురువులు రోమకచరిత్రమున ముఖ్యులు కాలేదు. రోమకసామ్రాజ్యము ముందుగా నుద్దేశింపబడక, తనంతట క్రమముగా పెరిగెను. ఇంచుమించు హఠాత్తుగనే రోమనులు సామ్రాజ్యపాలకులైరి; అది చివరకు జయప్రదము కాలేదు; ఆ పరిపాలనపద్ధతి శతశతాబ్దములలోను మారుచు, చివరను పూర్తిగా భగ్నమయ్యెను.

వంగదేశమందును మెసపొటేమియాలోను ఈజిప్టులోను వేయేండ్లలోకన్న రోమకసామ్రాజ్యమున నూరేండ్లలో నెక్కువమార్పు గలిగెను. ఇట్టి నిరంతరపు మార్పుచే, ఆపాలనపద్ధతి స్థిరత తప్పెను. ఇట్లసంపూర్ణమైపోయిన లోకపాలన కళారహస్యములనే నేడు యూరపియనులు ఆమెరికనులు సాధింప బూనినారు. రోమకరాజ్యపాలనమున రాజకీయముగనే గాక సాంఘిక నైతికవిషయములగూడ గొప్ప మార్పులు కల్గెనని చరిత్రపాఠకులు గ్రహింపవలెను.

మెకాలేగారి "లేస్ ఆఫ్ ఏన్షియంటు రోమ్" (ప్రాచీన రోమగీతములు) మొదటి కేటోసిపియోలు, జూలియస్ సీజరు, డయోక్లీషన్, కాన్‌స్టైంటైనుల వృత్తాంతములు,

జీవితకథలు, ఉపన్యాసములు, ద్వంద్వయుద్ధములు ఇత్యాదు లన్నిటిని కలగాపులగముజేసి, కొందరు రోమకరాజ్య మత్యుదారము ఘనము అందురు. ఇందలి వేర్వేరు పరిస్థితులకు 11-వ శతాబ్దపు విలియంవిజేతకాలపు లండనుకును ప్రస్తుతపులండనుకును గల భేదముకన్న నెక్కువ భేదమున్నది. వాటినుండి గ్రహించి అతికిన యీ చిత్రాంగములను వాటి సవ్యస్థలము లందుంచి జూచిన రోమకసామ్రాజ్యము మహాఘన మను భావము సన్నంకా దని తెలియగలదు.

రోమకరాజ్య వ్యాప్తిలో నాలుగంకములు గలవు. క్రీ. పూ. 390 లో గాలులు రోమము ముట్టడించుట మొదలు మొదటి ప్యూనికుయుద్ధ మంతమైన క్రీ. పూ. 240 వరకు మొదటిది; ఇది ప్రజాసత్తాసమన్వయాంకము; రోముచరిత్రలో నిదియే స్వరూపానుగుణమై యుత్తమమైనది. పెట్రీషియను లకు ప్లెబియనులకు జరిగిన చిరకాలసంఘర్ష మీకాలమున సమాప్తము గావచ్చెను; ఎట్రస్కనుల ప్రమాదము గడచి పోయెను; జనులలో నెవ్వరు నతిధనికులుగాని అతిదరిద్రులు గాని కాక, చాలవరకు ప్రజాహితపరులై యుండిరి.

ఇది 1900 కు బూర్వపు దక్షిణాఫ్రికాబోయరుల రిపబ్లికును 1800 కు 1850 కు మధ్యకాలపు ఉత్తరఅమెరికా రాజ్యముల సంఘమును బోలి, స్వతంత్రులగు రైతుల ప్రజాసత్తాక ప్రభుత్వముగ నుండెను. ఈయంక ప్రారంభకాలమున నిది యిరువది చదురపుమైళ్ళ విస్తీర్ణమగు చిన్న రాజ్యము; వీరు తమతోడి వీరరాజ్యములతో బోరాడినను వాటినాశము గోరక, వాటిమైత్రికై యత్నించిరి.

శతాబ్దులకొలది యంతఃకలహములు జరిగి, రోమనులకు సామరస్యస్వభావ మలవడెను. విజితపురములలో గూడ నీతత్వమే గలిగి, రోమకరాజ్యపాలనలో ఎన్నికలహక్కు గల్గియుండెను. మరికొన్ని పురములవారు స్వతంత్రులై, రోమనులతో పరస్పర వివాహవ్యాపారముల జేసికొనుచుండిరి.

యుద్ధావసరమునుబట్టి ముఖ్యస్థలములందు పౌరజనులే రక్షకసైనికులై యుండిరి. ఈ నవజిత దేశములందుగూడ కొన్ని హక్కులతో వలసగ్రామము లేర్పడెను; ప్రక్కల రస్తాలు నిర్మింపబడెను. కనుక వారి భాష, సంస్కృతి, దేశమంతటను వ్యాపించెను.

క్రీ. పూ. 89-వ యేట ఇటలీదేశ స్వతంత్రజనులంద రును రోమనుపౌరత్వపుహక్కును బొందిరి. ఈరీతిగా రోమక సామ్రాజ్యమంతయు నేకనగరమై వ్యాపించినట్లాయెను.

క్రీ. త. 212 లో సామ్రాజ్యపు స్వతంత్రజనులందరికి పౌరత్వపుహక్కు లీయబడెను. అందుచే అట్టివారందరును రోము వెళ్ళి, ఆ పురసభసమావేశములో వోటు చేయవచ్చును. రాకపోకలు గల నగరములకు అనేకదేశముల జనులకును గూడ పౌరత్వపుహక్కునిచ్చుట రోమనులు వ్యాపించుటకుచేసిన ప్రత్యేకయుక్తి. ఓడినదేశీయుల యాచారములను విజేత లవలంబించి వారిలో కలిసిపోక, పరాజితులే విజేతలలో కలిసి పోయిరి.

కాని మొదటి ప్యూనికుయుద్ధము సిసిలీవిజయము తరువాత ఇదివరలోని సంఘటనలతోబాటు ఇంకొకపద్ధతి యారంభించెను. పరాధీనదేశమైన సిసిలీని రోమనులు తమ

పొత్తుగ నెంచి అతిఫలవంతముగు నాదేశపునేలను, శ్రమజీవు లగు నాదేశీయులను, రోమకసంపత్తివృద్ధికై స్వలాభనిమిత్తము వినియోగించుచుండిరి.

కాని, ఈయైశ్వర్యము చాలవరకు పెట్రిషియనులకును ప్లెబియనులలో ప్రధానులకును మాత్రము చేరుచుండెను. యుద్ధములలో విదేశీయులు చాలమంది ఖైదీలై, బానిసలగు చుండిరి. మొదటి ప్యూనికుయుద్ధముకు పూర్వము ప్రజలలో చాలమంది స్వతంత్రకర్షకులుగ నుండిరి; వలయు నప్పుడెల్ల రోముతరఫున పోరుటకు వారికి హక్కుబాధ్యత లుండెను.

వారు యుద్ధముకై దేశాంతరగతులైనపుడు వారిపొలములు ఋణగ్రస్తములయ్యెను. ఈలోగా శ్రీమంతులు పెద్దభూములలో స్వంతకమతము పెట్టి, బానిసలచే సాగుచేయింప నారంభించిరి. పౌరయోధులు రణమునుండి రాగా, తమపంటకు ఇటలీ సిసిలీలలో శ్రీమంతులు కమతపు భూములందు దాసులద్వారా పండించిన చౌకపంటతో పోటీ కలిగెను. క్రొత్తపరిస్థితు లేర్పడి రిపబ్లికురూపమే మారెను. సిసిలీ రోముకు పరాధీనముగు టేగాక, సామాన్యప్రజలు భాగ్యవంతులగు పెట్టుబడిదా జీవుంగు పతులకో, పోటీదారులకో లోబడవలసివచ్చెను. ఇట్లు రోమక రాజ్యమున లాభపరులగు శ్రీమంతులకాల మనదగిన రెండవ వంగ మారంభించెను. కర్షకయోధులగు రోమనులు స్వపరిపాలనకై రెండువందలయేండ్లు పోరాడిరి; కాని దానిని నూరేండ్లుమాత్ర మనుభవించిరి; మొదటి ప్యూనికుయుద్ధముచే వారిశక్తి యుడిగి, ఆ స్వంతహక్కులుకూడ పోయెను.

వారి ఎన్నికహక్కులవలని లాభముగూడ పోయెను. రోమకరాజ్యమున రెండు పాలకసంఘము లుండినవి. అందు మొదటిది 'సెనేటు' అనబడు శిష్టసభ; అందు పెట్రీషనులు (తరువాత అన్నిజాతుల ప్రముఖులును) సభ్యులైయుండిరి. వారు 'కాన్సలులు, సెన్సరులు' అను ఉన్నతోద్యోగులచే మొదట నియుక్తులైరి. ఇప్పటి బ్రిటిషువారి ప్రభుసభవలె అందును గొప్ప భూస్వాములు రాజకీయనేతలు వర్తక ప్రముఖులు సభ్యులైరి. అమెరికనుసినేటుకన్న ఆంగ్లేయుల ప్రభుసభతోనే దీని కెక్కువ పోలిక. ప్యూనికుయుద్ధకాలము మొదలు మూడుశతాబ్దులు ఈసభ రోమనుల రాజకీయ పరిజ్ఞానమునకు భావములకు కేంద్రమైయుండెను. రెండవది ప్రజాసభ; ఇందు రోమనుపౌరు లందరును సభ్యులు. రోమక రాజ్య మిరువదిమైళ్లు విస్తీర్ణమైనపు డట్టిసభ వీలుగా నుండెను. ఇటలీవారును ఇతరదేశీయులును గూడ రోమకపౌరులైన పుడు ఈతొంబరసభ సరిగా పనిచేయుట అసాధ్యమయ్యెను. పురమందిరమునుండి రోముప్రాకారమునుండి ఆసభ జరుగునని ప్రకటింపబడి సభ కూడగనే అందు రాజకీయభ్రష్టులు బస్తీ లోని చిల్లరమూకయును హెచ్చుగా పోగగుచుండిరి. క్రీ. పూ. నాల్గవశతాబ్దపు ప్రజాసభ సామాన్యజనుల కష్టసుఖములను సవ్యముగా జర్చించి ప్రతిపాదించుచు, సెనేటుసభను హద్దులో నుంచుచుండెను. ప్యూనికుయుద్ధాంతము కాసభ ప్రజాశక్తి శూన్యమై, నిస్సత్వమాయెను. కనుక నాయకుల నిరంకుశత అధికమయ్యెను. రోమకప్రజాతంత్రమున ప్రతినిధి ప్రభుత్వ పద్ధతి ఎన్నడును లేదు. పౌరులు తమయుద్దేశముల దెలుపు

ప్రతినిధుల నెన్నుకొనవలెనని వారికి తోచలేదు; ఇది ముఖ్య విషయము. అందుచే రోమనుల ప్రజాసభకు అమెరికనుల ప్రతినిధిసభతోను, ఇంగ్లీషు కామన్సుసభతోను పోలిక లేదు. శాస్త్రరీత్యా పౌరసభయయినను క్రియలో నది యెంత మాత్రమును గణ్యముకాలేదు.

కనుక, రెండవ ప్యూనికుయుద్ధము తరువాత, సామాన్యరోమనుపౌరులు చాలదుస్థితిలో బడి నిర్ధనులై తరుచు తమపొలముల గోల్పోయిరి. బానిసలతో పోటీలచే వృత్తిహీనులైరి; తమకష్టముల దీర్పనగు రాజ్యాధికారము లేక యల్లాడుచుండిరి. పరిపాలనలో హక్కులేని ప్రజలు తమ భావము ప్రభువులకు నాటునట్లు చేయుటకు—సమ్మె, తిరుగుబాటు—ఈ రెండేసాధనములు గలవు. క్రీ.పూ. మొదటి రెండు శతాబ్దులలో, ఈతిరుగుబాటులు జరిగెను; కాని వ్యర్థమగుచుండెను. ఆ కాలపు తీవ్రసంఘర్షము, శ్రీమంతుల కమతముల విడగొట్టి పౌరుల కిప్పించుయత్నము, జనుల ఋణవిముక్తి యత్నము, మొదలగువానిని గూర్చి, ఈసంక్షిప్తచరిత్రమున వివరింప వీలులేదు. దేశమున విప్లవములు అంతఃకలహములు జరిగెను. క్రీ. పూ. 73 లో 'స్పార్టకసు' నాయకత్వమున బానిసలందరు తిరుగబడిరి; ఇటలీప్రజలబాధ యధికమయ్యెను. బానిసలలో కొందరు ద్వంద్వయుద్ధనిపుణు లగుటచే, అది కొంత కార్యకారి యయినది. చల్లారియుండిన "వెసూవియస్" అగ్ని పర్వతపుముఖములో నుండి స్పార్టకసు రెండేండ్లు ప్రభుత్వము నెదిర్చెను; గాని చివరకు విప్లవము లొంగెను. క్రాంతికారు లతిక్రూరముగ హింసింపబడిరి; స్పార్టకసు అనుచరు లారువేల

మంది రోమునుండి పోవు దక్షిణాపథమగు 'అపియన్ వే' వెంట కొరత వేయబడిరి. ఇట్లు తమ్ము పరాధీనులజేసిన ఆ నూతన ప్రభుల ధాటికి సామాన్యప్రజలు నిలువలేరైరి. తరువాత ఈ బీదల నణచిన శ్రీమంతులే (బీదలపైనను తమపైనను కూడ నధికారులు కాబోవు) మహాసేనప్రాబల్యమునకు కారకులైరి.

రెండవప్యూనికుయుద్ధకాలమువరకు స్వతంత్రకర్షకులే సైనికులై, అశ్వికులుగనో పదాతులుగనో యుద్ధము చేసిరి. సమీపమందు యుద్ధములు జరుగునపుడు ఈపద్ధతి సరి పోయెను. కాని యన్యదేశములందు జరుగు దీర్ఘయుద్ధము కాపౌరసేనాపద్ధతి పనికిరాలేదు. ఇదిగాక బానిసలుదున్ను పెద్ద కమతములు హెచ్చి, వెనుకటిపరిస్థితులు మారెను. స్వతంత్ర కృషీవలజాతి క్షీణించెను. అంతట 'మారియ' సను ప్రజానాయకు డొక క్రొత్తపద్ధతి తెచ్చెను. కార్తేజి నాశనమైన మీదట, ఉత్తరాఫ్రికాప్రాంతమున న్యుమీడియాయను మోటు జనులరాజ్య మేర్పడెను. దీనిరాజగు 'జుగుర్తా'తో రోమకోద్యో గులకు వైరము కలిగెను. ఆతనిని గెల్చుటకు వారు ముప్పతిప్పల బడిరి. ఈయుద్ధము రోము కపఖ్యాతి తెచ్చెను; దీని నంతమొం దింప ఆయదనివేళమున 'మారియసు' 'కాన్సలు' (అనగా ప్రధాని)గ జేయబడెను. ఈతడు జీతముల నిచ్చి, యోధులను చక్కగతరిఫీయతుచేసి, ఆసేనతో జుగుర్తా నోడించి అతనిని సం కెలలతో (క్రీ. పూ. 106 లో) రోముకు పట్టితెచ్చెను. కాని మారియసు (తన యుద్యోగకాలము దాటినను, పైన) ఆ

నూతనసేనల సాయముతో చట్టముకు భిన్నముగా కాన్సలుపని చేయుచునేయుండెను; ఆతని నెవరును వారింపలేరైరి.

అందుతో రోమకరాజ్యపరిణామమున 'సేనానిప్రాబల్య' మనదగిన మూడవయంక మారంభించెను. అప్పటినుండి జీతపు సేనల నాయకులు సామ్రాజ్యాధికారమునకై తమలో కలహ మారంభించిరి. ఆఫ్రికాలో మారియసుక్రింద సహాయసేనానిగ నుండిన కులీనసంఘీయుడగు "సల్లా"కు మారియసుకు పోటీ వచ్చెను; వారు తమతమ ప్రతికక్షుల బలవంతముగా జంపించిరి. వేలకొలదిజను లాంక్షలోబడి వధింపబడిరి; వారిభూము లమ్మి వేయబడెను. ఇట్టిసేనానుల ఘోరసంఘర్షమును స్పార్టకసువిప్లవ మును గడువగనే, 'లుకుల్లసు, పాంపే, క్రాసను, జూలియసు సీజరు' అను సేనానులు రాజ్యాధిపత్యముకై కలహించిరి. స్పార్టకను నోడించినది క్రాసను. లుకుల్లసు ఆసియామైనరును జయించి, ఆర్మినియాకు వెళ్ళివచ్చి శ్రీమంతుడై, వ్యవహారసంబం ధము మానుకొనెను. క్రాసను ఆసియాలో పర్షియాపై దండెత్తి, అందుపార్థియనులచే నోడి, హతుడయ్యెను. పాంపే సీజరుతో చాలకాలము పోరి, క్రీ. పూ. 48 లో సీజరుచే నోడింపబడి, ఈజిప్టులో హతుడయ్యెను; ఇట్లు సీజరు రోమక లోకమున సర్వాధికారియాయెను.

జూలియసుసీజరు కధికఖ్యాతిగల్గెను. అతనినొక పురాణ పురుషునిగ భావింతురు. అది సరికాదు. మూడవదగు సైనికాం కమునుండి, నాల్గవదగు సామ్రాజ్యాంకములోనికి మార్పు నాతడు గల్గించెను. ఆర్థిక రాజకీయములందు మహాకోలాహ లము కలుగుచు అంతర్యుద్ధములు జరిగి, సంఘము విపర్యస్త

మగుచున్నను, రోమకరాజ్యము క్రీ. శ. 100 వరకు ఇంకను విస్తరించెను. రెండవపున్యానికుయుద్ధము స్పార్టకసుతిరుగుబాటు మారియసుసేనల పునర్నిర్మాణము జరుగువరకు, ఈవ్యాప్తి తగ్గియుండెను. (ఇప్పటి ఫ్రాన్సు బెల్జియందేశములగు) గాలులో సేనానియైన జూలియస్‌సీజరు ఖ్యాతి సంపాదించెను. ఈ 'గాలు' జనులు ఉత్తరఇటలీని కొంతకాల మాక్రమించి ఆసియామైన రుపై దాడివెడలి గలేషియను లనుపేర నందు వసించిన గాలుల బోలు 'కెల్టికు' తెగవారే. గాలులోనికి దండయాత్ర చేసిన జర్మనులను సీజరు తరిమి, దానినంతను రోమకరాజ్యమున చేర్చెను. అతడు రెండుసారులు డోవరుజలసంధి దాటి,ఇంగ్లండు లోనికి గూడ (క్రీ. పూ. 55—54 లో) వచ్చెను; కాని దానిని స్థిరముగ జయింపలేదు. ఈలోగా పాంపే లోగడ తూర్పున కాస్పియనుసముద్రమువరకు లోబడిన ప్రాంతము లందు రోమనులబలము వృద్ధిచేయుచుండెను. క్రీ.పూ. మొదటి శతాబ్దపు మధ్యకాలమున సినెటుసభయే కాన్సలులను ఇత రోద్యోగులను నియమించి, అధికారము నిచ్చుచు (పేరుకైనను) పాలించుచుండెను. రోమను ప్రజాపాలనపు ఉన్నతసంప్ర దాయముల గాపాడుటకై సిసిరో మొదలగు కొందరు రాజ్య తంత్రజ్ఞులు శ్రమపడుచు, దానిచట్టముల మన్నింపజేయుటకు యత్నించుచుండిరి. కాని స్వాతంత్ర్యైతులతోబాటు ఇటలీ పౌరత్వశక్తిగూడ నశించిపోయెను. అందిపుడు స్వేచ్ఛాభిజ్ఞా నమే లేనిదాసులు, నిరుపేదలు మిగిలిరి. సినెటులోని ప్రజా వాదులకు ప్రజలలో పట్టుబలము లేదు. గొప్ప సేనాబలము తోనున్న వీరు లీప్రజావాదులకు పోటీదారులై భీతి గొల్పు

చుండిరి. సినేటుతో సంప్రతింపకయే, క్రాసస్, పాంపే, సీజరు, మొదటి 'ట్రయంవిరేటు' (= త్రితయము) అయి, సామ్రాజ్యపాలనము తమలో తాము పంచుకొనిరి. తరువాత పార్థియనులచే దూరస్థలమగు కార్హేవద్ద క్రాసస్ చంపబడెను; పాంపే సీజరులమధ్య కలహము కలిగెను. పాంపే "ప్రజాసత్తాక"పక్షము వహించెను; సీజరు చట్టమును సినేటు ఆజ్ఞను ధిక్కరించెనని అతనిని విచారణచేయుటకు శాసనము చేయబడెను. సేనాని తనయధికారరాష్ట్రపుహద్దును దాటి, ఆప్రాంతపుసేనల నితరప్రాంతములకు దెచ్చుట నేరమగును; సీజరుపాలనలోని గాలురాష్ట్రమునకు ఇటలీకి మధ్యసరిహద్దు "రూబికన్ నది"; చివరకు సీజరు తెగించి, క్రీ. పూ. 49 లో రూబికన్‌నది దాటి, పాంపే యధీనమగు రోముపైకి దాడి వెడలెను. యుద్ధాపాయసమయమం దొకసినే డిక్టేటరుగా అనగా సర్వాధికారియగునియంతగా ఎన్నుకొనుట రోములో సంప్రదాయసిద్ధము. పాంపేను జయించి, సీజరు (మొదట పదేండ్లను, తరువాత క్రీ. పూ. 45 లో యావజ్జీవమును) నియంతగా జేయబడెను. అనగా ఆ సామ్రాజ్యమంతకు సీజరు యావజ్జీవప్రభువయ్యెను. అతనిని రాజుగ జేయదల చిరి; కాని 5 శతాబ్దములక్రిందట ఎట్రస్కనుల నోడించి నప్పటినుండి, రాజశబ్దము రోమనుల కసహ్యమైనది. కనుక సీజరు రాజబిరుదమును నిరాకరించెను; సింహాసనము రాజదండము మాత్రము స్వీకరించెను. పాంపే నోడించి, సీజరు ఈజిప్టు వెళ్ళి, అచ్చట టాలమీవంశపు దేవాంశభావితయగు క్లియోపాట్రారాణిని ప్రేమించెను. ఆవలపుచే నాతనిమతి

తిరిగిపోయెను. ఆతడు రోముకు తిరిగివచ్చినప్పుడు, దేవాంశ రాజత్వపు ఈజిప్టుసంప్రదాయమును రోములో ప్రవేశింప జేసెను. అతని ప్రతిమ గుడిలో నుంచబడి "అజేయదేవునికి" అని లిఖింపబడెను. రోములో నశించిపోవు ప్రజాస్వామ్య భావము కడసారి అకస్మాత్తుగా జ్వలించెను. సినేటుముందర ముస తనప్రత్యర్థి యగు పాంపే ప్రతిమవద్ద సీజరు హఠాత్తుగా నిహతుడయ్యెను. ఇట్లు వ్యక్తుల దురాశలు కలహములు 13 యేండ్లు జరిగి లెపిడస్, మార్కు-ఏంటనీ, ఆక్టేవియసు సీజరు అను సేనానులు రెండవత్రితయమైరి. తనపినతండ్రి (జూలియసుసీజరు) వలెనే, ఆక్టేవియసు వీరదేశమగు పశ్చిమ రాష్ట్రముల గ్రహించెను. క్రీ. పూ. 31 లో తన ముఖ్య ప్రత్యర్థియగు మార్కు-ఏంటనీని 'ఏక్టియం' వద్ద నౌకాయుద్ధములో నోడించి, అతడు రోమకప్రపంచపు సర్వాధికారి యయ్యెను. కాని జూలియస్ వలెగాక ఆక్టేవియసుకు దేవాంశ పైగాని రాజనామముపైగాని యెట్టియపేక్షయు, వైభవ ప్రదర్శనమునకు ప్రేయసియు లేదు. ఆక్టేవియసు సినేటుకు రోముకు తిరుగ నధికారమిచ్చెను; తాను 'డిక్టేటరు'గా నుండుటకు నిరాకరించెను. అందుచే బాహ్యచిహ్నములకు బదులు యథార్థాధికారమునే సినేటువారతనికి కృతజ్ఞతతో నర్పించిరి.

రాజశబ్దమునకు బదులుగా అతనికి 'ప్రిన్సెప్స్' అనగా ప్రధాని యనియు, అగస్టస్ అనగా మహాఘనుడనియు పేరిడిరి. ఇట్లగస్టస్‌సీజరనుపేర నతడు, క్రీ. పూ. 27 నుండి క్రీ. త. 14-వరకు మొదటి రోమనుచక్రవర్తిగా నుండెను.

అతని తరువాత 14 మొదలు 37 వరకు టైబీరియసు సీజరును, ఆపైన కలిగ్యులా క్లాడియస్ నీరో మున్నగువారును పరంపరగా పాలించిరి. క్రీ. శ. 98 లో ట్రాజన్, 117 లో హేడ్రియన్, 138 లో ఏంటోనియసుపయస్, 161 నుండి 180 వరకు మార్కస్ ఆరీలియస్ చక్రవర్తులైరి. వీరందరు సేనాబలప్రధానులే. వీరిలో కొందరిని సైనికులు నశింపజేసిరి. రోములో క్రమముగా సినేటుసభ క్షీణించెను. ఆస్థానమును చక్రవర్తియు అతని యుద్యోగులును గ్రహించిరి. అప్పటి కాసామ్రాజ్యపుసరిహద్దు లతిదూరముగా వ్యాపించెను. బ్రిటనులో విశేషభాగమును డాసియా యనఁబడిన ట్రాన్సల్వేలియాయు ఆ సామ్రాజ్యమున చేర్చబడెను. ట్రాజనుచక్రవర్తి యూఫ్రెటీసునదిని దాటెను. హేడ్రియను చక్రవర్తి (చీనాలో హ్వాంగ్‌టివలె) తనసామ్రాజ్యము నుత్తరజనులనుండి రక్షించుటకై బ్రిటనులోను రైనుడాన్యూబునదులకు మధ్యను పెద్ద ప్రాకారముల గట్టించెను. అతడు ట్రాజను జయించిన కొన్ని దేశములను వదలివేసెను. అంతటితో రోమకసామ్రాజ్యపు వ్యాప్తి నిల్చిపోయెను.



# 34. రోము చీనాల మధ్యదేశము

క్రీ. పూ. మొదటి రెండుశతాబ్దులలో మానవజాతి పరిస్థితి మారెను. ఈజిప్టుమెసపొటేమియాలింకను సుభిక్షములై సమృద్ధజనములై యున్నను, వాని ప్రాబల్యము తగ్గెను. ఆ దేశముల పడమట క్రొత్తగా రోమకసామ్రాజ్యమును తూర్పున చీనాసామ్రాజ్యమును ప్రబలములయ్యెను. రోమకరాజ్యము యూఫ్రిటీసునదివరకే వ్యాపించెను. దాని కావలిదేశము సెల్యూకసు వంశీయులనుండి తప్పి క్రొత్తరాజులవశ మయ్యెను. చీనాలో ష్వాంగ్టియనంతరము 'త్సిన్' వంశముస్థానే వచ్చిన 'హాను' వంశరాజులు టిబెత్తును ఎత్తగు పామరుకొండల కనుమలను దాటి, పశ్చిమతుర్కిస్థానమును చీనారాజ్యమున చేర్చిరి. అక్కడికే చాలదూరమైనందున ఆసామ్రాజ్య మంతటితో నిల్చెను.

రోమకసామ్రాజ్యముకన్న చీనారాజ్య మెక్కువ విస్తీర్ణము, సమృద్ధజనము; అది యప్పటి కీసామ్రాజ్యము లన్నిటిలో గొప్పదై, ఎక్కువ కట్టుదిట్టములతో నుండెను. కాని నేలపైన సముద్రముపైన రాకపోకలసౌకర్య మింకను సరిగా వృద్ధి కానందున ఈ రెండుసామ్రాజ్యములకు పరస్పరము సంఘర్షము లేకుండెను.

అప్పటి కొకదానిస్థితి రెండవదానికి సరిగ తెలియదు. కాని పారసీకాదులద్వారాను, సముద్రపుటోడలపైనను ఆ రెండు రాజ్యముల మధ్యను కొంతవ్యాపార ముండెను; మరియు,

మధ్యఆసియాకును భారతదేశమునకునుగూడ వాటిసంస్కృతి తగులుచుండెను. క్రీ. పూ. 66 లో పాంపే నాయకత్వమున రోమనుసేనలు అలెగ్జాండరు మార్గమున బయలుదేరి కాస్పియన్ సముద్రము తూర్పుతీరమునకు వెళ్లెను. క్రీ. త. 192 లో, 'పాన్చొ' అను చీనాచక్రవర్తి పెద్దజైత్రసేనతో కాస్పియన్ సముద్రము జేరి రోమనునాయకుల కాసంగతి తెలియజేయుచు దూతల నంపెను. కాని యూరపుకు చీనాసామ్రాజ్యముకు పరస్పరము ప్రత్యక్షవ్యవహారపుసంపర్క మేర్పడుట కింకను కొన్నిశతాబ్దములు పోవలసియుండెను. ఈ రెండుసామ్రాజ్యముల కుత్తరదిశను మహారణ్యము లుండెను. ఇప్పటి జర్మనీ దేశ మాకాలమున జాలవర కడవి. ఆ యరణ్యములు రష్యా లోనికి చాలదూరము వ్యాపించెను. అందు 'ఆరకు'లను గజసమములగు మహావృషభము లుండెను. ఆసియాలోని మహా పర్వతశ్రేణుల కుత్తరముగ గొన్నియెడారులు, మైదానములు, ఇంకను పైన నడవులు, మంచుగడ్డలును ఉండినవి. ఆసియాపీఠ భూమికి తూర్పున త్రికోణాకారముగ మంచూరియాదేశ ముండెను. దక్షిణరష్యాలోని తుర్కిస్థానము మొదలు మంచూరియావర కున్న యీప్రదేశములలో చాలభాగపు కాలమానస్థితి ఎప్పుడు నతిసందిగ్ధమే. అచ్చటి వాన యస్థిరము; మానవవాసము కయోగ్యము. కొన్నియేండ్లుగా పచ్చికబయళ్లుండుచునే అంతలో క్షామముచే నెండిపోవుచుండెను. దీని పశ్చిమభాగము (అనగా జర్మను అడవులనుండి దక్షిణరష్యా తుర్కిస్థానము వరకును గాల్లండు మొదలు ఆల్ప్సుకొండల వరకును గలప్రదేశము) ఆర్యజాతుల మూలస్థానము. తూర్పున

నున్న మైదానములు మంగోలియా యెడారులు హూణులు మంగోలియనులు తార్తారులు తురుష్కులు అను సమీపసంబంధము ఏకభాష ఏకాచారము గల మంగోలుజాతులవారి యావాసములు. నార్డిక సస్యజనులు తమసరిహద్దుల దాటి వ్యాపించుచు, మెసపొటేమియా మధ్యధరాతీర ప్రాంతముల దక్షిణనాగరికస్థలములకు చేరినట్లే హూణజాతులు (జనసంఖ్య పెరిగి) చీనాలోని స్థిమిత ప్రదేశములకు వలసకు విజయముకు వచ్చుచుండిరి. ఉత్తర ప్రాంతములందు జలసస్యసమృద్ధి కల్గినపుడు జనసంఖ్య యధికమై తృణసస్యములు లేనపుడు పశువులుకూడ వ్యాధిగ్రస్తములుకాగా క్షుధాతురులగు నావీరులు బృందములుగా దక్షిణముగ వచ్చుచుండిరి. అప్పటి బలీయములగు నీ రెండుసామ్రాజ్యములు కొంతకాల మాయనాగరికుల నరికట్టి, అప్పుడప్పుడు వీరిని వెనుకకు తరుమగల్గినవి. ఉత్తరచీనానుండి హాన్‌వంశరాజులు మంగోలియాను జయించి, చాలకాలము పాలించిరి. చీనాసైనికులు రైతులుగూడ మహాప్రాకారములదాటి, అచ్చటి పచ్చికబయళ్ళ నుపయోగించుకొనుచు, అప్పుడప్పుడు తమపైబడు హూణుల జంపుచుండిరి.

అందుచే ఆసంచారులలో కొంద రచ్చట స్థిరవాసులై కర్షకులై, చీనారాజులకు పన్నులు చెల్లించుచు, వారిలో కలసిపోయిరి. కాని మరికొంద రచ్చటినుండి ఈశాన్య ప్రాగ్దిశల కొండకనుమలదాటి, పశ్చిమతుర్కిస్థానములోనికి బోయిరి.

క్రీ. పూ. 200 మొదల లిట్లు మంగోలుఆశ్వికులు పడమరగా జని, అచ్చటి యార్యజనులపై నొత్తిడిచేసిరి. అంత నాయార్యులు రోమనుసరిహద్దులపై నొత్తిడిచేసి, సందు దొరికి

నపు డా రాజ్యములోనికి జొరయత్నించుచుండిరి. మంగోలియను మిశ్రితులగు సితియను పార్థియనులు క్రీ. పూ. మొదటి శతాబ్దమునకు యూఫ్రిటీసునదివరకు వచ్చి, అచ్చట తూర్పున పాంపే మహాశయునితో యుద్ధముచేసి, సెల్యూకసువంశ రాజ్యమును తప్పించి, అర్సకిడ్ వంశమును పార్థియను వంశమును స్థాపించిరి.

అంతట క్షుధాతురులగు నీసంచారిజాతు లిట్లు తూర్పు పడమరలందలి బలీయమగు చీనారోమకను రాజ్యములపైకి వెళ్ళుటకన్న, మధ్య ఆసియాలోనుండి ఆగ్నేయమూలగా కైబరుకనుమద్వారా, భారతదేశములోనికి రాదొడగిరి. తెగ తెగగా వీరు వచ్చి, పంజాబుద్వారా భారతమైదానములోనికి చొరబడి, లూటీచేసి చాలనష్టము కల్గించుచుండిరి. అప్పటికి అశోకచక్రవర్తి స్థాపించిన సామ్రాజ్యము నామావశేషమై, కొంతకాలము హిందూదేశచరిత్ర మంధకారమయ మయ్యెను. దాడివచ్చినవారిలో నొక 'కుషాన్' రాజవంశపు భారతీయసితియను లుత్తర హిందూదేశమును కొంతకాలము పాలించి, కొంత శాంతిని గల్గించిరి. ఈదండయాత్ర లనేకశతాబ్దములు జరిగెను. క్రీ. త. 5-వ శతాబ్దములో చాలకాలము యస్తలైట్లను శ్వేతహూణులు భారతదేశపు చిన్నచిన్న రాజులపై పన్నులు వసూలుచేయుచు, భయంకరులై భారతదేశమునకు చాలహాని గల్గించిరి. *

* 29-వ అధ్యాయముచివర టిప్పణి చూడుడు. ఇప్పుడు పంజాబులో నున్న జాటులు, కొన్ని రాజపుత్రజాతులు, మార్వారు గుజరాతుల కొన్ని వర్తకజాతులు, ఈహూణ సితియన్ కుషాను తెగల దాయులవంశీయు లని, క్రమంగా భారతీయులైనారని, కొందరు విద్వాంసుల యభిప్రాయము.

క్రీ. శ. రెండవ శతాబ్దమున రోమను చీనాసామ్రాజ్యములలో అతితీవ్రమగు మహావ్యాధి వ్యాపించి, రోము చీనాసామ్రాజ్యముల దుర్బలము చేసెను. అప్పటినుండి వారు సంచారులయొత్తిడి నరికట్టలేకపోయిరి. ఆవ్యాధి చీనాలో 11 ఏండ్లు చెలరేగి, సంఘమును కల్లోలపరచెను. అప్పుడు హాన్ రాజవంశ మంతరించి, చీనాలో పరస్పర విభేదములు అల్లరి ప్రారంభించెను. వీటినుండి క్రీ. శ. 7-వ శతాబ్దపు టాంగ్ రాజ వంశపాలనవరకు, చీనా కోలుకోలేదు. ఆసియా నుండి ఆ మహామారి యూరపుకు వ్యాపించి, రోమక సామ్రాజ్యములో క్రీ. శ. 164 నుండి 184 వరకు చెలరేగి, ఆ సామ్రాజ్యమును పిప్పిచేసెను; అంతట రోమకరాజ్యపు జనసంఖ్య, పాలనశక్తి గూడ క్షీణించెను. సరిహద్దు ప్రాంత మప్పటినుండి ఇతరుల కచ్చుటచ్చుట సందునిచ్చెను. స్వీడను దేశములోని గాత్ లండునుండి మరలి వచ్చిన గాత్తులను ఒక క్రొత్తఆర్యజాతివారు రష్యాలోనుండి వాల్గానదీప్రాంతముల కును, అచ్చటినుండి నల్లసముద్రమువరకును పోయి సముద్రయానము నేర్చి ఓడదొంగలైరి. 1-వ శతాబ్దాంతముకు హూణులు పడమటివైపుచేసిన యొత్తిడి వీరికిని తగిలియుండును. 247 లో, ఈగాత్ జనులు దాడివెడలి డాన్యూబునదిదాటి,ఇప్పటిసెర్వియా దేశమున నొక యుద్ధమున డెసియస్‌చక్రవర్తి నోడించి చంపిరి. 236 లో 'ఫ్రాంకు'లను ఇంకొక జర్మనుజాతివారు రైనునది క్రిందిభాగమున హద్దుదాటివచ్చిరి; 'అలెమన్నీ' అను జాతివారు 'అల్సాసు' లోనికి ప్రవేశించిరి; వారిని గాలులోని రోమనుసేన

ఓడించినను, బాల్కనుద్వీపకల్పమందలి గాత్తులు విడువక ముట్టడించిరి. డాసియారాష్ట్రము రోమనుచరిత్రనుండి పోయెను. రోమనుల గర్వమునకును ఆత్మవిశ్వాసమునకును భంగము కలిగి, అప్పటికి మూడుశతాబ్దములనుండి ఆవరణలేకయే భద్రముగా నుండిన రోమునగరికి (ఈసంచారుల దాడినుండి రక్షణకై) 270-275 లలో ఆరీలియను చక్రవర్తి కోటకట్టి బలపఱచెను.



# 35. మొదటిరోమకరాజ్యమున జనసామాన్యస్థితి

రోమకసామ్రాజ్యము క్రీ. పూ. రెండుశతాబ్దములలో నిర్మితమై, అగస్టసుసీజరు కాలమునుండి రెండుశతాబ్దములు శాంతముగా భద్రముగా వృద్ధిగాంచి అంతట శిథిలమై విచ్ఛిన్న మాయెను; అది తెలియవలెనన్న ఆ మహారాజ్యమందలి సామాన్యజనజీవితము కొంత గమనింపవలెను. అప్పటిచరిత్ర ప్రస్తుతకాలమునకు రెండువేల యేండ్లలోపుది. ఆనాటి రోమను జనుల నాగరికజీవిత మిప్పటి నాగరికజీవితమును గొంతవఱకు పోలియుండెను. పాశ్చాత్యలోకమున నప్పటికి నాణెముల వాడుక ఆరంభించెను. మతగురువులు ప్రభుత్వోద్యోగులును గాక, ఇతరులును చాలమంది స్వతంత్రవృత్తి గలిగియుండిరి; రస్తాలు సత్రములు ఏర్పడి పూర్వముకన్న జను లెక్కువ స్వేచ్ఛతో ప్రయాణముచేయుచుండిరి. క్రీ. పూ. ఆరవశతాబ్ది కన్న, ఇప్పటి జీవితస్వేచ్ఛ అధికమైయుండెను. నాగరికజను లంతకుపూర్వ మొకప్రాంతమందే యుండి అచ్చటనే జీవించుచు ఒకేసంప్రదాయమునకు లోబడియుండిరి. సంచారిజనులుమాత్రమే వ్యాపారముచేయుచు తిరుగుచుండిరి.

కాని అప్పటిరోము చీనాసామ్రాజ్యములు శాంతము లైనను, అందలి వివిధప్రాంతముల నాగరికత వేరువేరుగా నుండెను. బ్రిటిషువారి శాంతపాలనలోని ఇప్పటి భారతదేశ

పరిస్థితులు మిగిలినసామ్రాజ్యముకన్న చాల భిన్నములు; అట్లే ఆయాప్రాంతములందప్పుడును సంస్కృతిలోను పరిస్థితిలోను చాల భేదముండెను. ఆవిశాలసామ్రాజ్యపు రోమనుసైనికులు పలసజనులు రోమనుదేవతలనే పూజించుచు, లాటినుభాషికులై యుండిరి. కాని రోమనువ్యాప్తికి పూర్వమేయుండిన ఆయాప్రాంతీయజనులప్పుడు రోముకు లోబడినను, తమపనులు యథాప్రకారమే చేసికొనుచు, కొంతకాలమువరకైనను తమ సాంప్రదాయిక దేవతలనే పూజించుచుండిరి. గ్రీసు ఆసియా ఈజిప్టులందును, గ్రీకుసంస్కృతిగల ప్రాచ్యదేశములందును, సామాన్యులలో లాటినుభాష వ్యాపింపలేదు. గ్రీకుభాషయే నిరాఘాటముగ నుండెను. "పాల్ ప్రవక్త" యని ప్రసిద్ధుడైన 'టార్ససు'పుర యూదుడగు 'సాలు' రోమకపౌరుడయ్యు, 'హీబ్రూ, 'లాటిను' కాక, గ్రీకునే మాటాడుచు గ్రీకులోనే గ్రంథరచన చేసెను. పారసీకమున సెల్యూకసువంశీయులగు గ్రీకుల నోడించిన పార్థియనులు రోమకసామ్రాజ్యమున చేరలేదు. కాని అందును గ్రీకులో మాటాడుట మర్యాదగా నుండెను. కార్తేజినశించినను, స్పెయిను ఉత్తరాఫ్రికాలలో కొన్నిభాగములందు కార్తేజిభాషయే చాలకాలము వాడుకలో నుండెను. రోమనులకు చాలపూర్వమే నాగరికులైన 'సెవిల్' పౌరులు తమకు కొన్నిమైళ్లలోనే రోముసైనికులు వసించు 'ఇటాలికా' పురముండినను, సెమిటిక దేవతలను సెమిటికుభాషనే తరతరములుగా వాడుచుండిరి. క్రీ. త. 193 నుండి 211 వరకు రోమనుచక్రవర్తియైన 'సెప్టిమియసు సెవరసు' స్వభాష కార్తేజిది; తరువాత నతడు అన్యభాషగా లాటిను నేర్చుకొనెను.

ఆతనిసోదరి లాటినును తెలియక, తనరోమను సంసారమును కార్తేజి భాషతోనే నిర్వహించుకొనుచుండెను.

కాని గాలు (ఇప్పటిఫ్రాంసు) బ్రిటనులలోను, ఇప్పటి రొమేనియాయగు డాసియాలోను, డాన్యూబునదికి దక్షిణపు (ఇప్పటి హంగరియగు) పన్నోనియాలోను, అప్పటికి మహా నగరములుగాని నాగరికతగాని లేనందున అచ్చటిలాటినుభాష ఆసంస్కృతి బాగుగ వ్యాపించెను. అప్పటికే అవి నాగరికములై అందు గ్రామములు నగరములు నిర్మింపబడెను; అచట లాటిను మొదటినుండి ముఖ్యభాషగా నుండి, రోమకదేవతలు, వారి ఆచారవ్యవహారములు, వ్యాపించెను. ఇప్పుడున్న రొమేని యను, ఇటాలియను, ఫ్రెంచి, స్పానిషుభాషలన్నియు లాటిను భాష పరిణామములే; అవి లాటిను భాషాచారవ్యాప్తికి నిదర్శ నములు; చివరకు ఆఫ్రికావాయవ్యభాగమున గూడ చాలవరకు లాటినే వ్యాపించెను. ఈజిప్టు గ్రీసు మొదలగు ప్రాచ్యభాగము లెన్నడును లాటినుభాషలు కాలేదు; అందు ఆప్రాంతీయ సంస్కృతులే యుండెను. రోములో విద్యావంతులు గ్రీకును నాగరికభాషగా నేర్చుకొని, గ్రీకువాఙ్మయపు ఘనతనుబట్టి గ్రీకునే (లాటినుకన్న) ఆదరించుచుండిరి. ఇట్లే ఆసామ్రాజ్యపు వివిధజాతుల వృత్తిపద్ధతులును భిన్నములై యుండెను.

అప్పటి స్థిరజనులకు వ్యవసాయమే ముఖ్యవృత్తి. రోమను స్వతంత్రకర్షకుల వృత్తిపోయెను; ఆ వ్యవసాయమును దాసజనులు చేయుచుండిరి. గ్రీకుజాతులలో ఆర్కేడియను లలో ప్రతిస్వతంత్ర పౌరుడును స్వాయముగ దున్నుచుం డెను; (స్పార్టాపౌరులు దున్నుట యగౌరవ మని, 'హెలట్ల'ను

బానిసలచే సాగుచేయించిరి.) కాని, ఆకాలముపోయి, గ్రీకు సంస్కృతిగల ప్రదేశములందుగూడ బానిసగుంపులే సాగుచేయ నారంభించిరి. ఆదాసజను లనేక ప్రాంతముల యుద్ధఖైదీలైనందున భిన్నభాషికులై యుండిరి. వారి సంతతివారాజన్మదాసులైరి. యజమానుల క్రౌర్యము నెదుర్కొనుటకు దగిన సంఘీభావము, హక్కులజ్ఞానము, విద్యాబుద్ధులును, వారికి లేవు. దేశీయులలో వారే అధికసంఖ్యాకులైనను, వారెన్నడును విప్లవమును కొనసాగింపలేకపోయిరి. క్రీ. పూ. మొదటిశతాబ్దపు "స్పార్టకసు తిరుగుబాటు"ను మృగయుద్ధ నిపుణులగు దాసులుమాత్రమే లేవదీసిరి. ప్రజాతంత్రపు అంత్యకాలమందును, సామ్రాజ్యారంభ కాలమందును, ఇటలీలో బానిసలను రాత్రులందు పారిపోకుండ సంకెలలందో తల సగము గొరిగించియో ఉంచుచుండిరి. వారు భార్యలు లేక, యజమాను లెంతహింసించినను లోబడుచు, చాల బాధ పడుచుండిరి. మృగములతో పోరుటకు యజమాని వారిని విక్రయింపవచ్చును. ఏబానిసయైనను యజమానిని చంపుచో, వానినేగాక ఆయింటిదాసు లందరిని కొరతవేయుచుండిరి. ఆథేన్సువంటి కొన్ని గ్రీకునగరములందు బానిసల దుస్థితి యింతకన్న కొంచెము మెరుగుగ నుండెను. రోమను పక్షీక సేనలసైకి దాడిసలుపవచ్చిన అనాగరికసేన లీబానిసలకు శత్రువులుగాక, విమోచకులైరి. చాలనాను పరిశ్రమలకును, జట్టులచే జేయించు ప్రతికార్యమును, గనులపని, లోహపరిశ్రమ, ఓడలలో తెడ్లువేయుట, రోడ్లు యిండ్లు నిర్మించుటగూడ చాల వరకు బానిసలవృత్తి అయ్యెను. ఇంట్లలో నౌకరి ప్రత్యేకము

దాసులదే. పౌరులు స్వతంత్రులైనవారు తమపనులను కూలి పనులను చేయుచుండిరి. వీరు శిల్పులుగ, మేస్త్రీలుగ, బానిస లతో పోటీపడుచుండిరి. కాని అట్టివా రెంతమందియో తెలి యదు. వివిధప్రాంతములందు భేదము లుండెను. బానిసలలో గూడ రకము లేర్పడెను. కొందరిని రాత్రులందు గొలుసులు వేసియుంచి, పగలు కొరడాలతో పొలములకో కోర్టులకో తోలుకొని పోవుచుండిరి. కొందరికి కొంచెముభూమి నిచ్చి యజమానికి కొంత ముజరా యిచ్చుపద్ధతిని దానిని వారు సాగుచేసికొని తమభార్యలతో కాపురముచేయ నిచ్చుచుండిరి. కొందరికి యుద్ధము లుండెను. ఎట్రస్కనులు బానిసలచే వారి ప్రాణములకై ద్వంద్వయుద్ధము చేయించిరి. ప్యూనికు యుద్ధా రంభమున క్రీ. పూ. 264-లో రోములో తిరుగ ఈదాస యుద్ధ మారంభింపఁబడి రోమనులకు వినోదహేతువయ్యెను.అవ సరమున కట్టి యుద్ధముచేయుటయును మామూలుగా తమ కంగ రక్షణకును శ్రీమంతులగు రోమను లట్టి దాసభటులను దమతో నుంచుకొనుచుండిరి. కొందరు బానిసలు విద్యావంతులు. రోమ నులు తరువాత జయించిన గ్రీసు ఉత్తరాఫ్రికా ఆసియామైనరు ప్రాంతములు నాగరికము లగుటచే అక్కడి ఖైదీలు బానిసలై నను గౌరవకుటుంబపు రోమనుయువకుల బోధకులు, శ్రీమంతుల గ్రంథాలయచాలకులు, కార్యదర్శులు, పండితులు నై పని చేయుచుండిరి. రోమనులు ఆదాసకవుల చర్యలచే (నృత్యము నేర్పిన కుక్కలచే వలె) వినోదించిరి. ఇట్టి దాస్యవాతావరణపు భయకలహాములమధ్యనే ఆధునికవాఙ్మయాభివృద్ధి విమర్శన

మారంభించెను. కొందరు చురుకైన దాసబాలుర గొని వారికి చదువు చెప్పించి లాభముకు విక్రయించుచుండిరి. బానిసలకు నకళ్ళు వ్రాయుట నగిషీపనులు చేయుట శిల్పవృత్తులు నేర్పు చుండిరి.

ప్రజాసత్తారంభపు ఐశ్వర్యదశకును అంటువ్యాధి తరువాత చివరవచ్చిన క్షీణదశకును మధ్య 400 ఏండ్లలో బానిసల స్థితగతులందు చాలమార్పులు గలిగెను. క్రీ. పూ. రెండవ శతాబ్దిలో యుద్ధపు బానిసలు సమృద్ధిగ దొరకిరి. అప్పటి రోమనుల ప్రవర్తన చాల అనాగరికమై, క్రూరముగనుండెను. అప్పటి దాసజనుల కెట్టిహక్కులును లేకుండెను. బానిస లన్నివిధములగు క్రూరకార్యములకు గురియగుచుండిరి. కాని క్రీ. త. మొదటి శతాబ్దముననే దాస్యమునుగూర్చి రోమనునాగరికుల వైఖరి కొంత మారెను. అప్పుడు ఖైదీ లంతగా దొరకక గిరాకి గలిగెను. మరియు బానిసల ఆత్మగౌరవము కాపాడుటవలననే తమకు హెచ్చులాభము కలుగు నని యజమానులు గ్రహించిరి. సంఘమున నైతికభావము న్యాయబుద్ధియు వృద్ధిఅయ్యెను.రోమనుల సహజకర్కశత్వము గ్రీకుల యుదారబుద్ధితో మిళితమై మృదుత్వము వహించెను. క్రూరకర్మలకు గొన్నినియమము లేర్పర్చిరి. మృగయుద్ధముకై దాసవిక్రయము చేయుటను నిషేధించిరి. పనికిప్రోత్సహించుటకై వారలకు జీతములీయజొచ్చిరి. వారిలోగూడ నొకవిధమగు వివాహపద్ధతి నేర్పర్చిరి. వ్యవసాయపుపనులలో కొన్ని సమయములందు తప్ప జట్లుగా పని చేయింప వీలులేదు. అట్టి ప్రదేశములందు బానిసలు యజ

నూనికి పంటలో వాటానిచ్చు రయితులైరి. వారు అవసరమై నపుడే పనిచేయుదురు. క్రీ. త. మొదటి రెండుశతాబ్దములందును, లాటిను గ్రీకుభాషల మాటాడు ఆ రోమకసామ్రాజ్యమున బానిసలే హెచ్చు; స్వాతంత్ర్యభావము గల జనులే తక్కువ. అందుచే ఆసామ్రాజ్యము తరువాత క్షీణించెను. అప్పటి జనసామాన్యమున సంసారజీవనము మిత వ్యయము చేయుచు సుదారత స్వతంత్రాలోచన విద్యావ్యాసంగము చేయువారు చాల తక్కువ. పాఠశాలలు కళాశాల అరుదు. మనస్స్వాతంత్ర్యము ప్రవృత్తిస్వాతంత్ర్యముకు లేకుండెను. భావిజనులకద్భుతాశ్చర్యముల గొల్పిన రోమనుల గొప్ప రస్తాలు మహాభవనశిథిలములు వారిశాసననియమసంప్రదాయము మన కాకర్షకములు అద్భుతములు. కాని, అప్పటి జనులలో స్వేచ్ఛాస్వాతంత్ర్యములు లేవని, శ్రీమంతులు దురాశాపరులైరని, మనము మరువకూడదు. నిరాధారులచే నిర్బంధముగ చాకిరీ చేయించుకొని ప్రబలులైన ఆయల్పసంఖ్యాకులును అంతరంగమున శాంతిసౌఖ్యములు లేకుండిరి. ఆవాతావరణమున స్వతంత్రమనస్కుల కుండదగు కళావాఙ్మయములు తత్వవిజ్ఞానములు క్షీణించియుండెను. అనుకరణము, కృత్రిమకళావృద్ధి, దాస్యసంకుచితభావములు, అప్పటి పరాధీనపండితులలో హెచ్చుగనే యుండెను. కాని చిన్నఆథెన్సునగరపు ఒక్కశతాబ్దపు అభివృద్ధిదశలో ఉదారవిద్యావ్యాసంగము గలిగెను; అట్టిది రోమకసామ్రాజ్య మంతటను ఆ నాలుగుశతాబ్దములలోను లేకుండెను. రోమనులయధికారమున ఆథెన్సు క్షీణిం

చెను; అలెగ్జాండ్రియాలో విజ్ఞానము కృశించెను; ఆకాలమున నరుని స్వతంత్రాలోచనశక్తి క్షీణించిన ట్లుండెను.*

---

* క్రీ. పూ. మొదటిశతాబ్దమందును క్రీస్తుతరువాత 5 శతాబ్దములందును మిగిలినదేశముల స్థితి ఇట్లు హీనమై నిరుత్సాహకరమైనది; కాని భారతదేశపు స్థితిమాత్రము వేరుగ ఉన్నతసంస్కృతి వ్యాపించెను; అప్పుడు మనదేశమందు కొంచెముగా బానిసలపద్ధతి యుండెను; కాని వారిసంఖ్య స్వల్పము; ఆకాలమందు పంజాబులో, ఆంధ్ర మగధదేశములలో వరుసగా గొప్పచక్రవర్తుల సుపరిపాలన యుండెడిది; భావకాళిదాసాది సంస్కృతమహాకవులు, గుణాఢ్యాది ప్రాకృతకవులు, తిరువళ్ళువరు, అవ్వయార్, నమ్మాళ్వార్ మొదలగు ద్రావిడకవులు, చరకసుశ్రుతాది వైద్యశాస్త్రజ్ఞులు, ఆర్యభటాది జ్యోతిశ్శాస్త్రజ్ఞులును వెలసిరి. సామాన్యులుగూడ సౌఖ్యవంతులుగను, నాగరికులుగను ఉండిరి. అప్పుడు బౌద్ధ హిందూమతములు మొత్తము మీద మంచిస్థితిలో నుండెను.



# 36. రోమకసామ్రాజ్యమున మతపరిస్థితులు

ఆ లాటిను గ్రీకుసామ్రాజ్యమున క్రీ. శ. మొదటి రెండుశతాబ్దములందును నరులు వ్యాకులాత్ములై, నిరాశులుగ నుండిరి; నిర్బంధము దౌర్జన్యము సర్వత్ర వ్యాపించెను. జనులలో గర్వము డంబము హెచ్చినవి; నిజమైన గౌరవమర్యాదలు లేవు. దురదృష్టవంతులగు బీదలు తృణీకృతులై, అతిదీనులైరి; శ్రీమంతులలో స్థిరత లేదు. ఇంద్రియలోలత్వము దురాశ అధికముగ నుండెను. చాలనగరములందు మనుష్యులు మృగములు రంగస్థలపు ద్వంద్వయుద్ధమున చంపబడుచుండిరి. ఆరక్తపాతము జనుల నాకర్షించుచుండుటచే అప్పటిదుస్థితి మనకు తెలియును. అందుచే మానవహృదయమందు నశాంతి ధార్మికాందోళనము కలిగెను.

ప్రాచీననాగరికులపైకి ఆర్యులతెగలు విజృంభింపగానే అచ్చటి ప్రాచీనగ్రామదేవతల పురోహితపద్ధతి పోయెను; లేదా, సమయానుకూలముగ మారెను. నీలగోధుమ వర్ణుల జీవితపద్ధతి ఆలోచనలు వంశలకాలనితరములుగా విగ్రహపూజలజీవితమున కనుకూలముగా నుండెను. పూర్వాచారములు నిత్యకృత్యరక్షణము యజ్ఞయాగకర్మకాండలును ఎల్లప్పుడును వారిమనస్సులం దుండెను. వారి దేవతలును దారుణ వికృతస్వరూపులైనట్లు ఆర్య సంస్కృతి వ్యాపించి యున్న ప్రస్తుత ప్రపంచముకు తోచును. కాని అప్పటి ప్రాచీనుల కా దేవతలు తీవ్రస్వప్నములందు కనబడు దృశ్యములవలె

విస్పష్టాకారము గలిగి సద్యఃఫలము నిచ్చునని తోచియుండును. సుమేరియాలోను ఈజిప్టులోను ఒక పట్టణరాజ్యము మరియొక దాని జయించుచో అచ్చటి గ్రామదేవతల పేరే మారెను. కాని వాటి స్వరూప స్వభావములు పూజాపద్ధతి మారుటలేదు. ఆ స్వప్నదృశ్యమండలి చిత్రములు మారినను స్వప్న మారీతినే కలుగుచుండెను. సుమేరియనుల జయించిన మొదటిసెమిటికు లాతత్వపువారే యగుటచే తమవశులైన మెసపొటేమియావారి మతమునే కొద్దిమార్పులతో గ్రహించిరి. ఈజిప్టు ఎన్నడును సంపూర్ణపరాధీనము కానందున వారిమతము సమూలముగ మారలేదు. టాలమీలు సీజర్లు పాలించునప్పుడును ఆమిశ్రదేశీయుల దేవాలయములు యజ్ఞవేదికలు పురోహితపద్ధతి యథాప్రకారముగ నుండెను.

ఒకేరీతి సాంఘిక ధార్మికపద్ధతి గలవారు జయించి నప్పుడు అచ్చటిగుడులకు విజేతలవాటికిని మధ్య సామరస్యము సజాతీయత యేర్పడెను. ఆ రెండు దేవత లేకస్వభావములైనచో పేరు భేదమే కాని దేవుడొకడే యని గురువులు ప్రజలుగూడ తలచుచుండిరి. ఇట్లు కలుపుటే 'థియోక్రాషియా' అనగా దేవ సమన్వయ మనబడును. క్రీ. పూ. ఆ వేయేండ్లలోని జైత్ర యాత్రలకాలమునగూడ నీదేవసమన్వయము జరుగుచుండెను. చాలస్థలములం దచ్చటి చిల్లరగ్రామదేవత లన్నియు ఒక సామాన్యదేవతలో మిళితమగుచుండెను. ఈరీతిగా బాబిలనులో యూదప్రవక్తలు లోకమంతటి కొకే ధర్మదేవుడు కల డని ప్రకటించినపుడు జనులమనస్సు లట్టిభావము కనుకూల మయ్యెను. కాని కొన్ని దేవతలలో స్వరూపభేద ముండి, సమ-

న్వయమునకు వీలులేకుండెను. గ్రీకులు వచ్చుటకుముందు ఈజి యనుజనులకు అమ్మవారిదేవతలం దెక్కువవిశ్వాస ముండెను. అట్టచో స్త్రీదేవతకు పురుషదేవతతో వివాహసంబంధము కలిగింపబడెను. జంతువులు నక్షత్రములు దేవతలుగా నెంచబడు చోట వాని నవతారసంబంధులుగ భావించి వాటియాకారము (ఏపామో సూర్యుడో) ఆభరణముగాను చిహ్నముగాను ఏర్పర్చిరి. ఒకప్పుడు పరాజితులైనవారి దేవుడు, విజేతల తేజోవంతులగు దేవతలకు దుష్టవిరోధులుగ నెంచబడెను. మతచరిత్రమున నిట్టి సరుదుబాట్లు సవరణలు ప్రాంతీయదేవతల వ్యాప్తులును విశేషముగ కనబడును. మిశ్రదేశ మేకరాజ్యముగ నేర్పడినపుడు దేవసమన్వయ మిట్లే విశేషముగ జరిగెను. ఈజిప్టుజనుల ముఖ్యయజ్ఞదేవత ఆసిరిసు. 'ఫారో' దానియవతారమే అని ప్రజలు భావించుచుండిరి. ఆసిరిసు చనిపోవుచు మరలమరల జనించుచుండు ననియు, బీజము పంట ఆదేవుని స్వరూపమే యని నరుల అమరత్వముకుగూడ ఆదేవుడే యాధార మనియు వారి నమ్మిక. తనగ్రుడ్లను పాతిపెట్టినను పైకి వెడలివచ్చు వెడల్పు రెక్కలు గల పేడపురుగును అస్తమితుడై తిరిగి యుదయించుచుండు భాసమానసూర్యుడును దేవుని చిహ్నములే. తరువాత కొంతకాలము కతడు ఏపిస్ అను పవిత్రవృషభస్వరూపముగ నెంచబడెను. ఐసిస్ అను స్త్రీదేవత ఇతనికి సంబంధించినదే. ఈ ఐసిస్ హేథార్ అను గోదేవత అని, అర్ధచంద్రుడని, సముద్రముపై గన్పడు నక్షత్ర మనిగూడ భావించిరి. ఆసిరిసుమరణింపగా ఆమె శిశువగు హోరసు అను సంధ్యాదేవి పెరిగి మరల ఐసిసు అయ్యె ననియు ఒకగాథ కలదు. ఐసిసు తన శిశువగు హోర

సుసు భుజములం దుంచుకొనినట్లు కొన్నిచిత్రములందు గలదు. వీటికి కార్యకారణ సమన్వయము లేదు. మనుష్యులలో విచ క్షణశక్తి గలుగుటను పూర్వము స్వప్నస్వరూపములవలె నిట్టి భావము లుదయించుచుండెను. మూర్తిత్రయమేగాక, ఈజిప్టు గాధలలో కొన్ని క్రూరదేవతలు శ్వాసముఖుడగు ఏన్యుబిస్, కాళరాత్రి మున్నగు అనేకవిమోహాకారములు సురనరవిరోధులు నగు దుష్టదేవత లుండిరి.

కాలక్రమమున ప్రతిమతమందును ఆయానరుల యాత్మానుకూలమగు సమన్వయము జరుగుచుండును. సందర్భశూన్యమని తోచు నీదేవతామూర్తులనుండియు మిశ్రదేశీయులు నిజమైన దైవభక్తిని తృప్తిని బొందుచుండిరి. ఈజిప్టువారి మనస్సున అమృతత్వవాంఛ చాలదృఢముగ నుండెను. కనుక ఇతరులకన్న వారిమతమున అమృతత్వాభిలాష బలమయ్యెను. మిశ్రదేశము పరరాజవశమై ఆ మిశ్రదేవతలచే రాజకీయఫలములేక ఆ దేవతలచే నాముష్మికఫలము కలుగు ననుఆశ దృఢము కాజొచ్చెను.

గ్రీకుల విజయానంతరము మిశ్రదేశీయులయొక్కయు గ్రీకుజనులందరియొక్కయు ధార్మికజీవనముకు అలెగ్జాండ్రియా నగరము కేంద్రమైనది. మొదటిటాలమీ ఆపురమందు 'సెరేపియం' అను పెద్దగుడి నిర్మించెను. అనేకవిధమగు త్రిమూర్తి దేవతల పూజించుచుండిరి. ఆసిరిస్ ఎపిస్ దేవతల అపరావతారమగు సెరపిసు, ఐసిసు, హోరసు వీరు త్రిమూర్తులు. వీరు వేర్వేరు దేవతలుగాక, ఒకేదేవుని స్వరూపము లనియు భావింపబడిరి. ఈ సెరపిసుకు గ్రీకుల జ్యూస్‌తోను, రోమనుల జ్యూపిటరుతోను, పారసీకుల సూర్యదేవునితోను ఐక్యముకల్గింపబడెను. గ్రీకుల

పలుకుబడి వ్యాపించినచోట్లనెల్ల ఉత్తరహిందూశమునకు పడమటిచీనాకుగూడ ఈపూజ వ్యాపించెను. సామాన్యజీవితము నిరాశమై క్షీణించిన ప్రదేశముల జనులు లోకాంతరమున సుఖానుభవము ఆనందము కలుగు నను భావము నాతురతతో గ్రహించిరి. "మరణానంతరము దైవమే మనరక్షకు"డని ఆ కాలపు గీత మొకటి కలదు. కొందరుభక్తులు ఐసిసునందు అభిమానము గల్గి, ఆమెవిగ్రహములను దేవాలయములందుంచి ఆమెను స్వర్గరాజ్ఞి అని, శిశువగు హోరసును అంసములందు ధరించు నని భావించిరి. ఆమెకు హారతులు మ్రొక్కుబడులు సమర్పించుచుండిరి. ముండితులైన మతగురువులు బ్రహ్మచర్యవ్రతులై ఆమెయారాధనదీక్షతో వేచియుండిరి.

రోమకరాజ్యవ్యాప్తితో నీనూతనమతము పశ్చిమయూరపునకుగూడ వ్యాపించెను. రోమనువిజయముతో స్కాట్లండునకు హాలండునకుగూడ ఈసెరపిస్ ఐసిస్ గుడులు, ఆపూజాదుల మంత్రములు, ఆసంస్కృతాశయము వ్యాపించెను, కాని యీసెరపిస్ మతమునకు గొన్ని పోటీమతములు నుండెను. వాటిలో ముఖ్యమైనవి పారసీకపు 'మిత్ర మతము'. మిత్రుడు ఉదారపవిత్ర వృషభమును బలినిచ్చిన ట్లొకవిస్మృతరహస్యగాథ యీమతమునకు మూలాధారము.

ఇది మిశ్రభావమిళితమగు సెరపిస్ ఐసిస్మతముకన్న పురాతనము. ఇది మానవసంస్కృతిలో ఉదయశిలాయుగపు బలులకాలపు దని తోచును. మిత్రవిగ్రహపు వృషభమునకు గాయమై నిరంతరము రక్తము స్రవింప, అందుండి నవజీవము కలుగునట; మిత్రదేవభక్తు డారక్తధారలో స్నాతు డగును.

మొదటి రోమనుచక్రవర్తుల పాలనయందుండిన దాసులు పౌరులు నవలంబించిన ఈ యన్నిమతములకు మూలాధార సూత్రము వ్యక్తిమోక్షము, వ్యక్తికి నిత్యత్వప్రాప్తి. అంతకు పూర్వమతములట్లు వ్యక్తిగతములుగాక సాంఘికములు. ఆపూర్వ సంప్రదాయమున దేవునికి పురరాజ్యముతోనే సంబంధము ముఖ్యము; అందు వ్యక్తిసంబంధము గౌణము. ఆదిమజనుల యజ్ఞములు ప్రత్యేకవ్యక్తులవి గాక, సంఘమంతటికి ఇహలోకావసరములకే సంబంధించెను. కాని, మొదట గ్రీకులు తరువాత రోమనులు మతమునకు రాజకీయసంబంధము లేకుండ జేసిరి. అంతట ఈజిప్టుసంప్రదాయమున మతము పరలోకప్రధాన మాయెను. వ్యక్తిగతములు అమృతత్వాపేక్షములునగు ఈక్రొత్త మతములచే, పూర్వపుగ్రామ్యమతములలోని ముఖ్యశక్తి ఉద్రేకము పోయెను; కాని ఆమతములు నశించలేదు. పూర్వపు రోమనుచక్రవర్తులక్రింద ప్రతినగరములోను అన్నిదేవతల ఆలయములు నుండెను. రోమనుల ముఖ్యదేవుడగు జూపిటరు కొకఆలయము, తరుచు అప్పటిపాలకుడగు సీజరు (= చక్రవర్తి) కొకఆలయము నుండెను. రాజులే దేవతలుగా భావింపబడ వచ్చు ననుసంగతి ఫారోలనుండి సీజర్లు గ్రహించిరి. అట్టి గుడులలో రాజపూజ జరుగుచు, రాజభక్తిని వెల్లడించుటకై కొందరు పూజాద్రవ్యములను సమర్పించుచుండిరి. కాని, సాధారణముగ జనులు తమ స్వంతబాధల నివారణకై స్వర్గరాజ్ఞియగు ఐసిస్‌గుడికి వచ్చిపోవుచుండిరి. ఇదిగాక కొన్నిచోట్ల విచిత్రములగు కొన్ని ప్రాంతీయదేవాలయము లుండెను. సెవిల్‌పురమున కార్తేజివారి పూర్వదేవతయగు కాముని పూజించు

చుండిరి. కొన్ని గుహలలోను, భూగర్భపుగుడులలోను మిత్ర దేవతల వేదికలవద్ద రోమనుసైనికులు బానిసలు పూజించు చుండిరి. కొన్నిచోట్ల యూదులు బైబిలు ప్రకారము లోకేశ్వరు డగు అదృశ్యదేవు నారాధించు ఆలయములు నేర్పడి యుండును. ఆయూదమతపు రాజకీయప్రసక్తికై యూదులతో తగవులు గలుగుచుండెను. విగ్రహపూజ తమమతమునకు విరుద్ధమని యూదజనులు సీజరు కచ్చు సాంఘికబలులలో పాల్గొనరైరి; రోమను విగ్రహస్పర్శ లేకుండుటకై సేనాధ్వజములకు జోహారు కూడ సలుపరైరి.

తూర్పున చాలమంది బుద్ధునికాలమునకు చాల పూర్వమునను వివాహాదిసుఖముల విడచి, ఆధ్యాత్మికశక్తులనే యపేక్షించి ఐహికబాధల తప్పించుకొనుటకై సన్యాసు లగుచుండిరి. బుద్ధుడీసన్యాసుల తీవ్రచర్యల నిరోధించెను; కాని ఆయన శిష్యులలో ననేకశ్రమణకులు తీవ్రసన్యాసమునే అవలంబించిరి. కొందరు మారుమూలల గ్రీకుగురువులుగూడ నిట్లే శోషక నియమావలంబులై, అంగభంగముగూడ జేసికొని ఆత్మహింస చేయుచుండిరి. జూడియాదేశీయులలో, అలెగ్జాండ్రియాలోనుగూడ క్రీ. పూ. మొదటిశతాబ్దమున వైరాగ్యము సన్యాసము వ్యాపించెను. కొందరు ప్రపంచసంబంధమువదలి, ధ్యానతపోనిరతులైరి; ఎస్సీనుతెగవా రిట్టివారే. క్రీ. త. మొదటి రెండు శతాబ్దములలోను ఆకాలపు బాధలనుండి మోక్షముకై అన్నిచోట్ల సాంసారికజీవనము త్యజించి విరాగులగుట అధికమాయెను. పూర్వపుస్థిమితత దేవగురుభక్తి పోయెను. దాస్యభావము క్రౌర్యము, భయనాశములు, ఆతురత, ఇంద్రియలోలత్వము

రూఢములై, ఆకాలపు జనులలో సంఘముపై నసహ్యత, అశాంతి, శ్రమ వైరాగ్యములచే శాంతిసంపాదనేచ్ఛ అంటు జాడ్యమువలె వ్యాపించెను. ఇట్టి భావముతోనే కొందరు దుఃఖితులు పశ్చాత్తప్తులు సెరపియమ్ దేవాలయములోనికి మరికొందరు రక్తసిక్తములు తమోయుతములగు మిత్రదేవుల గుహాలయములలోనికిని చనుచుండిరి.*

---

* ఈ అధ్యాయపు సంగతులు మన భారతదేశపరిస్థితుల కెంతవర కన్వయించునో పాఠకు లాలోచింపవలెను. వేదములందు మిత్రదేవు డనేక ఋక్కులలో ఉదహరింపబడి స్తుతింపబడెను. ఉదయపు సంధ్యావందనఋక్కులోను నేటి కీమిత్రస్తుతి జరుగుచున్నది. కాని, వాటిలో ఋషభసంబంధము గాని రక్తపాతప్రశంస గాని లేదు. అందు ఋషులు సూర్యుని మిత్రునిగా నెంచి జగత్కళ్యాణకరునిగను 'లోకబాంధవు'నిగను భావించిరి. (వేదమత సంబంధమగు మిత్రప్రశంస ప్రాచీనపారసీకార్యుల జెండ్ అవేస్తాలలోను గలదు. అచ్చటనే యీమిత్రదేవునికి పిమ్మట ఆప్రాంతపు ఆదిమ జనమతపు ఋషభరక్తపాతాదులతో సంపర్కము కల్గింపబడెనేమో తెలియదు.) మన దేశము దార్య ద్రావిడుల భిన్ననాగరికతలు (ఆదిమసంస్కృతియు) మిశ్రితమైనందున, ఇచ్చటను అట్టి దేవసమన్వయము జరిగియుండుట సహజమే.

ఆ ప్రాచీనజనులలో జరిగినట్లు పైనచెప్పబడిన దేవసమన్వయము "అమృతత్వనిత్యత్వాపేక్ష," "త్రిమూర్తి" భావము, వ్యక్తిమోక్ష పద్ధతి, ఐహికనిరపేక్షాదులు, మన దేశము కన్వయించుటను గూర్చి విమర్శకుల కింకను స్థిరాభిప్రాయ మేర్పడలేదు. ప్రాచీన వేదమతమున బౌద్ధయుగానంతరముకే చాల పరిణామములు కలిగి, "పౌరాణిక" మనబడు ప్రస్తుత హిందూమత మేర్పడెను. ఋగ్వేదసంహితలో 'అగ్ని, వాయు, ద్యౌః, సోమ, మిత్రావరుణ' ఇట్టి దేవతలకే ప్రాధాన్యము గలదు. వేదములందు 'విష్ణువు'

స్తుతి కొన్నిచోట్ల నున్నను, అందుకు ప్రాధాన్యము లేదు. రుద్రుని ప్రశంస వేదములం దతిస్వల్పము; ఋగ్వేదసంహితలో ఇప్పటిరూపు శివదేవప్రశంస లేదు; బ్రహ్మప్రశంస యున్నను విజ్ఞానము విద్య అను అర్థమం దుపయోగింపబడినది. త్రిమూర్తిభావన దరిమిలానే కల్గియుండ వచ్చును. కాని పైనజెప్పిన ఈజిప్టు త్రిమూర్తులతోను క్రైస్తవ త్రిమూర్తులతోను ప్రస్తుత హిందూమతపు త్రిమూర్తులకు చాల భేదము కలదు. మన త్రిమూర్తులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు విశ్వమునకు వరుసగా సృష్టిస్థితిలయములు గల్గించు భగవంతుని వేర్వేరు రూపములు.

ఆర్యులవ్యాప్తికి పూర్వము ద్రావిడులలో (మన ఆంధ్రదేశములో-గూడ) శివపూజ వ్యాపించి యుండెను; అది క్రమముగా ఆర్యహిందూమతమున గూడ ప్రధానమయ్యెను; ఈ పరిణామము కాళిదాసు కాలమునకు, మన యితిహాసములకును, చాల పూర్వమే కలిగియుండవలెను. ఆర్యుల ఋగ్వేద సంహితలోను మొదటి ఉపనిషత్తులందును విఘ్నేశ్వరాదులసంగతి, స్త్రీదేవతల ప్రశంస, అరుదు. ఆదిమద్రావిడమతమున స్త్రీదేవతలే ప్రధానములు; ఇప్పటికిని ముఖ్యమగు గ్రామదేవతలు స్త్రీలు. వేదములందును యజ్ఞమున్నను, విగ్రహారాధనయు ఆర్యదేవతలకు రక్తపిపాసయు ఉండినట్లు సూచన లేదు. ఆదిమద్రావిడ మతములలో, ప్రధానమైన విగ్రహారాధనము భీకరబలులు 'పౌరాణిక హిందూమతము లోనికిని వ్యాపించియుండును. ఋగ్వేదదేవులు సౌమ్యులు సౌఖ్యానందకరులుగ వర్ణింపబడిరి. ఆదిమద్రావిడదేవతలు ఆధివ్యాధికరులు భీకరులు నని గన్పట్టును. కొంతవర కీభీకరత్వము శివదేవుని కారోపింపబడెను. ప్రాచీనాదిమద్రావిడులు సర్పములను చంద్రుని పూజించుచుండిరి. నేటికిని యిట్టివ కొంతవరకు గలవు. అవి శివదేవుని ఆభరణ వాహనములుగ సేర్పడినవి (విష్ణునకుగూడ శేషసర్పము శయ్యగావింపబడినది.) శివునికి ఆర్యుల రుద్రునితోను, స్త్రీదేవతలకు ఆర్యదేవుల భార్యాదులుగను సమన్వయము గల్గెనని, భేతాళా-

దులు దుర్గ కాళీ మొదలగు దేవతలు మొదటి ద్రావిడమతమునుండియే ఆర్య మతమును వ్యాపించె నని, కొందరి అభిప్రాయము. ఋగ్వేదార్యులు సృష్టిలోని సూర్యాగ్నివాయువరుణాదులను అం దంతర్యామియగు పరమాత్మను పరమానందకరముగనే భావించిరి. "ఈభావము పౌరాణిక హిందూమత కాలమున 'ఇహలోకము దుఃఖభూయిష్టము' అని మారెను; ఆర్యుల సంఘక్షేమాభిలాష తరువాత వ్యక్తిమోక్షతత్పరతయైనది. అందుకు ద్రావిడనాగరికత కొంతవరకు కారణమేమో! అథర్వవేదమందలి భేషజ, తాంత్రిక, అస్త్ర, శాప, అభిచారాదులకు ద్రావిడసంపర్కముగూడ కొంతకారణము." అని కొంద రందురు.



# 37. ఏసుక్రీస్తు ఉపదేశము

క్రైస్తవులు ఈశ్వరావతారముగ భావించు ఏసుక్రీస్తు అగస్టసు సీజరు పాలనకాలమందు జూడియాలో జనించెను. ఈయన పేరటి మతము తరువాత రోమకప్రభువుల మతమయ్యెను.

చరిత్రను మతమును వేరుగా నుంచుట మొత్తముమీాద మంచిది. రాబోవు అవతారమని మొదట యూదు లెంచిన లోకేశ్వరుడు 'ఏసే' నని క్రైస్తవుల నమ్మిక. చారిత్రకుడుగనే యుండ దలచుచో ఈభావము నిజమని, కాదని, చెప్ప వీలులేదు. యథార్థముగ నరాకారమున వసించిన క్రీస్తును నరునిగనే చారిత్రకుడు చర్చింపవలెను. టైబీరియసు సీజరుకాలమున క్రీస్తు యూదదేశమున ప్రవక్తగా వచ్చెను; వెనుకటి యూద ప్రవక్తలరీతినే, ఆయన బోధ చేసెను. ఆయనకప్పుడు సుమారు ముప్పదేండ్లవయస్సు. అంతకుపూర్వ మాయన జీవితసంగతులు తెలియవు.

క్రీస్తుజీవిత బోధలగూర్చిన ప్రత్యక్షాధారము బైబిలు లోని నాలుగు 'సువార్తలే.' ఈతడు కల్పితుడు కాక యథార్థ వ్యక్తియే అని మన కాసువార్తలచే గోచరించును.

నిశ్చలముగా కూర్చునియున్నట్లు చిత్రించిన ఇప్పటి బౌద్ధవిగ్రహములవల్లను ఇటీవలి ఆరాధనవల్లను గౌతమ బుద్ధుని నిజప్రకృతి మరుగువడి యపోహాలు కలిగినట్లే క్రీస్తు సన్నగా చురుకుగా నున్నట్లు ఆధునిక క్రైస్తవకళాశిల్పులు ఆయన

యందు భక్తిచే చిత్రించిన సాంకేతికచిత్రములచే క్రీస్తు వ్యక్తిని గూర్చి జనులు చాల పొరబడిరి. యేసు నిరుపేదయగు బోధకుడై, ఆతపతప్తమై ధూళిధూసరమగు యూదదేశమున తిరుగుచు భిక్షాటనచే జీవించెను. కాని ఆత డెప్పుడును స్వచ్ఛవస్త్రముల ధరించి సుందరముగ దువ్వుకొని నిశ్చలుడై గాలిలో ఎగిరిపోవుచున్నటుల చిత్రింపబడెను. మూఢభక్తుల అతిశయోక్తుల నుండి యథార్థసంగతులను వేరుచేయలేని చాలమంది ఇట్టివర్ణనచే ఆయన జీవితమే నిజముకాదని నమ్మదగదని తలచిరి. ఈ క్లిష్టప్రక్షేపముల దీసివేసినయెడల ఏసుక్రీస్తు మానవసహజమగు శ్రద్ధా ప్రేమ కోపాదులు కలిగి ఈశ్వరుని విశ్వజనకత్వము పరలోకరాజ్యప్రాప్తి అను నూతనసిద్ధాంతముల బోధించిన ఆకర్షణశక్తి గల వ్యక్తిగా కన్పడును. ఆయన చాలమంది యనుచరుల ప్రేమసాహసపూరితుల జేసెను. దుర్బలరోగు లాయనసాహచర్యమున ధైర్యవంతులై, ఆరోగ్యమొందిరి. కొరతవేసినప్పు డతిశీఘ్రముగ జనిపోవుటనుబట్టి ఆయన దుర్బలదేహు డని యెంచవలెను. ఉరిశిక్ష యైనమీదట, అప్పటి మామూలుప్రకారము వధస్థానమున తన శిలువను వహించినవెంటనే ఆయన మూర్ఛితుడైనట్లు సాంప్రదాయికకథ గలదు. తనసిద్ధాంతముకు బోధించుట కాయన మూడేండ్లు దేశములో సంచరించెను. అప్పుడు ఒక విచిత్రయూదరాజ్యమును స్థాపింపజేయ యత్నించిన ట్లాయనపైన జెరూసలెములో నేరము మోపబడెను. అందుకై విచారింపబడి ఏసుక్రీస్తు యిద్దరుదొంగలతోసహా కొరత వేయబడెను. వారిద్దరు చచ్చుటకుముందే క్రీస్తుజీవితము చాలించెను. ఆయన ముఖ్యబోధయగు పరలోకరాజ్యపు తీవ్రసిద్ధాంతము

మానవులమనస్సుల కుత్తేజకమై పరిణామకర మయ్యెను. దాని సారమును అప్పటిలోకులు గ్రహింపలేకైరి. అప్పటి ఆసంస్థలకును, అభ్యాసములకును అది కేవల విరుద్ధముగ నుండెను. కొంత స్ఫురించగానే వారు దిగ్భ్రమచే వెనుదీసిరి. మనుష్యులు తమ మూఢజీవితము పూర్తిగ మార్చుకోవలె నని లోపలను బైటను పరిశుద్ధులు గావలె నని ధైర్యముతో విస్పష్టముగ ఏసు బోధించి జనుల నట్లు చేయకోరినట్లు తోచును. అప్పటిజనుల ప్రాచీనభావములకు నీసిద్ధాంతములకు గలిగిన సంఘర్షమే మన కిందుకావలసినది. లోకేశ్వరు డొకడే యని ధర్మస్వరూపు డని యూదులు బోధించుచుండిరి. కాని తమతండ్రియగు అబ్రహాం తో యూదులకు భూలోకమున ప్రాధాన్యమిచ్చుటకు దేవుడు ఖరారుచేసె ననియు, అట్లు బేరమాడు ననియు వారు తలచిరి. ఇట్టి తమనమ్మికను యేసు తుడిచివేయుట వారికి దిగులు కోపము గల్గించెను. దేవుడు బేరగాడు కాడనియు, స్వర్గమున దేవునికి "స్వంతమనుష్యులు" ప్రత్యేక ప్రీతిపాత్రులు నుండ రనియు, విశ్వవ్యాపియగు సూర్యునివలెనే దేవునికి నెవ్వనిపైనను పక్షపాత ముండ దనియు ఆయన బోధించెను. నరులందరును సోదరులే; వారందరు దోషులైనను లోకపిత కందరు నిష్టులే. స్వజనుల బొగడుచు ఇతరజనుల నిరసించుట దోష మని యేసు "మంచి సమరిటను" కథలో సూచించెను. యూదులు దేవునకు ప్రత్యేకాదరపాత్రు లని వారిలోగల దృఢవిశ్వాసమును యేసు "పనివాండ్ర" కథలో వారించెను. దేవుడు తనరాజ్యములోనికి వచ్చు ప్రతివారిని సమముగానే ఆదరించు నని, ఆయన అనుగ్రహమునకు మితి లే దని ఆయనదయాప్రసారములో భేద

భావము లేదని యేసు బోధించెను. ప్రతివారును తమయావచ్ఛక్తియుక్తుల దేవునికి సమర్పించవలెనని ఎవరికిని ప్రత్యేకపు హక్కులు సదుపాయములు మినహాయింపులు లేవని "కష్టనడిన నాణెము" "వితంతువుమైటు" కథలలో ఆయన సూచించెను. (మైటు దమ్మిడివంటి మిక్కిలి చిన్ననాణెము.)

క్రీస్తు యూదుల స్వకులాభిమానమునే గాక, వారి కుటుంబప్రేమనుగూడ ఈశ్వరప్రేమయను మహాప్రవాహములో కలిపివేయ యత్నించెను. "దేవరాజ్యమంతయు ఆయన యను చరకుటుంబమే." ఆయన జనులయొద్దకు పోవుచుండగా ఆయన తల్లియు సోదరులును ఆయనతో మాట్లాడుట కీవలకు వచ్చిరి. ఆవార్త నెవరో చెప్పగా ఆయన 'నాతల్లి యెవరు,సోదరులెవ్వరు? వీరే' అని తనశిష్యుల గనపర్చి, అంతరిక్షమందలి తండ్రి (ఈశ్వరుని) యాజ్ఞ నెఱవేర్చువారే నాసోదరీసోదరులును, తల్లియు అని ఆయన బదులుచెప్పెను.

'ఈశ్వరుడు జగజ్జనకుడు, నరులందరు సోదరులు' అని ఆయన బోధించి యూదుల స్వదేశకుటుంబ ప్రేమపాశముల ఛేదించెను. ఇశ్రేల్ ప్రజల ఆర్థికవ్యత్యాసమును వ్యక్తుల ప్రత్యేకపు ఆస్తిపద్ధతిని స్వలాభపరతనుగూడ, ఆయన ఖండించెను. జనులందరును వారి ఆస్తులును దేవునిరాజ్యములోనివారే. మనము సర్వాత్మనా యావదాస్తితోను ఈశ్వరేచ్ఛప్రకారము సేవ చేయుటయే ధార్మికజీవన మనిపించుకొనును. స్వలాభముకై ఐశ్వర్యము సంపాదించుటను స్వార్థపరత్వమును ఆయన చాల పర్యాయములు నిరసించెను.

"ఆయన దారిని పోవుచుండగా ఒకడు పరుగెత్తివచ్చి నమ్రుడై ఆయనతో 'సద్గురూ! నిత్యామృతజీవనము నార్జింప నేమిచేయవలెనే?' అని అడిగెను. అందుకు యేసు 'నేను సద్గురుపు డసుగాను. దేవుడుతప్ప మఱియెవరును సద్గురువులుగారు.(దేవుని) ఆజ్ఞలు నీకు తెలియును. వ్యభిచరింపకుము; హత్య దొంగతనము చేయకుము; కూటసాక్ష్యము చెప్పకుము; మోసము చేయవద్దు; నీతల్లిదండ్రుల గౌరవింపుము.' అని బదులుచెప్పెను. అతడు నా బాల్యమునుండి యిట్లే చేసితి నని మరల అనెను. అంతట యేసు అతని జూచి ప్రేమించి 'నీ కొక్కటే లోటు. నీవువెళ్లి నీకున్న యాస్తినంతయు అమ్మివేసి, ఆసొమ్మును పేదలకిచ్చివేసినచో నీకు పరలోకమున నిధి దొరకును.శిలువను ధరించి నాతో రమ్ము.' అని బోధించెను. ఆ శ్రీమంతు డందుపై శోకముతో వెడలి పోయెను. యేసు చుట్టుజూచి 'ద్రవ్యవంతులు దేవునిరాజ్యము లోనికి ప్రవేశించు టెంతకష్టము' అనెను. శిష్యు లామాటవిని ఆశ్చర్యపడిరి. యేసు తిరుగ నట్లే చెప్పి 'పిల్లలారా! సొమ్మునే నమ్మువారు దేవరాజ్యమును ప్రవేశించుట యెంతకష్టము! వారికి దేవరాజ్యప్రవేశముకన్న సూదికన్నములోనుండి ఒంటె దూరుట సులభము అని వచించెను." (మత్తయిసువార్త).

దేవునికి నరులందరు నొకటే యని మహాబోధ చేయు టలో క్రీస్తు అక్కడి పూర్వపు ధార్మికసిద్ధాంతములను నిరసించెను. భక్తుల జీవితవిధులనుగూర్చి ఆయన యభిప్రాయము తెల్పు ఈక్రిందికథ బైబిలులోని 'మార్కు' సువార్తలో చెప్పబడినది. ఫారిసీలును లేఖకులును "నీశిష్యులు పెద్దల సంప్ర దాయప్రకారము చేయక చేతులు కడుగుకొనకయే రొట్టె

తినెద రేమి?" అని యడుగగా, అందుకు ఏసు ఇట్లు చెప్పెను. "ముఖస్తుతియేగాని ఈజనుల హృదయము నాపై లేదు. వారు నాకుజేయు పూజ వ్యర్థము; వారు నరులయాజ్ఞలనే శిరసావహింతురు. మీనీచత్వమునుగూర్చి ఈసయ్య ముందేచెప్పియుండెను. దేవునియాజ్ఞను మూలద్రోసి, గిన్నెల గడుగుట మొదలగు సంప్రదాయముల రక్షణకై దేవాజ్ఞను మీరు పూర్తిగా నిరాకరింతురు."

నైతిక సాంఘిక పరివర్తనమే కాక,విస్పష్టమగు రాజకీయోద్దేశముకూడ ఆయనబోధలో నిమిడియుండెను. "నా రాజ్యమైహికము కాదు; అది జనహృదయములందే కాని సింహాసనములపై నుండదు" అని ఆయన చెప్పెను. కాని ఆయనయధికారము వ్యాపించినంతవరకు బాహ్యప్రపంచమును మారిపోయి నూతనమయ్యెను. ఆయన బోధసారము పూర్తిగా గ్రహించలేక పోయినను, లోకస్థితి క్రీస్తు తారుమారుచేయ యత్నించినట్లు గ్రహించి ఆకోపముననే క్రీస్తు కప్పుడు మరణదండన విధించిరి. క్రీస్తు తన ప్రత్యక్ష బోధచే సంఘమును తలక్రిందు జేయ యత్నించినటుల అప్పటివారికి తోచియుండును. అట్టి స్థితిలో శ్రీమంతు లా క్రొత్తబోధచే భీతులై, అందుండి తప్పుకొన యత్నించిరి. విశ్వజనీనమగు ధార్మికజీవనమున కాటంకము తొలగించి, రహస్యముల వెలిపుచ్చి వారికి ప్రత్యేకపు ఆస్తి హక్కులు గర్వము అధికారము నుండగూడదని, తాము చేయు కార్యమునకు ప్రేమ తప్ప వేరులాభము నపేక్షింపకూడ దని ఆయన బోధించెను; అందుచే విభ్రాంతులైన జను లాయనపై తిరుగబడిరి; ఇం దాశ్చర్యమేమి? తనశిష్యులలోపము నాయన

పెల్లడించినప్పుడు వారు నష్టే చేసిరి. అప్పటి మతగురువులును ఆయనకు విరోధులైరి; తమభావనల కతీతమై తమయుద్దేశములకు భిన్నమగు ఆబోధలకు వారు విభ్రాంతులై, ఆయన 'సీజరు' అని పరిహసించి ఆయనకు మేకులు ముండ్లుకట్టి రక్తవస్త్రములచే కప్పి అవమానించిరి. ఆక్రొత్త సిద్ధాంతముల నంగీకరించుచో ధనాఢ్యులు తమ యభ్యాసముల విడచి, స్వభావములు మార్చుకొని అజ్ఞాతమగు భావిసౌఖ్యముకై భయంకర మగు కష్టజీవిత మనుభవింపవలసియుండును.*

---

* క్రీస్తుగారి బోధలో ఈశ్వరుని లోకపితృత్వము సర్వసమత్వము ధర్మగురుత్వము ముఖ్యములు అపూర్వములు అని యిందు వ్రాయబడినది. క్రీస్తుండిన యూదదేశ ప్రాంతమందును యూరపులోను ఇవి నూతనములే; కాని ప్రపంచమంతకు అవి నూతనములు కావు. మనభారతదేశమున క్రీ.పూ. చాల శతాబ్దముల క్రిందనే యుండిన వేదములందును భగవద్గీతాదులందును కూడ, ఈశ్వరుడు సర్వలోకజనకుడు, సర్వభూతసముడు,సర్వప్రాణిహితకరుడు, అను సిద్ధాంతములు చాలచోట్ల బోధించినారు.

సవృక్షకాలాకృతిభిః పరోఽన్యో యస్మాత్ప్రపంచః పరివర్తతేఽయం,
ధర్మావహం పాపనుదం భగేశం జ్ఞాత్వాత్మస్థ మమృతం విశ్వధామ॥
(శ్వే. ఉ. 6. 6.)

ఏకోదేవః సర్వభూతేషు గూఢః, సర్వవ్యాపీ సర్వభూతాం
తరాత్మా......(శ్వే. ఉ. 6-11)
పితామహస్యజగతో...... (భ గీ. 9-17)
పితాసిలోకస్య చరాచరస్య ..... ( ,, 11-43)

క్రైస్తవమతముకు చాలపూర్వమే "సత్యంవద; ధర్మంచర" మున్నగు నీతివచనములు మనదేశమంతటను వ్యాపించి, నేటికిని భారతీయులకు అను

దినము జ్ఞప్తికి దేఁజడుచున్నవి. క్రైస్తవుల ముఖ్యసిద్ధాంతము లనబడు ధర్మాచిహింసలను క్రీస్తు కయిదుశతాబ్దములకు పూర్వమే వేదఋషులు బుద్ధుఁడు జినుడు తమమతముల ముఖ్యసూత్రములుగా బోధించిరి. ఇతరధర్మముల వదలి ఈశ్వరుశరణొందుటచే పాపములు పోవు నను క్రైస్తవసిద్ధాంతముగూడ క్రీస్తుకుపూర్వము హిందూమతమున చెప్పబడినదే (ఉ. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామిమా శుచః ॥ భ. గీ. 18-68). క్రీస్తు జననముకు చాలపూర్వమే అనేక హిందూవిద్వాంసులు, అశోకాదుల ప్రోత్సాహమున బౌద్ధమతబోధకులును, ఆసియామైనరు అలెగ్జాండ్రియా మొదలగు ప్రాంతములకు వర్తకులతోబాటు మతబోధలకై వెళ్ళి జ్ఞానవ్యాప్తి చేసినట్లును, అలెగ్జాండరుతోను పారసీకరాజులతోను దరిమిలాను కొందరు పాశ్చాత్యులు మనదేశముకు వచ్చి హిందూ సన్యాసులతోను విద్వాంసులతోను పరిచయము చేసుకొనినట్లును గూడ, చారిత్రకనిదర్శనములు గలవు. అందువలన ఏసుక్రీస్తుకు అధమం రెండుశతాబ్దములు పూర్వమే భారతీయమతసిద్ధాంతము లాప్రాంతముకు వ్యాపించియుండును. ఆయంశము లేసుక్రీస్తుబోధల కాధారము లగుటలో ఆశ్చర్యము లేదు. దేవుడు అంతరిక్షమందును విశ్వమంతటనుగూడ వ్యాపించియున్నట్లుగూడ క్రీస్తుకు చాలపూర్వ ముపనిషత్తులలో చెప్పబడినది.

ఆస్తిత్యాగము గూర్చి యేసుక్రీస్తు బోధించె నని శ్రీ వెల్సుగారు రిందు నిరూపించిరి; ద్రవ్యము ఆస్తి కామము విడుచుట అవసర మనియు అప్పటికి పూర్వమే బౌద్ధుల మూలగ్రంథములందును సనాతనార్యుల గ్రంథములలోను స్పష్టముచేయబడినది.

"తేనత్యక్తేన భుంజీథాః ....." (ఈ. ఉ. 1—1.)

"నవిత్తేన తర్పణీయోమనుష్యః......" (క. ఉ. 1—27)

"అమృతత్వస్యతునాశాస్తి విత్తేనేతి" (బృ. ఉ. 6—5.)

"నసాంపరాయః ప్రతిభాతి బాలం ప్రమాద్యంతం విత్తమోహే సమూఢం." (క. ఉ. 3-6)

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం, తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయదృష్టయే. (ఈ. ఉ. 15;) దీనికి సాంప్రదాయికులు వేరుఅర్థము చేయుదురు; కాని వైభావము ఇందు సూచిత మని తోచును.

కుర్యాద్విద్వాంస్తథాఽ_స్తకః చికీర్షుః లోకసంగ్రహం. (భ. గీ. 3-15)

అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మేప్రియోనరః (భ. గీ. 12-19)

సుసుఖం బతజీవాను యేసంనోనాత్థికించన, పీతిభక్ఖాభవిస్సామ

దేవా ఆభాస్సరాయథా. (ధ. ప 15, 4)

యమ్హిసచ్చంచధమ్మోచ అహింసా సంజమోదమో, సవేవంతమలో

ధీరోధీరో తి పబుచ్చతి (ధ ప. 19-6)

(=సత్య. ధర్మ, అహింసా, సంయమ, దమము లుండు వాంతమలుడు ధీరుడు స్థిరుడు అగును )

ఈధార్మికభావాలు పాశ్చాత్యులలో వ్యాపించుట చాల గొప్పవిష యమే, అందువల్ల అప్పటి శ్వేతజాతిలో గొప్పపరిణామము కల్గినది. అయితే, పైనచెప్పిన క్రీస్తుయొక్క సాంఘిక రాజకీయభావముల నిప్పటి క్రైస్తవ ప్రముఖు లాచరణలో అంగీకరింతు రని తోచదు; అమెరికా ముఖ్యపాశ్చాత్యదేశములు క్రైస్తవపాలనమందే ఉన్నవి; దాదాపు అందలి ప్రజలందరును క్రైస్తవులే. అందు ఈ సిద్ధాంతములకు కేవలము వ్యతిరేకములైన సామ్రాజ్యకాంక్ష, ధనాశ, స్వసంఘాభినివేశము, పరద్రవ్యాకర్షణము, హింసాకత్వము, మారణయంత్రప్రోత్సాహమును ప్రబలియున్నవి. ఈ కాంక్ష నచ్చటి లౌకిక జను లేగాక చాలమంది క్రైస్తవగురువులు మతవ్యాపకులుగూడ పరోక్షముగ నభిమానించుచున్నారు.

---

# 38. క్రైస్తవసిద్ధాంతముల పరిణామము

బైబిలులోని నాలుగు సువార్తలవలన ఏసుక్రీస్తు వ్యక్తి, ఆయన ఉపదేశము మనకు తెలియును. కాని, అందుచే క్రైస్తవుల ఆచారనిబంధనలు తెలియవు. క్రైస్తవవిశ్వాసముల ముఖ్యసూత్రములు యేసుయొక్క ప్రత్యక్షానుచరులు వ్రాసిన 'ఎపిసిల్సు' అనువానిలో కనబడును.

క్రైస్తవసిద్ధాంత ప్రవక్తలలో ముఖ్యుడు 'పాలు'; ఆయన యేసును చూడలేదు; ఏసు బోధింపగా వినలేదు. ఆయన అసలుపేరు సాలు. క్రీస్తుకొరత తరువాత ఆయన శిష్యబృందమును 'సాలు' చాల బాధపెట్టి, ఆరీతిగ మొదట ప్రముఖుడయ్యెను. కాని తరువాత హఠాత్తుగా క్రైస్తవుడై, 'పాల్' అని పేరు పెట్టుకొనెను. ఆయన మంచి మేధావి; ఆకాలపు మతశాస్త్రోద్యమనులందు విశేషశ్రద్ధవహించెను. అప్పటి యూదమతమును మిత్రమతమును అలెగ్జాండ్రియామతమునుగూడ ఆయన చక్కగా నేర్చుకొని, ఆమతముల విశేషసంగతులను ఆయన క్రైస్తవమతములోనికి తెచ్చెను. క్రీస్తు ముఖ్యోపదేశమగు దేవరాజ్యసిద్ధాంతము నాతడేమియు వృద్ధిచేయలేదు. కాని యూదులకు ముందు రాబోవునని చెప్పబడిన క్రీస్తు ఈ యేసే యని, పూర్వపు యజ్ఞబలులవలె ఈ యేసుమరణమును మానవజాతి విముక్తినిమిత్తమే జరిగిన యజ్ఞమనియు, ఆయన బోధించెను. మతములు తోడుగా వ్యాపించుచో, వీటిలో నొకదాని కర్మకాండ బాహ్యచిహ్నములు రెండవదానిలోనికి వ్యాపించు

చుండును. ఇప్పుడు చీనాలోని బౌద్ధాలయములు అచ్చట లోత్సేస్థాపించిన 'తవో' మతపు దేవాలయములరీతి నేయున్నవి. కాని బుద్ధునియొక్కయు లోత్సేయొక్కయు మూలసిద్ధాంతములు కేవలభిన్నములు. అట్లే మిత్ర అలెగ్జాండ్రియామతములందువలె, మతాచార్యుల శిరోముండనము, మ్రొక్కుబడులు, యజ్ఞవేదికలు, క్రొవ్వువత్తులహారతులు, మంత్రజపములు, విగ్రహములు మొదలగు బాహ్యపరికరములే గాక, ఆమతముల ప్రార్థనావచనములు ఆధ్యాత్మికభావములుగూడ క్రైస్తవమతములోనికి జేరినను ఆమతమునకు న్యూనతలేదు. ఈమతములన్నియు ఇంక కొన్ని చిల్లరమతములతోసహా ఒకదానిప్రక్క నొకటి వృద్ధినొందుచుండెను. ఒకమతమునుండి మరియొకదానిలోనికి జనులు తరుచుమారుచు, ప్రచారము సలుపుచుండిరి. వీనిలోనే ఒకదానికి ప్రభుత్వావలంబన ముండుచుండెను. యూదులవలెనే క్రైస్తవులును సీజరును దేవునిగా పూజింపనందున, ఇతరులకన్న వారిపై ప్రభుత్వమున కనుమానముండెను. ఇందుచేతనే ఏసు ఉపదేశముల తీవ్రతచేతను, క్రైస్తవము రాజద్రోహిమతముగా నెంచబడెను.

'ఆసిరిసు' వలెనే క్రీస్తుప్రభు మృతజనులకు నిత్యామరత్వ మిచ్చుటకై తిరుగ పుట్టునని పాలుప్రవక్త సూచించెను. తరువాత యేసుక్రీస్తునకు విశ్వజనకుడగు దేవునికినిగల సంబంధము గూర్చి అప్పటి క్రైస్తవసంఘములో తీవ్రశాస్త్రచర్చ జరిగెను. ఏసు దేవాంశుడేగాని, ఆయన అసలుదేవునికన్న భిన్నుడు తక్కువవా డని, 'ఆరియనులు' బోధించిరి. ఏసు భగవత్స్వరూపమే; తండ్రియగు నరుడు విశ్వకర్మావివృత్తుల చేయునట్లే,

దేవుడు యేసుగా నుండియే లోకజనకుడుగగూడ నున్నాడని, సబెల్లియను లనిరి. దేవుడొక్కడే; కాని 'తండ్రి కొడుకు హోలీ ఘోస్టు (మాయ)' అనుమూడురూపములుకలవు; అని త్రిమూర్తి వాదు లనిరి. కొంతకాలమువరకు ఆరియనులవాదమే పైచేయిగా నుండెను; తరువాత వాదోపవాదములు పరస్పరహింస యుద్ధములు జరిగి, చివరకు త్రిమూర్తివాదమునే క్రైస్తవులంగీకరించిరి. అతనేషియనుసిద్ధాంతమున ఈవాదము వివరింపబడి యున్నది.

ఈ చర్చలగూర్చి ఇందు వివరింపము. ఈ చర్చలకన్న క్రీస్తూపదేశముల ప్రభావమే అధికముగ వ్యాపించి, అందుచే నరజాతి నైతికాధ్యాత్మికజీవనమున నూతనదశ కలిగెను. దేవుడే విశ్వజనకుడనుటచే అందిమిడియున్న విశ్వమానవసౌభ్రాత్రమును, ప్రతినరుడు దేవుని పవిత్రవాస్థలము అను సిద్ధాంతమును కలిగెను. వాటిచే మానవజాతియొక్క భావిసాంఘికరాజకీయజీవితమునందమితమైన పరిణామము కలిగెను. క్రీస్తుమతము వ్యాపించినమీదట లోకులకు తోటినరులపై నొక నూతనగౌరవము కలిగెను. పాలు ప్రవక్త బానిసలు లొంగియే యుండవలె నని బోధించినసంగతి నిజమే; కాని సువార్తలలో యేసు ఉపదేశతత్వముకు నరుడు నరులస్వాధీనము చేసికొనుట, అప్పటి ప్రదర్శనరంగములు, మృగయుద్ధము, కేవల విరుద్ధములనుట నిశ్చయము.

క్రీ. త. మొదటి రెండుశతాబ్దములలోను ఆమతభావముల ననేకజను లామోదించిరి. రోమకసామ్రాజ్యమంతట నామతము వ్యాపించెను. చక్రవర్తులలో కొందరు తటస్థులు

గాను ఉండిరి. 2, 3-వ శతాబ్దములందు దాని నణచివేయు యత్నము జరిగెను. 303 లోను, ఆతరువాత డయోక్లీషియను చక్రవర్తి క్రిందను చివరసారి చాలహింస జరిగెను; క్రైస్తవాలయముల ఆస్తులు జప్తుచేయబడెను; బైబిలు మొదలగు మతగ్రంథముల దీసికొని నశింపజేసిరి; క్రైస్తవులకు ప్రభుత్వరక్షణ తీసివేయబడెను; కొందరికి మరణశిక్షగూడ జరిగెను. ఈగ్రంథముల యాధిక్యము నధికారులు గుర్తించినట్లు తోచును. గ్రంథాధారములగు ఈ యూదక్రైస్తవమతములు రెండును వ్యాపించుటకు జనులు విద్య నేర్వవలసియుండెను; అందుచేనవి విద్యావ్యాప్తి కలిగించుమతము లయ్యెను. పూర్వపుమతము లందే జనుల జ్ఞానాభివృద్ధి కెట్టిప్రేరణ గలుగలేదు. ఆకాలపు పశ్చిమయూరపుతో అనాగరికులచే గలిగిన కల్లోలసమయమున ముఖ్యముగా క్రైస్తవబోధకులే విద్యాసంప్రదాయము నిలిపిరి. ఆమతము డయోక్లీషియను పెట్టిన బాధల కణగిపోక, దినదిన వ్యాప్తిజెందెను. కొన్నిరాష్ట్రముల యుద్యోగులు క్రైస్తవులే; అందుచే నాయాంతశిక్షకార్యకారి కాలేదు. 317 లో సహాయ చక్రవర్తియగు గలేరిను క్రైస్తవుల నెవరును బాధింపకుండ ఆజ్ఞనిచ్చెను. క్రైస్తవమిత్రుడై తరువాత క్రైస్తవమతావలంబియైన కాన్‌స్టెంటైను చక్రవర్తి 324లో తాను దేవాంశ సంభూతుడు కానని చెప్పి, తన సేనలజండాలమీదను క్రైస్తవచిహ్నముల వేయించెను.

తరువాత కొలదియేండ్లలోనే క్రైస్తవమతము ప్రభుత్వమతమై స్థిరపడెను. మిగిలిన పోటీమతములు శీఘ్రముగా నశించెను; కొన్ని ఈమతములో హరించుకొనిపోయెను. 330లో

థియొడోసియసు అలెగ్జాండ్రియాలోని జూపిటరు సెరపిసు విగ్రహమును నశింపజేసెను. ఐదవశతాబ్దమునుండి రోమక సామ్రాజ్యమందు క్రైస్తవదేవాలయములు అబోధకులునే ఉండిరి.*

---

* క్రీ. శ. 3, 4-వ శతాబ్దముల కాలమందే కొందరు రోమక సామ్రాజ్యపు క్రైస్తవులు వర్తకులతోబాటు దక్షిణభారతదేశపు పశ్చిమతీరముకు వచ్చి, అచ్చటనుండి క్రైస్తవమతము బోధించిన నిదర్శనములు కలవు. సిరియనుక్రైస్తవు లనబడు అబాపతుక్రైస్తవు లిప్పుడును విశేషముగ తిరువాన్కూరులోను ఇతర మళయాళప్రాంతములందును కలరు. వారి యాచారముల కును పోర్చుగీలు ఫ్రెంచి ఇంగ్లీషు మిషనరీలప్రోత్సాహమున 16-వ శతాబ్దమునుండి యిటీవల క్రైస్తవులైనవారి ఆచారములకును కొన్నిభేదములు కలవు.

పాశ్చాత్యదేశమంతటను క్రైస్తవమతమే ప్రభుత్వ మతముగా నున్నది. అనగా ఆయాదేశపు ప్రభుత్వములు సాలీనా ప్రభుత్వాదాయమునుండి కొంతసొమ్ము క్రైస్తవమతసంస్థలకై వినియోగింతురు. (రష్యాలోమాత్ర మిటీవల సామ్యవాదులగు బోల్షివిక్కులచే నీపద్ధతి తీసివేయబడినది.) ప్రస్తుతము మనదేశము క్రైస్తవదేశీయులచే పాలింపబడుటచే, మనదేశమునగూడ నిప్పుడు క్రైస్తవమతమే ప్రభుత్వమతము; అనగా మనదేశీయులలో క్రైస్తవులు చాల తక్కువమందియే, అయినను మనదేశపు పన్నులబాపతు మనప్రభుత్వపు ఖజానానుండి. సాలీనా కొంతసొమ్ము క్రైస్తవమతపు చర్చిల నిమిత్తము బిషప్పులు మొదలగు ఆ మతగురువుల జీతములవగైరాలనిమిత్తము ఖర్చుచేయబడి, క్రైస్తవులకు ప్రత్యేకప్రోత్సాహ మీయబడుచున్నది.

---

# 39. సంచారిజనులచే సామ్రాజ్యవిచ్ఛిత్తి

రోమకసామ్రాజ్యము సాంఘికముగ క్షీణించుచు, నైతికముగ శిథిలమగుచునే 3-వ శతాబ్దియంతయు అనాగరికుల నెదుర్కొనవలసివచ్చెను. ఆకాలపు చక్రవర్తులు సర్వసేనాధిపులై, తమ యుద్ధావసరములకై రాజధానిని మార్చుచుండిరి. ఒకప్పుడు ఉత్తరఇటలీలోను మిలానుపురిలోను మరియొకప్పుడు (ఇప్పటి సర్వియాదేశపు) సిర్మియంలోను నిష్‌లోను, ఇంకొకప్పుడాసియామైనరులోని కోమిడియాలోను రాజధానియుండెను. ఇటలీ మధ్యనున్న రోమునగరము కేంద్రముకాక క్షీణించుచుండెను. సామ్రాజ్యము శాంతమై జనులు నిరాయుధులై యుండిరి. అధికారము సేనాగతమగుటచే చక్రవర్తులందుపై నాధారపడుచు, మిగిలిన ప్రజలవిషయమున పారసీకాది ప్రాచ్యరాజులవలె నిరంకుశులైరి. డయోక్లీషియను కిరీటమును ప్రాచ్యరాజుల దుస్తులను ధరించెను.

ఆసామ్రాజ్యపు రైనుడాన్యూబునదుల సరిహద్దునుండి శత్రువులొత్తిడిచేయుచుండిరి. రైనుపైన ఫ్రాంకులు, ఇతర జర్మనుజాతులు, ఉత్తరహంగెరీలో వండాలుజాతులు, ప్రస్తుత రుమేనియాయగు అప్పటి డాసియాలో 'విసిగాత్తులు' (పశ్చిమ గాత్తులు) వీరివెనుక దక్షిణరష్యాలో ఆస్ట్రగాత్తులు (తూర్పు గాత్తులు) వీరివెనుక వాల్గానదీప్రాంతమున 'ఆలను'లును వ్యాపించుచుండిరి. ఈసమయముననే మంగోలియనులు యూరపుపైకి వచ్చిరి. 'ఆలను' 'ఆస్ట్రగాత్తు'లనుండి హూణులు పన్నులు

వసూలుచేయుచు, వారిని పడమటికి తరుముచుండిరి. ఆసియా ఖండమున పర్షియా పునరుజ్జీవితమై, రోమనుసరిహద్దుల భేదించెను. 'సస్సనిడు' వంశ రాజుల క్రింద నీ నూతనపారసీకము బలీయమై, ఆసియాలో తరువాత మూడుశతాబ్దములు రోమక సామ్రాజ్యముకు పోటీదారై, మొత్తముమీద జయశీలముగ నుండెను.

యూరపుఖండ చిత్రపటమును జూచినచో, ఆరోమక సామ్రాజ్యపు ప్రత్యేకలోపము స్పష్టమగును. డాన్యూబునది ఏడ్రియాటికుసముద్రము కింకను సుమారు రెండువందలమైళ్ల దూరమున ఇప్పుడు బోస్నియా సర్వియా యనబడు ప్రదేశమునకు వచ్చును; అక్కడ ఆనది హఠాత్తుగా మలుపులు తిరుగును. రోమను లెన్నడును సముద్రమార్గమును రహదారిగా నుంచుకోలేదు; కనుక లాటినుభాషకమగు సామ్రాజ్యపు తూర్పు భాగములును, ఈ రెండువందలమైళ్లస్థలముద్వారానే వచ్చి పోవుచుండిరి. ఈమలుపువద్దనే అనాగరికజాతు లెక్కువ యొత్తిడిచేసి, ఆమార్గస్థలమును భేదించిరి; అంతట ఆసామ్రాజ్యము రెండు ప్రత్యేకఖండములై పోయెను.

ఆసామ్రాజ్య మింకను బలీయమై యుండినచో డాసియాప్రదేశము తిరుగవశమైయుండును; కాని ఆశక్తి నశించెను. కాన్ట్సెంటైను దైవభక్తిగల యోగ్యుడే. ఈ స్థలముననే ఆయన యొకసారి గాత్తులదాడి నాపెను. కాని డాన్యూబు నది కావలకు తరుమలేకపోయెను. సామ్రాజ్యపుగృహకల్లోలముల నవరించుటతోనే ఆతనికి సరిపోయెను. ఈజీర్ణించుసామ్రాజ్యము నుద్ధరింప క్రైస్తవమతపు నైతికబలమును ఐక్యభావమును

ఆతడుపయోగించెను. హెల్లస్పాంటుజలసంధియొద్ద బిజాంటియ మును స్థిరరాజధానిగా జేయనిశ్చయించెను. అదియే యిప్పటి కాన్స్టాంటినోపిలు. ఆపురము కట్టుచుండగనే ఆతడు మరణించెను. ఆయన రాజ్యాంతకాలమున నొకచిత్రము జరిగెను. 'గాత్తు' ల యొత్తిడిపొందిన 'వండాలు'లు రోమకరాజ్యమున కొంతస్థలము గోరి హంగెరిలో డాన్యూబునదికి పశ్చిమమందు పన్నోనియాం ప్రవేశించి, అందు వాస మేర్పఱచుకొనిరి. ఆయోధులు పేరుకు రోమనుసైనికులైనను వారితో కలసిపోక తమ నాయకుల క్రిందనే యుండిరి.

తన మహారాజ్యమును సరుదుకొనుచుండగనే కాన్స్టెం టైను కాలముచేసెను; అంతట సరిహద్దును భేధించి విసిగాత్తులు కాన్స్టాంటినోపిలును సమీపించి అడ్రియనోపిలువద్ద వాలెన్సు చక్రవర్తి నోడించి, (వండాలులు పన్నోనియాలోవలె) ఇప్పటి బల్గేరియాదేశమున స్థిరవాస మేర్పఱచుకొనిరి. నామమాత్ర మున వారు చక్రవర్తికి లోబడినను క్రియకు విజేతలే యైరి.

క్రీ. త. 379 మొదలు 395 వఱకు తియోడోసియసు పాలించినప్పుడు సామ్రాజ్యము స్థూలదృష్టికి సరిగనేయుండెను. అప్పుడిటలి పన్నోనియాల సేనలకు "స్టిలికో" అను వండాలును, బాల్కనుద్వీపకల్పమున "అలరికు" అను గాత్తును నాయకు లైరి. తియోడోసియసు నాల్గవ శతాబ్దము చివరకాలము చేయగా అతనికొడుకు లిద్దరిలో కాన్స్టాంటినోపిలువాసియగు ఆర్కేడియసుకు అలరికును రెండవవాడగు ఇటలీవాసి హనోరి యసుకు స్టిలికోయు సహాయులైరి. రాజపుత్రులను కీలుబొమ్మ లుగానుంచి ఆసేనాను లిద్దరును సామ్రాజ్యాధికారముకై పోరిరి.

ఆయుద్ధమున అలరికు ఇటలీ ప్రవేశించి రోమును ముట్టడించి క్రీ. శ. 410 లో దానిని పట్టుకొనెను.

5-వ శతాబ్దపు పూర్వార్ధమున యూరపులో రోమక సామ్రాజ్యమంతయు సంచారిజాతుల బందిపోటు సేనల కెర యయ్యెను. ఆకాలపు జనులస్థితి దుర్గ్రాహ్యము. ఫ్రాన్సు, స్పెయిను, ఇటలీ బాల్కనుదేశములందు పట్టణముల జన సంఖ్య తగ్గి క్షీణించి దరిద్రస్థితిలో నుండెను. అక్కడ పౌరుల జీవనము నీచమై, అస్థిరమై, దుర్భరమై యుండెను. అప్రాప్యమై దూరమందున్న చక్రవర్తిపేరట ఆయాప్రాంతముల యుద్యోగులే సర్వాధికారులై, యథేష్టముగ వర్తించుచుండిరి. క్రైస్తవ దేవాలయములందలి బోధకులు పురోహితులు సాధారణముగ నిరక్షరులై యుండిరి.విద్యక్షీణించి మూఢవిశ్వాసములు భయము జనుల నావరించెను. కాని లూటీదార్లు నశింపజేసినచోట్లదప్ప తక్కిన అన్నిచోట్లను గ్రంథములు చిత్తరువులు విగ్రహాదులు ఇంకను నిల్చియేయుండెను.

గ్రామజీవితమును దుస్థితిలోనేయుండి, ఈతిబాధ లధిక మయ్యెను. కొన్ని ప్రాంతములు యుద్ధమువలనను అంటువ్యాధి వలనను నిర్జనమయ్యెను. బాటలు, అడవులు బందిపోట్లపాలైనవి. ఇట్టిప్రదేశములోనికి సంచారిజాతులు యథేచ్ఛముగ బ్రవేశించి తమనాయకుల నచ్చటిపాలకులుగ జేసి తరువాత వారికి రోమ నుల అధికారబిరుద మిచ్చిరి. ఈ సంచారు లర్ధనాగరికులైనచో ఓడినవారిని కొంత మన్నించి వారిపట్టణముల బాలించుచు వారితో గలసి సంబంధముల జేసికొని లాటినుభాషను తమ యాసతో నేర్చుకొనుచుండిరి. కాని ఆంగ్లదేశమందు రోమక

రాజ్యమును జయించిన జూట్లు ఆంగిలులు సాగ్జనులు సేవ్యదారు లగుటచే ఆ పట్టణముల యవసరములేక వారు దక్షిణాంగ్ల దేశ మందలి రోమనునాగరికుల పూర్తిగా తొలగించి వారిభాషకు బదులు తమట్యూటను శాఖలోని ఆంగ్లమునే ప్రవేశింపజేసిరి. దానిపరిణామమే ఇప్పటి యింగ్లీషుభాష.

ఆయాజర్మను స్లవానికు తెగలు ఆచెదరిపోయిన సామ్రాజ్యమందు దోపిడికై సౌఖ్యవాసముకై జరిగించిన రాకపోకల వివరించుట కిచ్చట అవకాశము లేదు. మచ్చునకు వండాలు తెగను తీసికొందము. వారు చరిత్రకాలారంభమున తూర్పు జర్మనీకి వచ్చి తరువాత వెనుకజెప్పిన రీతిని పనోన్నియాలో వసించి క్రీ. త. 425 ప్రాంతమున అక్కడనుండి మధ్య నున్న రాష్ట్రములగుండ స్పెయినులోనికి బోయిరి. అక్కడ నదివరకే రష్యానుండి వచ్చిన విసిగాత్తులు మొదలగు మరికొందరు జర్మనులు తమప్రభువుల నియమించుకొనియుండిరి. అందుచే వండాలులు 'జెన్సెరిక్' అను నతని నాయకత్వమున 429 లో ఉత్తరఆఫ్రికాకు పోయి 439 లో కార్తేజిని బట్టుకొని అచట నౌకాదళమును నిర్మించి దానితో సముద్రముపై నధికారులైరి. అప్పటి కర్ధశతాబ్దముపూర్వము "అలరికు" చేసిన దోపిడి నుండి రోము కొంచెముగా కోలుకొనుచుండెను. దానిని వారు 455 లో పట్టుకొని తరువాత సిసిలీ కార్సికా సర్డీనియాలను పశ్చిమమధ్యధరాసముద్రములోని ఇతరద్వీపములను గూడ వశపఱచుకొనిరి. ఇట్లప్పటికి సుమారు 7 శతాబ్దముల క్రింద కార్తేజి వారు నిర్మించినంత సముద్రసామ్రాజ్యము నొకదాని నిర్మించి, వారు 477 ప్రాంతమున మహాబలులై (అత్యల్పసంఖ్యాకు

లయ్యె) ఈ ప్రదేశములన్నిటిని తమయధికారమునం దుంచు కొనిరి. 6వ శతాబ్దిలో ఈమహారాజ్యమునంతను కాన్స్టాంటైను రాజవంశీయుడగు మొదటి జస్టీనియను జయించి తాత్కాలిక ముగ ప్రాచ్యరోమక రాజ్యమున జేర్చెను.

ఈవండాలులవలెనే ఇతరసాహసికు లనేకు లిట్లే యుం డిరి. ఈస్థితిలో సువర్ణదేహులు అతిసాహసోత్సాహవంతులు మంగోలుజాతీయులు అగు హూణులు తూర్పునుండి తార్తా రులు ఇంక యూరపురంగముకు రా నారంభించిరి.

—

# 40. హూణులు : పశ్చిమసామ్రాజ్యాంతము

యూరపుపైన ఈమంగోలియనుల జైత్రయాత్రతో మానవచరిత్రలో నూతనశక మారంభించెను. క్రీ.పూ.సుమారు ప్రథమశతాబ్దివరకు మంగోలులకు ఆర్యులకు ప్రత్యక్షసంపర్కము లేదు. ఉత్తరమహారణ్యములకును పైనున్న గడ్డగట్టిన మంచుప్రదేశములందు పడమటి 'లాప్లండు దేశము'వరకు 'లాప్సు' లను ఒకమంగోలు తెగవారు వ్యాపించిరి. కాని ప్రపంచ ప్రధానరంగమున వా రేమియు పాల్గొనలేదు. పశ్చిమప్రపంచమున అసలు నీలగోధుమవర్ణులు ఆర్యులు సెమిటికులు వేలకొలది యేండ్లు మిశ్రితు లగుచుండిరి. (యూరపులోనికి 'ఎథియోపియను'లు వచ్చుటమాత్రము తప్ప) దక్షిణమునుండి కేవలము నల్లజాతులవారుగాని, ప్రాచ్యదేశమునుండి మంగోలియనులుగాని ఈమహారంగమునం దంతవరకు పాల్గొన లేదు. అప్పుడు ఈసంచారి మంగోలియనులు పశ్చిమముగా వచ్చుటకు గొన్ని కారణములు గలవు. ఒకటి: 'హాను'వంశీయుల పాలనమున శ్రీమంతమైన చీనారాజ్యమున ప్రజాసంఖ్య వృద్ధియయ్యెను; ఆ సామ్రాజ్యము బలీయమై, ఉత్తరమునకు విజృంభించెను. రెండవది: ఆర్యమంగోలియనుజాతుల కడ్డముగ మధ్య నుండిన మరుగుస్థలము (కాలము మారి) వానలు కొంత తగ్గుటవలన ఎండియు, అప్పటి మరుభూములలో వర్షించి బీడు లేర్పడియు ఆప్రదేశము వాసయోగ్యమై కాలము సుభిక్షమయ్యెను.

అందుచే జనసంఖ్య బాగుగా వృద్ధియై, పశ్చిమమున క్రొత్తగా బాగుపడిన ప్రదేశములను మంగోలు లాక్రమించి, ఆపైకి వ్యాపించిరి. ఇంకొక కారణము రోమకసామ్రాజ్యమున అప్పటి ఆర్థికదుస్థితి, శిథిలత్వము, ప్రజాక్షయము కల్గించెను; మరియు, అచ్చటి శ్రీమంతులు, తరువాత సైనికరాజోద్యోగులును, సామాన్యజనుల పీల్చి పిప్పిచేసిరి. ఇట్లు చీనులనుండి ఒత్తిడి, మధ్యప్రదేశపు ఆటంకముపోవుట, రోమనుల క్షీణదశ ఈ మూడును మంగోలియనుల కేకకాలమున తటస్థించెను. *

ఈ హూణులు క్రీ. త. మొదటిశతాబ్దముననే యూరపు ఖండపు తూర్పుసరిహద్దు చేరిరి. కాని 4, 5- వ శతాబ్దములందే ఈమైదానములందు ప్రబలురైరి. 5-వ శతాబ్దము హూణుల శతాబ్దము; వండాలు నాయకుడు 'హానోరియసు'కు యజమాని యగు 'స్టిలికో' క్రింద కొందరు హూణులు జీతపు సైనికులుగా మొదట ఇటలీలో ప్రవేశించి తరువాత వండాలులు ఖాళీచేసిన పన్నోనియా నాక్రమించిరి.

5-వ శతాబ్దపు రెండవపాదమున హూణులలో 'అత్తిల' అను మహావీరుడు బయలుదేరెను. అతని ప్రభావమునుగూర్చి మనకు స్పష్టముగా తెలియదు. అతడు హూణులనేగాక కొన్ని జర్మనులను తెగలగూడ బాలించెను. అతనిసామ్రాజ్యము పశ్చిమ

---

* ఈ హూణులదాడిప్రభావము కొంతవరకు మనభారతదేశమునకు తగిలి, పంజాబుప్రాంతపు పరిస్థితులు చెడెను. కాని గుప్తవంశపాలనమున తిరుగ నార్యావర్త మేకమై, జాతీయభావము బలీయమైయుండెను. అప్పటి ఆర్యావర్తపు భారతీయులలో నేకభాష, ఒకేనాగరిత ఐకమత్యము కలిగియుండి, చాలవరకు హూణధాటి నెదుర్కొనగలిగిరి.

యూరపులోని రైనునది మొదలు మధ్యఆసియా మైదానముల వరకు వ్యాపించెను. అతడు చీనారాజుతో రాయబారము సలిపెను. కాన్స్టాంటినోపిలునుండి 'ప్రిస్కసు' అను రాయబారి హంగెరీమైదానములో డాన్యూబునదికి తూర్పున నున్న ఈతని ముఖ్యస్థానమునకువచ్చి చూచి అచ్చటి పరిస్థితులగూర్చి వ్రాసెను. వీరి జీవితపద్ధతి వీరికిపూర్వ మచ్చట నుండిన ఆదిమార్యులవలె నుండెను. సామాన్యజనులు గుడిసెలలోను డేరాలలోను, నాయకుల మందిరాంగణములందును వసించుచుండిరి; విందులు, మధుపానము, కవులగానములు జరుగుచుండెను. అప్పటి కాన్స్టాంటినోపిలు పాలకుడైన ఆర్కేడియసు పుత్రుడగు రెండవథియోడియసుయొక్క క్షీణించు నాగరికాస్థానముకన్న, ఈఅత్తిలుని రాజధానిలో సభాస్థలియే హోమరుకథానాయకులకు అలెగ్జాండరు అనుచరులకుగూడ ఎక్కువ రంజకము సజాతీయముగ నుండియుండును.

పూర్వము ఈజియను నాగరికస్థానమును అనాగరిక గ్రీకులాక్రమించినట్లే, మధ్యధరాప్రాంతపు గ్రీకు రోమను నాగరిక దేశములను అత్తిలుని నాయకత్వమున హూణులు ఇతర సంచారిజాతులు పూర్తిగా నాక్రమింతు రని వెనుకటిచరిత్రయే తిరిగి అంతకన్న నధికముగ జరుగు నని కొంతకాలము తోచకగియుండెను. కాని కొంతవరకు సంచారులైనను గ్రీకులు తరువాత గోపాలురై స్థిరవాసు లైరి. అట్లుగాక, హూణు లెల్లపుడును సంచారులుగనే యుండిరి. అందుచే వారెచ్చటను స్థిరులుకాక దోపిడిచేసి పోవుచుండిరి. అత్తిలుడు థియోడోసియసు సామ్రాజ్యమును కొన్నియేండ్లు యథేచ్ఛగ పీడించుచుండెను.

అత్తిలుని సేనలు కాన్స్టాంటినోపిలు ప్రాకారమువరకున్న దేశ మంతటను లూటీచేసి ధ్వంసము చేసెను. బాల్కనుద్వీపకల్ప మందలి 70 పురముల నీతడు నశింపజేసె నని, తియొడోసియస్ రాజతనికి కప్ప మనుపేర లంచము నిచ్చుకొని ఆవలకు పంపివేసె నని, అతని నెట్లైన ఖూనీచేయింప గూఢచారుల పంపె నని * గిబ్బను చెప్పియున్నాడు. 451 లో అత్తిలుడు తనదృష్టిని రోమనుసామ్రాజ్యపు లాటిను (పశ్చిమ) ప్రాంతములవైపు మరల్చి, గాలుపై దండెత్తి ఉత్తరగాలులోని ప్రతిపురమును దోచెను. రోమకసామ్రాజ్యసేనలును, ఫ్రాంకులు, విసిగాత్తులు నేకమై అతని నెదిర్చి ఒక తుములయుద్ధమున ట్రాయిసుయొద్ద నతని నోడించిరి; అందు ఒకటిన్నరలక్ష మూడున్నరలక్షలలోపు జనులు నిహతులైరి. అందుచే గాలునం దాటంకము కలిగెను. కాని పైసాలున నాతడు 'వెనీషియా' ద్వారా యిటలీలోనికి ప్రవేశించి, అందలి 'అక్విలియా' 'పాడువా' నగరముల దగ్ధము చేసి, మిలానుపురమును దోపిడిచేసెను. ఈ ఉత్తరయిటలీపుర ములనుండియు ముఖ్యముగా పాడువానగరమునుండియు భయ విహ్వలు లగుజను లనేకులు అడ్రియాటికుసముద్రపు ఉత్తర మున పెద్ద మడుగులలో నేర్పడిన లంకలకు బోయి, అచ్చట వసించిరి. అదియే క్రమముగా వృద్ధియై, 'వెనీస్ నగర'మను పేర బరగి, మధ్యకాలమందు సుప్రసిద్ధ వ్యాపారస్థల మయ్యెను.

---

* ఎడ్వర్డు గిబ్బను 18-వ శతాబ్దపు ఆంగ్లచారిత్రకుడు; రోమక రాజ్యపు అంత్యదశనుగూర్చి 'డిక్లైన్ అండ్ ఫాల్ ఆఫ్ ది రోమన్ ఎంపైర్'అను విపులగ్రంథము వ్రాసెను.

453 లో అత్తిలు ఢొకయువతిని పెండ్లియాడి, ఆ పెండ్లి విందు కాగానే చనిపోయెను. అతని చావుతో ఈ దోపిడి సామ్రాజ్యము ఛిన్నభిన్నమయ్యెను. హూణజాతి పేరంతటితో నశించెను; వారు చుట్టుప్రక్కల ఆర్యజాతులలో కలసిపోయిరి. కాని ఈహూణుల దండయాత్రచే పశ్చిమ రోమకసామ్రాజ్య మంతరించెను. అత్తిలుని యనంతరము,రోములోని వండాలులు మున్నగు జీతపుసేనలచే 20 ఏండ్లలో వరుసగా పదిమంది చక్రవర్తులు రాజ్యమునందుంచబడి పాలించిరి.

కార్తేజినుండి వండాలులువచ్చి, 455 లో రోమును పట్టుకొని దోపిడిచేసిరి. చివరకు 'రోములసు అగస్టసు' అను పెద్ద పేరుతో చక్రవర్తిపదము వహించిన యొక పన్నోనియాజాతీయుని 476 లో సంచారిసేనలనాయకు డగు ఒడోసరు తరిమివేసి, పశ్చిమప్రాంతమున నిక చక్రవర్తియే లే డని కాన్స్టాంటినోపిలు రాజాస్థానమునకు తెలియపఱచెను. ఈవిధముగ లాటిను రోమకసామ్రాజ్యము అప్రతిష్ఠతో అంతరించెను. 493 లో తియోడరికు అను గాత్తుజాతీయుడు రోమునకు రాజయ్యెను. పశ్చిమ మధ్యయూరపుదేశములందెల్లను ఈ సంచారినాయకులే ఆ కాలమున రాజులు ప్రభువులుగ నుండుచు నామమాత్రముగ చక్రవర్తికి సామంతులమనుచు యథార్థముగా సంపూర్ణాధికారులై యుండిరి. ఇట్టి స్వతంత్రులగు దండునాయకు లప్పుడు వందలకొలదిగ నుండిరి. గాలు స్పెయిను యిటలీ డాసియాదేశములలో లాటిను కొన్నిమార్పుల బొంది వాడుకలో నుండెను. కాని ఆంగ్లదేశమందును రైనునదికి తూర్పునను జర్మనుభాషా

కుటుంబములోని భాషలును, బొహీమియాలో 'జెక్' అను స్లావ్ భాషయు వాడుకభాష లయ్యెను. పెద్దమతగురువులును, కొందరు విద్యావంతులును లాటినులో వ్రాయుచు చదువుచు నుండిరి. ఎచటను భద్రత లేకుండెను. ఆస్తి బలవంతుని సొత్తగుచుండెను. కోటలనిర్మాణ మధికమయ్యెను. రస్తాలన్నియు జెడిపోయెను. ఆరవశతాబ్ద మారంభించునప్పటికి పశ్చిమప్రపంచ మంతయు కలహాపూరితమై అందు అజ్ఞానాంధకారము వ్యాపించియుండెను. అప్పటి క్రైస్తవబోధకులు పరివ్రాజకులును లేనిచో లాటినువిద్య పూర్తిగా నశించియుండును.

రోమకసామ్రాజ్య మెట్లు వృద్ధియయ్యెను? ఎందుచే నది తిరుగ నశించెను? పౌరత్వజ్ఞాన మీవృద్ధికి కారణము. ప్రజాతంత్రవృద్ధికాలమందు సామ్రాజ్యప్రాబల్య కాలమందుగూడ రోమకపౌరులమను జ్ఞానముగలిగి జనులు తమహక్కు బాధ్యతల గ్రహించి 'రోమకన్యాయ' మనుభవించుచు రోమునిమిత్తమై త్యాగము చేయుచుండిరి. రోమకరాజ్యము న్యాయము ఘనమైనది అను ప్రతిష్ఠ దాని కావలగూడ చాలవఱకు వ్యాపించియుండెను. ఐశ్వర్యము సామాన్యుల దాస్యస్థితి వృద్ధి అయిన కొలది అనగా ప్యూనికు యుద్ధముల కాలమునుండి క్రమముగా పౌరతసంఖ్య వ్యాపించెను. కాని పౌరత్వజ్ఞానము క్షీణించిపోయెను.

ఇంతకును రోమకసామ్రాజ్యము పురాతనపద్ధతిపై నిర్మింపబడినది. ఆపౌరులు వృద్ధియైనకొలది వారికి విద్యకాని పౌరత్వజ్ఞానము కాని కలిగింపబడలేదు. అధికారులు తీర్మానములజేయు

టలో పౌరులసహకార మపేక్షింపలేదు. జనులలో ఐకమత్యము గలుగుటకై విశేషముగ విద్యాలయస్థాపనగాని సహకారము కల్గింప వారిలో వార్తలను వ్యాపింపజేయుటకాని జరుగలేదు. మారియస్ సల్లాలకాలమునుండి సాహసికు లధికారప్రాప్తికై పోరాడిరి. కాని సామ్రాజ్యవిషయములందు ప్రజలను జ్ఞానవంతులజేసి వారి సలహాలను తీసుకొనఁ దలపరైరి. పౌరతోత్సాహము పోషణలేక నశించెను. ఈపౌరస్వత్వశక్తి పోవుట నప్పుడెవరును గమనింపలేదు. అన్నిసామ్రాజ్యములకు, జనసంస్థలకు, జనుల సానుభూతి అంగీకారము మూలాధారములు. రోమక సామ్రాజ్యముపైన జనసామాన్యపుసమ్మతి నశించెను. అందుచే నారాజ్య మస్తమించెను.

పశ్చిమ రోమకసామ్రాజ్యము 5-వ శతాబ్దమున నశించినను దానిప్రతిష్ఠను సంప్రదాయమును అందలి లాటినుభాషకమగు క్రైస్తవకాతలికు సంస్థవారు పూర్తిగా నుపయోగించుకొనిరి. ఈ మతసంస్థవారు ప్రజల కిష్టమై వారిమనస్సుల నాకర్షించి తమ గ్రంథములను మతబోధను వ్యాపింపజేసి ప్రచారకులద్వారా ఏకీభావము కల్గించిరి. కనుక ఆరాజ్యము నశించినను క్రైస్తవసంస్థ రోమనుచట్టములకన్నను బలీయమై నిలచియుండెను. క్రీ. త. 4, 5 శతాబ్దములందు సామ్రాజ్యము నశించుచుండ క్రైస్తవ మతము యూరపుఖండమంతటను వ్యాపించి ప్రబలమయ్యెను. అది తన విజేతలగు విదేశీయుల జయించెను. అత్తిలుడు రోముపై దాడిసలుపుట కుద్దేశించినపుడు కేవల నైతికబలముతో నాతని

యుద్దేశమును మార్చివైచి,రోమునగరపు మఠాధిపుడగు 'పోపు' అత్తిలుని నిరోధించి, సేనలు చేయజాలనిపనిని తాను చేసెను. 'పోపు' క్రైస్తవమత సంస్థ కంతటి కధ్యక్షుడ ననెను. చక్రవర్తులు పోయినందున వారి బిరుదములను హక్కులను తానే గ్రహింప నారంభించెను. రోమకరాజ్యపు ముఖ్యయజ్ఞగురుచిహ్నమును రోమనుచక్రవర్తుల బిరుదములన్నిటిలో నతిప్రాచీనమగు'పాంటిఫెక్సుమాక్సిమసు' (=ముఖ్యాచార్యుడు) అను బిరుదముగూడ అతడు వహించెను.

---

# 41. బైజంటైను సస్సనిడు సామ్రాజ్యములు

రోమకసామ్రాజ్యమున గ్రీకుభాషకమగు పూర్వార్ధమున రాజకీయశక్తి యధికముగ నుండెను. లాటినుభాగమువలె గాక, అది క్రీస్తుతరువాత 5-వ శతాబ్దమున పరులదాడికి నిలువగల్గెను. అత్తిలుడు రెండవ 'తియొడోసియసు' రాజును బెదరించి కాన్స్టాంటినోపిలుప్రాకారమును ముట్టడించినను ఆ నగరమాధాటి నెదుర్కొని నిల్చెను. 'న్యూబియను' లను ఆఫ్రికను తెగవారు నైలునది పైభాగపు దక్షిణయీజిప్టును దోపిడిచేసిరి. కాని ఉత్తర-ఈజిప్టును అలెగ్జాండ్రియాయు భంగములేక వృద్ధిలోనే యుండెను. 'సస్సనిడ్' పారసీకులధాటికి ఆసియామైనరులో చాలభాగముకూడ నిలువగలిగెను.

6-వ శతాబ్దమున పశ్చిమప్రాంత మంధకారమయమై యుండ, గ్రీకుభాగమునమాత్ర మభివృద్ధియే కల్గెను. అచ్చట వీరుడు ఉదారుడు అగు మొదటి జస్టీనియనుచక్రవర్తి (527-565) పూర్వము నటియై ప్రతిభావతియైన 'తియోడోరా' రాణిని వివాహమాడెను. ఆయన వండాలులనుండి ఉత్తరాఫ్రికాను, గాత్తులనుండి చాలవఱకు ఇటలీని దక్షిణస్పెయినును గూడ తిరుగ జయించెను. ఆయన భౌతికబలముతోనే తృప్తి నొందక ఒకవిశ్వవిద్యాలయమును కాన్స్టాంటినోపిలులో గొప్ప చర్చిని స్థాపించెను. రోమకన్యాయశాస్త్రపు చట్టముల నేర్పర్చెను.

కాని తన విశ్వవిద్యాలయమునకు పోటీ లేకుండుటకై ప్లాటో కాలమునుండి వేయేండ్లుగా జరుగుచుండిన ఆథెన్సునందలి తత్వశాస్త్రవిద్యాలయమును కట్టిపెట్టెను.

ఈ బైజంటైనురాజ్యమునకు 3-వ శతాబ్దమునుండియు పారసీకరాజ్యముతో పొడుగునను పోటీగా నుండెను. ఈ రెంటి పోటీవలన ఆసియామైనరు సిరియా ఈజిప్టులు ఎల్లప్పుడును అశాంతి వినాశములపాలగుచుండెను. క్రీ. త. మొదటిశతాబ్దమున ఈదేశములు నాగరికములై, ఐశ్వర్యము జనసమృద్ధి కలిగియుండెను. కాని నిరంతరము సేనల రాకపోకలు, జననాశము, దోపిడి, యుద్ధపుపన్నులు వీటివలన క్రమముగా జనపదములు నగరములు క్షీణించి, జనులు చెదిరిపోయిరి; శిథిలములు మాత్రము మిగిలెను. ఈదీనావస్థలో మిగిలిన ప్రాంతములకన్న ఈజిప్టు కొంత మెరుగుగ నుండెను. కాన్స్టాంటినోపిలువలె నలెగ్జాండ్రియాయు తగ్గుచున్నను, అది పూర్వపశ్చిమదేశముల మధ్య వ్యాపారకేంద్రముగనే యుండెను.

సమరసంకులములై క్షోభించుచున్న ఈ రెండుసామ్రాజ్యములందును ఆకాలమున పదార్థవిజ్ఞానము రాజకీయవిజ్ఞానము నశించియుండెను. ఆథెన్సులో చివరనుండిన తత్వజ్ఞులు తమ్ముగూడ చక్రవర్తి అణచివేయువరకును, తమకు బోధపడకున్నను తమ ప్రాచీనవాఙ్మయము నతిభక్తితో అంతవరకు భద్రముగా కాపాడుచుండిరి. ఈగ్రంథములను స్వేచ్ఛాధైర్యములతో చర్చించి వ్యాసంగము చేయుమహనీయు లెవ్వరును ఆకాలమున లేకుండిరి. అందుకు సాంఘిక రాజకీయవ్యాకులత ముఖ్యకారణము. అప్పటి ఈ సామ్రాజ్యాధిపు లుభయులును

తమ తమ మతముకే ప్రాముఖ్యమిచ్చి, సహాసబుద్ధిలేక, నరుల స్వతంత్రబుద్ధి నరికట్టిరి; అది యప్పటి జనులబుద్ధిని మందము చేసెను.

ప్రపంచమందలి అతిప్రాచీనసామ్రాజ్యములకు, ఏదో ప్రాంతీయదేవతనో దేవసముడుగా భావించురాజునో పూజించు మత మాధారమైయుండెను. గ్రీకులలెగ్జాండరు దేవుడని భావించిరి. సీజరులకుగూడ దేవాలయములు యజ్ఞవేదికలు నేర్పడి, వారు ఈశ్వరసములుగ భావింపబడిరి; రోమకరాజ్యమున సీజరులకు హారతి నీయనివారిని రాజద్రోహులుగ నెంచిరి. ఆప్రాచీన మతములన్నియు కర్మకాండకు సంబంధించినవే; అందు మనో భావప్రసక్తిలేదు. ఎవడైన నప్పటిపద్ధతిని బలుల నిచ్చి, ఆ విగ్రహముకు మ్రొక్కిన చాలు; ఇక నావిషయములగూర్చి అత డేమితలచినను, తనకు తోచినట్లెల్ల జెప్పినను బాధలేకుండెను. కాని నూతనమతములు, అందు ముఖ్యముగ క్రైస్తవమతము, అంతరంగసంబంధులు. ఆమతస్థులగుట కీచర్యలజేయుటేగాక, ఆ సిద్ధాంతముల గ్రహించి వాటిని విశ్వసింపవలెను; ఏసంగతుల నమ్మవలెనని సహజముగ తీవ్రచర్చ యారంభించెను. ఈసిద్ధాంత మతముల క్రొత్తపదముల యర్థము జనులకు తెలియవలెను. ఆచారములందుగూడ మతస్థుల నాయుపదేశముల హద్దులో నుంచుటకు సనాతనవాదు లుదయించిరి. అయుక్తమతభావు లగుట, అందు ముఖ్యముగ నట్టిభావముల నితరులకు బోధించుట బుద్ధిలోపమేగాక నైతికదోష మని, అందుచే నట్టివారు భ్రష్టులగుదు రని అప్పటివారి నమ్మిక.

క్రీ. శ. 3-వ శతాబ్దిని పారసీకమున 'సస్సనిడు' రాజవంశమును స్థాపించిన మొదటి అర్దేషరు, 4-వ శతాబ్దమున రోమకసామ్రాజ్యము నుద్ధరించిన కాన్స్టైంటైనుగూడ ప్రజల వశముచేసికొనుటకు మతసంస్థ లుపయోగించు నని తలచి మతసంస్థల సహాయమును గ్రహించిరి. 4-వ శతాబ్దము ముగియులోగానే అధికారులు వాక్స్వాతంత్ర్యమును మతస్వేచ్ఛను పోగొట్టదొడగిరి. ప్రాచీనపారసీకమున ఒకమతమును జరాతుస్త్రుడను జొరాస్టరు స్థాపించెను. ఇందు యజ్ఞవేదికపై పవిత్రనిత్యాగ్ని ఉపాసనజేయు నాచారము దేవాలయపద్ధతియు గలవు. పారసీకరాజీ మతమును తనయుద్దేశమునకై ప్రభుత్వమతముగ జేసికొనెను. 3-వ శతాబ్దము పూర్తికాకమునుపే జొరాస్టరు మతస్థులు క్రైస్తవుల బాధింప నారంభించిరి.

'మనీషి' యను నూతనమతము స్థాపించిన 'మణి' అనునతడు 277 లో కొరతవేయబడి, ఆయన చర్మ మొలిచివేయబడెను. ఇట్లే కాన్స్టాంటినోపిలు క్రైస్తవరాజ్యాధికారులు మనీషను మున్నగు అన్యమతస్థులపై తీవ్రచర్యల నవలంబించిరి. క్రైస్తవభావములు జొరాస్టరుమతమందు సాంకర్యము గల్గించెను. నూతనభావములం దనుమానము గల్గెను. విజ్ఞానాభివృద్ధికి వలయు స్వాతంత్ర్యాలోచనము స్వేచ్ఛాయుతపరిశోధనయు లేకుండెను. ఇట్లు విజ్ఞానము పూర్తిగా క్షీణించెను.

ఆకాలపు బైజంటైనురాజ్యమున యుద్ధము, క్రూర మతచర్యలు, నరజాతికుండు మామూలు దురభ్యాసములు వ్యాపించియుండెను. పైకి బాగుగ గన్పించినను ఆ జీవితమున నిజముగు ఆనందము జ్ఞానతేజము లేకుండెను. బిజాంటియం పారసీకములు

పరస్పరమును, ఉత్తర ప్రాంతపు సంచారిజాతులతోను పోరు చుండిరి. అది లేనప్పుడు వా రాసియామైనరులలోను సిరియాలోను దండయాత్ర జేసి ఘోరరక్తపాతముతో ఆదేశముల ధ్వంసముచేసిరి. ఈ యుద్ధరుచక్రవర్తులును తమపై బడు ఉత్తర సంచారిజాతులపై కేకీభవింపరైరి. అందుచే వారు తమ ఐశ్వర్యము నిలుపుకొన్నరైరి. తార్తారులను నామాంతరముగల తురుష్కులీరెంటిలో నొకసారి యొకరాజ్యముకు, తరువాత రెండవరాజ్యముకు యుద్ధసహాయము జేసిరి. వారిట్లు మొదటి సారి చరిత్రములోనికి వచ్చిరి. 6-వ శతాబ్దమున బిజాంటియం రాజ్యపు 'జస్టీనియను'ను పారసీకపు మొదట 'కొస్రోసు'ను ముఖ్యముగ డీకొనిరి. 7-వ శతాబ్దపు మొదట హెరాక్లియసు చక్రవర్తికి రెండవ కొస్రోసుకు (580) పోటీగా నుండెను.

హెరాక్లియసు 610 లో చక్రవర్తి యయ్యెను. అంత వరకు రెండవ కొస్రోసే అంతటను జయమొంది సర్వాధికారియై ఏంటియక్ డెమస్కస్ జెరూసలెంనగరముల బట్టుకొనెను. అతని సేనలు కాన్స్టాంటినోపిలు సమీపపు ఆసియామైనరులోని చాల్సిడను పురమువరకు వచ్చెను. 619లో నాతడీజిప్టునుగూడ జయించెను. అంతట హెరాక్లియసు ఎదురుదాడి నారంభించి (ఆ పారసీకసేన యింకను చాల్సిడనులోనే ఉండ) నినేవానగరము నొద్ద నింకొక పారసీకసేనను 627 లో నోడించెను. 628 లో కొస్రోసు రాజ్యభ్రష్టుడై తన కుమారుడగు కవధ్ చే చంపబడెను. అంతట నిర్వీర్యములైన ఈ రెంటిమధ్య నొక సందిగ్ధసంధి జరిగెను. బిజాంటియం పర్షియా లిట్లు తమయంత్యయుద్ధ మొనర్చిరి. ఈలోగా ఒక జంఝూమారుత మప్పటికే ప్రక్కనున్న యెడా

రులలోనికి ప్రసరించి ఈనిరర్థకదీర్ఘసమర మంతమొందించ నుండెను. ఆ సంగతి నింకను ఆదేశీయులు గ్రహింపరైరి.

హెరాక్లియసు సిరియాలో శాంతిని సమకూర్చుచుండ, తన సామ్రాజ్యపు సరిహద్దున తన యుద్యోగు లుండు 'డమస్కసు'కు దక్షిణపురమగు 'బోస్త్రా' కొకసందేశము వచ్చెను. ఆ వార్త యెడారిలోని సెమిటికుశాఖయగు 'అరబిక్ భాష'లో నుండెను. ఆవార్త నొకద్విభాషి చక్రవర్తికి వినిపించెను. అది దేవుని ప్రవక్తయగు 'మహమ్మదు' నుండి వచ్చెను. యథార్థ రూపుడగు ఏకేశ్వరు నంగీకరించి సేవింపవలె నని యాసందేశము తెలియజేసెను. ఆ చక్రవర్తి యేమిజబాబు చెప్పెనో తెలియదు. 'టెసిఫన్ నగరము'న కవధ్ చక్రవర్తికిని అట్టివార్తయే వచ్చెను. అతడు చిరాకుతో ఆయుత్తరమును చింపివేసి, ఆచారుని పొమ్మని యాజ్ఞాపించెను.

ఈ మహమ్మదు అరేబియాయెడారిలోని 'బెడోయిను' జాతి నాయకుడు; వారి ముఖ్యస్థానము మదీనా అను చిన్న పురము. నిజమైన యేకేశ్వరునే విశ్వసింపవలె నని అతడు బోధించుచుండెను.

"ఓ ఈశ్వరుడా! ఆరీతినే, కవధ్ నుండి అతనిరాజ్యము చీల్చివేయుము." అని ఆయన పల్కెను.



# 42. చీనాలో సై, టాంగ్ వంశములు

5, 6, 7, 8-వ శతాబ్దులంతటను మంగోలియనులు క్రమముగా పశ్చిమమునకు రాజొచ్చిరి. అత్తిలుని హూణు లందుకు మార్గదర్శకులైరి. తుదకు మంగోలియనులు ఫిన్లండు ఎస్తోనియా హాంగరీలలో స్థిరవసతుల నేర్పరచుకొనిరి. ఈనాటికికూడ ఆ వంశీయు లచ్చట తుర్కీకి సన్నిహితమగు భాషల మాట్లాడుచున్నారు. బల్గేరియనులుకూడ తురుష్కజాతివారైనను, ఆర్య భాష నవలంబించిరి. అప్పటి కనేక శతాబ్దముల క్రింద ఈజియను సెమిటికు నాగరికతలపట్ల ఆర్యులవలెనే, యూరపు పర్షియా హిందూదేశముల ఆర్యనాగరికతపట్ల మంగోలియనులు వర్తింపదొడగిరి.

మధ్యఆసియాలోను, ప్రస్తుత పశ్చిమతుర్కీస్థానములోను తురుష్కులు స్థిరపడిరి. పర్షియారా జప్పటికే తురుష్కుల నుద్యోగులుగను సైనికులుగలును నియమించెను. పార్థియనులు పర్షియాప్రజలలో మిళితులై, చరిత్రలో పేరులేకుండ బోయిరి. మధ్యఆసియాలో ఆర్యులదాడి పోయి, ఆస్థానమును మంగోలులాక్రమించిరి. చీనామొదలు కాస్పియనుసముద్రమువరకు ఆసియాకంతకు తురుష్కులే అధికారులైరి.

క్రీ. శ. 2-వ శతాబ్దిచివర రోమకసామ్రాజ్యము ధ్వంస మొనరించిన మహామారియే చీనాలో హాన్‌వంశమునుకూడ కూలద్రోసెను. తరువాత నంతఃకలహములు హూణులదాడియు కల్గెను; అంతట యూరపుకన్న ముందుగా చీనా తలయెత్తి,

6-వ శతాబ్దములోగనే 'సై'వంశీయుల క్రింద నేకమై, పెూరాక్షి యసు కాలము తరువాత 'టాంగ్ వంశీయు'ల క్రింద విశేషాభి వృద్ధి నొందెను.

7, 8, 9 శతాబ్దములందు ప్రపంచములోనెల్ల చీనాయే మిక్కిలి శాంతమై, నాగరికముగ నుండెను. హాౕవంశీయులు తమ సరిహద్దుల నుత్తరదిశకును, సై, టాంగ్ వంశరాజులు దక్షిణముకును, వ్యాపింపజేసిరి. చీనారాజ్య మప్పుడు నేటి విస్తీర్ణతనొంది, మధ్యఆసియాలో నింకను వ్యాపించి తుదకు స్వశాఖీయులగు తురుష్కజాతులద్వారా పర్షియా కాస్పియను సముద్రములవరకు విస్తరించెను.

హూణుల ప్రాచీనచీనాకును, సై టాంగుల నూతన చీనాకును చాలభేద ముండెను; చక్కని నూతనవాఙ్మయము, కావ్యరచన కలిగెను. బౌద్ధమతము వచ్చి, ఆధ్యాత్మిక తత్వ విషయములందు విశేషవృద్ధి గలిగించెను. కళాకౌశలమందును, వృత్తివిద్యలందును, జీవితపు యితరాంశములన్నిటిలోగూడ చాలఅభివృద్ధి కలిగెను. తేయాకు వాడుక, కాగితములు తయారుచేయుట, కఱ్ఱదిమ్మలతో అచ్చువేయుట ఆరంభించెను. యూరపు పశ్చిమఆసియాలలోని ప్రజలు గుహాలలోనో గుడి సెలలోనో చుట్టుగోడలుగల చిన్నపురములలోనో బందిపోటు నాయకులలోనో వసించు ఆకాలమున కోట్లకొలదిచైనులు శాంతులై, గౌరవదాక్షిణ్యములు గలిగి సుఖించుచుండిరి. అప్పుడు పాశ్చాత్యుల మనస్సులన్నియు మతకలహములతో అంధీభూతమై యుండ చీనాలో సహనము, జ్ఞానకాంక్ష, ఔదార్యము పెరుగుచుండెను.

హెరాక్లియసు నినెవావద్ద జయమొందిన 627 లో చీనాలో టాంగ్ వంశీయుడగు తైత్సంగ్ చక్రవర్తియయ్యెను. హెరాక్లియసు పర్షియా కావలిప్రక్కను మిత్రులకై యత్నించి తనకు రాయబారుల పంపెను. తైత్సంగు వారల గ్రహించెను. అతడు పర్షియానుండి 635 లో వచ్చిన క్రైస్తవప్రచారకులను తమమతమును వివరింపనిచ్చి, వారి మతగ్రంథముల చీనా తర్జుమా నాతడు పరిశీలించెను. ఈవిచిత్రమత ముచిత మని చెప్పి ఒక క్రైస్తవదేవాలయమును మఠమును నిర్మించుట కనుజ్ఞ నిచ్చెను.

మహమ్మదురాయబారులు 628 లో ఒక వర్తకనౌకపై హిందూదేశతీరమువెంట సముద్రముపై దక్షిణచీనాలోని కాంటను చేరి, ఈరాజునొద్దకేగి వచ్చిరి. హెరాక్లియసు కవధుల వలెగాక, తైత్సంగు ఆరాయబారుల గౌరవించి, వారి మతాభిప్రాయములం దాసక్తి వెల్లడించి, కాంటనులో మసీదునిర్మాణము కంగీకరించెను. ప్రపంచమం దిప్పుడున్న మసీదులన్నిటిలో నిదియే అతిప్రాచీన మందురు.

# 43. మహమ్మదు – ఇస్లాము

7-వ శతాబ్దాదినాటి ప్రపంచస్థితిని గమనించువారు ఆసియా యూరపుదేశము లంతటను కొద్దిశతాబ్దములలో మంగోలుజాతివారే అధికారులగుదురని తలచియుందురు. పశ్చిమ యూరపులో శాంతసంక్షోభావముల సూచనలు లేవు. బైజంటైను పర్షియనుసామ్రాజ్యము లొండొరుల నాశమునకు సమకట్టెను. హిందూదేశమునుఅంతఃకలహములతో క్షీణదశకువచ్చెను. చీనా సామ్రాజ్యముమాత్రము క్రమాభివృద్ధిచెందుచు, జనసంఖ్యలో అప్పటి యూరపును మించెను. మధ్యఆసియాలో తురుష్కులు బలియులై, చీనాకు సహకారులై యుండిరి. అట్టిజోస్యము కేవలము నిరాధారముకాదు. 13-వ శతాబ్దమున మంగోలియను రాజొకడు డాన్యూబునదిమొదలు పసిఫిక్ సముద్రమువరకు జయింప, బైజంటైను పర్షియనుసామ్రాజ్యములను ఈజిప్టును హిందూదేశములో విశేషభాగమును తురుష్కవంశీయులు పాలింపనుండిరి.

యూరపులోని లాటినుల పునరుత్థానబలమును అరేబియాయెడారివారి అంతశ్శక్తినిమాత్రము అతడు సరిగా గమనించియుండడు. అరేబియాలో వెనుకటివలె కలహప్రియులగు చిన్నసంచారిజాతు లక్కడ ఉండు నని తోచవచ్చును. అప్పటికి వేయేండ్లలోగా సెమిటికువా రెవరును రాజ్యము స్థాపింపలేదు.

అప్పుడు హఠాత్తుగా (అరేబియాలోని) బెడోయినులొక శతాబ్దము విభవమొందిరి; తమరాజ్యమును భాషను

స్పెయినునుండి చీనాసరిహద్దువరకు వ్యాపింపజేసిరి. ప్రపంచమున కొకనూతననాగరికత నొసంగిరి. వారు స్థాపించిన మతము నేటి ముఖ్యమతములలో నొకటి; ఆరబుజ్యోతి నిట్లు వెలిగించినది మహమ్మదు; మెక్కాలో నొకధనికవర్తకుడు మరణింప, ఆతని భార్యను మహమ్మదు పెండ్లాడెను; 40 ఏండ్లవరకతడు విశేష చర్య యేమియు చేయలేదు; మతచర్చలం దాసక్తుడై యుండెను; అప్పటికి మెక్కాకు క్రైస్తవసంపర్కము లేదు; అరేబియా అంతటినుండి మెక్కాలో 'కాబా' అను నొకనల్లశిలపూజకై యాత్రికులు వచ్చుచుండిరి.

అంతకు 1200 ఏండ్లపూర్వపు హీబ్రూప్రవక్తలవలె మహమ్మదుకు 40-వ యేట ప్రవక్తలక్షణము లారంభించెను. అతడు నిజమగుదేవు డొకడే యనెను; ధర్మాధర్మఫలములను గురించి మొదట తనభార్యకు బోధించెను. యూదక్రైస్తవభావము లతనిసిద్ధాంతములోనికి జొచ్చెను. కొందఱు విశ్వాసవంతుల జేర్చుకొని, ఆనగరమున ప్రబలియున్న మూర్తిపూజకు వ్యతిరేకముగ బోధింపదొడగెను. అప్పటి మెక్కాఐశ్వర్యమునకు కాబాపూజకై వచ్చువారియాత్రలే మూలాధారము; తోటి పౌరులందరకు అతడు విరోధి ఆయెను. తాను మతోద్ధరణకీశ్వరు డేర్పరచిన తుదిప్రవక్తనని, అబ్రహాం ఏసుక్రీస్తులు తనకు పూర్వీకు లని, ఈశ్వరేచ్ఛ నెఱవేర్చి పూర్తిచేయ నియమితుడ నని, అతడు క్రమముగ ధైర్యముతో ప్రకటించెను.

దేవదూత పంపిన వని అతడు కొన్నిపద్యముల బ్రకటించెను; అతని కొకవిచిత్రదృష్టికలిగి, అందు తాను స్వర్గమున దేవ

సాన్నిధ్యమునకు గొనిపోబడి తన విధియంతయు బోధింపబడిన ట్లయ్యెను.

అతనిబోధనలు వ్యాపించెను; ఆపౌరుల ద్వేషమును వృద్ధియయ్యెను. తుద కతని తుదముట్టింప కుట్ర జరిగెను. కాని తనశిష్యుడు ప్రియమిత్రుడగు అబూబెకరుతోగూడ తప్పించుకొని, మహామ్మదు తనసిద్ధాంతము లంగీకరించిన మదీనాపురము చేరెను. మెక్కా_మదీనాలకు వైరము పొసగి, చివరకు మెక్కా వారు నిజమగు 'ఏకేశ్వరుని' పూజించుచు, మహామ్మదును ప్రవక్తగా నంగీకరించునట్లును, ఈనూతనమతస్థులును మామూలుగ మెక్కా_యాత్ర చేయుచునేయుండుటకును రాజీ జరిగెను. అందుచే మెక్కా_యాత్రయు నిల్చెను; నిజమగు ఏకేశ్వరమతమును స్థాపింపబడెను. హెరాక్క్యులస్, ఖైత్సంగ్, కవధ్ మొదలగు రాజులందరికి తనశిష్యులనుబంపిన యేడాదికి అనగా 629 లో మమహామ్మదు అధికారిగ్నై మెక్కా చేరెను.

632 లో నతడు మరణించెను; అంతవర కాయన ప్రతిభ అరేబియా యంతటను వ్యాపించెను. తన తుదియేండ్లలో అతడనేకభార్యల వివాహమాడెను. ఆధునిక ప్రమాణామునుబట్టి అతనిజీవిత మాదర్శప్రాయము కాదు; అతనికి గర్వము ద్రవ్యాశ జిత్తులు ఆత్మవంచన మతాభినివేశమునుండినట్లు కన్పట్టును. తనకు దేవుడు బోధించినట్లు చెప్పినవిధులను వివరణాలను 'కొరాన్' గ్రంథమున వెలువరించెను. ఆధ్యాత్మికముగగాని వాఙ్మయరూపముగగాని అది దేవదత్త మనదగి యుండలేదు.

మహామ్మదు జీవితములోను గ్రంథములలోను కొన్ని దోషము లున్నను, ఆయనబోధించిన ఇస్లాముమతమందు గొప్ప

జీవశక్తులు గలవు. నిశ్శంకమగు ఏకేశ్వరతత్వసిద్ధాంతము, దేవుడే తండ్రి పాలకుడు అను దృఢవిశ్వాసము, ఈరెండును సుబోధములై, శాస్త్రీయక్లిష్టత లేకుండెను. అదే ఈమతపు ముఖ్యవిశేషము. యజ్ఞబలులు కర్మకాండ దేవాలయముల సంపర్కము దీనికి లేదు. జంతుబలి మరల రాకుండ నాప్రవక్త బోధించెను; 'కొరాను'లో మెక్కాయాత్ర తాలూకు కర్మకాండను క్లుప్తము చేసి స్పష్టపఱచెను. తనయనంతరము తన్ను దేవునిగా భావింపకుండ మహమ్మదు తగు కట్టుబాట్లన్నియు జేసెను. 'జాతి, వర్ణ, జననస్థితు లెట్లున్నను ఇస్లాంమతస్థులందరు సోదరులు, దేవుని యెదుట సమానులు, అను ఇస్లాము సిద్ధాంతమును ముఖ్యమైనదే.

ఇవే ఇస్లామును ప్రపంచమున గొప్ప జీవశక్తిగా జేసినవి. ఇస్లాముబలముకు మహమ్మదుకన్న అతని మిత్రుడు సహాయకుఁడు ఐన అబూబెకరే ముఖ్యకారకు డందురు.

ఆవేశపరుడగు మహమ్మదు ఇస్లాముకు భావోద్రేకము గల్గించెను. కాని 'అబూబెకరు' దానికి స్థైర్య యోగ్యతలు తెచ్చెను. మహమ్మదు చలించినపుడెల్ల అబూబెకరతని గాపాడెను. మహమ్మదు చనిపోయినపుడు, అబూబెకరు ఖలీఫా అయి మహమ్మదు వేర్వేరురాజులకు వ్రాసిన లేఖల ప్రకారము కొండలగూడ జలింపజేయు నమ్మికతో లోకమందు 'అల్లా' సేవకులుగ మార్చుటకు మూడు నాలుగువేలు అరబ్బీసైనికులతో సంసిద్ధుడాయెను.*

---

* మహమ్మదీయమతమునే ఇస్లాము అనియు, మహమ్మదీయులనే ముస్లీము లనియు ముసల్మాను లనియు అందురు. మహమ్మదుకు వ్యక్తిగా గర్వ

ద్రవ్యాశ ఆత్మవంచనాదు లుండె నని ఈ యధ్యాయమున వెల్సుగారు దెల్పిన అభిప్రాయ ముచితముగా దోపదు. ఆధునిక ప్రమాణమునుబట్టి, ఇతర ప్రవక్తల మాట యటుండ, హిందూ క్రైస్తవాదిమతగ్రంథములందు వర్ణింపబడిన అవతార పురుషులజీవితవృత్తాంతముగూడ ఆదర్శరూపము లనుటకు వీలు లేదు. వాటి యందును లోపముల నెన్నవచ్చును. ఇతర ప్రవక్తలవిషయములు ఆయాప్రాంతముల పరిస్థితులబట్టి సమన్వయించుకొనునట్లే, మహమ్మదు ప్రవర్తన నెంచునప్పుడును, అప్పటి అరబువాతావరణమును వారి సాంఘికస్థితిని మనము మరువగూడదు. అప్పటి అరబ్బులలోని తీవ్రదురాచారములను అజ్ఞానము మహమ్మదు తొలగించి, అమతస్థులలో సర్వసమత్వమును అసమానమగు సౌభ్రాత్రమును ఐకమత్యము కలిగించెను. అప్పటి కనామకులుం మూఢులునైయుండిన బెడోయిను లాయనవలన కొలదికాలమున జగద్విఖ్యాతులై విద్యావంతులైరి ఇతరప్రవక్తలవలెగాక తాను ఈశ్వరావతార మను భావమును, జంతుబలులు మొదలగు కొన్నిదురాచారములును, తరువాత తరములవారికిగూడ కలుగకుండ నియమ మేర్పఱచు ఔదార్యము దూరదృష్టి గల మహాశయుడు 'గర్వి' 'ఆత్మవంచకుడు' అనుట సత్యము కాదు; కొరానులోను చక్కని నీతులు చాల గలవు ఏకేశ్వరత్వము బోధించుటేగాక అమతస్థులలో నత దంతర్విభేదములు తొలగించి, దేవునియెదుట అమతస్థులలో సర్వసమత్వము బోధించుటచే, మహమ్మదీయులలో నిప్పటికిని ఐకమత్యము చాల నధికమై యున్నది. ఈ విషయమునను, నిత్యము ఈశ్వరోపాసనపద్ధతియందును, అనేక వర్ణవ్యత్యాసములతోను అస్పృశ్యతాదోషములతోను విభిన్నభావులై యున్నమన సనాతనహిందువులమైనమనము మహమ్మదీయులనుండి చాల విషయములు నేర్చవలసియున్నది. మసీదులలోను సాంఘికసమావేశములలోను కులమునుబట్టి వ్యక్తిఘనతనుబట్టి విభేదములను ముస్లిములు పాటింపరు. మనలో నట్టి సమావేశములలో అనేకవిభేదము లుండుటయేగాక, జన్మలోపముచే నొకజాతిని సంపూర్ణముగ బహిష్కరించు ఆచారముగూడ ఉండినది.

# 44. అరబ్బుల స్వర్ణయుగము

అంతట మహమ్మదీయు లారంభించిన దండయాత్ర నర జాతిచరిత్రయం దత్యద్భుతము. 634 లో వారు 'యార్మక్ యుద్ధము'లో 'బైజంటైను' సేనల నిర్మూలించిరి. ఉబ్బు జబ్బుచే శక్తులుడిగి పర్షియాయుద్ధమున బలహీనులైన, హెరాక్లియసు సామ్రాజ్యపు సిరియా, డెమస్కస్, పాల్మైరా, ఆంటియక్ జెరూసలెం మొదలైన ప్రదేశములన్నియు నిరాతంకముగ వరుసగా మహమ్మదీయులకు లొంగిపోయెను. అచటి ప్రజలలో చాలమంది ముస్లిము లైరి. అంతట మహమ్మదీయులు తూర్పుకు తిరిగిరి. పర్షియనులు తమ విఖ్యాతసేనానియగు 'రుస్తుమ్' నాయకత్వమున గొప్ప గజబలములతో మూడుదినము లరబ్బులతో 'కడెస్సియా'యొద్ద 637లో ఘోరముగపోరి,తుదకోడిపోయిరి.

వెంటనే పర్షియాయంతయు వశమై మహమ్మదీయ సామ్రాజ్యము పశ్చిమ తుర్కిస్థానములో చాలవరకును, తూర్పున చీనాసరిహద్దువరకును వ్యాపించెను. *ఈజిప్టుకూడ

---

* ఆసమయమున ముసల్మానుమతములో జేరుట కిష్టపడక కొందరు పారసీకులు స్వదేశము విడిచి, నౌకలపైవచ్చి మనభారతదేశపు సూరతు చుట్టుపట్ల నివాస మేర్పరచుకొనిరి. అప్పటినుండి వారు భారతీయులుగనే ఉన్నారు. వారి సంతతివారు నేటివరకు ప్రత్యేకజాతిగ నుండుచు, జొరాస్టరుమతమును ఎట్టి ప్రతిబంధకములేక కాపాడుకొనుచున్నారు. వారే పార్సీలు. వారి అసమాన వ్యాపారసామర్థ్యము దాతృత్వబుద్ధి అతి శ్లాఘ్యములు. వారిమూలస్థలము నవసారిగ్రామము. చాలమంది పార్సీలు బొంబాయినగరమం దుందురు. దాని వ్యాపారాభివృద్ధికి ఐశ్వర్యమునకు కొంతవరకాపార్సీలే కారకులు.


ఏండ్లలో ముస్లిముల వ్యాప్తి

మొత్తముమీాద సులభముగనే లోబడెను. అంతయు కొరాను లోనే కలదను మూర్ఖతతో అచటి అలెగ్జాండ్రియా గ్రంథాలయమున నకళ్ల వ్రాతపనిని అరబ్బులు నశింపజేసిరి. ఈ జైత్రయాత్ర, ఆఫ్రికా ఉత్తరతీరమువెంట, జిబ్రాల్టరు జలసంధి స్పెయినువరకు వ్యాపించెను. వారు, 710 లో స్పెయినుపై దాడివెడలిరి. 720 లో ఫ్రాంసుకు దక్షిణమగు పిరనీసుకొండల వరకు చేరిరి. 732 లో ఫ్రెంచిదేశము మధ్యవరకు వచ్చి 'పోయిటీర్సు యుద్ధము'న ఆపుచేయబడి, తిరిగి పిరనీస్‌వరకు నెట్టివేయబడిరి. ఈజిప్టును జయించి, మహమ్మదీయులు నౌకాబలము నొందిరి. వారు కాన్‌స్టాంటినోపిలును కూడ జయింతురన్నట్లుచూపట్టెను. వారు 672 మొదలు 718 వరకు చాలసార్లు సముద్రమునైపునుండి ముట్టడించిరి. కాని ఆ మహానగరమప్పుడు లోబడలేదు.

అరబ్బులకు రాజకీయానుభవము రాజ్యాంగతంత్రమందాసక్తి తక్కువగుటచే స్పెయినుమొదలు చీనావరకు వ్యాపించి డెమస్కసు కేంద్రమై యుండిన ఈ మహాసామ్రాజ్యము త్వరలోనే కూలిపోయెను. మొదటినుండియు సిద్ధాంతభేదముచే వారిలో ఐక్యము చెడెను. రాజకీయచరిత్రగా గాక, మానవహృదయములకు నవజాతభావివశకు అందుచే గల్గిన మార్పే మనకు ముఖ్యము. వేయేండ్ల క్రిందట గ్రీకు విజ్ఞానముకంటె నతిశీఘ్రముగ అరబ్బులజ్ఞానము ప్రపంచమున విచిత్రముగ వ్యాపించెను. చీనాకు పశ్చిమమున నున్న ప్రపంచమంతటను అపుడు నూతనవిజ్ఞానోత్తేజము కలిగెను. పురాతనభావములు నశించి అనేక నూతనసిద్ధాంతములు బయలుదేరెను.

పర్షియాలో నూతనవికాసమొందిన అరబ్బీవిజ్ఞానమునకు మనీషియ నుజొరాస్ట్రియను క్రైస్తవ సిద్ధాంతములతోను సంబంధము కలిగెను. ఈజిప్టులోను గ్రీకు విజ్ఞాన సంపర్కము కలిగెను. మధ్యఆసియాలో బౌద్ధమతముతోను చీనాసంస్కృతి తోను సంబంధము కలిగెను. వారు చీనానుండి అచ్చుపుస్తక ములను పలయు కాగితపుపరిశ్రమ నేర్చుకొనిరి. ఇంతే గాక హిందూ ఆధ్యాత్మిక జ్ఞానముతోను గణితశాస్త్రముతోను వారికి సంబంధము కలిగెను.

కొరానొక్కటే మహాగ్రంథ మను సంకుచితాభిప్రాయము అరబ్బులకు త్వరలోనే పోయెను. అరబ్బులవిజయముతో బాటు అంతటను విద్య వ్యాపించెను. 8-వ శతాబ్దమునాటికి అరబ్బీ ప్రపంచమంతయు నొకే విద్యాసంస్థగా నుండెను. 9-వ శతాబ్ద మున స్పెయినుదేశపు 'కార్డోవా' లోని విద్యాలయపండితులు కైరో బాగ్దాదు బొఖారా సమర్కండ్ మొదలగుచోట్ల పండి తులతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచుండిరి. యూదుల అభి ప్రాయములు అరబ్బీభావములలో కలసెను. కొంతకాల మీ రెండు సెమిటికు జాతులును అరబిక్ ద్వారా కలిసి పనిచేసిరి. అరబ్బు ప్రభుత్వము క్షీణించినతరువాతగూడ అరబ్బుసంస్కృతి గల ప్రాంతములం దీ ఆనుకూల్య ముండెను. అందుచే 13-వ శతాబ్దమున ఉత్కృష్టఫలము కలిగెను.

క్రమపద్ధతులపై విషయజ్ఞానము సేకరించి చర్చించు గ్రీకు పద్ధతి ఈ సెమిటికుల విజ్ఞానోదయమున పునఃప్రతిష్ఠ చేయ బడెను. ఇంతకాలము మందగించి నిశ్చేష్టస్థితిలో నుండిన అరిస్టా టిలు అలెగ్జాండ్రియాకళాలయముల బీజము తిరిగి మొలక

లెత్తి ఫలోన్ముఖమై పెరుగజొచ్చెను. గణితవైద్య ప్రకృతి శాస్త్రములలో గొప్పకృషి జరిగెను. అసహ్యమగు రోమను అంకెలను మాని ఈనాటికిగూడ మన ముపయోగించుచున్న అరబిక్ అంకెలు వాడజొచ్చిరి. సున్న గుర్తుకూడ ఆరంభింపబడెను. ఆల్జెబ్రా (బీజగణితము) అనుపేరే అరబ్బీది. అల్కెమిస్ట్రీ అను పదము, ఆల్గల్ ఆల్డెబరాన్ బూట్స్ అను నక్షత్రముల పేర్లు కూడ అరబ్బీలు జ్యోతిశ్శాస్త్రమున కాంచిన విజయపుచిహ్నమే. వారి ఆధ్యాత్మికదృష్టి మధ్యయుగమంతలి ప్రసరించి ఇటాలియనులకే గాక, అఖిలక్రైస్తవ ప్రపంచపు ఆధ్యాత్మికభావములకు జీవము కల్గించినది.

అరబ్బీ రసాయనపరిశోధకులు ఆల్కెమిస్టులు (రసవాదజ్ఞులు) అనబడుచు, ఉదారతలేక తమపద్ధతులను పరిశోధనలను గుప్తముగనే యుంచిరి. తమపరిశోధనలచే నెట్టి విశేషలాభము కలుగవచ్చునో మానవజీవితముపై నెంతటి పరిణామము కల్గించునో వారు గ్రహించిరి. అత్యుపయుక్తము లగు అనేకలోహ సంబంధ రహస్యములను సూక్ష్మపద్ధతులను గ్రహించిరి. మిశ్రలోహములు, రంగులు, అరకులుతీయుట, ద్రావకములు, సారములు, సులోచనములు మొదలైనవానిని గ్రహించిరి. కాని లోహవినిమయముచే బంగారుచేయుట, వార్ధకము బోగొట్టి చిరంజీవులజేయు సిద్ధౌషధములు తయారుచేయుట ఈరెండు యత్నములుచేసి అందు విఫలులైరి. అరబ్బురసవాదజ్ఞుల క్లిష్టపరిశోధనలు క్రమముగ క్రైస్తవప్రపంచమున వ్యాపించెను. పరిశోధనాసక్తి అధికమాయెను. క్రమముగా నీశాస్త్రపరిశోధనలలో అన్యోన్యసహాయము జరిగి, సంఘమున వ్యాపించెను;

సహకారము లాభకారి యని తెలిసెను. కాలక్రమమున ఈరసవాదజ్ఞులలో తుదివారు, పరిశోధనతత్వజ్ఞులలో ప్రథములయిరి.

ప్రాచీనరసవాదజ్ఞులు క్షుద్రలోహములమార్పుచే బంగారము, నిత్యజీవమిచ్చు అమృతము, తయారుచేయుటకు విశ్వప్రయత్నము లొనర్చిరి; వా రాయత్నములో గ్రహించిన పరిశోధనశాస్త్రపద్ధతులు తుదకు మానవునకు ప్రపంచముపైనను తన భావిస్థితిపైనను గూడ అవధిలేనిశక్తిని గలిగించినవి.*

* అప్పుడు భూమిపై మన కాంభోజగాంధారాదిదేశములకు నౌకలతో సముద్రముపైన సింధుదేశమునకుగూడ, 8-వ శతాబ్దముననే కొందరారబులు వచ్చిరి; వారు భారతీయవిద్వాంసులతో సమావేశము నొంది, భారతీయవిజ్ఞానమును పాశ్చాత్యదేశములకు వ్యాపింపజేసిరి. మన ప్రాచీన భారతదేశమునగూడ నితరలోహములనుండి, రసపదార్థములనుండి, స్వర్ణము చేయుటకును, ఓషధులనుండి సంజీవనిచేయుటకును అనేకయత్నములు చేయబడి, రసాయనశాస్త్రము వృద్ధినొందించబడెను. అది యట్లుండ అరబ్బులకన్నను పారసీకులకన్నను భారతీయులే విజ్ఞానమందును తత్వశాస్త్రములందును అప్పటికి చాల గొప్పవిద్వాంసులైయుండుటచే, ప్రాచీనభారతీయులనుండియే అప్పటి అరబ్బులును పాశ్చాత్యులును అనేక విద్యల గ్రహించిరి. ప్రస్తుతము పాశ్చాత్యదేశములంతటను మనదేశమందును వాడుకలోనున్న అరబిక్ (లేక ఇంగ్లీషు) అనబడు అంకెలన్నియు మనదేశమునుండియే పూర్వమున అరబ్బులద్వారా ఇతరులకు వ్యాపించెను. ఇట్లే బీజగణితమంతయు, శుల్వసూత్రపు క్షేత్రగణితము (జ్యామితి) లో ముఖ్యాంశములును, రసాయనశాస్త్రము, చరకసుశ్రుతాదులు వైద్యశాస్త్రము, మన భారతీయవిద్వాంసులనుండియే అరబులు నేర్చుకొని యూరపుకు వ్యాపింపజేసిరి. మరియు వేదాంత తత్వశాస్త్రములందలి అనేక ముఖ్యవిషయములను, ముఖ్యముగ అనేక సాంఖ్యసిద్ధాంతములను భార

తీయులనుండి గ్రీకులు అరబ్బులు పారసీకులుగూడ నేర్చుకొని, తమ గ్రంథములం దాసిద్ధాంతముల చేర్చి, వాటిని చర్చించిరి. ఇట్లే కొన్ని సంస్కృత ప్రాకృతముల సామాన్యవాఙ్మయసంగతులను ముఖ్యముగా పంచతంత్రాదులందు జంతువులు నరులవలె వర్తించినట్లు చెప్పు అనేక నీతికథలు మనదేశమునుండియే పారసీకులు అరబ్బులు గ్రహించి, యూరపునకు మధ్యకాలమున వ్యాపింపజేసిరి. ఈ సంగతులు ప్రాచీనారబు పారసీకగ్రంథములవలననే స్పష్టమగును. 7-వ శతాబ్దము మధ్యవరకు అజ్ఞానులు అనాగరికులు అయియుండియు, అహంభావము లేక జ్ఞానేచ్ఛను తమలో ప్రజ్వలింపజేసికొని, అరబులు తమకన్న నాగరికులు జ్ఞానవంతులు అగు భారతీయులయొద్దనుండి, అనేకవిద్యలను శాస్త్రములను శ్రద్ధాసక్తులతో నేర్చుకొని వృద్ధిచేసి, వాటిని యూరపియనులకు వ్యాపింపజేయుటచే పాశ్చాత్యులకును తద్వారా ప్రపంచమునకును మహోపకారముచేసిరి. కాని తరువాత భారతీయులు మధ్యకాలముననుఇటీవలివరకును, మనపూర్వికులు మహావిజ్ఞాను లనుటతోనే తృప్తులై, గర్వించి యూరకొని, ఆ ప్రాచీనగ్రంథములనుగూడ పోగొట్టుకొనిరి. అట్లుగాక పాశ్చాత్యులు తాము ప్రాచ్యులనుండి నేర్చుకొనిన వివిధవిద్యలను విజ్ఞానమును కాలక్రమమున విడువక పట్టుదలతో వృద్ధిచేసుకొని, మహావిజ్ఞానులై తమ శిల్పకళాపరిశ్రమల వృద్ధినొందించుకొని, చివర కిప్పుడు మనకు బోధకులై అధికారులైరి.



# 45. లాటిను క్రైస్తవరాజ్యాభివృద్ధి

క్రీ. త. 7, 8-వ శతాబ్దులలో, ఆర్యప్రాబల్యము తగ్గిపోయెను. చీనాకు పడమట నున్న రాజ్యములన్నిటిని ఆర్యభాషికులు వేయేండ్లకు పూర్వము పాలించిరి; కాని యిప్పుడు హంగెరివరకు మంగోలియనులు చొరబడిరి. ఆఫ్రికా స్పెయినులు విడిపోయెను. ఆసియా మైనరులోని బైజంటైను ప్రదేశములు తప్ప, మిగిలిన ప్రదేశమంతయు ఆర్యపాలననుండి తొలగెను. గ్రీకులసామ్రాజ్యము క్షీణించెను; అందు మిగిలిన కొలది ప్రదేశములుమాత్రము వర్తకపుర మగు కాంస్టాంటినోపిలు చుట్టు నిలచెను. పశ్చిమ క్రైస్తవగురువుల లాటినుభాషలో మాత్రము ప్రాచీనరోమకసంస్కృతి చిహ్నములు నిలచినవి. ఆర్యు లట్లు క్షీణింప, వేయేండ్లు అంధకారమందు అజ్ఞాతవాసమందు ఉండిన సెమిటికులసంస్కృతి ఇప్పుడు మరల హెచ్చెను.

ఐనను, ఆర్యుల జీవశక్తి అంతరించిపో లేదు. ఆర్యులు యూరపు మధ్యవాయవ్యభాగములందు లీనులై, సాంఘికరాజకీయక్లిష్టతలో నుండియు, నూతనసాంఘికస్థితి నేర్పఱచుచు, లోలోన వెనుకటికన్న నధికబలము సంపాదింప సిద్ధమగుచుండిరి.

6-వ శతాబ్దాదిని మొదటి పశ్చిమయూరపులో కేంద్రప్రభుత్వము లేకుండెను. ఆభాగమున చిన్న రాజు లనేకులు వారివారి కోపినంత పాలించుచుండిరి. ఇట్లు చిరకాల ముండుట దుస్తరము. ఈకోలాహలమున సామంతరాజ్యపద్ధతినే ఒకవిధ

మగు సహకారము కలయిక యేర్పడెను; అది యూరపులో ఇప్పటికిని మిగిలినది. ఇదియే 'ఫ్యూడలుసిస్టము.' అందుచే నధికారవిషయమున సంఘమందు స్థిరభాగము లేర్పడెను. ప్రతిచోటను ప్రతివ్యక్తియు రక్షణసహాయార్థమై, కొంతస్వాతంత్ర్యము వదలుకొని, బలీయులను తనరక్షకులుగ నంగీకరించి వారికి సైనికసేవ జేయుచు, పన్నులు చెల్లించుచు, దానిప్రతిఫలముగ తనఆస్తికి భద్రత గలిగియుండెను; ఇట్లే ఆ మొఖాసాదారు తనకన్న గొప్పసామంతునికి లోబడియుండుట సుకరమయ్యెను. నగరములు, మఠములు, మతసంస్థలు ఇట్టి కట్టుబాటులనే చేసుకొనిరి. ఇట్టి అధికారపద్ధతి చాలచోట్ల నిర్బంధరీత్యా జరిగి, ఉభయత్ర వ్యాపించెను. మొత్తముమీద కొన్నిచోట్ల కొన్ని ప్రాంతీయవిభేదములు దౌర్జన్యము కలహములు చిన్నయుద్ధములు కలిగినను ఈసంస్థ పిరమిడులవలె వృద్ధియై, క్రమముగా శాంతిశాసనబద్ధమగు గొప్ప పాలకవర్గ మయ్యెను. ఈమహాసంస్థలో కొన్నిరాజ్యము లున్నతస్థితికి వచ్చెను. అప్పటికే ఫ్రాంకు రాజ్యస్థాపకు డగు క్లోవిసుక్రింద ప్రస్తుతఫ్రాంసు నెదర్లాండు దేశములు ఆఐదవశతాబ్దమునాటికే ప్రబలియుండెను. దాని వెంటనే విసిగాతిక్, లొంబార్డు, గాతిక్ రాజ్యములు బయలుదేరెను.

720 లో మహమ్మదీయులు పిరనీసుకొండలు దాటునప్పటికి, ఈ ఫ్రాంకురాజ్యమును క్షీణించిన క్లోవిసువంశ్యుల ఆస్థానికుడగు చార్లెసుమార్టెలు పాలించుచు, పోయిటీర్సువద్ద ముసల్మానుల పూర్తిగా నోడించెను. ఈచార్లెసుమార్టెలు ఆల్ప్సుకొండల కుత్తరమున పిరనీసునుండి హంగేరీవరకు గల యూరపు

కంతకు చక్రవర్తి యయ్యెను. అతడు ఫ్రెంచి, లాటిను, ఉత్తర జర్మను, నిమ్నజర్మనుభాషీయు లగు అనేకసామంతులపై నధికారము వహించెను; అతనికుమారు డగు 'పెడిసు' క్లోవిసు వంశీయులలో తుదివారి నంతమొందించి, రాజత్వమును బిరుదులను తానే వహించెను. అతని మనుమ డగు చార్లమను 768-లో నాసామ్రాజ్యము పాలింపదొడగి తిరుగ లాటిను సార్వభౌమ బిరుదము వహించెను. అత డుత్తరఇటలీని జయించి, రోముకును రాజయ్యెను.

ప్రపంచ చరిత్రదృష్టిని ఈ లాటిను రోమకసామ్రాజ్యపు సంప్రదాయ మెంత హానికరమో, ఆయారాజ్యముల చారిత్రకులకన్న మన కెక్కువ స్పష్ట మగును. ఈ యధికారమాయకై వేయేండ్లు నిరంతర కలహములు జరిగెను. అందుచే యూరపు నిస్సారమయ్యెను. ఆ కాలమంతయు అనంతవిరోధము లుండెను. యూరపు అంతట నవి మతిభ్రష్టుని వక్రచర్యలవలె వ్యాపించెను. చార్లమను (చార్లసు ది గ్రేటు) వంటి కొందరు జయశీలురు సర్వాధికారులు కా యత్నించిరి. చార్లమను సామ్రాజ్యమున చాల తరగతుల జాగీర్దారుల బోలు సామంతుల జమీలు కలసి యుండెను. రైనునదికి పడమటిజను లనేకులు లాటిను మిశ్రిత భాషల నేర్చిరి. ఇది తుదకు ఫ్రెంచిభాష యయ్యెను. రైనుకు తూర్పున ట్యూటనులు జర్మనుభాషను విడువలేదు. అందుచే ఆటవికులకు నీ రెండు శ్వేతజాతుల మధ్యను విభేదములు గలిగెను. ఫ్రెంచి ఆచార ప్రకారము చార్లమను అనంతరము సహజముగ నారాజ్య మతనికుమారు లందరకు పంచబడి ఈ విభేదము హెచ్చెను. చార్లమను తరువాత యూరపులో

నొక్కొకరాజు అతని వంశీయులు తరువాత మరియొకడు సామంతాదులపై తమ యధికారము స్థాపింప యత్నించిరి. ఈ గడబిడలో ఫ్రెంచి జర్మనుల మధ్య విరోధ మంతకంతకు పెరిగెను. చక్రవర్తులు మారుమూల క్షీణించియున్న రోమును వశపఱచుకొని అందు అభిషిక్తులు కా గోరుచుండిరి.

రోముమతపీఠమువారు పోపునే లౌకికచక్రవర్తిగగూడ జేయ యత్నించిరి. అందుచే యూరపు రాజ్యాంగస్థితి మరింత గహనమయ్యెను. పోపు అప్పటికే రోమునకు మతాధికారియై యుండెను. పోపుకు సైన్యములు లేకున్నను లాటిను ప్రపంచ మంతటను వ్యాపించిన మతాధిపతులద్వారా ప్రాబల్యముండెను. మానవశరీరములపై నధికారము లేకున్నను స్వర్గనరకద్వారముల బీగము లాతనిచేత నున్న వని జను లనుకొనుటచే వారి హృదయముపై నతడు విశేషాధికారము చలాయించెను. మధ్యయుగ మంతటను సమానత్వముకు, తరువాత వానిపై నధికారముకొరకు, తుదకు సార్వభౌమత్వము కొరకును రాజులు తమలో తాము కలహించుచుండిరి. వారినందరను లోబర్చుకొనుటకు ఒకప్పుడు ధైర్యముగ, మరొకప్పుడు రహస్యముగ, కొన్ని వేళల దీనముగగూడ సర్వక్రైస్తవపాలకుడ ననుకొను పోపు యత్నించుచుండెను. ఈ పోపులందరు వృద్ధులు; సగటున ఒక్కొకరు రెండేండ్లే పాలించిరి.

రాజులమధ్యను రాజుకు పోపుకు మధ్యను ఉండిన ఈ తగవులకుదోడు గ్రీకుభాషి కాన్‌స్టాంటినోపిలువాసి యగు చక్రవర్తితగవుగూడ నుండెను. చార్లమను లాటినుభాగపు సామ్రాజ్యము మాత్రమే పునర్నిర్మాణము చేసెను. లాటిను

గ్రీకుసామ్రాజ్యములమధ్య సహజముగ పోటీ పెరిగెను. మరియు గ్రీకు మాట్లాడు క్రైస్తవులసిద్ధాంతముకు కొత్తగా క్రైస్తవులైన లాటినులసిద్ధాంతములకును స్పర్థ కలిగెను. క్రీస్తుకు ముఖ్యదూతయగు 'సెంటుపీటరు'కు తాను స్థానీయుడనని పోపు ప్రకటించెను. గ్రీకుచక్రవర్తి గ్రీకు పీఠాధ్యక్షుడు అంచు కంగీకరింపరైరి. ఈవిభేదములకు తోడు క్రైస్తవత్రిమూర్తి సిద్ధాంత విషయమై తగవులు బయలుదేరెను; తుదకు 1045-లో పూర్తిగా విభేదము కలిగెను. లాటిను గ్రీకుపీఠములకు విభేదము ఆ మధ్యయుగజనులకు నష్టము కల్గించిన యితరకారణములకు తోడయ్యెను. ఈవిభిన్నక్రైస్తవరాజ్యముపై మూడు ప్రత్యర్థి వర్గముల దెబ్బలు తగిలెను. బాల్టికు ఉత్తరసముద్రప్రాంతముల ఆర్యులతెగవారు కొందరు మిక్కిలి ఆలస్యముగా క్రైస్తవమత మవలంబించిరి; ఈ ఉత్తరదేశ్యులు సముద్రముపై దోపిడివృత్తి నారంభించి స్పెయినువరకు గల క్రైస్తవ ప్రాంతతీరమంతయు దాడిసల్పిరి; నదులగుండ మధ్యదేశముకు, అచ్చటనుండి దక్షిణమునకు వారు నదులలోనికి తమనౌకల జేర్చి, కాస్పియను నల్ల సముద్రములమీదగూడ దోపిడిచేసిరి. రష్యాలో చిన్నసంస్థానముల నెలకొల్పిరి; వీరే మొదటిరష్యనులు. ఈరష్యనులు కాన్స్టాంటినోపిలు నాక్రమింపబోయిరి. 9-వ శతాబ్దమున చార్లమను శిష్యుడు అతని పోష్యుడు నగు ఎగ్బర్టుపాలనమున ఇంగ్లండు జర్మనుభాషికమై క్రైస్తవదేశమయ్యెను. అతని అనంతరుడగు "ఆల్ఫ్రెడ్" (886) వద్దనుండి ఈఉత్తరజనులు సగముrాజ్యము లాగుకొని, 1016-లో కన్యూట్ ఆధిపత్యమున ఇంగ్లండునంతను జయించిరి. "రోల్ఫు ది గాంగర్" క్రింద 912-లో ఉత్తర

జనుల దండింకొకటి ఉత్తరఫ్రెంచిదేశము జయించెను. అదియే నార్మండీ అనబడెను.

కన్యూటు ఇంగ్లండునేగాక నార్వే డెన్మార్కులనుగూడ పాలించెను. కాని అతని అనంతరము అతనికుమాళ్ల మధ్య తగవుచే ఆరాజ్యమనేకభాగము లాయెను; అనాగరికులలో నిట్టి లోప ముండుట మామూలే. ఈయుత్తరదేశీయుల తాత్కాలి కైక్యము స్థిరమైనచో లోక మెట్లుండెడిదిదో? వారద్భుతశక్తి సాహసవంతులు; తమ చిన్ననౌకలలో ఐసులండు గ్రీకులండు వరకు ప్రయాణము చేసిరి; అమెరికాభూమిపై మొదట వారే దిగిరి. తరువాత నీ నార్మనులు సారసినులయొద్దనుండి సిసిలీ నాక్రమించి, రోమును దోపిడిచేసిరి. ఆ ఐక్యము స్థిరమై నిల్చి నచో, కన్యూటురాజ్యము అమెరికా మొదలు రష్యావరకు గొప్ప నౌకాబలము గల్గియుండెడిది.

జర్మనులకు లాటిను యూరపియనులకు తూర్పున స్లావులు తురుష్కులు మిశ్రితులై యుండిరి. వారిలో 9-వ శతాబ్దము లలో పశ్చిమమునకు వచ్చుచున్న మాగ్యరులును హంగేరి యనులు ముఖ్యులు; చార్లమను వారిని కొంతకాలము నిరో ధించెను. కాని అతని యనంతరము వారు ప్రస్తుతపు హంగె రీలో స్థిరవాసులైరి. ఇదియే జర్మనుమహాయుద్ధానంతర (1919) వర్సైల్సుసంధితరువాత 'జుగోస్లావియా' అనుపేర రిపబ్లికుగ నేర్పడినది.

వారు తమజాతీయు లగు హూణులవలె యూరపులోని స్థిరరాజ్యములపై ప్రతివేసవిని దండెత్తుచుండిరి; వారు 938-లో

జర్మనీగుండ ఫ్రాన్సు ప్రవేశించి, ఉత్తరఆల్ప్సుకొండలు దాటి యిటలీ వెళ్లి, అంతయు దగ్ధపటలము చేసి గృహము చేరిరి.

దక్షిణమున రోమకసామ్రాజ్య శేషమును సారసినులు చూర్ణముచేసి, సముద్రాధికారమును వహించిరి. నల్లసముద్ర మందలి రష్యను జౌత్తరాహులు, పశ్చిమపు ఉత్తరదేశీయులును సముద్రముపైన వారికి తగుప్రత్యర్థులై యుండిరి.

ఈ ప్రబలవీరుల వ్యాప్తిచే తమ కగ్రాహ్యమగు శక్తులు తామెంచలేని అపాయము చుట్టుముట్టుచుండ, చార్లమను అతనితరువాత ఆశాయుతులగు రాజులు "పవిత్రరోమక సామ్రాజ్య" మను పేర పశ్చిమసామ్రాజ్యమును పునర్నిర్మాణము చేయ యత్నించిరి. తూర్పున కాన్స్టాంటినోపిలు పరిసరములు మాత్రము మిగిలి, తక్కినదంతయు క్షీణించెను. చార్లమను కాలమునుండి వేయేండ్లుగా నిట్లు యూరపుఖండ మీ సంప్రదాయమున లగ్నమైయుండెను.

యూరపుచరిత్రయందు చార్లమనుపేరు చాల గొప్పగా తోచినను అతనివ్యక్తి స్పష్టముగ గమనింపబడలేదు. అతడు నిరక్షరుడు; కాని విద్యయెడ గౌరవము కలవాడు. భోజన సమయమందెవరైన చదువగా వినుట, మతచర్చలు అతని కిష్టములు. తన శీతకాలనివాసమైన ఐలాషపెలులోను మేయెన్సు లోను అనేకవిద్వాంసుల జేరదీసి వారి సంభాషణములనుండి చాల గ్రహించెను. వేసవిలో స్పెయినులోని సారసీకులపైనను, స్లావు మాగ్యారుసాక్సనులపైనను, క్రైస్తవేతరు లగు ఇతర జర్మను తెగలపైనను యుద్ధము చేసెడివాడు. ఉత్తరఇటలీని జయింపక పూర్వమే రోమ్యులసు ఆగస్టసు తరువాత తాను

సీజరు కావలెనని అతనికే తోచెనో, లేక లాటినుపీఠమును కాన్స్టాంటినోపిలునుండి స్వతంత్రముచేయగోరిన 'మూడవలియో' పోపు ఉపదేశించెనో తెలియదు.

చక్రవర్తి పట్టాభిషేకమున కిరీటము నతనితలపైన పోపే ఉంచెనని, అట్లు లేదని చూపుటకు రోములో అతి విచిత్ర యుక్తుల బన్నుచుండిరి. క్రీ. శ. 800-వ ఏట క్రిస్టమసుదినమున విజయిగ్రాయె వచ్చిన చార్లమనును హఠాత్తుగా పోపు అభిషిక్తుని జేసెను. పోపు ఒకకిరీటము దెచ్చి చార్లమనుశిరముపై నుంచి, 'సీజరు' 'అగస్టసు'అను బిరుదములతో గౌరవించెను; ప్రజలు మిక్కిలి హర్షించిరి; చార్లమనుకుమాత్ర మందుచే విచారమయ్యెను; అది పరాభవ మనియే అతడు భావించెను. కిరీటమును పోపు పెట్టకుండ తానే లాగుకొని స్వయముగ తలపై నుంచుకొనవలెనని తనకుమారుని కతడు బోధించెను. ఈసామ్రాజ్యోద్ధరణపు ఆరంభమందే ప్రాధాన్యముకై పోపుకు చక్రవర్తిమధ్య తగవు మొదలిడెను. కాని చార్లమను కుమారుడగు "లూయీ ది పయస్" తండ్రిబోధల నిర్లక్ష్యముచేసి పోపుకు పూర్తిగా లొంగియుండెను.

చార్లమనుసామ్రాజ్యము 'లూయీ' అనంతరము విచ్ఛిన్నమయ్యెను. ఫ్రెంచిమాటాడు ఫ్రాంకులకు జర్మను మాటాడు ఫ్రాంకులకు, విభేదము కల్గెను. 919 - లో జర్మను సామంతులును ప్రభువులును చక్రవర్తిగా నెన్నుకొనిన సాక్సను తెగవాడగు 'హెన్రీ ది ఫవులరు' తరువాత అతని కుమారుడు 'ఒట్టో' చక్రవర్తి యయ్యెను. 962-లో 'ఒట్టో' రోముపై దాడి వెడలి అక్కడ పట్టాభిషేకమొందెను. 11-వ శతాబ్దారంభమం

దీసాగ్జనువంశము పోయి ఇతర జర్మనురాజులు వచ్చిరి. పశ్చిమమందు ఫ్రెంచిభాషీయులగు సంస్థానాధిపతులు, చార్లమనునుండి బయలుదేరిన 'కార్లొవీ వంశము' తరువాత జర్మనురాజులకు లోబడలేదు; నార్మండీప్రభువు, ఫ్రెంచిరాజు మరి యితరులును ఇందు చేర లేదు.

987-లో ఫ్రెంచిదేశము కార్లొవీవంశమునుండి 'హ్యూకాపే' హస్తగతమై 18-వ శతాబ్దమువరకు కావంశీయుల క్రింద నుండెను. హ్యూకాపేకాలమున ఫ్రాంసురాజు ప్యారిస్ పరిసరము మాత్రమే పాలించెను.

1066-లో ఇంగ్లండుపై నొకేమారు 'హెరల్డుహర్డ్రాడా' నేతృత్వమున 'నార్వేవా'రగు ఉత్తరదేశీయులు నార్మండీప్రభువు క్రింద లాటిను ఉత్తరదేశీయులు దాడివెడలిరి. ఇంగ్లండు రాజగు 'హరల్డు' వీరిలో మొదటివారిని 'స్టాంఫర్డుబ్రిడ్జియుద్ధము'న నోడించెను. కాని రెండవవారిచే 'హేస్టింగ్సు'వద్ద ఓడి పోయెను. ఇంగ్లండు నార్మనుల పాలబడినందున, స్కాండినేవియను ట్యూటను రష్యనుల సంపర్కము వీడి, ఫ్రెంచివారితో విశేషసంబంధము సంఘర్షముకు కలిగెను. తరువాత నాలుగు శతాబ్దములు ఇంగ్లీషువారు ఫ్రెంచిభూస్వాముల తగవులలో చిక్కుకొని ఫ్రెంచిసీమలో తమశక్తిని వ్యర్థముచేసిరి.

---

# 46. మతయుద్ధములు : పోపుప్రాబల్యము

చార్లమనును, అరేబియనునైట్సు కథలందు ప్రసిద్ధి చెందిన 'హరౌను-ఆల్-రషీద్'అను ఖలీఫాయు సమకాలికులు. డమస్కసు తప్పి తరువాత బగ్దాదు మహమ్మదీయరాజధాని అయ్యెను. అందుండి హరౌను-ఆల్-రషీదు అద్భుతమగు గుడారము, నీటిగడియారము, గజము, క్రీస్తుగోరీ తాళముచెవులు, వీటిమహుమతితో చక్రవర్తికి రాయబారుల బంపెను. ఈ తుది బహుమతివలన బైజంటైనురాజ్యము పవిత్రరోమకసామ్రాజ్యము (జెరూసలెంలోని క్రైస్తవుల రక్షణహక్కులవిషయమై) తమలో తాము కలహించెను.

9-వ శతాబ్దమున యూరపు అంతయు యుద్ధములందు దోపిడులందు బడియుండ, ఈజిప్టు మెసపొటేమియాల ఆరబు సామ్రాజ్యము మహానాగరికతతో నొప్పియుండె నని ఈబహుమతులు సూచించును. అందు వాఙ్మయవిజ్ఞానములు కళలు వృద్ధిజెందుచు, నరులు స్వతంత్రులు ఉదారులు నై నిర్భయులై యుండిరి. సారసెన్ రాజ్యము క్షీణించుచున్న స్పెయినులో ఉత్తరఆఫ్రికాలోగూడ మంచివిజ్ఞానజీవన ముండెను. యూరపు అంధకారమయ మైయుండిన యీశతాబ్దములలో యూదులు అరబ్బుల అరిస్టాటిలుగ్రంథముల జదివి, చర్చించుచుండిరి; వారు మూలబడియున్న తత్వవిజ్ఞానశాస్త్రబీజముల భద్రపఱచిరి.

ఆ ఖలీపారాజ్యమునకు ఈశాన్యమున ననేకతురుష్కజాతు లుండిరి. వారు ఇస్లాములో చేరి, దక్షిణమందలి పర్షియను

అరబ్బులకంటె హెచ్చు వీరావేశముతో ముస్లిం మతాభిమాను లైరి. పదవశతాబ్దమున నరబ్బులబలము క్షీణించినను, ఈధీరు లగు తురుష్కులు బలీయులైరి. ఖలీఫా కీతుష్కులతో సంబంధము 14 శతాబ్దులకుపూర్వము తుదిబాబిలోనియనుసామ్రాజ్యముపట్ల మీడులసంబంధమువలె నుండెను. 11-వ శతాబ్దములో సెల్జూక్ తురుష్కు లనబడు కొన్ని తురుష్కజాతులు మెసపొటేమియా ప్రవేశించి ఖలీఫాను వశపఱచుకొని, పేరుకు మాత్రము తమపాలకునిగ జేసుకొనిరి. అంతట వారు ఆర్మీనియా జయించి ఆసియామైనరులో శేషించిన బైజంటైనురాజ్యముపై బడిరి. 1071-లో మెలాస్‌గర్డుయుద్ధములో బైజంటైను సైన్యమును నశింపజేసి ఆసియాలో బైజంటైనురాజ్యమును నిశ్శేషము చేసిరి. మరియు నిసియాదుర్గము పట్టుకొని కాంస్టాంటినోపిలును కూడ పట్టుకొన యత్నించుచుండిరి.

బైజంటైను రాజగు 7-వ మైకేలు భయభ్రాంతుడాయెను. అప్పటికే ఒకమూల నార్మనులు 'డురాజో' నొక ప్రక్కను 'పెశ్చెనెగు' లను తుర్కిజాతీయులు డాన్యూబు ప్రాంతమునొకప్రక్కను ఆక్రమించిరి.అత డప్పటికేవారితో యుద్ధముల జిక్కుకొనియుండెను. తుదకతడు సహాయమునకై పశ్చిమ చక్రవర్తి నాశ్రయింపక, లాటినుక్రైస్తవప్రాంతాధిపుడగు రోములోని పోపు నాశ్రయించెను. ఇది చిత్రము; అతడు పోపగు 7-వ గ్రిగరీకి ఉత్తరములు వ్రాసెను. ఆతని అనంతరపు 'అలెగ్జియసు కామ్నెనసు'అను రాజు '2-వ అర్బను' (పోపు) కు మరింత ఆతురతతో వ్రాసెను.

లాటిను గ్రీకుపీఠముల విభేదము కలిగి 25 ఏండ్లైన కాలేదు. ఆ వివాద మింకను ప్రజలహృదయములలో లగ్నమై యుండెను. బిజాంటియం వారోడిపోగా, విడిపోయిన గ్రీకులపై మరల సర్వాధికారము చలాయింప పోపుకు సందు దొరికెను. మరియు పాశ్చాత్యక్రైస్తవులను కలవరపర్చుచున్న మరిరెండు సమస్యలుగూడ పరిష్కరించుట కిందుచే పోపు కదను కలిగెను. ఇం దొకటి: జనులు కలహప్రియులై తమలో తాము చిల్లర యుద్ధములు చేయుటచే సాంఘికజీవనములో నాందోళనము. రెండవది: పల్లపుప్రాంతముల జర్మనులు ఔత్తరాహులగు ఫ్రాంకులు నార్మనులు వీరి యద్భుతశౌర్యసాహసముల వినియోగించుట. క్రైస్తవులందరు తమలోని యుద్ధములు మాని, పుణ్యక్షేత్రమగు జరూసలెంపురిని పట్టుకొనుటకై తురుష్కులపై మతయుద్ధ మొనర్పవలె నని పోపు బోధించెను (1095). మ్లేచ్ఛుల నుండి పవిత్రమగు క్రీస్తుగోరీని వశముచేసికొనుట దీని యుద్దేశము. 'పీటర్ హెర్మిట్' అనునత డిందుకై ఫ్రాంసుజర్మనీల జనులలో చాల ప్రబోధము గావించెను. అతడు ముదుకబట్టలను ధరించి పాదచారిగనో గార్దభములపైననో తిరిగి పెద్దశిలువ ధరించి వీథులలోను గుడులలోను జనుల కుపన్యసించెనట. క్రైస్తవయాత్రికులు తురుష్కులచే పడు బాధల వర్ణించి క్రీస్తు పవిత్రసమాధి యితరులవశమం దుండుట క్రైస్తవుల కవమానకర మని బోధించెను. శతాబ్దములకొలది క్రైస్తవమతబోధ విని యున్న జనుల కందుచే చాలనుత్సాహము కలిగెను. అందుచే పాశ్చాత్యప్రపంచముపై నొకఆవేశము వ్యాపించి క్రైస్తవ జనసంఘము తనశక్తిని దెలుసుకొనెను.

అప్పుడు సంఘలాభమునకై సామాన్యజనులు ఏకమై సిద్ధమైరి. ఇట్లగుట నరజాతికి క్రొత్తవిషయము. అట్టిది వెనుకటి రోమక హిందూదేశ చీనాచరిత్రలలో నేదియు లేదు. అట్టి యుద్యమము బాబిలనుఖైదునుండి వచ్చినతరువాత యూదులలోమాత్రము కొద్దిగా నుండెను. తరువాత కొంతకాలమునకు ఇస్లాముకూడ తత్తుల్యమగు ఐక్యము నొందెను. అట్టి ఉద్యమములన్నియు ప్రచారమతముల నూతనభావములతో సంబంధించినది. హీబ్రూప్రవక్తలు, యేసు, అతని శిష్యులు, మణి, మహమ్మదు - వీరందరును మానవుల వ్యక్తి ఆత్మలకు ప్రబోధమొనరించిరి. వారు జనులఆత్మలకు దేవసాన్నిధ్యము కలుగజేసిరి. అంతకుపూర్వము మతములు వ్యక్తిసంబంధమగు ఆత్మజ్ఞానముగాక సంఘము మొత్తముకు సంబంధించి, మూఢవిశ్వాసములపై నాధారపడియుండినవి.

ప్రాచీనమతము దేవాలయములపైనను అర్చకులపైనను యజ్ఞయాగములపైనను ఆధారపడి సామాన్యజనుల భయపెట్టి దాసులుగ జేసికొనెను. కాని ఈ క్రొత్తమతము లా నరుని మానవత్వమును నిలిపెను.

ఈ మొదటియుద్ధప్రబోధముచే యూరపులో సామాన్యజనులు మొదటిసారి మేల్కొనిరి. అందుతోనే ఆధునిక ప్రజాయత్తత ఆరంభించె నన వీలులేదు; కాని అప్పుడు కొంతకదలిక గల్గెను; అనతికాలముననే అది మరల చలించి, సాంఘికమతవిషయములలో కల్లోలము గల్గించెను.

కాని ఈ మొదటి జనప్రబోధము శోకాంతమయ్యెను. సామాన్యజనబృందము లనేకములు ఫ్రాన్సు రైనులందు మధ్య

యూరపులనుండి తగునాయకులు సాధనసామగ్రి లేకయే పవిత్రమగు క్రీస్తుగోరిని రక్షింతు మని బయలుదేరిరి. ఇది ప్రజల క్రైస్తవమతయుద్ధయాత్ర. ఇందు రెండు పెద్దజట్లు పొరబాటున హంగెరీ ప్రవేశించి, ఈవెనుకనే మతమంగీకరించిన 'మాగ్యరు'లను అన్యమతస్థులుగా దలచి వారిపై అనేకఘోరము లాచరించి, వారిచే చిత్రవధ గావింపబడిరి; ఇంకొక మూడవదండు ఇట్టి వ్యవస్థలేని మనస్సుతోనే ప్రాగ్దిశకు నడచి, హంగెరీలో నిర్మూలితులైరి. 'పీటర్ ది హెర్మిటు' ఆధిపత్యమున మరి రెండు పెద్దగుంపులు కాన్స్టాంటినోపిలు చేరి బోస్ఫరసుజలసంధి దాటి, సెల్జూకుతురుష్కులచే హతులైరి. యూరపియనుల ప్రథమోద్యమపు ఆద్యంతము లిట్లయ్యెను.

మరుసటియేట 1097-లో జరుగు యుద్ధమునకై మంచి సైనికులగు నార్మనుతత్వపువారు బోస్ఫరసు దాటి నిసియాను కొల్లకొట్టి 14 శతాబ్దములకుపూర్వము అలెగ్జాండరు వెళ్లిన మార్గముననే ఆంటియోకును ముట్టడించిరి. ఆముట్టడి యొక సంవత్సరము పట్టెను. 1099 జూనులో ఆవీరులు జెరూసలెం ప్రవేశించి ఒకనెల ముట్టడితరువాత దానిని పట్టుకొనిరి. ఘోర రక్తపాతము జరిగి వీథులలో సవారిచేయువారిపై కూడ చిందునట్లు రక్తము ప్రవహించెను; 15-వ తేదీ సాయంకాలముకు పవిత్రమగు క్రీస్తుసమాధిస్థలమున్న దేవాలయములోనికి త్రోవచేసుకొని చొచ్చి, అక్కడి అడ్డంకులన్నిటిని జయించి, రక్తసిక్తులై వారలసటజెంది, సంతోషాతిశయమున ఆనంద బాష్పయుతులై ప్రార్థన సలిపిరి.

వెంటనే లాటినులకు గ్రీకులకు మరల కలహములు వచ్చెను. ఆ క్రైస్తవయుద్ధసైనికులందరు లాటినువారు. జెరూసలెంలోని గ్రీకుమతాధిపునిస్థితి తురుష్కులక్రింద కంటెను ఈ నూతనవిజేతలగు లాటినులక్రింద మరింత హీనమయ్యెను. ఈ క్రైస్తవమతసైనికులు బైజంటైనులకు తురుష్కులకు మధ్యచేరి ఇరువురితోను పోరుచుండిరి. ఆసియామైనరులో విశేషభాగమును బైజంటైనుచక్రవర్తి తిరుగ ఆక్రమించెను; గ్రీకులకు తురుష్కులకు మధ్య లాటినుల జెరూసలెం దానిచుట్టుపట్ల కొన్ని చిన్నసంస్థానములతో సరిహద్దుదేశముగా నేర్పడెను. ఈసంస్థానములలో సిరియాలోని ఎడిస్సా ముఖ్యము. ఈసంస్థానములపైగూడ వారియధికారము నామమాత్రమయ్యెను. 1144 లో ఎడిస్సా ముస్లిములవశ మాయెను. దీనికై మరియొక క్రైస్తవమతయుద్ధము బయలుదేరి ఎడిస్సాను సంపాదింపలేక నిష్ఫలమైనను, అంటియోక్ మాత్ర మట్టిగతి పాలు గాకుండ రక్షించెను.

ఈజిప్టు నాక్రమించిన కుర్దిషుశాఖ తురుష్కవీరుడగు 'సలాడీను' 1169 లో ఇస్లాంసైన్యమునుగూడదీసి క్రైస్తవులపై మతయుద్ధము చేయ ప్రబోధించి 1187 లో జెరూసలెమును మరల పట్టుకొనెను. అందుచే మూడవక్రైస్తవమతయుద్ధము కలిగెను; కాని క్రైస్తవులు జెరూసలెము నాక్రమింపలేకపోయిరి. నాల్గవమతయుద్ధములో (1202—4) లాటినులు బహిరంగముగ గ్రీకుసామ్రాజ్యముపైననే పడిరి; తురుష్కులతో బోరాడు నటననైన జేయరైరి; ఆయాత్రికులు 'వెనిసులో' బయలుదేరి 1204 లో కాంస్టాంటినోపిలును కొల్లగొట్టిరి. ఈదండయాత్రకు

వెనిసు అను వృద్ధిచెందు మహావర్తకనగరపు పౌరులు నాయకులై, బైజంటైనుసామ్రాజ్యపుతీరములను, ద్వీపములను ఆక్రమించిరి. ఫ్లాండర్సుదేశపు బాల్డ్విన నబడు లాటినురాజు కాంస్టాంటినోపిలులో ప్రతిష్ఠితుడయ్యెను; అందుచే గ్రీకులాటిను శాఖలు రెండును మరల మిళితమయ్యెను. 1261 లో గ్రీకులు తిరిగి రోమనులనుండి స్వతంత్రులైరి. అంతవరకా రాజులు కాంస్టాంటినోపిలును పాలించిరి.

పదవశతాబ్దమందు ఔత్తరాహులును, 11-వ శతాబ్దమందు సెల్జూకుతురుష్కులును ప్రాబల్యము వహించిరి గదా! అట్లే 12-వ శతాబ్దమును 13-వ శతాబ్దారంభమును పోపుల ఆధిక్యకాలము. అంతకు ముందువెనుకలకంటె అప్పుడు పోపు ప్రాబల్య మధిక మయ్యెను.

ఆ శతాబ్దములలో సులభము యథార్థము నగు క్రైస్తవ మతభావము యూరపునందు విశేషభాగములలో వ్యాపించెను. రోముకూడ కొంత నైచ్యదుర్దశలపాలైనది. 10-వ శతాబ్దపు పోపులగు 11, 12-వ జానుల జీవితచర్యల నేవిమర్శకుడును క్షమింపజాలడు. వారు కడు అసహ్యావర్తనులై యుండిరి. కాని లాటిను ప్రపంచపు జనులహృదయములు విశ్వాసయుతమై, నిరాడంబరముగ నుండెను. మామూలుగురువులు, సన్యాసులు, సన్యాసినులు సామాన్యముగ విశ్వాసము గలిగి యోగ్యులై యుండిరి. అట్టి ఉత్కృష్టజీవులు కల్గించిన నమ్మకము పైననే మతాధిపతుల అధికారము నిల్చియుండెను. ప్రాచీనపోపులలో గ్రిగరీ ది గ్రేటు (మొదటిగ్రిగరీ 590—604) చార్లెమనునాహ్వానించి, సార్వభౌమునిగ బలవంతముగ పట్టము గట్టిన

3-వ లియో (795—816) ప్రసిద్ధులు. 11-వ శతాబ్దాంతమున హిల్డిబ్రాం డను ఒక గొప్పరాజ్యాంగవేత్త బయలుదేరి పోపు (7-గ్రిగరీ) అయ్యెను (1073-1085). అతని తరువాత రెండవవాడు మొదటిక్రైస్తవమతయుద్ధము జరిపి, రెండవ అర్బను (1087—1099) సార్వభౌములపై పోపు అధికారియగునంతస్థితిని కల్గించిరి. బల్గేరియా మొదలు ఐర్లండు వరకును, నార్వేనుండి సిసిలీవరకును పోపులు సర్వాధికారులైరి. 4-వ హెన్రీచక్రవర్తి పశ్చాత్తప్తుడై హీనవస్త్రుడై మంచులో చెప్పులులేక కనోసాలో తనవద్దకు వచ్చి మూడహోరాత్రములు తన కోటముంగిట క్షమార్పణకై పడియుండినట్లు 7-వ గ్రిగరీ చేయగల్గెను. 1176 లో ఫ్రెడరికుచక్రవర్తి (ఫ్రెడరిక్ బార్బరోసా) 3-వ అలెగ్జాండరు (పోపు) కు నమస్కరించి అతని అధికార మొప్పగించెను.

11-వ శతాబ్దము మొదట మతపీఠం వారిఅధికారము జనులయిష్టముపైనను ఇంగితజ్ఞానముపైనను ఏర్పడియుండెను. అట్టి ముఖ్యమగు ప్రతిష్ఠను తరువాత పోపులు నిలుపుకొనలేకపోయిరి. 14-వ శతాబ్దపు ప్రథమదశకములో పోపుఅధికారము హరించిపోయెను. మతపీఠముపట్ల జనులు నమ్మికలేక దాని యాజ్ఞల నుల్లంఘించిరి. అందుకు కారణ మేమి ?

పీఠాధిపులు ద్రవ్యసంచయ మొనర్చుట మొదటికారణము. మతపీఠ మెన్నటికిని నష్టముకా దని నిస్సంతతిగ పోవువారు తమ ఆస్తులను మతపీఠమున కిచ్చివేయుచుండిరి. పశ్చాత్తప్తులగు పాపు లట్లొనర్ప ప్రోత్సహింపబడిరి. ఆస్తిరుచి అధికమయిన కొలదిని ఆస్తిసంపాదనాశయు అధికమగును. 13-వ

శతాబ్దమునాటికే మతాధిపతులు మంచివారుగాక ఎల్లపుడు ధనము ఆస్తికొరకే వెదకుచుండి రనువార్త మొదలిడెను.

రాజ్యంలోని ఆస్తి యిట్లు పరాధీనమగుటకు రాజు లిష్ట పడ్రైరి. సైనికసహాయముచేయగల భూస్వాములు సామంతులు తమ ప్రభువులకు బదులు తమమతాధిపులను వారి పీఠములను పోషించుచుండిరి. ఈ ఆస్తులన్నియు నిజముగా పరాయిఅధి కారముకు వెళ్లెను. 7-వ గ్రిగరీకి పూర్వముచుండియే బిషప్పుల నియమించు అధికారముకై పోపుకు రాజుకు మధ్య తగవు జరుగుచుండెను. ఆహక్కు పోపుదై, రాజుకు లేకున్నచో ప్రజలయంతరంగము రాజవశముచుండి తప్పును.మరియు రాజ్య మందలి స్థిరాస్తులుగూడ రాజునుండి తప్పుచుండెను. మత పీఠము వారు రాజుకు పన్నులు చెల్లించుటలేదు. తమపన్నులన్నియు పోపుకే చెల్లించుచుండిరి. ఇంతేకాక సామాన్యప్రజలఆస్తిపై గూడ రాజులు విధించుపన్నుల కదనముగా 10-వ వంతుపన్ను విధించుహక్కు తమకు గలదనిగూడ పీఠాధిపతు లనుచుండిరి.

11-వ శతాబ్దమున లాటిను ప్రాంతపు ప్రతిదేశచరిత్ర లోను పోపుకు రాజుకు మతోద్యోగుల యేర్పాటుకై తగవులు కలిగి, అందు సాధారణముగ పోపు జయమొందుచుండెను. రాజును వెలివేయుటకు, అతనిప్రజల నతని యధికారముచుండి తప్పించుటకును,అతనివారసును నియమించుటకును తనకుహక్కు గల దని పోపు అనుచుండెను; జాతియంతటిపై ఆంక్షవిధించియు జాతకర్మ తపస్సు తప్ప మిగిలినవిధులన్నియు జనులకు నిరాకరించి యు తన అధికారము చూపెను. అందుచే మతగురువులు వివా

హములు జరిపించుటకుగాని నిత్యకృత్యములను అంత్యకర్మల జరిగించుటకుగూడ వీలులేకుండెను. ఆ రెండు అస్త్రములతో తమకు మిక్కిలి వ్యతిరేకులగు రాజులను అతివిముఖులగు ప్రజలను 12-వ శతాబ్దపు పోపులు లొంగదీయగల్గిరి. కాని ఈ మహాధికారము కొన్ని ఆవశ్యకములకే ఉపయోగింపదగియుండెను. తరువాత వచ్చిన పోపులు వానిని సర్వసాధారణముగ నుపయోగించిరి. 12-వ శతాబ్దాంతమున 30 ఏండ్లలో ఇంగ్లండు స్కాట్లండు ఫ్రాన్సులపై వరుసగా ఆంక్ష వేయబడినది. పోపులు తమ కెదురుతిరిగిన క్రైస్తవరాజులపైగూడ మతయుద్ధముల రేపుటకు వెనుదీయరైరి. యుద్ధోత్సాహము నశించెను. పోపు ఆయన అనుచరులు రాజులతో మాత్రము కలహించి సామాన్య జనుల రంజన జేసినచో క్రైస్తవప్రపంచముపై నాయధికారము నిల్చియుండెడిది. కాని ఈ విశేషాధికారము మతాధిపతులు పెంకెతనముతో చెలాయించిరి. 11-వ శతాబ్దికిపూర్వపు రోమను మతగురువులు వివాహితులై తమ తోడి ప్రజలకు సన్నిహితులై, ప్రజలలో గలసియుండిరి. ఏడవ గ్రిగరీ వారల శాశ్వత బ్రహ్మచారులుగ జేసెను. మతగురువులకు సామాన్యులతో బాంధవ్యము లేకుండ త్రెంపివేసి, రోముతో ఎక్కువ సంబంధము కలుపదలచెను. కాని అందుచే మతపీఠమునకు సామాన్యజనులకు మధ్య నొకమహావిభేద మేర్పడెను. మతపీఠమునకు స్వాంతనాయ్యస్థానము లుండెను. మతగురువుల వ్యాజ్యములే కాక సన్యాసులు, విద్యార్థులు, మతయుద్ధసైనికులు, విధవలు, అనాథులు, మరణశాసనములు, వివాహములు,

మతద్రోహము మున్నగు విషయములన్నిటిని పరిష్కరించుటకు మతాధిపుల న్యాయస్థానముకే హక్కుండెను. మతగురువునకు సామాన్యునకు తగవు వచ్చిన అది మతన్యాయస్థానములందే పరిష్కరింపబడవలె. కాని, యుద్ధము శాంతి నిలుపుట మొదలగు భారమంతయు రాజుదే. అందుచే క్రైస్తవు లందరిలోను మత గురువులపై ఈర్ష్యఅసహ్యబుద్ధి వ్యాపించెను.

తనశక్తియంతయు సామాన్యజనుల సద్భావముపై నిల్చి యున్న దని పోపు గ్రహించక ప్రజల మతోత్సాహము ధ్వంస మొనర్చి, స్వతంత్ర భావము గలవారిపై బలవంతముగ పూర్వా చారసిద్ధాంతముల నతడు చొప్పించెను. నీతివర్తనముకై పీఠాధి పతులు కల్పించుకొన్నప్పుడు జనులు సహాయపడిరి; కాని భావముల జొప్పించుచో మాత్రము లేదు. దక్షిణఫ్రాంసులో 'వాలో' మతజీవనములందు క్రీస్తుకాలపు శుద్ధనిరాడంబరత్వ ములకు మరలవలె నని బోధింపగా, వాల్డోపైనను అతని అను చరులపైనను పోపు '3-వ ఇనోసెంటు' మతయుద్ధము ప్రకటించి వారిని అగ్నిఖడ్గమానభంగములచే దుర్భర దురంతములపాలు గావించి అణగద్రొక్కెను. అటులనే అస్సిసీలోని 'సెంటు ఫ్రాన్సిసు' (1181—1226) క్రీస్తుజీవితమును బీదరికమును సేవను అనుకరింపవలె నని బోధింప,అతని అనుచరు లగు ఫ్రాన్సిస్కనుల హింసించి అనేకబాధలబెట్టి ఖైదుచేసి చెదరగొట్టెను; మార్సె ల్సులో 1318-లో వారిలో నల్గురు జీవములతో తగులబెట్ట బడిరి. తీవ్రపూర్వాచారపరాయణులగు సెంటుడొమికన్‌లచే

స్థాపింపబడిన సంస్థకుమాత్రము 3-వ ఇనోసెంటు అత్యధిక సహాయముచేసి, వారిసహాయముతో స్వమతద్రోహులను స్వతంత్రభావులను శిక్షించుటకు ఇంక్విజిషన్ అనునొక క్రూరన్యాయస్థానము స్థాపించెను.

ఇట్లు అధికారదురాశ, అన్యాయాధికారము, అనర్థకాసహనము, వీటిచే మతాధికారులు సామాన్యప్రజల విశాల విశ్వాసము గోల్పోయిరి. దాని క్షీణతకు తమ అంతరంగలోపమే కారణము; కాని బాహ్యవిరోధులు కారు.



# 47. వ్యతిరేక ప్రభువులు, మతవిభేదము

క్రైస్తవలోకాధిపత్యముకై రోమను మతసంస్థ వారు చేసిన ప్రయత్నములందు పోపు ఎన్నికవిధానము లోపభూయిష్ఠమై యుండెను.

పోపుసంస్థ క్రైస్తవప్రపంచమంతట శాంతియుతపాలన నెలకొల్పి తనఆశ నీడేర్పడలచుచో అవిచ్ఛిన్నమగు దృఢనాయకత్వ మావశ్యకము. పోపులు నడువయసువారై, సమర్థులై, తమ స్థానీయుల నేర్పర్చుచు వారితో మతవిషయముల జర్చింపవలెను. ఎన్నికపద్ధతులు స్పష్టమై మారనివి నిరాక్షేపణవిగ నుండవలెను. కాని, అట్లేమియు జరుగలేదు. పోపు నెన్నుకొనువిషయములో 'బైజంటైన్' పవిత్రరోమకచక్రవర్తు' లకు ప్రమేయము కలదో లేదో కూడ నిర్ధారణ కాలేకుండెను. పోపులలో సమర్థుడగు ఏడవ గ్రిగరీ (1073—1035) ఎన్నికలకు క్రమపద్ధతి నేర్పరుప బూనెను. ఆయెన్నికహక్కును ఉన్నతరోమనుగురువు లగు కార్డినలులకే యిచ్చి, కేవలమంగీకారమును చక్రవర్తి లాంఛనంగా ఇచ్చున ట్లేర్పర్చెను. కాని, పోపు తన స్థానీయుని ముందుగా నియమించుపద్ధతి లేకుండెను. అందుకై మతగురువులు తమలో కలహించుచుండిరి; ఈలోగా పోపుస్థానము ఒకప్పుడు ఒకటి రెండేండ్లవరకును ఖాళీగ నుండెను. ఇట్లు పోపులస్థితిలో స్థిరనిర్ణయము లేకుండుటవలన ఎన్నికలవిషయమై తగాయిదాలు కలిగి, ఎవరికివా రిద్దరు ముగ్గురు తామే పోపులమని ప్రకటించుకొనుచుండిరి. ఆ తగాయిదా పరిష్కరించుటకై మతసంస్థలు

రాజునొద్దకో మరియొకరివద్దకో పోవలసివచ్చెను. గొప్పపోపుల జీవితమును సంశయాస్పదముగనే అంతమందెను. వారితరువాత మతసంస్థకు తగునాయకుడు లేక శక్తిహీనము కావచ్చును; లేక ఆ ప్రత్యర్థి తన్నుత్రోసివేసి ఆ చర్యలన్నిటిని తారుమారొనర్ప వచ్చును; లేక చావుకు సిద్ధమైన ముదుసలి పోపై, తన్ననుసరింప వచ్చును.

పోపుసంస్థలో నిట్టిలోప ముండుటచే, జర్మనీ రాజులు, ఫ్రాంసురాజులు, ఇంగ్లండులో పాలించిన నార్మనులు, ఫ్రెంచి రాజులు తమకిష్టుడే రోములో పోపు అగునట్లు తమ పలుకుబడి నుపయోగించుచుండిరి. యూరపియను విషయములలో పోపుసంస్థ ముఖ్యమైనకొలదియు, వారు ఇట్లు కల్పించుకొనుట సహజమే. పోపులలో ననేకులు అశక్తదుర్జనులైరి. కాని, కొందరు కడు సమర్థులు ధైర్యశీలురు నుండిరి. 38 ఏండ్లవయస్సునకు పూర్వమే పోపు అయిన 3-వ ఇన్నొసెంటు (1198—1216) చాల సమర్థుడు. ఆయన అనంతరపుపోపును అంతకన్న గొప్పవ్యక్తి అద్భుతస్వభావుడు అగు 2-వ ఫ్రెడరికు చక్రవర్తితో తగవులందు చిక్కుకొనిరి. ఈ తగవుచే చరిత్రలో నూతనయుగము కల్గెను. తుదకు పోపు రాజు నోడించి అతనివంశముకూడ నిర్మూలించెను; కాని ఆ సంఘర్షపుదెబ్బచే పోపుసంస్థగౌరవము నిర్మూల మయ్యెను.

'ఫ్రెడరికు' 6-వ హెన్రీ రాజు కొడుకు; అతనితల్లి సిసిలీ యందలి నార్మనురాజగు మొదటి రోజరు కుమార్తె. నాలు గేండ్ల వయస్సున 1198-లో నతడు రాజయ్యెను; 3-వ ఇన్నో సెంటు అతనికి సంరక్షకుడయ్యెను. అప్పటికి సిసిలీ నార్మనుల పాలబడి చాలకాలము కాలేదు. రాజాస్థాన మింకను

ప్రాచ్యపద్ధతులపై నుండి, విశేషవిద్వాంసులగు అరబ్బులతో నిండియుండెను. వీరిలో కొందరిచిన్నరాజుకు బోధకులై శ్రమ పడి తమభావము లాతనికి నేర్పిరి. ఆ రా జా ద్వంద్వబోధచే క్రైస్తవమతముగురించి ముస్లిము అభిప్రాయమును, ఇస్లామును గూర్చి క్రైస్తవాభిప్రాయము గల్గి, అన్ని మతములు ద్రోహ కరములే యని విచిత్రాభిప్రాయుడై, అట్లు స్పష్టముగ తెలుపు చుండెను. అతని మతనింద గ్రంథస్థమైనది.

ఫ్రెడరికు పెరిగినతరువాత తన సంరక్షకునికి వ్యతిరేకి యయ్యెను. పోపు తనశిష్యు డగు ఫ్రెడరికు రాజైనప్పుడు కొన్ని షరతుల గోరెను. జర్మనీలోని మతక్రాంతి నణచివేయ వాగ్దానము జేయవలె; సిసిలీ దక్షిణఇటలీలలో రాజు రాజ్యాధి కారము వదలుకొనవలె; (లేకున్న పోపుకన్న నతడు ప్రబలు డగును.) జర్మనుమతాచార్యులకు పన్ను లుండరాదు. ఫ్రెడరికు అట్లే యనెను. కాని, అట్లు అమలుజరుపు నుద్దేశము లేదు. ఇంతకుముందే పోపు ఫ్రెంచిరాజును అతని ప్రజలగు వాల్డెన్సుల పై ఘోరమతయుద్ధమునకు పురికొల్పెను. జర్మనీలో ఫ్రెడరికు కూడ నట్లే చేయవలె నని పోపు కోరెను. పోపుకు ఆగ్రహ పాత్రులైన భక్తులకన్న పోపే యెక్కువ ధర్మద్వేషి యని ఫ్రెడ రికు భావము; అతడు మతయుద్ధముల దలపెట్టలేదు. ముసల్మా నులపై దాడి వెడలి జెరూసలెము రక్షింపు మని పోపు కోరగా ఫ్రెడరికు అట్లే యనెను. కాని, దానిని నెఱవేర్పలేదు.

చక్రవర్తి యైనతరువాత 2-వ ఫ్రెడరికు జర్మనీలో నుండక సిసిలీలోనే ఉండిపోయి పోపుకు తాను చేసిన వాగ్దాన

ముల చెల్లింపబడాయెను. 3-వ ఇనోసెంటు విభ్రాంతుడై 1216-లో మరణించెను.

ఆ తరువాత పోపైన 3-వ హానోరియసు ఫ్రెడరికు నేమియు జేయజాలకపోయెను. 1227-లో పోపు అయిన 9-వ గ్రిగరీ ఈయువకు నెట్లైన సాధింప నిశ్చయించి, అతనికి నాంఛ విధించెను. 2-వ ఫ్రెడరికుకు మతసదుపాయములు లేకుండ జేసెను. కాని అరబు మిశ్రితమగు సిసిలీఆస్థానములో ఇది యేమియు పనిచేయ లేదు. చక్రవర్తి లోపములను మతద్రోహచర్యలను చెడునడతను పేర్కొనుచు, పోప్ బాకబహిరంగలేఖ నంపెను. దీనికి ఫ్రెడరికు తీవ్రప్రత్యుత్తర మిచ్చెను; దానిని యూరపు రాజు లందరకు పంపి, అందు పోపుకు రాజుకు గల సంఘర్షసమస్యను స్పష్టముగ మొదలంట వివరించెను; యూరపుకంతకు నిరంకుశ ప్రభువగుటకు పోపు యత్నించుటను నిరసించెను; రాజులందరేకమై తమహక్కుల రక్షించుకోవలెనని సూచించెను; మతపీఠపు ఆస్తిసంపత్తులవంక రాజుల ప్రత్యేకదృష్టి నాకర్షించెను.

ఈయాగ్నేయాస్త్రమును ప్రయోగించి, ఫ్రెడరికు పండ్రెండేండ్లక్రిందటి తన వాగ్దానము చెల్లించుట కనుమిషతో ఒక "మతయుద్ధ" మారంభించెను. ఇది 6-వ క్రైస్తవమతయుద్ధము (1228). మతయుద్ధదృష్టితో నిది యొక ప్రహసనము; 2-వ ఫ్రెడరికు ఈజిప్టుకు వెళ్లి, సుల్తానును గలుసుకొని సామరస్యముతో సమస్యల జర్చించెను; ఇరువురును స్వమతావేశము లేనివారే; ఆలోచించి వ్యాపారదృష్టితో ఉభయులకు లాభకరమగు సంధి చేసికొనిరి; ఆప్రకారము జెరూసలెము ఫ్రెడరికువశ మయ్యెను. ఇది సంధిరూపమగు విచిత్ర మతయుద్ధము. ఇందు రక్తము

చిందుటగాని, ఆనందబాష్పములుగాని లేవు. ఈ యద్భుతమత యోధు నంతట మతాధికారులు వెలివేసిరి. కనుక ఆ క్షేత్రమున కిరీటము నతడు స్వహస్తముతోనే గ్రహించి, జెరూసలెంరాజ్యై సామాన్యపట్టాభిషేకమే చేసుకొనెను. అటనుండి యతడిటలీ చేరి, ఈలోగా తనరాజ్యము నాక్రమించిన పోపుసైన్యమును మర్దించి తరిమి, పోపు విధించిన ఆంక్షను అతనిచే నిర్బంధముగ రద్దు చేయించెను. 13-వ శతాబ్దమున చక్రవర్తి పోపునెడ నిట్లు వర్తించినను, ఆరాజుపై ప్రజల కాగ్రహము కలుగలేదు; ఆదినములు గతించెను.

1239-లో 9-వ గ్రిగరీ మరల చక్రవర్తితో తగవును మొదలిడి, రెండవమారతనిని బహిష్కరించి ఇదివరలో పోపుకు కళంకమిచ్చిన దూషణయుద్ధమును పెంచెను. 9-వ గ్రిగరీ అనంతరము 4-వ ఇన్నొసెంటు పోపైనపు డీ తగవు మరల వచ్చెను. ఫ్రెడరికుమతసంస్థల నిరసించుచు జను లందరకు జ్ఞప్తిలోనుండున ట్లింకొక లేఖను వ్రాసెను; మతాధిపులగర్వమును దుష్ప్రవర్తనను పేర్కొని, అప్పటి అవినీతికంతకును వారి ధనగర్వములే కారణములని చాటెను; మతసంస్థపవిత్రత నిల్పుటకే మతాధిపుల ఆస్తినంతను లాగుకొనవలె నని తోడిరాజులకు సూచించెను. ఈవిషయము యూరపురాజుల హృదయముల నాటుకొనెను.

ఆతని తుదివత్సరముల గురించి చెప్పబోము. ఆతని వ్యక్తి విషయములకన్న, ఆజీవితముచేగలిగిన వాతావరణమే ముఖ్యము. సిసిలీలో అతని ఆస్థానకథ కొంతవరకు తెలియును. అతడు సౌందర్యోపాసి, భోగి; జారు డనిగూడ వర్ణింపబడెను. అన్ని విషయములు స్వయముగా జర్చించి తెలుసుకొన యత్నించెను;

తన ఆస్థానముకు ముస్లిము క్రైస్తవతత్వజ్ఞుల రప్పించి, ఇటాలియనులకు తురుష్కుల సిద్ధాంతవిజ్ఞానముల బోధింపజేసెను. అరబికు అంకెలు బీజగణితము క్రైస్తవవిద్యార్థుల కతనిమూలముననే బోధింపబడెను. అతని ఆస్థానవిద్వాంసులలో నొకడగు 'మైకేలు స్కాటు' అరిస్టాటిలు గ్రంథపు కొన్ని భాగములను, గొప్ప అరబ్బుపండితుడగు 'ఎవర్రోసు' వ్రాసిన టీకసహితముగ తర్జుమాచేసెను. ఫ్రెడరికు 1224-లో నేపిల్సు విశ్వవిద్యాలయము స్థాపించి, 'సెలరినో' విశ్వవిద్యాలయమందలి గొప్పవైద్యశాలాశాల నభివృద్ధిపఱచెను; జంతుప్రదర్శనశాలనుగూడ స్థాపించెను. డేగలవేటనుగూర్చి యాతడు వ్రాసిన గ్రంథమునుబట్టి అతడు పక్షిహృదయజ్ఞు డని కన్పడును. అత డిటాలియనులో పద్యముల వ్రాసెను. ఇటాలియను పద్యరచన అతని ఆస్థానమందే ఆరంభించెను. ఒక సుప్రసిద్ధగ్రంథకారు డాతనిని "మొదటి ఆధునికుడు" అనెను. ఇం దాతని నిష్పక్షపాతవిద్యాభిమానము సూచితము.

అంతట పోపులు బలీయులగు ఫ్రెంచిరాజులతో కలహించిరి. అందుతో పోపుల అధికారశేషముగూడ నశింపజొచ్చెను. 2-వ ఫ్రెడరికు పోగనే, జర్మనీ చీలికలై విడిపోయెను. ఇంతకుపూర్వము హోహెనుస్టాఫెను చక్రవర్తుల కుండిన స్థానము ను ఫ్రెంచిరా జాక్రమించి, పోపులకు రక్షకుడు సహాయుడు ప్రత్యర్థియు అయ్యెను. అనేకపోపులు వరుసగ ఫ్రెంచిరాజులకు సహాయులైరి. రోము సహాయమున ఫ్రెంచిరాజులు నేపిల్సు సిసిలీరాజ్యముల బాలించుచు, తిరుగ ఛార్లమనునాటిసామ్రాజ్యము నుద్ధరించి పాలించుట కవకాశములు పొందిరి. ఫ్రెడరికు

తరువాత హోహెను స్టాఫెనువంశ మంతమొందెను. 1273-లో హాబ్సుబర్గులోని రొడాల్ఫును ప్రథమ హాబ్సుబర్గు చక్రవర్తిగ నెన్నుకొనిరి. అప్పటినుండియు పోపులు తమ ప్రత్యేకాభిరుచులబట్టి ఒకరు ఫ్రాంసుకును, మరొకరు జర్మనీకిని, సహాయ మొనర్చుచుండిరి. ప్రాచ్యదిశను 1261-లో గ్రీకులు మరల కాన్స్టాంటినోపిలును లాటినులనుండి జయించిరి. ఈనూతన గ్రీకు రాజవంశపు మూలపురుషుడగు 8-వ మైకేలు పోపుతో సంధి యొనర్చునట్లు కొంత నటించి, రోమను మతపీఠమునుండి విడిపోయెను. ఇందువలనను, ఆసియాలో లాటినురాజ్యముల అంతముతోను ప్రాగ్దిశను పోపులఆధిక్య మంతరించెను.

1294-లో 8-వ 'బోనిఫేసు' పోపు పదవికి వచ్చెను. అతడు ఇటలీవాసి; ఫ్రెంచివారి విరోధి; రోమక సంప్రదాయాదర్శములం దభిమానియై, తీవ్రముగ వర్తింప మొదలిడెను. 1300-లో అతడొక వర్ధంతి జరుపగా, రోములో చాలమంది యాత్రికులబృందములు చేరెను. "సెంటు పీటరు" సమాధి యొద్దకు తేబడు బహుబాకృతిద్రవ్యములు గ్రహించుట కిరువురకు తీరికలేకుండెనట. కాని, యీయుత్సవము ఆభాసమాయెను. 1302-లో నితడు ఫ్రెంచి రాజుతో కలహించి, 1303-లో ఆ రాజుపై ఆంక్ష విధింపనుండగా, "అనగ్ని"లో తన పూర్వికుల మందిరములోనే గిల్లామ్‌డీ నోగరెట్ అనువా డతని హఠాత్తుగా బంధించెను. ఫ్రెంచిరాజు పంపిన ఆ చారుడు మందిరము లోనికి జొరబడివచ్చి, భయభ్రాంతుడై చేత శిలువబూని శయ్యాగతుడైన పోపును బెదరించి, అవమానపఱచెను; ఒకటి రెండు దినములలో నా నగరవాసులచే విడిపింపబడి పోపు రోముకు

వెడలిపోయెను. కాని, అక్కడ తిరుగ ఓర్సినీకుటుంబికులచే బంధితుడై కొన్ని దినములలో నిర్విణ్ణుడై ఆ వృద్ధుడు మరణించెను.

"అనగ్ని" ప్రజలు మొదటిదౌర్జన్యము గర్హించి, బోనిఫేసును విడిపించుటకు నోగరెట్టుపై కత్తిగట్టిరి. అప్పటికి "అనగ్ని" పోపు స్వగ్రామము. ఈ సందర్భమున ఫ్రెంచిరాజు క్రైస్తవ జగద్గురునెడ నీ దౌర్జన్యము జరుపుచు ఫ్రాన్సులోని ప్రభువులు మతసంస్థలు సామాన్య జనులు ఈ మూడుసంస్థల సమావేశము చేసి వారి అంగీకారము పడసెను. ఫ్రాంసులోను ఇటలీలోను పోపుపై జరిపిన యీ అత్యాచారమునెడ క్రోధసూచనలే లేవు. క్రైస్తవ పీఠాధికారము దుర్బల మయ్యెను. ప్రజా హృదయములపై దాని ప్రభావము నశించెను.

14-వ శతాబ్దమం దంతటను పోపులు తమగౌరవమును తిరుగ సంపాదింపలేదు. తరువాత ఎన్నుకోబడిన పోపు 5-వ క్లెమెంటు ఫ్రెంచిరాజగు ఫిలిప్‌చే కోరుకోబడెను. అత డెన్నడును రోముకు రాలేదు. తన ఆస్థానమును ఫ్రాంసుదేశమున 'అవిగ్ననుపురి'లో నేర్పఱచెను. 1337 వరకు అతనితరువాత వారంద రక్కడనే వసించిరి. అసాలున పోపు (11-వ గ్రిగరీ) రోములోని 'వాటికను' మహలులోనికి వెడలెను. కాని 11-వ గ్రిగరీ మతసంస్థ లన్నిటి అంగీకారము బొందలేదు. ఉన్నతమతగురువు లనేకులు ఫ్రెంచివా రగుటచే వారి యభ్యాసనహావాసములు 'అవిగ్నను'లో లగ్నమై యుండెను. 1378-లో గ్రిగరీ మరణించినపుడు ఇటలీవా డగు 6-వ అర్బను పోపుగా నెన్నుకోబడెను. ఈ వ్యతిరేకి గురువులు ఆయెన్నిక చెల్లదని చాటి 7-వ

క్లిమెంటును పోటీపోపుగా నెన్నుకొనిరి. ఈ చీలికయే 'మహా విభేద' మయ్యెను. రోములోని పోపుకు ఫ్రెంచిద్వేషు లగు చక్రవర్తి, ఇంగ్లండురాజు, హంగెరీ, పోలండు, ఉత్తరయూరపు రాజులు భక్తులైరి. ప్రత్యర్థిపోపులు 'అవిగ్నను'లో వసించుచు ఫ్రెంచిరాజు అతనిమిత్రులగు స్కాట్లండు, స్పెయిను, ఫోర్చుగలు రాజులు, అనేక జర్మనురాజన్యులు వీరిసహాయమును బొందు చుండిరి. వారిలో ప్రతిపోపును తనప్రత్యర్థి ననుసరించెడి వారిని బహిష్కరించుచుండెను (1378-1417). ఈ కల్లోలముచే యూరపు అంతటను మతవిషయములగురించి ప్రజలు స్వతంత్రాలోచనపరు లయిరి.

అంతట మతసంస్థను వీలువెంబడిని సంస్కరించుటకో, లేక ధ్వంసమొనర్చుటకో, క్రైస్తవలోకమున అనేక నూతనోద్యమములు బయలుదేరెను. ఈ క్రొత్త ఉద్యమములు ప్రత్యక్షముగ వ్యతిరేకించి పోపుప్రవృత్తిని ఖండించుచుండెను. 12-వ శతాబ్దము తరువాత 'విక్లిఫ్' (1320-1384) బయలుదేరెను. అతడొక గొప్ప ఆక్సుఫర్డువిద్వాంసుడు. పెద్దవాడైనతరువాత నతడు మతగురువుల అవినీతివర్తనమును పీఠాధిపుల అజ్ఞానమును చాల సార్లు బహిరంగముగ ఖండించెను. తన అభిప్రాయముల వెల్లడించుటకు 'విక్లిపైట్ల'ను బీదమత ప్రచారకుల సంఘము నేర్పఱచెను. తనకును మతపీఠమునకును గల సమస్యల ప్రజ లెఱుంగుటకై బైబిలు నాంగ్లములోని కనువదించెను. ఈతడు వెనుకటి సెంటుఫ్రాన్సిసు సెంటుడామినుకులకంటె విశేషవిద్యావంతుడు, అధికసమర్థుడు. పెద్ద లనేకు లాతనికి సాయముచేసిరి.

చాలమందిజను లాతని కనుచరులై రి. పోపు కినుకవహించి అతనిని ఖైదుచేయ నాజ్ఞాపించెను. అతడు జీవితాంతమువఱకు పూర్ణ స్వేచ్ఛతోనే యుండెను. కాతలికుమత పీఠమువారు మూర్ఖులై, తరువాత నతనిశల్యముల పెకలించిరి. 1415-లో కాన్‌స్టన్సు సభవారి తీర్పుప్రకారము 1428-లో 5-వ మార్టిను (పోపు) 'ఫ్లెమింగ్' అను బిషపుద్వారా సమాధినుండి విక్లిఫుఅస్థుల త్రవ్వి యెత్తించి తగులబెట్టించెను. ఈదుశ్చర్యను తుంటరి వ్యక్తులు కాక, మతపీఠమువారే అధికారరీత్యా జరిగించిరి!

# 48. మంగోలువిజయములు

13-వ శతాబ్దమున యూరపులో పోపు తనఆధిపత్యమున క్రైస్తవలోకము నేకముచేయ యత్నించి విఫలుడయ్యెను. ఈలోగా నంతకన్న విశాలరంగమగు ఆసియాలో చాలముఖ్య విషయములు జరుగుచుండెను. చీనా కుత్తరదేశమందలి మంగోలులను తార్తారుజాతీయులు హఠాత్తున జగత్కథలో ప్రముఖులై, వరుసగ నిరుపమానజయముల బొందుచుండిరి. తమ పూర్వులగు హూణులవలె ఆశ్వికులై వీరు 13-వ శతాబ్దము మొదట సంచారశీలురై మాంసము గుఱ్ఱపుపాలు భుజించుచు, కంబళ్లగుడారములలో నివసించుచుండిరి. చీనారాజుల అధికారమునుండి స్వేచ్ఛనొంది వీరు ఇతరతురుష్కుల నొకయోధసంస్థగ కూడదీసిరి. వీరికేంద్రము సైబీరియాలోని 'ఓనాన్' నదీతీరము.

ఆ సమయమున చీనా విభిన్నమై యుండెను. 'టాంగు' వారివంశము 10-వ శతాబ్దమునాటికి క్షీణించెను; దేశములో అంతఃకలహములు కల్గి, అందు మూడు ముఖ్యసామ్రాజ్యములు నిలిచెను. ఉత్తరమున పెకిన్ రాజధానిగాగల 'కిన్'ల సామ్రాజ్యము, దక్షిణమున నాన్కిన్ ముఖ్యపట్టణముగాగల సంగ్ సామ్రాజ్యము, మధ్యభాగమున హిసియా సామ్రాజ్యము నుండెను. 1214-లో మంగోలునాయకు డగు చెంగిజ్ ఖాను 'కిన్' సామ్రాజ్యముపై దాడివెడలి పెకినును పట్టుకొనెను. అటనుండి పశ్చిమమున కరిగి పశ్చిమతుర్కిస్థానము, పర్షియా, ఆర్మే

నియా, ఇండియాలో లాహోరువరకు, యూరపులో హంగేరీ సైలీషియాలవరకును, దక్షిణరష్యాను జయించెను. అతడు పసిఫిక్ మహాసముద్రమునుండి 'నీపరునది'వరకు వ్యాపించిన ఈ విశాలసామ్రాజ్యముకు ప్రభువాయెను.

అతని తరువాతివాడగు ఒగ్డెఖాను మంగోలియాలోని 'కారకోరము'లో స్థిరరాజధానిని నిర్మించి, అద్భుతజైత్రయాత్ర సాగించెను. అతనిసైన్యములు చాలనిపుణముగ తయారు చేయబడెను. చీనావారు కనిపెట్టిన తుపాకిమందు సంపాదించి వారు చిన్నతుపాకుల నుపయోగించి 'కిన్' సామ్రాజ్యమును పూర్తిగా జయించి 1235-లో ఆసియానుండి రష్యావరకు అద్భుతముగ వ్యాపించిరి; 1240-లో కీఫ్ నిర్మూలింపబడెను. రమారమి రష్యాఅంతయు మంగోలుల అధీనమయ్యెను. పోలండు ధ్వంసము గావింపబడి పోలులు జర్మనులు గలిసిన ఒకసైన్యము దక్షిణసైలీషియాలో 'లీగ్నిజ్'వద్ద 1241-లో సర్వనాశ మొనర్పబడెను. అంతకంతకు వెల్లివిరియు నీవాహిని నరికట్టుటకు ఫ్రెడరికు విశేషయత్నము లొనరించినట్లు కన్పింపదు.

గిబ్బను రచించిన "రోముక్షీణత, పతనము" అను గ్రంథపు టీకలో బ్యూరీగారిట్లు వ్రాసిరి. 1241-లో మంగోలులు పోలండును జయించి, హంగేరి నాక్రమించుటకు కేవల సంఖ్యాబలమే గాక, అత్యద్భుతమగు యుద్ధచాతుర్యమే కారణమని ఇటీవలనే యూరపియను చారిత్రకులు గ్రహించిరి. కాని తార్తారులు విజ్ఞానము - వ్యూహనైపుణ్యములేని మోటుగుంపులవారనియు, సంఖ్యాబలముననే తూర్పుయూరపునంతను జయించి

అడ్డువచ్చినవారినెల్ల ధ్వంసమొనర్చుచు తిరిగి రని కొందఱింకను పారబడుచున్నారు.

యథార్థముగ (మధ్యయూరపులోని) దక్షిణవిశ్చులానది మొదలు ట్రాన్సిల్వేనియావరకు విజయకార్యక్రమమంతయు అంత కట్టుదిట్టముగను జయప్రదముగను నడిపించుట అద్భుతము. ఆజైత్రయాత్ర అప్పటి యూరపుసేనలకు అసాధ్యము; యూరపు సేనానుల కగ్రాహ్యము. 'సుబూటైను'బోలు సేనాని 2-వ ఫ్రెడరికు మొదలు ఒక్కడైన యూరపులో లేడు; మంగోలులు హంగెరీ పోలండుల రాజకీయపరిస్థితులను పూర్తిగ కనిపెట్టియే ఆయాత్రకు గడంగిరి. ఆ దేశస్థితిగతుల గూఢచారులద్వారా సరిగా దెలుసుకొనుచుండిరి. హంగేరీవారు మున్నగు క్రైస్తవ సేనలో మూఢబాలిశులవలె నయి తమప్రత్యర్థులగు మంగోలుల రణచాతుర్యమును గ్రహింపరైరి. గ్నిజ్ వద్ద మంగోలులు విజయమందినను ఇంకను పశ్చిమమునకు చొరలేదు. అచ్చటి కొండలు అడవులు తమ వ్యూహపద్ధతులకు సరిపడవు. కనుక వారటనుండి దక్షిణాభిముఖులై 'సితియను' 'అవారు'హూణాది మిశ్రితజాతుల సంతకుపూర్వము మాగ్యర్లు నాశమొనర్చినట్లే సజాతీయులగు ఆమాగ్యరులను చంపియో, లేక తమలో కలుపుకొనియో, హంగేరీలో స్థిరవాసులు కా యత్నించిరి. అంతకు ముందు హంగేరియనులవలెనే వీరును అటనుండి నైరృతిదిశను దాడి వెడలియుందురు. ఈలోగా ఒగ్డయిఖాను హఠాత్తుగ మరణించెను. 1242-లో సింహాసనమునకై కొంతతగవు రాగా, హంగేరీ రుమేనియాలగుండ అపరాజితులగు మంగోలు లటనుండి తూర్పుకు తిరిగిపోయిరి.

తరువాత మంగోలులు తమదృష్టిని ఆసియాకు మరల్చిరి. 13-వ శతాబ్దమధ్యకు వారు 'సంగ్ సామ్రాజ్యము' జయించిరి. 1251-లో ఒగ్డైఖాను తరువాత మంగూఖాను నాయకుడై, తనసోదరుడగు 'కుబ్లైఖాను'ను చీనాగవర్నరుగ నియమించెను. 1280-లో కుబ్లైఖాను చీనాచక్రవర్తియై, 'యువాను వంశము'ను స్థాపించెను. వారు 1368 వఱకు పాలించిరి. చీనాలో సంగు ప్రభుత్వపు తుదిఛిద్రము లంతరించుచుండ మంగుకు మరియొక సోదరుడగు 'హూలాగు' పర్షియా సిరియాల జయించెను. అప్పటి మంగోలులు ఇస్లాముకు విరోధులు; బగ్దాదునగరము పట్టుకొని నపుడా పౌరుల వధించి, ప్రాచీనసుమేరియా కాలమునుండి మెసపొటేమియానుర్వరగ సమృద్ధజనముగ నుంచిన అతిప్రాచీన మగు జలాశయముల ధ్వంస మొనర్చిరి. ఆనాటినుండి మెసపొటేమియా శిథిలములతో ఎడారియై, ఏదో కొలదిమందికే జీవనాధారమైనది. మంగోలు లీజిప్టులో చొరలేదు. 1260-లో హూలాగుసైన్యము నొకదానిని పాలస్తైనులో ఈజిప్టుసుల్తాను పూర్తిగ నోడించెను.

అంతట మంగోలువాహిని వెనుకకు తగ్గెను. ఆ ఖాను సామ్రాజ్యము చిన్నచిన్నసంస్థానములుగా విడిపోయెను. చీనావారివలెనే తూర్పుమంగోలులు బౌద్ధులైరి. పశ్చిమశాఖవారు ఇస్లాము స్వీకరించిరి. 1368-లో చీనులు యువానువంశమును తొలగించి స్వకీయమగు మింగువంశము స్థాపించిరి. ఆరాజవంశము 1368 నుండి 1644 వరకు నిలిచెను. 1480 వరకు రష్యనులు తార్తారుదండులకు లోబడియేయుండిరి. కాని, ఆసాలున రష్యా

రాజధానియగు మాస్కోలో గ్రాండుడ్యూక్ అను సామంత ప్రభువు పూర్ణస్వతంత్రుడై, ఇప్పటి రష్యారాజ్యముస్థాపించెను.

14-వ శతాబ్దమున చెంగిజ్‌ఖాను వంశీయుడగు తైమూర్లేను మరల మంగోలుప్రతిభను వ్యాపింపజేసి, పశ్చిమతుర్కిస్థానములో రాజ్యము స్థాపించి, 1369-లో 'మహాఖాను' పదవి నధిష్ఠించి సిరియామొదలు ఢిల్లీవరకు జయించెను. ఆసామ్రాజ్యమాతనియనంతరమే నశించెను. ఆతని వంశీయుడగు బాబరు అను సాహసియగు వీరుడు తుపాకులసహాయముతో సేనను తెచ్చి, ఉత్తరభారతదేశములో ప్రవేశించెను. అతని మనుమడగు అక్బరు (1556—1605) ఆతనివిజయమును సంపూర్తి చేసెను. ఈ మంగోలువంశము హిందూదేశమున విశేషభాగముపై 18-వ శతాబ్దమువరకు ఢిల్లీలో పాలించెను. (వీరినే ఆరబులు మొగలు లనిరి. అదే వీరి ప్రతినామ మైనది.)

13-వ శతాబ్దమున ఈ మంగోలుదండయాత్ర ఫలితముగ ఒట్టమనుతురుష్కు లనబడిన యొకతురుష్కజాతి తుర్కిస్థానము నుండి ఆసియామైనరుకు పోయిరి; అచ్చట వారు రాజ్యమును వ్యాపింపజేసి, డార్డెనల్సుజలసంధి దాటి, మాసిడోనియా సెర్వియా బల్గేరియాలపై దండెత్తిరి. తుదకీ ఒట్టమనురాజ్యములమధ్య కాన్స్టాంటినోపిల్ లొక చిన్నద్వీపమువలె నుండెను. 1453-లో ఒట్టమను సుల్తానగు 2-వ మహమ్మదు చాల తుపాకులసహాయముతో యూరపువంకనుండి ముట్టడించి కాన్స్టాంటినోపిలును పట్టుకొనెను. ఈసంగతి యూరపులో కల్లోలము గల్గింప మరల మతయుద్ధప్రశంస కలిగెను; కాని మతయుద్ధదినము లంతరించెను.

16-వ శతాబ్దమున ఒట్టమనుసుల్తానులు బాగ్దాదు హంగరీ ఈజిప్టులను, రమారమి ఉత్తరఆఫ్రికానంతను జయించిరి; వారికి నౌకాదళముచే మధ్యధరా సముద్రాధికారము వచ్చెను. వారు ఆస్ట్రియారాజధాని యగు వియన్నానుగూడ బట్టుకొన బోయి, ఆచక్రవర్తివద్దనుండి కప్పము గ్రహించిరి. 15-వ శతాబ్దపు క్రైస్తవరాజ్యముల హీనస్థితికి రెండేమినహాయింపులు; మొదటిది: 1480-లో మాస్కో స్వాతంత్ర్యపునఃస్థాపనము; రెండవది: క్రైస్తవులు క్రమముగ స్పెయినును తిరుగ జయించుట. 1492-లో ఆద్వీపకల్పములోని 'గ్రనడా' అను తుది మహమ్మదీయసంస్థానముగూడ 'ఆరగను'రాజగు ఫెర్డినండుకును అతనిభార్య కాస్టైలురాణి అగు 'ఇజబెల్లా'కును లొంగిపోయెను.

చివరకు 1571-లో లెపాన్టోవద్ద నౌకాయుద్ధము జరిగి, అందు ఒట్టమనులగర్వ మడగెను. అంతవరకు మధ్యధరా సముద్రప్రాంతము క్రైస్తవాధికారములోనికి రాలేదు.*

---

* 11-వ శతాబ్దమునుండి మనభారతదేశమున వివిధ ముసల్మను రాజులు కొంతకొంత వ్యాపించిరి. 8-వ శతాబ్దమున అరబ్బులు సముద్రముపైన వచ్చి దాడిసల్పి, సింధులో కొందరి నిస్లాముకు మార్చిరి. కాని వారియధికారము నిలువలేదు. అందుచే ఆప్రాంతపు విజ్ఞానముమాత్రము 8-వ శతాబ్దమందే అరబ్బులకు వ్యాపించెను. వాయవ్యప్రాంతపు ఆఫ్ఘనిస్థానమునుండి 11-వ శతాబ్దమున మహమ్మదుఘజినీ అనేకదండయాత్రలు సలిపి, దేవాలయాకలనుండి చాలద్రవ్యము గ్రహించెను. కాని మనదేశమున రాజ్యస్థాపన చేయలేదు. 12-వ శతాబ్దపు 'మహమ్మదుగోరి' ఆర్యావర్తమున పరరాజ్యస్థాపన నారంభించెను. భారతీయయోధులు శూరులైనను, అప్పు డార్యావర్తము చిన్నచిన్నరాజ్యములుగ విభక్తమయి, ఆరాజులు నిరంతరము కల

హించుచుండిరి. విదేశీయులగు ప్రబలశత్రువులు వచ్చినప్పుడైన, స్వదేశరక్షణకై అందరు నేకీభవింపరైరి. హిందువులలో బౌద్ధులలోగూడ అప్పుడు విగ్రహారాధన కులాచారాది బాహ్యచిహ్నములకే ప్రాబల్యము కలిగి, నిజమగు మతధర్మముల జనులు మరచిరి. అప్పటికి పరస్పరము భాషాభేదము నేర్పడెను. వారు తుపాకుల నవ్యోపయోగమును గ్రహింపరైరి. ఇస్లాముమతావేశమున పరులు జాతీయోత్సాహముతో కలసి పోరుచుండ, భారతీయయోధులు విజ్ఞానము స్తంభించి కులవిభేదములతోను పరస్పరాసూయలతోను సహకారహీనులై యుండిరి. అఫ్ఘనులు శీతలదేశపుకొండలలో అశ్వములపై చురుకుగ వ్యూహ మేర్పర్చి చరించుచు, నవీనపద్ధతుల యుద్ధముల సాగించిరి. భారతీయులట్లుగాక, పూర్వపురీతినే ఏనుగులతోను సంఘటన లేని అశ్వికపదాతులతోను, ఆడంబరయుతులగు అనుచరులతోను, ప్రాచీనపద్ధతులతో యుద్ధ మొనర్చిరి. అందుచే గోరి, కుతుబుద్దీను, అల్లాయుద్దీను ఖిల్జీ, మహమ్మదు తుగ్లకు మొదలగు తురుష్కరాజులు ఆర్యావర్తమును (కొంతవరకు దక్కనుప్రాంతముగూడ) జయించి పాలించిరి; బెంగాలు గుజరాతు దక్కను మొదలగు ఆయాప్రాంతములందు తురుష్కరాజు లేర్పడి, క్రమముగ స్వతంత్రులు కాజొచ్చిరి. అప్పుడు పెద్ద హిందూదేవాలయములందును బౌద్ధవిహారములందును అమూల్యమైన చాల బంగారుఆభరణములు వాహనములు రత్నములు వజ్రములు నుండెను. వాటిని హరించుటకును, ఆలయవిగ్రహముల నిర్మూలించుటకును, తురుష్కులు నిశ్చయించుకొనిరి. ఆ తురుష్కరాజులలో కొంద రాయాలయప్రాకారముల బడగొట్టి చొచ్చి అందలి విశేషధనరత్నాదుల దీసికొనిరి. 14-వ శతాబ్దము చివర తైమూరు అను మంగోలునాయకుడు వనదేశపు వాయవ్యప్రాంతమున దాడి సలిపి, అచటి రాజధాని యగు ఢిల్లీని కొల్లగొనినప్పుడును, తమలో తగవు పడుచు, భారతీయరాజు లతని నాపలేకపోయిరి. 13, 14 వ శతాబ్దులందు త్రిలింగదేశరాజు కాకతీయుడు అగు ప్రతాపరుద్రదేవునికి ముసల్మానురాజులతో పోరు సాగుచు, తుదకు కాకతీయరాజ్యము క్షీణించెను; అం వధికారులుగ

నుండిన హరిహరబుక్కరాయలు 14-వ శతాబ్దిమధ్యమున తుంగభద్రాతీర మున విద్యానగరరాజ్యమును స్థాపించి ప్రబలులై, మహమ్మదీయులదాడు లణ చిరి. కొంతమతద్వేషాదులచేతను, సవర్ణహిందువుల వెలివల్ల పంచమహిందువు లనేకులు ముస్లిము లగుటయు, హిందూముసల్మనురాజులమధ్య సహకారము లేకుండినను జనపదములందు సంస్కృతి చెడలేదు. చిరకాలాగతమగు గ్రామ పంచాయితీపద్ధతి నిల్చియుండెను; గ్రామములందు శిల్పములు పరిశ్రమలు వృద్ధిలోనే యుండి, మన దేశము అప్పుడు ప్రశస్తమగు నౌకలపైని ఇతరదేశము లతో దూరవర్తకవ్యాపారములు సలుపుచుండినట్లు 'మార్కోపోలో' మొద లగు యాత్రికులు వ్రాసిరి. ఇందు తయారైన సన్నని బట్టలు ఇతరవస్తువులు విరి విగ విదేశముల కెగుమతియగుచుండెను; ఘజినీ సుల్తాను మొదలగురాజు లచ్చటి శిల్పకళాప్రవీణుల నాఫ్ఘనుదేశాదులకు దీసికొనిపోవుచుండిరి. కుతుబుద్దీను (క్రీ. శ. సుమారు 1200) హయామున కట్టిన ఉక్కుధ్వజస్తంభ మీనాటి కిని చెడిపోక, ఆధునిక వైజ్ఞానికలోహశిల్పులకు నాశ్చర్యకరముగనుండుట అప్పటి శిల్పకళాభివృద్ధిని తెల్పును.

16-వ శతాబ్దమున మొగలుసామ్రాజ్య మారంభించెను. దానిస్థాపకు డగు బాబరుతల్లిది మంగోలుజాతి; తండ్రిది తుర్కిజాతి. బాబరుకు తుపాకులు మందుసామాను లుండెను. అతనిసైనికులు కొండదేశములం దశ్వములపై స్వారి చేయుచు యుక్తితో యుద్ధ మొనర్చుటలో నారితేరినవారు. అప్పుడు ఢిల్లీ పాలకుడగు 'ఇబ్రహింలోడి' గర్వి, క్రూరుడు అయినందున అతనిచే బాధితు లైన ఆస్థానరాజన్యులే భారతదేశసంపత్తిచే నాకృష్టుడైన బాబరును ఢిల్లీ రాజుతో యుద్ధముచేయ నాహ్వానించిరి. అంతట 1527-లో పానిపట్టు యుద్ధమున విభేదయుతమగు లోడీసేనలను, 1527-లో 'ఖాండ్వ' యుద్ధ మున 'మేవారు రాణా'యగు సంగ్రామసింహుని సేనలను, సాహసి ధీమంతుడు నగు బాబరు తుపాకులసహాయముతో నోడించి, 'మొగలు రాజ్యము' స్థాపిం చెను. అతడు క్రమముగా తనరాజ్యమును విస్తరింపజేయుచు, 1530-లో

చనిపోయెను. అతని కుమారుడగు హుమయూను యోగ్యుడైనను అసమర్థుడు. 1540-లో కనోజ్ వద్ద బీహారుపాలకుడగు ఆఫ్ఘనువీరునిచే నోడి, రాజ్యభ్రష్టు డయ్యెను. అంతట విజయియైన 'షర్షా' ఢిల్లీరాజై, ఆర్యావర్తమంతను జయించి, రాజ్యపాలనలోను ఆర్థికసంస్కరణముచేతను సేనలోను న్యాయశాఖలోను కట్టుదిట్టముల నేర్పఱచి, గొప్పరస్తాల నిర్మించి సౌకర్యముల గల్పించియు, సౌఖ్యకరముగ సమర్థతతో రాజ్యము నిర్వహించెను. షర్షాఅనంతర మతనివంశీయు లశక్తులైరి. ఈలోగా పర్షియారాజుసహాయమున హుమయూను మరల సేనల సంపాదించి గాంధారమును పంజాబును జయించెను; అతడు ఢిల్లీ ఆఫ్ఘనుసుల్తానును 'సర్హిందు' యుద్ధమం దోడించి, మొగలురాజ్యమును మరల స్థాపించి, 1556-లో చనిపోయెను. అతని కుమారుడగు అక్బరు వీరుడు; ధీరోదాత్తుడు. అతడు యువకుడయ్యు, 1560 నుండి స్వతంత్రపాలన నారంభించెను క్రమముగా అక్బరు విజయియై, ప్రస్తుతపు మద్రాసు రాష్ట్రము నిజాంరాజ్యప్రాంతము తప్ప మిగిలిన భారతమంతను తన సామ్రాజ్యమున జేర్చి, 1605 వరకు సమర్థతతో బాలించెను. 16-వ శతాబ్దమున మధ్యయూరపుచక్రవర్తి యగు 5-వ చార్లెసు, ఫ్రెంచిరాజగు ఫ్రాంసిసు, ఇంగ్లండుపాలకులగు 8-వ హెన్రీ ఎలిజబెతులు, స్పెయినుచక్రవర్తి యగు 2-వ ఫిలిప్పు మొదలగు అప్పటిరాజు లందరికన్న అక్బరే ఎక్కువ మహానీయుడు, దూరదర్శి, ప్రాజ్ఞుడు, జనక్షేమపరుడు అని చెప్పవచ్చును. అశోకునివలె గాక అక్బరు చాల యుద్ధ దండయాత్రల జేసి, విశేషరక్తపాతము గావించెను. కాని తాను స్థాపించిన సామ్రాజ్యము స్థిరము బలీయము శాంతముగ జేయుటకు శ్రమపడెను. కనుకటి తురుష్కరాజులవలె గాక, అతడు హిందూమహమ్మదీయులమధ్య అనుకూలత ఏకీభావము అవసర మని గ్రహించి, అందుకై పాటుపడెను; అంతర్వివాహములగూడ ప్రోత్సహించెను. మతమూర్ఖత తగ్గింపజేసెను; విద్వాంసులచే సర్వమతముల సిద్ధాంతములను చర్చింపజేసి, భావ

దాస్యము తొలగించి, సర్వమతసముడై, నిష్పక్షపాతియై, జనులలో పరస్పర స్నేహమును వృద్ధిచేసెను. ఆయామతస్థులు బాహ్యచిహ్నములకును శుష్కాచారములకొరకును కలహించుట ఆయన కిష్టముకాకుండెను; అన్నిమతముల మూలసూత్రము లొకటే యని ప్రచురించెను. ముసల్మనుమతశాఖలలో 'సూఫీ' మతము తనకు నచ్చెను; జీవాత్మలన్నియు పరమాత్మనుండి వచ్చి దానితో అవినాభావసంబంధము గలవను మనవేదాంతతత్త్వమే దీని సిద్ధాంతము. 13-వ శతాబ్దముమధ్య యూరపుచక్రవర్తి యగు 2-వ ఫ్రెడరికువలె అక్బరును సర్వమతబాహ్యచిహ్నములను ఆచారవివాదములను నిరసించినను అతనివలె నాస్తికుడు గాక, తత్త్వజ్ఞుడై యథార్థ వేదాంతియై విశ్వప్రేమను గల్గియుండెను. షర్షా ఆరంభించిన నాణెములపద్ధతిని, రాజ్యాంగసంస్కరణములను, అక్బరు ఉద్ధరించి వృద్ధిచేసెను; భూమిపన్ను వసూలుపద్ధతి ఆయాతాలూకాలపాలనము న్యాయనిర్వహణము పూర్తిగా సంస్కరించి చక్కనిస్థితికి దెచ్చెను; రస్తాలబాగుచేసి సత్రముల నిర్మించి ప్రయాణవ్యాపారములకు సౌకర్యము కల్గించెను; పరాజితుల బానిసలుగ చేయుపద్ధతిని నిర్మూలించెను; యాత్రికుల పన్ను, 'జిజియా' (తురకలు కానివారిపై పన్ను) మొదలగు చెడుపన్నుల దొలగించి, ఉద్యోగు లక్రమముగా ప్రజల బీడింపకుండ తగు నిబంధనల జేసెను; హిందువులందు వ్యాపించిన 'సతీ' పద్ధతి (వితంతువుల నిర్బంధమరణము) అతిబాల్యవివాహములు విభిన్నవయస్కవివాహములు సమీపబంధువివాహములు మొదలగు సాంఘికదురాచారముల నిరుత్సాహపఱచెను; హిందూమతాదుల మన్నించెను; జాతిమతభేదములు లేకుండ తోడర్మల్ మానసింహాది సమర్థులగు హిందువులగూడ ఉన్నతోద్యోగుల జేసెను. అప్పుడు సంస్కృతమును హిందీ మొదలగు దేశభాషల సాహిత్యమునకును మంచిప్రోత్సాహము కలిగెను. భట్టోజిదీక్షిత సూరదాసు తులసీదాసు మొదలగువిద్వాంసులు సుమా రాకాలమువారే. అక్బరు విజ్ఞానాభివృద్ధిగూడ

గల్గించెను. 15-వ శతాబ్దిని రామానందకబీరులు, 16-వ శతాబ్దమున చైతన్య నామదేవనానకులు పరిశుద్ధమైన భక్తిని బోధించిరి. హిందూమహమ్మదీయ సంస్కృతులమధ్య సమీకరణయత్నములు జరిగెను; అక్బరు అనంతర మొక శతాబ్దమువరకతని పుత్రపౌత్రపాలనమునగూడ (వారి కట్టి ప్రజ్ఞ ఔదార్యము లేకున్నను) భారతదేశస్థితి బాగుగనుండెను. దేశమందు రాజాదరణమున అనేకపరిశ్రమలు కళలు అభివృద్ధిచెందెను; సుందర రాజమందిరము లెన్నియో నిర్మింపబడెను. అక్బరు మనుమడగు షాజహాను కట్టించిన ఆగ్రాలోని 'తాజ్ మహల్' ఢిల్లీలోని 'జుమ్మామసీద్' మొదలగునవి నేటికిని జగత్ప్రసిద్ధములు; చిత్రకళలుకూడ చాల వృద్ధినొందెను. ఈ మొగలురాజులందరు పరధ్యానము లేక భారతదేశమునే స్వదేశముగ నెంచుకొని, దానిక్షేమమునే గోరుచుండిరి. 16-వ శతాబ్దమున ఆంధ్రదేశమున విద్యానగరసామ్రాజ్యము వృద్ధినొందెను; అందు కృష్ణదేవరాయాదులు ఆంధ్రవాఙ్మయమునుగూడ చాల ప్రోత్సహించిరి కాని 17-వ శతాబ్ది చివరకు భారతదేశపుస్థితి క్రమముగా మారెను. ఆశతాబ్దిమధ్య ఉదారుడగు తనయన్న 'దారా'ను చంపి మొగలు చక్రవర్తియైన ఔరంగజేబు (షాజహాను 3-వ కుమారుడు) విచిత్రపురుషుడు, అతడు కార్యపరుడై సమర్థుడై రాజ్యమును విస్తరింపజేసినను, మతమూర్ఖులసలహాతో ఇస్లాముమతావేశమున హిందూద్వేషియై, ప్రేమహీనుడై తనసైనికులపైనను మంత్రులపైననుగూడ నమ్మికలేక, అంతరంగికులగూడ అనుమానించి, క్రూరుడై అక్బరు పాలనపద్ధతిని తలక్రిందుచేసెను.

పూర్వపు సామంతరాజ్యపద్ధతి (యూరపులోని ఫ్యూడల్ పాలనలో వలె) ఉద్యోగులు 'సుబా' లను జాగీరులను వంశపారంపర్యముగ ననుభవించు పద్ధతి నక్బరు తీసివేసి, వారికి జీతముల నేర్పరచియుండెను; దానిని ఔరంగజేబు మార్చి, మరల జాగీర్లపద్ధతిని తెచ్చుటచే సామంతు లేర్పడి ప్రజల బాధింపజొచ్చిరి; అతడు మతవిభేదముల రేపెను. ప్రజలలో ద్వేషము వృద్ధియై, మహారాష్ట్రమున శివాజినాయకత్వమున జనులు స్వతంత్రులైరి;

రాజపుత్రరాజులు తిరుగబడి, ఔరంగజేబుకు పరమశత్రువులైరి. పంజాబులో గురుగోవిందసింహుని నాయకత్వమున సిక్కులు (హిందువులకు మహమ్మదీయులకు మధ్య మతమువారు) వీరులై స్వాతంత్ర్యయుద్ధము సలిపిరి; ఔరంగజేబు నిరాదరణచేతను, అశాంతిచేతను, దేశమందు పరిశ్రమలు శిల్పకళలు మున్నగునవి క్షీణింపజొచ్చెను. 1707-లో ఔరంగజేబు చనిపోగా మొగలురాజవంశము అంతఃకలహము పాలయ్యెను; ఆవంశపురాజులు బలహీనులైరి; దేశమున ఆయాప్రాంతములందు చిన్న స్వతంత్రరాజ్యము లేర్పడి, పరస్పరము యుద్ధములు జరుగుచుండెను. దక్కనులో మొగలుసామంతుడు 'నిజాం' తనరాజ్యమును స్వతంత్రముచేసెను. శివాజి హిందూమహారాష్ట్ర రాజ్యము వ్యాపింపజేసి, 1680-లో చనిపోగా ఆరాష్ట్రపుమంత్రులగు 'పీష్వా'లు పూనానుండి యారాజ్యమును నిర్వహించుచుండిరి. కొంతకాలమునకు పీష్వాలు బలహీనులు కాగా, వారి సేనానులగు గయికవారు బరోడాలోను, హోల్కారు ఇందోరులోను, సింధియా గ్వాలియరులోను ఇట్లు స్వతంత్ర రాజ్యముల నేర్పఱచుకొనిరి; (ఆరాజవంశములు ప్రస్తుతపు ప్రభుత్వము కిప్పుడు సామంతులై, దేశీయరాజ్యములుగ పాలనము చేయుచున్నవి.) ఉత్తర హిందూదేశమున ఔడ్ (అయోధ్య) నవాబు వంగదేశపునవాబు మొదలగు వారును స్వతంత్రులైరి. ఈరాజ్యపాలకులమధ్యను నిరంతరకలహములు గలుగుచు, భారతదేశమున క్రమముగ అశాంతి హెచ్చి. ప్రజలు సౌఖ్యము గోల్పోయిరి. 15, 16-వ శతాబ్దములందు కలిగిన ఆధ్యాత్మికబోధముకూడ క్రమముగ క్షీణించెను. ఆంగ్లేయులు డచ్చి ఫ్రెంచి మొదలగు పాశ్చాత్యులు విరివిగా వచ్చునప్పటికి భారతీయు లిట్టి దుస్థితికి వచ్చుచుండిరి.

# 49. యూరపియనుల విజ్ఞానవికాసము

12-వ శతాబ్దమున యూరపియను విజ్ఞాన మిక బాగుపడి వృద్ధికాబోవుసూచన లగుపించెను. గ్రీకు పరిశోధకుల మొదటి విజ్ఞానవికాసమును ఇటలీవాసి 'ల్యుక్రెషియసు' చేసిన యూహాలను వీరు మరల నుద్ధరించున ట్లుండెను. ఈ పునరుజ్జీవనము కనేక క్లిష్టకారణములు కలవు. వ్యక్తియుద్ధము లంతమై, మతయుద్ధానంతర మేర్పడిన యోగ్యజీవనపద్ధతి ఈ యుద్ధఫలితమగు ఉత్తేజనము ప్రథమ కారణములు; వర్తకము తిరుగ వృద్ధియయ్యెను. పట్టణములకు సుఖరక్షణ కలిగెను. మతగురువులలో విద్య పెంపొందెను. సామాన్యజనులు చదువుకొనజొచ్చిరి. 13, 14-వ శతాబ్దులలో నగరముల స్వతంత్రత వృద్ధి గాజొచ్చెను. వెనీసు, ఫ్లారెన్సు, జినోవా, లిస్బను, పారిసు, బ్రూజెసు, లండను, ఆంట్వర్పు, హాంబర్గు, న్యూరెంబర్గు, నొవ్గరాడ్, విస్బీ, బెర్గెన్ పురము లట్టివే. ఈ వర్తకపురములం దనేకయాత్రికు లుండిరి. వర్తకయాత్రిలకు సంప్రదింపు ఆలోచన ఉండును. మత విషయములందు పోపులకు రాజులకు జరుగు కలహములను వ్యతిరేకుల శిక్షించుటలో వారిదారుణచర్యలను జూచి, జను లాయా మతసంస్థల ప్రామాణ్యము శంకించి వాని నిరోధించుచు మూలసిద్ధాంతములను గూర్చి స్వతంత్రముగ జర్చింపదొడగిరి.

అరబ్బులు యూరపులో అరిస్టాటిలు విజ్ఞానము మరల అందిచ్చిరి. 2-వ ఫ్రెడరికువంటి రాజులు ఆరబుల తత్వశాస్త్రమును, విజ్ఞానమును యూరపులో వ్యాపింపజేసిరి. భావవికా

సము గల్గించుటకు యూదులును చాల తోడ్పడిరి. వీరు క్రైస్తవ పీఠాధికార మంగీకరింపరు. ఇంతేగాక అప్పటి రసవాదజ్ఞుల విచిత్రవిమర్శలు వ్యాపించి, ఆధునిక వైజ్ఞానికపరిశోధనలకు దారి చూపెను. ఇట్లు స్వతంత్రవిద్వాంసులలోనేగాక, సామాన్య జనులలోను జ్ఞానము పూర్వముకన్న వృద్ధిచెందెను. అంతే యున్నను క్రైస్తవబోధ, అందుచే వ్యక్తికిని ధర్మదేవతతో ప్రత్యక్షసంబంధము కలిగెను. అందుచే మతరాజాదులగూర్చి ప్రజలు స్వతంత్రనిర్ణయములకు రాగలుగుచుండిరి.

11-వ శతాబ్దముకే యూరపులో తాత్వికచర్చ తిరుగ నందుకొనెను. పారిసు ఆక్సుఫర్డు బలోనా మొదలగు కేంద్రము లందు విశ్వవిద్యాలయము లేర్పడి వృద్ధిచెందెను. అచ్చట మధ్య కాలపువిద్వాంసులు పూర్వికుల శబ్దార్థచర్చ నందుకొనిరి. ఆ తత్వచర్చ భావివైజ్ఞానికకాలపుచర్చకు పూర్వరంగ మయ్యెను. వీరిలో ప్రముఖుడగు "రోజరుబేకన్" అను (1210—1293) ఆక్సుఫర్డులోని ఫ్రాన్సిస్కను శాఖీయుడగు మేధావి, ఆధునిక వైజ్ఞానికపద్ధతికి మూలపురుషుడు. ఇతడు అరిస్టాటిలు తరువాత ముఖ్యమహనీయుడు. ఈ ధీరుడు తన గ్రంథములం దాకాలపు జనుల అజ్ఞానమును ఖండించెను. లోకులు మూఢు లని జనుల చర్యలు బాల్యచేష్ట లని వారిసిద్ధాంతములు బాలిశభావము లని ఈకాలమున ఎవరైన వెల్లడించినను, అందుచే ప్రమాద ముండదు. కాని, మధ్యకాలపుజనులు హత్యలు హోమము అంటువ్యాధులు లేనిసమయములందు తమ సిద్ధాంతములే ప్రమాణము లని నమ్ముచు, వానిని శంకించువారిపై తీవ్రముగ నాగ్రహించుచుండిరి. అంధకారమున కాంతిరేఖవలె రోజరు

బేకను ఆకాలపు అజ్ఞానమును నిరసించి, జ్ఞానవ్యాప్తికై చాల సూచనల జేసెను. అరిస్టాటిలువలెనే ఇతడును పరిశోధనకు జ్ఞాన సంపాదనకు ప్రాముఖ్య మిచ్చెను.

అయినను జనులు అరిస్టాటిలు గ్రంథముల లాటిను తర్జుమాల దిరుగవేయుటతో తృప్తి చెందుటచూచి బేకను అరిస్టాటిలునే దూషించి, "నా కధికార ముండినచో అరిస్టాటిలు గ్రంథము లన్నిటిని తగులబెట్టెదను. ఈ పుస్తకములచే కాలహారణము అజ్ఞానము మాత్ర మధికమగును" అనెను. అపార్థకములగు ఈ లాటిను తప్పుతర్జుమాల పూజమాత్రము చేయుట జూచినచో, అరిస్టాటిలును బేకనువలె చెప్పియుండును. పూర్వాచారులవలన కారాగృహాది బాధలు కలుగకుండుటకై, సూచనా రూపముగనే బేకను తనగ్రంథమందు "మూఢవిశ్వాసము అధికార ప్రాబల్యము పూర్వాచారము మూఢత్వము విజ్ఞాన ప్రాతికూల్యము మాని లోకజ్ఞానము కల్గినచో జనులకు సర్వశక్తులు గలుగును" అనెను.

"తెడ్లక్కరలేకనే యంత్ర సహాయమున నదీసముద్రాదులందు మహానౌకల నొక్కడే నడుపవచ్చును; లాగుటకు జంతువులు లేకనే యంత్రశక్తిచే నడుపు శకటములను పురాణరథములవలె, నిర్మింపవచ్చును. విమానయంత్రముల నిర్మించి, వాటి మధ్య వాయుమండలమున కృతకపక్షములతో నెగురవచ్చును" అని బేకను వ్రాసెను. కాని యీప్రకృతిశక్తిరహస్యములను పరిశోధించి ఉపయోగించుట కప్పటి కింకను మూడుశతాబ్దములు గావలసివచ్చెను. అరబ్బులు క్రైస్తవలోకులకు తత్వశాస్త్ర రసవాదముల జ్ఞానమేగాక, జ్ఞానవ్యాప్తి కవసరమగు కాగితములు

గూడ లభింపజేసిరి. కాగితము చేయుట చీనాలో బహుశః క్రీ. పూ. రెండవశతాబ్దమందే కనిపెట్టిరి. క్రీ. త. 751-లో చీనులు సమరఖండమందలి అరబ్బులపై దాడి సలిపి అం దోడిరి. అందుఖైదీలైన కొందరు చీనులనుండి అరబ్బులు కాగితము చేయుట నేర్చుకొనిరి. 9-వ శతాబ్దమున వ్రాసిన కాగితము లిప్పటికిని గలవు. గ్రీసుద్వారానో, లేక స్పెయిను పునర్జితమై అందలి కాగితపు యంత్రములను క్రైస్తవులు వశపరచుకొని నప్పుడో, వారు కాగితముల జేయనేర్చిరి; కాని అచట 13-వ శతాబ్దము పోవువరకు మంచికాగితములు చేయలేరైరి. మంచి కాగితము లిట్లిటలీలో తయారు కా నారంభించి, 14-వ శతాబ్దమున జర్మనీలో వ్యాపించి, ఆశతాబ్దముచివర చౌకగ్రంథముల నచ్చువేయ వీలాయెను. అంతట సహజముగ అచ్చువిధానము కనిపెట్టబడెను. అందుచే విజ్ఞానజీవితము త్తేజితమయ్యెను. ఇది వరలోవలె వ్యక్తుల మనసులలోనికి కొద్దిగా దిగజారుటకు బదులు అప్పటినుండి జ్ఞానము మహావాహినివలె వేగముతో వేలకొలది లక్షలకొలది జనులలో వ్యాపింపనొడగెను.

ముద్రణఫలితముగ బైబిలుగ్రంథములు సమృద్ధమై జగమంతట వ్యాపించెను. పాతపుస్తకములు చౌక ఆయెను; గ్రంథాకారమును బాగుపడి, సులభముగ గ్రహింపవీలయ్యెను; చదువు సులభమైనందున చదువరులసంఖ్యయు వృద్ధిఅయ్యెను. జనులందరి కుపయుక్తములగు గ్రంథముల (లాటినులో గాక) వాడుకభాషలో వ్రాయ మొదలిడిరి, ఇట్లు 14-వ శతాబ్దిలో యూరపియనుల యథార్థవాఙ్మయ మారంభించెను.

పారసీనులవల్లనే గాక, మంగోలువిజయముచే గూడ యూరపియనులకు త్తేజన గలిగెను. ఖానుమహాశయుకాలమున ఆసియా పశ్చిమయూరపులమధ్య పరస్పరసమావేశ మధికమై తత్కాలపు మహాపథము లేర్పడెను. కారకోరమువద్ద రాజస్థానమున అన్ని దేశముల ప్రతినిధులు నుండిరి. క్రైస్తవ ఇస్లాము మతముల సంఘర్షముచే నేర్పడిన ఆటంకములు కొంత తగ్గి, మంగోలియనులను క్రైస్తవులుగా జేయ యత్నించిరి. అసలులో మంగోలులది 'షమేనిజ' మను నొక ఆదిమమతము. మంగోలు రాజాస్థానమున పోపు ప్రతినిధులు భారతదేశపు బౌద్ధబోధకులు పారసి ఇటలీ చీనాల కార్మికులు బిజాంటియం ఆర్మీనియాలవర్తకులు గూడిరి. అరబుఉద్యోగులు భారతీయ జ్యోతిశ్శాస్త్రజ్ఞులు పారసీక వైజ్ఞానికులు కలిసి సంప్రదించిరి. చరిత్రకారులు తమ రచనలలో మంగోలుల యుద్ధహత్యలకే ప్రాముఖ్యమిచ్చిరి. కాని, వారి జ్ఞానాపేక్షకు దగుస్థాన మీయరైరి. మంగోలులు (స్వతంత్ర జ్ఞానము లేకున్నను) ఆయా ప్రాంతాల కళాశిల్పవిజ్ఞానములను గ్రహించి ప్రపంచమున వ్యాపింపజేసి లోకోపకారులైరి. చెంగిజ్ కొల్లై విచిత్రవ్యక్తులగూర్చి తెలిసిన సంగతులు వారు

అహంకారి యగు అలెగ్జాండరుకును, రాజ్యతంత్రజ్ఞుడయ్యు మూఢవిశ్వాసము గల చార్లమనుకును బుద్ధివైశద్యమున దీసి పోరని సూచించును. మంగోలురాజాస్థానికుడైన 'మార్కో పోలో' అను వెనీసుపౌరుడగు యాత్రికు డాకథ నొకగ్రంథముగా వ్రాసెను. అప్పటికే ఒకసారి యాత్ర చేసిన తనతండ్రి తోను పినతండ్రితోను, 1272-లో నతడు చీనాకు వెళ్లెను. తన యొద్దకువచ్చిన ప్రథమ లాటినీయులగు ఆ 'పోలో' లను

ఖానుమహోదయు డభినందించి క్రైస్తవమతమును వినోదకర మగు నితర యూరోపియనువిషయములను తనకు తెల్పు బోధకుల బంపగోరి వారిని తిరుగ బంపెను.

వెనుకటిసారివలె క్రిమియాదారిని గాక, ఈసారి పోలోలు ముగ్గురును పాలస్తైనుగుండ బయలుదేరి ఖానుమహోదయుడు తమ కిచ్చిన స్వర్ణముద్రతో నిరాతంకముగ ప్రయాణముచేసిరి. ఖానునియభీష్ట మీడేర్ప జెరూసలేంలోని క్రీస్తుగారి దీపపుతైలమును దెచ్చుటకై వా రాపురము చేరి, అటనుండి సైలీషియాద్వారా ఆర్మీనియా ప్రవేశించిరి. మంగోలు సామ్రాజ్యపు దక్షిణభాగమును ఈజిప్టుసుల్తాను అప్పటిలో ముట్టడించుచుండెను; కనుక వా రుత్తరమునుండియే మెసపొటేమియా వచ్చి, పారసీకసింధుశాఖతీరమందున్న ఆర్మజ్ చేరి, అచ్చట భారతదేశవర్తకుల గలసికొనిరి; కాని అచ్చటనుండి నౌకాయానము చేయక, పారసీకమరుభూములగుండ బాల్ఖుద్వారా ఉత్తరమున పామీరుపీఠభూములపైనుండి కాష్ఘుర్ చేరి, అచ్చటినుండి కోటాన్ లాబ్‌నర్లగుండ చీనాలోని హోయాంగ్‌హోనదీప్రాంతమువెంట పెకినునగరము చేరి, అందు ఖానునిఆతిథ్యము స్వీకరించిరి. యువకుడు బుద్ధిమంతుడు నగు మార్కోను జూచి, కోబ్లై మిక్కిలి సంతుష్టు డయ్యెను. మార్కో తార్తారుభాషయందు ప్రవీణుడై, అచ్చట నుద్యోగియై, నైరృతిచీనాకును ఇతరస్థలములకును రాయబారి యయ్యెను. మార్గమందలి యాత్రికులకు చక్కని సత్రములు, ద్రాక్షతోటలు, ఉర్వరక్షేత్రములు, ఆరామములు, బౌద్ధశ్రమణకుల మఠములు, స్వర్ణచీనాంబరములు, చక్కని టపేటాల

తయారుచేయు నేతగాండ్రను, అనేక పురజనపదములను, మార్కోపోలో వర్ణించి, యూరపియనుల నద్భుతానంద పరవశుల గావించెను. బర్మాను, అందలి గజశతములతో నొప్పు మహాసేనల మంగోలుధనుర్ధరు లోడించినవిధమును, మంగోలులు పెగూదేశమును జయించుటను, జపానుసంగతిని కూడ మార్కోపోలో తనగ్రంథమున తెలియజేసెను; జపానులో బంగారు అధికమని అతిశయోక్తిగ వర్ణించెను. అతడు యాంగ్చో నగరమును మూడేండ్లు ప్రభువుగా పాలించెను. అతడు తార్తారే అనియు, పరదేశికా డనియు చీనావారికి దోచియుం డును. అతడు భారతదేశమునకు రాయబారిగా వెళ్లెను. 1277-లో చక్రవర్తిఆస్థానమున నొక 'పోలో' యుండినటుల చీనాగ్రంథములలోను చెప్పిరి. మార్కోపోలో వ్రాసిన యాత్రాగ్రంథము యూరపియనుల కుత్తేజనము గలిగించెను. 15-వ శతాబ్దపు యూరపియను వాఙ్మయములో మార్కోపోలో యాత్రకథ ఉత్తరచీనా పెకినునగరము మొదలైనవి ప్రాముఖ్యము వహించెను.

మార్కోపోలోయాత్రల జదివినవారిలో తరువాత రెండు శతాబ్దముల కుదయించిన జినోవానావికుడగు క్రిష్టఫరు కొలంబసు పశ్చిమముగా బయలుదేరి ప్రపంచమును చుట్టి చీనా చేరుట కద్భుతాలోచన సలిపెను. కొలంబసు గుర్తులుపెట్టిన ఆగ్రంథప్రతియొకటి సెవిల్‌పురమున గలదు; జినోవాపౌరున కిట్టి యుద్దేశములు గల్గుట కనేక కారణములు కలవు. కాన్స్టాంటి నోపిలు 1453-లో తురుష్కుల పాలబడువరకు ప్రాచ్యపశ్చిమ దేశముల మధ్య వ్యాపారరంగముగ నుండెను. జినోవాపౌరు

లచట వర్తకము చేయుచుండిరి. కాని జినోవావారి ప్రత్యర్థు లగు వెనీసుపౌరులు తురుష్కులకు తోడై గ్రీకులకు విరోధు లైరి. అంతట తురుష్కుల అధికారమున కాన్స్టాంటినోపిలుకు జినోవాకు మధ్య ప్రాతికూల్య మేర్పడెను. ప్రపంచపు గోళా కారత అప్పుడు కనులకు స్ఫురించి పశ్చిమదిశవైపుకు వెళ్లి చీనాకు చేరు ఉద్దేశము కలిగెను. అప్పటికి నావికుల దిక్సూచి కనిపెట్ట బడెను; దిక్కులు తెలియుటకు నక్షత్రాధార మక్కఱలేక పోయెను. నార్మనులు కేటలోనియనులు జినోవావారు పోర్చు గీసువారును అప్పటికే అట్లాంటికుమహాసముద్రమున కెనరీ మెడీరా అజోర్సు ద్వీపములవరకు బోవుచుండిరి.

కాని తన యుద్యమమునకై నౌకాయాన మారంభించు ముందు కొలంబసు కనేకకష్టములు కలిగెను. ఆత డనేకసంస్థాన ములకు బోయి, చివరకు మూరులనుండి అప్పుడే స్వతంత్రమైన గ్రనడాలోని ఫెర్డినండు ఇజబెల్లాల ఆదరము నార్జించి, వారి సహాయమున మూడు చిన్నినావలలో ఆమహాసముద్రముపై బయలుదేరి, రెండునెలల తొమ్మిదిరోజులు యాత్ర చేసినమీద నొకభూస్థలిని జేరెను; అది హిందూదేశ మని భావించెను. కాని యదియొక నూతనప్రపంచము; దానియునికి ప్రాచ్యలోకుల కంతవరకు దెలియదు. అచటనుండి బంగారు ప్రత్తి కొన్నివిచిత్ర జంతువులను ఆదేశీయులగు యిద్దరడవిజనులను దీసికొని, అతడు తిరుగ స్పెయిను జేరెను. ఆ నూతనదేశము హిందూదేశమే యని తనజీవితాంతమువర కతడు భావించుటచే ఆ నూత్నజను లను ఇండియను లని పిలిచిరి.

కొలంబసు యాత్రాజయముచే మహోదధియాత్రకు ప్రోత్సాహ మధికమాయెను. 1497-లో పోర్చుగీసువారు ఆఫ్రికాను చుట్టి, నౌకలపై భారతదేశము చేరిరి. 1515-లో జావాద్వీపమున పోర్చుగీసుఓడ లుండెను. 1519-లో స్పానిషు వారి యుద్యోగియగు 'మాగు ల్లను' (పోర్చుగీసు నావికుడు) సెవిలుపురమునుండి పశ్చిమమున నయిదునావలతో బయలు దేరెను. వాటిలో 'విక్టోరియా' నావ ప్రపంచమంతయు మొదటి మారు చుట్టి, 1522-లో తిరుగ సెవిలు చేరెను. ఆయాత్రలో బయలుదేరిన 280 మందిలో 31 మంది ఆయోడలో సురక్షిత ముగా మరలివచ్చిరి. మాగెల్లను ఫిలిప్పైనుదీవులందు జంపబడెను.

కాగితపుపుస్తకముల ముద్రణము, గోళాకార ప్రపంచము జుట్టి రాగల్గుట, క్రొత్తదేశములందు వివిధ విచిత్రజంతువృక్ష జాతులను విచిత్రాచారవ్యవహారములను జీవితావసరమగు క్రొత్తవస్తువులను గనిపెట్టుటకాశయు యూరపియనుల మనస్సు లలో నొక్కసారిగ ప్రత్యక్షమయ్యెను. చిరకాలమై మరచిన గ్రీకుగ్రంథములచ్చువేసి జనులు చదివిరి. 'ప్లాటో'భావములును, ప్రజాస్వామ్యస్వాతంత్ర్యమును, వాటిఘనతయు, జనులకు గోచ రించెను. రోమకప్రభుత్వముచే పశ్చిమయూరపున శాంతియు న్యాయపరిపాలనయు ఏర్పడెను. లాటిను మతసంస్థ దీనిని స్థిరపఱ చెను. కాని రోమనుల పాలనకాలమున అధికారప్రాబల్యముచే విచక్షణజ్ఞానము నిరుద్ధమై, వ్యాప్తి లేకుండెను. లాటినుమనో భావ మంతట ముకుళించినది. 13, 16-వ శతాబ్దులమధ్య, అరబు

మంగోలుల ప్రభావమువలనను, గ్రీకుగ్రంథముల పునరభ్యాసము వల్లను, లాటిను ఆచార మాంద్యమునుండి బయల్పడి యూరపి యను ఆర్యులు జ్ఞానవ్యాప్తియందును, భౌతికవిషయములందును, మానవకోటికి తిరుగ నాయకులు కా నారంభించిరి.*

---

* ఆకాలమున భారతదేశమునకు యూరపుకు పారసీక, మిశ్ర, దేశములద్వారాను వెనిసు జినోవాలద్వారాను చాల వ్యాపారము జరుగుచుండెను. ఈ దేశపు సున్నితపుదినుసుల కనేకములకు యూరపులో చాల గిరాకి యుండెను. మనదేశపు రేవుపట్టణములు చాలవృద్ధినొంది, గొప్ప నౌకలు నిర్మింపబడుచు, ఖండాంతరములకుబోవుచు, మనదేశము చాల శ్రీమంతమై యుండినట్లు మార్కొపోలోగూడ తనగ్రంథమునవర్ణించెను. కొలంబసు నౌకాయాత్ర చేయుటలో భారతదేశమును చేరుట కుద్దేశించె నని కొందరు చారిత్రకుల యభిప్రాయము.

# 50. లాటిను మతపీఠసంస్కారణము

ఈ బుద్ధివికాసముచే లాటినుమతసంస్థకూడ చాలవరకు మార్పుచెంది కొంత విచ్ఛిన్నమయ్యెను. మిగిలిన భాగమును ఎక్కువగ పునర్నిర్మాణమొందెను.

11, 12-వ శతాబ్దములలో నా మతసంస్థ సకలక్రైస్తవ ప్రపంచమునకు నిరంకుశనాయక మగుచుండెను. కాని 14, 15-వ శతాబ్దములలో ప్రజలమనస్సులపైన వారిచర్యలపైన దాని ప్రాబల్యము క్షీణించెను. ఆరంభదశలో దానికి చేయూతగ నున్న ప్రజలమతోత్సాహము ఆమతాధ్యక్షుల మదగర్వదుశ్చర్యలచే ఆసంస్థ కెదురుతిరిగెను. ఫ్రెడరికుచక్రవర్తి ప్రచారముచే ఇతరరాజన్యులును పోపు కవిధేయులైరి గదా! ఆమతపీఠమం దేర్పడిన గొప్పచీలికయు దాని ధార్మికప్రతిష్ఠల క్షీణింపజేసెను. దాని కిరువైపులనుండి విప్లవాఘాతము తగిలెను.

ఆంగ్లేయుడగు 'విక్లిఫ్' బోధలు యూరపులో విరివిగ వ్యాపించెను. 1398 లో ఆస్ట్రియాలోని ప్రేగ్ విశ్వ విద్యాలయములో జానుహస్సు అను జెక్ జాతివిద్వాంసుడు విక్లిఫ్ బోధలపై అనేకోపన్యాసముల నిచ్చెను. ఈ బోధ అజ్ఞానులలో గూడ త్వరలో వ్యాపించి సామాన్యజనుల కుత్సాహము గల్గించెను. మతవిభేదముల పరిష్కారముకై 1414-18-వ సం॥ల మధ్య సర్వమతపీఠసభ యొకటి కాన్స్టన్సునగరమున జరుపబడెను. 'హస్సు' 1415 లో నీసభకు చక్రవర్తిచే అభయ

హస్తమొంది పిలువబడి వెళ్ళెను. కాని మతాధికారు లచట నతనిబట్టి, నాస్తికతకై యాతని విచారణచేసి, సజీవముగ తగుల బెట్టిరి. ఆ చర్యచే బొహీమియనులు శాంతింపలేదు; సరికదా, అచ్చటి హాసు అనుచరులు విప్లవము గావించిరి. అందుపై యుద్ధము లారంభమై యవి లాటిను సంస్థల యధికారమును నశింపజేసెను. కాన్స్టెన్సువద్ద కూడినసభలో క్రైస్తవలోకాధి కారిగ నెన్నుకోబడిన పోపగు 5 వ మార్టిను ఆ విప్లవము నణచుటకు మతయుద్ధము చేయ జనుల బురికొల్పెను.

ఈ చిన్న పీరజాతి నణచుటకై 5 మతయుద్ధములు నడుపబడి, అన్నియు వ్యర్థమాయెను. 13-వ శతాబ్దమున వాల్డెన్సులపై జరిగించినట్లే 15-వ శతాబ్దమున యూరపులోని నిరుద్యోగులగు దుష్టులందరు బొహీమియాపై బంపబడిరి. వాల్డెన్సులవలె గాక బొహీమియను జెక్కులు శూరులై, ఆయుధములతో నెదిర్చిరి. బొహీమియా కా మతయుద్ధముకై నెడలిన రాజసైన్యములు యుద్ధభూమిని హాసు అనుచరుల శకటధ్వని వారి భేరీరవములు దూరమునుండి వినినంతనే, రణరంగమునుండి చెల్లాచెదరై పారిపోయిరి. (డొమాజ్లిస్ యుద్ధము 1431). 1436 లో హాసు అనుచరులతో మతసంస్థల వారు బేసిలువద్ద సంధి గావించుకొని, లాటినులలోని కొన్ని ప్రత్యేక దురాచారముల సవరణ కంగీకరించిరి.

15 వ శతాబ్దమున యూరపు అంతటను గొప్ప అంటు వ్యాధి వ్యాపించెను; జనసంఘమందు చాల అశాంతి దుర్దశ కలిగెను. ఇంగ్లండులోను, ఫ్రాన్సులోను, రైతులు భూస్వాములపైనను శ్రీమంతులపైనను తిరుగబడిరి. హాసైట్లు

యుద్ధము కాగానే, జర్మనీలో ప్రజాసంక్షోభ మధికమై, మత విప్లవము కలిగెను. ఇందుకు గ్రంథముద్రణము గూడ దోడ్ప డెను. 15-వ శతాబ్ది మధ్యమున హాలండులోను రైనునదీ ప్రాంతమందును సులభముద్రణ మారంభమై, ఇటలీకి ఇంగ్లం డుకు గూడ వ్యాపించెను. ఆంగ్ల దేశపు వెస్టుమినిస్టరులో 1477 లో 'కాక్స్టను' అచ్చుకూటము నారంభించెను. అందుచే బైబిలు ప్రతులు విరివిగా వ్యాపించి, జనుల మతవిషయికచర్చ లకు సౌకర్య మధికమయ్యెను. అప్పుడు యూరపులో నపూర్వ మగు విద్యావ్యాప్తి గలిగెను. మత సంస్థ లల్లరిలో నుండెను; జనసామాన్యమున విద్యాజ్ఞానము గలిగెను; మతాధిపులకు రాజులకు మధ్య మతపీఠపు ఆస్తులకై కలహము కలిగెను.

జర్మనీలో విట్టెంబర్గునుండి పూర్వాచారసిద్ధాంతములను ఖండించుచుండిన మార్టినులూథర్ (1483-1516) అను నొక సన్యాసిపై 1517-లో మతాధిపుల క్రోధము ప్రసరించెను. పండితపద్ధతి నీతడు తనఖండనమును మొదట లాటినులో నారం భించెను; అటుతరువాత అచ్చుసదుపాయముతో జనుల వాడుక భాషయగు 'జర్మను'లోనే ప్రజలందరికి తనభావముల వెద జల్లెను. హస్సు నణగద్రొక్కినట్లే యితనినిగూడ అణప యత్నము జరిగెను. కాని ముద్రాయంత్రముచే పరిస్థితులు మారెను. మరియు జర్మనురాజు లనేకు లతనికి ప్రత్యక్షముగను రహస్యముగను మిత్రులై, అతనికి దురవస్థ కలుగకుండ జేసిరి.

ఇట్లు నూత్న భావము లధికమగుచు, మతమున మూఢ విశ్వాసము నశింపజొచ్చెను; అప్పుడు అనేకరాజులు పోపుసంస్థకు తమప్రజలకు గల మతానుబంధము తెగగొట్టి, తామే తమ

రాజ్యపు మతాధిపులు గాదలచిరి. ఇంగ్లండు, స్కాట్లండు, స్వీడను, నార్వే, డెన్మార్కు, ఉత్తరజర్మనీ, బొహిమియా, ఈ దేశము లొకదానివెంట నొకటి రోమనుమతకేంద్రాధికారము నుండి విడిపోయి ప్రత్యేకమయ్యెను.

కాని, ఈరాజులు జనులనైతికోన్నతిభావస్వాతంత్ర్యము వృద్ధిచేయుట కెట్టియత్నమును చేయలేదు. తమప్రజల మతశంకలను స్వతంత్రభావములను రోముకు వ్యతిరేకముగా స్వబల వృద్ధికిమాత్ర ముపయోగించుకొనిరి. అందుచే రాజాధిపత్యమున ఆయాదేశములందు జాతీయమతపీఠము లేర్పడినంతటు, ఆరాజులు ప్రజాందోళనము నణచిపట్ట యత్నించిరి. కాని 'యేసు' బోధలో (మతాధిపులకుగాని రాజులకుగాని స్వామిభక్తి గలిగి వినమ్రులై యుండుటకంటె) మానవుని ఆత్మగౌరవమును నిర్మలజీవితమునే మేల్కొల్పు విచిత్రజీవశక్తి యుండెను. ఈరాజుల ఆధిపత్యమున పోపు మతసంస్థనుండి విడగానే, దైవమానవులమధ్య పోపును రాజులను అధికారిగా అంగీకరింపని చాల చిన్నసంస్థలును బయలుదేరెను. ఉదాహరణకు, ఇంగ్లండు స్కాట్లండులలో జీవితమునకు మతమునకు బైబిలే మూలాధారమను సంఘము లనేకము లుండెను. ప్రభుత్వమతాధికారులు వీటిని నిరోధించిరి. ఇంగ్లండులో 'నాన్‌కన్ఫార్మిస్టు' లనబడిన ఈస్వతంత్రులు ఆదేశపు 17, 18-వ శతాబ్దముల రాజ్యాంగవిషయములలో నధికముగ పాల్గొనిరి. ఇంగ్లండులో రాజు మతపీఠాధిపు డగుటచే, ఆతగవులో 1649-లో ఇంగ్లండు రాజగు 1-వ చార్లెసు శిరచ్ఛేదము నొందెను. అంతట 11 ఏండ్లీ స్వతంత్ర సంస్కర్తల ప్రభుత్వమున ఇంగ్లండు ప్రజాతంత్రక

ముగా నుండెను. ఈ యుత్తర యూరపువారు లాటిను క్రైస్తవ ప్రపంచమునుండి విడుటయే "రిఫర్ మేషన్" అనబడెను. ఈ విఘాతనాశముల యొత్తిడిచే రోమను మతపీఠమందును ముఖ్యమగు మార్పులు గల్గెను. ఆసంస్థ పునర్నిర్మితమై, దానియందొక నూతనశక్తి ప్రవేశించెను. ఈ పునర్నిర్మాణమున, లయోలాలో 'సెంటు ఇగ్నేషసు' అని ప్రపంచమున పేరొందిన 'ఇనిగోలా పెజ్ డిరికాల్డి' అను విచిత్రచరిత్రుడగు సైనికయువకుడు 1538-లో మతగురువై, మతసహాయమునకు క్రమశిక్షణ శౌర్యౌదార్యముల దేవలె నని ప్రత్యక్షయత్న మొనరించి జీససుసంఘమును స్థాపింపజేసెను. జెసూయిట్లనబడు ఈయేసు సంఘమును ప్రపంచమందొక గొప్పమతప్రచారకసంఘమయ్యెను. ఆసంఘము క్రైస్తవమతమును భారతదేశము, చీనా, అమెరికాలకు గూడ గొంపోయెను; అది రోమను మతపీఠపువినాశము నాపెను; కాతలికు ప్రపంచమంతటను విద్యాభివృద్ధి చేసెను; అంతట ప్రొటెస్టంటులును విద్యాకృషి హెచ్చించిరి. రోమను కాతలికు మతపీఠమున ఇప్పటికిగల ఉత్సాహము ముఖ్యముగా నీజెసూయిటు సంస్థల కార్యఫలితమే.



# 51. ఐదవచార్లెసు చక్రవర్తి

"పవిత్రరోమక సామ్రాజ్యము" 5-వ చార్లెసు చక్రవర్తి నాటికి కొంత ఆధిక్యముకు వచ్చెను. యూరపు పాలించిన రాజులలో నితడతివిచిత్రుడు; చార్లమనుతరువాత చాల గొప్పప్రభువని కొంతకాల మితనికి పేరుండెను.

ఆతని గొప్పదన మాతనిచే కలుగలేదు. అతని పితామహుడు 1-వ మాక్సిమిలియను (1459-1519) ముఖ్యకారకుడు. కొన్ని రాజవంశములు రణము సలిపియు, కొన్ని కుతంత్రముల బన్నియు లోకమున ప్రబలమయ్యెను. ఈ హాబ్సుబర్గు వంశీయులు వివాహముల మూలమున నక్లైరి. హాబ్సుబర్గుల అసలు పిత్రియమగు ఆస్ట్రియా, స్టిరియా ఆల్సేసులలో గొంతభాగము, మరికొన్ని ఆస్తులు, వీటితో నారాజ్యము మొదలిడెను. అతడు (మాక్సుమిలియను) నెదర్లండు బర్గండీల రాణిని (ఆమెపేరుతో మన కంతపని లేదు) వివాహమాడెను. ఆమె మరణముచే బర్గండీలో విశేషభాగము జారిపోయెను; కాని నెదర్లం డతనికి నిలచెను. తరువాత నతడు 'బ్రిటనీ రాణి'ని వివాహమాడ యత్నించి, విఫలుడాయెను; 1493-లో తనతండ్రియగు 3-వ ఫ్రెడరికుకు వారసుడుగా చక్రవర్తియై, అంతట 'మిలాను' రాణిని వివాహమాడెను; అతడు ఫెర్డినండు ఇజబెల్లాల మందమతి కుమార్తెతో తనకుమారునికి వివాహము చేసెను. అప్పటికి స్పెయిను సర్డీనియా సిసిలీలను బ్రెజిలుకు పశ్చిమమగు అమె

రికానంతను ఫెర్డినండు పాలించుచుండెను; అందుచే మాక్సిమిలియను పౌత్రుడగు ౫-వ చార్లెసు దాదాపు అమెరికా ఖండమంతను, తురుష్కవశముకాని యూరపులో దాదాపు సగమును పాలింపదొడగెను. 1506 లో నతడు నెదర్లండు రాజయ్యెను; మాతామహుడగు ఫెర్డినండు 1516 లో మరణింపగా తనతల్లి మతిహీన యగుటచే తానే స్పెయిను సామ్రాజ్యమునకు చక్రవర్తియు నయ్యెను. పితామహుడగు మాక్సిమిలియను 1519లో పోయెను.అందుచే తన 20-వ యేట అనగా 1520 లో, చార్లెసు జర్మనీ ఆస్ట్రియాల చక్రవర్తియు నయ్యెను. ముఖమంతగా కళలేక మొద్దుపెదవులు పొడుగుగడ్డము వికారమైనను, అతడు సుందరయువకుడే. అతని చుట్టుపట్ల అప్పటి రాజులు వీరయువకులు; 1515 లో, 21 ఏండ్ల యువకుడగు ఫ్రాన్సిసు ఫ్రెంచిరాజయ్యెను. 1509 లో 18-వ యేట 8-వ హెన్రీ ఇంగ్లీషురాజయ్యెను. అప్పుడు (1526 నుండి 1530 వరకు) భారతదేశమున మొగలుచక్రవర్తియగు 'బాబరు' పాలించెను; టర్కీలో 1520 లో సులైమను మహోదయుడు పాలకు డాయెను; వీ రిద్దరును మహాసమర్థులు. ఆకాలపు (1513) పోపగు '10-వ లియో' మహాప్రజ్ఞాన్వితుడు. ఒకేమనిషి సర్వ రాజ్యముల ప్రభువగుట ప్రమాదకరమని,పోపును 1-వ ఫ్రాన్సిసును చార్లెసు జర్మనుచక్రవర్తి కాకుండ నిరోధింపజూచిరి. ఫ్రాన్సిసు హెన్రీలు తామే చక్రవర్తి కా యత్నించిరి; కాని 1273 మొదలు హాబ్సుబర్గువంశీయులే చక్రవర్తులగు సంప్రదాయబలమునను, ఎన్నికదార్లకు లంచ మిచ్చియు, చార్లెసే చక్రవర్తి యయ్యెను. మహావిభవుడగు నీయువకుడు మొదట

తనమంత్రులచేతి కీలుబొమ్మయైనను, క్రమముగా శక్తిప్రాబల్యములు గల్గి తన యధికారబాధ్యతను అందలి కష్టములను గమనించెను.

అప్పటికే జర్మనీలో లూథర్ ఆందోళనము బయలుదేరెను. పరిస్థితులు క్లిష్టమయ్యెను. పోపు తనయెన్నికకు వ్యతిరేకి; అందుచే తాను ప్రాటెస్టంటు (సంస్కరణ) పక్షమందుండదగినను, కాతలికుల మూలకంద మగు స్పెయినులో పెరిగిన చార్లెసు లూథరు పక్షీయులగు ప్రాటెస్టంటు ప్రభువులకు, ముఖ్యముగా సాగ్జనీప్రభువుకు విరోధి యయ్యెను. ఈ రెండు కక్షలకు సంధి చేయ మనఃపూర్వకముగ యత్నించినను వ్యర్థమాయెను. విభేద మధికమాయెను. జర్మనీలో చాలచోట్ల గ్రామీణులుగూడ తిరుగబడిరి. ఈకష్టములకుదోడు పడమటినుండి తన ప్రత్యర్థియగు మొదటిఫ్రాన్సిసును, తూర్పున హంగేరినుండి తురుష్కులును, చార్లెసురాజ్యములపై దాడి సల్పిరి. చార్లెసుకు స్పెయినుసేన యున్నను, జర్మనీలో ద్రవ్యము పుట్టుట చాల కష్టమై, ఆర్థికకష్టము కలిగి ఆతడు చాల ఋణగ్రస్తుడాయెను.

ఆంగ్లరాజగు హెన్రీ సహాయమంది చార్లెసు మొత్తముమీద ఫ్రాన్సిసును తురుష్కులను ఓడించెను. వారి ముఖ్యరణరంగ ముత్తరయిటలీ. ఈనాయకు లెవరును ప్రతిభావంతులు కారు; సంఖ్యాబలమే జయకరమయ్యెను. జర్మనుసేన ఫ్రాన్సుపై దాడివెడలెను; కాని మార్సిల్సునగరమును బట్టుకొనలేక ఇటలీలోనికి తిరిగి అందు మిలానును గోలుపోయి పావియాలో ఫ్రాన్సిసుచే ముట్టడింపబడెను. ఈముట్టడి దీర్ఘకాల ముండగా,

క్రొత్తజర్మనుసేనలు వచ్చెను; వారిమధ్య చిక్కుకొని, ఫ్రాన్సిసు ఓడి గాయపడి బందీ యయ్యెను. కాని, తరువాత పోపును స్పానిష్ చార్లెసు ప్రాబల్యమును జూచి ఈర్ష్యచే నతని కెదురుతిరిగిరి. బోర్బనునాయకత్వమున జర్మనుసేనలు జీతములు లేక రోముపై దాడివెడలి ఆనగరమును 1527-లో పట్టుకొని కొల్లగొట్టిరి. ఆపురమున లూటీహత్యలు జరుగుచుండగా, పోపు 'సెంటు ఏంజెలో కోట'లో దాగుకొని తుదకు జర్మను సేనలకు 4 లక్షల 'డకట్లు' లంచమిచ్చి పంపివేసెను. ఇట్లు నిరర్థక సమరములు జరిగినమీదట, యూరపునంతను దారిద్ర్యదేవత వరించెను. తుద కిటలీలో చార్లెసే జయమొంది 1530-లో బలోనాలో పోపుచే నభిషిక్తుడాయెను. జర్మనుచక్రవర్తి కీ గౌరవము జరుగుట కిదియే చివరిసారి.

ఈలోగా తురుష్కులు హంగరీలో ముందుకు వచ్చి, 1526-లో హంగరీరాజు నోడించి చంపి, బుడాపెస్టుపురిని బట్టు కొనిరి. సులైమనుచక్రవర్తి 1529-లో వియన్నానగరమును గూడ బట్ట యత్నించెను. ఈస్థితిలో చార్లసు దద్దరిల్లి తురు ష్కుల దరుమ యావచ్ఛక్తిని వినియోగించెను కాని, ప్రబల శత్రువులు తమ సరిహద్దు చేరినప్పుడైన జర్మనుసామంతు లేకము కారైరి. ఫ్రాన్సిసు ఇంకను వైరము వీడనందున, తిరుగ ఫ్రెంచి యుద్ధము సంభవించెను; 1538-లో దక్షిణఫ్రాన్సుపై దాడి జరిగెను; అంతట చార్లెసు ఫ్రెంచిరాజు మిత్రులై తురుష్కుల నెదుర్కొనిరి. కాని ప్రొటెస్టంటులగు జర్మనురాజన్యులు రోముకు విరోధులై, 'స్మాల్కాల్డిక్ లీగ్' అను విరోధి సంఘము స్థాపించిరి. అందుచే తురుష్కులతో హంగరీకై పోరు

టకు బదులు, చార్లెసు జర్మనీలో నంతఃకలహమగ్ను డయ్యెను. దీని యారంభదశలోనే చార్లెసు మరణించెను. కొంతకాలము మహాసమరముగ కొంతకాలము కుట్రరూపముగ మారుచు, నిరర్థకము రక్తపూరితము నైన ఈ దీర్ఘకలహము 19-వ శతాబ్దమువరకు సాగి, కాలసర్పమువలె మధ్యయూరపును వేధించి నిస్సార మొనర్చెను.

తన్నావరించిన యాబాధలతత్వము నాచక్రవర్తి కనిపెట్టలేకపోయెను; ఆకాలమున కతడు చాల మంచివాడే; ఆ శోషకకలహములు నిజమగు ధార్మికవిభేదము లని యాతడు భ్రమించెను; ఆకక్షుల సఖ్యపర్చి సంధియొనర్చుట కత డనేకవిధముల యత్నించెను; న్యూరెంబర్గు, రేటిస్బను, ఆగ్సుబర్గులలో జరిగినసంధు లాతని అంత్యకాలమందే జరిగినవి. కాని, మిగిలిన రాజు లెవ్వరును అపుడు మనఃపూర్వకముగా సంధియత్నము చేయలేదు. అప్పటిప్రజలలోని ధార్మికాందోళనమును, సాంఘికన్యాయతత్పరతను, జ్ఞానవ్యాప్తిని రాజులు తమస్వలాభముకే యుపయోగించుకొనిరి. ఆంగ్లరాజగు 8-వ హెన్రీ మతద్రోహము నిరసించు గ్రంథములు రచించి, పోపుచే "ధర్మరక్షకు"డని బిరుదొందెను. కాని తన ప్రథమభార్యను వదలి ఆనిబోలి నను సుందరిని వివాహమాడుటకును, ఇంగ్లండులోని మతసంస్థల సొత్తుల గబళించుటకును అతడు 1530-లో ప్రొటెస్టంటు ప్రభువులతో జతకూడెను. స్వీడను డెన్మార్కు నార్వే దేశములపాలకు లప్పటికే ప్రొటెస్టంటులై, పోపుఅధికారము నిరాకరించిరి.

జర్మను మతయుద్ధము 1546-లో (మార్టినులూథరు మరణించిన కొద్దినెలలకే) మొదలిడెను. ప్రొటెస్టంటు సాగ్జను

సేన 'లోచో'వద్ద నోడెను. మిగిలిన ముఖ్యశత్రువు ఫ్రాన్సురాజు అగు ఫిలిప్పును మోసముచే చక్రవర్తి ఖైదుచేసెను; సాలీనా కప్పమీయ నంగీకరించి, తురుష్కుల వదల్చుకొనెను. 1547-లో ఫ్రాన్సిసు చనిపోగా, చక్రవర్తి హాయిచెంది శాంతి నెలకొల్ప నారంభించెను. కాని, 1552-లో జర్మనీలో తిరుగ యుద్ధ మారంభించెను; 'ఇన్సుబ్రక్కు'వద్ద చార్లెసు ఓడి తప్పించుకొని, పాసో వద్ద సంధిచేసికొని తాత్కాలికశాంతి స్థాపించుకొనెను; ఇట్లీ 32 యేండ్లను అధికారముకై రాజులు కలహించిరి. అప్పటికి తురుష్కులుగాని, ఫ్రెంచి జర్మను ఇంగ్లీషువారుగాని అమెరికా ఉనికిని సముద్రమార్గమున ఆసియాఖండమును జేరగల్గుటను దాని లాభమును ఇంకను కనిపెట్టలేదు. స్పెయినుదేశీయుల తరఫున 'కార్టేజి' స్వల్పజనులతో మధ్యఅమెరికాలో నవశిలానాగరికతలోని మెక్సికోదేశమును జయించెను. 'పిజారో' సేనాని (మధ్యఅమెరికాలోని) పెనామాభూసంధిని దాటి (1530); దక్షిణఅమెరికాలోని విచిత్రదేశమగు పెరూను జయించెను. అందుచే స్పెయినుఖజానాకు వెండిదిగుమతి తప్ప యూరపుకెక్కువలాభ మున్నట్లు తోచలేదు.

పాసోసంధి కాగానే నిర్మలమనస్కుడై యూరపు రాజుల పరస్పరవైరము వ్యర్థమని గమనించి అస్వస్థదేహుడగు చార్లెసు తనయధికారము వదలి, జర్మనురాజ్యమును తనతమ్ముడగు ఫెర్డినందుకును, స్పెయిను నెదర్లండు దేశములను తన పుత్రుడగు 2-వ ఫిలిప్పుకును విడిచి, వానప్రస్థుడై, (స్పెయినులో) టేగసు నదీతీరపు వనములోని 'యూస్టు' అను క్రైస్తవమఠమందు వసించుచు, 1558-లో చనిపోయెను.

మహాభోగి యగు సార్వభౌము డిట్లు సర్వప్రపంచము వదలి యేకాకియై విరాగియగుట యద్భుతమని కొందరు వర్ణించిరి. కాని అచ్చటగూడ చార్లెసుకు 150 మంది అనుచరులు; విభవముకు లోటులేదు. రాజ్యభారముమాత్రము పోయెను. పితృవాక్యపాలకుడగు 2-వ ఫిలిపు (స్పెయినురాజు) ఆతని యోగక్షేమ మరయుచుండెను. చార్లెసు రాజ్యత్యాగము కితరకారణములును గలవు. రాబర్ట్సనుగారి "చార్లెసు జీవని"అను గ్రంథపు అనుబంధముతో 'ప్రెస్కాటు' ఇట్లు వ్రాసెను. "ఉద్యోగులకు రాజుగారికి జరుగు ఉత్తరప్రత్యుత్తరము లన్నిటిలో చార్లెసు చక్రవర్తి వ్యాధిభోజనముల గూర్చి వ్రాయబడుచునే వచ్చెను. రాజకీయలేఖలం దిట్లు భోజనాదులగూర్చి చర్చించుట అరుదు; ఆ యుద్యోగులకును ఇది విషమమై యుండును. చార్లెసు కిష్టములగు వివిధమత్స్యముల దూరస్థలములనుండి ఇతరదేశములనుండి కూడ తెప్పించి యిచ్చినట్లును వైరాగ్యమునగూడ చార్లెసుజిహ్వాచాపల్య మధికముగ నుండినట్లును, ఈ యుత్తరములచే తేటపడును."

అంత్యకాలమందు గూడ దన కుపవాస మక్కఱలేకుండ చార్లెసు 1554-లో 3-వ జూలియసు (పోపు) నుండి పత్రిక నొందెను. అతిభోజనము, అందుపై వ్యాధి, చికిత్స, ఆతనికి నిత్యచర్యలు. అతడు స్వయముగా జదువక, చార్లమనువలె భోజనకాలమం దితరులు చదువగా వినుచుండెను. ఆటబొమ్మలతోను సంగీతాదులతోను అప్పుడప్పుడు రాజకార్యములతో గూడ వినోదించుచుండెను. చక్రవర్తిని చనిపోగానే ఆతని మతాచారనిష్ఠ యధికమాయెను. ప్రాచీన కర్మకాండలందు

పట్టుదల హెచ్చి తనసమీపమున 'వల్లడాలిడ్'లో ప్రాటెస్టంటు బోధ జరుగుట జూచి యతడు కోపోన్మత్తుడై, వారిని విచారణ లేకయే శిక్షింప నియమించెను. అట్టి దురాచారుల క్షమింపక (తాను నెదర్లండ్సులో చేసినట్లు) జీవముతోనే దహించివేయ వలెనని పశ్చాత్తప్తులను శిరచ్ఛేదము చేయవలెననియుచెప్పెను.

ఇట్లే అతని కపరకర్మల శ్రద్ధ హెచ్చెను. యూరపున మహాత్ము నశించిన దని, దానిని భూస్థాపితముచేసి శాస్త్రరీత్యా సంస్కరించవలె నని ఆతనికి దోచియుండును. యూస్టుప్రాంతమున ఉత్తరక్రియలు జరుగుచోట్లనెల్ల హాజరై, ఎచ్చటనో పోయిన వారికి నాత డుత్తరక్రియల జరుపుచుండెను; తనభార్య యాబ్దిక దినములందు ప్రతిసాలున ఆమె యుత్తరక్రియల జరిపెను; మరియు తన యుత్తరక్రియలుకూడ యథావిధిగ తానే జరిపించుకొనెను. అది యిట్లు చిత్రింపబడినది.

"ఆమందిరము నావరించిన గాఢాంధకారము అందలి వందలకొలది మైనపుదీపముల కాంతిచేగూడ బోలేదు. ఆభవన మధ్యమున సమాధిపై నల్లగుడ్డ కప్పిన శవపేటికచుట్టు రాజ కుటుంబమువా రందరు సన్యాసి సోదరబృందమును విషాద వేషులై గుమిగూడిరి. ప్రేతశాంతికై ప్రార్థనలు జరిగెను; ప్రేతు డున్నతలోకము నొందుగాత యని కోరబడెను; పరిచారకు లందరు చుట్టునుండి తమయాజమాని మరణదృశ్యము మనో వీథుల దోపట్టుటచే మిగుల ఖిన్నులై, కంట తడిపెట్టిరి. దీప హస్తుడై నల్లని యంగరక్షాముసుగుతో చార్లెసు తనకుటుంబ ముతో జేరి, తనఉత్తరక్రియల గమనించుచుండెను. తన ఆత్మ

నీశ్వరార్పణ చేయుసూచవగా చేతనున్నదీపము నతడు పురో హితుని కిచ్చుటతో నీ కర్మకాండ ప్రదర్శనము ముగిసెను."

ఈనాటకము జరిగిన రెండుమాసములలో నాతడు మర ణించెను. అతనితోబాటు "పవిత్రరోమకసామ్రాజ్య"పు ఆధిక్య మ స్తమించెను. ఆతనిరాజ్య మప్పటికే కుమారుడు సోదరుడు పంచుకొనిరి. ఆ "పవిత్రరోమకసామ్రాజ్యము" దుర్బలమై క్షీణించుచు, 1-వ నెపోలియను దినములవరకు నుండెను. దాని సంప్రదాయవాసన ఇంకను పోక, ఈనాటిరాజకీయముల గూడ విషపూరితము చేయుచున్నది.*

---

* యూరపుఖండములో అధికారముకై కాథలికు ప్రాబల్యము గల ఫ్రెంచి ఇటలీ వారును, ప్రొటెస్టంటు ప్రాబల్యము గల జర్మను ఆస్ట్రియనులును మహాయుద్ధమునకు పూర్వమును తరువాతను అనేకయుక్తులను ఆయుధసన్నా హములను చేయుచు, ఇతరరాజ్యములతో చిత్రవిచిత్రములగు సంధులు జరిగించుచుండుట ఇందు సూచితము.

# 52. యూరపులో రాజ్యాంగపరీక్షలు; రాజత్వప్రజాతంత్రాదులు

ఇట్లు లాటినుమతపీఠము విచ్ఛిన్నమై పవిత్రరోమక సామ్రాజ్యము క్షీణించెను. 16-వ శతాబ్దాదినుండియు యూరపు జనులు నూతనపరిస్థితులకు దగిన నవీనపాలనవిధానముకై యత్నించుచుండిరి. ప్రాచీనప్రపంచమందు, రాజవంశములు పాలకజాతివారిభాషయు మారుచుండినను, రాజు దేవాలయ కూటాలద్వారా బాలించుపద్ధతిమాత్ర మట్లే యుండెను. మామూలుజనుల జీవితపద్ధతి స్థిరముగ నుండెను. 16-వ శతాబ్దపు నవీనయూరపులో, రాజవంశముల మార్పులు ముఖ్యములు కావు; అచ్చటి సాంఘిక రాజకీయ నిర్మాణములలో పరిశోధనలు చాల జరుగుటయే గమనింపదగినది. ఆపరిస్థితులే మారుచుండు టచే, అందుకు వీలగు సంస్థలకై యత్నములు చేయుటలో చిక్కులు కలుగుచుండెను. మానవుడు బుద్ధిపూర్వకముగ మార్పు కిష్టపడడు. మనస్ఫూర్తి లేకుండ చేయు మార్పులు అప్పటి పరిణామములకన్న వెనుకబడుచుండెను. 16-వ శతాబ్దమునుండి మానవచరిత్రలో నప్పటి సాంఘిక రాజకీయసంస్థలు సరిపడక సౌఖ్యము లేకున్నది. ప్రాచీనపద్ధతుల స్థానమున సమయోచితముగ సంఘ మంతటికి పునర్నిర్మాణము నెమ్మదిగా జాగ్రత్తతో జరుపవలెను.

దాదాపు నూరుశతాబ్దములకాలము ప్రాచీనకాలమున సామ్రాజ్యము, మతగురువు, జానపదులు, వర్తకులు ఈ సంస్థలు (మధ్యమధ్య దండయాత్రలతో) ఒకవిధముగా వీలు సాగుచుండెను. ఆ పరిస్థితు లెందుచే మారిపోయెను?

ఇందుకు కారణము లనేకములు. మానవ వ్యవహారములే వేర్వేరుగా నుండును; అన్నిటికన్న ముఖ్యకారణము ప్రథమమున కొద్దిమంది ధీమంతులతో నారంభించి మొదట మెల్లగాను ఈ 500 యేండ్లలో సామాన్యజనులలో అతివేగముగాను భౌతికవిజ్ఞానము వ్యాపించగనే పరిస్థితులు మారిపోయినవి.

మానవుల జీవితాదర్శము మారగానే వారి పరిస్థితులును మారెను. జనులు జ్ఞానవంతులై నిత్యావసరములతో తృప్తినొందక విశాలాదర్శములకై పాటుపడగోరిరి. గత 20 శతాబ్దులలో ప్రపంచమున జ్ఞానవ్యాప్తిగలిగించిన బౌద్ధమతము, ఇస్లాము, క్రైస్తవమతము, మొదలగు గొప్పమతముల ముఖ్యసూత్ర మిదియే. అవి (ఇదివరలోని మతము లెత్తుకొనని) 'ఆత్మ' విషయమై పాటుపడెను. రక్తసిక్త బలిదానములతో పూజారులతో మూఢవిశ్వాసములతో గూడిన ప్రాచీనమతములను కొంత మార్చి, కొన్నిటిని రూపుమాపి, వాటిస్థాన మాక్రమించి అవి స్వతంత్ర మతములైనవి. ప్రాచీనజనులలోవలెగాక, ఈమతములు వ్యక్తికి ఆత్మగౌరవమును, సామాన్యధర్మములలో వారి విధులను గుర్తింపజేసి, వాటి నిర్వహణమును పెంపొందించెను.

లిపి సౌకర్యముతో వ్రాత వ్యాపించి, ప్రాచీననాగరికతలో మార్పు గలిగి మహాసామ్రాజ్యములు విశాలరాజకీయ సంబంధములు ఏర్పడెను. తరువాత రాకపోకలకు గుఱ్ఱములు,

ఒంటెలు, బండ్ల ఉపయోగమును, రోడ్లును, యినుపవస్తువుల వ్యాప్తియుగూడ పురోభివృద్ధికి కారణమాయెను. తరువాత నాణెముల చలామణివచ్చి, ఋణపద్ధతిమారెను; అందుచే ఆస్తి హక్కులు వ్యాపారమువృద్ధియై, ఆర్థికస్థితి తారుమారయ్యెను. సామ్రాజ్యములు విస్తరించినకొలది నరుల మనోభావములును మారెను. ప్రాంతీయ గ్రామదేవత లంతరించెను; దేవసమన్వయము కలిగి మహామతములు వ్యాపించెను. అంతట చరిత్ర భూగోళవివరముల లిఖించుట ఆరంభమై, జనులకు తమ అజ్ఞానము బోధపడి జ్ఞానతృష్ణ కలిగెను.

వైజ్ఞానికపద్ధతి గ్రీసులోను అలెగ్జాండ్రియాలోను చక్కగ నారంభించి తాత్కాలికముగ నిల్చిపోయెను. ట్యూటను అనాగరికుల దాడి, మంగోలియనుల పశ్చిమదండయాత్ర, మతపరిణామములు, అంటువ్యాధులు, సాంఘికరాజకీయస్థితుల చాల క్లిష్టముచేసెను. ఈచిక్కులు వీడుచుండగనే ఆర్థికజీవితమునుండి దాస్యపద్ధతి పోయెను. కాగితపుయంత్రములు అచ్చుకూటములు మొదలిడి జ్ఞానము వ్యాపించి క్రమముగా జ్ఞానేచ్ఛ, పరిశోధనము, బుద్ధివికాసము మరల ఆరంభించెను.

ఈ జ్ఞానాభివృద్ధితో బాటు 16-వ శతాబ్దమునుండి నూతనావిష్కరణములు మొదలిడి రాకపోకలసౌకర్యము సమావేశము హెచ్చి జనుల పరస్పరసంబంధము మారజొచ్చెను. పరస్పరము లాభనష్టములు సహాయము హెచ్చెను. అందుకు తగుపరిపాకము లేనందున ఈ నూతనావిష్కరణముల యుక్తమార్గముల జరుపుయత్నములు జరుగలేదు; తుదకీ 20-వ శతాబ్దపు మహావిప్లవముచే జనుల మనస్సులకు ఉత్తేజనము కలి

గెను. కడచిన నాలుగుశతాబ్దములలో నరులచరిత్రము పైదులో నిద్రించువాడు అది నిప్పంటుకోగనే కంగారుతో సమన్వయము చేసుకొన యత్నించురీతి నున్నది.

వ్యక్తులకథ కాక సంఘవృత్తాంతమే చరిత్రము; చరిత్రమున రాకపోకల నూత్నపద్ధతులే ప్రధానములు. అచ్చు, కాగితములు, నావికుల దిక్సూచివాడుక, సముద్రయానము చేయు ఓడలువచ్చుట, 16-వ శతాబ్దపు ముఖ్యసంగతులు; అచ్చు కాగితములచే జ్ఞానవ్యాప్తి కల్గి రాజకీయనిర్మాణము వృద్ధి నొందెను. దూరసముద్రయానముచే ప్రపంచ మేకమయ్యెను. 13-వ శతాబ్దములోని మంగోలులు పశ్చిమదేశములకు తుపాకి తుపాకిమందు వాడుక తెచ్చిపెట్టిరి; అందుచే చిన్నసామంత రాజులకోటలు భేద్యమైనవి; పురప్రాకారములు దుర్బలము లైనవి; అందుతో ఆసామంతపద్ధతియు నశించెను. కాన్స్టాంటినో పిలును మెక్సికో పెరూలును తుపాకులతోనే జయింపబడెను.

17-వ శతాబ్దమున విజ్ఞానవ్యాప్తి కలిగి భావిస్థితులు మారెను. సర్ ఫ్రాన్సిసుబేకను (1561-1626) ఈ వైజ్ఞానికు లలో ముఖ్యుడు. ఇతడు వెరుల్యంప్రభు వనుపేరుతో ఆంగ్ల న్యాయశాఖాధికారి అయ్యెను; ఇతడు కాల్చెస్టరు తత్వజ్ఞుడగు డాక్టరు గిల్బర్టు (1540-1603)కు శిష్యుడు; మొదటి బేకను వలె నీబేకనుకూడ స్వతంత్రపరిశోధన ముఖ్య మని బోధించెను. వైజ్ఞానికపరీక్షవలని లాభమును సూచించుట కతడు 'న్యూ అట్లాంటిసు' అను ఉత్తేజకమగు విచిత్రకథాగ్రంథము వ్రాసెను. ఇంతలో పరిశోధనను విజ్ఞానప్రచురణను ప్రోత్సహించుటకై లండను రాయలుసొసయిటీ. పారెంకెను సొసయిటీ మొదలగు

జాతీయసమితు లేర్పడెను. యూరపులోని నూతనపరిశోధనలకే గాక, ప్రపంచచరిత్రలగూర్చి భావదాస్యము కల్గించు మూఢమతవిశ్వాసముల బోగొట్టుటకును, యూరపులోని యీ వైజ్ఞానికసంఘము లెంతో యుపయోగించెను.

అచ్చుకాగితములు సముద్రనౌకలవంటి ప్రబలావిష్కరణములు క్రొత్తవేవియును 17,18-వ శతాబ్దులందు కలుగలేదు. కాని, అప్పుడు క్రమముగా జ్ఞాన మభివృద్ధియై 19-వ శతాబ్దమున ఫల మిచ్చెను. భూగోళజ్ఞానము వృద్ధియయ్యెను. టాస్మేనియా, ఆస్ట్రేలియా, న్యూజీలండుల గనిపెట్టిరి. ఆంగ్లదేశమున 18-వ శతాబ్దమున లోహముల కరగింపుకు రాతిబొగ్గు వాడబడి ఇనుము చౌకగా దొరకెను. పెద్ద లోహవస్తువులు విరివిగా వాడుట సాధ్యమై, ఆధునికయంత్రములు కలిగెను.

ప్రకృతిశాస్త్రము కల్పవృక్షమువలె ఎల్లప్పుడును చిగురు, పువ్వు, కాయలు నిండియుండును. 19-వ శతాబ్దమున మొదలిడిన ఈ విజ్ఞానఫలముల కంత ముండ దని తోచును. మొదట ఆవిరి, తరువాత ఉక్కు, ఇనుపదారి, మహాసముద్రనౌక, గొప్ప వంతెనలు, మహాప్రాసాదములు, అద్భుత శక్తియుతములగు యంత్రసామగ్రి, నరుల అవసరసౌకర్యములకు వలయు వివిధవస్తువులు, ఇంతేగాక విద్యుచ్ఛక్తి సంబంధమగు అమూల్యనిగూఢపదార్థములు ఇట్టి వన్నియు వరుసగా నరులకు లభించుచున్నవి.

16-వ శతాబ్దానంతరపు రాజకీయ సాంఘికజీవనమును దహింపబడు ఖైదులోని ఖైదీచర్యతో బోల్చితిమి. మననిద్రలో అసందర్భపరిస్థితులు కనబడునట్లే 16-వ శతాబ్దపు 'పవిత్ర రోమక

సామ్రాజ్య' స్వప్నమందు చార్లెసుచక్రవర్తి నిద్రాముఖము, బుభుక్షుకుక్షియు, ఆంగ్ల రాజగు 8-వ హెన్రీయు లూథరును కాతలికుఐక్యమును జీల్చివేయుటయు గల్గినవి. 17, 18-వ శతాబ్దులం దీ స్వప్నమున వ్యక్తుల రాజ్యము దృశ్యమయ్యెను. ఆ కాలపు యూరపులో రాజు లేకచ్ఛత్రాధిపత్యముకై నీరస రాజ్యముల కబళింప యత్నించిరి. ఆ యత్నములను మొదట భూస్వాములును, కోస్తావర్తకము పరిశ్రమలు వృద్ధియైనమీాదట ద్రవ్యవంతులు, వ్యాపారులును నిరోధించిరి. ఇందులో నేకక్షకును పూర్ణజయము రాలేదు. ఒకచోట రాజు జయమొంద, మరియొకచోట వ్యాపారులు ప్రజాసత్తాకరాజ్యమును స్థాపించిరి. ఆకాలపుప్రభుత్వములు ఆయాపరిస్థితులబట్టి మారుచుండెను. ఈ రాజతంత్రనాటకములందు రాజప్రధాని ముఖ్యపాత్ర వహించి, రాజుపై తరుచు పలుకుబడి కల్గియుండెను. కాతలికుదేశములందు మతగురువే మంత్రిస్థానము వహించుచుండెను. 5-వ చార్లెసు కుమారుడు స్పెయినురాజు నగు 2-వ ఫిలిపుయొక్క అధికారమునుండి తిరుగబడి హాలండులో వర్తకజనులు రిపబ్లికు (ప్రజాతంత్రరాజ్యము) స్థాపించిరి. ఇంగ్లండులో 8-వ హెన్రీ తనమంత్రి 'వూల్సే'తోను, ఎలిజబెత్తురాణి తన మంత్రి 'బర్లే'తోను రాజాధికారము బలపర్చుకొనిరి. అది పిమ్మట 1-వ జేమ్సు 1-వ చార్లెసుల తెలివితక్కువచే చెడిపోయెను. ప్రజాద్రోహపునేరముకై 1649-లో 1-వ చార్లెసు శిరచ్ఛేదమొందెను. ఇది యూరపువారి రాజకీయభావమున క్రొత్త విషయము. 1660 వరకు ఇంగ్లండు ప్రజాతంత్రకమై, పార్లమెంటు సర్వాధికారి యైనది. 3-వ జార్జి (1760-1820) శ్రమపడి తిరుగ

కొంత రాజాధికారము నిలువబెట్టుకొనెను. కాని, అధికారము చలాయించుటలో ఫ్రెంచిరాజు లెక్కువ జయమొందిరి. వారి ముఖ్యమంత్రులగు రిచెలూ (1585-1642) మాజరిన్ (1602-1661)-ల ప్రజ్ఞయు, 14-వ లూయీ రాజు (1643-1715) శక్తియు, ఇందుకు కారణములైనవి. 14-వ లూయీ మిక్కిలి సమర్థుడు. ఆతనికి రాజ్యకాంక్ష యధికము; అతడు ఫ్రాన్సును బలీయముగ జేసి దాని సరిహద్దు త్వరలో రైనునది పిరనీసుకొండల వరకును వ్యాపింపజేయ యత్నించెను. 'పవిత్రరోమక సామ్రాజ్యము' వంటి ఫ్రెంచి సామ్రాజ్యము స్థాపింపగోరెను. యుద్ధము కన్న లంచ మిచ్చుటయే అతని ముఖ్యతంత్రము. ఇంగ్లీషురాజగు 2-వ చార్లెసు, పోలిషు ప్రభువులు గూడ ఆతని సొమ్ము దినుచుండిరి. ఫ్రెంచిసొమ్ము అన్ని ప్రాంతములకు వ్యాపించెను. ఫ్రాంసులో ఆతని మహాప్రసాద మగు 'వర్సైల్సు' అంగణము మహావైభవముతో నొప్పుచు ప్రపంచము కసూయాశ్చర్యకరమయినది.

అంతట యూరపులోని యితరరాజులు 'లూయీ'వలె వ్యయము వైభవము సాగించిరి. 'వర్సైల్సు' బోలు మందిరములను కట్టించి, అందు సుందరవస్తువుల జేర్చిరి. చిత్రకళ, సంగీతము, సుందరశిల్పములు వృద్ధినొందెను. అంతటను సౌందర్యోపాసకులు మహిళామణులు జరిపట్టువస్త్రముల ధరించి, విచిత్రవేషములతో వసించుచుండిరి. (సామాన్యులు తన్ను జూచి అసహ్యపడినను) రాజన్యుల కాదర్శభూతుడై 'లూయీ'మహావైభవముతో నుండెను. ఆకాలమున జర్మనులు విభేదములతో నుండిరి. కొందరు రాజులు లూయీ ననుకరించిరి. జర్మను

స్వీడను బోహీమియారాజులలో అప్పుడు జరిగిన (1618—48) ముప్పదేండ్లయుద్ధముచే ఒకశతాబ్దమువరకా దేశములు నీరసించి పోయెను. ఆయుద్ధాంతమున వెస్టుఫేలియాసంధి (1648) యేర్పాట్లచే యూరపుపటము పలురకముల 'చిల్లరరాజ్యముల అతుకుల బొంత'గా తయారయ్యెను. స్వీడనులో నొక అగ్రము జర్మనీకి వచ్చెను. కొన్ని ద్వీపములు తప్ప మిగిలిన రైనుప్రాంతము ఫ్రాన్సుకు సంబంధములేకుండెను.1701-లో జర్మనీలో ప్రష్యాకు ప్రత్యేకరా జేర్పడెను; ప్రష్యా క్రమముగా వృద్ధినొందెను. అప్పటి రష్యారాజగు ఫ్రెడరికు మహాశయుడు (1740—86) పాట్స్డంలో రాజాస్థాన మేర్పఱచెను. అందు వర్సైల్సులో వలె ఫ్రెంచిభాష, ఫ్రెంచి వాఙ్మయము వాడుకలో నుండెను.

1714-లో (జర్మను) హానోవరు ప్రభువు ఇంగ్లండుకు రాజై, జర్మను సామ్రాజ్యసంబంధమును చాలవరకు తప్పించుకొనెను. 5-వ చార్లెసు వంశీయులలో ఆస్ట్రియా శాఖవారు చక్రవర్తినామమును నిలుపుకొనిరి; స్పెయినుశాఖవారు స్పెయినును పాలించుచుండిరి. కాని అప్పుడు తూర్పున నొక చక్రవర్తి బయలుదేరెను. 1453-లో కాన్స్టాంటినోపిలు పతనము తరువాత మాస్కో ప్రభువగు ఇవానుమహాశయుడు (1462—1505) బిజాంటియముకు రాజు కాగోరి, తనసేన కా రాజ్యచిహ్నము నెలకొల్పెను. అతని మనుమడు క్రూరుడు నగు 4-వ ఇవాను (1533—84) సీజరు (జారు) బిరుదు నొందెను.* 'పీటరు' మహా

---

*జూలియసు సీజరుపేర తరువాత రోమకచక్రవర్తులు 'సీజరు' బిరుదు వహించిరి; (292—296 పుటలు చూడుడు.) దీని యనుకరణముగ దరిమిలాను రష్యాచక్రవర్తులు 'జార్' అనియు, జర్మనుచక్రవర్తులు 'కైజరు' అనియు బిరుదులు వహించిరి.

శయుని (1632—1725) క్రింద రష్యా యూరపులో ప్రాముఖ్యముకు వచ్చెను. పీటరు నేవానదియొడ్డున 'పీటర్సుబర్గ'ను క్రొత్తరాజధాని గట్టి రష్యాకు యూరపుతో ప్రత్యక్షసంబంధము గలుగజేసి దానికి 13 మైళ్లదూరమున పీటరోఫ్‌లో నొకప్రాసాదము ఆస్థానము నేర్పరచి అందు ఫ్రెంచినే ఆస్థాన భాషగా జేసెను.

ఆస్ట్రియా ప్రష్యా రష్యాలమధ్య నిరుకుకున్న పోలిషు రాజ్యమున రాజబలము ప్రజైక్యము లేకుండెను; అందుచే చుట్టు నున్న ఈ మూడు రాజ్యములు పోలండును మూడు భాగములుగా పంచుకొనిరి; దానివ్యక్తిత్వము కాపాడి తన మిత్రముగా నుంచుకొనుటకు ఫ్రెంచిరాజు చేసిన ప్రయత్నము వ్యర్థమయ్యెను. అప్పుడు స్విడ్జర్లండు కొన్ని ప్రజాతంత్ర రాజ్యములసమితిగా నుండెను. వెనిసుపురి ప్రజాతంత్రకమయ్యెను. జర్మనీలో, చాలభాగమువలె ఇటలీయు అనేక ప్రభువులమధ్య విభక్తమై యుండెను. పోపు వెనుకటి సర్వాధికారము పోయి, ఇతరరాజ్యములందు జోక్యము గల్గించుకొనక తనసంస్థానమును మాత్రము పాలించుచుండెను. యూరపు పరస్పరవిభిన్నమై, ఒకేరాజకీయపద్ధతి లేకుండెను.

ఈ రాజులును ప్రజారాజ్యములును యిరుగుపొరుగు రాజ్యములతో కలహములు, ఆక్రమణయుక్తులు జరిగించు చుండిరి. ఈ ప్రత్యేకరాజ్యముల పరస్పర విరోధవాసన యిప్పటికిని యూరపులో పూర్తిగా వదలలేదు. ఈకాలపు జ్ఞానవంతుల కప్పటిచరిత్ర నిరర్థకముగ గన్పించును. రాజపరివారమందును

మంత్రులమధ్యను కలుగు అసూయలచే రాజ్యములమధ్య జరుగు యుద్ధములు ఆకాలపు లంచములు అసూయలు కనిన మన కసహ్యముగ నుండును. కాని 20 భిన్న రాష్ట్రములుగా నున్నను, యూరపంతటను అప్పుడు విద్యాజ్ఞానములు వ్యాపించి వృద్ధి నొందెను. నవీనసంగతులు కనిపెట్టబడుచుండెను. 18-వ శతాబ్దమున అప్పటి రాజకీయపద్ధతుల విమర్శించుచు గ్రంథములు వ్రాయబడెను. అప్పటి యూరపు అగమ్యగోచరస్థితి వాల్టేరు కవియొక్క 'కాండైడు' వంటి గ్రంథములందు తీవ్రవిమర్శకు పాత్రమయ్యెను.



# 53. ఆసియాదులందు యూరపియను సామ్రాజ్యము

మధ్యయూరపు ఇట్లు విచ్ఛిన్నమై కోలాహలములో నుండ, పశ్చిమయూరపువారు (అందు ముఖ్యముగా డచ్చివారు నార్వే, స్వీడను, స్పెయిను, పోర్చుగలువాసులు) సముద్రము దాటి, ఖండాంతరములందుగూడ స్పర్ధపడుచుండిరి. యూరపులో రాజకీయభావములు ముద్రాయంత్రముమూలమున జనులంధరిలో వ్యాపించి ఉద్రేకము గల్గించెను. సముద్ర నౌకలద్వారా యూరపియనుల యనుభవములు ప్రపంచమంతట వ్యాపించెను.

డచ్చివారును నార్వే స్వీడను దేశీయులును మొదట వ్యాపారలోపాదులకే ఖండాంతరములకు బోయిరి; కాని స్పెయినుదేశీయులే మొదట వలసపద్ధతి నారంభించిరి; వారు త్తర అమెరికా అంతటిపై నధికారము వహింపబూనిరి; కాని యింతలో పోర్చుగీసువా రందు వాటా కోరిరి. పోపు 1494-లో బ్రెజిలును పోర్చుగలుకు, తక్కిన అమెరికానంతను స్పెయినుకు, పంచియిచ్చి చివరిసారి తన లోకాధిపత్యము చలాయించెను. ఈ సమయమున పోర్చుగీసువారు తూర్పుదక్షిణదిశలగూడ వ్యాపింపజొచ్చిరి. 1497-లో వాస్కోడగామా పోర్చుగలు రాజధాని యగు లిస్బనునుండి నావలపై బయలుదేరి దక్షిణాఫ్రికా అగ్రముచుట్టి జాంజిబరుకును, అచ్చటినుండి భారత దేశములోని కాలికట్టుకును చేరెను. 1515-లో జావా మలాకా

ద్వీపములయొద్ద పోర్చుగీసునావ లుండెను. ఈధీరులు హిందూ మహాసముద్ర తీరములందు రేవుపట్టణములు కోటలు కట్టిరి. మొజాంబికు, భారతదేశమందలి గోవా డయ్యూ డామనులు, చీనాలో 'మేకో' టిమరులో నొకభాగమును, ఇప్పటికిని పోర్చుగీసుపాలనములో నున్నవి. అమెరికాలో అధికారము చేయకుండ పోపు ఇతర యూరపియనులపై ఆంక్ష విధించెను; కాని వారు స్పెయిను పోర్చుగలుల ఏకాధిపత్యమును నిరాకరించిరి; ఇంగ్లీషు, డేను, స్వీడులు, డచ్చివారును ఉత్తరఅమెరికాలోను వెస్టిండీసుద్వీపములందును ప్రవేశించిరి. కాథలికు అయ్యు, ఫ్రాంసురాజును ప్రాటెస్టంట్లవలెనే పోపు ఆంక్షల మూలద్రోసెను. ఈ నూతనప్రదేశములందుగూడ, యూరపియనుల యుద్ధములు వ్యాపించెను.

ఈ ఖండాంతరరాజ్యములకై జరిగిన కలహములందు తుద కింగ్లీషు వారెక్కువ విజయమొందిరి. డేనులు, స్వీడులు, జర్మనీతో నంతఃకలహములలో బడి యుద్ధము సాగింపలేరైరి; స్వీడనుకూడ ('గస్టవస్ అడాల్ఫ'సను రాజసింహునిక్రింద) జర్మనుసంగములందే నిమగ్నమయ్యెను. అమెరికాలో స్వీడనువారి కుండిన చిన్నరాజ్యములు డచ్చివారివశ మయ్యెను. కాని డచ్చివారు స్వదేశమున ఫ్రెంచివారిబాధచే దుర్బలులై, ఆంగ్లేయులతో పోటీలో నిలువలేకపోయిరి. దూరప్రాచ్యదేశములందు, ఇంగ్లీషు డచ్చి ఫ్రెంచివారును, అమెరికాలో ఇంగ్లీషు ఫ్రెంచి స్పానిషువారును అధికారముకై యుద్ధ మొనర్చిరి. ఆంగ్లద్వీపముకు యూరపుకుమధ్య (ఇంగ్లీషుచానలు) సముద్ర ముండుటచే యూరపులోని లాటినుసామ్రాజ్యాదుల

యుద్ధములలో ఇంగ్లండు చిక్కకొన లేదు. ఫ్రాంసు ఎప్పుడును యూరపే ముఖ్య మని ఎంచుకొనెను. 18-వ శతాబ్ద మంతయు ఫ్రెంచివారు స్పెయిను ఇటలీ జర్మనీలందు ప్రబల మందుటకై యత్నించిరి; ప్రాచ్య దేశములందును అమెరికాలోను అంతగా వ్యాపింపలేరైరి. 17-వ శతాబ్దమం దాంగ్లదేశ మందలి మత రాజకీయవిభేదములచే చాలమంది ఆంగ్లేయులు స్వదేశమువీడి, అమెరికాచేరి అందు స్థిరవాస మేర్పఱచుకొనిరి. వా రచట వలసయుండి వ్యాపించిరి; ఇట్లు క్రమముగా బ్రిటిషు జాతివా రమెరికాలో వృద్ధియై, అచట ప్రధానజాతివారైరి. 1756—1760-ల యుద్ధములలో ఫ్రెంచిప్రభుత్వమువారు కెనడాను విడిచిరి; అది పూర్తిగా ఆంగ్లాధికారుల వశమైనది.

తరువాత కొలదియేండ్లకే భారతదేశమున ఫ్రెంచి డచ్చి పోర్చుగీసువారికన్న, ఇంగ్లీషుకంపెనీవారే ప్రబలాధికారులైరి. బాబరు అక్బరువంశీయులు పాలించిన మొగలుసామ్రాజ్య మీలోగానే మిక్కిలి క్షీణించిపోయెను. ఆసామ్రాజ్యపుస్థానమును బ్రిటిషువారి 'ఈస్టిండియా కంపెనీ' అను వర్తకసంఘమాక్రమించి జయించెను. ఇది విచిత్రము. ఈస్టిండియా కంపెనీ ఏలిజబెత్తురాణి కాలమున లండనులో కోస్తావర్తకుల చిన్న సంఘముగ నారంభించి, క్రమముగా నావలరక్షణకై ఆయుధములను సేనలను జేర్చుకొని మొదట భారతదేశమునుండి పరిమళద్రవ్యములు, పచారుదినుసులు, రంగులు, తేయాకు, రత్నములు తెచ్చుచు ఆ వ్యాపారముచే చాలాలాభము నొందుచు భారతదేశపు ప్రభువుల రాజ్యములను క్రమముగా వశము చేసుకొనిరి. ఆక్రయవిక్రయవ్యాపారులు అమితద్రవ్యముల


అమెరికాలో బ్రిటిషు, ఫ్రెంచి, స్పానిషు వారలవ్యాప్తి (1750)
జగత్కథ
ఫ్రెంచి
స్పానిషు
బ్రిటిషు

హరింప నారంభించిరి. వారిని అదుపు ఆజ్ఞలలో నుంచువారు లేరైరి. అట్లు పోగుచేసిన భారతదేశ ద్రవ్యమును విశేషముగ ఆ కంపెనీ ప్రముఖులు, ఉద్యోగులు, మామూలు గుమాస్తాలు, సోల్జరులుకూడ తమతో దీసుకొని ఇంగ్లండుకు జేరిరి.

ఇందాశ్చర్యము లేదు. శ్రీమంతమగు భారతదేశ మాపరిస్థితిలో నసహాయమై తమపాల బడగా, తా మేమి చేయవచ్చునో, ఏచర్యకూడదో ఆంగ్లేయులకు నిశ్చయము లేకపోయెను. అచ్చటి దేశము, ఆపరిస్థితి వీరికి క్రొత్త. గోధుమవర్ణులగు భారతీయులు భిన్నజాతీయులని దాక్షిణ్యపాత్రులు కారని వా రెంచిరి. అప్పటి గూఢ దేవాలయములబట్టి అచ్చటి ప్రవర్తనపద్ధతియు భిన్నమని తోచెను. తరువాత నీ సేనానులు ఉద్యోగులు స్వదేశమగు ఇంగ్లండుకు వచ్చి భారతదేశమున క్రూరులై బలాత్కారముగ ద్రవ్య మపహరించినందుకు పరస్పరము నిందించుకొనిరి. అది బ్రిటనులో ఆంగ్లేయులకు విచిత్రముగ దోచెను. క్లైవు దోషియని పార్లమెంటువారు నిర్ధారణచేసిరి. అతడు 1774-లో ఆత్మహత్య చేసుకొనెను. భారతదేశ పాలకుడైన (మొదటి గవర్నరు జనరలు) వారన్ హేస్టింగ్సుమహాశయుపైనను 1783-లో నిట్టినేరము మోపబడెను. 1792-లో నతడు నిర్దోషిగా నెంచబడెను. లోకమం దిట్టిపరిస్థితి అతివిచిత్రము, అభూతపూర్వము. అప్పటి ఆంగ్ల సామ్రాజ్యముకన్నను మిక్కిలిగొప్పదై అధిక జనసంఖ్య గల ఆ మహారాజ్యమును ఒక లండను కంపెనీ పాలించుచుండెను. అందుపై పార్లమెంటువారి అజమాయిషీమాత్ర ముండెను. సామాన్యపు ఆంగ్లేయులకు హిందూదేశ మన్న దూరస్థము, విచిత్రము అగు దుష్ప్రాప్యభూమిగా దోచెను. అచటికి

ధీరసాహసులగు బీదయువకులు వెళ్ళి అనేక వత్సరములతరు వాత ఐశ్వర్యవంతులు కోటీశ్వరులునై వచ్చుచుండిరి. ప్రాచ్య దేశ మందలి యీ కోట్లకొలది గోధుమవన్నె జనుల జీవిత మిట్టి దని యాంగ్లేయు లూహించుట కష్టనూయెను. భారతదేశము విచిత్రము అప్రత్యక్షముగ గన్పట్టెను. అందుచే ఆకంపెనీ చర్య లపై తగుతనిఖీ అజమాయిషీ చేయుట ఇంగ్లీషువారి కసాధ్య మాయెను.

పశ్చిమ యూరపురాజ్యము లిట్లు నూతనఖండాంతర రాజ్యములకై, సముద్రములపైన లోకమంతటను బోరుచుం డిరి. అప్పు డాసియాభూభాగమున రెండురాజ్యములు జయ మొందుచుండెను. 1360-లో మంగోలుల పాలనము వదల్చు కొన్న చీనా స్వజాతీయులగు 'మింగు' రాజులపాలనలో 1644 వరకు వృద్ధిచెందెను. అటుపై మంచూ లనబడు మరియొక మంగోలుతెగవారు చీనాను జయించి, 1912 వరకు పాలిం చిరి. ఈలోగా రష్యారాజ్యము తూర్పువైపు వ్యాపించుచు ప్రపంచమున ప్రబలమగుచుండెను. రష్యనులు సగము ప్రాగ్జాతి, సగము పాశ్చాత్యజాతి. ఆ రాజ్యము పూర్వార్ధగోళముమధ్య నున్నది;ఫ్యూడలు (జాగీరులపద్ధతి) పాలనక్రింద నున్న పోలండు హంగేరీలను వ్యవసాయదేశములకును, తూర్పున తార్తారులకును అడ్డుగోడలవలె నున్న కొండతుప్పలలోను గుట్టలతోను నిండిన మరుభూములందు కోసకు లనబడు ఒక క్రైస్తవజాతి నివసించు చున్నారు; వారే రష్యాఅభివృద్ధికి కారకులు. ఈ కోసకులు యూరపులో తూర్పుఅడవులవారు; వీరు 19-వ శతాబ్దిమధ్యపు అమెరికా సంయుక్తరాష్ట్రములలోని పశ్చిమప్రాంతపు వనచరుల

వలె నుండిరి. రష్యాలోనుండి ప్రవాసితులగు విప్లవకారులు, బానిసలు, మతాంతరీయులు, దొంగలు, తిరుగుబోతులు, హంతకులు వగైరాలు నిర్జన మగు దక్షిణప్రాంతమున జేరి, అక్కడ వసించుచు పోలు రష్యను తార్తారు జాతులతో స్వాతంత్ర్య రక్షణలకై పోరాడిరి. తూర్పున తార్తారునుండి పారిపోయిన వారు నీకోసకులతో జేరిరి. బ్రిటిషుప్రభుత్వమున స్కాట్లండు దేశపు కొండజాతులు సైనికులైనట్లే, క్రమముగా నీసరిహద్దు ప్రాంతపుశూరులు రష్యను సామ్రాజ్యోద్యోగములలో జేరవీరి కాసియాలో క్రొత్తభూము లీయబడెను. వీరు తురుష్కస్థానమందును ఆమూరునదివరకును సైబీరియాలోను వచ్చిపడుచున్న మంగోలుదండుల నరికట్టిరి.

17, 18-వ శతాబ్దులలో మంగోలులశక్తి యెట్లు క్షీణించెనో తెలియదు. చెంగిజ్ఖాను తైమూరు లేనులనాడు మధ్య ఆసియానుండి వ్యాపించి లోకపాలకులైన వీరు రెండు మూడు శతాబ్దులలో రాజకీయముగ నీరసులైరి. శీతోష్ణస్థితిలో మార్పులు, మితిలేనిరోగములు, మలేరియాపోలు అంటుజాడ్యములు, క్షామములును, మధ్యఆసియాజనుల క్షీణదశకు గొంత కారణమైయుండును. లోకచరిత్ర పరిమితినిబట్టి చూచిన నిది తాత్కాలికమే; చీనానుండి యచట వ్యాపించిన బౌద్ధమతపద్ధతి గూడ వారిని నిర్వీర్యులుగ నొనర్చె నని కొందరి అభిప్రాయము. ఏది యెట్లున్నను 16-వ శతాబ్దమునాటికి మంగోలు తార్తారు తురుష్కజాతులవారు పైకి వ్యాపింపలేదు. సరిగదా పశ్చిమమున క్రైస్తవరష్యనులచేతను,తూర్పున చీనావారిచేతను జయింపబడుచు వెనుకకు నెట్టివేయబడుచుండిరి.

17-వ శతాబ్దమంతటను కోసకులు యూరపియను రష్యా నుండి తూర్పు దెసకు వ్యాపించుచు, సాగుకు వీలగుచోట్ల స్థిరవాసులైరి. తుర్కీవారింకను బలీయులైయున్న దక్షిణమున వలసజనుల సరిహద్దుకోటలు బురుజులు వెనుక కేర్పడెను. ఈశాన్యమున రష్యా పసిఫికుమహాసముద్రమువరకు వ్యాపించెను.*

*భారతదేశమందు 17-వ శతాబ్దపు స్థితిపోయి, 18, 19-వ శతాబ్దములందు వేరుమార్గము పట్టెను. ఔరంగజేబు పాలన పద్ధతిచే దేశమందశాంతి పరస్పరవిరోధములు ప్రబలి, ఆతనియనంతరము 18-వ శతాబ్దమున మొగలుసామ్రాజ్యము క్షీణింపజొచ్చెను. వంగదేశము అయోధ్య దక్కనులలో ముసల్మాను సామంతరాజ్యములు, మహారాష్ట్ర రాజపుత్రస్థానాదులందు హిందూరాజ్యములును, పంజాబులో సిక్కురాజ్యమును, స్వతంత్రరాజ్యము లయ్యెను. మనఆంధ్రదేశమున బొబ్బిలి, విజయనగరం, పిఠాపురం, పెద్దాపురం, నూజవీడు, వెంకటగిరి మొదలగు సంస్థానములు ఐకమత్యము లేక నిజాంరాజ్యమునకు లోబడియుండెను. ఈరాజ్యము లన్నియు తమలో తాము కలహించుచుండ దేశమున విద్య శాంతి క్షీణించి, సాంఘిక కల్లోలము కలుగజొచ్చెను ఉన్నతాదర్శములు పోయి, ఔరంగజేబు నాటిన సంఘువిద్వేషపువిషాంకురము క్రమముగా వృద్ధియై, విభేదములు హెచ్చెను. పరస్పర సమావేశములు ఏకీభావము తగ్గసాగెను. ఆయాప్రాంతముల భాషలలోను ఆచారములలోనుగూడ భేదములు పెరిగెను; ఆయారాజులు స్వలాభపరు లగుట గమనించి, అర్థాన్వేషులై వచ్చిన పాశ్చాత్యులగు పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి, ఇంగ్లీషువారు తంత్రములు పన్ని చేరి యొక పక్షము వహింపగా, మనలో విరోధములు యుద్ధములు మరింత హెచ్చెను. అంతఃకలహములను ఆంగ్లేయులు సమయోచితయుక్తితో స్వలాభమునకు పూర్తిగా వినియోగించుకొనిరి. 18, 19-వ శతాబ్దులలో మనదేశమున ఫ్రెంచి ఇంగ్లీషుల ప్రతి

ముఖ్య యుద్ధములోను భారతీయసేనలు ఆంగ్లేయుల తరఫునను ఫ్రెంచివారి తరఫునను నిలిచి పరస్పరము యుద్ధముచేసెను. 18-వ శతాబ్దాంతమునకు ఆంగ్లులే ప్రబలులై, తమప్రాబల్యము ననేకవిధముల విస్తరింప జేసికొనిరి.

అంతవరకీ దేశము పాలించిన తురుష్కులు,మంగోలులు, అన్యదేశీయులైనను క్రమముగ మనదేశీయులలో కలసిపోయి, వారిచ్చటనే స్థిరవాసులై, భారతీయులైపోయి ప్రజలసుఖదుఃఖములలో పాల్గొనుచుండిరి. వారు నీటిపారుదల, ఆర్థిక క్షేమము, వ్యాపారాభివృద్ధి,విద్యాభివృద్ధికొరకే గాక యుద్ధములకు భవనములకు శిల్పకళలకు వినోదములకు వినియోగించు ద్రవ్యమంతయు మనదేశీయులకే యీయబడి, అంతయు మనదేశమందే నిల్చెను మనదేశపు పరిశ్రమలకు ప్రోత్సాహము, బీదలకు జీవనాధారము ఉండెను ఉన్నతోద్యోగములును భారతీయులలోనే యుండెను. 18-వ శతాబ్దమువరకు పాలన అన్యదేశమునుండి జరుపబడుటలేదు. అన్యదేశములకు ద్రవ్యము చేర్చు పద్ధతిలేదు; ఇచ్చటి శిల్పకళలకు మంచిపోషణయుండెను. రాజులు మారుచుండినను, దేశమంతట నుండిన గ్రామపంచాయితీ పద్ధతిచే ప్రతిగ్రామమునకు వలయు ముఖ్యవస్తువు లాగ్రామప్రాంతము లందే తయారై వినియోగమగుచుండెను.అంతవరకు మనవస్తువు లన్యదేశములందుగూడ చాల అమ్మబడుచు, మన జనుల శిల్పము సంపత్తి హెచ్చుచుండెను. గతశతాబ్ది మొదటివరకు ఆంధ్రప్రాంతమున నీలపల్లి, నర్సాపురం, మచిలీపట్టణము (బందరు), కొత్తపేట, మనదేశపు ఇతరప్రాంతములందు సూరతు, కాలికట్టు, కొల్లం, చట్టగ్రామము (చిటగాంగు) మొదలగు రేవుపట్టణములందు నౌకానిర్మాణాదులు, సరుకులు, ఎగుమతియు, వృద్ధిలోనే యుండెను. 19-వ శతాబ్దపు మొదటినుండి ఆ పరిస్థితులు పూర్తిగా మారెను. వెల్సుగారిందు సూచించినట్లు మనకు పేరుకు ఆంగ్లరాజు ప్రభువైనను, క్రియకు బ్రిటిషు పార్లమెంటుమెంబర్లును వారి నెన్నుకొనెడు ఆంగ్లప్రజలు ముఖ్యముగా ఆ వ్యాపారస్థులు మన కధి

కారులైరి. అందుచే వ్యాపారపద్ధతులు వారికే లాభకరమగునట్లు తయారగుట సహజము; కొలదికాలములోనే ఇటనుండి బట్టలు లోహావస్తువులు మొదలగు తయారైన వస్తువుల యెగుమతి తగ్గి మనదేశమంతటను గూడ విదేశవస్తువులు వ్యాపించెను; మనదేశీయవస్తువుల ఖర్చుతగ్గి, మన గ్రామజనుల వృత్తులును క్షీణించెను; ధనము విదేశాలకు పోవుచో, మనజనులలో దరిద్రత నిర్వ్యాపారతయు హెచ్చును గదా! పరదేశపాలనచే సామ్రాజ్యపు దృఢతకై మనదేశాదాయములో చాలభాగము విదేశీయుల సైనికవ్యయనిమిత్తమును పెద్ద ఆంగ్లోద్యోగుల హెచ్చుజీతముల నిమిత్తమును ఖర్చగుట సహజము. జనుల విద్యారోగ్యాదులకై ప్రభుత్వాదాయములో ద్రవ్యము చాలదు. ఇంతేకాక పరాధీనజనులలో మనోహృదయవికాసము క్షీణించి స్వతంత్రభావములు జ్ఞానాపేక్ష విద్యాభిలాష తగ్గుట సహజము. మనదేశీయులు జాత్యున్నతికి తగు కృషిచేయుట మానిరి. అందుచే ఈ రెండు శతాబ్దములలో మన దేశమున విద్యాహీనత, వృత్తిహీనత, నిరాశభావము, క్షామములు దురాచారములును హెచ్చినవి.



# 54. అమెరికనుల స్వాతంత్ర్యయుద్ధము

18-వ శతాబ్దపు 3-వ పాదమున యూరపువారంతః కలహములలోబడి, మతరాజకీయ విషయములం దైక్యభావము లేకున్నను ముద్రితగ్రంథాదులవలనను ఖండాంతరములకు బోవు మహానౌకలసహాయమునను ఉత్తేజితులై, తగవులు పడుచునే వారంతటను వ్యాపించి ప్రపంచతీరము లన్నిటిని వశము చేసికొనిరి. ఈ యుద్యమమునకు నియమము లేదు. ఇతర దేశీయులపైన వారి కప్పుడు గల్గిన తాత్కాలిక సదుపాయమువలన వారిట్లు వ్యాపించిరి. ఆ సౌకర్యములచే పశ్చిమయూరపుజనులు ప్రాయికముగ ఖాళీ యగు అమెరికాఖండమున వలస నేర్పఱచుకొనిరి. దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, న్యూజీలండు దేశములను గూడ యూరపియను లాక్రమించుకొని నావికులనాదిగ ఆశించు వర్తకలాభమునకై తమజాతులకే ఆకట్టు చేసిరి. కొలంబసు అమెరికాకు, వాస్కోడగామా భారతదేశమునకు వెళ్లెను. అప్పటికే జనసమృద్ధము సంపన్నము నగు నీ ప్రాచ్యదేశముల యాత్రలకు ద్రవ్యవ్యాపారాశలే ముఖ్యోద్దేశములు. అమెరికాలో ఆదిమజను లల్పులు; అనాగరికులు. అందుచే యూరపియనులు వెండి బంగారములకొరకచటనే వలసగ నుండిపోయిరి. స్పెయిను దేశీయుల వశమైన అమెరికాలో వెండి సమృద్ధిగ దొరికెను. ఖనిజములు, తోటలు, అచ్చటి ముడివస్తువులు, ఉన్ని, చర్మములు వీటికై వా రమెరికాలో స్థిరవాసులైరి.

ఇక్లేండు 17-వ శతాబ్దిమొదట పూర్వాచారపరులు పెట్టు బాధల సహింపలేక మతసంస్కారులగు ఇంగ్లీషుసంస్కర్తలనేకులు మత హింసలనుండి విముక్తికై అమెరికాలోని న్యూఇంగ్లండు చేరిరి. 18-వ శతాబ్దమున బాకీలబాధ పడలేక, అనేకులు జార్జియాకు పోయిరి. 18-వ శతాబ్దాంతమున డచ్చివారు అనాథులను ఆఫ్రికాలో దక్షిణపుదగు గుడ్‌హోప్‌అగ్రముకు పంపిరి. ఇట్లు యూరపియనులు సముద్రముల నిశ్శంకముగా దాటి, వలసకు చనిరి. 19-వ శతాబ్దములో పొగయోడలు వచ్చిన కొలది యేండ్లలోనే అమెరికా ఆస్ట్రేలియాలలోని ఖాళీప్రదేశములకు యూరపియనులు మహాప్రవాహములుగా వలసపోయి, ఆ ఖండాంతరములందును స్థిరవాసులైరి. ఇట్లు యూరపియను జనమువారి నాగరికత విశాలప్రాంతముల నాటబడెను. నాగరికులగు ఈ నూతనజాతులక్కడ సులభముగ వృద్ధిజెందిరి. యూరపులోని అధికారులు దూరదృష్టి లేక వీరి విషయమై తగునిర్ణయము లేకుండిరి. ఆ వలసప్రజలు స్వాతంత్రత కోరినను, ఆ వలస రాజ్యములు కేవలము తమ కధీనమగు సొత్తనియు, తమ కాదాయసాధనము లనియు వారిపై దాడిసలుపుదు మనియు యూరపియనుఅధికారులు ఎంచిరి. ఆ వలసజను లింగ్లండు దాటి అన్యదేశాలమధ్యకు వ్యాపించి సముద్రయుద్ధమున కందకున్నను, వారు మాతృదేశాధీనులై నటు లెంచి యూరపువారు తృణీకరింపసాగిరి.

దాదాపు 19-వ శతాబ్ది మధ్యవరకు నీ ఖండాంతర రాజ్యములతో రాకపోకలు తెరచాపయోడలతోనే జరిగెను. అప్పటికి భూతలముపై శీఘ్రగామము లశ్వములే; అందుచే

భూతలపు రాజ్యవ్యాప్తి సమావేశము గుట్టుపు అందుబాటు నకు లోనైయుండెను.

18-వ శతాబ్ది ఉత్తరార్థపు మధ్యకాలముకు ఉత్తర మెరికాలో ఉత్తరభాగము బ్రిటిషువారిఅధికారమున నుండెను. ఫ్రెంచి అధికారులు అమెరికాను వదలిరి. పోర్చుగీసువారికిజెందిన బ్రెజీలు, ఫ్రెంచి, బ్రిటిషు, డచ్చి, డేనిషువారల అధీనమందున్న ఒకటిరెండు చిన్నదీవులు తప్ప ఫ్లోరిడా, లూయిజియానా, కాలిఫోర్నియా, దక్షిణ అమెరికా అంతయు స్పానిషువారిదై యుండెను. ఇట్లుండ ఈ ఖండాంతరరాజ్యముల నణచియుంచుటకు ఓడలసహాయము చాల దని, మైను ఒంటారియో సరస్సులకు దక్షిణమందలి బ్రిటిషు వలసజనుల చర్యలవల్ల స్పష్టపడెను.

ఈ బ్రిటిషుకాలనీల ఉత్పత్తిస్వభావము లనేక విధములు; అక్కడ బ్రిటిషువారితోబాటు అనేకులు ఫ్రెంచి, స్వీడిషు, డచ్చివారు నుండిరి. మేరీలండులో బ్రిటిషుకాతలికు లుండిరి. 'న్యూయింగ్లండు'లో బ్రిటిషు ప్రొటెస్టెంటు తీవ్రవాదు లుండిరి. న్యూయింగ్లండువాసులు తామే సాగుచేసికొనుచు, దాస్యపద్ధతిని ఖండించిరి. 'వర్జీనియా'లో బ్రిటిషువారు ఆఫ్రికానుండి నీగ్రోగుంపుల తెచ్చి దాసులజేసి విశాలప్రదేశములను వారిచే సాగుచేయించుచుండిరి. అట్టి రాష్ట్రములనడుమ సహజైక్యము లేదు. వాటిలో కొన్నిటిమధ్య దీర్ఘప్రయాణము అవసరము. అందుకు అట్లాంటికు మహాసముద్రమును దాటునంత శ్రమాలస్యములగుచుండెను. ఇట్లు బ్రిటిషు అమెరికనులలో ఐకమత్యము లేకున్నను, లండనులోని బ్రిటిషుప్రభుత్వమువారి స్వార్థపరమూర్ఖచర్యలచే ఆ వలసజను లేకీభవించిరి. వారిపై పన్నులు

విధింపబడెను; కాని ఆ యాదాయవ్యయవిధానమున వారి కధికారము లేదు. వారితో వర్తక మాంగ్లదేశీయులకు లాభకరముగ నేర్పరుపబడెను. నల్లబానిస లుండుట యిష్టమైనను, నల్లవారికను హెచ్చిన తమ్ము తుడిచివేయుదు రని భీతిలి వర్జీనియనులు ఇక బానిసలదిగుమతి వల దనిరి. కాని, తమలాభము కావర్తకమును బ్రిటిషుప్రభుత్వమువారు నడుపుచునేయుండిరి.

ఆకాలమున బ్రిటనులో రాజాధికారము హెచ్చైయుండెను. 1760 మొదలు 1820 వరకు పాలించిన 3-వ జార్జి మూర్ఖుడై ఇంగ్లండుకు కాలనీలకు మధ్య జగడము పెంచెను.

బ్రిటిషుప్రభుత్వమువారు తమ ఈస్టిండియాకంపెనీ లాభముకై అమెరికనువర్తకులకు హానికరమగు కొన్నిచట్టముల జేసిరి. అది యీతగవును మరింత వృద్ధిచేసెను. 1773-లో కొందరు అమెరికనులు మారువేషముతో జొచ్చి ఆంగ్లప్రభుత్వమువారు క్రొత్తగా విధించినపన్ను పరతుల్కపై బోస్టను పురపురేవులో దిగుమతియైన మూడుపడవల తేయాకును సముద్రములో ద్రోసివేసిరి. బోస్టనుసమీపమున లెగ్జింగ్టను వద్ద బ్రిటిషుప్రభుత్వమువా రమెరికను నాయకుల నిరుపుర బట్ట యత్నించిరి. అందుపై 1775-లో యుద్ధము మొదలిడెను; బ్రిటిషువారే 'లెగ్జింగ్టను'వద్ద మొదట తుపాకులు పేల్చిరి. కన్కార్డువద్ద మొదటియుద్ధము జరిగెను. ఈయుద్ధారంభమందేడాదిపై వర కమెరికనులు మాతృదేశముతో విచ్ఛిత్తి కిష్టపడలేదు. కాని 1776 లో ఆవలసరాష్ట్రముల ప్రతినిధులు 'కాంగ్రెసు' అనుపేర సమావేశమై, స్వాతంత్ర్యప్రకటన చేసిరి. ఫ్రెంచివారితో యుద్ధమం దారితేరిన 'జార్జివాషింగ్టను' ఆ అమెరికనుల

సర్వసేనాని; 1777-లో బ్రిటిషుసేనాని (జనరలు బర్గోయిను) కనడానుండి న్యూయార్కుకు బోవుచుండ, 'ఫ్రీమన్సుఫారము వద్ద' అమెరికనులచే నోడి, 'సారటోగా'కడ పూర్తిగా లొంగెను. ఆయేటనే ఫ్రెంచి స్పానిషువారలు ఇంగ్లండుపై యుద్ధము ప్రకటించి, బ్రిటిషునౌకల నిరోధించిరి. 1781-లో కార్నవాలీసు సేనానిక్రింద మరియొక బ్రిటిషుసైన్యమును వర్జినియాలోని యార్కుటౌనుద్వీపకల్పమం దమెరికనులు పట్టుకొనిరి. ఆపైన 1783-లో పారిసులో సంధి జరిగెను; మైనునుండి జార్జియావరకు గల ఆ13 వలసరాష్ట్రములుకలసి స్వతంత్రరాష్ట్రసమితి యయ్యెను.ఇదియే 'అమెరికా సంయుక్తరాష్ట్రములు'. దానికుత్తరముందున్న కెనడామాత్రము బ్రిటిషుసామ్రాజ్యమందే యున్నది; నాల్గేండ్లవరకు ఈసంయుక్తరాష్ట్రముల కేంద్రప్రభుత్వము దుర్బలమై, అవి మరల ప్రత్యేకరాష్ట్రములుగా విడిపోవున ట్లుండెను; కాని బ్రిటిషులతో విరోధము, ఫ్రెంచిదౌర్జన్యము, విడిపోయిన గల్గు ఇక్కట్లు, వెంటనే విచ్ఛిత్తిలేకుండ జేసెను. ఈ రాష్ట్రాలకు 1783-లో నొక ఫెడరేషను(=సమిష్టిపాలనవిధానము)కూర్పబడి, ఆమోదింపబడెను. ఆచట్టముచే కేంద్రప్రభుత్వమును విశేషాధికారమునుగల యధ్యక్షుడు నేర్పడెను. వీరికి 1812-లో బ్రిటనుతో రెండవయుద్ధము కలిగి జాతీయైకమత్యము బలపడెను. ఐనను ఇందలిరాష్ట్రములు విశాలములు; అందలిప్రజలు భిన్నాభిప్రాయులు; అప్పటికి ప్రయాణసదుపాయములు తక్కువ; అందుచే యూరపురాజ్యములవలె ఈసమితియు త్వరలోనే విడిపోవునట్లుండెను. దూరపుజిల్లాలనుండి వచ్చుప్రతినిధులు (కాంగ్రెసు మెంబర్లు) వాషింగ్టనుజేరుటకు చాల శ్రమయగుచుండెను.

సామాన్యభాషావాఙ్మయములనుసామాన్యవిద్యావిజ్ఞానములను వృద్ధిచేయుటకు తీవ్రప్రతిబంధము లుండెను. కాని విచ్ఛేదము లేకుండ జేయుశక్తులు ప్రపంచమున గల్గుచుండెను. త్వరలోనే నదులలో పొగయోడ, నేలపై రైలుమార్గములు, తంతిమార్గమును ఏర్పడెను; ఈ శీఘ్రయానమువల్ల రాకపోకలు హెచ్చి సంయుక్తరాష్ట్రము విచ్ఛిన్నము కాకుండ నిల్చెను. చెదరియున్న ఆప్రజలందరు నేకమై, ఆధునికజాతులలో నగ్రగణ్యులైనారు.

తరువాత 22 ఏండ్లకు మధ్య దక్షిణఅమెరికాలోని స్పానిషుకాలనీలుకూడ ఈ 13 రాష్ట్రములవలె యూరపునుండి వీడి స్వతంత్రములయ్యెను. కాని వారు వివిధప్రాంతముల జెదరియుండిరి. పర్వతములు అడవులు ఎడారులును అడ్డమగుచుండెను; బ్రెజిలులోని పోర్చుగీసుసామ్రాజ్యము నడ్డుగనుండెను. అందుచే వారికైక్యము కుదురకస్వతంత్రమగు రిపబ్లికుల (ప్రజాతంత్ర) సమూహముగ నున్నారు. వారిలో వారికి యుద్ధములు, విప్లవములు కల్గుచున్నవి.

ఈ నిర్బంధవిచ్ఛేదవిషయమున బ్రెజిలు మరియొకమార్గమవలంబించెను. 1807-లో నెపోలియను ఆధిపత్యమున ఫ్రెంచి సైన్యములు మాతృదేశమగు పోర్చుగలు నాక్రమించెను. ఆ రాజు బ్రెజిలుకు పారిపోయెను. అప్పటినుండి విడిపోవువరకు పోర్చుగలుకు బ్రెజిలు సామంతమగుటకు బదులు, బ్రెజిలుకే పోర్చుగలు సామంతస్థానముం దుండెను. 1822-లో పోర్చుగీసు రాజుకుమారుడగు మొదటి 'పేడ్రో' పాలనమున బ్రెజిలు స్వతంత్రమయ్యెను. కాని ఈ నూతనప్రపంచము రాజత్వమునకు సుముఖము కాలేదు. 1889-లో బ్రెజిలువాసు లాచక్రవర్తిని

యూరపుకు సాగనంపిరి; మిగిలిన అమెరికాతోబాటు బ్రెజిలు సంయుక్తప్రజాతంత్రరాజ్య మాయెను.*

---

* ఆంగ్లేయులు మొదలగు యూరపియను లుత్తరఅమెరికాలో ప్రవేశించునప్పటికి అందు కొంద రాదిమజను లుండిరి. వారు ఎఱ్ఱఇండియను లనబడిరి. (మొదట పాశ్చాత్యు లాదేశ మిండియాయే అని తలచి వారి నిండియను లనిరి.) ఈ ఆదిమజనులను వలసవచ్చిన యూరపియనులు తరిమి తమతుపాకులతో కాల్చి చంపి, దాదాపు నిశ్శేషుల జేసి, క్రమముగా దేశ మంతటి నాక్రమించిరి. పాశ్చాత్యు లాక్రమించి వలసజేసికొన్న యిట్టి ప్రతిదేశమందును అచ్చటి ఆదిమవాసుల క్షీణింపజేసి, ఆవలసదేశమంతటిని శ్వేతజాతులకే ప్రత్యేకింపజేసికొని శ్వేతేతరులగు జాతుల నచ్చట స్వేచ్ఛగా వసింపకుండను, అచ్చటి పౌరులు గాకుండను నిర్బంధము లేర్పర్చి యున్నారు. అందుచే తరుచు వివిధజాతులమధ్య మనస్తాపము కల్గుచున్నది. ఈయెఱ్ఱ ఇండియనులకు గొప్ప ప్రాచీనసంస్కృతి కొంతవరకు భారతీయసంస్కృతిని బోలినది ఉండెను.

ఇందు ఉదహరించిన 'న్యూఇంగ్లండు, వర్జీనియా, జార్జియా, టెక్సాసు' మొదలగునవి ఆయావలసరాష్ట్రముల పేర్లు. ఈ కాలనీలు మొదట పరస్పర రాజ్యసంబంధము లేకయుండి ఇవియన్నియు కలిసి తరువాత సంయుక్త రాజ్యముగా నేర్పడెను. ఇందు ప్రతిరాష్ట్రముకు కొన్ని స్వీయవిషయము లందు రాష్ట్రీయస్వాతంత్ర్యముండును. దేశ మంతటికి సంబంధించు ముఖ్య విషయములందు మాత్రము సంయుక్తరాజ్యపు ఫెడరల్ ప్రభుత్వముకే దేశ మంతటను సామాన్యాధికార ముండును. ఈ ఫెడరల్ పద్ధతినే 1935సం॥ పు మన భారతదేశపురాజ్యాంగములో చేర్చిరి. కాని, కొన్ని విషమనిబంధనలు పెట్టిరి; సంస్థానాలు వ్యతిరేకించెను. మరియు అమెరికాలోని ప్రజల ప్రభుత్వముకు సర్వాధికార ముండును. 1935 సం॥ పు మన ఫెడరల్ ప్రభుత్వము కట్టియధికార మీయలేదు. నిజమైన ముఖ్యాధికారము బ్రిటిషు ప్రభుత్వమువారు వహించునట్లు రాజ్యాంగము తయారుచేసిరి. దక్షిణఅమెరికాలో చాల రిపబ్లికు లేర్పడి, వాటిమధ్య చాల కలహము లున్నవి.

# 55. ఫ్రెంచి విప్లవము, మరల రాజత్వము

బ్రిటిషువారి 13 (అమెరికను) కాలనీలు స్వతంత్రములైన వెంటనే యూరపులోని ఫ్రాన్సులో మహాకల్లోలముతో సాంఘికరాజకీయవిప్లవము బయలుదేరెను; లోకపు రాజ్యాంగ సంస్థ లెంత అస్థిరములో అందుచే యూరపువారికి గోచర మయ్యెను.

యూరపులో రాజసంస్థలందెల్ల ఫ్రెంచివారిదే బలీయము; ఇతరరాజ్యములకు ఆదర్శము ఆకర్షకముగనుండెను. కాని అది అన్యాయాధారమై హఠాత్తుగ నశించెను. అది ప్రబలము ఉజ్వలముగ నుండినను అందు సామాన్యజనులు చాలబాధ నొందిరి. మతగురువులకు కులీనులకు పన్నులులేకుండెను;పన్నుల భారమంతయు సామాన్యులపైనను, రయితుకార్మికులపైనను మోపబడెను. గ్రామ్యజను లందుచే క్రుంగిపోయిరి. శ్రీమంతు లగుకులీను లధికారము వహించి దీనులను తృణీకరించుచుండిరి. 1787-లో ఖజానా దివాలాస్థితిలో బడగా ప్రభుత్వపు ఆదాయ వ్యయముల సరిచేయుటకై ఫ్రెంచిరాజు ప్రజాప్రతినిధుల రప్పించెను. ఆదేశపు 'స్టేట్సు జనరల్' అను ప్రజాసభ పూర్వపు బ్రిటిషుపార్లమెంటును బోలెను. అందు ప్రభువులు మతగురువులు ప్రజాప్రతినిధులు గలసియుండిరి;అది 1789-లో వర్సైల్సు భవనమున కూడెను. దానికి 1610 సంవత్సరము తరువాత నదే సమావేశము; ఈ నిరంకుశపాలనకాలంలో లోలోన నుడుకుచున్న అసంతృప్తిని గనపఱచుట కిప్పు డవకాశము దొరికెను.

ప్రజాప్రతినిధులు ప్రజాసమితిపైనను, రాజుపైనను అధికారము చేయఁబూనిరి. వెంటనే తగవులు కలిగెను. ప్రజాప్రతినిధులే బలీయులైరి. స్టేట్సుజనరలుసభ జాతీయమహాసభగా మారెను. బ్రిటనులోవలె ఫ్రెంచిదేశమునఁగూడ రాజును లొంగదీయుటకా సభవారు తయారైరి. అంతట ఫ్రెంచిరాజగు 16-వ లూయీ వారి నణచుటకై రాష్ట్రములనుండి సేనలను కూర్చెను. వెంటనే పారిసును ఫ్రాంసుదేశమంతయు గూడ రాజుపై తిరుగబడెను. అంతట నిరంకుశ రాజత్వము కూలిపోయెను. భీకరమగు *'బాస్టైలు' ఖైదును పారిసు ప్రజలు వశముచేసికొనిరి. విప్లవము దేశమంతట వ్యాపించెను. తూర్పునను, వాయవ్యరాష్ట్రములందును, అనేక ప్రభుభవనములను ప్రజలు తగులబెట్టిరి; భూస్వాములహక్కు-పత్రముల దగులబెట్టి, యజమానులను తరిమి చంపిరి. ఒకనెలలో ఆ సంప్రదాయ ప్రభుపద్ధతి నశించెను. చాలమంది రాజన్యులు, రాణి ఆస్థానికులు అన్యదేశములకు పారిపోయిరి. పారిసులోను ఇతరనగరముల లోను తాత్కాలిక పౌరరాజ్యము లేర్పడెను. రాజత్వము నణచుటకై, 'నేషనల్ గార్డ్' అనుపేర జాతీయరక్షకసేన నాయా పౌరసంఘములు సిద్ధపర్చెను. ఆనూతనస్థితి కనుకూలమగు సాంఘిక రాజకీయ పద్ధతిని జాతీయసభవా రేర్పర్చబూనిరి.

---

* 'బాస్టైలు' ఫ్రాంసుదేశపు రాజధాని యగు పారిసునగరమందు చాల బలీయమై దుర్భేద్యమగుకోట; ఫ్రెంచిరాజులు దీనిని రాజకీయఖైదీలబంధించుటకు వాడుచుండిరి. ప్రజాపక్షులగు అనేకు లప్పటికి రాజద్రోహపు నేరముకై ఆఖైదులో నుంచబడియుండిరి. విప్లవము రాగనే వీరు విడుదలయైరి; అందు ప్రజావ్యతిరేకులు ఖైదీలుగా నుంచబడిరి.

ఈకార్య మతిదుర్ఘటము; వారు నిరంకుశత్వపు అన్యాయచర్య లన్నిటిని తొలగించిరి; కులీనులగు రాజవంశీయులకుకూడ పన్నులు విధించిరి; దాస్యపద్ధతిని ప్రత్యేకపు హక్కులను పరిహరించిరి. పారిసునగరమున ప్రజాసత్తాకమగు రాజత్వము స్థాపించుట కాసభవారు యత్నించిరి. రాజు వర్సైయిల్సుప్రాసాదమును పూర్వవైభవమును విడచి, పారిసులోని 'టులేరీసు మందిరము'న మితవ్యయముతో నుండెను. తరువాత రెండేండ్లు జాతీయసభవారు నవీనపద్ధతిని స్థిరపాలన చేయ యత్నించిరి. ఆ సభవారిచర్యలు కొంత మార్పదగియుండినను, చాలవర కుచితముగ నేయుండెను. శరీరహింస,విచారణ లేకుండనే ఖైదుచేయుట, నాస్తికుల బాధించుట మొదలగుశిక్షల దొలగించి, దండస్మృతిని సవరించిరి. నార్మండీ బర్గండీ మొదలగు పూర్వపు సామంతరాజ్యపద్ధతిని తీసివేసిరి; దేశమును 30 జిల్లాలుగా విభజించిరి; సేనలో ఉన్నతోద్యోగములు సామాన్యులకును అందుబాటు చేయబడెను. కాని ఆ న్యాయాధిపులను ప్రజలే స్వల్పకాలము కొకసారి ఎన్నుకొనుచుండిరి; అందుచే ప్రజలే న్యాయమున కంత్యాధికారులైరి. న్యాయాధిపులు తమ్ము నెన్నుకొను చిల్లరజనుల ధోరణినిబట్టి వర్తింపవలసివచ్చెను. మతసంస్థల గొప్పఆస్తులన్నిటిని ప్రభుత్వమువారు వశపరచుకొనిరి. విద్యాధర్మకార్యముల జేయువారు తప్ప తక్కిన కేవల మతసంస్థలన్నియు దీసివేయబడినవి. మతోద్యోగులజీతములు జాతీయద్రవ్యములోనుండి యీయబడుచుండెను; ఈపద్ధతి చిన్నమతోద్యోగులవిషయమున సవ్యమే; బిషప్పులవంటి పీఠాధికారులకు నెన్నిక పెట్టిరి; రోమను మతపద్ధతి కిది కేవలము

వ్యతిరిక్తము. హఠాత్తుగ ప్రొటెస్టంటుపద్ధతి పెట్టిన ట్లాయెను. అందుచే రోమనుసాంప్రదాయికులగు అప్పటికున్న మతాధిపులకు గురువులకును జాతీయసమితిచే నియమితులగువారికిని మధ్య సంఘర్షము కలహములు కలిగెను.

ఫ్రాంసులో ఈప్రజాసత్తాకరాజత్వ మారాజు చర్యవల్లనే 1791-లో హఠాత్తుగా భగ్నమాయెను. తూర్పుసరిహద్దున ప్రభువంశీయులయొక్కయు మిత్రులయొక్కయు సహాయమున రహస్యంగా విదేశసేనల రప్పించి, రాజును రాణియు తమకుటుంబముతో వారిని గలియుటకై పారిపోయిరి. కాని దారిలో వారెన్నువద్ద పట్టుపడి, పారిసుకు చేర్పబడిరి. వీరి చర్యచే ఫ్రాన్సులో రాజుపైనద్వేషము దేశభక్తి ప్రజాస్వామ్యపుజాతీయభావము నుద్రేకించి ప్రజ్వరిల్లెను. వెంటనే రిపబ్లికు అనగా ప్రజాతంత్రరాజ్యము ప్రకటింపబడి, ఫ్రెంచి రాజుకు సాయముచేయజూచిన ఆస్ట్రియా ప్రష్యాలతో యుద్ధమారంభమాయెను. పారిసులో రాజును విచారణచేసి దేశద్రోహ మొనర్చినందుకు (ఇంగ్లీషువా రిదివరలో జేసినట్లే) 1793 జనవరిలో రాజుకు ఫ్రెంచివారు శిరచ్ఛేదము చేసిరి. అంతట ఫ్రాన్సులో గొప్పకల్లోల మారంభించెను. రిపబ్లికుకై ఆవేశము గలిగెను. ప్రజలు ఇక నెట్టిరాజీయులేకుండ పూర్వపు రాజవంశమును సంహరింప నిశ్చయించిరి. ఈ క్రాంతికారు లన్యదేశముల విప్లవకారులకును సాయముచేయ సమకట్టిరి. యూరపు అంతను, ప్రపంచమంతనుగూడ ప్రజాతంత్రముగ జేయ దలపెట్టి ఫ్రెంచియువకులు హెచ్చుగ రిపబ్లికుసేనలో జేరిరి. దేశమంతట

నుద్రేకకరమగు 'మార్సి లే' అను నూతనజాతీయగీతము వ్యాపించెను. ఆపాట పాడుచు ఫ్రెంచిసైనికులు విజృంభించగా శత్రువులు వెన్నిచ్చి పారిపోవజొచ్చిరి. 14-వ లూయీ అంతకు బూర్వము స్థాపించిన ఫ్రెంచిరాజ్యపు సరిహద్దులనుగూడ 1792 అంతములోగానే దాటి ఫ్రెంచిజాతీయసేన లన్యదేశముల గూడ జయింప నారంభించి బెల్జియంరాజధాని యగు 'బ్రసెల్సు' జొచ్చిరి; సేవాయి నాక్రమించిరి; మెయిన్సుపై దాడిసల్పిరి; హాలెండునుండి షెల్టురాష్ట్రమును వశపఱచుకొనిరి. అంతట ఫ్రెంచివా రొకపొరపాటుచేసిరి; లూయీ శిరచ్ఛేదము కాగానే లండనులో ఫ్రెంచిప్రతినిధిని ఇంగ్లీషువారు పంపివేసిరి. అందుచే క్రోధావిష్టులై, వారు ఇంగ్లండుపై యుద్ధము ప్రకటించిరి. విప్లవమున ఫ్రెంచివారి కుత్సాహవంతమగు కాల్బలము గొప్ప ఫిరంగులు సమకూడెను. కాని, నౌకాబలము చాలదు. ఇంగ్లీషువారు సముద్రముపై సర్వాధికారులైరి. ఫ్రెంచివిప్లవము కప్పటివరకు బ్రిటనులో కొంచ రనుకూలురు. ఈ యుద్ధప్రకటన కాగానే ఇంగ్లీషువారు యూరపులోని యితరరాజ్యములతో నేకమై ఫ్రెంచివారిపై కత్తికట్టిరి. ఫ్రెంచివారు మొదట బెల్జియంలోనుండి ఆస్ట్రియనుల దరిమివేసి, హాలండునుగూడ ప్రజాతంత్రరాజ్యముగ జేసిరి. అందుపై డచ్చివారి నౌకాసేన వీరి వశమయ్యెను. ఇటలీవైపున ఫ్రెంచివారు మొదట జయమొంద లేదు. కాని 1796-లో 'నెపోలియను బోనపార్ట్' అను క్రొత్త ఫ్రెంచిసేనాని ఆసేనల జయప్రదముగ నడిపించి ఉత్తరఇటలీ

లోని పీడ్మంటుదాటి, మాంటువా వెరోనాల జేరెను. *'ఎన్సైక్లోపీడియా బ్రిటానికా'లో ఫ్రెంచివిప్లవయుద్ధము గురించి 'సి ఎఫ్. ఎట్కిన్సను' ఇట్లు వ్రాసెను. "ఆంగ్లమిత్రులకు ఫ్రెంచి రిపబ్లికనుల సంఖ్యయు తీవ్రవేగమును దిగ్భ్రమ గల్గించెను; తాత్కాలికముగ పోగైన యీసేనలకు పరికరములు, సొమ్ము లేవు; సామాను దాటించు బండ్లు లేవు. కాని, వారు 1793—94-లో సత్యోత్సాహులై భోజనసామగ్రి లేకున్నను జనపదములనుండి ఆహారమును దెచ్చుకొనుచు యుద్ధము చేసిరి. ఇట్లు పూర్వపు రాజకీయసేనల పటాటోపము, మాంద్యము, ఆడంబరము పోయెను; 1793-లో జాతీయసేనాపద్ధతి, వాటి తీవ్రగమనము, ఉత్సాహమును ప్రారంభమాయెను. తగుసామగ్రి లేకున్నను చిరుగుగుడ్డలతోనే. ఫ్రెంచిసైనికు లావేశపూరితులై జాతీయ గీతముల బాడుచు, స్వదేశమునకై పోరుచు, విస్పష్టాదర్శము లేకనే అన్యదేశముల జయించుచుండిరి. ఈలోగా పారిసులో రిపబ్లికనుల యుత్సాహము వక్రగతిపట్టెను; 'రాబస్పియర్'అను తీవ్రాశయుడు విప్లవనాయకు డాయెను. అతడు దుర్బలుడు, భీరుడు, గర్విష్ఠి. ఐనను తానే రిపబ్లికురక్షకుడ నని మూర్ఖత వహించి తన బలస్థాపనకై రాజాభిమానులందరిని సంహరింప బూనెను. 'లావెండీ' యను పడమటిజిల్లాలో నిర్బంధసేనాపద్ధతి మతసంస్థల ఆస్తిని లాగివేయుపద్ధతి కష్టముగ తోచెను. అచ్చటి ప్రజలు తిరుగబడి రాజవంశీయులకు మతగురువులకు సహాయకులైరి. లయన్సు, మార్సేల్సుజిల్లాలందు, టూలనులోని రాజ

* ఇంగ్లీషులో నన్నివిషయములను చర్చించి ప్రామాణికముగ తెలియజేయు విపులమగు 'విజ్ఞానసర్వస్వ' గ్రంథము.

సహాయకులకు, ఇంగ్లీషు స్పానిషు సేనలకు ప్రజలే తావొసగిరి. అందుచే రాజసహాయకుల నందరను జంపవలెనని క్రాంతికారులకు దోచెను.

విప్లవకారుల న్యాయసభ తరుచు మరణశిక్షల విధించుచుండెను. అప్పుడు నూతనముగా గనుగొనబడిన "గిలెటిన్" అను యంత్రముపై ఆశిక్షప్రకారం శిరచ్ఛేదము జరుగుచుండెను. రాణిని, రాబస్పియరువిరోధులను, నాస్తికవాదులనుగూడ ఒకరీతినే తలదీసిరి. రోజులు వారములు గడచెను. ఈ మారణయంత్రముతో తలలు ఖండింపబడి రక్తపాతము హెచ్చెను; నల్లమందు కలవడినవా రింకను నల్లమందు కోరునట్లు రక్తవిదాహ మధికమగుచుండెను.

చివరకు 1794 వేసవిలో రాజస్పియరుకే అధికారభ్రంశము, శిరచ్ఛేదము కలిగెను. తరువాత నైదేండ్లవరకు ఒక పంచాయితీసభవారు ఫ్రాంసును పాలించుచు అప్పటి పరిస్థితుల ప్రకారము యుద్ధము జరిపిరి. విప్లవోత్సాహముతో ఫ్రెంచి సేనలు హాలండు బెల్జియం స్విట్జర్లండు దక్షిణజర్మనీ ఉత్తరఇటలీ దేశముల బ్రవేశించి, అక్కడి రాజులను పదభ్రష్టులజేసి ప్రజాతంత్రరాజ్యము లేర్పఱచిరి. ఈ రాజకీయాశయము లున్నతములైనను, ఫ్రెంచిపాలకులు ఆర్థికబాధలోబడి, తన్నివారణకని ఓడినదేశములనుండి చాలద్రవ్యము హరించుచుండిరి. అందుచే అన్యదేశ సంబంధవిషయమునను, లూటీవిషయమునను, పూర్వపు సంప్రదాయము తప్పదాయెను.

ఈసమయమున ఫ్రెంచివారి జాతీయాహంభావపు మూర్తియగు ఒకమహానుభావు డపుడు బయలుదేరెను. అందుచే

ఫ్రాంసుకు ప్రపంచమునకుగూడ హాని కల్గెను. అతడు ఫ్రాంసుకు పదేండ్లఖ్యాతిని, తుదకు పరాజయమును అవమానమును కల్గించెను. అతడే ఫ్రెంచిసేనల నిటలీలో జయముతో నడపిన 'నెపోలియన్ బోనపార్ట్'; పంచాయితీవారి అయిదేండ్లపాలన లోను నెపోలియను స్వలాభపరుడై క్రమముగా అధికారమునకు వచ్చెను; దూరదృష్టి తక్కువైనను అత డఖండశక్తివంతుడు; రాబస్పియరుసిద్ధాంతపు తీవ్రవాదియై, క్రమముగా వృద్ధినొందెను. కాని యూరపులోని నవ్యభావముల నతడు గ్రహింపక, పాశ్చాత్యసామ్రాజ్యమును తిరుగ స్థాపింపబూని, "పవిత్రరోమక సామ్రాజ్య"పు శేషమునుగూడ నశింపజేసి, దానిస్థానే పారిసు కేంద్రముగా నవీనసామ్రాజ్యము స్థాపింప జూచెను. ఆస్ట్రియా చక్రవర్తికి "పవిత్రరోమకచక్రవర్తి" అనుబిరుదము పోయెను. నెపోలియను ఆస్ట్రియనురాజపుత్రిని వివాహమాడుటకై తన ఫ్రెంచిభార్యను వదలివేసెను.

1799-లో అతడు 'ఫస్ట్ కాన్సల్' అనుపేరుతో ఫ్రాన్సుకు పాలకు డయ్యెను. చార్లమనును బోలుటకై, అతడు 1804-లో చక్రవర్తి బిరుదము వహించిత న్నభిషిక్తుని జేయబోవు పోపు చేతినుండి కిరీటము లాగుకొని, తానే తలపై నిడికొనెను. తన కుమారుని రోమునకు రాజుగా నభిషిక్తుని జేసెను.

ఇట్లు కొన్నియేండ్లు నెపోలియను విజయియై పాలించెను. ఇటలీ స్పెయినుదేశముల జాలవరకు జయించెను; ప్రష్యాను ఆస్ట్రియాను ఓడించి రష్యాకు పశ్చిమమగు యూరపంతటను అధికారము వహించెను. కాని, సముద్రాధికారము సంపాదింప లేకపోయెను. 1805-లో (స్పెయినుకు పశ్చిమాగ్రమగు) ట్రఫా

ల్గరుదగ్గర ఆంగ్ల నౌకా సేనాని 'నెల్సను' ఫ్రెంచినౌకలను పూర్తిగా నోడించెను. తరువాత 1808-లో నతనిపై స్పెయిను తిరుగబడెను. అచ్చట 'వెల్లింగ్టను' సేనాని క్రింద ఒక ఇంగ్లీషుసేన క్రమముగా ఫ్రెంచిసేనలను స్పెయినునుండి ఉత్తరమునకు నెట్టివేసెను. 1811-లో నెపోలియను రష్యారాజగు 1-వ అలెగ్జాండరుతో యుద్ధమారంభించెను. 1812-లో నెపోలియనుసంకులమగు 6 లక్షలమహాసేనతో రష్యాలోనికి దండయాత్ర చేసి అచ్చటిమహా శీతమువలనను రష్యనులవలనను పరాజయము నొందెను. ఇంతలో జర్మనీ స్వీడను తిరుగబడెను. ఇట్లు ఫ్రెంచిసేన లోడి పోగా, 'ఫాంటెనీబ్లో' నద్ద 1814-లో నెపోలియను రాజ్య త్యాగముజేసి 'ఎల్బా'కు ప్రవాసితు డయ్యెను. అటనుండి ఫ్రాంసుకు తప్పించుకొని, అతడు 1815-లో మరల నధికారము వహింప యత్నించెను. కాని బ్రిటిషు బెల్జియను ప్రష్యనుల సమిష్టిమహాసేనచే నతడు 'వాటర్లూ'వద్ద నోడి, 1821-లో 'సెంట్ హెలీనా' ద్వీపములో బ్రిటిషుఖైదీగా చనిపోయెను.

ఫ్రెంచి విప్లవశక్తు లంతట క్షీణించి, అంతరించెను. జయమునొందిన మిత్రమండలివారు వియన్నాలో సమకూడి ఈమహాక్షోభమునకు పూర్వపుపరిస్థితుల పునరుద్ధరణ చేయ యత్నించిరి. అలసిపోయిన యూరపు తరువాత నలుబదేండ్లవర కొకవిధమగు శాంతితో నుండెను.*

---

* నెపోలియనునకు సామ్రాజ్యకాంక్ష యుండినసంగతి నిజమే; కాని, యూరపియను, బ్రిటిషునాయకులకు నుండెను. అతనిలో చాల సుగుణములు నుండెను. యుద్ధరంగమున నతని శౌర్యసాహసములు చాతుర్యము ఆధునిక కాలమం దసమానములు; 'మిత్రమండలి'వారి సేన లేవియు 1812 వర కా

20 ఏండ్లలోను భూమిపై నాతని నెదుర్కొని నిలువలేకపోయెను; నిరంతర యుద్ధములు జరుగుచుండినను అతడు ఫ్రాంసులో మహోపకారకమైన చక్కని సంస్కరణముల గావింప నారంభించెను. ఇప్పటి యూరపులోని చట్టములకు ముఖ్యాధారమగు 'కోడ్ నెపోలియన్' అతడేర్పఱచినదే. కొలతలు నాణెములు మొదలగువాటి కతడు దశాంశపద్ధతి నారంభించెను. ఫ్రాంసు అంతటను అతడు చక్కనిరోడ్లను, గొప్పకాలువలను, అద్భుతభవనములను, ఇతర నిర్మాణకార్యములను గూడ, ఏర్పాటుచేసెను; ఆర్థికసంస్కరణముల గావించెను. ఇంకను ప్రజోపయోగకరములగు కార్యము లనేకముల నతడుచేయదలచెను. కాని యూరపులో ఇతరరాజులందరు రాజత్వ సంస్థల రక్షణకై, ఫ్రాంసుపై విడువక యుద్ధము సాగించినందున, కొన్ని స్థిర సంస్కరణములు జరుపనవకాశముకలుగలేదు. ఇంగ్లండు ఫ్రాంసులమధ్య యుద్ధము కతనిబాధ్యత యెంతయో, నిర్ణయించుట కష్టము. నెపోలియనుకాలపు దీర్ఘయుద్ధముచే యూరపుకు నష్టము కలిగినది; కాని అప్పటి యూరపురాజులు స్వార్థపరులై నిరోధించనిచో యూరపుస్థితి తరువాత నెట్లుండెడిదో! అప్పటి యూరపు ప్రభుత్వముల స్వార్థపరత ఆ యుద్ధాంతమున వారు జరిపిన వియన్నాసభలచే తెలియును; ఆసంధి దుష్ఫలితములు పై అధ్యాయమున వివరింపబడును.



# 56. నెపోలియను అనంతరపు సంవిగ్ధశాంతి

వియన్నా సంధిలో రాజ్యముల సరిహద్దుల నసందర్భముగ నేర్పర్చిరి; ఆయారాజులు తమ అక్రమాధికారముల బలపర్చుకొనుచు ప్రజల వాక్స్వాతంత్ర్యము నరికట్ట యత్నించిరి; అందుచే ఆసంధి స్థిరశాంతి నీయలేదు; 1854 నుండి 1871 వరకు తిరుగ యుద్ధములు గలిగెను. ముఖ్యముగా స్పెయినురాజు పూర్వపరిస్థితుల నెలకొల్పుటకై అతిక్రూరమగు "ఇంక్విజిషను పద్ధతి" గూడ పునరుద్ధరించెను. నెపోలియను తనసోదరుడగు జోసెఫును 1808-లో స్పెయినురాజుగ జేసినప్పుడు సంయుక్త రాష్ట్రములవలెనే దక్షిణఅమెరికాలో స్పానిషుకాలనీలుగూడ తిరుగబడెను; వాని నాయకుడు బోలివరు. ఆ స్వాతంత్ర్య యుద్ధము సంయుక్తరాష్ట్రయుద్ధమువలె దీర్ఘముగ జరిగెను. అసమర్థమగు స్పెయిను కితరయూరపియనురాజులు సహాయము చేయవలెనని ఆస్ట్రియారాజు సూచించెను. బ్రిటిషువారందుకు వ్యతిరేకులైరి. ముఖ్యముగా సంయుక్తరాష్ట్రాధ్యక్షు డగు "మన్రో" 1823-లో 'యూరపువా రమెరికాలో నిక కల్పించుకొనకూడదు' అని తీవ్రాక్షేపణ చేసెను. ఆ రాజులయత్న మంతటితో నిలిచిపోయెను; అమెరికాలో అమెరికనులు కాని ఇతర రాజ్యములవారు రాజకీయముగ గల్పించుకొనగూడ దనుటే "మన్రోసిద్ధాంతము". దీనిచే రమారమి నూరుసంవత్సరములు ఇతర రాజ్యముల యాటంకములేక దక్షిణఅమెరికారాష్ట్రములు

స్వేచ్ఛతో వృద్ధినొందెను. ఇట్లు స్పెయినుకు అమెరికాలోని కాలనీలు పోయెను; యూరపురాజు లారాజుకు యూరపులో మాత్రము సహాయము చేసిరి. 1823-లో స్పెయినులో ప్రజలు తిరుగబడిరి; దానిని యూరపియనురాజుల ప్రోత్సాహమున ఫ్రెంచిసేన యణచివేసెను. ఇట్లే యిటలీలోని నేపిల్సుజనుల తిరుగుబాటును ఆస్ట్రియావా రణచివేసిరి.

1824-లో 18-వ లూయీ మరణించెను; 10-వ చార్లెసు ఫ్రెంచిరాజై, పత్రికావిశ్వవిద్యాలయముల స్వాతంత్ర్యము నశింపజేసి, నిరంకుశుడు కాజొచ్చెను. 1789-లో తగులబెట్టిన ప్రభుమందిరాదుల నష్టపరిహారముగా ఆ యజమానులకు నూరుకోట్లఫ్రాంకులను ప్రజాద్రవ్యమునుండి రా జిచ్చెను. 1830-లో నీరాచరికముపై ఫ్రాంసువారు తిరుగబడిరి; విప్లవములో నిహతుడైన ఆర్లియన్సుప్రభువు కుమారు డగు "లూయీ ఫిలిప్పు"ను తమరాజుగా జేసిరి. ఇందుకు బ్రిటిషువా రంగీకరించిరి. మరల ఫ్రాంసులో రాజే వచ్చె నని సమాధానము కల్గెను. జర్మనీ ఆస్ట్రియాలలో ప్రజాభావ మిందుకు సహృదయ మయ్యెను; అందుచే, యూరపురాజు లీవిప్లవము కడ్డమురా లేదు. ఈ 'లూయీ పిలిప్పు' 1830 నుండి 1848 వరకు ఫ్రాంసును ప్రజానుకూలముగ పాలించెను.

వియన్నాసంధిపైన రాజపక్షీయుల చర్యలచే పరిస్థితు లీరీతికి వచ్చెను. ఆసంధిలో దేశముల సరిహద్దుల నసందర్భముగ నేర్పఱచుటచే కాలక్రమమున నింకను ప్రజలకు హానిగలిగెను. వేర్వేరుభాషల మాట్లాడుచు, వేరు వాఙ్మయముల జదివి, వేరు భావములు గలిగి, మతభేదములుగూడ గలజనుల నొకేదేశ

ముగా భావించుట అతికష్టము. స్విసుకొండజనులవలె పరస్పర రక్షణావసరమువంటి ప్రత్యేకలాభమున్నప్పుడు వేరువేరుభాషలు మతములు గల ప్రాంతములవారొకే రాజ్యములో నుండ వచ్చును. స్విడ్జర్లండులోగూడ ఆయా ప్రాంతములవారికి చాల విషయములలో ప్రాంతీయస్వాతంత్ర్యము కలదు. మాసిడోనియాలోవలె, వివిధ జనులు వేర్వేరుగ్రామములలోను జిల్లాలలోను అతుకులుగా నున్నను, ఆయా ప్రాంతములకు వేరువేరు పరిపాలన పెట్టవచ్చు. కాని వియన్నాసంధిప్రకారము వేరువేరు భాషలు మతములు కలవారిని సందర్భశూన్యముగ భిన్నరాజ్యములలో జేర్చుచు, సరిహద్దు లేర్పఱచిరి.

అనవసరముగా డచ్చి రిపబ్లికును ధ్వంసమొనర్చి, ప్రొటెస్టంటులగు డచ్చివారిని పూర్వపుస్పానిషు (ఆస్ట్రియను) నెదర్లండులోని ఫ్రెంచిభాషికులగు కాతలికులతో కలిపి, నెదర్లండు రాజ్యముగా నేర్పఱచిరి. జర్మను మాటాడు ఆస్ట్రియనులకు ప్రాచీనవెనిసు రిపబ్లికును మిలానువరకు ఉత్తర యిటలీనిగూడ ఒప్పగించిరి. సర్డీనియాకు ఫ్రెంచి మాటాడు సేవాయిప్రదేశమును ఇటలీలోని కొన్నిభాగములను కలిపి ఒకరాజ్యముగ జేసిరి. ఇదివరకే పరస్పర సంబంధము లేని జర్మను, హంగరియను జెకోస్లవేకియను, యుగోస్లావు, రుమేనియనులకు తోడు ఇపుడిటలీవారిని, ఆస్ట్రియనులు 1772-1795-లలో సంపాదించిన పోలిషుభాగములగూడ గలిపి, ఆస్ట్రియా హంగరీరాజ్యము లేర్పఱచిరి; అది కప్పల తక్కెడయై మరింత దుర్భరమాయెను. స్వాతంత్రభావులు కాతలికులునగు పోలిషుజనులు తక్కువ నాగరికత గల్గిన గ్రీకుజాతీయుడగు రష్యాచక్రవర్తిపాలనకు విడువ

బడిరి. కొన్ని ముఖ్యమగు జిల్లాలు ప్రొటెస్టంటు ప్రష్యాకు జేరెను.విజాతీయులగు ఫిన్నుల ప్రాంతముగూడ జారు కీయబడెను. కేవల భిన్నస్వభావులగు నార్వేవారు స్వీడిషు ప్రజలు ఒకరాజు క్రింద కలుపబడిరి. జర్మనీ చాల అగమ్యగోచరస్థితిలో నుంచ బడెను; చాల చిన్నరాష్ట్రముల కూడికచే జర్మను సమ్మేళన మేర్పడెను. అందు ప్రష్యా ఆస్ట్రియాలు కొంతచేరి, కొంత చేరక ఉండెను. హాల్ట్సీనులో గొంత జర్మనుభాషికులగు ప్రజలపై నధికార మున్నందున డెన్మార్కు రాజుకూడ జర్మను సమ్మేళనమున జేరెను. లగ్జెంబర్గులో చాలమంది ఫ్రెంచిభాషి కులు; దాని పాలకుడు నెదర్లండుకును రాజు. అయినను దానిని జర్మనుసమ్మేళనమున జేర్చిరి.

జర్మనుభాషను మాటాడుచు తమభావమును జర్మను సారస్వతముపై నాధారపఱచుకొనువారును, ఇటాలియను భాష మాటాడుచు అందలిభావములు గ్రహించువారును, పోలిషువాఙ్మయమునుండి విజ్ఞానము బొందువారును ఇట్లు ఎవ రికి వారు తమభాషాపద్ధతుల ప్రకారము విడిగ స్వవిషయముల నడుపుకొనిన జాల చక్కగ నుండును; ఇతరులకు నుపయోగ మగును; బాధలు తగ్గును. ఈ ముఖ్యసూత్ర మిందు మరచిరి. జర్మనుల అప్పటి జాతీయగీతము జర్మను మాటాడు ప్రదేశ మంతయు జర్మనీదేశమే అను భావమును బోధించెను; అది సహజముగ సర్వజనాంగీకృత మయ్యెను.

నెదర్లండ్సురాజ్యములోని ఫ్రెంచి మాట్లాడు బెల్జి యనులు ఫ్రెంచివిప్లవముచే ప్రేరితులై, 1830-లో డచ్చివారి కెదురుతిరిగిరి. మిగిలిన రాజ్యములన్నియు వీరు ప్రజాతంత్ర

రాజ్యము స్థాపించెద రను భీతిచేతనో, లేక ఫ్రెంచి దేశములో జేరిపోవు నను భయముచేతనో జోక్యము గల్పించుకొని,సాక్సెకో బర్గుగోథాకు జెందిన 1-వ 'లియొపాల్డు'ను బెల్జియనులకు రాజుగా నేర్పఱచిరి. 1830-లో ఇటలీ జర్మనీలలో తిరుగుబాట్లు జరిగెను. కాని వ్యర్థమయ్యెను. రష్యాక్రింది పోలండులో తీవ్రక్రాంతి గలిగి రాజధానియగు 'వార్సా' లో 'రిపబ్లిక్' అనగా ప్రజా తంత్రరాజ్య మేర్పడి, 1825-లో అలెగ్జాండరు తరువాత రష్యా జారు అయిన 'నికొలసు' నొకయేడాది యెదిర్చెను; ఆతడు దాని నతిక్రౌర్యదౌర్జన్యములతో నణచివేసెను. పోలండులో పోలిషుభాషను బహిష్కరించి, ఆచక్రవర్తి అచటి కాతలికు మతమునకు బదులు గ్రీకుపీఠము నాస్థానమతముగా జేసెను.

1821-లో గ్రీకులు తురుష్కులపై తిరుగబడి ఆరేండ్లు మొండియుద్ధము జేసిరి. యూరపుప్రభుత్వము లందులో గల్పించుకొన లేదని కొందఱు రాజులు నిరసించిరి. అనేకులు వాలంటీరులుగా గ్రీకులకు దోడ్పడిరి. చివరకు బ్రిటిషు ఫ్రెంచి రష్యారాజ్యములు గ్రీసుకు తోడ్పడెను. ఇంగ్లీషు ఫ్రెంచినావలు టర్కీనౌకలను 'నవరినో' యొద్ద 1827-లో నశింపజేసెను. 'జారు' టర్కీలోనికి దాడివెడలెను. అంతట 1829-లో 'అడ్రియనోపిలు' సంధిప్రకారము గ్రీసు స్వాతంత్ర్యమొందెను.కాని ప్రజాతంత్ర రాజ్య మేర్పడకుండ బవేరియావాసియగు 'ఒటో'అను జర్మను రాజన్యునకు గ్రీసురాజత్వ మీయబడెను. ఇప్పటి రుమేనియా సర్వియాలకు సరిపోవు డాన్యూబుప్రాంతములకు క్రైస్తవాధి కారు లేర్పరుపబడిరి. ఈప్రదేశములను తుర్కీనుండి పూర్తిగా తొలగించుటకుగా నింకను గొంత రక్తపాతము కానుండెను.

---

# 57. భౌతికవిజ్ఞానాభివృద్ధి

17, 18-వ శతాబ్దులలోను, 19-వ శతాబ్దము మొదటను యూరపురాజ్యములలో నీసంఘర్షములు జరుగుచుండెను; 1648-లో జరిగిన 'వెస్టుఫేలియాసంధి' యేర్పాట్లుమారి,1815-లో వియన్నాసంధి యేర్పడెను. చిత్రవిచిత్రమగు మార్పులు కలిగెను. సముద్రనావలమూలమున యూరపియనులు ప్రపంచమంతటను ప్రబలులైరి. ఈలోగా యూరపియను లున్నచోట్లనెల్ల క్రమముగా జ్ఞానాభివృద్ధియు, ప్రపంచమునుగూర్చి నూతనభావములును కలుగుచుండెను.

17, 18-వ శతాబ్దముల రాజకీయజీవితములో నంతగా ప్రత్యక్షమగు మార్పు లేదు; సామాన్యజనులలోను అప్పుడు విశేషభావోద్రేకము కలుగలేదు; దీనిఫలితము 19-వ శతాబ్దపు ఉత్తరార్థమందే పూర్తిగా కనబడెను. గ్రీసులోవలె యూరపులోను స్వతంత్రవ్యక్తులే పరిశీలజేసిరి. విశ్వవిద్యాలయములు కొంతసహాయకములైనను, మొత్తముమీద నీతత్వవిజ్ఞానాభివృద్ధి శ్రీమంతులగు కొందరు స్వతంత్రవ్యక్తులవల్లనే కలిగెను. ఇట్లు ఇతరద్రవ్యముపై ఆధారపడి స్వేచ్ఛాభావముతో జరిగింపని పరిశోధనము స్వతంత్రముగా నుండక కుంటుపడి నూతనావిష్కారములన్న వెనుదీయుచుండును.

1662-లో * "రాయలుసొసైటీ" ఏర్పడెను; బేకను

---

* లండనులోని ముఖ్య వైజ్ఞానికసంఘము. జగత్ప్రసిద్ధులు నవ్యావిష్కరణదక్షులు అగు వైజ్ఞానికులే ఇందు సభ్యులు. మనదేశీయులలో జగదీశచంద్రవసు, చంద్రశేఖరరామన్‌వంటి కొలదిమంది ఇందు "ఫెల్లో"లు.

"న్యూఅట్లాంటిసు" గ్రంథములోని భావముల సిద్ధింపజేయ యత్నించెను. ఇట్లే 17, 18-వ శతాబ్దులందు పదార్థచలనముల గూర్చి యుక్తజ్ఞాన మేర్పడెను. గణితశాస్త్రముకూడ చాల వృద్ధి నొందెను. దుర్భిణితో నిర్మించిన సూక్ష్మదర్శిని దూరదర్శిని యంత్రముల సహాయమున వస్తుపరీక్ష, ప్రకృతి పరిశోధనము, జీవాంగనిర్మాణపరీక్షయు, చక్కగా వృద్ధినొందెను. మొదట అరిస్టాటిలు సూచింప లియోనార్డోడావిన్సి (1452-1519) ఆరంభించిన భూతత్వశాస్త్ర మప్పుడు పునరుత్పన్న మయ్యెను; అందుచే, శిలాధాతువులం దిమిడియున్న పూర్వయుగస్థితిలోని రహస్యములు విదితము కాజొచ్చెను.

పదార్థవిజ్ఞానాభివృద్ధిచే లోహతత్వజ్ఞానమును వృద్ధి గాంచెను. అందుచే దృఢమగు నూతన లోహాదిపదార్థములు విశేషముగ వాడుట సాధ్యమయ్యెను; వాటిచే ప్రత్యక్షోప యోగము నిచ్చు నూతనావిష్కరణములు గలిగెను. క్రొత్త రకముల పెద్దయంత్రసామగ్రి చేయబడి, అందుమూలమున వస్తువులు సమృద్ధిగా తయారు కా నారంభించెను; అందుచే పరిశ్రమలందు గొప్పమార్పు కలుగజొచ్చెను.

'ఇంజిన్' అనబడు ఆవిరియంత్రమును 'వాట్టు' కనిపెట్టెను. దానిని 1804-లో 'ట్రెవితిక' బండ్ల కుపయోగించి ఆవిరిబండ్ల నారంభించెను. 1825-లో మొట్టమొదటి రైలుమార్గము (ఇంగ్లండులోని) స్టాక్టను డార్లింగ్టనుల మధ్య నేర్పడెను. స్టైఫెన్సను 'రాకెటు' అనుపేరుతో నడిపిన 13 టన్నుల రైలు బండికి గంటకు 44 మైళ్లవేగము వచ్చెను. 1830 నుండి అయో

మార్గములువృద్ధియై, యూరపంతటను ఆ శతాబ్దపు మధ్యకే యినుపదారు లల్లుకొనెను.

భూమిపై శీఘ్రయాన మేర్పడగనే మానవుల స్థిర జీవనములోను మార్పు కలిగెను. రష్యాలో తన కాపద గలిగిన మీదట నెపోలియను 1812-లో అచటి 'విల్నా పురము'నుండి ఫ్రాంసులో పారిసు చేరుటకు 13 రోజులు పట్టెను. ఈ 1400 మైళ్లు అప్పటిసదుపాయము లన్నిటితోను సగటున గంట కైదు మైళ్ళ చొప్పున మాత్రమే వెళ్లగల్గెను. మామూలు యాత్రికు నకు దానికి రెండింతలకాలము పట్టియుండును. పూర్వము క్రీ. త. మొదటిశతాబ్దిలో రోము గాలుల మధ్య ప్రయాణ మునకు నింతేకాలము పట్టుచుండెను.

రైలుబండ్లమూలమున ఈపరిస్థితియంతయు మారెను. ఆదూరమే 2-రోజులలోగా సామాన్యులు నిప్పుడు వెళ్లెదురు. అనగా యూరపులో దూరము పదియవవంతుకు తగ్గినట్లైనది. అందుచే నంతకుపూర్వముపాలన కందుబాటైనదానికన్న పదిరెట్లెక్కువ దూరదేశములగూడ పాలించుట సుసాధ్యమైనది. దాని పూర్ణఫలిత మింకను గ్రహింపుకు రాక, యూరపువారి రాజ్యముల సరిహద్దు లింకను గుఱ్ఱపుబండ్లప్రయాణపుకాల ముకే సందర్భముగ నేర్పడియున్నవి. కాని అమెరికాలో సద్యః ఫలము కలిగెను. సంయుక్తరాజ్యపు అతిదూరములగు పశ్చిమ జిల్లాలన్నియు రాజధానియగు వాషింగ్టనుకు రైలుమార్గము ద్వారా కలిపివేయబడినవి, అంతకుముందు లేని సంఘీభావ మిందుచే నేర్పడెను.

పొగయోడ లప్పటికే ఆరంభమైనవి. 1802-లో స్కాట్లండులోని క్లైడునదికాలువలో 'చార్లొటీ డండసు' అను పొగయోడ యుండెను. 1807-లో 'ఫుల్టను' అను అమెరికావాడు బ్రిటిషుఇంజనుతో 'క్లెర్మంట్' అను పొగయోడను న్యూయార్కుకు పైగా హడ్సనునదిలో తయారుచేసెను. మొదటిసముద్రపుస్టీమరు న్యూయార్కునుండి 'ఫిలడల్ఫియా'కు వెళ్లెను; అదియు అమెరికనులదే. ఆవిరియంత్రములతో అట్లాంటికుమహాసముద్రమును దాటిన మొదటిస్టీమరగు 'సావన్నా'(1819)కూడ అమెరికనులదే. దీనికి తెరచాపలు నుండెను. ఇవియన్నియు కఱ్ఱచక్రములుగలవి; కఱ్ఱచుక్కాని చక్రములతో నడుపబడు నౌకలు విశాలసముద్రముపై పయనముజేయుటకు వీలు లేకుండెను. ఆచుక్కాని చక్రములు సులభముగ విరిగిపోవును. కొంతకాలముకు మర పొగయోడలు బయలుదేరెను. ఈమరను లాభకరముగ జేయుటకు చాలచిక్కులు దాటవలసివచ్చెను. 19-వ శతాబ్ది మధ్యకుగాని, సముద్రముపై పొగయోడల మోతశక్తి చాపయోడలశక్తిని మించకపోయెను. అటుతరువాత నౌకాయానము వేగముగ వృద్ధినొంది సుకరమయ్యెను. అంతట తాము ఫలానాదినముకు గమ్యస్థానము జేరుదు మను నమ్మిక నౌకాయాత్రికుల కేర్పడెను. యూరపు అమెరికాల మధ్యప్రయాణ మట్లాంటికుమహాసముద్రమంతయు దాటిపోవలెను; అందుకు వారములు నెలలుగూడ పట్టుచు,చేరుట నమ్మిక లేకుండెను. అది క్రమముగా సులభము శీఘ్రము నయ్యెను.

1910-లో శీఘ్రనౌక లయిదురోజులలోగానే ఫలానాగంటకు గమ్యస్థానము చేరు నని చెప్పగలస్థితి గలిగెను.

అప్పుడు 'వోల్టా' 'గాల్వనీ' 'ఫారడే' మున్నగు మహనీయులు విద్యుద్విషయములగూర్చి చాల పరిశ్రమ జేసిరి; విద్యుచ్ఛక్తి, దాని పరిణామములు కనిపెట్టబడెను. అందుచే మానవుల అన్యోన్యసంసర్గము కొక విచిత్రసాధనముగూడ కలిగెను. ఎలెక్ట్రిసిటి (=విద్యుచ్ఛక్తి) మూలముననే టెలిగ్రాఫు అనబడు తంతివార్తాపద్ధతి 1835-లో అమలుకు వచ్చెను. ఫ్రాంసుకు ఇంగ్లండుకు మొట్టమొదటి కేబిలులు అనగా జలాంతస్తంత్రులు, 1851-లో నిర్మింపబడెను. కొలదియేండ్లలోనే తంతివార్తాపద్ధతి నాగరికలోకమంతయు వ్యాపించెను. అంతకుబూర్వ మొకప్రక్కనుండి మరొకవైపుకు మందముగా బోవు వార్త లిందుచే ప్రపంచమంతటట నించుమించుగా నొకేమారు వెల్లడి కాజొచ్చెను.

ఈ ఆవిరియంత్రపు పొగబండ్లు, తంతివార్తలు 19-వ శతాబ్దమధ్యమునాటి ప్రజ కత్యద్భుతము విప్లవకరము అని తోచెను; కాని యవి మోటువగు ప్రారంభఫలితములే; ముం దింకను చాల వృద్ధినొంద నుండెను. పూర్వకాలీనములన్నిటికంటె నిప్పుడు వృత్తివిద్యల జ్ఞానము, కౌశలము అతిశీఘ్రముగ వృద్ధినొందెను. అనుదినజీవితమందు మొదట నంతగా కాన్పింపకున్నను మొత్తముమీద మానవునికి చాల ముఖ్యమగు అనేకనిర్మాణవస్తువులు క్రమముగా మనకు వశపడినవి. 18-వ శతాబ్దపు మధ్యకు పూర్వమే కట్టెబొగ్గులమూలమున మిశ్రమగు లోహపుపాడినుండి యినుము శుద్ధిచేసి చిన్నముక్కలుగా తయారుచేసి, సమ్మెట మూలమున అనేకరూపములుగా తయారుచేయుచుండిరి. పనివారలకు, శిల్పులకు ఇది

చాల ముఖ్యము. ఒకొక్కపనివాని బుద్ధిచాతుర్యములబట్టి, వస్తువులందు మంచి యేర్పడుచుండెను. 16-వ శతాబ్దమున, ఆ పద్ధతిని రెండుమూడు టన్నులకన్న నెక్కువ ఉక్కు నొకమారు తయారుచేయ వీలు లేకుండెను. (అందుచే ఫిరంగులపరిమాణము మితమై తక్కువగ నుండెను.) 'కోకు' అను దృఢమగు నేలబొగ్గు తయారుకాగనే చాల వేడి పుట్టింపగల యంత్రపుకొలుము లేర్పడెను. 18-వ శతాబ్దిని 1728 వరకు ఇనుపరేకులును, 1783 వరకు కడ్డీలు ఊచలుకూడ తయారుకాలేదు. 'నేస్మిత్తు' ఆవిరి సమ్మెట 1838-లో నుపయోగమునకు వచ్చెను.

ప్రాచీనకాలమున లోహవిజ్ఞానము లోహపరిశ్రమ హీన స్థితియం దుండుటచే ఆవిరిని విరివిగ నుపయోగింప వీలు కలుగ లేదు. ఇనుపరేకులు తయారగుటకుపూర్వ మావిరియంత్రము లేదు; సరిగదా నీరుతోడు పురాతనపు మోటయంత్రములు గూడ అభివృద్ధికాలేదు. ఆధునికదృష్టి కా ప్రాచీనయంత్రములు చాలమోటువై వికృతమగు ఇనుపముద్దలుగ గన్పడును. కాని ఆకాలపు లోహవిజ్ఞానమునుబట్టి అప్పటి కవియే గొప్పవి. 1856-లో 'బెస్సెమేర్' పద్ధతి అమలులోనికి వచ్చెను. 1864-లో ప్రతిరకపుటినుము ఉక్కు కరగించి శుభ్రపఱచి, కొత్తరీతివగు విశేషపరిమాణముల ఉక్కు పోతపోయుటకు వీలగు బాహాటపుకొలిమిపద్ధతి ఏర్పడెను. ఈనాడు గిన్నెలో పాలు కళపెళ కాగురీతిని విద్యుచ్ఛక్తిచే వేడినెక్కించు కొలుములలో టన్నుల కొలది ఉక్కు కరగించి పొంగింపవచ్చును. ఇనుమును ఉక్కు ముద్దలను వశముచేసుకొని ఇచ్ఛవచ్చు ఆకారముతో కావలసినంత గట్టిగా చేయవచ్చును; అట్టిశక్తి అంతకుపూర్వ మెన్నడును

లేదు. ఇనుపదారులు మొదటి యింజినులు లోహపరిశ్రమాభి వృద్ధికి ప్రారంభదశలే. కొద్దికాలముకే యినుప ఉక్కు స్టీమర్లు, బ్రహ్మాండమైన వంతెనలు, వివిధమగు పెద్ద ఉక్కుయంత్రములును తయారయ్యెను. మొదట బెదురుచు రైళ్లను సన్నగానే కట్టిరి. అది పొరబాటని విశాలముగ సౌఖ్యకరముగ గట్టవచ్చునని తరువాత మనుష్యులు గ్రహించిరి.

19-వ శతాబ్దికి బూర్వము ప్రపంచమున 2000 టన్నుల కన్న హెచ్చు మోయు నావలులేవు; ఇప్పు డేబదివేల టన్నుల మహానావలుగూడ వింతగలేవు. ఈయభివృద్ధిపరిమాణమున మాత్రమే అని పొరబడుదురు; ఇప్పటి మహానావలును, ఉక్కు ప్రాసాదములును పెద్దవగుటయే కాదు; వాటి పద్ధతియే వేరు. ఇవి ఎక్కువ సూక్ష్మమై, దృఢతరమైన వస్తువులతో తేలికగాను గట్టిగాను నిర్మింపబడును; వీటి నెక్కువయుక్తితో క్లిష్టముగ తయారుచేయుదురు. పూర్వపు ఇండ్లు ఓడను అప్పటి సామగ్రిని బట్టి నిర్మింపబడెను. ఇప్పుడు వస్తురచన నరులకు స్వాధీనమైనది; ఆ వస్తుపరికరములు మనయిష్టావసరముల ప్రకారము మార్చుకొని, వాడుచున్నాము. దిబ్బలనుండి గనులగోతులనుండి బొగ్గు ఇనుపమట్టి యిసుక తీసి, బాగుచేసి, కరగించి, పోతపోసి మహాభవనములపై 6 వందల అడుగులయెత్తున తళతళలాడు ఉక్కుటద్దపువస్తువులుగా నమర్చుట అద్భుతము కాదా ?

లోహవస్తుజ్ఞానసందర్భమున ఉక్కు నుదహరించితిమి. రాగి, తగరము, అల్యూమినం నిక్కెలు మొదలగు క్రొత్త లోహముల కథయు నింతే. రకరకముల అద్దములు శిలలు సున్నము మొదలైన అన్ని భౌతికద్రవ్యములు రంగులు నేత

వస్తువులు ఇప్పటికి నరునికి వశమైనవి. కాని యివి ప్రారంభ ఫలములే. మనకు శక్తియున్నను దాని నెట్లు వాడవలెనో, ఇంకను తెలియుట లేదు. వెనుకటి వైజ్ఞానికశక్తితో జేసిన వస్తువులు చాల అవకతవకగా మోటుగా తయారైనవి; ఇప్పటి అనంతపరికరములతో వాటి నందముగాను అనుకూలముగాను చేయుట కారంభమగుచున్నది.

ఇట్లే భౌతికయంత్రాభివృద్ధితోబాటు, విద్యుచ్ఛక్తి విజ్ఞానముకూడ వృద్ధియైనది. ఈ పరిశోధనఫలితములు గతశతాబ్ది యెనభైలలో జనసామాన్యమునకు తెలియ మొదలిడెను. అంతట హఠాత్తుగా విద్యుద్దీపములు, విద్యుచ్ఛకటములు నారంభించి భౌతికబలము కాంత్యుష్ణములుగాను, ఆకర్షణశక్తి భౌతికబలముగాను, గొట్టములో నీరువలె, రాగితీగమీద బహిరంగముగ నడుపబడుచున్నవి.

ఈ విజ్ఞానాభివృద్ధికి మొదట బ్రిటిషు ఫ్రెంచివారలు అగ్రేసరులైరి. కాని, నెపోలియనుచర్యలచే విధేయత నేర్చుకొనిన జర్మనులు వైజ్ఞానికపరిశోధనలో చాల అభినివేశయుతులై, అందరిని మించిపోయిరి. బ్రిటిషు విజ్ఞానావిష్కరణములు కళాశాలలకు సంబంధించని స్వతంత్ర స్కాచి బ్రిటిషుల కృషిచే గల్గినవి.

ఆ కాలమున బ్రిటిషు విశ్వవిద్యాలయములు విజ్ఞానవిషయమున వెనుకబడుచు, లాటిను గ్రీకు మహాకావ్యముల వల్లెవేయు పండితుల అహంభావపద్ధతి నవలంబించెను. ఫ్రెంచి విద్యలోగూడ జెసూయిటు శాఖీయులపద్ధతిని ప్రాచీనమహాకావ్యముల పఠనమే ముఖ్యముగా నుండెను. పరిశోధకవశము

నేర్పఱచుటను (బ్రిటిషు ఫ్రెంచివారికన్న) జర్మనులే ముందారంభించిరి. పరిశోధనల కవకాశముల దృష్టిని జూచిన, ఈదశము చాల చిన్నదే. ఈ పరిశోధనలమూలమున బ్రిటను ఫ్రాన్సు దేశములు లోకమం దెల్ల హెచ్చుధనికములు బలీయములు నైనవి; కాని ఆ శాస్త్రీయపరిశోధకులకు నూతన వస్తుసృష్టి జేయువారికి బలము ధనము చేకూర లేదు. సత్యాన్వేషణపరుడగు వైజ్ఞానికునకు ద్రవ్యలాభాపేక్ష లంతగా నుండవు. పరిశోధన నిమగ్నుడైనవాడు విజ్ఞానోత్సుకుడేగాని దానిమూలమున ధనము సంపాదింపబూనడు; వారిపరిశోధనలవలని ఆర్థిక లాభ మొందు ధనార్జనపరులు మరియొకరకపువారు. బ్రిటనులో జరిగిన పరిశోధనవల్లను నూతనయంత్రములవలనను కోటీశ్వరులైన పుంజీపతులందరు వాటి కసలు కారకులైన ఆ పరిశోధకులు తిండిలేక కృశించుచున్నను జూచి యూరకుండిరి. కాని ప్రాచీనపుపండితగురువులవలె జాతీయస్వర్ణాండముల నిడిన ఆ బాతుల నవమానపరచి చంపివేయుటమాత్రము లేకుండెను. నేర్పరులగు గడుసరులు లాభ మొందుటకే వైజ్ఞానికులను పరిశోధకులను ప్రకృతి యేర్పర్చెనని వారు తలచిరి.

ఈవిషయమున జర్మనులు కొంత కృషిచేసిరి; ఈ నూతన విద్యనభిమానించి దానిని వృద్ధిజేసిరి. బ్రిటిషులవలె వైజ్ఞానికుల దృణీకరింపక, జర్మను వర్తకులు పారిశ్రామికులు జ్ఞానముకు దోహదమిచ్చి, వైజ్ఞానికులకు ప్రోత్సాహ మిచ్చి, విజ్ఞానపరిశోధనలకై ఇతరులకన్న నెక్కువవ్యయముచేయుచు దానివలన విశేషఫలముల నొందిరి. అందుచే 19-వ శతాబ్దపు ఉత్తరార్థమునకు ఆయావిజ్ఞానశాఖలలో జరుగు నవీనపరిశోధనలు జర్మ

నులో నేర్పడెను. వాటి నెఱుగవలెనన్న ప్రతివైజ్ఞానికుడును జర్మనుభాష నేర్చుకొను అవసరము కలిగెను. కొన్ని విజ్ఞాన శాఖలలో (విశేషించి రసాయనశాస్త్రములో) తమ పాశ్చాత్య సోదరు లందరికన్న జర్మనులు హెచ్చుజ్ఞానము నార్జించిరి. ఇట్లు గతశతాబ్ది ఆరు, ఏడవదశకములలో జరిగి, ఆవైజ్ఞానికకృషి ఫలితములు జర్మనువారికి 8-వ దశకము తరువాత అనుభవమునకు వచ్చెను; అందుచే జర్మనులు పరిశ్రమలలోను, వృత్తి విద్య లందును, యంత్రనిర్మాణప్రజ్ఞలోను బ్రిటిషు ఫ్రెంచివారలను మించిపోయిరి.

ఇంతేకాక 8-వ దశమున ఆవిరిశక్తికి బదులుగా సులభముగ కాలు పెట్రోలువంటి పదార్థములనుండి వచ్చు ఒక వ్యాపకశక్తితో నడుపు 'మోటార్ ఇంజను' అను కొత్త యంత్రము లేర్పడెను. అంతట నూతనయుగము వచ్చెను. అందుచే తేలికయ్యె విశేషలాభకరమైన నూతనయంత్రములను మోటారుబండ్ల కుపయోగించిరి. చిరకాలము క్రిందనే సాధ్య మనుకొన్న ఆకాశయానము నిమిత్తము ఈలఘుతీవ్రయంత్రముల సహాయమున విమానముల నిర్మించిరి. వాషింగ్టనులోని స్మిత్సోనియనుసంస్థకు జెందిన లాంగ్లేగారు 1897-లో నొక యంత్రము (బెలూను) గనిపెట్టెను; అది మానవుని మోయు లేకున్న గాలిలో నెగురును. 1909 నాటికి వాయువిమానము లేర్పడి మానవుల ప్రయాణముల కనువయ్యెను. రైలుమార్గములు, మోటారురోడ్డులు ఏర్పడినమీదట మానవుని శీఘ్రగమనశక్తి కవధి కలిగిన ట్లుండెను. కాని, గాలివిమానములు రాగనే ప్రపంచము నొకమూలనుండి యింకొకమూల కింకను

అతిశీఘ్రముగ దాట వీలాయెను. 18-వ శతాబ్దమున లండను నుండి ఎడింబరో వెళ్లుట కెనిమిదిదినములు పట్టెను. బ్రిటిషు వాయువిమానసంఘమువారు లండనునుండి (ఆస్ట్రేలియాలోని) మెల్బోర్నుకు (ప్రపంచమున కర్ధభాగపు దూరమును) కొన్ని సంవత్సరములకు ఆ ఎనిమిది దినములలోనే ప్రయాణ మొనర్ప వచ్చు నని 1918-లో తెలియబఱచిరి.*

ఒకచోటనుండి మఱియొకచోటుకు ప్రయాణకాలము తగ్గించుట ఒకటే ఇందుల విశేష మని తలపరాదు. మానుష శక్తియొక్క యుత్కృష్ట మహావకాశముల కిది సూచకము. ఇట్లే 19-వ శతాబ్దమున వ్యవసాయశాస్త్రము, కృషిరసా యనపు విజ్ఞానము, ఇట్లొకదానితో బాటొకటి వృద్ధిజెంది నది. రసాయనశాస్త్రీయమగు యెరువులు తయారైనవి; వాటి వాడుకచే 17-వ శతాబ్దపు పంటలకు 4 రెట్లు 5 రెట్లు పంట నిపుడు పండింపగల్గుచున్నారు. వైద్యవిజ్ఞానమున నింకను విశే షాభివృద్ధి కలిగెను. మానవుని జీవితపరిమాణ మభివృద్ధిజెంది, దైనిక కార్యములందు నరులశక్తి యధికమై, రోగబాధయు అందుచే జీవనాశమును తగ్గిపోయెను.

మొత్తముమీఁద మానవజీవితమందు గలిగిన యీ మార్పులచే లోకమం దొక నూతనశక మేర్పడినది. రమారమి ఒక శతాబ్దములోనే యంత్రసాధనములం దింతటిమార్పు కల్గి నది. మానవుని భౌతికావశ్యకముల విషయమున ప్రాచీనశిలా

---

* ఇటీవల జరిగిన పోటీలో ఆ దూరమునంతను మూడురోజులలోగనే విమానములపైన పోగలిగిరి. ఇప్పుడు సరాసరి విమానయానంతో మూడురోజు లలో ప్రపంచమంతను చుట్టివచ్చుచున్నారు.

యుగమునాటినుండి వ్యవసాయదినములవరకు గల మధ్యకాలముకన్నను (ఈజిప్టులోని పెపీకాలమునుండి (18-వ శతాబ్దపు ఆంగ్లరాజగు)మూఁడవజార్జి కాలమువరకు గల సహస్రాబ్దులపరిమితిలో కన్న) ఈస్వల్పకాలమున నరున కధికాభివృద్ధి కలిగెను. మనుష్యుల కావశ్యకవస్తువులలో చాల పరిణామము కలిగి, బ్రహ్మాండ మగు భౌతికనిర్మాణ మేర్పడెను. అందునుబట్టి మన ఆర్థిక సాంఘికరాజకీయ పద్ధతు లన్నియు చాల మార్పుచెందెను. యంత్రనిర్మాణపరివర్తన మిట్లు వృద్ధిచెందువరకు అట్టిమార్పులు గలుగలేదు; ఇందులో వేగంగా వృద్ధి ఇంకను కల్గుచున్నది.



# 51. పారిశ్రామిక పరివర్తనము.

ఆదిమనరులకాలమందు వ్యవసాయము లోహోత్పత్తివలె, ఇప్పుడు విజ్ఞానాభివృద్ధిచే నేర్పడిన క్రొత్తయంత్రసాధనములు మానవులకు నూతనానుభవము నిచ్చెను. ఇదియు, పారిశ్రామిక పరిణామమును, అనగా పూర్వమునుండి క్రమముగా కలుగుచున్న ఆర్థికసాంఘిక స్థితుల మార్పును, ఒకటే అని చారిత్రకు లనేకులు పొరబడుదురు. ఏకకాలమందే పరస్పర సహాయముతో నీరెండును వృద్ధియగుచున్నను, నిజముగ నివి విభిన్నములు. నేలబొగ్గు ఆవిరి నూతన యంత్రములు గూడ లేకపోయినను, ఒకరీతి పారిశ్రామిక పరివర్తనము కలిగియే యుండును. ఆస్థితిలో,రోమక రిపబ్లికు కాలమందువలె, స్వతంత్ర కర్షకుల భూములుపోవుట, జట్టు కూలీలచే పనులుచేయించుట; పెద్దకమతములు, పెట్టుబడి దారులగు పుంజీపతులేర్పడుట, ఆర్థికహాని యీకాలమున గూడ కలిగియుండును. ఆవిరియంత్రములు రాకముందే ఫాక్టరీపద్ధతి ప్రారంభించెను. అది యంత్రములవలనగాక పనుల విభజనచే గలిగెను. పారిశ్రామిక కార్యములకై జలచక్రములుగూడ రాకముందే, టోపీలు అట్టల పెట్టెలు కర్రసామానులు రంగుపటములు గ్రంథచిత్రములు మొదలగు వానిని సమర్థులగు ప్రత్యేకపుకూలీలు చేయుచుండిరి. అగస్టసుకాలమున రోములోకూడ ఫాక్టరీలుండెను. పుస్తకపు దుకాణములలో వరుసగా లేఖకులనుంచి వారిచే నకళ్ళు వ్రాయించుచుండిరి. 17 వ శతాబ్దములో బీదజనులచే గుంపు

లుగా కూలిపనుల జేయించుచుండినటుల డెఫో గ్రంథముల వల నను ఫీల్డింగు రాజకీయ కరపత్రముల మూలమునను దెలియును; దీనిచూచనలు 1516 లోనే మూరుయొక్క 'ఉటోపియా' లో గూడ గన్పడును. కాని, ఈపరిణామము సాంఘికమే కాని యాంత్రికము గాదు.

18-వ శతాబ్దపు మధ్యకాలమువరకు, పశ్చిమయూరపు సాంఘికార్థికస్థితి క్రీస్తుకుపూర్వపు మూడుశతాబ్దముల లో రోమకరాజ్యమందుండినరీతినే యుండెను. కాని యూరపులోని రాజకీయవిభేదములు, రాజత్వపద్ధతిపై తిరుగుబాటు, ప్రజా సామాన్యపు ఉత్సాహము పట్టుదల, కొంతవరకు పశ్చిమయూరపి యనులు యంత్రముల నేర్పర్చుటగూడ, ఆపరిణామములను నూతనమార్గముల బట్టించెను. క్రైస్తవమతముచే యూరపియను లలో సంఘీభావబుద్ధి విశేషముగ వ్యాపించినను, రాజకీయశక్తి జనులలో కేంద్రీకృతము కాలేదు. అందుచే ద్రవ్యబలాభి లాషులు కూలీలచేతను బానిసలచేతను పనిచేయించుట మాని, యంత్రశక్తితో ద్రవ్యమార్జింప దలపెట్టిరి; అప్పటి ఆర్థిక సాంఘిక రాజకీయపారిశ్రామిక ఫలితములతో నిమిత్తములే కుండనే నరులు నూతనయంత్రముల గనిపెట్టిరి; ఆయంత్రపరి వర్తనముచే నరుల స్థితిగతులందు సతతము గలుగుచుండిన భేద ముల ననుసరించి పారిశ్రామిక పరివర్తనము ఇతరచర్యలవలె మారుచుండెను. రోమకరాజ్యకాలమున, శ్రీమంతు లింకను ఐశ్వర్యవంతులైరి; చిన్న వ్యవసాయదారులును, వ్యాపారస్థు లును క్షీణించి, కూలీలు హెచ్చిరి; అట్లే 18, 19 శతాబ్దము లందును ద్రవ్యము పుంజీపతుల అనగా శ్రీమంతుల హస్తగత

మయ్యెను. ఈరెంటికి గల భేదము కార్మికపద్ధతిలో మాత్రమే గలదు. ప్రాచీనకాలపు కార్మిక శక్తికి అజ్ఞానులు పరాధీనులు నగు జనుల చేతిపనియే ఆధారము; దీనికి బండ్లయెడ్లు గుఱ్ఱములుమాత్రము తోడగుచుండెను. బరువువస్తువులను మనుజుడే యెత్తవలెను; కోరీల పాషాణములను నరులే శ్రమతో జితుగగొట్టుచుండిరి. పూర్వులు చాలవరకు శరీరశ్రమతోనే కార్యముల జేయుచుండిరి, ఆవిరి విద్యుచ్ఛక్తియంత్రముల గల్పించి వాటిమూలమున నరుల స్వకాయకష్టము తగ్గింపవచ్చు నని ఆకాలమున తోచలేదు. కాలువల త్రవ్వుటకును గొప్ప రాస్తాల వేయుటకును, ఆనకట్టల గట్టుటకును, జనులు పెద్దపెద్ద జట్లుగా పనిచేయుచుండిరి; గనుల పనివాండ్రసంఖ్య చాల హెచ్చయ్యెను. కాని 19-వ శతాబ్దమున పరికర సౌకర్యము వస్తుసామగ్రి యధికమైనకొలది, పరిస్థితులు మారెను. కేవల క్లేశకార్యములకు నరుల యవసరముపోయి, అట్టిపనులను మనుష్యులకన్న యంత్రములచే నెక్కువ చక్కగను సులభముగను జేయింపజొచ్చిరి. అందుచే యుక్తికార్యములకే అనఁగా మానవ కార్యములకే నరులు కావలసివచ్చిరి. ప్రాచీననాగరికకాల మందు జనులు కావలసివచ్చిరి. ప్రాచీననాగరికకాలమందు జనులు మంద బుద్ధులు విధేయులునై శ్రమజీవనము చేయుచుండిరి. జనుల యోగక్షేమముల కిప్పు డట్టి శ్రమ యవసరము కాకపోయెను.

నూతన లోహపరిశ్రమలకే గాక, వ్యవసాయము గనుల పనివంటి పూర్వపు పరిశ్రమలకుగూడ, ఈసూత్రము వర్తించులు. దున్నుటకు, విత్తుటకు, కోతకోయుటకును, కూలిలజట్లకు బదులు వేగముగల యంత్రములు సిద్ధమయ్యెను. రోమక నాగర

కత చౌకకూలీలపైనను బానిసలపైనను ఏర్పడెను. ఆధునికనాగరి కత చౌకయగు యంత్రశక్తిపై ద్వారా నిర్మింపబడెను. ఈనూ రేండ్లలోను భౌతికశక్తి వృద్ధియగుచుండ, నరుల కూలి ప్రియ మగుచున్నది. కొంతకాలము జనుల కూలియే చౌకగా నుండు టచే, గనులలో మాత్రము యంత్రములు పనిచేయుట కొక తర మాలస్యమాయెను.

ఈరీతిని మానవచర్యలందు ముఖ్యమగు మార్పు కలి గెను. దేహకృషిచే పనిచేయు శ్రమజీవులసంఖ్య వృద్ధి పరచు టకు ప్రాచీనకాలపు శ్రీమంతులు ప్రభువులు యత్నించిరి. సామాన్యజనులును కేవల శరీరశ్రమకన్న గొప్పకార్యములనే చేయదగునని 19-వ శతాబ్దము గడచినకొలదిని బుద్ధిమంతులకు వ్యక్తమైనది. పారిశ్రామికాభివృద్ధికొరకై సామాన్యజనుల విద్యావంతులుగ జేయుట యవసరమైనది. ఆసియాలో ముస ల్మానుమతవ్యాప్తి గల స్థలములందువలె, యూరపులో క్రైస్తవ మతము వ్యాపించు చోట్ల ప్రజలలో విద్య లోలోన క్రమ ముగా వ్యాపించెను. మతజ్ఞానముకై పవిత్రగ్రంథముల జదువు టయు, అందుకై విద్య వ్యాపించుటయు నవసరము క్రైస్తవ మతపు ఆయా శాఖలవారు, తమపక్షపువారి సంఖ్య వృద్ధి చేయించుటకై, జనులలో విద్య వ్యాపింపజేసిరి. 19-వ శతా బ్దపు 3, 4 దశకములలో నానామతసిద్ధాంతములవారు యువకు లలో తమమతస్థు లధికులగుటకై, వేరువేరు విద్యాలయములను మతజాతీయపాఠశాలలను, (కాతలికులు ప్రాథమికవిద్యాలయ ములుకూడ) ఏర్పరచిరి. ఆశతాబ్దపు ఉత్తరార్ధమున పాశ్చాత్య లోకమందు జనసామాన్య మందతివేగముగ విద్య వ్యాపిం

చెను; కులీనులగు శ్రీమంతులలో నంతవేగముగ వ్యాపింపలేదు; అందుచే, పైజాతికిని క్రిందిజాతికిని విద్యాజ్ఞానవిషయములం దిదివరలో నుండిన విశేషాంతరము పోయెను; అందరును చదువ గల్గిరి. సంఘస్థితికి సంబంధించన ట్లున్నను, యాంత్రికపరివర్తన మీరీతిని జనులందరిలోను విద్యావ్యాప్తికి కారణమైనది.

రోమకరాజ్యపు ఆర్థికపరివర్తనము మనకు వ్యక్తమైనట్లు, అప్పటి సామాన్యజనుల కది సరిగా వ్యక్తము కాలేదు. కాని, 19-వ శతాబ్దములో జరిగిన పారిశ్రామిక పరివర్తనముచే సామాన్యజనులస్థితియు మారెను. వారు విద్యావంతులై, సంగతుల స్వయముగ చర్చింపగలిగిరి; సులభముగ ప్రయాణములు చేయుచు, పరిస్థితుల స్వయముగ జూడగలిగిరి. అందుచే, ఈపరివర్తనఫలితము సామాన్యులకును దెలియుచున్నది.*

---

* 19-వ శతాబ్దపు ఆర్థికపరివర్తనమువల్ల విశేషఫలితములు కల్గినవి. మహాయంత్రములమూలమున నరులకు బరువుపని తగ్గినది; కాని కార్మికులీమహాయంత్రముల కధీనులై, అందు తాము పనిముట్లవలె నగుచున్నారు. అం దుద్యోగులే బుద్ధిని స్వతంత్రజ్ఞానమును నిర్మాణశక్తిని ఉపయోగింతురు. చిల్లరకార్మికులు 'మిల్ హాండ్స్, ఫ్యాక్టరీ హాండ్స్'; అనగా వారి హస్తమే ప్రధానము గాని మనస్సు హృదయము కావు. వారిచర్య లొకేరీతి నుండును; అందు కళాచాతుర్య ముండదు; పనిలో స్వతంత్రత లేదు. కర్మాగారపద్ధతివలన పనివాండ్ర మనశ్శరీరముల ఆరోగ్యము, నైతికస్థితియు చెడును; భారతదేశమువంటి ఉష్ణదేశములం దాహాని యెక్కువ. మరియు, కార్మికులు ఆయంత్రయజమానులగు పుంజీపతులకు కేవలము పరాధీను లగుదురు. ఇది యంతయు పనిగలవారిస్థితి. ఈ యంత్ర కర్మాగారములు విస్తరించుటచే చాలమందికి వృత్తిచ్ఛేద మగును. వేల

కొలది జనులు చేయదగుపనిని తరుచొకే మహాయంత్రము చేసివేయును; ఆయంత్రముకు కొద్దిమంది మాత్రము కార్మికులు కావలసియుందురు. అందుచే, యంత్రాలయపద్ధతిచే చాలమంది ఇదివరకొని పనివాండ్రు నిరుద్యోగులు కాకతప్పదు. ఇదివరలో కొన్ని పాశ్చాత్యదేశములలో యంత్రాలయములు హెచ్చుగా వ్యాపించినను, అందు తమదేశమునకే గాక దాదాపు యితరదేశీయులందరకు సరుకుల సప్లయిచేయుటచే, తమదేశము కవసరమగువానికన్న చాల హెచ్చుయంత్రముల నచ్చట పనిచేయుచుండిరి; కనుక ఆదేశీయుల కందరికి పను లుండినవి. ఇతరదేశముల ధనమంతయు ఆ పారిశ్రామికదేశములకు బోవుచు, ఆ పెట్టుబడిదార్లను శ్రీమంతులుగ జేసినది. ఆస్థితిలో వారు తమ కార్మికుల కింతవరకు చాల హెచ్చుజీతముల నీయగల్గిరి. అయితే అందుచే ఆవస్తువులగొను ఈజిప్టు భారతదేశము చీనా మొదలగు ప్రాచీనసంపన్నదేశము లిప్పుడు ఆర్థికముగ పరాధీనములై, దరిద్రములైనవి; ఈ జనులలో చాలమంది వృత్తిహీనులైరి. అనగా భారతదేశాదుల క్షీణింపజేసియే, పాశ్చాత్యదేశముల యంత్రపరిశ్రమలు, ఐశ్వర్యము వృద్ధి కాగలిగెను ఎల్లకాల మిట్లే యుండుట సహజముకాదు. అందుచే జపానీయులు, భారతీయులు, చీనులు, పారసీకులు, మొదలగు ప్రాచ్యదేశములవారు పాశ్చాత్యులధాటికి నిల్చుటకై, తాము మిల్లులను ఫ్యాక్టరీలను నెలకొల్పదొడగిరి. ఈ వ్యాపార మీదేశములందు వృద్ధికాగనే, పాశ్చాత్యపరిశ్రమలదండయాత్ర తగ్గెను. ఆదేశములందలి కొన్ని పెచ్చుయంత్రములు నిల్చిపోయి, కొందరు కార్మికులు నిరుద్యోగులైరి. ప్రాచ్యదేశములందు పరిశ్రమలు వృద్ధియైనకొలదిని కేవల యంత్రపరిశ్రమలపై ఆధారపడు పశ్చిమదేశముల ప్రాబల్యము కొంత తగ్గి, వాటికి నష్టము కలిగితీరును; వస్త్రాదులకే గాక విత్తుట కోతలు మొదలగు వ్యవసాయకార్యములకును, ఆయోమయములగు మహాయంత్రముల వాడుక మొదలిడిరి. అందుచే చాలమంది

కర్షకులు పనిలేక మూలపడుచుండ, కొద్దిమంది గొప్ప పెట్టుబడిదార్లు మాత్ర మింకను శ్రీమంతులైరి; కేవల ద్రవ్యసంచయమే వారి యాదర్శ మగుచున్నది. యాంత్రికపరివర్తనము పారిశ్రామికపరివర్తనమును భిన్నము లనుమాట నిజమే. కాని మహాయంత్రములమూలమున పారిశ్రామిక క్రాంతి చాలరెట్లు ఎక్కువ తీవ్రమైపోయినది. పరిశ్రమల నాయకులకు కార్మికులకు మధ్య విభేదము విపరీతముగ హెచ్చిపోయినది. మన దేశము లందుగూడ మిల్లుబట్టలవలన కొద్దిమంది శ్రీమంతు లగుచున్నను, వారికన్న చాలరెట్లు యెక్కువమంది గ్రామజనులు పడకుట నేత మున్నగు తమ వృత్తులు పోవుటచే నిరుద్యోగులై, నిరాహారు లగుచున్నారు. ఇట్లే ఇటీవల ధాన్యపు మరలు పంచదారఫాక్టరీలు మున్నగునవి వ్యాపించినకొలది ధాన్యపు దంపుడు బెల్లపువ్యాపారము ఇత్యాదులు క్షీణించి, వానిచే జీవించు లక్షలకొలది జనుల స్వతంత్రవృత్తులు పోయినవి. కోతలు వగైరా వ్యవసాయపుపనులకును అమెరికాలోవలె మహాయంత్రముల వాడుచో, ఇంకను చాల పరిణామము జరుగును. ఇప్పటికే గ్రామజనులస్థితి దుర్భరముగా నున్నది. మనదేశములకన్న జనసంఖ్య తక్కువగా ఉన్న ఆస్ట్రేలియా దక్షిణాఫ్రికా కనడావంటిచోట్ల అట్టిపద్ధతులు ప్రస్తుతము ఆర్థికముగ లాభకారులే. కాని మనదేశమున మాత్రము గ్రామములందలి నిత్యావసరముల కుండు గృహపరిశ్రమల నశింపజేసి, వానిస్థానమున బస్తీలలో మహాకర్మాగారముల వృద్ధిచేయుటచే జనసామాన్యమునకు మొత్తముమీద లాభముకన్న నష్టమే చాల అధికము. భారతదేశమందును చీనాలోను నిత్యావసరములకును పూర్తిగా పాశ్చాత్యపద్ధతిని మహాయంత్రముల పద్ధతులు అమలుకు వచ్చినచో, ఈ కోట్లకొలది జనులలో చాలమంది కిప్పుడున్న వృత్తులు పోయి, ఏకొద్దిమందియో భాగ్యవంతు లగుదురు. మరియు అంతమంది కార్మికులకు పనియిచ్చునన్ని ఫాక్టరీల స్థాపించు కెడల వాని అన్నిటిలోను తయారగు వస్తువులను ఇతరదేశములందును చౌకధరకు పోటీగా అమ్మవలసియుండును. అప్పుడు పాశ్చాత్యుల పరిశ్రమలతో

విపరీతమగు పోటీ జరిగి వారిలో కల్లోలము కలుగక మానదు. పరిమితిలోను జనసంఖ్యలోనుగూడ మనకన్న చిన్నదగు జపానుదేశము ఈ యాంత్రిక నాగరికత నాదర్శముగ జేసికొని పాశ్చాత్యులవలెనే తమ జనులకు పూర్తిగ వృత్తుల గల్పించుకొనుటకై పెద్దపెద్ద కర్మాగారముల నిర్మించి, తమ ప్రభుత్వ సహాయమున చవుకగా వస్తువుల దయారుచేసి, అమ్మకమునకై మన బజారులను కొంతవరకు ఇతరదేశములనుకూడ ఆ వస్తువులతో నింపివేయుచున్నది. అందువలన ఇచటనే గాక పాశ్చాత్యులలో గూడ కోలాహలము కలుగుట తెలిసినేయున్నది. మరియు మనదేశజనులలో చాలమందికి ముఖ్యవృత్తియగు వ్యవసాయము ఒకప్పు డస్థిరమగుటవల్లను, సాలుకు కొద్దినెలలే పనియుండుటవల్లను వ్యవసాయపు రైతులకుకూడ అందుకు సంబంధించి కొద్దిపాటిలో స్వతంత్రముగ తమ గ్రామమందే పనిచేసికొన వీలగు సహాయవృత్తులు అవసరము. ధాన్యపుదంపు, నూలు వడుకుట, బట్టలనేత, తేనె బెల్లము వగైరాలు తయారుచేయుంట, వడ్రము, కమ్మరము, చెప్పులుకుట్టుట ఇట్టి పరిశ్రమలు ఇందు కన్నివిధముల దగియున్నవి. యాంత్రికపరిశ్రమలకు ప్రాముఖ్యమిచ్చుటచే గ్రామములలో కోట్లకొలది రైతుల కిసహాయవృత్తులు లేకుండ నశించును. రైల్లు విద్యుచ్ఛక్తి మున్నగు దేశమంతటికి సంబంధించు కొన్నింటికి మనకును యంత్రము లవసరమే. కాని యిచ్చటి పరిస్థితుల బట్టి అన్నింటికిని మహాయంత్రములనే దెచ్చిపెట్టుట ఉచితముగ దోపదు.

# 59. ఆధునిక సాంఘికరాజకీయ భావముల అభివృద్ధి

ప్రాచీననాగరికుల సంస్థలు, ఆచారములు, రాజకీయభావములు, కాలక్రమమున నెమ్మదిగా వృద్ధినొందును; ముందుగా నేవ్యక్తియు వాటి నేర్పర్చలేదు, కనిపెట్టలేదు. నరుల కౌమారదశ ప్రారంభమయిన క్రీ. పూ. 6-వ శతాబ్దమునమాత్రమే, నరులు తమ పరస్పరసంబంధమునుగూర్చి ఆలోచించి, భావదాస్యమువీడి, ప్రాచీనవిశ్వాసములను చట్టములను పాలనపద్ధతిని మార్చుటకు మనఃపూర్వకముగ యత్నించిరి.

గ్రీసులోను అలెగ్జాండ్రియాలోను జ్ఞానోదయమైన సంగతిని, దాస్యపద్ధతి తగ్గిపోవుటను, మూర్ఖభావులు నిరంకుశప్రభుత్వములు ఈ జ్ఞానారంభమునకు విఘ్నము గలిగించిన సంగతిని, చెప్పియుంటిమి. యూరపు నావరించిన యీయంధకారము పోగొట్టదగు స్వతంత్రజ్ఞానకాంతి 15, 16-వ శతాబ్దములవరకు తిరుగ గలుగలేదు. యూరపువారి మనోవీథిని అరబ్బుల ఔత్సుక్యవాయువులును మంగోలుల జైత్రయాత్రాతరంగమును క్రమముగా శుభ్రము చేసినసంగతిని సూచించితిమి. మొదట భౌతికజ్ఞానము భౌతికశక్తియునే వృద్ధిపై, జనుల మానవత్వము స్వస్థతజెందెను. నరుల పరస్పరసంబంధము, వ్యక్తిసంఘముల మనస్తత్వము, ఆర్థికతత్వము, వీటివిజ్ఞానము అతిసూక్ష్మము, క్లిష్టము; వీటిచర్చచే భావోద్రేకమును గల్గును; కనుక, ఆ విజ్ఞా

సము వేగముగ వృద్ధికాలేదు; చాల ఆటంకములు కల్గుచుండెను. నక్షత్రములగూర్చియు, అణువులగూర్చియు, వివిధసూచనలను జనులు శాంతముగ విందురు; కాని మన జీవితపద్ధతులగూర్చిన భావములు వినగనే, మనలో ప్రతివారికిని ఉద్రేకము కలుగును.

గ్రీసులో వస్తుతత్వమునుగూర్చి అరిస్టాటిలు పరిశోధనకు ముందే 'ప్లాటో' యుక్తాలోచనలు చేసినటులే, యూరపులోను ప్లాటోయొక్క 'రిపబ్లికు' 'లా' గ్రంథముల ననుకరించుచు, ఊహాయుతకథలతో నూతనరాజకీయచర్చ లారంభించెను. ప్లాటో వలె 'సర్ థామస్ మూరు' వ్రాసిన 'ఉటోపియా' గ్రంథపు ఫలితముగ, ఇంగ్లీషువారిలో బీదలగూర్చి క్రొత్తచట్టము చేయబడెను. నేపిల్సువాసియగు 'కంపనెల్లా' రచించిన (సిటీ ఆఫ్ ది సన్) 'సౌరనగరమను' గ్రంథ మీరీతిదైనను, విపరీతభావములు కలదైనందున నిష్ఫలమయ్యెను.

17-వ శతాబ్దాంతమునకు సాంఘికరాజకీయ శాస్త్రముల గూర్చి, కొంతవాఙ్మయమేర్పడెను. ఇంగ్లీషు ప్రజాస్వాత్వవాది పుత్రుడును ఆక్స్‌ఫర్డు విద్వాంసుడును రసాయనవైద్య విద్వాంసుడు నగు 'జాన్ లాకు' యీచర్చారంభకులలో నొకడు; ప్రభుత్వము, సహిష్ణుత, విద్య, వీటినిగూర్చిన యితనిగ్రంథములు సాంఘికపునర్నిర్మాణము భావ్య మని సూచించుచున్నవి. తరువాత ఫ్రాన్సులో 'మాంటెస్క్యూ' (1689—1755) అప్పటి మతసాంఘికరాజకీయసంస్థలను తీవ్రముగ విమర్శించి, ఫ్రాన్సులోని నిరంకుశప్రభుత్వపు గౌరవము

గూల్చెను. సాంఘికపునర్నిర్మాణముకు వ్యతిరేకములగు దురభిప్రాయముల నాతడును 'లాకు'ను ఖండించిరి.

18-వ శతాబ్దము తరువాత జనులు ధైర్యముగ స్వతంత్ర విమర్శన సాగించిరి. ముఖ్యముగా జెసూయిట్ల సమితినుండి తిరుగబడిన 'ఎన్సైక్లోపీడిస్టు' లను మేధావులు కొందరు 1766-లో నూతనభావన కారంభించిరి. వారితోబాటు ఆహారాదివస్తువులు తయారు సరఫరాల గూర్చి 'ఫిజియోక్రాటు'లను అర్థశాస్త్రజ్ఞులు కొందరు స్వతంత్ర చర్చచేసిరి. "కోడ్-డి-లా-నేచరు" కర్తయగు 'మోరిల్లీ' ఆస్తి వ్యక్తిగతమగు పద్ధతిని నిరసించి, సంఘమును సమిష్టి పద్ధతిని నిర్మింపవలెనని సూచించెను. సోషలిష్టులను పేరబరగు 19-వ శతాబ్దపు వివిధసిద్ధాంతము సామ్యవాదుల కాతడే ప్రారంభకుడు.

సామ్యవాద మన నేమి? సామ్యవాద మనుదానికి నూరు వివరణములు, సామ్యవాదులలో వేయిశాఖలును గలవు. సర్వజనోపయోగదృష్టిని ఆస్తిని వ్యవహరించుటయే సామ్యవాదసూత్రము. ఆభావ మాయాకాలమం దేరీతిగా నుండెనో ప్రస్తుతభావము లెట్లు కల్గెనో క్లుప్తముగ బరిశీలింతము. ఈనాడు చాలవరకు మన రాజకీయజీవితమంతయు సామ్యవాదమువైపు అంతర్జాతీయతవైపు తిరుగుచున్నది.

వ్యక్తులకు మమకారము కలహేచ్ఛ ఉండుటవలన స్వత్వభావము కల్గును. నరునికి మానవత్వ మేర్పడుటకు చాలపూర్వమే నరులపూర్వికమగు మర్కటమా స్తిదారుగా నుండెను. మృగములు ఆస్తిహక్కుకై పోరును. శునకము కెముకయు, ఆడుపులికి గుహాయు, దుప్పికి తన మందయు, ఇవి స్పష్టముగ

ఆస్తియే. సాంఘికశాస్త్రమున "ఆదిమసంఘ స్వామ్యపద్ధతి" అను పద మర్థములేనిది; ప్రాచీనశిలాయుగమునాటి కుటుంబసమూహములోని జ్యేష్ఠుడు, తనభార్యలు, కుమార్తెలు, తన పరికరములు, తనకు వశమగు ప్రపంచమును, ఆన ఆస్తి యని దృఢముగా భావించెను. అన్యుడెవడేనితన పరిసరమునకు వచ్చినచో, వానితో యుద్ధముచేసి, వీలైనచో సంహరించుచుండెను. తరువాత యువకుల స్వాతంత్ర్యమును, ఇతరవంశములనుండి పట్టి యువకులు తెచ్చుకొనిన భార్యలు, వారిపరికరములు, వారువేటాడిన మృగములును, ఆయువకుల ఆస్తులు అని వృద్ధు లంగీకరించిరి; ఇట్లు సంఘము వృద్ధియాయెను. ఈసంగతి ఆట్కిన్సన్ "ప్రైమల్‌లా" (= ఆదిమన్యాయము) గ్రంథమున వివరించెను. ఆస్తియందా యావ్యక్తుల హక్కులసమన్వయముకై రాజీయేర్పడి, మానవ సంఘము బాగుపడెను. అన్యజాతులతో సంఘర్షము లేకుండుటకై, ప్రతితెగవారు రాజీపడుచుండిరి. కొండలు, అడవులు నదులును అందరివే; అందుచేనవి ప్రత్యేకవ్యక్తికి జెందవాయెను. ఎవనికివాడే అదితనది కావలెననికోరును; కాని, అదిదుస్సాధ్యము. ఈనాగరిక జనులకంటే, మృగములందును, ప్రాచీనమృగతుల్యులందును, స్వత్వమువిషయమై పట్టుదల అధికముగా నుండెను. మన హేతుజ్ఞానముకన్న సహజోద్దేశమందే ఆస్తిభావము రూఢమై యున్నది.

నేటిఅడవిజనులలోను విద్యావిహీనులలోను వ్యక్తిస్వామ్యముకు మితిలేదు. స్త్రీలు, దుఃఖితులు, పట్టువడిన వన్యమృగములు, వనమార్గములు, రాతిగనులు, ఒకటి యన నేల దేనికొరకైనను పోరాడి సాధించు కొనదలచుచో, అది వాని ఆస్తియే.

సంఘమభివృద్ధి జెందినకొలదియు, అంతః కలహములు తగ్గించుటకై ఒకవిధమగునిర్ణయములకువచ్చి, ఆస్తిహక్కుల నిర్ణయించుకొనుటకు గొన్ని సులభనిబంధనల నేర్పరచిరి; ముందుగాచేసినవాడు ఆక్రమించినవాడు దానినంతను తానే అనుభవింపవచ్చును; ఋణముచెల్లించలేని ఋణగ్రస్తుడు అప్పులవాని యాస్తి, అనగా అతనిదాసు డగుచుండెను. ఇట్లే కొంతభూమిని తన హక్కుగా నుంచుకొనువాడు తరువాత దానివీడదలచినచో, ఇతరులయొద్దనుండి ప్రతిఫలము గ్రహించుటయు ఉచితముగనే తోచెను. కాలక్రమమున జీవితము నియమబద్ధమగుట మంచిదని తోచెను; నెమ్మదిగ ప్రతివానిహక్కుకు మితియుండుట అవసర మని గ్రహింపబడెను. తాముపుట్టిన యీజగత్తులో సర్వమును వ్యక్తుల హక్కులో నుండుటేగాక తామే పరాధీనులముగా నుంటి మని నరులు కనిపెట్టిరి. ప్రాచీనసంస్కృతిలోని సాంఘిక సంఘర్షముల వివరించుట కష్టము; కాని, రోమక ప్రజారాజ్యమునుగూర్చి వెనుక చెప్పినసంగతులబట్టి, ఋణములు పెరుగుట సంఘములకు బాధకరములుకాగా, ఆఋణబాధ్యత నిరాకరింపవలసియుండునని, భూమియందు వ్యక్తులహక్కుకు మితి లేనిచో కష్టకారణమగునని, విశదమగును. దరిమిలాను బాబిలనువారు బానిసలందు జనులస్వత్వమునకుతీవ్రమితిని అందుకు నిబంధనలను ఏర్పరచిరి. తుదకు వెనుకటి అందరికన్న స్పష్టముగ "యేసుక్రీస్తు" ఆస్తియందు వ్యక్తిహక్కుపద్ధతి కూడదని సూచించెను. విశేషద్రవ్యవంతులకు స్వర్గము వచ్చుటకన్న సూదితలకన్నములోనుండి ఒంటెదూరిపోవుట యెక్కువ సులభమని అయన చెప్పెను. ఇట్లు ఇరువది ముప్పది శతాబ్ద

ములనుండి ఆస్తియందు వ్యక్తులహక్కులనుగూర్చి క్రమముగా విమర్శ జరుగుచునేయున్నది. క్రీస్తుతరువాత 19-వ శతాబ్దములకు క్రైస్తవమతబోధ జరిగిన దేశములంతటను నరులను ఆస్తిగా భావింపగూడదని విశదమయినది. ప్రతివాడును తన యాస్తిని తనయిష్టప్రకారము చేసికొనవచ్చునను సిద్ధాంతము తక్కిన యాస్తివిషయమునగూడ పూర్తిగా వర్తింపదని స్పష్టమయినది; కాని యీవిషయము 18-వ శతాబ్దము చివరకును సందిగ్ధముగనే ఉండెను. రాజులును, ప్రభువులును, వ్యక్తుల ఆస్తులను హరించి నష్టపరచకుండ రక్షించుట అప్పటి జనుల ముఖ్యోద్దేశమై యుండెను.

ఇట్లు వ్యక్తుల ఆస్తిని పన్నులనుండి రక్షించుటకే ఫ్రెంచి విప్లవము కలిగెను. కాని ఆయుద్యమమున కలిగిన సర్వసమత్వ సూత్రముచే, ఆస్తియందు వ్యక్తుల స్వామ్యపద్ధతియే విమర్శ పాలాయెను. జనులనేకులు నిలువ నీడ, తినుట కన్నములేక కష్టపడుచుండ, నిరుపేదల కన్నము పెట్టి స్థలము నియ్యనిచో, జనులందరు సమానులు స్వతంత్రులు అగుటెట్లు? ఇందుకు పరిష్కారముగ, ఆస్తినంతను అందరకు పంచిపెట్టవలెనని ఒక ముఖ్యరాజకీయకక్షవారందురు. ఆస్తినంతను వృద్ధిచేసి సర్వజనీనముగా చేయవలెనని వారియభిప్రాయము; ఈ ఆదర్శముతోనే మరియొక పద్ధతివారగు కమ్యూనిస్టు లనబడు సంఘస్వామ్యవాదులు, * అన్ని ఆస్తులందు వ్యక్తుల కెట్టి హక్కులు

* రష్యాలో ఈ పక్షమువారినే బొల్షివిక్కులు సోవియటులని అందురు.

లేకుండజేసి, ప్రజాసత్తాక ప్రభుత్వమే ఆస్తికంతకు హక్కుదారై యుండవలె నందురు.

ఇట్లు, ఒకేస్వాతంత్ర్యసౌఖ్యాదర్శములతో, ఒకపక్షము ఆస్తుల హక్కుల దృఢపర్చవలెనని, రెండవవారు వ్యక్తుల నసలే తొలగింపవలెనని, తీర్మానించినారు. స్వత్వ మనునది ఒక పదార్థముగాక, అనేకసంగతుల సమూహమగుటయే, యీ వైచిత్ర్యముకు కారణము.

ఆస్తిహక్కు సులభవిషయముగాదు. అందు చాల రకముల స్వత్వములు మిళితములు. నరునిదేహము, శిల్పుల పనిముట్లు, వస్త్రాదులు, వారివారి నిరాక్షేపణీయమగు సొమ్ములు. కాని రైళ్లు, వివిధయంత్రసామగ్రి, గృహములు, ఆగామములు, వినోదనౌకలు. ఇట్టివానిలో నేవేని యెంతవరకు వ్యక్తుల కధీనము కావచ్చునో, ఏవేవి ప్రభుత్వాధికారమందుండి ప్రభుత్వముచేతనే ప్రజోపయోగముకై వినియోగింపవలెనో, ప్రత్యేకముగా నిర్ణయింపదగును.

ఈసంగతి 19-వ శతాబ్దము జరిగినమీదటనే వ్యక్తమయ్యెను. ఈప్రశ్నల ప్రత్యక్షముగ చర్చింపగానే, రాజకీయ ప్రశంసగూడ తప్పక కలుగును. చివరకు ఆచర్చ రాజ్యపాలనమును సుష్టువుగాజేసి రక్షించుటెట్లను సమస్యగా పరిణమించును.

అందుచే సాంఘికమన స్తత్వపు సమస్యలు కలుగును; విద్యాశాస్త్రపరిశీలనకు వీటితో సంబంధము గలదు. ఆస్తితత్వమునుగూర్చినవిమర్శ లుద్రేకపూరితము లగుచున్నవి; నిదానముగ శాస్త్రీయముగ చర్చించుట యింకను లేదు. ఒకవంక ఆస్తియందు దాయావ్యక్తుల అధికారమును కాపాడి అభివృద్ధి

చేయుటకు వ్యక్తివాదులు యత్నించుచున్నారు; మరియొకవంక వ్యక్తిగతపద్ధతిని నిరోధించుచు, ఆస్తిహక్కుల నన్నిటిని ప్రజాస్వామ్యము క్రింద కేంద్రీకరించుటకు సామ్యవాదులు తలపెట్టుచున్నారు. మొత్తముమీద ప్రభుత్వముకు పన్ను నీయకూడదను కేవల వ్యక్తివాదులు మొదలు, ఎట్టి ప్రత్యేకపుఆస్తియు నుండరా దను సంఘస్వామ్యవాదులవరకు పలుతరగతుల అభిప్రాయము కలవారు గలరు. నేటి మామూలు సామ్యవాది కొంతవరకు వ్యక్తి ఆస్తి నంగీకరించును; కాని విద్య, సరఫరా పద్ధతులు, గనులు, భూమిహక్కు మొదలైన జనుల ఆవశ్యక పదార్థములు చక్కని కట్టుబాట్లతో నడుపబడు ప్రభుత్వమునకు జెందగోరుదురు. ప్రస్తుతము శాస్త్రీయనియమము గలది సామ్యము అగు సామ్యవాదపద్ధతికి క్రమముగ బలము చేరుచున్నది. విద్యావిహీనుడు పెద్దవ్యవహారముల నడుపుటకు సులభముగ గలసిరాడు. ప్రభుత్వము క్లిష్టకార్యముల వహించి వ్యక్తులనుండి కార్యభారములను తమపై పెట్టుకొనుకొలది అందుకు జనులందరిలో సరియగు విద్యాభివృద్ధి ప్రభుత్వముపై విమర్శయు, వారికి సంతృప్తికరమగు చర్చావకాశమును, అవసరములు. వార్తాపత్రికలు, ప్రస్తుత రాజ్యముల రాజకీయ పద్ధతులు, అపసవ్యధోరణినే ఉన్నవి. అందుచే సంఘస్వామ్య పద్ధతిని వ్యాపింపజేయుట ఇప్పుడు మంచిదిగా గనపడదు. యజమానులకు నౌకరులకు (విశేషించి స్వలాభపరాయణులగు యజమానులకును అసంతృప్తులగు కార్మికులకు) మధ్య నుండిన సంఘర్షమువలన మార్క్సుగారి బోధప్రకారము తీవ్రమగు సామ్యవాదపు సిద్ధాంతమునకు ప్రపంచమున

ప్రచారము కలిగెను. ఆర్థికావశ్యకతలనుబట్టియే మను ష్యుల మనోభావము లేర్పడుచుండు ననియు, ప్రస్తుత నాగరికతలో శ్రీమంతులగు యజమానజాతికిని కార్మికజనులకును మధ్య తగవు తప్పదని నమ్మి, ఆసూత్రముపైన మార్క్సు తన సిద్ధాంతముల నిర్మించెను. యాంత్రికపరిణామమువలన విద్యా వ్యాప్తి కలిగి, చాల అధికసంఖ్యాకులగు కార్మికులు స్వసంఘము కధికారము కోరుచు అల్పసంఖ్యాకులగు యజమానులకు విరోధు లగుదురు. ఆ పాలకులు స్వార్థపరులుగ నుందురు. సంఘీభావముచే స్వసంఘబలమును గుర్తించి, కార్మికు లేదోవిధ మున బలవంతముగ నధికారము లాగుకొందురు. ఒక నూతన సామ్యవాదిరాజ్య మేర్పడును; అని మార్క్సు నిర్వచించి యుండెను. విరోధములు విప్లవములు సాధ్యములే; కాని అందుచే ఒక నూతన సామ్యవాదిరాజ్యమే వచ్చుననవీలులేదు; అందుచే సంఘస్థితికి వినాశము కలుగవచ్చును. మార్క్సు సిద్ధాంతము రష్యాలో నమలునం దుంచబడి ఎట్టి నిర్మాణపద్ధతిని గల్గించలేకపోయె నని ముందు చూచెదము.*

మార్క్సుజాతుల సంఘర్షము పోగొట్టుట కాస్థానమున తరగతుల సంఘర్షము నేర్పరుపదలచెను. మార్క్సుసిద్ధాంతము ఫలితముగ వరుసగా మొదటి రెండవ మూడవ అంతర్జాతీయ కార్మికసమావేశములుగల్గెను. కాని ఆధునిక వ్యక్తి వాదపద్ధతి నుండియు అంతర్జాతీయాశయముల జేరుట కనువు గలదు.

ఆంగ్లేయార్థశాస్త్రజ్ఞుడగు 'ఆడం స్మిత్తు' కాలమునుం డియు ప్రపంచాభివృద్ధికి నిరాటంకమగు స్వేచ్ఛావ్యాపార

* ముందు 66-వ అధ్యాయాంతపు టిప్పణి చూడుడు.

మువసర మను అభిప్రాయము కలదు. వ్యక్తివాది ప్రభుత్వమునకు సర్వాధికార ముండుట కంగీకరింపడు; అట్లే యతడు జాతీయ వాదులు సూచించు వర్తకపుసుంకములు, సరిహద్దు నియమములు, స్వేచ్ఛావర్తకమునకు నిరోధములు వీటికిని వ్యతిరేకించును. ఇట్లుద్దేశములం దంత భేదించి వర్గవిరోధము కోరు మార్క్సు సామ్యవాదపద్ధతివలె విక్టోరియాశకమందలి బ్రిటిషువర్తకుల స్వేచ్ఛావర్తకపద్ధతియు ప్రాంతీయభేదముల తొలగించుటకు మానవవిషయములన్నిటియందును అంతర్జాతీయదృష్టి వ్యాపింప జేయుటకును యత్నించుచున్నది.

కేవల సిద్ధాంతవాదములకన్న యథార్థస్థితి గమనించుటే కార్యసాధకమగును. పరస్పరవిరుద్ధములగు భావములతో బయలు దేరిన వ్యక్తివాదసిద్ధాంతము, సంఘస్వామ్యసిద్ధాంతము ఈ రెండును ఒకేఆదర్శముకై యత్నించుచున్నవి. కనుక సాంఘిక రాజకీయములలో విశాలభావములు గల మానవులందరు కలసి మెలసి పనిచేయదగును. అందుచే నుభయులు కలసియే వ్యవహరింపవచ్చును. రోమకసామ్రాజ్యముపైనను క్రైస్తవమతసంఘముపైనను ప్రజలవిశ్వాసము తగ్గి, వివిధ పరిశోధనలమూలమున మానవులదృష్టి మధ్యధరాసముద్రప్రాంతములనుండి విశాల ప్రపంచమునకు మరలెను. అప్పటినుండి ఈ సమస్య పరిష్కరింప యత్నము జరుగుచునేయున్నది.

ఈ యార్థిక సాంఘిక రాజకీయభావముల పరిణామ వివరణను విమర్శలవరకు తెచ్చుచోఁ గొన్ని చర్చాస్పదమగు సమస్యల తేవలసియుండును. అది యీగ్రంథోద్దేశము కాదు. కాని, ప్రపంచచారిత్రకుని విశాలదృష్టితో గమనింతుమేని

మానవుల మనోధోరణిని సవ్యమార్గమున బెట్టుపునర్నిర్మాణ కార్యము పూర్తికాలేదని చెప్పకతప్పదు. ఇది ఎంతలోపముగ నున్నదో చెప్పలేము. కొన్నిసామాన్యభావములు వెలువడు చున్నవి. వాటిఫల మిప్పటి కొన్నివృత్తాంతములలోను, చర్యల లోను కనబడును. విస్పష్టముగను తృప్తికరముగను లేనందున వానిని సాధించుటకు జనులు తగుయత్నము చేయుటలేదు. జనులచర్యలు పురాతనసంప్రదాయములకు నవీనములకు మధ్య చలించుచు, తరుచు సంప్రదాయపద్ధతివంకకే కొంత మొగ్గును. కాని క్రిందటితరమువారి యభిప్రాయములతో పోల్చినచో, నరుల స్థితిగతులం దొక నూతనపద్ధతి యేర్పడుచున్నట్లు కన బడును. ఈయాకారము కొన్నిచోట్ల దృశ్యాదృశ్యముగ నుండుచు, కొన్నియెడల పద్ధతులలోను వివరములలోను మారుచున్నది. కాని యది క్రమముగా స్పష్టమగుచు, దాని మూలసిద్ధాంతములు అంతగా మార్పులేక వృద్ధినొందుచున్నవి.

మానవజాతియంతయు అనేకవిషయములలో నొకేమహా సంఘ మగుచున్న దని, అట్టివిషయముల ప్రపంచమంతటికి ఒకే సమానాకార ముండవలె నని అంతకంతకు విస్పష్టమగుచున్నది. ఉదాహరణకు, ప్రపంచమంతయు ఆర్థికముగ నొకేసంఘ మని, అందలిముడివస్తువుల నేకరించుటకు అందరును ఏకీభావముతో సరిగా యత్నింపవలె నని, నూతనపరిశోధనలచే గల్గిన అద్భుత శక్తులనుబట్టి ప్రస్తుతపు పోటీతో భిన్నపద్ధతులతో నా కార్యము లజేయుటచే చాలహాని కలుగు నని, తేలుచున్నది. ఆర్థికవిషయ ములను ద్రవ్యవిషయములను ప్రపంచమంతకును వర్తించు పద్ధతిపైనే నడుపుట యవసరము. అంటుజాడ్యములు వలస

యాత్రలుగూడ స్పష్టముగ ప్రపంచసమస్యలే. నరులార్జించిన విస్తారశక్తి విశాలవ్యాపకతలవల్ల యుద్ధములు మహావిధ్వంసకరములు, కల్లోలకరములు అగును. ప్రభుత్వములమధ్యను జనులమధ్యను ఉండు తగవులను యుద్ధములమూలమున పరిష్కరింప వీలులేదు. అందుచే నిదివరకున్న ప్రభుత్వములకంటె విశాలాధికారముగలది అవసర మని సూచితము.

విజయమూలముననో, ఇప్పు డున్న రాజ్యము లన్నిటిని ఏక మొనరించియో ప్రపంచమంతట నొకే మహాప్రభుత్వము స్థాపించుటే యీసమస్యల పరిష్కారమునకు సాధనమున వీలు లేదు. మానవ ప్రతినిధిసభ, ప్రంపంచమహాసభ, ప్రపంచాధ్యక్షత, సార్వభౌమత్వము ఇట్టి వానిని జనులు ఇప్పటి సంస్థలపోలిక నూహించినారు. మనకు మొదట నట్లే తోచినను, ఏబదివత్సరముల చర్చానుభవములచే ఇట్టివానియందు నమ్మిక తగ్గును. ఆపద్ధతిని ప్రపంచైక్యము కల్గుట కాటంకమధికము. ప్రపంచమంతటను అధికారము గల కొన్ని ప్రత్యేకసంఘముల నియమించి ప్రస్తుతప్రభుత్వములవారు వానికి ప్రత్యేకాధికారముల నిచ్చి ఆరీతిని సహజసంపదవృద్ధి, తన్నాశము, కార్మిక పరిస్థితుల సమన్వయము, ప్రపంచశాంతి, నాణెములు, జనాభా, ఆరోగ్యము మొదలగు విషయముల నాసంఘములద్వారా పరిష్కరించుట యుచిత మని ఆధునికాభిప్రాయము.

ప్రపంచమంతటి కొకేప్రభుత్వము లేకున్నను, ప్రపంచము యొక్క సామాన్యవిషయములనన్నిటి నొకేవిషయముగా వ్యవహరించు భావమైనను కలుగవలె. కాని నరులందరిలో నీమాత్రపు సంఘీభావ మేర్పడుటకైనను, ఇట్టి అంతర్జాతీయపరిష్కా

రములకు ఆయాజాతులలోని ఈర్ష్యాసూయలు పోవుటకుగాను మానవుల మనస్సునందు సర్వమానవసౌభ్రాత్వము మానవులందరొకేకుటుంబ మనుభావము లోకులకు విశదమగునట్లు బోధింపవలెను.

20 శతాబ్దములపైనుండియు ముఖ్యమైన ప్రపంచమతములు సర్వమానవసౌభ్రాతృత్వమును స్థాపించి పెంపొందించుటకు పాటుపడుచున్నను, ఇప్పటికిని జాతివర్ణనిరోధములు ఈర్ష్యలు కక్షలు అవిశ్వాసములు ప్రతివ్యక్తి మానవసేవ చేయదగు ననువిశాలభావము కడ్డుతగిలి ప్రకోపించుచున్నవి. క్రీ. త. 6, 7 శతాబ్దములందలి అల్లకల్లోలములలో యూరపియనులలో క్రైస్తవైక్యభావము కల్గింప యత్నముజరిగినట్లే మానవసౌభ్రాతృత్వభావ మీనాడు ప్రజలహృదయము నాకర్షించుటకు పెనగులాడుచున్నది. అట్టిభావములవ్యాప్తికై మనస్ఫూర్తిగా పాటుపడి పేరుప్రతిష్ఠ లాశింపని ప్రచారకబృందము పనిచేయవలెను. ఎంతవర కీకార్యక్రమము సాగుచున్నదో, అది యెంతవరకు ఫలించుచున్నదో సమకాలికలేఖకు లెవ్వరును నిర్ణయింపలేరు.

ఇప్పటి సాంఘికార్థికపరిస్థితు లంతర్జాతీయ సమస్యలతో అభేద్యముగ కలసియున్న వని తోచును. ఈసమస్యలపరిష్కారముకై మానవులకు సానుభూతి ఉత్తేజము కలిగించి, సంఘసేవాభావమును పురికొల్పవలెను. వివిధజాతుల అసూయ, అనుమానము, అహంకారభావమును, సంఘలాభమును నిరోధించుచున్నవి. ఆయావ్యక్తుల స్వలాభపరత వివిధజాతుల అసూయాహంభావాదుల వృద్ధిజేసి అదియు వృద్ధియగుచున్నది. వ్యక్తుల కత్యాశ కలిగినట్లే, జాతులకును చక్రవర్తులకును చాల ఆస్తి

కావలె నని అత్యాశ కల్గుచున్నది. ఈరెండు నొకేరీతివై, ఒకే మనోభావముచేతను అజ్ఞానసంప్రదాయమువల్లను కల్గును. అంత ర్జాతీయత అనగా జాతుల సంఘస్వామ్యము. అందుకు వలయు నంత గంభీరము పటిష్ఠము అగు మనస్తత్వవిజ్ఞానముగాని, మానవులలో అన్యోన్యత పరస్పరసహకారము కల్గింపదగిన నిర్ణీత విద్యావిధానముగాని, మరి యేపద్ధతికాని ఇంతవర కేర్పడలేదు. 1820-నాటి జనులు విద్యుచ్ఛక్తిచే నడచు రైలుమార్గములు నిర్మించుట కశక్తులైనట్లే, మన మీనాటికి సరియగు ప్రపంచజాతి సంస్థాపనపద్ధతుల నేర్పఱచుట కశక్తులమైయున్నాము. కాని దానిని కొలదికాలముననే సాధింపవచ్చు నని తోచును.

తనజ్ఞానశక్తి నెవడును దాటలేడు; సమాలోచన సమకాలికజ్ఞానమును దాటి పోవీలులేదు. జనహృదయమందును ప్రపంచమందును శాంతి యేర్పడి, నిరాదర్శము అంధకార రూపము నగు ప్రస్తుతవ్యర్థజీవితపద్ధతి నంతమొందించుటకు ముందిక నెన్నితరములు యుద్ధవినాశములబాధ పొందవలెనో ఊహింప శక్యముకాదు. మనము సూచించు పరిష్కారము లన్నియు నింకను అస్పష్టములు, అనాగరికములు, అభిమానానుమానభరితములుగ నున్నవి. భావ పునర్నిర్మాణకార్యక్రమ మారంభమై, మన అభిప్రాయములు క్రమముగా స్పష్టముగ సరిగ నేర్పడుచున్నవి. కాని అవి యింకను అసంపూర్ణములు. ఈకార్యక్రమము మందముగనో శీఘ్రముగనో ఎట్లున్నదో చెప్పుట కష్టము. కాని అవి స్పష్టమైనకొలదిని మానవహృదయములపై నధికశక్తిని పొందును; సరియైన వసునిర్ణయము లేకుండుటచే

అవి యింకను కార్యకారులగుటలేదు. వాటిని విభిన్నముగ సందిగ్ధముగ కంగారుగ బోధించుటచే వాటిపై గొంతమందికి దురభిప్రాయము కలుగుచున్నది. నిశ్చయము కలుగగనే ఈనూతన భావ మవశ్యముగ బలీయమై, జనావలంబ మొందును. త్వరలోనే అట్టిబలము కలుగవచ్చును. స్పష్టముగ బోధపడగానే జను లాభావముల నేర్చుకొందురు.

---

# ౬౦. సంయుక్తరాజ్యాభివృద్ధి

యాంత్రికమగు క్రొత్త ప్రయాణసౌకర్యములవలన ప్రపంచమున అన్నిటికన్న ఉత్తరఅమెరికా కెక్కువగ లాభించినది. 18-వ శతాబ్దపు విశాలరాజకీయ భావములు సంయుక్తరాజ్యములందు జేరెను. మరియు ఆస్వతంత్రభావములపద్ధతినే దాని రాజ్యాంగ నిర్మాణ మేర్పడెను. వారు రాజత్వమును ప్రభుత్వమత పీఠసంస్థను వదలిరి; బిరుదులపద్ధతి తొలగించిరి; వ్యక్తుల ఆస్తిరక్షణ తమ స్వాతంత్ర్యమునందొకభాగముగా నేర్పడెను. రమారమి ప్రతిపురుషునికిని ఓటుచేయు హక్కు నిచ్చిరి. అయితే వారి ఓటుపద్ధతు లతిక్లిష్టములు; అందుచే వారి రాజ్యాంగ జీవితము త్వరలోనే (పార్టీ) కక్షులహస్తములలో బడెను. ఐనను ఆస్వతంత్రజనులు ఆనాటి యితర జాతులందరికంటె నధికశక్త్యుత్సాహములతో దేశభక్తిని నిరాటంకముగ వృద్ధిచేసికొనిరి.

అంతలో వెనుకజెప్పిన రాకపోకల సౌకర్యములు కలిగెను. తమకు విశేషలాభము కలిగించిన రైలుమార్గములను తంతిమార్గములను స్టీమరులను వారు తమ దేశవృద్ధియం దొక సహజభాగముగనే గ్రహించిరి; కాని అవి సహజములు కావు. అవి సకాలము కేర్పడి అమెరికా కైకమత్యము గల్గించెను. ఈనాటి సంయుక్తరాష్ట్రము మొదట నదీనౌకల మూలమునను, అటుపైన రైలుమార్గముల సాయమువల్లను ఏర్పడినది. ఇవి లేనిచో విశాలఖండమగు ప్రస్తుత సంయుక్తరాష్ట్రము

లేకరాజ్యముగ నుండుట కేవల మసంభవము; అచ్చటి పశ్చిమ ప్రాంతములకు జనులవ్యాప్తి అతిమందమై యుండును. అది మధ్యమైదానము నెన్నడును దాటి యుండెడిదే కాదు. సముద్రతీరమునుండి సగముభాగముకు లోపున నున్న మిస్సోరినదికి ఆజనులు వ్యాపించుటకు దాదాపు 200 ఏండ్లు పట్టెను. ఆనది కావల నేర్పడిన మొదటిరాజ్యము మిస్సోరి; ఇది నౌకాసౌకర్యముగల రాజ్యము (1821); కాని తరువాత రైళ్ళమూలమున పసిఫికుసముద్రమువరకున్న విశాలదేశమంతను కొలది దశకములలోనే వలసజను లాక్రమించిరి.

మనకు సినీమాసౌకర్యము లుండినచో 1600 నాటి నుండియు నేటేట క్రమముగా ఆజనులు వ్యాపించిన విధమును ఉత్తర అమెరికాచిత్రపటముపై నొక్కొక్కవంద జనుల సూచించుట కొకచుక్కతోను, లక్షజనాభా గల నగరములకు పువ్వుగుర్తుతోను చిత్రింపవచ్చును.

200 ఏండ్లవరకు సముద్రతీరప్రాంతమునను, నావ్య నదులవెంటను క్రమముగ ఇండియానా కెంటకీ మొదలగు ప్రదేశములకే ప్రాకులాడుచుండిన ఆరాష్ట్రముకు రమారమి 1810 ప్రాంతమున హఠాత్తుగా నభివృద్ధి కలిగెను. నదీతీరముల వెంబడి పరిస్థితు-లు త్తేజకములై, మనము పెట్టుచుక్కలు మహానదీతీరములనుండి కన్సాసునెబ్రాస్కాలకు వ్యాపించును.

1830 నాటినుండి రైలుమార్గముల సూచించు నల్లని గీతలు బయలుదేరి, నల్లనిచుక్కలు వేగముగ వ్యాపించును. ఇవి యంత్రములచే వెదజల్లిన ట్లుండును. ఇంతలో నొక్కొక చోట హఠాత్తుగా లక్షజనాభాగల పెద్దనగరముల సూచిం

చుచు పూవుగుత్తులు గన్పించును. మొదట నొకటిరెండు మాత్రమే యున్నను అటుపై ననేకనగరములు పెరుగుచు, వలలవలె నల్లుకున్న రైలుమార్గములలో ముడులవలె బయలు దేరును.

ఆ సంయుక్తరాష్ట్రములవృద్ధి లోకమందపూర్వము. అది యొక నూతనానుభవము. అంతకుపూర్వ మట్టిజాతియే బయలు దేరియుండదు; ఇదివర కట్టిజాతి యున్నను రైలుమార్గములు లేకుండినచో ఏనాడో విభిన్నశకలము లయ్యెడిది. రైలు మార్గములు తంత్రులు లేకున్నచో, కాలిఫోర్నియాను (ఆదేశపురాజధానియగు) వాషింగ్టనుకంటె, (చీనాలోని) పెకినునుండియే పాలించుట సులభము. ఈసంయుక్తరాష్ట్రము లలో జనాభా విపరీతముగ పెరిగి, అందు ఏకీభావమును కల్గెను. ఒకశతాబ్దికి పూర్వము (మధ్యదేశపు) వర్జినియాలోని మనిషికంటె, నేటి (పడమటి పసిఫికుతీరపు) సాన్‌ఫ్రాన్సిస్కో మనిషికి (తూర్పున అట్లాంటికుతీరపు) న్యూయార్కు మనిషితో నెక్కువ పోలిక గలదు. పైనుండివచ్చినవారీజాతిలో కలిసి పోవుచున్నారు. సంయుక్తరాష్ట్రములన్నియు భాషయందు చర్యలందు నేకీభావము కలిగి, రైలు తంతిమార్గములచే నొకే సంస్థగా అల్లివేయబడెను. వాయుయానము ఇందు కింకను తోడ్పడును.

సంయుక్తరాష్ట్రములోని ఈమహాజాతిచరిత్ర కేవలము క్రొత్తది. అది పదికోట్లకు మించిన జనాభాగల మహారాజ్యము; అంతపెద్ద విదివరలో చాల ఉండినవి; కాని అవి చాలరకముల జాతులకూడికగా నుండెను. ఈపరిమాణమున నిదివర కెన్నడును

ఒకేజాతి లేదు. ఈనూతన సంస్థకు క్రొత్తపేరు కావలెను. ఫ్రాంసు హాలండు లను దేశము లనినట్లే, సంయుక్తరాష్ట్రములనుగూడ దేశమందుము; కాని యీరెంటికిని ఒంటిగుఱ్ఱపుబండికిని మోటారుబండికిని గల వ్యత్యాసము గలదు. దేని కది వేర్వేరు కాలములందు వేర్వేరుపరిస్థితులలో బుట్టి, వేరుమార్గములబని చేయుచున్నవి. ఈ సంయుక్తరాజ్యములు పరిమితిసందర్భము లందుయూరపియను రాజ్యముకు ప్రపంచసంయుక్తరాష్ట్రము లకు మధ్యరకముగా నున్నవి.

ఈ యాధునికాధిక్యము కల్గుటకు ముందు అమెరికాలో ఒక అంతర్యుద్ధము జరిగెను. స్టీమర్లు రైలుమార్గములు తంత్ర్యాది సౌకర్యములు వచ్చులోగానే దీని దక్షిణరాష్ట్రములకు ఉత్తర భాగములకు మధ్య అంతఃకలహములు పెరిగెను. దక్షిణరాష్ట్రీ యులు బానిసల గల్గియుండిరి; ఉత్తరరాష్ట్రవాసులందరు స్వతంత్రజనులే. రైలుమార్గములు స్టీమర్లు వచ్చునప్పటి కీస్పర్ధ లేర్పడెను; అవి యిప్పుడు మరింత తీవ్ర మయ్యెను. ఈ క్రొత్త ప్రయాణసౌకర్యమువలన సంఘీభావము హెచ్చి, 'దక్షిణరాష్ట్ర భావమా ఉత్తరరాష్ట్రభావమా జాతీయభావము కావలెను?' అను సమస్య ముఖ్య మయ్యెను; రాజీ కవకాశము లేకుండెను. ఔత్తరాహులు స్వేచ్ఛావ్యక్తిత్వయుతులు; దాక్షిణాత్యులు పెద్దజమీనాల నేర్పఱచి, అజ్ఞానులగు వేనవేలు నల్లబానిసప్రజలచే కూలిపనిచేయించుచు వారిపై నధికారము వహించిరి. జనులు పశ్చిమదిశకు వ్యాపించి, నూతన రాజ్యముల స్థాపించుకొలది, శీఘ్రవ్యాప్తి నొందు అమెరికనుసిద్ధాంతముల క్రొత్తసంస్థ లేర్ప డినకొలది అది స్వతంత్రరాజ్యము కావలెనా, లేక జమీందారీ

బానిసపద్ధతులు నిలిచియుండవలెనా అను సమస్య కలిగెను. 1833-నుండి అమెరికాలో దాస్యనిరోధక సంఘమొకటి ఏర్పడి, దేశమంతటను బానిసపద్ధతి నిర్మూలనకై ఆందోళన సలుపుచుండెను. 'టెక్సాసు' వారు సంయుక్తరాష్ట్రములలో జేరిన తరువాత ఈతగవు తీవ్రసంఘర్ష మయ్యెను. టెక్సాసు ప్రథమమున మెక్సికోలో ప్రజాతంత్రకమందు జేరియుండి, బానిసల వాడుకొను అమెరికనుల వలసదేశమై, తరువాత మెక్సికోనుండి విడిపోయి, 1835-లో స్వతంత్రమై, 1844-లో సంయుక్తరాష్ట్రములతో గలసెను. మెక్సికనుశాసనము ప్రకారము బానిసపద్ధతి నిషేధింపబడెను. సంయుక్తరాష్ట్రపు దక్షిణరాజ్యములవారు బానిసపద్ధతి నవలంబించిరి.

ఇంతలో సముద్రనౌకాయాన మభివృద్ధిజెందెను; యూరపుదేశములనుండి విరివిగ వలసజనులు అమెరికాలోని ఉత్తరరాష్ట్రములకు జేరి, అచటి వ్యవసాయపుజిల్లాలగు అయోవా, విస్కాన్సిన్, మిన్నెసోటా, ఆరెగానులను రాష్ట్రములుగా నేర్పర్చి, ఇతరరాష్ట్రములతో దుల్యముగ నభివృద్ధి జేసిరి. అందుండి సెనెటు ప్రతినిధి సభలకు వచ్చుసభ్యులు దాస్యవిరోధులు; ఇట్లు రాజ్యాధికారమున ఔత్తరాహుల ప్రాబల్య మధికమాయెను. ప్రత్తి పండించెడి దక్షిణభాగమువారు ఈయుత్తరప్రాంతీయులు చేయుదాస్య నిషేధ ప్రచారము జూచి కుపితులై, వారి ప్రాబల్యముకు భయపడి సంయుక్తరాష్ట్రమునుండి విడిపోవజూచిరి. వారు తమకు దక్షిణమున చున్న మెక్సికోను ఆప్రాంతపు సముద్రపుదీవులను

కలుపుకొనవలెనని ఉత్తరభాగమునుండి విడిపోయి, పెనామా వరకు బానిసపద్ధతి నిల్పుకొను ఒక మహారాజ్యమును స్థాపింప వలెనని తలచిరి. అందుకు వ్యతిరేకి యగు 'అబ్రహాంలింకను' 1860-లో సంయుక్తరాష్ట్రాధ్యక్షు డయ్యెను. వెంటనే దక్షిణ భాగము విడిపోవ నిశ్చయించుకొనెను. దక్షిణకెరొలినావారు విడిపోవుటకు తీర్మానించి యుద్ధమునకుగూడ సిద్ధమైరి. మిసిసిపీ, ఫ్లోరిడా, అలబామా, జార్జియా, లూజియానా, టెక్సాసు, జిల్లాలుకూడదానితో గలసెను.అలబామాలోని'మాంటుగోమరీ' యొద్ద జరిగిన సమావేశములో 'జెఫర్సనుడేవిసు' ను దాక్షిణాత్యరాష్ట్రములవారు తమ అధ్యక్షునిగ నెన్నుకొని నీగ్రోల బానిసలుగ నుంచుకొనుపద్ధతిని సమర్థించుచు రాజ్యాంగవిధానము నేర్పఱచిరి.

ఆంగ్లరాజ్యముతో యుద్ధముచేసి స్వాతంత్ర్య మొందినప్పటినుండి వృద్ధిచెందిన ఆ అమెరికనులకు అబ్రహాంలింకను తగు ప్రతినిధి. బాల్యదశయందతడు పడమటివైపుపోయిన వలస ప్రవాహామునందు పాల్గొనెను; 1809-లో కెంటికీలో జనన మొంది బాల్యమందు 'ఇండియానా'కు, అటుపైని 'ఇల్లినాయి'కి గొంపోబడెను. 'ఇండియానా' కు అడవిప్రాంతమున అతనియిల్లు వనమధ్యమందు దూలములో దొలిచిన కోటరమువలె మోటుగ నుండెడిది; అతని బడిచదువుకూడ చాల తక్కువయే; కాని అతనితల్లి బాల్యమందే చదువునేర్పి, పఠనమం దాతని కత్యాసక్తి గల్గించెను. 17 యేండ్లప్రాయమునాటి కతడు కుస్తీలు పరుగెత్తుట మొదలగు వ్యాయామములం దారితేరెను; కొంతకాల మొక సరుకులదుకాణమున గుమస్తాయై, అటుపైని త్రాగు

బోతగు నొక భాగస్వామితో గలసి వ్యాపారముచేసి ఋణ ములపా లయ్యెను. దానిని 15 ఏండ్లకుగూడ బూర్తిగ దీర్పలేక పోయెను. 1834-లో నతడు, 25 ఏండ్లప్రాయమందే ఇల్లినాయి రాష్ట్రమునుండి ప్రతినిధిసభ కెన్నుకొనబడెను. ఇల్లినాయి వాస్తవ్యుడును సెనేటరు నగు 'డగ్లసు' కాంగ్రెసుమహాసభలో ధాస్యపద్ధతిపక్షనాయకుడగుటచే ఈదాస్యసమస్య ఇల్లినాయిలో జెలరేగెను. డగ్లసు చాల శక్తిప్రఖ్యాతులుగలవాడు. లింకను కొంతకాలము వ్యాసములందు, వాదోపన్యాసములందు, దాస్య పద్ధతిని ప్రతిఘటించి, క్రమముగ నతనితో సముడై, అజేయుడగు ప్రత్యర్థి యాయెను. తుదకు వారితగవులు 1860-లో అధ్యక్ష పదవిపోటీలో పెరిగెను; 4-వ మార్చి 1861-వ తేదీని లింకనే అధ్యక్షుడయ్యెను. అంతట వాషింగ్టనునుండి పాలించు సంయుక్తప్రభుత్వమునుండి దక్షిణరాష్ట్రములు విడిపోయి, యుద్ధప్రయత్నముల జేయుచుండెను.

అమెరికాలో నీయంతర్యుద్ధము వేలతో నారంభమై లక్షలకొలది సైనికులకు పెరిగెను.* 'ఫెడరలు' అనగా సమిష్టి ప్రభుత్వపుసైన్యము పదిలక్షలకు మించెను. తూర్పుసముద్రము నూతనమెక్సికోలనడుమ విశాలప్రదేశమంతటను యుద్ధములు జరిగెను. వాషింగ్టన్, రిచ్మండునగరములపై వారిదృష్టి నిల్చెను.

---

* కొన్నిరాజ్యములు కొంతవరకు తమ వ్యక్త్యధికారముల నిలుపు కొనుచు జాతీయవిషయములకును అంతర్జాతీయములకును సర్వాధికారముగల కేంద్రరాజ్యమును తమ ప్రతినిధుల సమిష్టివర్గములద్వారా నిర్మించుకొనుచో, అసమిష్టిప్రభుత్వము 'ఫెడరలు' ప్రభుత్వ మనబడును. ఇప్పుడు మనదేశము కేర్పడిన రాజ్యాంగ మట్టిదే.

అనుపాయయుద్ధము టెన్నెసీ, వర్జీనియాల నగవనములలో నుండియు మిసిసిపీనది వెంటను జరిగెను. దానిని వివరింప నిట వీలులేదు. అనేకులు హతులైరి; దేశమందు భయంకరనాశము కలిగెను; దాడి కెదురుదాడిజరిగెను; ఆశపోయి, నిరాశకలిగెను; మరల ఆశ కలిగి క్షీణించెను; కొన్నిసమయములందు వాషింగ్టను పురము శత్రుహస్తముల జిక్కునట్లుండెను. ఇంతలో ఫెడరలు సేనలు దక్షిణకేంద్రమగు రిచ్మండుపైకి వ్యాపించెను; దాక్షిణాత్యుల సేనానియగు 'లీ' అతిసమర్థుడు; కాని వారికి తగుసంఖ్య సౌకర్యములు లేకుండెను. సంయుక్తపక్షీయుల సేనాను లసమర్థులు. వారు తీసివేయబడి, క్రొత్తసేనానులు నియమింపబడు చుండిరి. తుదకు 'షర్మను' 'గ్రాంటు'ల నాయకత్వమున సంయుక్త పక్షమువారు విచ్ఛిన్నులైయున్న దాక్షిణాత్యుల జయించిరి. 1864 అక్టోబరులో షర్మనుక్రింద నొక ఫెడరలుసైన్యము దాక్షిణాత్యుల వామభాగము భేదించి, టెన్నెస్సీనుండి జార్జియా గుండ తీరమువరకువెళ్లి, అటనుండి కెరొలినాగుండ వెనుకనుండి దాక్షిణాత్యసైన్యములపై బడెను. ఇంతలో రిచ్మండు సమీపమున వెనుకనుండి షర్మను చుట్టివచ్చువరకును దాక్షిణాత్యుల సేనతో గ్రాంటు పోరుచుండెను. 1865 ఏప్రిలు 9-వ తేదీని 'లీ' తనసైన్యముతో 'ఎప్స మెటక్స్' న్యాయభవనమునొద్ద పూర్తిగ లొంగిపోయెను. ఒకనెలలో మిగిలిన ప్రత్యర్థిసేన లన్నియు పోరు చాలించెను. అంతట దాక్షిణాత్యుల ప్రత్యేక సంఘ మంతరించెను.

ఈనాలుగేండ్లయుద్ధముచే సంయుక్తరాష్ట్ర జనుల కమితమగు ప్రజానాశము, మనోవ్యథ కల్గెను. అనేకులకు ఆయా

రాష్ట్రముల స్వాతంత్ర్యమే యిష్టముగ నుండెను. మొత్తము మీద దక్షిణజిల్లాలపై నుత్తరప్రాంతీయులు దాస్యవిమోచనను నిర్బంధముగ మోపిన ట్లయ్యెను. సరిహద్దురాష్ట్రములలో సోదరులు తండ్రి కుమారులు చెరియొకకక్షకుజెంది రణరంగమందెదురైరి. ఉత్తరజనులు తమ ఆశయము ధర్మ మని విశ్వసించిరి; ప్రజలలో ననేకుల కది సవ్యముగ తోపలేదు. కాని లింకను కేమాత్రము సందేహము లేకుండెను. ఆగడబిడలో నతడు సద్భావముతో అమెరికనుల సంఘీభావముకై పాటుపడుచుండెను. దాస్యపద్ధతి కతడు విరోధియే; ఐనను దానినంత ముఖ్యముగ దలపలేదు; అతని ముఖ్యాశయము సంయుక్తరాష్ట్రములు నిత్యము తగవులాడు రెండుతునకలు కాకూడదనియే.

యుద్ధారంభమున కాంగ్రెసుఫెడరలు సేనానులు దాస్యవిమోచనపద్ధతి తీవ్రముగ జరుపగా, లింకను వ్యతిరేకించి వారి యుద్రేకమును తగ్గించెను. క్రమముగా యజమానులకు పరిహారము లిచ్చియే స్వేచ్ఛ కలిగింపు మని యతడు కోరెను. 1865 జనవరిలో కాంగ్రెసువారు బానిసపద్ధతి యంతరించునట్లు రాజ్యాంగమున మార్పుచేసిరి. రాష్ట్రము లీనూతనప్రతిపాదనము నామోదింపకముందే యుద్ధము సమాప్తమాయెను.

1862-1863 లలో యుద్ధము సాగుచుండ, మొదటి యుత్సాహము ఉద్రేకము తగ్గి, అమెరికనులు యుద్ధబాధలను పూర్తిగా గ్రహించిరి. పరాజయభీతులు, ద్రోహులు, ఉద్యోగభ్రష్టసేనానులు, కక్షస్పర్ధ గల రాజకీయవేత్తలు, నిరుత్సాహసైనికులు, అధ్యక్షునిచుట్టు జేరిరి. రిచ్మండువద్ద జెఫర్సనుడేవిసు స్థితియు నిట్లే యుండియుండును. ఇంగ్లీషుప్రభుత్వమువా

రక్రమముగా దాక్షిణాత్యపక్షమువారికి మూడు యుద్ధనౌకల యోధసహితముగ సాయ మిచ్చిరి; వాటిలో "అలబామా" పేరింకను జ్ఞప్తిలో నున్నదే; ఇది సంయుక్తరాష్ట్రపు నౌకలను సముద్రమునుండి తరిమివేసెను. మెక్సికోలో ఫ్రెంచిసైన్యములు మన్రోసిద్ధాంతమును మూలద్రోయుచుండిరి. యుద్ధము నాపు చేయుటకును, యుద్ధసమస్య నటుంచి ఉభయసైన్యములను మెక్సికోలోని ఫ్రెంచివారిపై మరల్చుటకును, రిచ్మండునుండి కుయుక్తిసూచనలు వచ్చెను. కాని లింకనుమాత్రము సంయుక్త రాష్ట్రాధికారము స్థిరపడువరకును అట్టి సందేశముల వినదలప లేదు. అమెరికను లందరొకేజాతియైనపు డట్టిపనుల జేయ వచ్చును; కాని రెండుజాతులుగా విడియున్నంతకాలము చేయ వీలులేదని యతని భావము.

శ్రమకరమై చాలకాలము సందిగ్ధమైయుండిన యీ యుద్ధకాలమున, లింకను తనవిధి మన్నించి ధైర్యముతో సంయుక్తరాష్ట్రము నేకముగ జేసెను. కొన్నిసమయములందు చేయునది లేకున్నను నిశ్చలుడై, హాసముతో విశ్రాంతినొందు చుండెను. సంయుక్తరాష్ట్రము జయమొంది రిచ్మండు పట్టువడిన మరునాడే లింక నక్కడకు వెళ్ళి 'లీ' పట్టువడినసంగతి విని, అక్కడనుండి వాషింగ్టనుకు తిరుగ వెళ్ళి, ఏప్రిలు 11-వ తేదీని తన తుదిబహిరంగోపన్యాసము నిచ్చెను. ఓడినరాష్ట్రముల కిష్టమై అచ్చో విశ్వాసము కల్గించు ప్రభుత్వమును స్థాపించి పునర్నిర్మాణ మొనర్చుట యతనియుద్దేశము. ఏప్రిలు 14-వ తేదీ సాయం కాలము వాషింగ్టనులోని ఫోర్డునాటకశాలకు పోయి అతడు రంగమువంక చూచుచుండెను; రహస్యముగ నాతనివెనుక

అతని విరోధియగు 'బూత్' అనునటుడు చేరి తలపై తుపాకితో ప్రేల్చెను; తత్క్షణమే లింకను మరణించెను. కాని లింకను కార్యము నెఱవేరినది. 'దేశైక్యము' రక్షింపబడెను.

ఆయుద్ధారంభమున పసిఫిక్ ప్రాంతముకు రైలుమార్గము లేదు. అటుపైని రైలుమార్గములు సంయుక్తరాష్ట్రముల విశాలప్రదేశమంతయు దట్టముగ నల్లుకొని, భౌతికముగను మానసికముగను అభేద్యమగు ఏకరాజ్యముగ మార్చివేసెను. చీనాలోని సామాన్యజనులు చదువునేర్చుకొనువరకును ప్రపంచమంతటిలో నిజమగు గొప్పజాతి యిదియే. *

* నీగ్రోల శ్రమవల్లనే, అమెరికా ప్రత్తిపంటవ్యాపారాలతో శ్రీమంతమైనది. ఇట్లు నీగ్రోల కమెరికాలో దాస్యవిముక్తి జరిగినను, వారిబాధలు పూర్తిగా తొలగలేదు. సాంఘికముగా వారి కిప్పటికిని అనేకనిర్బంధములు బాధలు నున్నవి ఆ దక్షిణరాష్ట్రముల తెల్లవారు మొత్తముమీద నీగ్రోల స్వాతంత్ర్యమునకు వ్యతిరేకు లగుటచే తరువాతగూడ వారి యభివృద్ధికి చాల నాటంకముల గల్గించిరి. అయినను అమెరికాలో నీగ్రోలు స్వయంకృషిచే విద్యావంతులై శ్రమజీవులై ప్రగతిశీలురై యున్నారు. అప్పటి నీగ్రోల స్థితికి మనదేశపు మాలమాదిగలతో కొంతపోలికకలదు. మన మాలలవిషయమున మనము చేయని 'లించింగ్' మొదలగు దౌర్జన్యముల నమెరికను లొకప్పుడు నీగ్రోలపై జరుపుట కలదు; కాని వారు నీగ్రోలను తమ గ్రామవీధులలోనికిని సమీపమునకును రానీయకుండుట, అస్పృశ్యతకు మతకారణము నారోపించుట లేదు. భారతీయులు మొదలగు ప్రాచ్యదేశీయుల కచ్చట పౌరత్వపుహక్కులు కార్మికులుగా నుండు హక్కులు నిరాకరించుటలోగూడ అమెరికనులు జాతివిభేదములను స్వార్థపరతను గమనించుచున్నారు.

మున్ముందు సంయుక్తరాష్ట్రముల కొక చీనాయే సాటి కాగల్గునని వెల్సుగారిందు సూచించిరి. కాని అంతకుముందే రష్యా అమెరికనులతో సమాన బలము కావచ్చును. అమెరికనులకన్న చీనులవలె భారతీయులును చాలనెక్కువ మందియే కలరు. కాని భారతీయులు అంతవిద్యావంతులై స్వతంత్రులై అంత యుచ్చదశకువచ్చుట దుర్ఘటమని వెల్సుగారికి తోచియుండునేమో!

యూరపియను యువకులు వలసవచ్చి సాహసోత్సాహములతో యంత్రపరికరముల వృద్ధిచేయుటవల్లను, నీగ్రోలశ్రమవల్లను అమెరికాలో భౌతికనాగరికత వేగముగ వృద్ధియైనది. జనసంఖ్య హెచ్చినది. అమెరికా సంపత్తు మహాయుద్ధము తరువాత విపరీతముగ హెచ్చి న్యూయార్కు ఆర్థికముగ లండనుస్థాన మాక్రమించినది. కాని 1929 నుండి అమెరికాలో ఆర్థికదుస్థితి యేర్పడినది. కొన్ని బ్యాంకులు దివాలాతీసినవి. బ్రిటిషు ఫ్రెంచి వగైరా ప్రభుత్వములవా రమెరికనుప్రభుత్వము కీయవలసిన యుద్ధఋణము నీయమనిరి. అమెరికాలో పరిశ్రమలకును కష్టస్థితి గల్గినది. ఇప్పు డక్కడ సుమారు కోటిమంది నిరుద్యోగు లున్నారు. ప్రస్తుతాధ్యక్షుడగు 'రూజ్వెల్టు' కృషివలన కొంతవరకు బాధలు తగ్గినను, ఇప్పు డమెరికా సంయుక్తరాష్ట్రము అంత నాకర్షకముగ లేదు.

# 61. యూరపులో జర్మనీ ప్రాబల్యము

ఫ్రెంచివిప్లవము నెపోలియను యుద్ధకల్లోలము అంతరించగానే, యూరపున మరల కొంతకాలము శాంతి కలిగెను. అప్పటికి పదేండ్ల పూర్వపు రాజ్యపరిస్థితులు మరల నేర్పడెను. 19-వ శతాబ్దపు మధ్యవరకు ఉక్కు రైలుమార్గములు స్టీమర్లు వగైరాల క్రొత్తసదుపాయములచే రాజ్యాంగములందంతగా మార్పు గలుగలేదు. పట్టణ పరిశ్రమలవలన సాంఘికస్పర్ధలధికమాయెను. ఫ్రాంసు చాల యలజడితోనుండెను. 1830 విప్లవము తరువాత మరల 1848 లో మరియొక విప్లవము గలిగెను. నెపోలియన్ బోనపార్టు మేనల్లుడగు 3-వ నెపోలియనాయెట అధ్యక్షుడై, 1852-లో చక్రవర్తి యయ్యెను.

అతడు పారిసు పునర్నిర్మాణముకు పూనుకొని, 17-వ శతాబ్దమునాటి అపరిశుభ్రమగు ఆ యిరుకుబస్తిని ఈనాటి చలువరాతి విశాల సుందర నగరముగ మార్చెను. యావత్తు ఫ్రాంసుపునరుద్ధరణము మొదలిడి దానిని శ్రీమంతమగు ఆధునిక సామ్రాజ్యముగ దయారుచేసెను. కాని 17, 18-వ శతాబ్దములలో యూరపులో వ్యర్థయుద్ధము గల్గించిన రాజ్యాధికారపుస్పర్ధల మరల తీసికొనిరానారంభించెను. రష్యాలో 'జార'గు మొదటి నికలసు (1825—1856) కూడ దక్షిణమున కాన్స్టాంటినోపిలుపై కన్నుంచి, టర్కీపైకి తీవ్రముగ వ్యాపించుచుండెను.

ఈ యర్ధశతాబ్దము పోగానే యూరపున మరల యుద్ధముల శకము వచ్చెను. అవి ముఖ్యముగా వివిధదేశబలములు సమానమగుటకును, కొన్నియెడల నధికారప్రాబల్యముకొరకునై జరిగెను. టర్కీకి తోడుగ ఇంగ్లండు ఫ్రాంసు సర్డీనియాలు (రష్యాలోని దక్షిణపు ద్వీపకల్పమగు క్రిమియాయుద్ధమున) రష్యాపైకి వెడలెను. ఇటలీ సహాయముతో ప్రష్యాయు ఆస్ట్రియాయు జర్మనీలో నాయకత్వముకై కలహించెను. ఫ్రాంసు సేవాయిజిల్లాను పోగొట్టుకొనెను. కాని, ఉత్తరఇటలీని ఆస్ట్రియాపాలనమునుండి విడిపించెను. క్రమముగ ఇటలీ యేకరాజ్యమై, ఐకమత్యమును బొందెను. అప్పుడు 3-వ నెపోలియను, అమెరికాలోని అంతర్యుద్ధకాలమున మెక్సికోను జయింప యత్నించెను. అచ్చటి 'మాక్సిమిలియ'ను నామమాత్రుని రాజుగా నిలవబెట్టెను. కాని ఇంతలో త్వరలోనే సంయుక్తరాష్ట్రము యుద్ధసన్నద్ధముకాగానే ఆక్రొత్తరాజును వానికర్మమునకు వదలివేసెను; మెక్సికను లామాక్సిమిలియనును కాల్చివేసిరి.

యూరపులో ప్రాబల్యముకై ప్రష్యా ఫ్రాంసులు చిరకాలమునుండి తగువుపడుచు 1870-లో యుద్ధమునకు దిగెను. ప్రష్యా చిరకాలముక్రిందనే ఈసమస్యను గమనించి, అందుకు తయారయ్యెను. ఆర్థికదుర్నీతిచే క్షీణించియున్న ఫ్రెంచిరాజ్యమతిశీఘ్రముగ అద్భుతపరాజయ మొందెను. జర్మనులు 1870 ఆగస్టులో ఫ్రాంసుపై దండువెడలిరి; సెప్టెంబరులో 'సెడను' వద్ద ఫ్రెంచిచక్రవర్తి నడుపుచున్న ఒక పెద్దసేన లొంగిపోయెను.

అక్టోబరులో 'మెట్జ్' వద్ద మరియొకసైన్య మోడెను. 1871 జనవరిలో రాజధాని ముట్టడి పోరాటము జరిగి, పారిసు గూడ జర్మనుల హస్తగతమాయెను. ఫ్రెంచివారు 'అల్సేసు లోరైను' పరగణాలను జర్మనుల కిచ్చి, 'ఫ్రాంకుఫర్టు'వద్ద రాజీపడిరి. ఆస్ట్రియాగాక మిగిలిన జర్మనీయంతయు నొకేమహారాజ్యముగ నేర్పడెను. ప్రష్యారాజు జర్మనుచక్రవర్తి యాయెను.

అప్పటినుండి 43 ఏండ్లు యూరపుఖండమున జర్మనీయే ముఖ్యరాజ్యముగ నుండెను. 1877-78 లో మరల రష్యా టర్కీల యుద్ధము జరిగి బాల్కనులలో కొంతమార్పు కలిగెను; మిగిలిన యూరపియను సరిహద్దులు 30 యేండ్లట్లే యుండెను.



# 62. రైలు స్టీమర్ల నూతన ఖండాంతర రాజ్యములు

18-వ శతాబ్దిచివరను సామ్రాజ్యములు విచ్ఛిన్నము లాయెను; జిగీషులకు పరాభవ మగుచుండెను. బ్రిటను స్పెయిను రాజ్యముల కమెరికాలోని కాలనీలతో దూరప్రయాణమున శ్రమాలస్యములు గల్గుచుండుటచే రాకపోకలు దుర్ఘట మయ్యెను. ఆ కాలనీలు స్వతంత్రజాతులై వాటికి ప్రత్యేక భావాశయములు నూత్నపద్ధతియు నేర్పడెను. వృద్ధియైనకొలది ఆ వలసరాజ్యములకు మాతృదేశమువారికి మధ్య అప్పటి నౌకాయానప్రబంధము చాలకపోయెను. కనడాలో మహారణ్య మధ్యపు ఫ్రెంచి వర్తకస్థానములును ఇండియాలో గొప్ప విజాతీయులమధ్య బ్రిటిషువారి వర్తకసంస్థలు మాత్రము తమ రక్షణసదుపాయలాభములకై యత్నించుచు అందుకు తమ మాతృదేశములపై నాధారపడెను. 19-వ శతాబ్దారంభపు స్థితినిబట్టి ఆఖండాంతర రాజ్యములకంతేపరిమితియని చాలమందికితోచెను. 18-వ శతాబ్దిమధ్యను ఖండాంతరములందు బయలుదేరిన గొప్ప యూరపియను సామ్రాజ్యములన్నియు 1820 నాటికి చాల చిన్నవిగ నుండెను. రష్యనులుమాత్రము పూర్వమువలె ఆసియాలో నడ్డుగ వ్యాపించిరి.

1815 నాటికి బ్రిటిషుసామ్రాజ్యమం దున్నవి:—కనడాలో స్వల్పసంఖ్యాకులు గల సముద్రనదీసరః ప్రాంతములు హడ్స

నుజే కంపెనీవారి ఉన్ని వర్తకస్థానములు తప్ప ఇతర నివాసము లేర్పడని అరణ్యప్రాంతములును, హిందూదేశములో ఈస్టు ఇండియాకంపెనీ పాలనలోనున్న ద్వీపకల్పములో 3-వ భాగమును, దక్షిణాఫ్రికాలో నల్లజాతులును విప్లవకారులగు డచ్చివారు నివసించు 'గుడ్‌హోప్' అగ్రపరిసరతీరప్రాంతములును, పశ్చిమఆఫ్రికాతీరమున గొన్ని వర్తకస్థానములును, జిబ్రాల్టరు పాషాణమును, మాల్టాద్వీపము, జమైకా, వెస్టిండీసులోని కొన్ని జానిసకార్మికుల స్థానములు, దక్షిణఅమెరికాలోని బ్రిటిషు గయానా, ఆవలివైపున బందీల బంపుట కేర్పడిన ఆస్ట్రేలియాకు దక్షిణమందున్న టాస్మేనియాద్వీపము, ఆస్ట్రేలియాలోని 'బొటనీబే' అను అఖాతస్థానమును మాత్రము స్పెయినువారు క్యూబాను ఫిలిప్పైనుదీవులలో గొన్నిస్థానములను నిలుపుకొనిరి. పోర్చుగలుకు ఆఫ్రికాలో ప్రాచీనరాజ్యశేషము కొంతయుండెను. తూర్పున ఇండియాదీవులలో ననేకములు, డచ్చిగయానా, డెన్మార్కు, వెస్టిండీసులో ఒకటి రెండుదీవులు, హాలండుకు వశమైయుండెను. ఫ్రాంసుకు ఒకటిరెండు వెస్టిండీసు దీవులు ఫ్రెంచిగయానాయు ఉండెను. ప్రపంచమున యూరపు రాజ్యముల కవసరమైనది, వారు సంపాదింపబోవునది ఇంతే యని తోచెను. ఒక్క ఈస్టిండియాకంపెనీమాత్రము వ్యాపకధోరణిలో నుండెను.

తక్కినయూరపువారు నెపోలియను యుద్ధములలో నిమగ్నులై యుండినపుడు తూర్పున ఈస్టిండియాకంపెనీవారనేకగవర్నరుజనరలులక్రింద ఇండియాలో నంతకుపూర్వము త్తరమునుండి వచ్చిన తురుష్కాది దండయాత్రికుల పద్ధతినే

యవలంబించిరి. వియన్నాసంధి యనంతరము, ఆకంపెనీవారు పన్నులు విధించుచు, యుద్ధములు చేయుచు, ఆసియాలోని యితర ప్రభుత్వములకు ప్రతినిధుల నంపుచు కొంతయధికారము చలాయించు రాజ్యముగ నేర్పడిరి. వారు భారతదేశపు ద్రవ్యమును విశేషముగా తమ పశ్చిమదేశమునకుబంపు ధోరణి మాత్రము మానలేదు.

కొంతకాల మొకరాజునకు మరికొంతకాల మింకొకరికి సహాయకులై, ఈకంపెనీవారు తుదకందరికన్న ప్రబలులై, సర్వాధిపత్యమునకు వచ్చిరి. దాని నిట వివరింపవలసి లేదు. అస్సాం సింధు అయోధ్యరాష్ట్రములకును వీరిబలము వ్యాపించెను. ఈనాటి విద్యార్థులకు పరిచితమగురీతిని, సామంతరాజ్యముల అతుకులతో వానినన్నిటిని చుట్టుముట్టి బ్రిటిషుఅధికారములో నున్న పెద్దరాష్ట్రములుగల హిందూదేశ బ్రిటిషురాజ్యపుఆకార మేర్పడజొచ్చెను. అంత నచట దేశీయసిపాయీల తీవ్రవిప్లవము జరిగి, తరువాత 1858-లో ఈకంపెనీవారు ఆసామ్రాజ్యమును బ్రిటిషుప్రభుత్వమువారు లాగుకొనిరి. "హిందూదేశ ప్రభుత్వపు యుక్తపరిపాలన"కై పార్లమెంటులో శాసన మేర్పడి అందుచే గవర్నరుజనరలు 'వైస్రాయి' (=రాజప్రతినిధి)గ మారెను. కంపెనీవారికి బదులు బ్రిటిషుపార్లమెంటుకు బాధ్యుడగు బ్రిటిషుపాలకవర్గపు భారతమంత్రి యేర్పడెను. 1877-లో బీకన్సుఫీల్డు ప్రభువు విక్టోరియారాణిని హిందూదేశచక్రవర్తినిగా బ్రకటించి సామ్రాజ్యతత్వమును బూర్తిచేసెను.

భారతదేశము ఇంగ్లండు ఇప్పుడీవిచిత్రరీతిని కలుపబడి యున్నవి. హిందూదేశపాలన మిప్పటికిని మొగలాయిసామ్రాజ్య

పద్ధతినే యున్నది. కాని పూర్వపు మొగలుచక్రవర్తి స్థానమును రాజాలంకృతమగు బ్రిటిషు ప్రజాసత్తాకరాజ్య మాక్రమించెను. హిందూదేశమున వ్యక్తినిరంకుశత లేదు. కాని ఆ పాలనమంతయు నిరంకుశముగనే యున్నది. దానిపాలనలో నిరంకుశరాజత్వపు లోపములు, ప్రజారాజ్యోద్యోగుల వ్యక్తి లోపము, బాధ్యతాశూన్యతయు చేరియున్నవి. భారతీయుడు తనబాధల జెప్పుకో దలచిన తాను దర్శింపదగిన రా జెవరును గన్పింపరు. అందుల చక్రవర్తి యొకస్వప్నమూర్తి. ఆ భారతీయుడు ఇంగ్లండులో కరపత్రముల బంచిపెట్టుటయో లేక బ్రిటిషువారి కామన్సుసభలో ప్రశ్న లడిగించుటో జరిపింపవలెను. పార్లమెంటు బ్రిటిషుకార్యములలో నిమగ్నమైయున్న కాలదిని ఇండియావిషయమున దృష్టితగ్గిపోయి హిందూదేశము అచటి యధికారవర్గపు కరుణపై నాధారపడియుండుచున్నది.

రైలుమార్గములు స్టీమరులు విరివిగా వ్యాపించువరకును ఇండియాలో దప్ప నింకెక్కడను యూరపియను సామ్రాజ్యము లధికముగా వ్యాపింపలేదు. బ్రిటనులోని ఒక తెగ రాజ్యాంగవేత్తలు ఖండాంతరములో ఆస్తులు సంపాదన రాజ్యముల సత్పరిపాలనకు హానికరము లని యెంచిరి. ఆస్ట్రేలియాలో ఇంగ్లీషువారివ్యాప్తి మొదట మందముగ నుండెను; కాని 1842-లో విలువగల రాగిగనులును, 1851-లో బంగారు గనులును అచ్చట దొరకినంతనే దానికి క్రొత్తప్రాముఖ్యము వచ్చెను. ప్రయాణసౌకర్యవృద్ధిచే, ఆస్ట్రేలియాఁడన్ని యూరపు తేబడి, అందు విశేషముగ అమ్మబడెను. 1849 వరకు, కనడాకూడ ఎక్కువయభివృద్ధి చెందలేదు. అచ్చటి ఫ్రెంచి

బ్రిటిషు నివాసులకు మధ్య తగవులు, అనేక విప్లవములు కలిగెను. తుదకు 1867-లో కనడాలో ఫెడరలుడొమినియను (=సంయుక్తాధినివేశము) అను విధానమేర్పడి, కల్లోల మణగెను. కనడావారి దృక్పథమును మార్చినది రైలుమార్గము. అందుచే సంయుక్తరాజ్యములోవలె కనడావారును పశ్చిమదిశకు విరివిగ వ్యాపించి ధాన్యాదివస్తువులను యూరపుకు సులభముగ బంపి యమ్ముకొనవీలుకలిగెను; వారు విరివిగ వేగముగ పెరుగుచున్నను భాషలోను ఆదర్శములోను అభిమానమందును ఒకే జాతిగ నుండగల్గిరి. రైలుమార్గములు స్టీమర్లు తంతిమార్గము కాలనీల అభివృద్ధిపరిస్థితులన్నిటిని మార్చివేసెను.

1840-కి పూర్వమే, న్యూజీలండులో ఇంగ్లీషువారి వలస లేర్పడి ఆదీవపసౌకర్యముల నుపయోగించుకొనుటకు 'న్యూజీలండు భూమికంపెనీ' ఒకటియేర్పరుపబడెను. 1840-లో న్యూజీలండుకూడ బ్రిటిషువారి కాలనీలరాజ్యములందు జేర్పబడెను.

బ్రిటిషురాజ్యము లన్నిటిలో ముందుగా ఈ క్రొత్త ప్రయాణసౌకర్యములవలని ఆర్థికలాభములను కనడా పొందెను. ఇంతలో దక్షిణఅమెరికాలోని రిపబ్లికులు (ముఖ్యముగా 'అర్జంటైను') పశువులవర్తకమందును, కాఫీపంటయందును యూరపుతో ప్రయాణసౌకర్యలాభముల గమనింపజొచ్చిరి. ఇంతకుపూర్వము ఈ నిర్జనవనప్రదేశముల బంగారము, ఇతర లోహములు, పచారిదినుసులు, దంతములు, బానిసలవ్యాపారము, యూరపియనురాజ్యముల నాకర్షించెను. 19-వ శతాబ్దము చివరకు యూరపులో జనాభా పెరుగుటచే ఆ ప్రభుత్వ

ములు ముఖ్యాహారపదార్థములకై ఇతర ప్రాంతములపై నాధారపడెను. దీనికితోడు పెంపొందుచున్న వైజ్ఞానిక పరిశ్రమ పద్ధతులచే ఆపరిశ్రమలలో వాడుటకై క్రొత్తముడివస్తువులకు క్రొవ్వు, మైనము, రబ్బరు, మొదలగు ఇదివరలో లెక్కచేయ బడని పదార్థములకును గిరాకి గలిగెను. బ్రిటను, హాలండు, పోర్చుగలువారు తమపాలనలోని రాజ్యములందు ఉష్ణ సమశీతోష్ణదేశముల వస్తువు లుండుటచే అత్యధికమగు వర్తక లాభమును బడయుచుండిరి. 1871 తరువాత జర్మనీ, ఫ్రాన్సు, కొంతకాలమునకు ఇటలీయు ఇతరు లాక్రమించని ముడివస్తువులు గల ప్రదేశములకొరకును ఆధునికనాగరికత వ్యాపింపజేసి లాభము పొంద వీలగు ప్రాచ్యదేశములకొరకును, వెదుక జొచ్చిరి.

మన్రోసిద్ధాంత మడ్డుపఱచిన అమెరికాలో తప్ప తక్కిన ప్రపంచమంతటను రాజకీయరక్షణ లేనిప్రదేశములకై యూరపి యనులలో సంఘర్షము బయలుదేరెను.

యూరపువారికి తమసమీపమం దున్న ఆఫ్రికా అప్ప టికి బాగుగ తెలియనిదైనను అనేకావకాశములు గలదై యుండెను. 1850 వర కది అంధకారబంధురమగు విచిత్రఖండ ముగ తోచెను; ఈజిప్టుతీరదేశము మాత్రము తెలిసియుండెను. ఆఫ్రికాలోనికి మొదట చొచ్చుకొని పరిశోధించివచ్చిన ధీరా న్వేషకు లాశ్చర్యకథల జెప్పుచుండిరి. వారివెనుక వెళ్ళిన రాజ కీయప్రతినిధులు పాలకులు వర్తకులు వలసజనులు వైజ్ఞానికులు కొన్నిటిని తెల్పిరి. అతివిచిత్రమగు మఱుగుజ్జులబోలు నర జాతులు, 'ఒకాపీ' వంటి నూతన మృగములు, అద్భుత ఫల

పుష్పములు, క్రిమికీటకములు, భయంకరరోగములు, దిగ్భ్రమ గొలుపు గహనపర్వతదృశ్యములు, భూమధ్యపు విశాల సముద్రములు, మహానదులు, సెలయేళ్లు వానితో ఆఫ్రికా వేరుప్రపంచమై యుండెను. ఇచట జింబాబ్వేయొద్ద విస్తృతమగు నొక ప్రాచీననాగరికత దక్షిణముగా వ్యాపించినచిహ్నములున్నవి. ఈ నూతనప్రపంచమునకు యూరపియనులు వచ్చిరి. అప్పటికే అచట బానిసవర్తకము చేయు అరబ్బులు తుపాకుల ధరించి యుండిరి. అక్కడి దేశీయులగు నీగ్రోలు అయోమయస్థితిలో ఉండిరి.

1900 నాటికి, అనగా అర్ధశతాబ్దములో, యూరపులోని ప్రభుత్వములు ఆఫ్రికానంతను అన్వేషించి, పటముగీచి, పరిశోధించి, అంచనాలువేసి, పంచుకొనిరి; ఈ తగవులలో అచటి దేశీయుల క్షేమ మెంతమాత్రమును లక్ష్యపెట్టరైరి; అరబ్బు బానిసవర్తకులను తొలగింపకున్నను, వారిని నిరోధించిరి. కాని బెల్జియను కాంగో అడవులలో దేశీయజాతులను పీడించి తద్ద్వారా తయారుచేయించి రబ్బరుకై, అనుభవములేని యూరపియను ఉద్యోగులు దేశీయుల బాధించి, ఘోరదౌర్జన్యము లొనరించిరి; ఈవిషయమున, ఏయూరపియను ప్రభుత్వమును నిర్దోషి కాదు.

బ్రిటిషువారు 1883 లో ఈజిప్టును వశపరచుకొనిరి. ఈజిప్టు టర్కీవారి సామ్రాజ్యమందు జేరియున్నను, బ్రిటిషువారీజిప్టును వదలలేదు. 1898 లో, 'కలనల్ మార్చండ'ను నొకడు పశ్చిమతీరమునుండి, మధ్యఆఫ్రికా దాటి 'ఫషోడా' యొద్ద ఉత్తరనైలు నాక్రమింపబోయెను; అందుచే నాతగవు

ఫ్రాన్సు బ్రిటనులను యుద్ధమువరకు లాగెను. వీని నిక్కడ వివరింప స్థలము లేదు.

ప్రథమమున బ్రిటిషుప్రభుత్వము దక్షిణాఫ్రికాలోని 'బోయర్లు' అను డచ్చినివాసులను ఆరెంజినదిరాజ్యములోను ట్రాన్సువాలులోను స్వతంత్రప్రజాస్వామ్యముల స్థాపించుకొన నిచ్చెను. కాని 1877-లో విచారించి ట్రాన్స్వాలు ప్రజాతంత్ర రాజ్యమును బ్రిటిషుసామ్రాజ్యమున గలుపుకొనెను. ట్రాన్స్వాలు బోయర్లు పోరాడి, మజూబాపర్వతయుద్ధానంతరము (1881) స్వాతంత్ర్యము సంపాదించిరి. 1899-లో నా రెండు రిపబ్లికుల తోను బ్రిటనుకు యుద్ధము కలిగి, మూడేండ్లు బ్రిషువారి కపార వ్యయము కల్గి తుద కా రెండురాజ్యములును బ్రిటనుకు లొంగి పోయెను.

అవి చాలకాల మిట్లు లోబడియుండలేదు. బ్రిటనులో కొత్తయెన్నికల తరువాత 1907-లో బ్రిటిషు లిబరలుపక్షము వారు దక్షిణాఫ్రికాసమస్యను చర్చించిరి. ఈ పూర్వపు ప్రజా తంత్రకములుగూడ స్వతంత్రములై, కేప్ కాలనీ నేటాలులతో బాటు మనస్ఫూర్తిగా దక్షిణాఫ్రికారాష్ట్రముల 'యూని యను' (సమితి) లో జేరి బ్రిటిషుప్రభుత్వముక్రింద తమ్ము తామే పాలించుకొనెడి ఒకే 'ప్రజాతంత్రకము'గా నేర్పడెను.

25- వత్సరములలో ఆఫ్రికావిభజన మిట్లు పూర్తి యయ్యెను. ఇందు పశ్చిమతీరమున స్వాతంత్ర్య మొందిన బానిసల స్థానమగు 'లైబీరియా', ముసల్మానుసుల్తాను అధిపత్యము క్రింద నున్న 'మొరాకో', 1896-లో అడోవాయుద్ధమున ఇటలీతో పోరి స్వాతంత్ర్యము నిలుపుకొన్న ప్రాచీన విచిత్ర దేశమగు

అబిసీనియా ఈమూడు చిన్న దేశములుమాత్ర మా యాక్ర మణలో బడక మిగిలినవి*

* 'వెస్టిండీసు' అని పైనచెప్పిన దీవులు అమెరికా సంయుక్తరాష్ట్రముల కాగ్నేయదిశ నట్లాంటికుమహాసముద్రావృతమై యున్నవి. 15-వ శతాబ్దిలో కొలంబసు భారత చీనాదేశముల జేరు నుద్దేశంతో పశ్చిమసముద్ర యాత్ర జేసినప్పు డాదీవుల జేరి. అవియే హిందూదేశప్రాంత మని భావించెను. అందుచే పాశ్చాత్యులందరు వానిని 'ఇండీస్' అనిరి; అది పొరబాటని తెలిసిన మీదట అవి 'వెస్టిండీస్' (పశ్చిమహిందూప్రాంతము) అనియు మనదేశమున కాగ్నేయదిశనున్న జావా సుమత్రా బోర్నియో మున్నగుద్వీపములను 'ఈస్టిండీస్' (తూర్పుహిందూప్రాంతము) అనియు పిలువజొచ్చిరి. ఇట్లే మనభారత దేశమందు వ్యాపారమును తరువాత రాజ్యాధికారమును చేసిన ఇంగ్లీషుకంపెనీకి 'ఈస్టిండియా కంపెనీ' అని పేరువచ్చెను. దానిస్థానమున మనదేశమునకు సర్వాధికారులయిన బ్రిటిషు పార్లమెంటువారు మనదేశమం దాయాశాసన సభలను సలహాసంఘములుగనే వినియోగించుకొనుచు, లండనులోని 'ఇండియా కౌంసిలు' ద్వారాను మనదేశమందు తమయుద్యోగులద్వారా మనదేశమును పాలించినారు. పార్లమెంటుదే అంత్యాధికార మనుభావముతో మనరాజకీయ నాయకులు కొందరు, ముఖ్యముగా మితవాదివర్గమువారు, అప్పుడప్పుడు పైన చెప్పినట్లు ఇంగ్లండులో కరపత్రముల పంచి కామన్సులో ప్రశ్నల నడిగించుచునే యుండిరి. కాని, అందువలన సాధారణముగా నిజమైన పరిహారము కలుగలేదు ఆఫ్రికాలో తూర్పుప్రాంతమం దున్న అబిసీనియారా జిటలీతో 1896-లో పోరి స్వాతంత్ర్యము నిలుపుకొన్నను, దరిమిలాను ఇటలీవారబిసీనియాతో యుద్ధమునకై విశ్వప్రయత్నముల జేసి సేనలసిద్ధపర్చి అబిసీనియా నాక్రమించి ఘోరముగ విధ్వంసముల జరిగించినారు. కాని, 2-వ ప్రపంచ యుద్ధముతరువాత జర్మనుపక్షపు ఇటలీవారును పరాజితులుకాగా, మరలఅబిసీనియాకు స్వతంత్రత లభించినది. మొరాకో చాలవరకు ఫ్రెంచివారి ఆధిపత్యమున బడినది. లైబీరియా స్వేచ్ఛయు దాదాపు నామమాత్రమే; ఇప్పుడు ఆఫ్రికాలో పూర్ణస్వతంత్ర మని చెప్పుకొనదగు పెద్దదేశీయరాజ్యము ఈజిప్టుఒకటే.

# 63. ఆసియాలో యూరపియనుల ఆక్రమణ - జపాను వృద్ధి

ఆఫ్రికాలో యూరపియనుల యాక్రమణ జరిగినది. అందులో ఇట్లు దానిస్థితికి శాశ్వత పరిష్కారమైన దనుట సబబు కాదు. 19-వ శతాబ్దిలో యూరపియనులకు సూక్ష్మవిమర్శ చేయు అలవాటు లేక, స్థూలభావములే యుండెను. పాశ్చాత్య దేశములందలి యాంత్రికపరిణామముచే యూరపియనులకు గలిగిన నదుపాయములు తాత్కాలికములు. వాటిచే మానవులపై యూరపియనుల కేర్పడిన నాయకత్వము శాశ్వతముగ నుండు నని మంగోలుమహావిజయము మొదలగు మహావిప్లవముల నెరుగని కొందరు పొరబడిరి. కాని, విజ్ఞానమును దానిఫలితములను ఇతరులును గ్రహింపవచ్చును. చీనావారును భారతీయులును ఇంగ్లీషు ఫ్రెంచివారియంత నేర్పుతో బరిశోధనల జేయగల్గుదురు. పాశ్చాత్యులలో సహజవిజ్ఞానోత్తేజనమును ప్రాచ్యులలో సహజమాంద్యము పూర్వాచారపరత్వమును కల వనియు, అందుచే యూరపియనుల లోకప్రాబల్యము శాశ్వతమే యనియు కొందరు భ్రమించిరి.

ఈవ్యామోహమున వివిధ యూరపియనురాజ్యముల విదేశాంగశాఖవారు బ్రిటిషువారితో బాటు ప్రపంచమందలి అనాగరికవస్వ్యస్థలులను వశపర్చుకొనుటకు తగవులాడిరి; మరియు ఆసియాలోని సమృద్ధనాగరికజనులనుగూడ ముడిపదార్థముల

వలె వశపర్చుకొని గ్రహింపవచ్చు నని వారిని తమలో పంచుకొనజొచ్చిరి. భారతదేశమున లోలోన దుర్బలమైనను పైకి అద్భుతముగ గన్పట్టు బ్రిటిషుపాలకవర్గపుసామ్రాజ్యపద్ధతిని ఈస్టిండీసులోని లాభదాయకమగు డచ్చివారి విశాలరాజ్యమును చూచి పర్షియా టర్కీ ప్రాచ్యద్వీప చీనా జపానులలో గూడ నట్టివైభవము నొందవచ్చు నని యూరపులోని కొన్ని ప్రతర్థిరాజ్యము లాశపడినవి.

1898-లో జర్మనులు చీనాలోని 'కియాచౌ'ను పట్టుకొనిరి; బ్రిటిషువారు అందలి 'వీ-హై-వీ' ఆక్రమించిరి. మరియు రష్యనులు కొరియాలోని నౌకాశ్రయమగు పోర్టు ఆర్థరుకోటను పట్టుకొనిరి. అంతట చీనాలో యూరపియనుల యెడ ద్వేషానలము రగుల్కొనెను. కొందరు యూరపియనులను క్రైస్తవులను సంహరించి, 1900-లో చీనులు తమ రాజధాని యగు పెకినులోని యూరపియను ప్రతినిధుల కార్యాలయమును ముట్టడించిరి. *ఇంతలో యూరపియనురాజ్యాల మిశ్రసేన యొకటి 'పెకిను'కు నడుపబడి ఆ ప్రతినిధులను రక్షించి, ఆదేశపు అమూల్యవస్తువులను విశేషముగ అపహరించెను. అంతట రష్యనులు మంచూరియా నాక్రమించిరి. 1904-లో బ్రిటిషువారు తిబెత్తుపై దండెత్తిరి.

కాని యీ మహారాజ్యముల తగవు లట్లుండగా జపాను నవనాగరికమయి ముందుకు వచ్చెను. ఈ చరిత్రయం దింత వరకును జపానుకు ప్రాముఖ్యము రాలేదు. మూలనున్న జపానువారి నాగరికత మానవజీవితపుపరిణామము కంతగా

---

*ఇదియే బాక్సరు విప్లవమనబడును.

తోడ్పడలేదు. వా రితరులనుండి యధికముగ గ్రహించిరి. కాని, ఇతరుల కేమియు నీయలేదు. అసలు జపానీయులు మంగోలుజాతివారు. వారి నాగరికత, వ్రాత, సారస్వతము, శిల్పకళాదులు చీనావారినుండి వచ్చెను. వారి చరిత్ర చాల చిత్రము. క్రీ. త. మొదటి శతాబ్దములలో వారిలో సామంత రాజ్యపద్ధతి యుండెను. ఫ్రాంసులో ఇంగ్లీషువారి యుద్ధముల వలెనే ప్రాచ్యదిశను జపానువారు కొరియా చీనాలపై బడు చుండిరి. యూరపుతో జపానుకు ప్రథమసంబంధము 16-వ శతాబ్దమున గల్గెను. 1542-లో కొంతమంది పోర్చుగీసువా రొక చీనా యోడలో జపాను చేరిరి. 1549-లో *ఫ్రాన్సిసుజ్జేవియర్ అను నొక జెసూయిటు ప్రచారకు డచ్చట బోధింపసాగెను. కొంత కాలము జపాను పాశ్చాత్యసంబంధము నంగీకరించెను. క్రైస్తవప్రచారముచే కొందరుజను లామతమును స్వీకరించిరి. 'విలియం ఆడమ్స్' అను నొకడు జపానీయుల కాంతరంగికుడై గొప్పనౌకల నిర్మించు విధానమును వారికి జూపెను. జపాను వారి నౌకలలో భారతదేశమునకును 'పెరూ'కును ప్రయాణ ములు జరిగెను. ఆ సమయమున స్పానిషు డామినికనులకును పోర్చుగీసు జెసూయిటులకును ఇంగ్లీషు డచ్చి ప్రొటెస్టంటుల మధ్య పోరాటములు గలిగి, వారిలో ప్రతివారు తక్కిన తమ విరోధులు ద్రోహబుద్ధితో నున్నట్లు జపానుప్రజల కొకరిపై నొకరు చాడీలు చెప్పి, వారిని జాగ్రత్తపడుమని హెచ్చరించిరి. ప్రబలురగు జెసూయిటులు బౌద్ధులను హింసించి, అవమానింప

*ఈయన 'ఏసుసమితి' స్థాపకులలో నొకడు; 1542 లో భారతదేశమున గోవా తిరువాన్కూరు మున్నగుచోట్ల క్రైస్తవప్రచారము చేసెను.

మొదలుపెట్టిరి. యూరపియనులందరు దుర్భరాసహ్యజాతియని, అందును కాతలికు క్రైస్తవమతప్రముఖులు పోపును ఇదివరలోనే ఫిలిప్పైనుదీవుల స్వాధీనపఱచుకొన్న స్పానిషురాజును కుతంత్రములు పన్నుచున్నారని తుదకు జపానువారు నిశ్చయించిరి. ఈ క్రైస్తవుల బాధచే విసిగి 1638-లో జపానీయులు యూరపియనులను బహిష్కరించిరి. 200 ఏండ్లవరకు అట్లే యుండెను. ఈ 200 వత్సరములలోను జపానీయులు మిగతా ప్రపంచముతో సంబంధము లేకయుండిరి. తీరనావలనే గాని పెద్దనౌకల నిర్మింపనీయరైరి. జపానీయు డెవడును బయటకు పోను వీలులేదు. యూరపియను లెవరును జపానులోనికి రాను వీలులేదు.

ఇట్లు రెండుశతాబ్దములకాలము జపానుకు ప్రపంచపు చరిత్రప్రవాహముతో సంబంధము లేకుండెను. వారి జనాభా మొత్తములో నూటికయిదుగురైనలేని 'సమ్యురై' లను సామంతరాజన్యులు నిరంకుశులయి ప్రజల బీడింపజొచ్చిరి. ఈలోపున తక్కినలోకమంతటను విశాలభావములు నూతన రాజ్యములు నేర్పడెను. నూతననిర్మాణపునౌకలు తరుచు జపానుతీరములనుండి పోవుచుండెను. కొన్నిసమయముల నౌకాభంగముచే నావికులు దానితీరము జేరుచుండిరి. అప్పటికి జపాను పాశ్చాత్యరాజ్యములతో సమముగా వృద్ధిజెందుట లేదు; ఈస్థితిలో 1837-లో పసిఫికుమహాసముద్రమున నీటిపై చాలదూరమున జిక్కుపడిన కొందరుజపానీయనావికుల దీసుకొని చుక్కలు చారలు గల యొకవిచిత్రపతాకముతో*

*చుక్కలు చారలు అమెరికాసంయుక్తరాష్ట్రపు జాతీయధ్వజచిహ్నము.

జపానులోని 'యెడో' అఖాతము కొకనొక వచ్చెను; దానిని ఫిరంగులతో జపానువారు పారద్రోలిరి. కాని ఇట్టిపతాకము తోనే మరికొన్ని నౌకలు మరల గన్పించెను. 1849-లో 18 అమెరికను నావికులు నౌకాభంగముచే జపానునేలపై జేరిరి; వారివిడుదల గోరుట కొకనౌకవచ్చెను. 1853-లో 'కమ్మొడోర్ ఫెర్రీ' అను అమెరికను నౌకానాయకుడు నాలుగు యుద్ధ నౌకలతో వచ్చి పొమ్మన్నను పోక, ఆనిషిద్ధతీరములందే లంగరువైచికొని అప్పుడు జపానుపాలకులగు ఇరువురు ప్రభువులకును రాయబారము లంపెను. 1854-లో నతడు మరల ఆవిరిచే నడుచుచు పెద్దఫిరంగు లమర్చియున్న పది అద్భుత నావలతో వచ్చి, వర్తకమునకును ఇతరసంబంధములకును షరతుల బంపెను. జపానువారు వారి కడ్డుపెట్టలేకపోయిరి. 500 రక్షకభటులతో సంధిపత్రము సంతకముచేయుటకు నౌక నుండి తమదేశములోని కావిదేశీయులు దిగిరి; జపానీయులు గుంపులుగా మూగి, తమవీథులలో గల్గిన ఆ నూతనదృశ్యమును ఆశ్చర్యముతో జూడసాగిరి.

అమెరికావెంబడి, రష్యా, హాలండు, బ్రిటను వచ్చెను. 'షిమనోసెకీ' జలసంధి ప్రాంతాధికారియగు జపానుప్రభు వొకడు ఈవిదేశనౌకలపై తుపాకుల ప్రేల్పించెను. కాని బ్రిటిషు డచ్చి అమెరికను ఫ్రెంచి యుద్ధనౌకలన్నియు జేరి యేకమై ముట్టడించి శతఘ్నులు ప్రేల్చి, అచటి కోటబురుజుల ధ్వంసమొనర్చి, ఖడ్గధారులగు జపానీయుల జెదరగొట్టెను. తుదకు (1865) వీరందరు చేరిన సైన్యమొకటి 'కియోటో' యొద్ద జపానువారు కొన్ని సంధిషరతుల నంగీకరించునట్లు

జేసెను; ఇట్లు జపానుకు మరల ప్రపంచముతో సంబంధము కలిగెను.

ఈ వృత్తాంతములచే విశేషావమానము కలిగి, జపానీయు లద్భుతజ్ఞానశక్తులతో తమ సంస్కృతిని సంస్థలను యూరపియను వానితో సమస్థితికి దెచ్చుటకు బూనుకొనిరి. అంతట జపాను వారు మానవజాతిచరిత్రయందు మరి యేజాతియు పొందని తీవ్రాభివృద్ధి గాంచిరి. 1866-నాటికి జపానీయులు మధ్య యుగమునాటి ప్రాచీనభూస్వాముల వికృతపద్ధతిలో నుండిరి; 1899-కి ప్రగతి గల యూరపియనురాజ్యములతో సములై, పూర్తిగ పాశ్చాత్యులవలె నైరి. ఆసియావారు యూరపియను లకు వెనుకబడి రని, వారిస్థితి ఇక బాగుపడ దని కొందరెంచిరి; ఆ దురభిప్రాయమును వారు పోగొట్టి, యూరపువారి అభి వృద్ధియే మందముగా నున్నట్లు తోపింపజేసిరి.

1894-95-లో చీనాలో జపాను గొప్పయుద్ధము చేసెను; జపా నెట్లు పాశ్చాత్యరీతికి వచ్చెనో అందుచే దెలిసెను; జపానుకు అతిసమర్థమగు పాశ్చాత్యపద్ధతిసేనయు, చక్కని చిన్న నౌకా దళమునుగూడ నుండెను. జపానుకు కల్గిన పునరుజ్జీవవిశేషమును ఆంగ్ల అమెరికనులు గ్రహించి, దానిని యూరపియను రాజ్యాలతో సమంగా గౌరవింపజొచ్చిరి. ఆసియాలో భారత దేశమువంటి యితరప్రాంతములకై వెదకుచుండిన తక్కిన యూరపియనురాజ్యములవారు మాత్ర మాపరిస్థితి గ్రహింప రైరి. మంచూరియాలోనుండి కొరియాకు రష్యా వ్యాపించెను. ఫ్రాంసు అప్పటికే దక్షిణమున బర్మా కాగ్నేయప్రాంతమందున్న 'టాంకిన్, అన్నాము'లలో తనఅధికారము స్థాపించుకొనెను.

జర్మనీ ఇట్టి ఆక్రమణదేశమునకై వెదుకసాగెను. 1895-లో జపాను చీనా నోడించెను. కాని, ఈమూడురాజ్యములును ఆవిజయముచే చీనానుండి జపాను ఎట్టిలాభమును బొందనీయకుంట జేసి, మరల యుద్ధము కలుగు నని యుద్ధమం దలసియున్న జపానును వారు బెదరించిరి.

అంతట జపాను తాత్కాలికముగ తలయొగ్గి తన బలమును కూడదీసుకొనెను; పదేండ్లలో జపానుకు రష్యా సామ్రాజ్యంతో యుద్ధము కలిగెను; అందు యూరపియనులకు గర్వభంగమయి, ఆసియాలో నూతనశక మారంభించెను. పాపము రష్యనుప్రజల కంతదూరమున తమకు గలుగనున్న యీయాపత్తుసంగతి తెలియదు. ధీమంతులగు కొందరు రష్యను రాజ్యాంగవేత్తలు ఈవెఱ్ఱిదాడియన్న నిష్టపడకుండిరి. కాని, రష్యాచక్రవర్తి 'జారు'చుట్టును శ్రీమంతులగు దురాశాపరులు అతనిబంధువులగు ప్రభువర్గీయులును జేరి మంచూరియా చీనాల నాక్రమించుటకై ప్రేరణజేసిరి. ఆసమరసంరంభంలో జపాను వీరుల సేనలు నావలపై పోర్టుఆర్థరురేవుకును కొరియాకును చేరెను. సైబీరియను రైలుమార్గముమీదుగా వెళ్ళిన రష్యను సైనికబృందము లారణరంగములో జపానుయోధుల శస్త్రముల కాహుతియైరి.

సరియగు నాయకత్వము సాధనసామగ్రి లేక సముద్రము పైనను భూమిమీదను నోడెను. రష్యనుల బాల్టిక్ నౌకా దళము ఆఫ్రికానంతను జుట్టివచ్చి, 'చుషిమా' జలసంధియొద్ద జపానీయులచే పూర్తిగా ధ్వంసముచేయబడెను. అంతట రష్యనుప్రజలు తమప్రభుత్వంపైన కుపితులై, తిరుగబడిరి.అంతట

1905-లో 'జారు'యుద్ధము ముగించెను. ఆసంధి ప్రకారము 1875 లో రష్యా ఆక్రమించిన సఘేలియనుదీవి దక్షిణభాగమును, కొరియాను జపానువారి కిచ్చివేసి, జారు మంచూరియాగూడ వదలుకొనెను; అంతట ఆసియాపై యూరపియనుల దండయాత్రలకు ప్రతిబంధమారంభించి ఆక్రమణపట్లు సడలజొచ్చెను. *

---

* రష్యా జపాను యుద్ధానంతరము ఆసియాలోని యితరదేశములవలె భారతదేశమునగూడ నూతనజాతీయభావము జనించెను. మనదేశంలోను నూతన పరిశ్రమలు విద్యాలయములు స్థాపింపబడెను. ప్రజాందోళనను తృప్తిపర్చుటకు 1908 లోను 1919 లోను ఈదేశపు రాజ్యాంగమున కొన్ని సంస్కరణలు గావింపబడెను. ఇట్లే చీనాలో జాతీయోద్రేకము కలిగి 1912-లో అక్కడి చక్రవర్తి తొలగింపబడి, రిపబ్లికు అనగా ప్రజాతంత్రకప్రభుత్వము స్థాపింపబడెను. కాని కొలదికాలములోనే భేదము లంకురించి, అంతర్యుద్ధములు కలిగెను అప్పటియూరపు యుద్ధఫలితముగ జపానుబల మధికమయ్యెను. 1923లో గొప్ప భూకంపము ఉప్పెన అగ్నిప్రమాదము కలిగి, రాజధానివగైరాలకు నష్టము కలిగెను; కాని జపానీయు లసాధారణ ధైర్యోత్సాహములతో పునర్నిర్మాణము చేసికొనిరి. జపాను జనసంఖ్య వేగముగ వృద్ధియగుచుండ కొండలతో నిండియున్న ఆచిన్నద్వీపములు తమ వ్యవసాయాదులకు చాలక వేరువలసప్రదేశములకొరకును, ముడివస్తువుల సంపాదనకును, ఆజనుల కార్మికయంత్రాగారములందలి వస్తువుల వ్యాపారవ్యాప్తికొరకును జపానువారు అన్యదేశములందువ్యాపింప యత్నము నారంభించిరి. తమకు ఆగ్నేయమందున్న ఆస్ట్రేలియాలో విశేషభాగ మచ్చటి శ్వేతజనుల వాసమున కలవికానిదగుటచే, తమకు వీలుగానున్న ఉత్తరాస్ట్రేలియాకు పోవుటకు జపానీయు లుత్సహించిరి; కాని ఆస్ట్రేలియను లాప్రదేశము ఖాళీగానున్నను సరేగాని శ్వేతేతరుల నందు

వలసకు రానీయరైరి. 1926-లో చీనాలో ముఖ్యనగరమగు షాంఘైపై జపానీయులు దాడి సలిపి, తరువాత 1930-1931 లో మంచూరియా నాక్రమించి, దానిని చీనానుండి స్వతంత్రముజేసి, దానికి 'మంచూకో' అను పేరిడిరి. తమప్రాబల్యమం దుంచుకొనిరి. ఇది జాతిసమితిసూత్రములకు భిన్న మైనను జాతిసమితివా రందుకు తగుచర్య యేమియు సలుపలేదు. అంతట చీనాజపానులమధ్య సంధికి ప్రయత్నము జపానుప్రభుత్వపు విషయము నియమాలవల్లను, ఆంగ్లఅమెరికనులు తెరవెనుక చేయు తంత్రములవల్ల సంధి కుదరక, విరోధమే ప్రబలి తుదకు ఉభయరాజ్యాలకు హానికరంగా పరిణ మించినది.

# 64. 1914. సం॥రంలో బ్రిటిషుసామ్రాజ్యము.

బ్రిటిషు సామ్రాజ్యముకు రైలు స్టీమరు సౌకర్య మాధారము. దాని వివిధభాగముల నిటక్లుప్తముగ గమనింతము. ఇది యంతకుముం దెన్నడు లేని విచిత్ర రాజకీయ సమ్మేళనము.

ఈసామ్రాజ్యంలో ముఖ్యము ఈసంస్థకంతకు కేంద్ర మగు బ్రిటిషు దీవులు; అది రాజయుతమగు "ప్రజా తంత్రక"ము. ఇం దైర్లండు కలసియుండుట ఐరిషుప్రజ లలో చాలమంది కిష్టము కాదు. ఇంగ్లండు, వేల్సు, స్కాట్లండు, (ఉత్తర) ఐర్లండుల శాసనసభ్యులతో బ్రిటిషు పార్లమెం టేర్పడియున్నది. పార్లమెంటులో అధికసంఖ్యాక వర్గమువారు ముఖ్యామాత్యుని మంత్రిమండలిని నిర్ణ యింతురు. వారు తరుచు బ్రిటిషువారి స్వీయపరిస్థితుల సందర్భమునుబట్టి ఏర్పడుదురు. ఈమంత్రివర్గమే మిగిలిన సామ్రాజ్యము నంతను శాంతియుద్ధాధికారములతో సహా, అంత్యాధికారము గల్గి పాలించును.

బ్రిటను తరువాత, రాజకీయముగ ముఖ్యమైనవి ఆస్ట్రేలియా, కనడా, బ్రిటిషువారి చిరకాలాక్రాంతమగు (15శత) న్యూఫౌండ్లండు, న్యూజీలండు, దక్షిణాఫ్రికా సమితి, ఇవి యన్నియు స్వపరిపాలనగలిగి క్రియలో స్వతంత్ర రాజ్యములై, బ్రిటనుతో మైత్రికలిగియుండును; (అయితే ఈస్వపరిపాలన అక్కడి శ్వేతజాతులకే రంగుజాతుల కేమీ లేదు.). తత్కాలపు

బ్రిటిషు ప్రభుత్వమువారు వీటిలో ప్రతిరాజ్యమందు రాజు తరఫున ఒక ప్రతినిధిని నియమింతురు.

తరువాత ముఖ్యమైనది భారతదేశము; ఇందు రక్షితులగు పరాధీనసంస్థానములతో సహా, ఏడెనుకునుగూడ ఆంగ్ల ప్రభుత్వ ముండును. ఇది మొగలుదర్బారువంటిది. ఈభారత సామ్రాజ్యమంతటను బ్రిటిషురాజును, పార్లమెంటువారి అధికారము క్రింద ఇండియా కార్యాలయము వారును, పూర్వరాజుల స్థానము నాక్రమించిరి. *

అటుతరువాత ముఖ్యమైనది ఈజిప్టు; అది ఖెడివ్ అను ప్రత్యేకరాజు గలది, రాజకీయంగా స్వతంత్రము; కాని కొన్ని విషయాలలో సందిగ్ధస్థితిలో నున్నది.

అంతకంటెను అస్పష్టముగ బ్రిటిషువారిచేతను, ఈజిప్టు ప్రభుత్వముచేతను, ఆక్రమింపబడి పాలింపబడునది, ఆంగ్లో ఈజిప్షను 'సూడాన్' దేశము.

ఇవిగాక, ఎన్నుకొనబడిన శాసనసభలు నియమితులైన కార్యనిర్వాహకవర్గములతో కొంతవరకు స్వపరిపాలన గల్గి

---

*మనదేశమున మొగలు సామ్రాజ్యము ఇంగ్లీషువారధికారులగుటకు చాలపూర్వమే క్షీణించిపోయెను. మహారాష్ట్రరాజులును ఇతరహిందూసిక్కు రాజులును ఆఫ్ఘనువంశపు నబాబులును ఇంగ్లీషువారి కాయాప్రాంతములను వశముచేసిరి. ఇప్పుడు భారతరాజ్యము బ్రిటిషుసామ్రాజ్యమునుండి స్వతంత్రమయి 15-8-1947 నుండి డొమినియను ప్రతిపత్తిని పొంది, 26-1-1950 నుండి స్వతంత్ర రిపబ్లికుగ నున్నది. అయితే, సౌకర్యనిమిత్తం 'కామన్వెల్తు'లో చేరియున్నది.

కొన్ని బ్రిటిషువారి స్వంతమును కొన్ని యితరములు నగు మాల్టా, జమైకా, బహామాస్, బెర్ముడాల వంటివి గలవు.

అటుపైన, బ్రిటిషు ప్రభుత్వమువారి వలసరాజ్యముల కార్యస్థానముచే నిరంకుశముగ పాలింపబడుచు, నియమిక శాసన సభలు కలిగిన *సింహళము, ట్రినిడాడ్, ఫిజీ, గవర్నరులున్న జిబ్రాల్టరు, సెంటుహెలీనా, కలవు. ఇవి 'క్రౌనుకాలనీ' లన బడును. ఇవిగాక, రాజకీయముగ బలహీనములై, అనాగరిక జాతుల కావాసమై, ముడిపదార్థములు సమృద్ధిగ గలవై, పేరుకు రక్షిత దేశములగు, బసూటాలాండువంటివి కలవు; ఇందు దేశీయరాజులపై హైకమిషనరును నియమింతురు. రోడీషియా మొదలగుచోట్ల కొన్ని కంపెనీలు, అందుపైన హైకమీష నరును, పాలించును. ఇవి ఉష్ణప్రదేశములు. ఈ రాజ్యములలో కొన్ని కాలనీకార్యాలయము ద్వారాను, కొన్ని విదే శాంగ కార్యవర్గముద్వారాను, సంపాదితములు; కాని మొత్తముమీద అందు చాల భాగముపై కాలనీ పాలక వర్గమువా రధికారము వహించిరి.

ఏ ఒక్క అధికారవర్గము, ఏ యొక్క వ్యక్తియు బ్రిటిషు సామ్రాజ్యసంపాదనను నిర్ణయింపలేదని యిందుచే స్పష్టము. ఇది అంతకుపూర్వపు సామ్రాజ్యములకు భిన్నము లగు రాజ్యసంస్థల ప్రోగు; వాటి కందుచే శాంతి రక్షణ గలెను. ఉద్యోగులు పీడించినను, అసమర్థులైనను, ఆంగ్ల దేశమువా రశ్రద్ధవహించినను, అధీనజాతులనేకులు దాని

* ఇటీవల సింహళమునకు క్రొత్తరాజ్యాంగశాసనము 'డొమినియను' ప్రతిపత్తిగల్గి అమలులో నున్నది.

నోర్చుకొని సహించిరి. ఆథెన్సుసామ్రాజ్యమువలెనే ఆ సామ్రాజ్యమునకు సముద్రముపై రాకపోకల సౌకర్యమాధారము; బ్రిటిషు నౌకాదళము దీనికిమూలబలము. నౌకానిర్మాణము, స్టీమర్లు, నౌకానైపుణ్యము, 16, 19 శతాబ్దములమధ్య అభివృద్ధిచెందుటచే, బ్రిటిషు సామ్రాజ్య మేర్పడగలైను. వాయుమండలముననను, భూమిపైనను, శీఘ్రగమనమునకు నూతన సౌకర్యము లభివృద్ధి జెందెనేని, ఏసమయమందైనను దానికి చిక్కు కలుగవచ్చును. *

---

* ఈ సామ్రాజ్యములోని ఐర్లండు ప్రజలు రెండు శతాబ్దములనుండి స్వాతంత్ర్యము గోరుచు ఇంగ్లీషువారితో పోరుచుండిరి. విశేష రక్తపాతము జరిగి, తుదకు 1921 నుండి ఐరిష్‌ఫ్రీస్టేటు అనుపేరట దానికి కనడావగైరాలవలెనె డొమినియను స్వాతంత్ర్య మీయబడెను. అందు ఉత్తరభాగము ఆంగ్లవ్యాపారుల కావాసము అగు అల్‌స్టరు మాత్రము బ్రిటిషుపరిపాలనము లోనే యున్నది. అల్‌స్టరునుగూడ ఫ్రీస్టేటులో చేర్చవలెనని, మరియు ఇంగ్లండుకు తమపై నిప్పుడున్న యధికారములేకుండ తమకు సంపూర్ణ స్వాతంత్ర్యము కావలెనని, ఐర్లండు ప్రజలు ఆందోళనచేయుచు, ఆంగ్లదేశప్రభుత్వముతో తమకున్న రాజకీయసంబంధమును క్రమముగా త్రెంచివేసుకొనుచు, ప్రీవీకౌంసిలుకు అప్పీలును, గవర్నను జనరలు ఏర్పాటు వగైరాలుకూడ లేనిచేసినారు. ఐర్లండు హక్కులిట్లు హెచ్చుట బ్రిటిషు ప్రభుత్వ మొప్పుకొన్నది. వెస్టుమినిస్టరు చట్టము మూలమున మిగిలిన కెనడా, దక్షిణాఫ్రికా, వలె అధినివేశరాజ్యములకు గూడ క్రమముగా సంపూర్ణ స్వపరిపాలన హక్కును, ఇష్టమైనచో ఆంగ్లసామ్రాజ్యమునుండి సంపూర్తిగా వేరుబడు అధికారమును, ఆంగ్లవస్తువులపైగూడ తమ కుచితమని తోచినంత పన్నులు విధించుటకు హక్కును, ఏర్పడినవి ఇప్పటి కామన్వెల్తులో మనభారతదేశమే

చాల ముఖ్యమైనది. తక్కిన బ్రిటిషు సామ్రాజ్యముజనసంఖ్య అంతయు కలిపినను మనదేశజనసంఖ్యకు తగ్గిపోవును. భారతదేశమువల్ల బ్రిటిషుప్రజలకు ఆప్రభుత్వమునకు లాభము కలుగుచున్నది ఇంగ్లీషువారితో బాటు అధినివేశ ప్రజలుగూడ మనదేశమందు వసించుటకు స్వేచ్ఛావ్యాపారము ఉద్యోగము చేయుటకు హక్కున్నను, మనదేశములో కొన్నిటియందు వసించుటకు హక్కులు నిరోధింపబడినవి. తూర్పు దక్షిణాఫ్రికాలలో ఆంగ్లేయులకంటె పూర్వమునుండి వలసపోయి స్థిరవాసులైయున్న భారతీయుల హక్కులుకూడ ఇటీవల తగ్గించివేయబడినవి. ఈ అధినివేశములలో ఆదిమప్రజలు చాలవరకు క్షీణించిరి; తెల్లవారే అధికారంగల పౌరులు; వారిది బ్రిటిషువారిది ఒకే మతము, ఒకేనాగరికత; వారికి పరస్పరసహాయ మవసరము. ఈ అధినివేశములు విశాలప్రదేశములు; అందు జనసంఖ్య చాలతక్కువ. అందు శ్వేతజాతీయులే వసింపవలె నని, భారతీయులు జపానీయులు మొదలగువా రచ్చటి పౌరులు కాగూడ దని, వారిపట్టుదల. పరస్పరహృదయత ఉండుటచే అధినివేశపు శ్వేతజనుల కింగ్లీషుప్రభుత్వమువారు విశేషాధికారము బుద్ధిపూర్వకముగ నిచ్చుట సహజము; మనదేశపుస్థితి వేరు.

మొదటిమహాయుద్ధము కాగానే ఇంగ్లీషువా రీజిప్టుపై తమ 'ప్రొటక్టరేట్' అనగా రక్షకాధికారమును ప్రకటించిరి. ఈజిప్టుజనులు ఇప్పుడు మరల స్వతంత్రులయినారు. ఇట్లే మనభారతరాజ్యాదులును స్వతంత్రములయిన వని ముందు చూడగలము.

---

# 65. యూరపులో ఆయుధ యుగము

## 1914_18 - మహాసంగ్రామము

అతివిశాలమగు అమెరికను రిపబ్లికుకు స్టీమర్లును రైలు మార్గములును, ప్రపంచమంతట వ్యాపించిన బ్రిటిషుసామ్రాజ్యమునకు స్టీమర్లును తోడయ్యెను; కాని యీభౌతికవిజ్ఞానాభివృద్ధిచే, యూరపులో క్రిక్కిరిసియున్న యితరజాతులలో వేరుఫలితములు గల్గెను; గుఱ్ఱపు రహదారులనాటి కాలమున ఏర్పడిన సరిహద్దులలోనే వారు ఇరుకుకొనియుండిరి. బ్రిటిషు వారు సముద్రవ్యాప్తియం దితరులకంటె ముందంజ వేసిరి. ఒక్క రష్యామాత్రము తూర్పుదిశకు వ్యాపింప వీలుండెను; రష్యావారు సైబీరియాగుండ ఒక పెద్ద రైలు మార్గమును నిర్మించి, జపానుతో తగవులో జిక్కికొనిరి. అక్కడ నుండి ఆగ్నేయదిశను పర్షియా హిందూదేశముల సరిహద్దులవరకు త్రోసుకొనివచ్చిరి; అంతట బ్రిటిషువారికి కొంత ఆగ్రహము కలిగినది. మిగిలిన యూరపియను రాజ్యములు జనసంఖ్య పెరిగి నానాటికి క్రిక్కిరిసిపోవుచున్నవి. మానవజీవితపు నూతనపద్ధతులచే కొత్తసదుపాయములేర్పడినవి. వాటిలాభము బొందుటకు, కలసి ఒకవిధమగు స్వచ్ఛందసంఘీ భావమేర్పర్చుకొనియో, లేక సర్వాధికారియగు రాజ్యముచే ఐక్యమొనర్పబడియో, వారందరు తమరాజ్యములనుపరిస్థితులను విశాల మొనర్చు కొనవలసియుండెను. ఆధునికాభిప్రాయము మొదటి పద్ధతివంకకే

మొగ్గియున్నను, రాజ్యాంగపుపూర్వసంప్రదాయము యూరపును రెండవపద్ధతివంకకే మరల్చినది.

3-వ నెపోలియనుయొక్క ఫ్రెంచిసామ్రాజ్యము భగ్నమైనమీదట నవీనజర్మను సామ్రాజ్యమేర్పడెను; అందుచే జర్మనుఆధిపత్యమున యూరపు అంతయు కూడి ఏకీభవించునని తోచెను. అస్థిరశాంతిలోనున్న ఆ 44 ఏండ్ల (1870—1914) లోను యూరపురాజకీయస్థితి యట్లుండెను. చార్లమను సామ్రాజ్యము విచ్ఛిన్నమైనప్పటినుండియు, యూరపుఆధిపత్యముకై జర్మనీతో తీవ్రముగ పోటీపడుచున్న ఫ్రాంసు రష్యాతో సఖ్యముచేసి, తననీరసత్వమును బోగొట్టుకొన యత్నించెను. నెపోలియనుకాలమునుండి ఆస్ట్రియా 'పవిత్ర రోమకసామ్రాజ్య' పదవినిత్యజించెను. ఆస్ట్రియాతోను కొంతవరకు నూతనయిటలిరాజ్యముతోను, జర్మనీమైత్రి నేర్పరచుకొనెను. బ్రిటిషురాజ్యము, తన మామూలుపద్ధతినే, యూరపియను రాజ్యాంగములలో జోక్యము కల్పించుకొని కల్పించుకొననట్లుండెను. కాని క్రమముగా జర్మనుల నౌకాదళము తీవ్రముగవృద్ధినొందుట జూచి, ఇంగ్లీషువారు ఫ్రెంచిరష్యనువర్గమువారితో జేరిరి. కైజరు రెండివవిలియం యొక్క (1838—1918) అద్భుతభావముల వలన, జర్మనులు రాజ్యపరిపాక మొందక పూర్వమే సముద్రముపై సాహస కృత్యము లొనర్చిరి; అందుచే తుదకు ఇంగ్లీషువారేగాక, జపాను, సంయుక్తరాష్ట్రములుగూడ, దాని శత్రువర్గమునందు జేరిరి.

ఈజాతులన్నియు ఆయుధముల సమకూర్చెను. ప్రతియేడును ఫిరంగులు, రణపరికరములు, యుద్ధనౌకలు, మొదలగు

వానిని తయారుచేయుచు, అందుకు ఆయా ప్రభుత్వములు జాతీయద్రవ్యమును విశేషముగ ఖర్చుపర్చిరి. ఏయేటి కాయేడే యుద్ధము కలుగబోయి, ఆగుచుండెను. తుదకు 1914సం॥లో యుద్ధ మారంభించెను. జర్మనీ ఆస్ట్రియాలు ఫ్రాంసు రష్యా సర్వియాలపై బడెను; జర్మనుసైన్యములు బెల్జియముగుండ నడువ, జపానుతోసహా బ్రిటనువారు బెల్జియముకు సహాయులైరి. వెంటనే టర్కీ జర్మనీతో కలిసెను. 1915-లో ఇటలీ ఆస్ట్రియాపై యుద్ధమారంభించెను. ఆయేడే అక్టోబరులో బల్గేరియా మధ్యరాజ్యముల గూడెను. 1916-లో రుమేనియాయు, 1917-లో సంయుక్తరాష్ట్రములు, చీనాయును, జర్మనీపై యుద్ధ మారంభించెను. ఈమహాప్రళయమందెవరి బాధ్యత యెంతయో వివరించుట కిందు వీలులేదు. ఆమహాసంగ్రామమునేల మొదలిడిరనుటకన్న, అది రాకుండ (జనులు) ముందుగనే కనిపెట్టి యేల నివారింపరైరను ప్రశ్నముఖ్యము. కొలదిమంది తమచర్యలచే యుద్ధమునకు కారకులైరి; ఉదారనిష్కల్మష భావముతో యూరపియనుల కేకీభావముకల్గించుటకు బదులుగా, కోట్లకొలది జనులు ఉదాసీనులో బుద్ధిహీనులో దేశభక్తిపేరట ఆవేశయుతులో అయిరి; యుద్ధమువారింపరైరి. ఇది యెక్కువశోచనీయము.

నవ్యవిజ్ఞానపువ్యాప్తివల్ల సమరపద్ధతు లప్పుడు మారినవి. ఉక్కు, ప్రయాణము రోగములు, మొదలగువానిపై భౌతికశాస్త్రపరిశోధనచే మానవున కపారశక్తి కల్గెను. ఈశక్తినిలోకులు తమ రాజకీయ నైతికజ్ఞానములబట్టి మంచికి చెరుపునకుగూడ వినియోగింపవచ్చు గదా. యూరపు ప్రభుత్వము లన్నియు

పూర్వపు ద్వేషాసూయలకులోనై, నిరోధ వినాశముల కమిత శక్తుల సుపాదించిరి. ఈయుద్ధము ప్రపంచమంతటను దావానల మురీతి వ్యాపించి, విజేతలకు ఓడిపోయినవారికి గూడ అపార నష్టము గలుగజేసెను. ఈ యుద్ధపు ఆరంభదశలో, జర్మనులు పారిసు పైకి అద్భుతముగ విజృంభించిరి. రష్యనులు తూర్పు జర్మనీపై దాడివెడలిరి. ఈరెండును అరికట్టి నెట్టివేయ బడెను. అప్పుడు ఆత్మరక్షణపద్ధతి ప్రధానమయ్యెను. కందక ములలోనుండి యుద్ధముచేయుపద్ధతి విస్తారముగ వ్యాపించెను; అందుచే నాయాసైన్యములు అపారనష్టముతోగాని ముందు నకు నడువవీలులేక పోయెను. సేనలు యూరపున కడ్డముగ దీర్ఘమగు బారులుతీర్చి, అగడ్తలవెనుక నిల్చియుండిరి. లక్షల కొలది యోధులిట్లు రణరంగమం దుండ, వీరివెనుక దేశజను లందరు వీరి కాహారాదులు మందుగుండు సామగ్రి అందజేయ పనిచేయుచుండిరి. యుద్ధకార్యముల కవసరమగు పరిశ్రమలుతప్ప, మిగిలిన ఉత్పత్తిపరిశ్రమలన్నియు నిల్చిపోయెను; యూరపులో దృఢశరీరులగు పురుషులందరు సేనలలోనికో, నౌకాదళము లోనికో, లేక వానినిమిత్త మేర్పడిన పరిశ్రమాలయముల లోనికో, చేర్చుకొనబడిరి. కర్మాగారములలో పురుషులకు బదులు స్త్రీలువిస్తారముగ జేరిరి. ఆ మహాసంగ్రామకాలమున, యుద్ధము చేయు దేశముల ప్రజలలో సగముకుపైగా, తమపూర్వవృత్తుల మార్చుకొనియుందురు. సాంఘికముగా వారు స్వస్థితి దప్పి, పర స్థితినొందిరి;విద్యావిజ్ఞాన పరిశ్రమలు కొంతవరకు నిల్చిపోయెను; యుద్ధావసరములకే సర్వశక్తుల వినియోగించిరి. యుద్ధాధికారులు

ప్రభుత్వపు ప్రచారకులు పత్రికావార్తలగూడ నిరోధించి, వృత్తాంతములను తారుమారుచేసిరి.

అంతట యుద్ధతీవ్రత యధికమై, కందకముల వెనుకనున్న ఆయా వైరిసేనలకంపబడు ఆహారపదార్థముల ధ్వంసమొనర్చుటయు, వాయువిమానములనుండి దాడియు, మొదలిడెను. ఫిరంగులపరిమాణము వినాశకశక్తి క్రమముగా నధికమయ్యెను; కందకములలో దాగి ప్రతిఘటించుసేనల నాశ మొనర్చుటకై విషవాయువులు, బాంబులు, 'టాంకు' అను కదలు చిన్నకోటలు, మొదలగు అద్భుతపరికరములు కల్పింపబడెను. ఈయన్నిటిలో అంతరిక్షయుద్ధము అత్యద్భుతము.ఇదివరలో స్థల జలముల రెంటినుండియేయుద్ధము జరుగుచుండెను; ఇపుడు యుద్ధము వాయుమండలమునకు వ్యాపించెను. ఇంతకు పూర్వము సేన లొండొంటి నెదుర్కొని తాకినపుడే యుద్ధముజరిగెను. ఇపుడో ప్రతి చోటను యుద్ధమే. ప్రథమమున 'జెప్పెలిన్' ( = జర్మను విమానము), కేవల రణరంగమున నేగాక,దానినిదాటి సకలపరిశ్రమలజేయు మామూలుప్రదేశములంతటను యుద్ధము జరుగసాగెను. ఈనవ్యయుద్ధములలో, సైనికవర్గము ఇతరప్రజలు అనుభేద మిపు డంతరించెను. ఆహారపదార్థములను బండించెడివాడు, దుస్తులుకుట్టువాడు, కట్టెలుగొట్టువాడు, ఇండ్లు బాగుచేయువాడు, ప్రతి రైలుస్టేషను, గిడ్డంగికూడ, రణోపయోగులు కనుక, వినాశ్యముగనే యెంచబడెను. క్రమంగా, విమానయుద్ధము భీభత్సమై విపరీతనష్టము కలిగింపజొచ్చెను. అంతట యూరపులో విశేషభాగము ముట్టడులకు, రాత్రులందు దాడికి, లోనయ్యెను. లండను పారిసువంటి బహిరంగనగరములపౌరులు

ప్రతిరాత్రియు నిద్దురలేక, ఒకవంక బాంబులు ప్రేలుచుండ, విమానములపై పేల్చు ఫిరంగులు దారుణధ్వనులు చేయుచుండ, అగ్నినార్పు యంత్రములు బాధితులకు సాయమొనర్చు శకటములు నిర్జనమగు చీకటివీధులందు నిరంతరము ధ్వనించుచు దిరుగజొచ్చెను. ఈదారుణరంగముచే, బాలవృద్ధాతురుల మనశ్శరీరములకు మరియు నష్టము గల్గెను.

యుద్ధమును వెన్నంటు అంటుజాడ్యములు 1918 లో యుద్ధాంతమున కారంభించెను. ప్రపంచమంతటను ఇన్‌ఫ్లుయన్‌జా మహావ్యాధి ప్రసరించెను*; అందుచే అనేకలక్షల ప్రజలు నశించిరి. మరియు 1918 ఆరంభమున, యూరపులో చాల భాగము తీవ్రదుర్భిక్షము పాలయ్యెను. సేద్యదారులు రణరంగమునకు యోధులుగ పోయిరి; ఆహారపదార్థముల యుత్పత్తి చాల తగ్గిపోయెను. మరియు, జలాంతర్గాములోడల ముంచి యపారనష్టము గలిగించెను; సరిహద్దు లరికట్టబడి మామూలు మార్గముల రహదారీ పోయెను. ప్రపంచమందలి ప్రయాణ సౌకర్యములు తారుమారై, పంటగింజలను సరిగా అందరకు అందింప వీలులేకుండెను. వివిధప్రభుత్వములు ఆహారపదార్థముల సరఫరానుగూడ తమ వశమందే యుంచుకొని, తమ ప్రజలందరకు కొద్దికొద్దిగా పంచి యిచ్చుచుండిరి; (ఇదే కంట్రోలు రేషను అనబడెను.) నాయుద్ధాంతమునకు లోకమంతకు కట్టుగుడ్డలు తగ్గిపోయెను; గృహవసతి లేదు; ఆహారము జీవితావసరమగు

* ఈ ఇన్‌ఫ్లుయన్‌జా వ్యాధి అప్పుడు మన భారతదేశమునకు కూడ వ్యాపించగా, అందుచే కొన్ని నెలలలో సుమారు 70 లక్షలమంది మన దేశీయులు చనిపోయిరి.

ఇతరపరికరములును క్షీణించెను; ఆర్థికజీవనము వర్తకవ్యాపారములు అగమ్యగోచరమయ్యెను. ప్రతివాని కేదోబాధ; చాలమంది జను లిదివర కెఱుగని కష్టముల బడిరి.

1918 నవంబరులో మహాయుద్ధ మాగిపోయెను. ఆసాలు వసంతఋతువున విశ్వప్రయత్న మొనర్చి, జర్మనులు పారిసును సమీపించిరి; ఆస్థితిలో మధ్యయూరపురాజ్యములు స్తబ్ధమై నిర్విణ్ణము లయ్యెను. ఆజనులు నిరుత్సాహులైరి; వారి సాధనశక్తులు నిశ్శేషమాయెను. *

---

*యుద్ధఫలితముగ జయమొందిన ఇంగ్లండు, అమెరికా, ఫ్రాంసులకు నష్టములతోబాటు కొన్ని లాభములుకూడ గలిగెను. వాటి వ్యాపారములు పునరుజ్జీవితము లయ్యెను. జర్మనీ ఆస్ట్రియాల పోటీ (తాత్కాలికముగనైన) తొలగెను జర్మనీ వలసరాజ్యములు ఇంగ్లండు వగైరా అధికారములోనికి వచ్చెను; నష్టపరిహారముగ చాల ద్రవ్యము జర్మనులనుండి రాబట్టుకొనిరి. బ్రిటిషుసామ్రాజ్యమం దంతర్భాగమై యుండిన భారతదేశముకూడ ఆ మహా యుద్ధములో మిత్రమండలికి విశేష ద్రవ్యపరికరములతోను యోధులమూలమునను చాల సహాయము చేసి, అనేకనష్టముల ననుభవించెను. అందుచే బ్రిటిషువారికి యుద్ధములో నెంతో లాభించెను; ఆకారణమున హిందూదేశీయులకు స్వపరిపాలనాధికారము యుద్ధానంతరము తప్పక నిత్తుమని (యుద్ధము జరుగుచున్నప్పుడు) 1917-లో బ్రిటిషు ప్రభుత్వము వారు వాగ్దానము చేసిరి. కాని క్రియలో అట్లు జరుగక 1919-లో స్వల్ప సంస్కరణములుమాత్ర మీయబడెను. మరియు మన జాతీయభావము నణచుటకు క్రొత్త చట్టము లమలులకు వచ్చెను. ఇంతేగాక ఆ సమయమున టర్కీ అవమానింపబడి తురుష్కులు తమ రాజ్యము నాసియాలోనే ఉంచుకొని అందు అంగోరాను రాజధానిగా జేసికొనిరి. ఈ కారణములచే 1919-21-లో భారతదేశమున విశేషాందోళనము కలిగెను.

# 66. రష్యాలో నవయుగము.

మధ్యయూరపుప్రభుత్వము లిట్లు క్రుంగెను; అందు కొకయేడు పూర్వమే రష్యాలో రాజత్వ మంతరించెను. అర్ధ ప్రాచ్యుడగు ఆ'జారు' తాను పూర్వరోమకసామ్రాజ్యపు వారసు ననుకొనెను. ఆమహాయుద్ధమునకు కొన్నియేండ్లముందే 'జారు' శీవి పూర్తిగా జెడినట్లు సూచన లగుపించెను. రాజసభ యంతయు 'రాస్‌పుటీన్' అను ఒక వంచకసన్యాసి యధీన మయ్యెను; సైనికరాజకీయపాలనపద్ధతియంతయు శిథిలమై, దుర్నీతిమయమై యుండెను. యుద్ధారంభమున రష్యాలో నొక్కసారి జాతీయోత్సాహము వెలిగి నిర్బంధమహాసేన పోగుచేయబడెను. కాని తగుయుద్ధసామగ్రి సమర్థులగు ఉద్యోగులు లేకయే పాపమా వాహినులు జర్మను ఆస్ట్రియను సరిహద్దుల యుద్ధరంగమునకు గొనిపోబడెను.

యుద్ధారంభమున (1914 సెప్టెంబరుకే) జర్మనీ తూర్పు భాగమున రష్యనుసేనలు జర్మనులతో యుద్ధముచేసెను. అందు వలన అప్పటికి జర్మనులు పశ్చిమరంగమున ఫ్రాన్సుపై జరిపిన ప్రథమజైత్రయాత్ర నిలిచిపోయి, జర్మనులదృష్టి తూర్పువైపు తిరిగెను. వేలకొలది రష్యనుభటు లాయుద్ధమున దారుణమరణ బాధల నొందిరి. కాని ఆరంభమున ఆతూర్పుయుద్ధము లేనిచో పడమట ఫ్రెంచివారు జర్మనులచే పూర్తిగా నోడియుందురు; అందుచే పశ్చిమయూరపువారందరు ఆరష్యనులకు ఋణపడి యున్నారు. కాని ఆయసంగతసామ్రాజ్యపు దీనజనుల కీయుద్ధ

భారము దుర్భరమయ్యెను. తగు నవ్యాయుధాలు లేకయే రష్యనుభటులు యుద్ధరంగమున కంపబడి, రణాగ్నియందు ఆహుతిచేయబడిరి. కాని యెట్టిమూఢులకైనను సహనమునకు మితియుండును గదా! ఆ యనాథసైనికులలో 'జారు' పాలన పద్ధతియందసహ్యాభావము వ్యాపించెను. 1915 అంతమునుండి రష్యానుగూర్చి పశ్చిమపు మిత్రమండలివారాతురపడుచుండిరి. 1916 అంతయు రష్యావారాత్మరక్షణలో నుండిరి. జర్మనీతో వారికి ప్రత్యేకసంధి యగు నని వదంతి కలిగెను.

1916 డిశంబరు 29 తేదీని, రాస్పుటిన్ సన్యాసి రష్యా రాజధానియగు పెట్రోగ్రాడులో నొకవిందులో జంపఁబడెను. 1917-లో మార్చికి పరిస్థితులు మారి, పెట్రోగ్రాడులో ఆహారముకై బీదలు దొమ్మిచేసిరి; అది మహావిప్లవముగ పరిణమించెను. ప్రజాప్రతినిధిసభ యగు 'డ్యూమా' ను అణచివేసి, విప్లవపక్షనాయకుల బట్టుకొనుటకు యత్నము జరిగెను. 'జారు' మార్చి 15 కు రాజ్యము వదలెను; యువరాజుక్రింద నూతన రాజ్య మేర్పడెను. మొదట మితము నియమబద్ధము అగు క్రాంతితో స్థిమితమగు రాజ్యము సాధ్యమగునట్లుండెను. కాని రష్యాలో ప్రజలకు ఆరాజత్వమందును విశ్వాసము పూర్తిగా నశించుటచే అట్టిసరుదుబాట్లు వీలుకాలేదు. యూరపులోని ప్రాచీనసంప్రదాయపు 'జారు' లు, యుద్ధములు రష్యనుల కసహ్యముగ తోఁచెను. అందలి దుస్సహబాధలనుండి రష్యనులు శీఘ్రవిముక్తి గోరిరి. రష్యాలో నిజమైన పరిస్థితుల మిత్రమండలి వారు గ్రహింపలేరైరి. అచ్చటిమిత్రమండలి ప్రతినిధులు రష్యాలో రాజాస్థానమునకే అలవడిరి; వారికి రష్యను భాషా

జ్ఞానము లేదు; వారు ప్రజాభిప్రాయము గ్రహింపలేకపోయిరి; వారికి ప్రజాస్వామిక రాజ్యమన్న అయిష్టము; వారు నూతన ప్రభుత్వమునకు చిక్కులు గల్గింపజొచ్చిరి. ఆ రిపబ్లికు అధ్యక్షుడగు 'కెరన్‌స్కీ' వక్త, సుముఖుడు. ఐనను స్వదేశమున సాంఘిక విప్లవమును బయట మిత్రరాజ్యముల వైముఖ్యము గల్గి అతని స్థితి క్లిష్టమైపోయెను. అతడు తన ప్రజలకు సాగుకు వలయు భూమి నిచ్చి, రష్యాకు శాంతిగల్గింప యత్నించెను; కాని యందుకు ఈమిత్రమండలివా రంగీకరింపలేదు. ఫ్రెంచి బ్రిటిషు పత్రికలు, అలసియున్నను రష్యావారు తిరుగ దాడివెడలవలెనని వేపుకతినిరి. కాని యింతలో జర్మనులు భూమిపైనను సముద్రముపైనను రష్యనుల రేవుపట్టణమగు రైగాను తీవ్రముగ ముట్టడింపగా, రష్యాకు సాయముగ బ్రిటిషునౌకా దళమువారు బాల్టికుసముద్రములోనికి దాడినైన జరుపరైరి. ఆ క్రొత్తరష్యా రిపబ్లికువా రొంటిగ పోరవలసివచ్చెను. బ్రిటిషునౌకాదళనాయకుడగు ఫిషరు ప్రభువు (1841-1920) తీవ్రముగ వాదించుచున్నను, సముద్రముపై సర్వాధికారము గల్గియుండియు బ్రిటిషువారును వారిమిత్రులును (జలాంతర్గాములతో నీటిలో కొంత ముట్టడించుట తప్ప) ఆయుద్ధమంతటను జర్మనులను బాల్టికుసముద్రమున సర్వాధికారులుగా నుండ నిచ్చిరి.

ఇక రష్యనుప్రజ లాయుద్ధము నెట్లైన నంతమొందింప నిశ్చయించిరి. పెట్రోగ్రాడులో 'సోవియట్' అను కార్మిక యోధుల ప్రతినిధిసభ యొకటి యేర్పడెను; వారు స్వీడను ముఖ్యపట్టణమగు 'స్టాక్హోం' లో సోషలిస్టుల అంతర్జాతీయ

మహాసభ నొకదానిని సమకూర్చ యత్నించిరి. అప్పుడు బెర్లినుతో ఆహారమునకై దొమ్మి జరుగుచుండెను. ఆస్ట్రియా జర్మనీలలో యుద్ధమన్న చాల విసుగుగా నుండెను. 1917-లో అట్టి సామ్యవాదమహాసభ జరిగియుండినచో ప్రజానుకూలమగు న్యాయమైన సంధియు జర్మనీలో రాజ్యపరివర్తనమును కలిగి యుండును; అట్టిసభ జరుగనిండని తన పశ్చిమమిత్రులను కెరెన్స్కీ ప్రార్థించెను. బ్రిటిషు లేబరుపక్షములో ఎక్కువ మంది అందు కామోదించిరి. కాని అట్లుజరిగిన ప్రపంచమంతటను సాంఘికవిప్లవము కలుగు నని భీతులై, ఆంగ్లమిత్రమండలివారు దానిని నిషేధించిరి. ఇట్లు వారివల్ల నెట్టిసహాయమును లేకయే ఆనిర్భాగ్యపు మితవాది రష్యనుకిపబ్లికువారు పోరుచు 1917 జూలై నెలలో మొండిధైర్యముతో జర్మను ఆస్ట్రియాలపై తమ తుదిదండయాత్ర సాగించిరి. మొదట కొంచెము జయించి నను, తరువాత ఆ రష్యనుసైనికు లోడి సర్వనాశ మొందిరి.

అంతటితో రష్యనులు నిరాశులైరి; రష్యనుసైనికులు ముఖ్యముగా ఉత్తరప్రాంతమున తిరుగబడిరి. 1917 నవంబరు 7-వ తేదీని కెరెన్స్కీప్రభుత్వ మంతమొందెను. అధికారము 'సోవియటు'ల హస్తగతమాయెను. ఈ నవ్యపక్షపు నాయకుడు 'లెనిను' అంతటితో పశ్చిమప్రభుత్వములతో నిమిత్తము లేకుండ రష్యా జర్మనీలు రాజీపడి, 1918 మార్చి 2-వ తేదీని సంధి చేసికొనిరి.

వెనుకటి వాచాలరాజ్యాంగపువారితోను, 'కెరెన్స్కీ' బోలు మితవాదివిప్లవకారులతోను లెనినుగారి ఈ 'బాల్షివిక' పక్షమునకు సంబంధము లేదు. వీరు 'మార్క్సు' సిద్ధాంత మను

సరించు కమ్యూనిస్టులు అనగా సంపూర్ణ ప్రజాస్వామ్య వాదులు. తాము రష్యాలో అధికారము వహించినమీదట ప్రపంచ మంతటను సాంఘికపరివర్తనము కలుగు నని నమ్మి, వారు పూర్ణ విశ్వాసముతో ఎట్టిఅనుభవము లేకయే రష్యాలో ఆర్థికసాంఘిక పరిస్థితులను తలక్రిందు చేయవొడగిరి. ఈ యద్భుతనూతన పద్ధతికి సహాయము జేయదగు సుజ్ఞానము, సానుభూతి, ప్రజ్ఞ గూడ పశ్చిమయూరపుప్రభుత్వములకును అమెరికనుప్రభుత్వ మునకును లేదు. అచ్చటి పత్రికలు అధికారులు ఈ బొల్షివిక్కులను దూషించి రూపుమాప సమకట్టిరి. అందుచే తమదేశ ములకును రష్యాకును ఎంతనష్టము కలిగినను సరే! ఆప్రపంచ పత్రికలన్నియు వట్టిఅబద్ధముల గల్పించి, బొల్షివిక్కులపైన లేని పోనియపవాదుల వ్యాపింపజేసెను; బొల్షివికునాయకులు నమ్మ రాని రాక్షసు లని, దోపిడి రక్తపాతములలో మునిగితేలు చుందురని, విషయలోలు రని వీరితో బోల్చుచో 'రాస్పుటీను' అధికారపు 'జారు' ఆస్థానమే పరిశుద్ధముగ నెంచవచ్చునని జెప్ప దొడగిరి. ఈ శ్రాంతదేశముపైన దాడు లారంభించిరి; రష్యాలో నవ్యప్రభుత్వంపైన తిరుగుబాటుదారులకు వీరు ప్రోత్సాహము సహాయము నిచ్చిరి. బొల్షివిక్కులవలని భయముచే వారి శత్రువు లెట్టి యసహ్యదూషణకైన వెనుదీయరైరి. అయి దేండ్లు తీవ్రయుద్ధముచే నలసి కల్లోలములో బాధపడు రష్యా దేశమును పాలించు ఆ బొల్షివిక్కులతో 1919-లో ఆదేశపు ఉత్తరప్రాంతపు ఆర్కేంజలువద్ద బ్రిటిషుసేన, తూర్పు సైబీరి యాలో జపానీయులు, దక్షిణమున ఫ్రెంచి గ్రీకుసేనల సహాయ ముతో వచ్చిన 'రుమేనియను'లు, 'సైబీరియా'లో 'కాల్చెక్'

అను నౌకాధిపతి, క్రిమియాంలో ఫ్రెంచినౌకాదళపు మద్దతుతో వచ్చిన 'డెన్కిను' సేనానియు ఒక్కుమ్మడిగ యుద్ధము సాగించిరి. 'ఎస్తోనియను'ల సేన రష్యా ముఖ్యనగరమగు 'పీటర్సుబర్గు'ను సమీపించెను. 1920-లో ఫ్రెంచివారి ప్రోద్బలమున పోలులు రష్యాను ముట్టడించిరి. మరియు ఒక క్రొత్త దండయాత్రికుడగు (రష్యను) 'రాంగెల్' సేనాని తన స్వదేశముపై తిరుగబడి దాడిసల్పి నష్టము గల్పించుచుండెను. 1921 మార్చిలో రష్యనురేవు క్రాన్‌స్టాటువద్ద నావికులు తిరుగుబాటొనర్చిరి. కాని, తమ అధ్యక్షుడగు లెనిను నవ్యనాయకత్వమున రష్యా పాలకు లీముట్టడుల నన్నిటి నెదుర్కొని అద్భుతావేశంతో పోరి ఆపగల్గిరి. ఎన్నికష్టములు గల్గినను శౌర్యసాహసములతో రష్యను ప్రజ లీ తీవ్రబాధల నోర్చి, జంకులేక తమ క్రొత్త ప్రజాతంత్రరాజ్యము నిలువబెట్టిరి. 1921 అంతమునకు, విధిలేక బ్రిటిషువారును ఇటలీయు రష్యనుల కమ్యూనిస్టు రాజ్యము నొకవిధముగా నంగీకరించిరి.

ఇట్లు ఈ క్రొత్తబాల్షివికుప్రభుత్వమువా రన్యదేశముల దాడిని, స్వదేశములోని తిరుగుబాట్లను ఎదుర్కొని జయించిరి. కాని వారు రష్యాలో కమ్యూనిస్టుభావములతో నూతనసాంఘికపద్ధతి నేర్పఱచుటలో తగుజయ మొందలేదు. రష్యనురైతు తన భూమిహక్కుకై ఆశపడును. తిమింగిల మెగురుట యెంతకష్టమో, అతడు కమ్యూనిస్టుభావము లంగీకరించుట అంత కష్టము. రష్యనుక్రాంతిచే పూర్వపు జమీందారులభూమి అతనికి లభించెను. కాని ఆ విప్లవముచే సొమ్ము నకు కిమ్మతు పోయెను; తాము పండించుపంట ధరలేక తమకు

నిరుపయోగ మయ్యెను. అప్పటి యుద్ధబాధచే రైలుమార్గ ములు చెడిపోయి ఇదివరకే పాడైన వ్యవసాయపుపంట లింకను క్షీణించి, ప్రజలు తమ తిండికిమాత్రమే పండించుకొనిరి; పట్టణ ముల కాహారము లేకుండెను. కమ్యూనిష్టుపద్ధతిని సమిష్టిగ పారిశ్రామికవస్తువుల జేయుటకు తొందరయత్నముల జేసిరి. కాని అవి జయప్రదము కాలేదు. 1920-వ సాలుకు రష్యాలో ఈకల్లోలదశలో అధునికనాగరికత పూర్తిగా విచ్ఛిన్నమై, అపూర్వక్లిష్టత యేర్పడెను. రైలుమార్గములు చెడిపోయి, నగర ములు పాడుపడి అంతటను మరణము లధికమయ్యెను. కాని ఆదేశీయులు ఎన్నికష్టాలున్నను తమపైకి వచ్చు శత్రువులదాడి నెదుర్కొనగల్గిరి.

ఈ క్లిష్టస్థితివలన వారు పునర్నిర్మాణపద్ధతిని కొంత తగ్గింప నిశ్చయించిరి. సమయానుకూలంగా 'నవార్థికవిధాన' మవలం బింపబడెను. వ్యక్తులకు స్వంతఆస్తి స్వంతవ్యవహారము ఉండు టకు కొంతఅవకాశ మీయబడెను. మరల వస్తూత్పత్తి కొంత వర కేర్పడెను. రష్యాలో సాంఘికవాదపద్ధతి తగ్గి నూరేండ్ల క్రిందటి సంయుక్తరాష్ట్రపుపద్ధతి యేర్పడునట్లు తోచెను. అమెరి కాలోని చిన్నవ్యవసాయదార్లవలె రష్యాలో 'కులకు' లను సంపన్నులగు రయితు లేర్పడిరి. చిన్నస్వతంత్రవర్తకులు వృద్ధి నైరి. కాని సామ్యవాదులు తమ యాదర్శముల నీరీతిని వదలు కొని నూరేండ్లక్రిందటి అమెరికా ననుసరించుటకు రష్యావా రొప్పుకోలేదు. దేశమును సంఘస్వామ్యపద్ధతికి తెచ్చుటకు వారు 1928-లో దృఢప్రయత్నము లారంభించిరి. ప్రభుత్వమే

పరిశ్రమలను (ముఖ్యముగ లోహపువస్తువులు) వేగముగ వృద్ధి చేయుటకును, వ్యక్తిరయితులకు బదులు సమిష్టిగనే పెద్దపెద్ద కమతములు బాడుగయంత్రసహాయంతో సాగుచేయించుట కును, అయిదేండ్ల కార్యక్రమము నేర్పఱచిరి. ఈపంచాబ్దపద్ధతి కనేకాతంకములు గల్గెను; అక్కడిజను లింకను విద్యలేని మూఢులు; నవ్యపద్ధతి పనితనముగలశిల్పులు, మేస్త్రీలు తక్కు వగనుండిరి;మరియు పాశ్చాత్యదేశీయు లావిధానమును సహాయ ముచేయక కేవలము రష్యాకు వ్యతిరేకులై యుండిరి. ఐనను పరిశ్రమల అభివృద్ధిలో కొంతజయము కలిగెను. కొంతనష్టము లోపములు ఉన్నను,కొంతఅభివృద్ధికలిగెను. కర్షకవస్తూత్పత్తికై సాహసముతో తొందరగ చేసిన యత్నములు మొదట అంతగా ఫలప్రదము కాలేదు.

మిగిలినదేశములవారు యథాప్రకారముగ స్వలాభము నిమిత్తము పెట్టుబడిదార్లు చేయు వ్యాపారపద్ధతికే లోబడి యుండుచు, రష్యాలో జరుగుచున్న యీపరీక్షను శంకించుచు, సందేహాయుతులుగ నున్నారు. ప్రాచీనపద్ధతివారిపనియు సరిగా లేదు. ఈజనులలో చాలమంది దరిద్రులై బజారుధరకు వస్తు వుల కొనుశక్తిని గోల్పోయినారు; సంఘాభివృద్ధి అడుగంటు చున్నది. వీదజనుల కాత్మవిశ్వాసమును క్షీణించుచున్నది. 'ప్లానింగు' (=నిర్ణాత విధానం, కావలెనసుభావము అంతట వ్యాపించినది. అంతట ప్రజల ఆర్థికబాధ లధికమైనవి. అంతట 'ప్లానులు' సూచనలు వచ్చినవి. ముఖ్యుడగు ప్రతిరాజ్యాంగ

వేత్తయు ఒకప్లాను సిద్ధపర్చెను. ఈరీతిగనైనను లోకులందరు రష్యాఆశయమును గౌరవించిరి.*

*ఈసామ్యసంఘసిద్ధాంతమునకు ప్రారంభికు డగు 'కార్ల్ మార్క్స్' అను అర్థశాస్త్రజ్ఞుడు 1818-లో జర్మనీలో జనించెను; 1842 నుండి జర్మనీ ఫ్రాన్సు ఇంగ్లండులలో వసించి అందుండి తన తీవ్రసామ్యవాద సిద్ధాంతములను బోధించెను; అతడు తన సిద్ధాంతములగూర్చి విపులగ్రంథము రచించి 1883-లో చనిపోయెను. 'లెనిను' మహాశయుండు బాల్షివికు రష్యాకు మొదటిఅధ్యక్షుడై, రష్యాలో మార్క్సుసిద్ధాంతముల నమలులో బెట్టెను.

బాల్షివికుపాలనఫలితమును చర్చించు సందర్భమున రష్యాలో జారు పాలననాటి పరిస్థితికిని ఈనాటి సోవియటు రష్యాపరిస్థితికిని భేద మున్న దని గమనించవలెను.

1917-లో ఈ మహాక్రాంతి ఆరంభించునప్పటికి రష్యాలోని సామాన్యప్రజలు అత్యంతదుర్దశలో నుండిరి. నిరంకుశుడగు జారును ప్రభువర్గమును కొందరు శ్రీమంతులును పూర్ణాధికారులై సర్వసుఖము లొంది యుండిరి; ప్రజలు పరిపాలనలో ప్రాబల్య మేమియు లేకుండిరి ; వారిలో నూటికి 70 మంది నిరక్షరులై యుండిరి; చాలమందికి వృత్తి లేదు ; తినుట కాహారములేదు ; వారికి తగు వైద్యవసతులు లేవు ; మరణములు హెచ్చు ; ప్రజ లర్ధనాగరికులు; అంతర్విభేదములు కలహాములు హెచ్చు. ఆ స్థితి నున్న దేశమును ఈ 30 ఏండ్లు బాల్షివిక్కులు పాలించిరి ; ఇప్పుడు నూటికి 90 మంది రష్యనులు విద్యావంతులైరి ; (నూరేండ్ల పైనుండి సమర్థమగు అంగ్లప్రభుత్వము సర్వాధికారముతో పాలించిన మనదేశమం దిప్పుడు నూటికి 10 మాత్రమే చదువగలరు.) రమారమి అన్ని పాశ్చాత్య దేశములలోను ఇప్పుడు సుమారు నూటికి పదిమందివృత్తిలేనివారు. వారికి వృత్తుల గల్పించుట

ఆయా ప్రభుత్వములకు మహాసమస్య యైనది. రష్యాలో ఇప్పు డందరికి వృత్తులు, ఆహారములయేర్పాటులును కలవు; రష్యాప్రభుత్వము అందుకు బాధ్యత వహించును. (భారతదేశమందు చాలమంది నిరుద్యోగులు; వారికి పనిగాని సరిగా పోషణగాని ఆహారసౌకర్యముగాని లేదు; ఆంగ్లదేశాదులలో నిరుద్యోగులకు ప్రభుత్వ మేవృత్తినో పోషణకు ద్రవ్యమునో ఈయవలె. ప్రజల బిచ్చమెత్తనీయరు. భిక్షాటనమునకు మనదేశమున సంపూర్ణస్వాతంత్ర్యము కలదు.) రష్యాలో బీదల కుచితముగ సినీమా సంగీతాదులు గూడ ప్రభుత్వమువా రేర్పర్చిరి. అచ్చట ధనికులకు బీదలకు విశేష భేదములేదు. బీదలసౌకర్యమే ముందుగా గమనింపబడును. అందు కొన్ని పొరబాట్లు పైనచెప్పిన చిక్కులును కలవు. కాని పని కొంతవరకు జయప్రదముగ నున్నది. క్రమముగ వస్తువుల ఉత్పత్తి హెచ్చినది; ఇతరదేశములకు గూడ సరుకు లెగుమతియగుటచే, ఆపోటీకి పాశ్చాత్యులుగూడ భయపడు చున్నారు. క్రమముగా రష్యనులు పంటలను పరిశ్రమలనుకూడ వృద్ధిచేసి కొనుచు, పరాధీనత లేకుండ ఆవశ్యకవస్తువులను స్వదేశమందే యుక్తితో సంపాదించుచు పునర్నిర్మాణము చేయుచున్నారు. విద్యావ్యాప్తిలో విజ్ఞాన పరిశోధనలలో విమానాది యుద్ధబలమునగూడ రష్యను లభివృద్ధిలో నున్నారు; వెనుకటివలె తృణీకరింపక ఇంగ్లండు ఫ్రాంసు అమెరికా మున్నగు ప్రముఖ దేశముల పాలకులును రష్యాపట్ల భయాదరములతో నున్నారు. సంయుక్త జాతి సమితివారు రష్యా నాహ్వానించి తమలో జేర్చుకొనిరి.

సంఘస్వామ్యపద్ధతి రష్యనుగ్రామీణుల కెంతమాత్రమును సరిపడ దనుట సరియేనా? తత్వమున రష్యనులు చాలవరకు ప్రాచ్యులు. చరిత్రాదినుండి పాశ్చాత్యులలో ఆస్తి వ్యక్తిగతమే అని భావించినను, ప్రాచ్యదేశములందును ఆదిని అట్లే యుండెనా? మనదేశమందు మొదట భూమ్యాదులు సంఘ గతములేగాని వ్యక్తిగతములు కావనుట కాధారము కలదు. వేదకాలమున

ఆస్తిసంఘగత మని తోచును ; వ్యక్తులకే ఆస్తిహక్కు లనుసూచన తక్కువ. తరువాత స్మృతులలోగూడ స్థిరము సంఘగత మని కుటుంబ యజమానియగు తండ్రికిగూడ స్థిరమును ఇతరుల కిచ్చుహక్కు లేదని సూచించబడినది. ఇదియే అసలు సమిష్టికుటుంబపద్ధతికి ఆరంభసూత్రము అని చెప్పబడుచున్నది. (ఉ. 'స్థావరం ద్విపదం చైవయద్యపి స్వయమార్జితం, అసంభూయ సుతాన్ సర్వాన్ నదానం నచవిక్రయః.)

'యేజాతా యేప్యజాతాశ్చ, యే చ గర్భేవ్యవస్థితాః
వృత్తిం తేప్యభికాంక్షంతి వృత్తిలోపో విగర్హితః,
'అవిభక్తావిభక్తావా సపిండాః స్థావరేసమాః'

(విష్ణు మనువచనములు, మితాక్షరలో నుదాహరించబడినవి.)

ప్రాచీన కాలమున మనదేశమున కుటుంబము విభక్తమగుట అరుదు. ఆవిధానములో సమిష్టికుటుంబము చాలపెద్దదై తరుచు సపిండులందరు సమిష్టిగ ఒకేగ్రామమున ఉండుచుండిరి. [సపిండశబ్దమున కసలు అర్థము సమిష్టి క్షేత్రభూమి (పిండ మిచ్చునది) కలవా రని, 'సమానోదక' అనగా ఒకేజలాశయాధారము కలవారని, దరిమిలాను ఆశబ్దములకు తర్పణపిండములతో సంబంధము కల్గింపబడె నని, కొందరు విజ్ఞుల అభిప్రాయము.) చారిత్రకకాలమున పరిస్థితులు మారుచు రాగా క్రమముగా మొదట చరమందు, తరువాత స్వార్జితమందు వ్యక్తులప్రత్యేకపుహక్కు లేర్పడి, అంతట విభాగమును క్రయాదులద్వారాను ఆస్తిహక్కులు కల్గుటకు సౌకర్యము చేయబడినది; ఆప్రకారము దరిమిలా ధర్మశాస్త్రములలో నిబంధనలు కలవు. చివరకు 12-వ శతాబ్దమున విజ్ఞానేశ్వరుడు 'మితాక్షరి'లో స్వత్వస్వభావమును చర్చించి, వ్యక్తుల లౌకిక స్వత్వపద్ధతిని చమత్కారముగ సాధించి, విభాగాదులకు నిబంధనల విశాలము జేసెను. 14-వ శతాబ్దపు జీమూతవాహనుని (దాయభాగగ్రంథము)చే వ్యక్తుల ప్రత్యేకపుహక్కు లింకను హెచ్చుచేయబడెను. ప్రాచీన కాలమున

మన దేశమందు ప్రతిగ్రామపు ఆస్తులు మొదలగునవి ఆయాగ్రామపంచాయతీల పాలనమం దుండెను. అందుచే సమిష్టి హక్కు, సంఘస్వామ్యము, వారికి క్రొత్తకాదని తోచును. నేడు అది రష్యాలో జయప్రదమగుటలో ఆశ్చర్యము లేదు.

కాని రష్యాలో జరుగుచున్న సోవియటుపద్ధతిలో అనేకలోపములును కలవు. మహాయంత్రప్రకోపము, ఆయుధబలవృద్ధి, హింసాతత్వము, నిరంధపద్ధతి, కేంద్రప్రభుత్వపు సర్వాధికారము, ఇట్టి అనర్థకలోపములు బొల్షివికు రాజ్యమునగూడ కలవు. రష్యాలోను యాంత్రికప్రకోపము అనర్థములు కొంతవరకు కనబడుచున్నవి. రష్యనులకు ఇతరులతో సంఘర్షము అవిశ్వాసము హెచ్చుచున్నది. హింసాబలముతో ప్రజాధికారము సాధించినను ఆ హింసాతత్వము రూఢమై ఎప్పటికైనను హానిగల్గించు నను గాంధిమహాత్ముని సూక్తికి నేడు రష్యాలో నిదర్శనములు కనబడుచున్నవి. ప్రజాస్వామ్యవాదులలోనే కక్షలేర్పడినవి. లెనిను 1922-లో మరణింపగా ఆయన శిష్యులగు ట్రాట్స్కీ స్టాలినులు రెండుపక్షములు వహించిరి; ట్రాట్స్కీ తుదకు దేశము వదలిపోయినను అతని పక్షపువారు స్టాలినుపక్షముపైన రహస్యపుకుట్రలు చేయగా విచారణలు జరిగి వేలకొలదికి తీవ్రదండనలు విధించిరి. ఎందరో పదభ్రష్టులయిరి. అయినను క్రాంతియత్నాలు సాగుచునేయుండెను; కనుక స్టాలిను నియంతయై లోహపురుషుడై నిర్దయముగా క్రాంతికరుల నణచివేసి, సోవియటుల ఏకాధికారివలె వర్తించుచున్నాడు. కాని రష్యనులలో దాదాపు అందరును స్టాలిను తమ నాయకుడుగ భావించి అతని ఆజ్ఞల ననుసరించుచున్నారు. రష్యాలో రెండవపార్టీయే లేదు. అన్యదేశాలలోని కమ్యూనిస్టులు వారి సంఘములు స్టాలినునే కమ్యూనిస్టుల ఏకనియంతగ గుర్తించి ఆయన ఆజ్ఞలను తమతమ దేశాలలోను అనుసరించుట విశేషము.

# 67. నానాజాతిసంఘము

మొదటి ప్రపంచసంగ్రామపుఫలితముగ దేనికిని ఆది అంతము సమాఖ్య కలుఁగలే దని ఇప్పుడు మనకు బోధపడుచున్నది. ఆయుద్ధముచే లక్షలకొలఁది ప్రజలు హతులైరి; ప్రపంచము బాధలపాలై, దరిద్రస్థితికి వచ్చినది; రష్యాకు పెద్దదెబ్బతగిలెను. ఈవిశ్వ మపాయకరము నిర్దాక్షిణ్యము అని, ఇందు మన మొకపద్ధతి దూరదృష్టివిచక్షణలేక యల్లాడుచుంటిమని ఆభయానకయుద్ధముచే మనకు జ్ఞప్తికలిగినది. మానవజాతి కనర్థము గల్గించిన జాతీయాహంకారములును సామ్రాజ్యదురాశలును ఈ యుద్ధముచే నశింపలేదు; ఈయుద్ధపుశ్రమ అలసట తీరగానే ప్రపంచమున నిట్టియనర్థము తిరుగ గల్గించుటకవి సిద్ధముగనే యున్నవి. యుద్ధములవల్లను, విప్లవములవల్లను లాభములేదు; పూర్వకాలపుసంస్థల అడ్డములను మోటుగ తొలగించుటకు మాత్రమే యుద్ధ ముపయోగించును. ఆమహాయుద్ధముచే యూరపునకు జర్మనుసామ్రాజ్యతత్త్వపుబాధ పోయెను; రష్యాలో సామ్రాజ్యతత్త్వము నశించినది; అనేక రాజవంశములు పదభ్రష్టములైనవి. కాని యూరపులో కొన్ని నిరంకుశ రాజ్యములపతాకములెగురుచునేయున్నవి. సరిహద్దుల పేచీలు కోపకారణములగుచునేయున్నవి. మహాసేనలు నూతనసామగ్రుల ప్రోగుచేసుకొనుచున్నవి. వర్సైల్సుసంధిసభలో జర్మను, ఆస్ట్రియను, తురుష్క, బల్గేరియనులు ఆసభాచర్చలో పాల్గొనలేక ఆసభవారి తీర్మానములమాత్ర మంగీకరింపవలసివచ్చెను.

ఈమహాయుద్ధము తరువాత దాక్షిణ్యభావము నశించెను. విజేతలు తమతమ దేశములకైన కష్టనష్టములనే గమనించిరిగాని ఓడినవారిస్థితియు చెడిపోయిన దనుతథ్యము గమనించలేదు; యూరపులోని జాతీయాహంభావముల పోటీలవల్లను, ఈశక్తులలో సామరస్యము గల్గించునది లేకయు మహాయుద్ధము కలిగెను. సంఘర్షము ఆయుధసేకరణము సాగుచుంటే, వెనుక కల్గినరీతినే గాకున్నను, మరియొకరీతినైనను, మహాయుద్ధము కల్గుచుండును. రాజకీయసామరస్యము గల్గించిననే ఆప్రవృత్తుల నరికట్టవచ్చు; లేనిచో తిరుగ బీభత్సకరమగు యుద్ధము వచ్చితీరును. పెట్టలు గుడ్లుపెట్టునట్లే యుద్ధసన్నద్ధమగు రాజ్యములు యుద్ధములు చేయుచునే యుండును. యుద్ధమున అలసి బాధితులైనవారాసత్యమును మరచిరి; ఆనష్టమంతటికి ఓడినజాతులవారే బాధ్యులనియెంచిరి. ఆయుద్ధఫలితము వేరైతే అప్పుడు వారును తమ విరోధిజాతుల నట్లే యెంచియుందురు. జర్మనులదే తప్పని, ఆంగ్లమిత్రమండలివారెంచిరి. రష్యనులు ఇంగ్లీషువారు ప్రేరేపించివారు దోషు లని జర్మనులు తలచిరి. ఆ చిన్నచిన్న రాజ్యముల నిర్మాణములో లోపమున్నది; కసితో శిక్షార్థముగ పరాజితుల నుండి విపరీతమగు సొమ్మును గుంజుట కాసంధిలో నిర్ణయించిరి. విజేతలకు నష్టపరిహారముకని దివాలాలోనున్న పరాజితజాతుల పైన దుర్భరభారము మోపిరి. అంతర్జాతీయపరిస్థితుల జక్కపెట్టి యుద్ధము నివారింపనేర్పఱచిన నానాజాతిసమితివారికి అందుకు తగు సమర్థతయు సదుద్దేశమునుగూడ లేకుండెను.

నానాజాతిసమితిపద్ధతిని అమెరికా సంయుక్తరాజ్యపు అధ్యక్షుడగు 'డాక్టరు విల్సను' తెచ్చిపెట్టెను. అమెరికాలో

ఇతరులు కలుగజేసికొనకుండ మన్రో సిద్ధాంత మేర్పఱచుటతప్ప అప్పటి కమెరికనులకు ఈపూర్వప్రపంచవిషయములం దెట్టిభావములును లేవు. హఠాత్తుగా అప్పటి మహాసమస్యల పరిష్కారమును చేయజాలరైరి. వారు ఈపూర్వప్రపంచపు రాజకీయములనుండి తప్పించుకొనుటకే అప్పటికి యత్నించుచుండిరి; జర్మనుల జలాంతర్గామియుద్ధముచే వారును జర్మనులకు శత్రువులై, మిత్రమండలిలో జేరిరి; ప్రపంచసమస్యకు పరిష్కారముగ 'నానాజాతిసమితి' నేర్పర్చిరి. అప్పుడు సామాన్యజనులందరు యుద్ధముతో మిక్కిలి విసుగుజెంది, ఎంతనష్టము గల్గినను మరల యుద్ధము రాకూడ దనుకొనిరి. కాని, అందుకై తమతమ సంపూర్ణస్వాతంత్ర్యములో నెంతమాత్రమును వదలుటకు ఈప్రపంచరాష్ట్రము లిష్టపడలేదు. విల్సను అధ్యక్షుడు అప్పుడుదారమగు బహిరంగోపన్యాసముల నిచ్చెను. కాని విల్సను ప్రజలనుగాక అట్టిరాజ్యముల నెదుర్కొనవలసివచ్చెను. అతడు కల్గించిన ఉత్సాహము వెంటనే అణగిపోయి నశించెను.

యూరపులోని కార్మికులు ఇత్యాదుల ప్రతినిధులు విల్సను అధ్యక్షుడు చెప్పిన 14 అంశముల ప్రణాళికను శిరసావహింప సిద్ధపడిరి. కాని వారియాశలు త్వరలోనే వ్యర్థాశలై, అతడు నిర్మించిన జాతిసమితి బలహీనమై, నిరుపయోగమై పోయెను. ఆ మహాశయముల నెఱవేర్చ దగుశక్తి విల్సనుకు లేదు. అతడు సూచించిన ప్రక్రియ నమెరికనులు నిరాకరించిరి; అత డేర్పరిచి యూరపు ఒప్పుకొనిన జాతిసమితిలో అమెరికాయే చేరలేదు. తాము సిద్ధముగాలేని విషయములోనికి తమ్ము లాగిరని అమెరికనుప్రముఖులు తలచిరి. ఇట్లీజాతిసమితి అకాల

జనన మొంది, అప్పుడే అంగహీన మయ్యెను. దాని నిర్మాణపద్ధతి పెద్దదే; కాని, దాని అధికారము సంకుచితము; అది అంతర్జాతీయవ్యవహారముల పరిష్కారముల జేయలేకుండెను. కాని అట్టిపద్ధతికై జనుల కమితోత్సాహము కల్గుటయు, ప్రజాసామాన్య మిక యుద్ధముల నిరోధించుటకు సిద్ధపడుటయు, చరిత్రమున గమనింపదగినవి. ప్రభుత్వములు హ్రస్వదృష్టి గలిగి మానవకార్యములందు విభేదముల గల్పించి దుష్టపాలన జేయుచున్నవి. కాని లోకము కైక్యము క్రమపద్ధతి కలుగవలె నని జనులలో తీవ్రాభిలాష కలుగుచున్నది.

కాని యీయుద్యమ మాచరణలోనికి రాకుండ ఆటంకము లేర్పడుచున్నవి. వర్సైల్సు సంధి ద్వారా అప్పటి ప్రభుత్వములు, ఆ రాజ్యాంగభావములు స్థిరములుగ నుంచుటకే ఆసంధి సమితులద్వారా ప్రయత్నించిరి. ప్రభుత్వములు రాజ్యములు స్థిరములుకావు. నరుల ఆవశ్యకతలబట్టి ప్రభుత్వరాజ్యముల మార్చవలెను. మరియు వీనికన్న ఆర్థికసమస్యలు చాల యెక్కువ ముఖ్యములు. వాటిని గూర్చి భావములు యుక్తవిద్యచే నేర్పడవలెను. జనుల ఆర్థిక సాంఘికబాధల దొలగించుటకు, జనుల అపోహలను ఆశయముల గూర్చిన అపార్థములను పోగొట్టుటయే సాధనము. ఈమధ్యకాలములో ఎన్నియో ప్రపంచసభలు జరుగుచువచ్చినవి. అందు లోకవ్యవహారముల సువ్యపరిష్కారముకు మందముగను అవకతవకగను యత్నములు జరిగినవి. ఇంతవరకున్న జాతీయరాజకీయదృష్టి క్రమముగా మారుచు, ఆర్థికద్రవ్యవిషయములందు లోకప్రజను లందరిక్షేమము నొక్కటే యనుభావ మీసమావేశములందు

కొందరు తెలిపినారు. కాని రాజకీయకార్యపరులు సంఘ కార్యనిరతులు, పత్రికాసంపాదకులు, గూడ ఈనూత్న భావములు ఆమోదించుటకుముందే ఆర్థికజీవన మల్లకల్లోలమై, దరిద్రత నిరుద్యోగము ప్రపంచము నావహించినవి; నరజాతి జీవశక్తి చెడుచు, సంఘుభద్రతకు భంగము వాటిల్లుచున్నది. నేరములు హెచ్చినవి; రాజకీయజీవితమునకు స్థైర్యము తప్పినది. మానవకథలో 19-వ శతాబ్దిలో కలిగిన ప్రగతియుతాభివృద్ధిని మరల నందుకొనుటకు తగు నైతికబలము, నేతృత్వము, దీక్ష, మన మానవజాతికి కలదో లేదో!

గత మహాయుద్ధముల జననష్టము మహానర్థము అంతరించవలె నన్న మానవజాతి చాలవరకు పునర్నిర్మితము గావలెను. ఇప్పటిరీతి సమితులు ఆయా ప్రభుత్వములమధ్య సభల అతుకుల పురాణములు, ప్రస్తుత క్లిష్టసమస్యల బరిష్కరింపలేవు; అందే మియు తేలదు. మానవుల అన్యోన్యసంబంధముల విజ్ఞానమింకను బాల్యావస్థలోనే యున్నది. విద్యను విజ్ఞానమును క్రమపద్ధతి నభివృద్ధిచేసి వాటిని మానవజీవితమునకు వర్తింపజేయవలెను. సంకుచితము నాశశీలము నగు నైతిక రాజకీయ భావముల దొలంగించి, అందుకుబదులు మానవజాతిక్షేమము అందరికి సమానంగా ఆవశ్యక మని గ్రహించి ఉదారమగు విశాల భావముల నవలంబించవలెను.

ఈరోజులలో మానవుల నావరించినన్ని కల్లోలములు అనర్థములు బాధలు ఇదివర కెన్నడును లేవు. విజ్ఞానశాస్త్రముచే నరుని కపూర్వమగు మహాశక్తులు గల్గినవి. ఆశక్తులను వశ మొనర్చుకోలేదు. ఉదారభావపు నిర్భయాలోచన, విమర్శయుత

మగు ప్రక్రియయుగల వైజ్ఞానికపద్ధతిద్వారా నరు లీయద్భుత శక్తుల వశపరచుకోవచ్చు. మానవు డింకను బాల్యావస్థయందే యున్నాడు. వానిచిక్కులు వార్ధకనీరసత్వపువి కాక, వృద్ధి యగువారి ఉద్రేకపువై యున్నవి.

లోకచరిత్ర మొకే పరిణామపద్ధతి, జ్ఞానశక్తి, సాధనకై జీవులు నిరంతరకృషితో పోరుచుందురు. ఈసిద్ధాంతము గ్రహించుచో ఇప్పటి పురోభివృద్ధివాంఛను దాని యవాంతరములను గమనింతుము. మానవుల ఘనత ఉదయావస్థలో నున్నది. ప్రకృతి శోభను, చిన్నజంతువుల మందగమనపు ఇంపును, వేలకొలది చిత్రరూపములను హృదయరంజకగీతములు, అద్భుతభవనములు, సుందరారామములును గమనించగా మానవుల ఇచ్ఛాశక్తితో అనుకూలసందర్భములలో నింకను ఘనకార్యముల సాధింపవచ్చు నని తెలియును. మనకు గలశక్తి నియమితము కాకున్నను వర్ధమానము. మన నరజాతి అద్భుతకార్యములు సాధించి ఐక్యశాంతుల సంపాదించుటకును, రాబోవుతరముల వారిభవనము లింకను సుందరమై, లోక మతిమనోహరము కావలె. ధైర్యసాహసశక్తు లింక నధికమై, లోకులు వృద్ధిజెందవలె. మానవు డిప్పటికి సాధించినది అల్పము; అది నరుడు మున్ముందు సాధింపవలసినదానికి పూర్వరంగ మని భావింపవలె.*

*విల్సను వర్సైల్సుసంధికి పునాదిగా ఏర్పర్చిన 14 సూత్రములు ఆదర్శరూపమైనవి, ప్రపంచక్షేమకరమైనవి. కాని వాటినిబంధనలను విజేతలగు వారి రాజ్యాంగవేత్తలే యేర్పర్చి, వాటినన్నిటిని స్వలాభదృష్టితో తమ యిష్టప్రకార మమలు జరిపిరి. జాతులు ఆయుధములను మహాసైన్యములను తగ్గించుకొనవలె నని, పాలనమున ప్రతిజాతివారికి స్వయంనిర్ణయాధికార

ముండవలె నని, ఇకముందు ప్రతిజాతికి స్వయంనిర్ణయమునుబట్టియే పాలనము రాజ్యాంగము ఏర్పడవలె నని, మొదలగు విల్సనుసిద్ధాంతముల నప్పుడు ఓడిన వారికి వ్యతిరేకమైనంతవఱకు బూత్రిగ నమలు జరిపిరి; కాని ఆ సూత్రములను మిత్రమండలివారు తమపైన అమలు జరుపుకోలేదు. అందుచే చాల వరకు అది తరువాత లోకమందు అశాంతికి అన్యాయమునకు ముఖ్యకారణమైనది.

బ్రిటిషు ఫ్రెంచివారి ప్రాబల్యముగల ఆ జాతిసమితివారు అన్యాయపు నియమములను నిర్బంధముగ అమలు జరిపిరి. ఈ సంధి జరిగిన కొలదిలోనే లిథువేనియా చర్యలు, గ్రీసువారు తుర్కీవారిపై జరిపినయుద్ధము, రష్యాపై ఆయాప్రభుత్వముల చర్యలు, పోలిషు జర్మను కలహము, ఇట్లు తమసభ్యులే జరిపిన కొన్నికార్యములను జాతిసమితివారు వారాపరైరి. ఆయాప్రభుత్వముల ఆధిపత్యధోరణియు ఆర్థికస్వార్థపరతయు పోవలెను. అంతవరకు ప్రపంచ సభలు జయప్రదము కావు. ఆయాదేశములందు పేరాశయు, పుంజీపతుల ప్రాబల్యమును జాతిద్వేషమును ఉన్నంతవరకట్లే యుండును. మఱియు ప్రస్తుతప్రపంచపు యాంత్రికనాగరికతలో గల్గు అధికారవాంఛాది సహజ లోపములును అందుకు కొంతవఱకు మూలకారణములు.

కొత్తరకపు గొప్పకట్టడములు దీర్ఘప్రయాణసాధనములు విద్యుద్యంత్రములు మున్నగు వానికేగాక, ఇదివరలో నరులచేతిపనితో సులభముగ జరుగుచుండు నిత్యావశ్యకములగు ప్రతికార్యములకు ఇప్పుడు మహాయంత్రములనే వాడుటచే ఆర్థిక నైతికస్థితులు చెడుట సహజము. నగరజీవమునకే అలవడిన శీతలప్రాంతపు పాశ్చాత్యదేశములకన్న మన ప్రాచ్యదేశములకు యాంత్రికప్రాబల్యముచే ఎక్కువహాని కల్గు ననియు తోచును.

యంత్రకర్మాగారములద్వారా వస్తునిర్మాణము చేయువారు వాటికి వలయు ముడివస్తువులకొఱకును, తమ కర్మాగారములలో బహుళోత్పత్తితో

తయారగువస్తువులను లాభము కమ్మి సొమ్ము రాబట్టుటకు మార్కెట్లకును వారు ఇతరదేశములపై నాధారపడవలెను. అందుకై వారు అట్టి యితర దేశాలపైన ప్రాభవముకై యథాశక్తిగా ప్రయత్నింతురు. అంతట తీవ్రముగ పోటీ కలుగును. యాంత్రికపరిశ్రమలో ప్రబలులగుజాతులు కొన్ని యితర దేశములపై నధికారులై అట్లు లాభమునకు అమ్ముటకును, అచ్చటనుండి తమ జనులకు యంత్రపరిశ్రమలకు వలయు ముడివస్తువులను ఖనిజములను చవుకగ తెప్పించుకొనుటకును, యత్నింతురు; అందుకు వీలుగనే తమ అధీనదేశముల ఆర్థికపద్ధతులను మార్చుచు, తదనుగుణముగనే ఆపరాధీనజనుల పాలింతురు తమ ఆర్థిక నైతిక జీవితపు రక్షణకై ఈ పరాధీనులు కా యత్నింతురు. ఉభయత్ర హింసాత్మకము సంఘర్షమును సాగును.

బలీయములగు ఆయారాజ్యములును ఈ రీతినే తమ యధికార వ్యాపారముల వ్యాపింపజేయ పోటీ చేయుదురు. అందుచేతను సామ్రాజ్యము యంత్రవ్యాపారాదుల లాభరక్షణకును, తమ అధీనదేశములపై నధికారము నిల్పుకొనుటకును, ఆపరతంత్రదేశమందు పరిపాలనకులు ప్రబల సేనలను పరికరములను వృద్ధిచేయుచుందురు. ఆ పరతంత్రదేశపు ఆదాయము దుర్వినియోగము చేసి పీడింతురు. ఈ యాంత్రికమైన నాగరికతవలన పారిశ్రామికదేశజనులకును స్థిరలాభ ముండదు. ఆయాసుర సంపత్తుచే తుదకు పాలకదేశాలలోను సామాన్యజనులకును హాని కలుగును. ఆ దేశముల పాలకవర్గమువారు తమ బలరక్షణకై స్వదేశమందు విశేషవ్యయముతో సైన్యవృద్ధి చేయుదురు. రాజ్యాధికారమంతయు కొద్దిమంది పుంజీపతుల యిష్టముపై నిల్చియుండును; వారు దానిని స్వలాభము కుపయోగింతురు. పారిశ్రామికదేశములలోగూడ సామాన్యప్రజలు దుస్థితిలోనే యుందురు. అట్లుగాక వారిస్థితి బాగుండవలె నన్నచో, ఆయాగ్రామజనులు స్వావలంబులై అన్నముబట్టలకు, ఉత్పత్తిచేయుచు, స్వయముగా తమ ప్రాంతములందే చేతిపనులమూలమున సంపాదించుకొనవలెను. అట్లైనచో జనుల

ఆరోగ్యము, ఋజువర్తనము, వ్యక్తిస్వాతంత్ర్యమును వృద్ధియగును. జనుల లోను దేశములమధ్యనుగూడ స్పర్ధ, పేరాశ, అధికారేచ్ఛ, హింసాబుద్ధి నశించును; భౌతికబలావేశము తగ్గును. మనోహృదయములు నిర్మలములై సత్వవృద్ధి కలిగి, ఆత్మికమగు అంతశ్శక్తి అనగా దైవసంపత్తు వృద్ధిగాంచును. అప్పుడు జాతులమధ్య సంఘర్షమునకవసర ముండదు.

ఈ యాంత్రికనాగరికత ప్రకోపమువలన ఆయా సామ్రాజ్యములు విజృంభించుచు, తమ ప్రాబల్యము వృద్ధిచేసుకొనుటలో కలహించుచు శాంత దేశముల బాధించుచు, వాని నేదోవిధమున వశపరచుకొనుచు, ఆయా దేశముల స్వాతంత్ర్యము నెట్లో హరించుటకు వెనుదీయుటలేదు. ఈ పరిస్థితులను కొంత చారిత్రకముగ గమనింతము. అమెరికా సంయుక్తరాజ్యమం దచ్చటి ఆదిమ జనుల రూపుమాపి యేర్పడిన యూరపియనులు తమ వ్యాపారమును హెచ్చించినారు. తక్కిన రంగములందు బ్రిటిషు ఫ్రెంచిరాజ్యము లమెరికా సాయ మపేక్షించుచు, అమెరికావారి ప్రవృత్తికి లోబడుచున్నారు. యూరపియనులును అమెరికా సంయుక్తరాజ్యములవారును కోట్లకొలది డాలరులను ఆదేశములలో పెట్టుబడి పెట్టి ఆయాదేశాలలో గనులు అడవులు వగైరాలను తమ వశమందుంచుకొని ఉపయోగించుకొనుచు, ఆయా దేశముల స్వేచ్ఛాభివృద్ధి కడ్డుపడుచున్నారు. స్పెయినులోని ప్రజావిప్లవము నణచి, ఫ్రాంకో అను స్పానిషుసేనాని స్పెయినులో నిరంకుశరాజ్యము స్థాపించి నాడు. అక్కడి ధనికవర్గపు ద్రవ్యాయుధసహాయముతోనే ఫ్రాంకోసేనాని హఠాత్తుగా కొన్నిస్పెయినుసేనలతో మొరాకోలోని పరాధీనులగు 'మూరు' లను తెచ్చి, ప్రజాప్రభుత్వమును దౌర్జన్యముతో నడచివేయ నారంభించి నాడు. అప్పటి ప్రజాప్రభుత్వమును ఘోరయుద్ధములో నణచివేసెను. అంతర్జాతీయ న్యాయములను బట్టియు నీతినిబట్టియు న్యాయనిబద్ధమైన ప్రజాప్రభుత్వమునకే జాతిసమితివారును అందు ప్రముఖులైన బ్రిటిషు

ప్రభుత్వము వర్తిగారాలును తోడ్పడుట సబబు కాని అట్లు జరుగలేదు. ఇటలీ జర్మనీల నియంతృ ప్రభుత్వములు బహిరంగముగ స్పెయినులో విద్రోహియగు ఫ్రాంకోపక్షముకు ఆయుధములను విమానాదులను తమసేనలనుగూడ నిచ్చి, మహాదౌర్జన్యముతో మారణము జరిగించుచు ప్రజాప్రభుత్వము నణచ తోడ్పడిరి. స్పెయినులో ఇటలీ జర్మనీల ప్రాబల్యము హెచ్చుట హానికర మైనను, బ్రిటిషుప్రభుత్వమువారు తమ పుంజీపతి ప్రాబల్యమువలన విద్రోహి పక్షమునకు సానుభూతి నిచ్చిరి.

బ్రిటిషువారు (అబిసీనియాలోవలె) తమ హక్కులను మాత్రము భద్రపర్చు షరతుల నిటాలియనులతో నేర్పర్చుకొనిరి. బ్రిటిషు పుంజీపతులు విద్రోహియగు ఫ్రాంకోకు ఆ యుద్ధసమయములో కోట్లకొలది సహాయ లను ఇచ్చియు, తట నాటక మాడియు ఫ్రాంకోజయముకు కారకు లయినారు. తమతమ ఆర్థిక ప్రాబల్యమును యాంత్రికాధిక్యమును నిలువ బెట్టుకొని ఆర్థికమగు 'హక్కు'లు పోషించుకొనుటకే ఆయా విదేశప్రభుత్వ ములును ప్రముఖులును యత్నించినారు. అంతర్జాతీయనీతి క్షీణించినది. ఇందుల మూలకారణము యాంత్రికనాగరికతవలని విపరీతపరిణామము. అంతట చీనాలోను ఇట్లే మహాయుద్ధము జరిగి, ప్రజాక్షయము కలిగినది. చీనా మహాదేశము. చీనుల నాగరికత చాల ప్రాచీనము, సౌమ్యము; చీనులు లోకోపయోగములగు ఆవిష్కారము లెన్నిటినో జేసిరి. కాని ఇంగ్లండు జర్మనీ అమెరికా వర్తిగారాలలో యాంత్రికపరిశ్రమలు హెచ్చగనే వాని సరఫరాకై చీనాలో తమ ప్రాబల్యము హెచ్చించుట కాయా ప్రభుత్వములవారు తీవ్రముగ యత్నించిరి. నల్లమందు వర్తిగారాలను చీనులకు బ్రిటిషు వ్యాపారులు నిర్బంధముగ నంటగట్టిరి. వారు వ్యతిరేకించగా, యుద్ధముచేసి లాంగదీసి చీనాలో రేవుపట్టణములం దధికారము వహించిరి. చీనాసుంకముల కుద్దతిని వాటి వసూళ్ళను బ్రిటిషువర్తిగారా విదేశీయులు వశపర్చుకొనిరి.

న్యాయవిచారణాదులలోగూడ కొన్ని ప్రత్యేకాధికారములను లాగుకొనిరి. ఆ సమయమందు చీనాలో 'మంచూ'వంశపు చక్రవర్తి దుర్బలుడై నాడు. సరియగు కేంద్రప్రభుత్వము లేదు. ఈ విదేశీయులు ఆయాప్రాంతపు ప్రభువులలో జరుగు కలహములకు ప్రోత్సాహమిచ్చుచు, క్రమముగా ప్రాబల్యము సంపాదించిరి. అక్కడను క్రమముగ బ్రిటిషువారి మిల్లుబట్టవగైరా యాంత్రిక వస్తువులు విరివిగ వ్యాపించినవి. కొన్ని గనులు రైల్లు వగైరాల బ్రిటిషుకంపెనీ లేర్పడి, బ్రిటిషువారి ప్రాబల్యము హెచ్చినది. అంతట ఫ్రెంచి జర్మనీ రష్యావారును చీనాలో చెరియొకప్రాంతమందు ప్రాబల్యమేర్పర్చుకొనిరి. ఇట్లు చీనాను వీరు తమ ప్రాబల్యప్రాంతములుగ పంచుకొనిరి. అమెరికావారికిని మిల్లుయంత్రములు హెచ్చి, వారు తమ సరుకులు చీనాలోని జనబృందముల కమ్ముచు లాభము పొందుచుండిరి. ఈస్థితిలో జపాను యాంత్రిక పరిశ్రముల వృద్ధిచేసుకొనుచు పోటీకివచ్చినది. చీనా విశాల దేశము. అందలి ప్రత్తి బొగ్గు వగైరా ముడివస్తువులు తీసుకొని, అందలి 45 కోట్ల ప్రజలకు తమ యంత్రముల సరుకు లమ్ముకొని తాము లాభము గడించవచ్చునని జపానీయులు పాశ్చాత్యనీతి ననుకరించిరి; 1894-లో చీనాతో కయ్యము పెట్టుకొని దాని నోడించిరి. 1904-05-లో అడ్డువచ్చిన రష్యా నోడించి, రష్యా పోటీలేకుండ జేసుకొనిరి. 1914-18 యుద్ధములలో జపానీయులు చీనా ప్రాంతమునందు జర్మనుల స్థానములన్నిటిని వశపర్చుకొని తమ ప్రాబల్యము హెచ్చించుకొనిరి. ఇట్లు చీనాదౌర్బల్యము హెచ్చెను.

1912-లో చీనావారు తమ చక్రవర్తిని తొలగించి ప్రజారాజ్యము స్థాపించుకొన్నను, వారి జాతీయనాయకుడగు సన్యటుసేను ఇంతలో చనిపోగా, ఆయాప్రాంతముల సామంతరాజులు స్వతంత్రులై తమలో కలహించుచు, విదేశీయుల సాయము నొందుచు, వారికి ప్రాబల్య మిచ్చుచుండిరి రష్యాలోని ప్రజాస్వామ్యప్రభుత్వపు సానుభూతితో చీనానాయకులును దేశక్షేమకరమగు ప్రభుత్వము సాపింప యత్నించిరి; దేశీయపరిశ్రమల స్థాపింపబూనిరి. వెంటనే

విదేశీయులతో సంఘర్షమేర్పడినది. అక్కడ వేగముగ దేశీయపరిశ్రమల వృద్ధియైచో నబ్రిటిషువారు జపానీయులు వగైరాల వ్యాపారలాభముకుంటుపడును. అప్పుడు బ్రిటను జపాను వగైరాలు చీనాలో కొందరు ప్రాంతీయ నాయకులకు తోడ్పడి, వారిద్వారా అక్కడి జాతీయోద్యమము నరికట్టగల్గిరి. 'యూన్షికాయి' అను సేనాని చీనాకధ్యక్షుడై, జపాను బ్రిటను వగైరాల కనుకూలుడయ్యెను. తరువాత నాయకుడైన చయాంగుకైషకును అట్లేచేసి కమ్యూనిస్టుపక్షీయుల నతిఘోరముగ హింసించెను: ప్రజాస్వామ్యపుపక్షపు వారిని నడివీథులలలోగూడ ఎట్టివిచారణయు లేకుండ చంపించెను. అతనికి పద్ధతులకు బ్రిటిషువారు జపానీయులు తోడ్పడిరి. అందువలన చీనాలో ప్రజాస్వామ్యపక్షీయులకును చయంగుకైషకుగారి పుంజీపతి పక్షీయులకును విరోధ మేర్పడినది. ఇతరప్రాంతపువారిపైన దండయాత్రలు సాగించుచు, విదేశప్రముఖులనుండి తాను ద్రవ్యసేనాసహాయ మొందుచుండెను; ప్రజాస్వామ్యవాదులును లొంగక వీరావేశముతో పోరుచుంటే చీనాలో అంతఃకలహములు రక్తపాతము హెచ్చినవి. కమ్యూనిస్టులప్రాబల్య మణచుటకను పేరుతో జపాను క్రమముగ చీనాలో బ్రిటిషు వగైరాల యర్థాంగీకారముతో తన బలము హెచ్చించి, చీనానుండి ప్రతిసారియు క్రొత్తలాభములను పొందుచు తన సేనాబలము చూపి, దండయాత్ర నారంభించి కొంత్రఆక్రమణలుచేసి తన పట్టుసాగించుకొనెను. చీనాలో కమ్యూనిస్టుపక్షముతో చయంగుకైషకు ఘోరవిరోధము పెట్టుకొనెనుగదా! జపాను ఆక్రమణ క్రమముగ మితిమీరినది. 1931-33లలో మంచూకో నాక్రమించి, అక్కడ చిన్నబొమ్మరాజును పెట్టి తామే పాలించుచు ఇంకా దక్షిణమందు జెహోలురాష్ట్రము ఇత్యాదులును జపానీయు లాక్రమించిరి. ఆర్థికసేనాసహాయములు చీనాప్రభుత్వమువారు జపాను నుండియే పొందవలెనని షరతుపెట్టిరి. చీనా జపానువారి పలుకుబడిలో నుండవలె నని జపానువారు బహిరంగముగనే చీనాను నిర్బంధించినారు.

మరియు హోయాంగుహో ప్రాంతపు ఉత్తరచీనాతత్వమునకు, యాంగ్ట్సి ప్రాంతపు మధ్యదక్షిణ చీనాలతత్వమునకు భేదము అనుశ్రుతముగ వచ్చుచున్నదిగదా! ఈ విభేదము హెచ్చించి ఉత్తరచీనాలో తమవలనుకుబడి నింకను హెచ్చించి, అక్కడిపాలకుని జపానీయులు లోబర్చుకొనిరి; ఉత్తరచీనా దక్షిణచీనా నుండివిడి, ప్రత్యేకస్వతంత్రరాష్ట్రముగ నుండవలెనని ప్రకటించిరి. ఇట్లు చీనా దేశము ఖండములగుటకు చయాంగుకైషకు సమ్మతింపలేదు. కనుక చీనా జపానులమధ్య యుద్ధము తప్పదాయెను. ఉత్తరచీనా రాజధానియగు పెకింగుకు సమీపమందు చీనులకు జపానీయులకు సంఘర్షము కలిగిన దను కారణమున జపానుప్రభుత్వము చీనాపైన 7-7-1937 తేదీని దండయాత్ర నారంభించిరి; తమ విశేషశస్త్రబలము నుపయోగించి చీనాసేనల నోడించి చీనాలో హెచ్చుభాగము నాక్రమించినారు; తమ సముద్రసేన నుపయోగించి, చీనుల కితరదేశములనుండి యెట్టిసాయమును రాకుండజేసినారు; విమానములతో నాంకింగువంటి మహానగరములను ధ్వంసముచేసి అంతర్జాతీయమగు షాంఘైనిగూడ వశపర్చుకొన్నారు.

ఈ జపానుదండయాత్రవలన చీనాకు ఘోర మగు అన్యాయము జరిగినను, అంతర్జాతీయసిద్ధాంతము లడుగంటినను బ్రిటను వగైరాలు అప్పుడు చీనాకు సాయపడలేదు. స్పెయినులో అవలంబించిన రాజనీతినే ఈ పుంజీపతి రాజ్యములు చీనా జపానుల సందర్భములోను పెట్టుకొన్నారు. లాభమునే చూచుకొనుచు, పుంజీపతి రాజ్యములు పరస్పరము సాయము చేసుకొనును. ఆర్థిక సాంఘిక విషయములలోను ప్రజాసామాన్యము స్వతంత్రులగుటయు ప్రజాస్వామ్య ముండుటయు పుంజీపతివర్గము కిష్టముకాదు.

ఈరీతిగగూడ యాంత్రిక నాగరికత వర్గసంఘర్షమును హెచ్చించును. మనదేశమందును ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ సంచరించిరి. 1930-32 లో మనదేశమందు గొప్పసత్యాగ్రహము కల్గినది.

అందు జమీందార్లు పుంజీపతులు మతమూర్ఖులు (ఇప్పుడు స్పెయినులో వలె) ప్రజాసామ్యమునకు తోడ్పడక ప్రభుత్వము కనుకూలులైరి. అప్పుడును (వస్త్ర బహిష్కారాదులలో) ఆర్థికసమస్యలకే ప్రాముఖ్యము కల్గుటయు విశేషము; తరువాత ప్రభుత్వము క్రొత్తరాజ్యాంగ మిచ్చినను ఆర్థికద్రవ్యాధికారములు తమచేతిలో 'రిజర్వు' చేసుకొనిరి; మరియు బ్రిటిషువ్యాపారస్థుల హక్కులకు నష్టములేకుండునట్లు షరతు లేర్పర్చినారు. ఇట్లు పుంజీపతితత్వమునకు సామ్రాజ్య తత్వమునకు అనుబంధ మున్నది.

బ్రిటనులో యాంత్రికనాగరికతయు పుంజీపతితత్వమును ప్రబలినవి. వారాయంత్రములద్వారా బహుళోత్పత్తి చేయుదురు. వాటి నితరదేశాలలో మంచిధరకు విక్రయించుటకై సామ్రాజ్యాధికారము చలాయింతురు. ఇట్లు ప్రపంచమం దన్నిప్రాంతములలో యాంత్రికనాగరికతవలన జనసామాన్యము కన్యాయము జరుగుచుండును.

సృష్టిలోకూడ ఒక్కొక్కయుగము గడచినకొలది కేవల భౌతికశక్తి గల జంతువులు పోవుచు, క్రొత్తయుగమునందు బుద్ధివైశద్యముగల జంతువులు గల్గెను; ఆయుగముకూడ గతింపగనే, ఇంకను క్రొత్తయుగమున ఇంకను మనశ్శక్తి నైతికవిచక్షణగల జంతువులువచ్చెను; తుదకు హెచ్చు మనశ్శక్తి ఆత్మికశక్తిగల నరజాతి ఆధునికయుగమున కలిగెను. నరజాతిలోగూడ ఆదిమ నాగరితకన్న ఆర్యనాగరికతలోను, తరువాత బౌద్ధయుగాదులందును క్రమముగా ఆత్మికశక్తి వృద్ధిచెంది, అహింసాసత్యాది ఆధ్యాత్మికలక్షణములకు ప్రాముఖ్యము కలిగెను; ఇకముందును ఆత్మికశక్తి వృద్ధియగుటవలననే పురోవృద్ధి కలుగుట సృష్టిసంకల్ప మని తోచును. అట్టి భూతదయను అహింసాతత్వమును ఆత్మికశక్తిని జనులలో వారి నాయకులలో వృద్ధిచేసినమీదటనే, రాజకీయములందును జాతిసమితులు లోకక్షేమముకొరకే పనిచేసి జయప్రదములగును. ప్రపంచపు ప్రస్తుతదుస్థితి పోవలె నన్నచో దానిమూలకారణమగు

హింసాహంకారస్వార్థపర తాతత్వముల మార్చవలెను; అందుకు ఇప్పటినాగరికతలోను పరిణామము కలుగవలెను. భిన్ననాగరికతల దెల్పు దైవాసురసంపత్తులు భగవద్గీతలో నీక్రిందిరీతిని వర్ణింపబడినవి:—

"అహింసా సత్యమక్రోధః త్యాగశ్శాంతిరపైశునం,
.........భవంతి సంపదం దైవామభిజాతస్య కేశవ."
(గీత. అ. 16. శ్లో. 2—8.)

దంభో దర్పోఽతిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీం,
దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతాః.
(గీత. అ. 16. శ్లో. 44—45.)



# 68. జాతిసంఘపు వ్యర్థత

అప్పటి నానాజాతిసంఘములో విజేతలకే స్థాన మిచ్చిరి; బ్రిటిష్ ఫ్రెంచివార లాసంఘములో ప్రాబల్యం కలిగి దానిని స్వలాభము కుపయోగించుకొనిరి. ఓడిన జర్మన్ టర్కీల అధీన రాజ్యములను చాలవరకు తమ "మాండేటు"లను పేరుపెట్టి పంచుకొనిరి. ట్రస్టీల మని తమ స్వార్థముకు భుక్తపఱచుకొనిరి. ఈదోపిడిపంపకంలోను తమ కన్యాయము జరిగె నని ఇటలీ జపానులు అసంతృప్తిచెందినవి.

మఱియు అప్పటి ఆదేశీయుల సామాన్యదృక్పథమును వ్యత్యస్తముగ నుండెను. జర్మనీవగైరాలే ఆమహాయుద్ధముకు బాధ్యులు, దోషులు; వర్సాలే సంధిషరతులు న్యాయ్యములు, అవివేదవాక్యములు—అని ఫ్రెంచి బ్రిటిష్విద్యార్థు లందరికి స్కూళ్లలో బోధించిరి. అవి కేవలం అన్యాయమైనవని స్వయం నిర్ణయసూత్రప్రకారం మరల ఉన్నతస్థితికి గావలె నని అందుకు స్వశక్తి వృద్ధిచేసుకోవలెనని జర్మన్జనులు ప్రచారముచేయుచు తమవిద్యార్థులకు బోధించుచుండిరి. ఇట్లు ఆయారాజ్యములలో క్రొత్తతరంవారు కేవలం వ్యత్యస్తాశయాలు అలవర్చుకొనిరి. ఇట్లు ఆయాజాతుల యువకులు పొరుగురాజ్యములలో ద్వేషభావములతో పెరిగిరి.

1914-18 నాటి ఆమహాయుద్ధం తరువాతగూడ ఆయాదేశాలలో చిల్లరపోరులు సాగించుచునేయుండిరి. మరియు గ్రీకుసైన్యములు టర్కీమీద గొప్పదండయాత్ర చేసెను. తుర్కీ

సుల్తాను పదభ్రష్టుడు కాగా, కమాలుపాషా నాయకుడై యువక తురుష్కులసేనతో గ్రీకుల నోడించి, ఆసియాలో "అంగారా"ను రాజధానిగ జేసుకొని నవ్యతుర్కీరిపబ్లికును స్థాపించెను. క్రొత్త సాంఘికసంస్కరణలు పెట్టి పాశ్చాత్యనాగరికతను అభిమానించెను. అరబ్బీలిపికి బదులు స్వభాషకు ఇంగ్లీషుఅక్షరములు పెట్టించెను; స్త్రీలకు ఘోషాపద్ధతి తొలగించెను; ఖలీఫాఅధికారమును మాన్పించెను.

జర్మనీలో అప్పు డార్థికదుస్థితి పెరిగిపోయి, జర్మనులలో చాల ఆందోళన హెచ్చెను. వారు కోట్లకొలది పౌనులు నష్టపరిహారంగా విజేతల కిచ్చుకోవలె. కాని వారికి బంగారము లేనందున బ్రిటిష్ ఫ్రెంచివారలకు వస్తుసామగ్రి ఇచ్చురూపంగా ఈముడుపును జర్మనులు చెల్లింప నిర్ణయమైనది. కాని ఈతేరసరుకుల దిగుమతివల్ల బ్రిటన్ ఫ్రాన్సులలో సంపదాధారమగు పరిశ్రమలఉత్పత్తి తగ్గి అక్కడికార్మికులు నిరుద్యోగులు కాజొచ్చిరి. జర్మను ఆస్ట్రియనుజాతుల నణచియుంచుటే ఆంగ్ల ఫ్రెంచిప్రముఖుల ఉద్దేశ్యము. ఈస్థితిలో ఆస్ట్రియాజాతుడగు "హిట్లర్" జర్మనుజాతినాయకుడైనాడు. యూదాదుల ద్రోహంవల్లనే క్రిందటి మహాయుద్ధంలో జర్మనులు శస్త్రత్యాగం చేసిరని, నిజంగా జర్మనుజాతి అజేయమగు ఆర్యజాతి అని వారు మరల యుద్ధప్రవీణులై పగసాధించి పూర్వోన్నతి నొంది లోకప్రముఖులు కావలెనని ఈతడు ప్రచారముచేసెను. అతని "నాజీ"పక్షములో జర్మనుయువకులందరు చేరిరి. ఈలోగా ఆంగ్ల ఫ్రెంచిప్రముఖులకు తంత్రాదులవల్ల జర్మనీలో మిగతా రాజకీయపక్షాలు తమతో విరోధపడుతుంటే ఆదేశపు

ఆర్థికదుస్థితి అసహ్యమగుచుండెను. ఈనిరాశస్థితిలో నాజీ పక్షము ప్రబలమై హిట్లరు జర్మనీకి సర్వాధికారియగు నియంతయై, ధృష్టతతో గూఢంగా జనుల బ్రోత్సహించి ఆయుధబలం హెచ్చించెను. యూదులను కార్మికకమ్యూనిష్టుసంస్థలను అణచివేసెను. ఇట్లే ఈలోగా ఇటలీలో ముస్సోలినీ నియంతయైనాడు. ఈయన ప్రథమంలో సోషలిష్టుపత్రిక సంపాదకుడై యుండి, పిమ్మట ఫాసిష్టు అనుపేర నియంతృపద్ధతిపక్షమును స్థాపించి, ధనాఢ్యవర్గపు సహాయంతో సామ్యవాదులను కమ్యూనిష్టులను తొలగించి, సర్వాధికారియై, సైనికప్రాబల్యంతో పాలించెను.

ఈనాజీ ఫాసిష్టునియంతలు కొంతకాలమును ఏకాశయపరు లగుటచే అన్యోన్యతగలవారు గాఢమైత్రి సంధిని చేసుకొనిరి.

ఇట్లే జపానులోను సైనికపక్షము ప్రజాయత్తపక్షముల కన్న బలీయమై, మంత్రిత్వాధికారము చేతబట్టి యథేష్టంగా పాలన సాగించెను. ఈ మూడుదేశాల నియంతృప్రభుత్వములును నిర్దయమగు సైనికశిక్షణతో విశేషంగా సేనలుపెంచి తమ ఉద్ధతాశయాలను ప్రచారంచేయుచు తమతమ రాజ్యాలను తమచుట్టుపట్ల దేశములలోకి దురాక్రమణద్వారా విస్తరింపజేయబూని, ప్రజాపక్షములను స్వతంత్రకార్మికసంఘములను నణచి పుంజపతిపక్షాలను ప్రోత్సహించి, వారిసాయం పొందుచుండిరి. రష్యావలె కాక ఈ మూడునియంతృరాజ్యాలవారు అప్పటి జాతిసంఘమును దాని ఆజ్ఞలను తృణీకరించి, బెదిరించి తమరాజ్యాలను బలపర్చి విస్తరింపజేయుచు విమానబలములను

యువకసేనాదళములనుపెంచి యుద్ధసన్నద్ధు లగుచుండిరి. వీరి ఔద్ధత్యంవల్ల వర్సైలేసంధి ఏర్పాట్లు చీల్చబడి క్రమంగా రద్దగుచుంటే, ఆసంధినియమాలను కాపాడి అమలుజరుపవలసిన జాతిసంఘ మేమియు చేయలేక నిరర్థకమగు తీర్మానాలుమాత్రం చేస్తు పరిహాసాస్పదమగుచుండెను. అంతర్జాతీయ సూత్రాలకు వ్యతిరిక్తంగా జపానీయులు చీనాలో (1931-33) ఇటాలియనులు ఆఫ్రికాలోని అబిసీనియాలో జర్మనీ ఇటలీల బహిరంగ సహాయంతో ఫ్రాంకో స్పెయిన్‌లోను (1935-1939) ముట్టడులను ఆక్రమణలను సాగించగా వాటిని జాతిసంఘమువారు నివారింపలేదు; సవ్యపరిష్కారముకు యత్నించలేదు. సరికదా వాటి ఔచిత్యముగూర్చి ఈసంఘపుసభ్యులలో అభిప్రాయభేదాలు కలుగుచుండెను.

ఈజాతిసంఘము నిస్సార మని అశక్త మని గ్రహించి వర్సైలేసంఘపునియమాల నుల్లంఘించుచు నవ్యాస్త్రబలగర్వితుడు నాజీనేత హిట్లరు తన జర్మనుదళాలతో 1938 సం॥ లో ముందుగా ఆస్ట్రియాను ఆక్రమించిన పిమ్మట ఆంగ్లఅమెరికా ఫ్రాన్సులలో ఆర్థికవ్యత్యయము హఠాత్తుగా బ్యాంకులు దివాలాఅయి వస్తువులధరలు పడిపోయినవి. దానినుండి కోలుకొని వ్యాపారాదులు రక్షించి తాము ను విమానదళములను హెచ్చించుకొని ప్రత్యర్థులతో పోరుట కా ప్రజాయత్త రాజ్యాలపాలకులు అహోరాత్రములు నవ్యాయుధవృద్ధి చేయుచు, తాము ను వైమానికశక్తిని బలపర్చుకొనుచుండిరి. అమెరికా అధ్యక్షుడు రూజువెల్టు బీదల కనుకూలంగా "నవ్య ప్రణాళిక" పెట్టగా బ్రిటనులోను కార్మికుల కనుకూలమగు

కొన్ని విధానములు పెట్టి కార్మికస్థితి బాగుచేసి ప్రజాక్షేమము కొంత కాపాడిరి. శత్రుపక్షంలో విమానశక్తి బలమగుకొలది ఆంగ్ల అమెరికనులును నౌకాబలంతో సహా భూ వాయురంగాల లోను యోధశక్తిని వృద్ధిచేసుకొని విమానదళములను పెంచుకొనిరి. ఇట్లు లోకంలో ముఖ్యరాజ్యాలమధ్య మరల ఆయుధ వృద్ధి పోటీయు స్పర్ధయు అతివేగంతో (విజ్ఞానావిష్కరణాల సహాయంతో) వృద్ధి కాజొచ్చినది. ఈ ఆంగ్ల ఫ్రెంచి అమెరికనుల సామ్రాజ్యలాభములను తద్వారా ప్రాబల్యం కల్గుటను జూచి జర్మన్ ఇటలీ జపానీయులు సహజంగా అసూయచెంది వారితో పోరి తాము సామ్రాజ్యబలం సంపాదింపజూచిరి. ఇట్లు వేర్వేరు రాజ్యాలు వ్యతిరిక్తాశయాలతో పరస్పర ద్వేష యుతులై, తమబలములు హెచ్చించుచు జ్వరతీవ్రతతో స్వార్థ సాధనకు పూనుచుండిరి. శాంతిరక్షణ కని యెన్నియో అంతర్జాతీయసభలు సమావేశములు అప్పుడప్పుడు జరుగుచుండినను, ఈ రెండుకూటములమధ్య సంఘర్షము పోగొట్టదగుపక్షద్వయ సమీకరణము అందుకు ఉభయత్ర తగుయత్నమును జరుగనే లేదు.

—

# 69. ద్వితీయ మహాయుద్ధము

ఈ భీకరపరిస్థితులనుబట్టి లోకశాంతికై జర్మనీ ఇటలీ జపానుల ఉద్ధతఘాటి నరికట్టుటకు ప్రజాయత్తరాజ్యాలవారు కలసి పంప్రదించి ప్రక్రియ నాలోచించి నిర్ణయించుట అవశ్యకమని అట్టి సమావేశం చేయుద మని 1938-39 లలో చాల సారులు రష్యనుమంత్రులు ఆంగ్ల ఫ్రెంచి అమెరికనుఅధికారుల నాహ్వానించిరి. కాని ఈరాజ్యాలప్రముఖులలో నాజీఫాసిస్టుల మీదకంటె కమ్యూనిస్టులమీద నే అప్పుడు ఈర్ష్యాక్రోధములు హెచ్చుగ నుండెను. కనుక వీ రందు కొప్పుకోక అట్టిసమావేశం జరుగలేదు.

ఈలోగా హిట్లరు ఆస్ట్రియాను కబళించి జెకుప్రాంతపు బొహిమియానుగూడ ఆక్రమించబోయెను. అప్పుడు బ్రిటిష్ ప్రధాని చాంబర్లేను వెళ్లి అందు కొడంబడుచు శాంతిసాధనాశతో మ్యూనిక్ లో హిట్లరుతో నొకసంధి చేసుకొనెను. కాని హిట్లరు అంతటితో తృప్తిజెందక అందుకు భిన్నంగా 1939 మార్చిలో మిగతా జకొస్లావేకియానంతను సైన్యంతో హఠాత్తుగా ఆక్రమించెను. అందులో పోలండు హంగెరీలును కొద్దివాటా పుచ్చుకొన్నవి. కాని త్వరలో పోలండునే హిట్లరు బెదిరించెను. అప్పుడైనను రష్యా సూచించునట్లు బ్రిటిష్ రష్యనురాజ్యాలు తమలో సహకరించి సమిష్టిగ పోలండును సాయుధంగా రక్షింతు మని నిశ్చయం తెల్పియుంటే జర్మనుని యంత ఉద్ధతచర్య అంతటితో ఆగియుండునేమో! కాని అప్పు

డును రష్యాతో హిట్లరు మహాయుద్ధం సాగించవలె ననియు రష్యాతో తాము సహకరించితే కమ్యూనిష్టులకు బలప్రతిష్ఠలు చేకూరు నని కమ్యూనిష్టులే తమ కెక్కువవిరోధు లని యెంచి ఆంగ్లప్రముఖు లందుకు నిరాకరించిరి. అప్పటికి పోలండు కమ్యూనిష్టులకు వ్యతిరిక్తమగు కాతలికు నియంతృరాజ్యమే. రష్యా కక్కడ స్థానములేకుండ ఈపోలండు హంగెరీ ఇత్యాదుల రక్షణకు ఈరాజ్యాలతో బ్రిటిష్వా రంతట తొందరగ నిరర్థక సంధి మాట్లాడుకొనిరి. బ్రిటిష్ అధికారుల ఈవిచిత్ర ధోరణివల్ల రష్యనులు సహజంగా వ్యాకులురై కోపించిరి. ఈస్థితి గమనించి హిట్లరు భేదనీతి నుపయోగించి తనమంత్రిని మాస్కోకు పంపి రష్యా జర్మనీలమధ్య కలహము లేకుండ 'అనాక్రమణసంధి'ని కోరగా అప్పటిప్రమాదము తప్పుటకై రష్యను లాసంధి కొప్పుకొనిరి. అందుమీద బ్రిటిష్వారి కాక్రోశము ఆవేశము కలిగి, బ్రిటనులో తీవ్రసమరసన్నాహములు సత్వరం సాగినవి.

అంతట జర్మను ఐక్యము కావశ్యక మని 'డాన్జిగుపుర ముతో కలయునెపమున 1-9-1939 తేదీన జర్మనులు పోలండు పైన దాడి నారంభించిరి. వెంటనే 3-9-1939 తేదీని పోలండు రక్షణకని ఆంగ్లఫ్రెంచిరాజ్యాలు జర్మనీపైన యుద్ధప్రకటనచేసిరి. ఇట్లు రెండవప్రపంచయుద్ధ మారంభించెను. పోలులు చాల యేండ్లనుండి ఆయుధాలు సేకరించి జర్మనుల నియంతృపద్ధతినే యుద్ధసన్నద్ధులైనను జర్మనుధాటికి తట్టుకోలేదు. నాజీలనవ్యరణ పద్ధతి అందరిని ఆశ్చర్యమగ్నుల చేసినవి. విమానదళములముట్టడితో బాంబరులవర్షంతో టాంకుపటాలాలవిజృంభణతో అద్భుత వేగపు వాహినీవ్యూహములతో ఆయుద్ధ మారంభంలోనే

ప్రచండమై కలవరపర్చెను. అథమం ఆరు నెలలైనా తమ్ము రక్షించుకొందు రన్న పోలు లుద్విగ్నులై 15 రోజులలోనే లొంగిపోయి నిర్వణ్ణులైరి. ఆంగ్ల ఫ్రెంచిమిత్రులనుండి ఒకవిమాన పటాలముగూడ వారిరక్షణకు రాలేదు. పోలండులోని ఆయువుపట్టులన్నియు జర్మనులకు చిక్కినవి. ఈపూర్ణమగు అపజయము చూచి అందులో తూర్పుభాగమున లోగడ రష్యా వశంలో ఉండినది (కర్జను లైనువరకు) రష్యను లాక్రమించు కొనిరి. బాల్టిక్ రాజ్యాలతోగూడ మైత్రి సంధి చేసుకొని, ఆవైపునుండి ఆక్రమణ జరుగకుండ తమ సరిహద్దు రక్షణచేసు కొనిరి. ఇట్లు ఒకనెలలోనే పోలండు పూర్తిగా జర్మనులవశమై నది. ఫ్రెంచిబ్రిటిష్‌వారు పశ్చిమమున సేన లాయుత్తంచేసినను అప్పుడాదిశనైనను జర్మనీని ముట్టడించలేకపోయిరి. నెలలకొలది గొప్ప రక్షణశ్రేణులందు అక్షౌహిణు లార్భాటములు చేయుచున్నను ఆదుర్గశ్రేణు లభేద్యమై యుండెను.

ఈలోగా అట్లాంటికుమహోదధిలో ప్రచండజలయుద్ధములు సాగుచుండెను. దేశాంతరాలనుండి ఆహారాయుధాదులు చేరవేయు బ్రిటిష్‌నౌకలను జర్మన్ జలాంతర్గాములు నీటిలో ముంచివేయ యత్నించుచుండగా వీటిని నవ్యనౌకాయంత్రములతో వేటాడి బ్రిటిష్‌వారు నశింపజేయుచు జలతలంపైన దొరికిన జర్మనునావలన్నిటిని పట్టిలాగుకొని వాడుకొనుచుండిరి. కొన్ని తప్పించుకోలేని జర్మనునౌకలను (శత్రువశం కాకుండుటకై) జర్మనులే ముంచివేసుకొనుచుండిరి. ఇట్లుండ ముంచబడిన కొన్ని బ్రిటిష్‌నౌకలనుండి చేర్చిన ఆంగ్లఖైదీలను (1940-లో) జర్మనులు తమనౌకలో జర్మనీకి చేరవేయు

యత్నంలో నార్వేదేశపుతీరంవెంట బోవుచుండిరి. ఇది బ్రిటిషురాజ్యముకు వాయవ్యదిశను కొంతదగ్గరలో నున్నది. ఈనౌకను బ్రిటిష్‌యోధులు తమనౌకలతో వెంటాడి (నార్వే అధికారులు వద్దన్నను, నార్వేతీరంలో పట్టుకొని అందలిజను లందరిని విడిపించి తీసికొనిపోయిరి. అంతవరకు తటస్థరాజ్యమైన నార్వేగూడ అంతట రణరంగమైనది. జర్మనులు డెన్మార్కుగుండ నార్వేను సముద్రంమీదుగా విమానసేనతో ముట్టడించి ఆక్ర మించిరి. బ్రిటిష్‌సేన లక్కడకువెళ్ళి పోరియు ఓడిపోగా, నార్వేఅంతయు జర్మనులవశ మయినది.

ఈస్థితిలో భయోద్విగ్నులై బ్రిటిష్‌పార్లమెంటు చాంబర్లేనును మంత్రిత్వమునుండి తొలగించి చర్చిల్ ప్రధానిగ సర్వపక్షపు జాతీయమంత్రివర్గము నేర్పర్చుకొని సర్వశక్తులను కేంద్రీకరించి మహాదీక్షతో సమరయజ్ఞము సాగించిరి. బ్రిటిష్ డొమినియనురాజ్యాలు ప్రత్యక్షంగా (పరోక్షంగా అమెరి కనులును) వారికి తోడ్పడిరి. ఆంగ్లమిత్రమండలితో అను బంధము కల్గి బ్రిటనుకు జర్మనీకి మధ్యనున్న హాలండు బెల్జియం లగ్జెంబర్గులను అప్పుడు జర్మనులు టాంకు విమానదళములతోనొ క్కసారిగ ముట్టడించిరి. బ్రిటిష్‌వారు ఫ్రెంచివారు తీవ్రకృషితో తోడ్పడియు ఈదేశముల రక్షింపలేకపోయిరి. విమానబృంద ములనుండి ఛత్రయోధులు అక్కడి కీలకస్థానములందు దిగి అక్కడి రక్షణనిర్మాణములను యాంత్రికకేంద్రాలను భిన్నభిన్న ములు చేయుచు వెనుకనుండియు శత్రుదళముల ముట్టడించి కలవరపర్చిరి. ముందుగా విమానాశ్రయములను ఆకాశము నుండి ముట్టడించి పట్టుకొని తమ కుపయోగించుకొసాగిరి. ఇట్టి

క్రొత్తపద్ధతులతో శత్రువులను కల్లోలపరచి జర్మను లొకనెల లోనే ఆదేశములను జయించి వాటికి దక్షిణసీమనున్న ఫ్రాన్సు ఉత్తరభాగమును అమితవేగంతో టాంకుదళములతో ఆక్ర మించిరి; వా రీరీతిగ ఫ్రెంచి దుర్గపంక్తులను రక్షణకోటలను ప్రక్కనుండి తప్పించుకొని ఫ్రెంచి బ్రిటిష్ సేనాదళములను ఛేదించి చెల్లాచెదరు చేయగల్గిరి. ఇట్టి బ్రిటిష్ సేన యొకటి బెల్జియంలో చిక్కుబడి 'డన్కర్కు' రేవుకు చేరి తమ ఆయుధ సామగ్రిని లోహరథములను వదలి తాముమాత్ర మెట్లో చిన్ననావలమీాద మరల ఇంగ్లండు చేరగల్గిరి. బెల్జియంరాజు లియోపాల్డు జర్మనులకు లోబడెను.

ఆవరుసను జర్మనులు ప్రబలవిమానాదులతో పశ్చిమ దిశను భీకరంగా దాడిచేసి క్షోభించియున్న ఇంగ్లండును 1940 జూన్‌లో ముట్టడింతు రని కొంద రూహించిరి; (అట్లు జరిగియుంటే యేమిమార్పు వచ్చెడిదో) కాని, హిట్లరు ఆద్వీప ముల కప్పుడు సేనలను పంపక, హిట్లరు జర్మనుదళములను ఫ్రాన్సుమధ్యలోకి మరలించి ఫ్రెంచిసేనలతో 200 మైళ్లు వెడల్పున హాహాకారిగా ఘోరయుద్ధం సాగించి సుమా రొకనెలలో మధ్యఫ్రాన్సంతయు సముద్రతీరమువరకు జయిం చెను. ఫ్రెంచివా రప్పుడు కోరినను, అమెరికనులు వెంటనే సైనికసహాయం చేయలేదు. అంతటి నిస్సహాయులగు ఫ్రెంచి వారు నిర్విణ్ణులైరి. ఈవిప్లవంలో అక్కడ క్రొత్తప్రభుత్వ మేర్పడి ఫ్రెంచిప్రభుత్వంవారు జర్మనులవశులై వారితో వెంటనే సంధి చేసుకొనిరి.

కాని కొందరు ఫ్రెంచివారు అందు కొప్పుకొనక యుద్ధ మింకను సాగించుటకు ఇంగ్లండులో యోధకార్యసమితి నేర్పరచిరి. కొన్ని ఫ్రెంచినౌకలు విమానములు నెట్లో దాటించి బ్రిటిష్‌వశం చేసుకొనిరి. అట్లు చేరని కొన్ని నౌకలను జర్మనులకు దొరకకుండునట్లు బ్రిటిష్ యోధులు ముంచివేసిరి. ఈసమయంలోనే ఇటలీవారు జర్మనీకి మద్దతుచేసి, ఫ్రాన్సుపైన యుద్ధం ప్రకటించి మధ్యధరాప్రాంతంలో కొంత జర్మనులకు తోడ్పడిరి. ఈవక్రగతిని వ్యవధిని గమనించి అమెరికనుల సంపూర్ణసహాయంతో బ్రిటిష్ వారు స్వదేశరక్షణ కన్ని యేర్పాట్లును తీవ్రంగా చేసికొనిరి. వేలకొలది నవ్యవిమానములలో యంత్రసామగ్రులతో యోధులు అమెరికానుండి వాయు వేగంతో ఆంగ్లదేశరక్షణకు వచ్చి కాసి, అద్భుతమగు రక్షణ నిర్మాణముల జేసియుంచిరి.

కొందరు డొమినియనువైమానికులును వివిధసాధనపరికరాలతోవచ్చి సోదరాంగ్లులరక్షణకు తోడ్పడిరి. ఆపిమ్మట సెప్టెంబరులో జర్మనులు ఇంగ్లండుపైన తీవ్రంగా విమానపు దాడులు జరిపిరి. వాటివల్ల లండను మున్నగు కొన్నినగరములకు కొంతజనద్రవ్యనష్టము కల్గినది. కొన్నిపురములు ధ్వంసమైనవి. కొంత భయోత్పాతము కల్గినది. కాని ఈలోగా సన్నద్ధులైన బ్రిటిష్ వారు మొండిధైర్యముతో పోరుచు శతఘ్నులతో రహస్యయంత్రాలతో కొన్నిజర్మనువిమానముల నేల గూల్చుచు ఆఘాటికి నిలువగల్గిరి. అంతటితో నాజీలు ఇంగ్లండుపై పెద్దదాడిని నిల్పివేసి పశ్చిమయూరపునుమాత్రం తీరంవరకు తమవశమం దుంచుకొని మరల ప్రాచ్యరంగముకు

వచ్చిరి. అక్కడి బాల్కన్ ప్రాంతంలో హంగరీ రుమేనియా ఇత్యాదులను గ్రీసు ఆల్బేనియాలను ఇట్లే వాయుభూసేనల యంత్రసాహచర్యంతో జర్మనులు వశపర్చుకొని, దాదాపు తూర్పుయూరపుకంతకు అధిపతు లయిరి. ఆపిమ్మట అపారమగు యోధశక్తితో గూఢసన్నాహములు చేసికొని హిట్లరు తన జీవితాశయమగు రష్యావిధ్వంసమును సాధించుటకు మహా మూర్ఖచర్య జరిగించెను. (అప్పటికి 25 ఏండ్లనుండియు తీవ్రంగా కమ్యూనిస్టురష్యాను హిట్లరు విపరీతంగా నిరసించి దూషించుచు వారిరాజ్యమును నశింపజేసి పశ్చిమరష్యాభాగమును జర్మనుసామ్రాజ్యంలో కలుపుకోవలె నని చాటుచుండెను.)



# 70. సమరాంతము

ఇట్లు 'నాజీ' నాయకత్వమున జర్మనుసేన లామహా యుద్ధంలో పశ్చిమయూరపునంతను పూర్వభాగమును జయించిన మీదట హిట్లరు ఆజ్ఞపైన జర్మను అక్షౌహిణులు హఠాత్తుగ తే 22-6-1941 దీని రష్యాపైన 200 మైళ్ళవెడల్పున గొప్ప దండయాత్ర సాగించెను. ఆ ప్రచండసంగ్రామంలో లక్షలకొలది సాయుధపదాతులు వేలకొలదిటాంకులు విమానదళములు పశ్చిమరష్యాలో రంగస్థలములు రుద్రభూములుగ జేసి ఆ ప్రాంతపు ఫ్యాక్టరీలు, ఆనకట్టలు, జలాశయములును ధ్వంసపర్చి బీభత్సముచేసి జర్మను లోకమేడాది తీవ్రంగా విజృంభించిరి. ఆప్రాంతపు నాగరికనిర్మాణములన్నియు నాశనమయి లక్షల కొలదిజనులు హతులైనను రష్యనుసేనలు ఆవేశోద్రేకంతో మాస్కోను రక్షించుకొనుటేగాక స్టాలిన్‌గ్రాడువద్ద జరిగిన అద్భుతవ్యూహాయుద్ధంలో తుదకు జర్మను అక్షౌహిణుల నరికట్టి పారదోలిరి. ఈలోగా మధ్యధరాసముద్రం దాటి ఉత్తర ఆఫ్రికా ప్రవేశించి ఈజిప్టును ఛేదించి మధ్యప్రాచ్యపు తురుష్క రాజ్యాలద్వారా దక్షిణరష్యాను భారతపు సరిహద్దువరకు వ్యాపించుటకు జర్మనులు చేసిన అద్భుతమహాయత్నము రష్యను లకేగాక ఆంగ్ల అమెరికనులకును భయోత్పాతం కల్గించగా అప్పటికి వారు భారతదేశమును రణసాధనలమహాకేంద్రంగా చేయుచుండిరి. జర్మనునియంతవేసిన యీ జైత్రయాత్రాప్రణా ళిక వారిశక్తిసాధనములకు మించినది. తూర్పున జపానీయులు

ఆంగ్లఅమెరికాకూటపు మిత్రచతుష్టయమును ఢీకొని పసిఫికు సాగరపువిశాలరంగంలో మహాదావానలమును సృజించిరి. వారప్పటికే చీనాలో తీరప్రాంతమంతను జయించి, ఫ్రెంచి ఇండో చైనాను సయామును బ్రిటిష్‌మలయాను జయించి, అమెరికనువశపు ఫిలిప్పైనులను డచ్చి ఇండోనేషియాను ముట్టడించి, అద్భుతశూరత్వంతో వశపర్చుకొనిరి. ఇట్లు 7-11-1941 నుండి ప్రారంభించిన ప్రాచ్యరంగపు మహాసమర మాపసిఫికుమహా ప్రాంతమంతను అల్లుకొనెను. 1942 ఏప్రియలునాటికి బర్మాను జపానీయులు జయించిరి. యుద్ధరంగము భారతదేశపు అస్సాంప్రాంతముకు విస్తరించినది. జాపులతోడ్పాటుతో భారత జాతీయసేన యేర్పడి సుభాష్‌బోసునాయకత్వమున మణిపుర ప్రాంతముకు వచ్చి, వెనుకకు తగ్గెను.

ఇట్లు ప్రాక్పశ్చిమరంగాలలో వెల్లివిరిసి వచ్చువాహినులు భారతదేశప్రాంతంలో కలసి ఆసియా యూరపులంతట సర్వాధికారం వహించు నను శత్రుప్రచారవిజృంభణలకు ఆంగ్ల అమెరికనులు దిగ్భ్రమజెంది విభ్రాంతులైరి; భారతదేశమంతను సమర శిబిరముగజేసి, అన్నిప్రక్కలనుండి మోటారు విమానాదిదళము లను హెచ్చుగ చేర్చిరి; భారతదేశపు సర్వసంపదలను జనశక్తు లనుగూడ ఏకైకదృష్టితో యుద్ధసంచాలనకు కేంద్రీకరించి, వాటి నన్నిటిని ఆమహాయుద్ధంలో తమ ఆవశ్యకతలకు యథేచ్ఛగా వినియోగించిరి. 1943 నుండి ఎట్లో యుద్ధప్రవృత్తి ఆంగ్ల అమెరికనుపక్షముకు అనుకూలంగా మారినది. యూరపులో తూర్పున రష్యనులు పశ్చిమదక్షిణాలలో ఆంగ్ల అమెరికనులు విమాననౌకలయంత్రపరికరాలు సహా ప్రయోగించి,

జర్మను యుద్ధస్థావరాలను యంత్రకేంద్రాలను మర్దించి, ఒత్తిడి చేసిరి. అంతట జర్మనులు తాళలేక 1944-లో లొంగిపోయిరి. నాజీనాయకుడు హిట్లరు జర్మనురాజధాని బెర్లిన్‌లోనే హతుడాయెను. ఇట్లు యూరపురంగపుయుద్ధము అంతముకాగా, దానితో అమెరికనులును తమనౌకావిమానదళములను అన్నిటిని ప్రాగ్దిశకు మరల్చి, విశాలపసిఫిక్ పారావారపు వేలకొలది ద్వీపములను వరుసగా జపానీయులనుండి జయించుచు, జపానును సమీపించి అందుపైన విమానాలదాడులు తీవ్రంగా సాగించిరి. ఇట్లు జపానీయులు ఆత్మరక్షణకే తమ నౌకావిమాన దళములు కేంద్రీకరించవలసివచ్చి, తాము లోగడ జయించిన లక్షలకొలదిమైళ్ళ సముద్రాంతరములలో వ్యాపించిన విశాల రాజ్యములన్నియు వదలుకొనిరి. 1945-వ సంవత్సరంలో అమెరికనుఅక్షౌహిణులు జపానులోని రెండునగరాలపైన విమానాలనుండి (అణుశక్తి విజ్ఞానంద్వారా కోట్లకొలది డాలర్ల ఖర్చుతో తయారైన అపారవిధ్వంసకమైన) ఆటంబాంబులను ప్రయోగించిరి. అక్కడ యమయాతన గల్గి, ఆపురములజనులు స్త్రీశిశుసహితం మరణించిరి; ఆస్తులు ధ్వంసమయినవి. (భూకంపపు భయమువల్ల) జపానులో ఇండ్లు చాలవరకు కఱ్ఱతో అట్టలతో కట్టుకొందురు. అగ్నిప్రమాదము హెచ్చుగుటవల్ల అవి హెచ్చుగ తగులబడినవి.

ఈభీభత్సపు పైశాచికచర్యలవల్ల శాంతజనులు వేలకొలది మరణించిరి; అంతట జపానీయులలో హాహాకారము వ్యాపించి, వెంటనే అమెరికా అడిగినప్రకారం జపానీయులు అస్త్రసన్యాసం జరిగించిరి. ఇట్లు మహాయుద్ధ మంతమయి, ఆంగ్ల

అమెరికనుల మిత్రపక్షము జర్మనీ ఇటలీ జపానుల నాక్రమించిరి. మొదట విజృంభించిన జర్మనీ జపానులదాడి కెట్లో తాళి, క్రమంగా యాంత్రికబలము, యుద్ధపరికరములు హెచ్చుగ వృద్ధిచేసికొని, దీక్షతో నైతికప్రచారముచేసి ప్రపంచప్రజానాను భూతి నెక్కువగా సంపాదించిన రష్యా ఆంగ్ల-అమెరికను మిత్ర మండలికి విజయము గల్గినది. ఈయుద్ధముకు ముందు మహా బలీయ మనుకొన్న ఆంగ్ల, ఫ్రెంచి, డచ్చిరాజ్యాల దుర్బలత దీని అంతమందు వెల్లడియైనది. యుద్ధారంభమున ఎగసిపడిన జర్మనీ ఇటలీ జపానురాజ్యములు క్రుంగిపోయి, తమజాతీయస్వాతంత్ర్య మునుగూడ గోల్పోయినవి.



# 71. మహాయుద్ధఫలితము

మొదటి (1914-18 నాటి) ప్రపంచయుద్ధము అంతకు పూర్వపుయుద్ధాలకన్న ఎక్కువదారుణము, వినాశకరము, విప్లవకరము నయినది. కాని మరి 20 ఏండ్లకే కలిగిన 2-వ ప్రపంచయుద్ధము అంతకన్నను అన్నివిధముల ఎక్కువ హానికరంగా పరిణమించినది. క్రౌర్యంలో, అసత్యప్రచారాలలో, విశాలవ్యాప్తిలో, శాంతపౌరులనుగూడ బాధించుటలోను, ఇది పూర్వయుద్ధాలన్నిటిని మించినది. దీనిఫలితంగా లోకస్థితి అన్ని రంగాలలోను అన్నివర్గాలలోను తారుమారైనది. ఈయుద్ధము బాంబరు టాంకు ఇత్యాదులముట్టడులతో రౌద్రంగా ఆరంభించి, శాంతిప్రియులను తల్లడిల్లజేసి, ఆటంబాంబుప్రయోగంతో ఆబాలగోపాలపు వేలకొలది పౌరులను క్షణంలో తుడిచిపెట్టుటతో సమాప్తమయినది. దాక్షిణ్యము మానవధర్మమును క్షీణించినవి.

1-వ మహాయుద్ధపుచివర ఎంతకఠినమైనను శాస్త్రీయపు సంధి ఏర్పడి, ఓడినరాజ్యముకు స్వదేశంలోనైన స్వతంత్రత కల్గినది. ఈసారి సమర మంతమై 5 ఏండ్లు అయినను సరియగు సంధియే లేదు. పరాజితదేశాలు నేటికీ శత్రురాజ్యాల ఆధిపత్యంలో నున్నవి. ఇది విజేతల క్రౌర్యాధిక్యమును సూచించును. జపానులో అమెరికనుదూతకు అంత్యాధికారము. జర్మనీ

ఖండితమై నేటికీ రెండు వ్యతిరిక్తాశయపురాజ్యాల భిన్నాధిపత్యంవల్ల నలుగుచున్నది. చిన్నకొరియాయు ఇట్టిదౌర్భాగ్యమును లోనై, అందులదుష్ఫలము నక్కడి పీడితప్రజ లిప్పుడు భీకరయుద్ధంద్వారా అనుభవించుచున్నారు. 1945-కు పిమ్మటను మహాదారుణములుజరుగుచునేయున్నవి. మిగిలినరాజ్యాలలోను కల్లోలము లేర్పడి, నేటికిని సాగుచున్నవి. డచ్చిసామ్రాజ్యము చావు దప్పి కన్ను లొట్టబోయినను వారిని సామ్రాజ్యపిపాస బాధించుచున్నది. బెల్జియంగతియు నట్లే. అక్కడ రాజును మరల తెచ్చినందుకు కార్మికులు ఉద్రిక్తులై వెడలగొట్టించినారు. ఫ్రెంచివారు గృహకల్లోలంతో క్రుంగుచున్నను, ఇండో-చీనాలో ప్రజలనోరుకట్టి హింసించి సామ్రాజ్యలాభం పొందజూచుచున్నారు. బ్రిటిష్‌వారి అసమానసామ్రాజ్య మిప్పుడు కొంత విచ్ఛిన్నమైనది. వా రిప్పుడు పూర్వపుబలిష్ఠతను ప్రపంచనేతృత్వమును గోల్పోయి, వాటిని ప్రబలురగు అమెరికాకు విధిలేక సమర్పించుకొన్నారు. లండనుకు బదులు న్యూయార్కు ప్రపంచపు ఆర్థికరాజధాని యైనది. బ్రిటిష్‌పౌనునాణె మిప్పుడు డాలరుకు లొంగి సేవచేయుచున్నది. వారిసామ్రాజ్యమునుండి భారత బర్మాలు తప్పుకొన్నవి. కామన్వెల్తులో మన భారత మున్నను సమానప్రతిపత్తితో ఇచ్ఛికముగనున్నది. అందలి శ్వేతరాజ్యములును 'మాతృదేశం'తో పూర్వపు అనుబంధము తగ్గించుకొనుచున్నారు. బ్రిటిష్‌వారి సమరబలము ఆర్థికనైతిక శక్తులు క్రుంగిపడినను, ఇటీవలనే ఆంగ్లులదేశభక్తి అద్భుతకృషి ద్వారా కోలుకొనుచున్నవి. రష్యావారు బ్రిటనుకన్నను గత

యుద్ధములో నెక్కువదెబ్బతిన్నను, అక్కడిప్రజల తదేకదీక్ష వల్ల రష్యా త్వరలో బలపడినది. ఈమహాయుద్ధ మసలు శ్వేత జాతులలోనే అంకురించినను, వారిప్రాభవమందున్న రంగు జాతుల వా రెక్కువమంది మరణించి వారిసంపదలు ఆహుతి యైనవి. అయితే మొత్తంమీద ప్రపంచప్రజనసంఖ్య వేగంగా హెచ్చుచు, ముఖ్యంగా అమెరికా బ్రిటనులలో వస్తువుల బహుళోత్పత్తియు పెరుగుచున్నది. అయితే, పురుషుల (అందును మధ్యవయస్కుల) సంఖ్య యుద్ధకారణమున తగ్గి, సాంఘికవిప్లవము, అవినీతియు పెరిగినవి. యుద్ధావశ్యకత కని కట్కోట్లకొలది ఆహారవస్తువులు ఖనిజవృక్షాది సంపదలును యథేచ్ఛంగా పాలకులు భావిదృష్టి లేకుండ వినియోగించిరి. తత్కారణమున యుద్ధకాలంలో తిండిలేక శాంతపౌరులలోను లక్షలకొలది జనులు మరణించిరి; మిగిలినవారు నేటికిని నానా బాధలు పడుచున్నారు. పశుధనమును చాల క్షీణించినది. ఆహారసమస్య నానాటికి జటిలమగుచున్నది.

వీని అన్నిటికన్న ముఖ్యము నైతికపతనము. పత్రికలు, రేడియోలు, సినీమా ఇత్యాదులద్వారా యుద్ధావశ్యకతలపేర అసత్యదౌర్జన్యాదుల దుష్ప్రచారములు ఇనుమడించినవి. ఈవిష వ్యాప్తివల్ల లోకమంతట అన్నివర్గాలలో అన్నిపక్షాలలో హింసాధోరణి, కులమతద్వేషాలు, స్వార్థపరత, విశృంఖలతయు విపరీతంగా పెరిగి విద్యావంతులలోను ఆదరపాత్ర మగు చున్నవి. ఈసారి మహాయుద్ధం సమాప్తమైనమీదను గ్రీసు, చీనా, ఆగ్నేయాసియా, బర్మా ఇత్యాదులలో మహాసమరములు

సాగుచునేవచ్చినవి. నిజమగుశాంతిప్రియతయు శాంతప్రవృత్తియు నేటికిని ఏర్పడలేదు. సరియగు దైవభక్తి పాపభీతి ఆస్తికత న్యాయమగుక్రమశిక్షణయు చెడినవి. వెనుకటికన్న ఆసియాలో కమ్యూనిజము కిప్పు డెక్కువప్రాబల్యము కల్గి అందరిలోను హింసాపరత్వము పెరుగుట కీ యవినీతియు నిరాశాధోరణియు కొంతకారణము కావచ్చు. అట్టి వాతావరణంలో అహింసాసత్యప్రచారం చేసి అందుకు జీవితం ధారపోసిన గాంధీమహాత్ముడు హత్యపాలగుట కాకతాళీయముకాదు.



# 72. భారతీయస్వాతంత్ర్యము

కాని, ఈమహాయుద్ధపుఫలితంగా లోకముకు కొన్ని సత్ఫలితములును కలిగినవి. ఈమహాభూకంపంవల్ల లోకమంతట రాజకీయసాంఘికాలలో మహావిప్లవ మేర్పడినది. ఆగ్నేయ ఆసియా బర్మాచీనాలకు స్వాతంత్ర్యము లభించినది. అనగా ఈమహాయుద్ధం నాటికి పరాధీనస్థితిలోనో (చీనావలె) శ్వేత జాతుల అంత్యాధిపత్యంలోనో యున్న ప్రపంచపుసగంజనాభా గలజాతుల కిప్పుడు రాజకీయంగా జాతీయస్వాతంత్ర్యము లభించినది. ఈపరిణామ మీమహాయుద్ధపు ప్రత్యక్షఫలం కాక పోవచ్చు; కాని దాని తీవ్రప్రభావంవల్ల త్వరగా లభించినది. వాటిలో తక్కినవాటి తీవ్రక్రాంతికి ముఖ్యకారకమగు మన భారతదేశంలోని పరిణామ మెక్కువముఖ్యము, విశిష్టమును.

మహాయుద్ధపు ఆరంభంలో బ్రిటిష్‌వారీదేశములో అవలంబించిన ఉద్ధతనిరంకుశపద్ధతిని విమర్శించి, భారతజాతీయ వాదులు బ్రిటనువగైరాలలోవలె ఈదేశంలోను సర్వకక్షి జాతీయప్రభుత్వ మేర్పరుపగోరిరి. అట్లు జరుగనందున అప్పటి కుండిన ప్రాంతీయస్వాతంత్రము (Provincial autonomy) ను కూడ కాంగ్రెసువారు వదలుకొనిరి. జాతీయమంత్రివర్గములకు బదులు దౌర్జన్యము నియంతృపాలనము సర్వత్ర విజృంభించినవి. బ్రిటనులో డొమినియనులలో మాత్రం ముందుగ తమ శ్వేత ప్రతినిధులలో సంప్రతించి వారి ఇచ్ఛానుసారమే చేసిరి. ప్రజా నీకమంతటికష్టసుఖములు మార్చు ఇట్టి ప్రచండసమరంలో

ప్రజానాయకులభావములను తృణీకరించి, దౌర్జన్యపద్ధతులతో జనుల నోరుకట్టి దేశసంపద లన్నిటిని యథేచ్ఛగ వినియోగించి హింసాప్రవృత్తి సాగించు పరప్రభుత్వపుదుర్నీతిని ఖండించుచు మనదేశంలో జాతీయవాదులు గాంధీమహాత్ముని నాయకత్వమున సమిష్టిసత్యాగ్రహం సాగించ 1942 ఆగస్టులో నిశ్చయించినారు. కాని ఈసత్యాగ్రహము పుట్టకముందే దాని నణచివేసి యథేచ్ఛగ పాలనను యుద్ధపద్ధతిని సాగించ నిశ్చయించి, పరాయి ప్రభుత్వ మప్పుడు (1942 ఆగస్టు 9 నుండి) వేలకొలది ప్రజా ప్రముఖులను హఠాత్తుగ నరెస్టుచేసి నిర్బంధించి, అతికఠినమగు ఆర్డినెన్సులను జారీచేసి, అధికారదౌర్జన్యమును ధారాళంగా సాగించిరి. ప్రజాప్రతినిధులమంత్రివర్గము నేర్పర్చి వారి సలహాతో పాలింపు మని తమరక్షకులగు అమెరికనుఅధ్యక్షుని సూచించినను గూడ, ఈవిషయంలో చర్చలు నిరాకరించుట లజ్జాకరమైనది. కనుక సహజంగా ప్రజలలో అట్టి దుష్ట ప్రభుత్వంపైన ద్వేషాగ్ని పెరిగిపోయి, చాలచోట్ల జనులు ఆద్వేషమును వివిధరూపముల గనపర్చిరి. రైలుపట్టాలు తీగలు తొలగించుట సర్కారుకార్యాలయాలు తగులబెట్టుట ఇట్టి అప్పటిచర్యలు శాస్త్రీయంగా సత్యాగ్రహచర్యలు కావు; కాని అవి బ్రిటిష్‌ప్రభుత్వంపైన విద్వేషమునకు ప్రత్యక్షచిహ్నము లని బ్రిటిష్‌వారును గ్రహించిరి. యుద్ధాంతమున బ్రిటిష్ వారి పరపతి అసలే నశించినది. జర్మనులముందర జపానీయుల యెదుటను పోరలేక, బ్రిటిషువారు తాము తెచ్చిన భారతీయ సేనలను బర్మా మలయాలరంగంలో దిక్కులేకుండా శత్రువుల కరుణకు వదలి, తాముమాత్రం నౌకావిమానములలో పారి

పోవుటతోను, ఈ దేశంలో చూపిన వారిపిరికిచర్యలతోను బ్రిటిష్ వారి పరపతియు వారియందు జనాదరమును పూర్తిగ నశించినవి. యుద్ధాంతముకు ఆంగ్లుల ఆర్థికశక్తియు నౌకాదిసైనికశక్తియు క్షీణించెను. జనుల స్వాతంత్ర్యదీక్ష భారతీయసైనికులలోను బాగుగ వ్యాపించినది. ప్రవాసులగు భారతీయులు బర్మాలో సుభాషునాయకత్వమున సాగించిన దాడియు దానిపైని బ్రిటిషు వారిచర్యయు ఇందుకు తోడ్పడినది.

1945-సం॥లో జరిగిన బ్రిటిష్ పార్లమెంటు ఎన్నికలలో చర్చిలునాయకత్వపు కేవలసామ్రాజ్యవాదులగు కాంసర్వేటివులోడి, లేబరు (కార్మిక) పక్షంవారు బ్రిటిషుపాలకులైనారు. అంతట రెండేండ్లు గాంధీ నెహ్రూ ఇత్యాదిప్రజానాయకులతో రాయబారములు జరిగి, తుద కెట్లో భారతదేశముకు స్వాతంత్ర్యము రాజీద్వారానే సిద్ధించినది. అయితే వాయవ్య-ఈశాన్యపు ముస్లింప్రాబల్యపుభాగాలు 'పాకిస్తాను' అనుపేర ప్రత్యేక రాజ్యముగ నేర్పర్చబడినది. (అది ఇప్పటికిని బ్రిటిషుడొమినియనుగ నున్నది.) భారతరాజ్యము రిపబ్లికుగ క్రొత్తరాజ్యాంగ మేర్పఱచుకొన్నది. సౌకర్యముకై కామన్వెల్తుసంబంధము మాత్ర ముంచుకొన్నది.

దేశంలో పుదుచ్చేరి యానాం మున్నగు (ఫ్రెంచి) తీరస్థలాలు గోవా మున్నగుపోర్చుగీసు రేవులుమాత్రం ఇంకను విదేశాధిపత్యంలోనే యున్నవి. పూర్వపు మనదేశీయసంస్థానములును ఇప్పుడు భారతరాజ్యంలో మిళితమైనవి. కాశ్మీరమును మిళితమైనను, పాకిస్తానువారి అవరోధంవల్ల అది ఇంకను తగాదాలో యున్నది.

బ్రిటిష్ సామ్రాజ్యపునాయకమణిగనుండిన భారతదేశము స్వాతంత్రత నొందగనే, వెంటనే ప్రక్కనున్న బర్మారాజ్యమును పూర్ణస్వతంత్రరాజ్య మైనది.

దక్షిణపుప్రక్కనున్న సింహళమునకును డొమినియను ప్రతిపత్తి సిద్ధించినది. ఉత్తరపునేపాలు భారతప్రభుత్వంతో అనుకూలసంధి చేసికొన్నది. ఇకమన భారతరాజ్యంలోనిసామంత రాజ్యాలలో స్వతంత్రసంస్థానములలో కొందరుపాలకులు మొదట వ్యతిరేకించినను తమ కిదివరలో అండగనుండిన బ్రిటిష్ వారితోడ్పాటిక లభించదనియు ప్రజాభిప్రాయము నిర్నిరోధమనియు గ్రహించి, భారతకేంద్రరాజ్యముకు లోబడి, ప్రజాయత్తపాలనలో పాల్గొన సమ్మతించిరి. కనుక 26-1-50 నుండి అమలుకువచ్చిన భారతరాజ్యము (పాకిస్థానుమినహా) ఒకే మహారాజ్యముగ నేర్పడి, అట్లు అమలుకువచ్చి, మిగతారాజ్యములతో స్నేహసంబంధములు కలిగియున్నది. మధ్యప్రాచ్యపు ముస్లిం సంస్కృతికి దూరప్రాచ్యపుబౌద్ధసంస్కృతికి పాశ్చాత్యసంస్కృతికిని అసలు భారతసంస్కృతితోసహా చారిత్రాత్మికసమ్మేళన మీ దేశములోనే కల్గియున్నది.

# 73. మలయా రాజ్యము

భారతవర్షాల కాగ్నేయదిశనున్న మలయా రాజ్య మింకను బ్రిటిషుపాలనలోనే అశాంతస్థితిలో నున్నది. అక్కడి మలయనులలో తగినసంస్కృతియు ఏకీభావమును లేవు. మరియు లక్షల కొలది భారతీయులు అంతకంటె హెచ్చుగ చీనులును అక్కడ తరతరములుగ వలసయున్నారు. వీరందరు వివిధభాషికులు నానాగోత్రికులుగ నుండుట జూచియు, ఇక్కడ ఉత్పత్తి యగు రబ్బరు తగరము మున్నగువ్యాపారవస్తువుల అధికలాభమును తమకే ఇంకను నిలుపుకొనుపేరాశతోను బ్రిటిషువా రక్కడ సామంతరాజుల నుంచి, జనులలో విభేదాలు పెంచి, తమ యాధిపత్యమును యథాప్రకారంగా సాగించుకొనుచున్నారు. అయితే అక్కడిప్రజ లిందు కొప్పుకొనుటలేదు. 1942 ఆరంభంలో దానిరాజధానిసింహాపురదుర్గమును జపానువారు పట్టుకొని మలయారాజ్యమంతను జయించి, బ్రిటిషువారి నటనుండి పారద్రోలి, మూండేళ్లు యథేచ్ఛగా పాలించిరి. జపానుసామ్రాజ్యము 1945-సం॥లో ఓడి కూలిపోగా, జపానీయులు హఠాత్తుగా మలయారాజ్యమును ఖాళీచేసిరి. పారిపోయిన భూస్వాములు వర్తకులువలె పాలకులును సందుచూచుకొని మరల సింహాపురితో బాటు మలయారాజ్యమంతను ఆక్రమించి, యథాప్రకారం నిరంకుశాధిపత్యం చలాయించుచున్నారు. కాని ఇంతవరకు అజేయులనుకొన్న బ్రిటిషువారు వట్టి సామాన్యనరులే. ఇక్కడి వారిరాజ్య మన్యాయము, వా రార్థికంగాను జనుల బీడించుచున్నారు, వారి నోడించి స్వతంత్రుల మగుదము మనుజాతీయో

ద్యమ మిప్పుడు మలయాలో నాటుకొని వ్యాపించియున్నది. అక్కడి గొప్పగొప్పతోటలు గనులు వ్యాపారములు బ్రిటిషు ధనాఢ్యులవశములో నున్నవి. వాటిలోని కార్మికు లిపుడు సర్కారునిరాదరణచే బాధపడుచు నిరాశచేత కుపితులై, యజ మానులపైన తిరుగబడుచున్నారు. వీరందరు కమ్యూనిష్టుక్రాంతి కారు లని వీరిదౌర్జన్యము నణచివేసి శాంతిని స్థాపింతు మనుచు, బ్రిటిష్ అధికారు లీప్రాంతాలలో విమానపుదాడులు సైనిక దండయాత్రలు సాగించుచు, క్రూరచర్యలతో పశుబలంతో తమ ఆధిపత్యమును నిల్పుకొనుచున్నారు. రాజకీయంగానేగాక సాంఘికంగాను చాలదుర్దశలో నున్న అక్కడి కొందరుకార్మికు లును నిరాధారజనులును ప్రభుత్వపు ఖరివల్ల సవ్యపాలనయందు నిరాశులై కమ్యూనిష్టుపద్ధతి నభిమానించినను ఆశ్చర్యకరము కాదు. భావపరిణామమును ఈ రేడియోకాలంతో ఎవరును ఆపలేరు. కాని రష్యనులకమ్యూనిష్టుపక్షంతో అక్కడిమలయ నులకు భారతీయులకు ప్రత్యక్షసంబంధములేదు. అక్కడి బ్రిటిషువారు ఇప్పటిస్వార్థపరతను క్రౌర్యచర్యలను విడనాడి ప్రజాక్షేమం కోరి సానుభూతితో వర్తించి వారిస్వాతంత్ర్యపు హక్కును గుర్తించేయెడల మలయాసమస్య, త్వరలోనే పరిష్కా రం కాగలదు. కాని బ్రిటిషువా రింకను అట్టిప్రవృత్తిని చూపనం దున అక్కడ జాతీయతతోబాటు కమ్యూనిష్టుతత్వము బీదజను లలో (ముఖ్యంగా చీనులలో) నానాటికిబలపడుట సహజము. అక్కడ భారతీయులలోను హెచ్చుమంది కార్మికజనులు; పిస్తోలువంశమందున్నందుకు మరణదండన విధించిన సాంబశివన్ కేసునుబట్టియే అక్కడిశాసనము లెంతక్రూరములో స్పష్టమగును.

# 74. ఇండోనేషియా

మలయాకు ఆగ్నేయదిశను ఇండోనేషియా రాజ్య మున్నది. ఇది సుమత్రా, జావా, సెలబసు, మొలకసు మున్నగు వందలకొలదిద్వీపముల సమూహము.

ఇందులో బోర్నియో న్యూగినీలలోని బ్రిటిషుభాగం తప్ప తక్కిన ఇండోనేషియా అంతయు డచ్చిసామ్రాజ్యములో నుండెను. ఇందలి నూనెగనులు పంచదారఉత్పత్తి వగైరాలలో బ్రిటిషువారికిని చాల వాటా కలదు. గతమహాయుద్ధంలో 1940-సం॥ లోనే డచ్చివారి మాతృదేశమగు హాలెండు జర్మనుల వశ మయ్యెనుగదా! 1942-సం॥ లో ఇండోనేషియా దీవు లన్నియు జపానీయులవశమై, మూడేండ్లుపైగా వారి అధీన ములో నుండెను. జపానువారు యుద్ధములో దెబ్బతిని వెనుకకు పోగానే, బ్రిటిషుప్రోత్సాహంతో డచ్చివారు మరల ఇండో నేషియాను ఆక్రమించి పాలింపజూచిరి.

కాని ఈలోగా అక్కడ స్వాతంత్ర్యోద్యమము ప్రబలమై డచ్చివారిపాలనను ఆప్రజలు నిరాకరించి తిరుగబడిరి. డచ్చివారు సైనికంగాను ఆర్థికంగాను చాల దుర్బలులైనను, సామ్రాజ్యాశ విడువక ప్రాకులాడి జాతీయోద్యమమును దౌర్జన్యంతో అణచి వేయుచు, తక్కినజాతులతోడ్పాటు నర్థించుచుండిరి. ఒకసారి ఒకరీతి రాజీసంధి జరిగి, దానిని డచ్చివారు మరల ఉల్లంఘించి దౌర్జన్యంతో సేనాబలము ప్రయోగించిరి. ఆరాజ్యంలోని ఆ ప్రాంతీయజాతులలో విభేదాలు ద్వేషములు పెంచుటకును

యత్నించిరి. అయినను డాక్టరు సోకర్నో, డాక్టరు హట్టా
మున్నగువీరుల నాయకత్వమున ఇండోనేషియనులు జాతీ
యోద్యమమును తీవ్రంగా సాగించిరి; తమలోని కమ్యూనిస్టు
తిరుగుబాటుల నణచివేసిరి. భారతదేశంతో చిరకాలపు
సంస్కృతివ్యాపారాలసంబంధంగల ఇండోనేషియనుల స్వాతంత్ర్య
సిద్ధికై నెహ్రూనాయకత్వమున భారతీయులు సానుభూతి
సహాయముల నిచ్చిరి. ఈలోగా ఐక్య(సంయుక్త)జాతిసమితి
వారును కొంత కల్పించుకొనిరి. ఈ ఒత్తిడులవల్ల దీర్ఘరాయ
బారములు జరిగి, తుదకు రాజీద్వారా ఇండోనేషియనుల కిటీ
వలనే స్వాతంత్ర్యము లభించినది. ఇపుడు వారికి మనదేశంతో
రాజకీయమైత్రి వ్యాపారసంబంధములుకూడ వృద్ధియగు
చున్నవి. ఇండోనేషియనులలో చాల హెచ్చుమంది ముస్లి
ములు; కాని వారు మతమూర్ఖత లేకుండ భారతీయులపైన గౌరవ
ప్రతిపత్తిస్నేహభావములు కల్గియున్నారు. అక్కడకిరోసినునూనె
రబ్బరు కొన్నిలోహములు బీటుదుంపలు మున్నగు ప్రకృతి
సంపదలు చాల గలవు.

---

# 75. చీనా స్థితి

జపానీయులు యూరోపియనుల దూరాక్రమణపద్ధతుల ననుసరించుచు తమవశంలో నుండిన మంచూరియా మంగోలియాలనుండి ఉత్తరచీనాలోనికి 1937 సం॥ లో దండయాత్రను సాగించిరి. అక్కడ చీనుల జాతీయకమ్యూనిష్టుపక్షాలమధ్య అంతఃకలహ ముండెను. వారల శిక్షణపద్ధతిలోను రణనీతిలోను సమన్వయములేక యుండెను. జపానీయులు క్రమంగా దక్షిణం వరకు తీరప్రాంతపు చీనానంతను కబళించిరి. చయాంగుజాతీయ ప్రభుత్వము తమరాజధాని నాంకింగు ఇత్యాదులు వదలి పడమటి చంకింగుకొండలలోనికి తప్పుకొన్నది. కమ్యూనిష్టులు గ్రామపరిసరాలలో వ్యాపించి గెర్రిల్లాయుద్ధము సాగించిరి. బొగ్గు ఇనుముగనులు రైల్వేలు పంటజిల్లాల ప్రధానపురములును జపానీయు లాక్రమించి, తమబలీయత నుపయోగించుకొనిరి. ఈ విషమస్థితిలోను చీనుల చయంగుపక్షము కమ్యూనిష్టు నేతృత్వపు చీనాప్రజాపక్షంతో మిత్రత లేక కలహించుచు, పరాయి అమెరికనులసాయముపైనే ఆధారపడెను. ఇంతలో జపానుకు ఆంగ్ల అమెరికను డచ్చిరాజ్యాలతో ప్రాణాంతకపు యుద్ధ మేర్పడినది. దీని మొదట జపానీయులు విజృంభించినను, వారు 1945 సం॥ నాటికి ఓడిపోయి హఠాత్తుగ చీనానంతను పూర్తిగా ఖాళీచేసి స్వదేశంలో చేరి క్రుంగిపోయిరి. ఈ ఆకస్మిక స్థితివల్ల వారల బలీయమగు విశేషాయుధములు చీనుల పాల

బడినవి (కొమింటాంగువా రెంత అడ్డుకొనజూచినను) అందులో చాలాభాగము ప్రజాసామ్యవాదులకు వశమయినది. ఆ 'కమ్యూనిష్టు' చీనులతో రాజీ కొప్పుకోక వారిపైన చయాంగుపక్షీయులు పెద్దదండయాత్ర సాగించి వారిని వేటాడజూచి తుదకు తామే ఓడిరి. చయంగుపక్షము నానాటికి కేవలం పుంజీపతి పక్షము, స్వార్థపరము, అవినీతిపరము అయి, ప్రజాదరము నసలే కోల్పోయినది. అమెరికను బలములపైనే ఆధారపడుచు చయంగు ప్రభుత్వవర్గ మప్పుడు కేవలం అమెరికనులకు వశంవద మయినది. కమ్యూనిష్టులవ్యాప్తి నరికట్టి చీనాలో తమ ప్రాబల్యము హెచ్చించుకొనుటకు అమెరికను లెంత ఆశపడినను జంకిరి. చయంగుది పేరుకుమాత్రం జాతీయ ప్రభుత్వము, వట్టి నేతిబీరకాయయయినది. చీనాలో బీదలేగాక మధ్యవర్గములును చయంగు ప్రభుత్వమును విడనాడి 'కమ్యూనిష్టు' లనబడు ప్రజాస్వామ్యపక్షముకే అంతటను స్వాగతమిచ్చిరి. అప్పుడు చెలరేగిన గృహాయుద్ధంలో చయంగుసేనల సాయముకని అమెరికను లంపిన ఆయుద్ధసామగ్రులు (కొమింటాంగుల అవినీతి అసమర్థతఫలితంగా చాలవరకు శత్రుపక్షముకు వశమగుచుండెను. ఉత్సాహ చాతుర్యములతో 'కమ్యూనిష్టు' చీనులు విజృంభించి, ఉత్తరము నుండి మధ్యదక్షిణ చీనాలుగూడ ఆక్రమించి చయంగు పక్షీయులగు కొమింటాంగువారిని 1950 నాటికి చీనాభూభాగ మంతటినుండి తరిమివేసిరి. జపానుపతనసమయమందు ఉత్తరపు మంచూరియాప్రాంతమును ఆక్రమించిన సోవియటురష్యనులు సహజంగా తోటికమ్యూనిష్టువాదులకు రహస్యంగా అప్పుడు ఆయుధసహాయంచేసియుందురు కాని అప్పటిసోవియటురష్యా

చయంగుప్రభుత్వముతో మైత్రితోనే యుండెను. చయంగుకు అమెరికనులు ధారాళముగ నిచ్చిన ద్రవ్యాయుధసహాయము వ్యర్థమగుటేగాక పైగా అవి శత్రుపక్షముకు చేరుచుండెను. తుదకు అమెరికనులును నిరాశులై 1948-నుండి చయంగుకు సహాయము మానిరి.

ఈరీతిగా సుమారు 48 కోట్లజనసంఖ్య గల్గి ఫలవంతమై గొప్పప్రకృతిసంపద గల చీనాయంతయు కమ్యూనిష్టుసేనాని యగు మోత్సెటంగునాయకత్వమున గొప్పప్రజారాజ్యముగ నేర్పడినది. ఇది కమ్యూనిష్టురాజ్య మనబడుచు, విదేశాంగ విధానంలో సోవియటురష్యాకు మిత్రమయి వారి కనుకూలముగ నున్నది; కాని మోత్సెటంగుమంత్రివర్గము వివిధప్రజా పక్షయుతము ఇప్పటికిని అక్కడి ఆస్తులయందు వ్యక్తులహక్కు వ్యాపారాదులు చాలవరకు మనదేశంలోవలెనే యున్నవి. అయితే, ఫుంజీపతులపైన చాల హెచ్చుపన్ను వేయబడుచు, జమీందారీవిధానము వ్యక్తుల పెద్దపెద్దకమతములు తొలగింపబడి, బీదలకు సామాన్యరైతులకు మధ్యవర్గీయులకు లాభకరమగు చాల సంస్కరణలు తేబడినవి. అక్కడి ప్రజాబాహుళ్యముకు ఆ ప్రభుత్వంపైన చాలవర కాదర మున్నది. ఆప్రభుత్వము చీనాలో స్థిరపడినది. మనభారతదేశము చీనాలో ఈ నవ్యప్రభుత్వముతో మైత్రిగల్గియున్నది. బ్రిటిషువారును దీనిని గుర్తించినను, వారికి ఇంకను మైత్రియేర్పడలేదు. అమెరికనులు ఈ చీనాప్రభుత్వము నింకను గుర్తింపక చిక్కులు పెట్టుచున్నందున కొంతక్లిష్టపరిస్థితి ఏర్పడినది.



# 76. జపానులో పరిణామం

ప్రాచ్యరాజ్యాలలో అగ్రగణ్యమనుకొన్న జపాను 1945 సంవత్సరంలో క్రుంగిపోయి, అమెరికనుల వశమయినది. మెకార్థరుసేనానికి దైవాంశికు డనబడు 'హిరోహితో' చక్రవర్తియు దాసుడైనాడు. జపాను ఆర్థికవ్యవస్థయు అమెరికనుల వశమయినది. జపానులో అమెరికను వ్యతిరేకధోరణిని తీవ్రంగా అణచినారు; భావస్వాతంత్ర్యము పోయినది; 'సర్వం పరవశం దుఃఖం' కదా ! ధీరులగుజపానీయులు దుఃఖస్థితి నెట్లో సహించి, అమెరికనుల మెప్పించి ఎట్లో పునరుద్ధరణ చేసుకొనుచున్నారు; వారి సామ్రాజ్యము పోయి, ఫార్మోజా అమెరికనుసేనలక్రింద వారి వశంవదు డగు చయంగు కావాసముగనున్నది. 1952 సంవత్సరంలో తుదకు జపానుకు (అమెరికను సేనాల అధికారం జపానులోనిల్చియుండు షరతుపైన) ఒకరీతి స్వతంత్రత లభించి, శాంతిసంధి జరిగినది. ఇట్టి షరతులకు భారతీయు లొప్పుకో లేదు; కాని జపానుతో ప్రత్యేకపుసంధిచేసుకొని భారతదేశము మరల మైత్రి నేర్పర్చుకొన్నది. ఇప్పుడు జపానుకు మనభారతదేశాదులతో మరల వ్యాపారము జరుగుచున్నది. పొరుగున నున్న కమ్యూనిష్టుచీనా రష్యాలతో మైత్రి లేకయున్నను ఇటీవలనే వారితో కొంత వ్యాపారయత్నము సాగుచున్నది.

పూర్వపుసైనికబల మిప్పుడు లేకున్నను యంత్రపరిశ్రమశిల్పములలో అనుభవజ్ఞులగుజపానువారు శ్రద్ధతో ఆత్మోన్నతికై

నిరంతరంకృషి చేయుచున్నారు. వారు కార్యదీక్షులు. పతితులు కుసు స్వయంకృషివల్ల పునరున్నతి కల్గును. జపానీయులు మరల పరిశ్రమరంగంలో మిగతాదేశములతో పోటీకి రాగల్గుదురు. కృష్యాదిరంగములలో జపానీయుల వైజ్ఞానికానుభవమును మనదేశములోను ఉపయోగించుచున్నారు. అక్కడి మితవాది పక్షపు మితవాదిమంత్రివర్గముకు ఇటీవల పతనము గల్గినను ఎన్నికలలో మరల మితవాదిపక్షముకే ప్రాబల్యము కలిగినది. జపానీయులరాజనీతి యిప్పుడు శాంతపద్ధతికి వచ్చినది.



# 77. భారతపాకిస్థానులు

భారతదేశముకు 15-8-1947 స్వతంత్రత లభించినది. అప్పుడే, అందులో ముస్లింజనబాహుళ్యం గల వాయవ్య ఈశాన్యఖండములను విడదీసి, వాటిని 'పాకిస్తాను' అనుపేర బ్రిటిషుసామ్రాజ్యంలోని ప్రత్యేకరాజ్యంగా నిర్ణయించినారు. ఇది బ్రిటిషువారి భేదనీతికిని, భారతీయులలో నేర్పడిన సాంఘిక విభేదములకును ఫలితము. ముస్లింజనులలో హెచ్చుమంది కోరికపైన అట్లువిభాగము జరిగినది. మిగతా భారతీయనాయకు లప్పటిస్థితిలో విధిలేక ఆవిభజనపద్ధతికి ఒప్పుకొన్నారు. 1947-లో అతివేగంగా ఈవిభాగము జరిగినది. అప్పటికే హిందూ సిక్కులకు ముస్లిములకు మధ్య కలహము వ్యాపించెను. ఈ విభాగసందర్భంలో ద్వేషానలము ఉత్తరదేశమంతటను మరింత ప్రజ్వరిల్లినది.

ఈ ఉభయరాజ్యాలలో అల్పసంఖ్యాకవర్గపువారిలో భీతావహమేర్పడెను; సాంఘికమగు కొట్లాటలు చెలరేగి; వేల కొలదిగ జనులు హతులయిరి. ఆస్తులును చాల నష్టమయినవి. లక్షలకొలది హిందువులు సిక్కులు ఉద్రిక్తులై తమ సర్వస్వ మును పాకిస్తానులో వదలి మనదేశంచేరిరి. ఇట్లే అనేకులు ముస్లి ములును పాకిస్తాను కిటనుండిపోయిరి. ఈకాందిశీకుల ప్రవాసం వల్ల సాంఘికంగాను ఆర్థికంగాను ఈరెండుదేశాలలో గొప్ప కల్లోల మేర్పడినది. రెంటిమధ్యను రాజకీయంగాను ద్వేషభావ మేర్పడెను. ఈవిభేదముల నరికట్టి స్నేహభావ మేర్పర్చ

యత్నంలో అహింసాప్రవక్త యగు గాంధీమహాత్ముడు హతు డాయెను. అంతట ఉభయరాజ్యాలలో ప్రవాసజనులకు క్రమంగా చాలకష్టంమీాద పునరావాసము చేయబడుచున్నది.

ఈకాందిశీకుల ఆస్తులనిర్వహణగూర్చి రెండుదేశాల మధ్య తగవులు కలిగినవి. ఇట్లే హిమాలయనదులనుండి పశ్చిమ పంజాబుకు తూర్పుపంజాబుకు ప్రవహించు నదీజలముల పంపకపు తగవులును తెగక కలతలకు కారణమయినవి. దేశీయసంస్థానా లలో ఏప్రాంతపువి అక్కడిరాజ్యములతో మిళితమయినవి. రెంటికిని సరిహద్దుగల కాశ్మీరంవిషయంలోమాత్రం పెద్దకల హము చెలరేగినది. దండోపాయంతో కాశ్మీరమును వశపర్చు కొనుటకై పాకిస్తానువారు తమ వాయవ్యపు కొండజాతులచేత కాశ్మీరంపైన హఠాత్తుగా పెద్దయెత్తున దాడిచేయించి అందుకు తాము ను చాల తోడ్పడిరి. కాశ్మీరపుప్రజానాయకులు రాజు గూడ భారతరాజ్యమును రక్షణ వేడిరి. వారికి విమానదళముల ద్వారా భారతరాజ్యము రక్షణనిచ్చి, శత్రుసేనలను కొంతవరకు కాశ్మీరమునుండి తరిమినది. కాశ్మీరరాజు తనరాజ్యము భారత రాజ్యంలో మిళితమగు నని ఆదాడిసమయంలో ప్రచురించెను. కాశ్మీరీయులలో ముస్లింబాహుళ్యము కలదు. వారి నిశ్చితాభి ప్రాయమును అక్కడి వయోజనులందరి వోటుద్వారా దరిమి లాను తేల్చుకొని, ప్రజాసమ్మతి వచ్చినమీాదటనే కాశ్మీరము భారతమిళితంగా ఖాయపర్చబడు నని స్థిరపర్చుకొనిరి.

కాశ్మీరమువిషయంలో పాకిస్తానువారు శత్రుపక్షం వహించుటను సౌమ్యంగా అరికట్టుటకై భారతప్రభుత్వంవారు పాకిస్తానుచర్చనుగూర్చి ఐక్యరాజ్యసంఘపు భద్రతాసమితికి

నివేదించిరి. వారితీర్పు తేలువరకు కాశ్మీరయుద్ధం నిలుపుచేసిరి. భద్రతాసమితివారు మన యీరెండుదేశాలమధ్య కాశ్మీర సమస్య తేల్చుటకని మధ్యవర్తులచేత చర్చచేయించినను ఫలితము తేలలేదు. ముస్లింబాహుళ్యం గల కాశ్మీరమంతయు తమకే చెందవలె నని పాకిస్తానీల పట్టు. అచటి ప్రజాభిమతం భారతసంలీనతనే కోరుచున్నందున మతమునుబట్టియే కాశ్మీరసమస్య పరిష్కరించుట సబబుకాదని భారతీయులవాదము. ఈకాలంలో రాజ్యములు లౌకికములు (secular) గా ఉండవలె కాని, మతపక్షపాతం వహించకూడదు. ఆర్థికంగా కాశ్మీరీయులకు మిగతా భారతీయులకుమధ్య వ్యాపారాదులు వృద్ధిచేసుకొనుటకు మంచి అవకాశమున్నది. అయితే అక్కడి ముస్లింజనబాహుళ్యముతో మిగతావారికి ఇప్పుడు గల మైత్రి నిల్చియుండి ధ్రువపడునట్లు మిగతా భారతీయులును తోడ్పడవలె. కాశ్మీరప్రధానియగు షేక్ మహమ్మదుఅబ్దుల్లా అక్కడ మతసామరస్యమును ప్రజల ఆర్థికోద్ధరణను సాధించుచున్నాడు. 'కాశ్మీర, జమ్మూ, లడకు' అను మూడుప్రాంతాలమధ్య సాహచర్యమును ఆవశ్యకము.

ఆర్థికంగా, భారతపాకిస్తానములు అన్యోన్యాశ్రయములు. పాకిస్తానములోని జనుము, సన్నపత్తి, గోధుమ ఇట్టివస్తువులు మనకు ఆవశ్యకములు. మనదేశములోని ఇనుము, నేలబొగ్గు, పంచదార ఇత్యాదులు పాకిస్తానులకును కావలెను. ఇట్టి అన్యోన్యసంబంధము ప్రకృతిలోనే యేర్పడినది. మఱియు ఈరెండుదేశాలవారు అసలు ఒకేసంస్కృతితో భారతజాతివారుగ నుండి 1947 సంవత్సరంవరకు అట్లే మెలగిరిగదా! మతమునుబట్టి వేర్వేరుజాతులు (nations) ఏర్పడు ననుభావము

క్రమంగాపోవలెను. ఈ రెండు దేశాలమధ్య ఇప్పు డేర్పడియున్న సమస్యలు ఉభయ రాజ్యాలకు లాభకరంగా పరిష్కారమగుట సుసాధ్యము. ఈ రెండు దేశాల నాయకులమధ్య రాజకీయంగా ఎట్టివిభేదా లేర్పడినను, ఈ రెంటి ప్రజాసామాన్యంలో మాత్రం ద్వేషభావముకు బదులు ఆనుకూల్యమే కలదు. అట్టిస్థితిలో పాకిస్తానులో ముస్లింలీగునాయకులు పాలకులు ఇండియాపైన అపోహాలు కల్గి విముఖంగా కనబడిననుగూడ, ఉభయులమధ్య సమస్యలను అనుకూలంగా పరిష్కరింపబూనుటే ఉభయతారకమగును. అట్లుగాక, కేవలం ఐక్యరాజ్యసమితిపైనో, విదేశప్రభుత్వాలపైనో ఆధారపడి వారి కాతగువులలో అవకాశమిస్తే పిల్లులమధ్య రొట్టెవిభాగమును కోతి తీర్చినట్లే యుండును. కనుక స్నేహపరిష్కారపుయత్న మిప్పుడు సాగుచున్నది.

---

# 78. ఆఫ్రికా

ఇట్లు ఆసియాలో చాలభాగము శ్వేతజాతీయుల ఆధిపత్యమునుండి మరల స్వతంత్రం కాగలిగినది. మనసమీపపు ఖండమగు ఆఫ్రికాలోమాత్రం యూరపియనుజాతి నిరంకుశ విజృంభణ హెచ్చుచున్నది. అక్కడ ఉత్తరపునైలుతీరప్రాంతమగు ఈజిప్టు అనబడు మిశ్రదేశ మెట్లో బ్రిటిషుఆధిపత్యమును వదల్చుకొన్నది. అక్కడి ఫరూకురాజు అవినీతిపరుడు; నజీబు సేనాని నియంతృత్వమున ఈరాజును ఈజిప్షనులు నిర్వాస మంపినారు; ఇప్పు డీజిప్టులో రిపబ్లికు ఏర్పడవచ్చును. ఉత్తరంలోనే ట్యునీషియా, అల్జీరియాలు ఫ్రెంచిసామ్రాజ్యములో చేరియున్నవి. అక్కడి స్వాతంత్ర్యోద్యమమును ఫ్రెంచివారు నిర్దయంగా అణచుచున్నారు. మొరాకోస్థితియు ఇంచుమించు అట్లేయున్నది. అబిసీనియాలో రాజుకు మరల స్వతంత్రత లభించినది. తూర్పుఆఫ్రికాలో బ్రిటిషు ఆధిపత్యంక్రింద ఉగాండాప్రాంతము శాంతంగానే ఉన్నది. అక్కడి 'కెన్యా'లో బ్రిటిషు పాలకుల జులుము హెచ్చుచున్నది. అక్కడ కొందరు స్వతంత్రతప్రాప్తికని బ్రిటిషుధనికులను అధికారులను చంపబూనిరట! ఈయుద్యమముకు 'మావ్ మావ్' అని పేరువచ్చినది. కాని, ఈక్రాంతికారులను అణచుట కని అక్కడ బ్రిటిషుపాలకులు పదిరెట్లు ఎక్కువ హింససాగించుచు ప్రజలను పీడించుచున్నారు.

తూర్పుఆఫ్రికాలోని భారతీయులు చాలశాంతంగా వ్యాపారాదులు చేయుచున్నారు. ఇక మహాగహానయుతమగు మధ్య ఆఫ్రికాస్థితి అంధకారబంధురముగ నున్నది. కొందరు తెల్లజాతివా రక్కడి ప్రకృతిసంపదలను వశపర్చుకొని వలసయుండుచు, అనాగరికులగు దేశీయులను పీడించుచు బ్రిటిషుకేంద్రాధికారము నుండి తమకు స్వతంత్రత కావలెననుచున్నారు; వీరు నల్లజాతుల వారిని మరింత పీడించ దలచినారు.

దక్షిణాఫ్రికాలో సర్వాధికారము అక్కడ వలసగనున్న శ్వేతజాతీయులది; వారు అక్కడిభారతీయులకన్న హెచ్చు సంఖ్యాయైనను ఆఫ్రికను నల్లవారికన్న చాలకొద్దిమంది. అయినను వారు రంగుజాతులకన్న తా మన్నివిధముల కులీనులము, ఘనులము అని ఎన్నికలలో, శాసనసభలలో, పాలనలో, పరిశ్రమలలో అధికారమంతను తమలోనే యుంచుకొన్నారు; ఆర్థికంగానే గాక, సాంఘికంగాను రంగుజాతులను హీనస్థితిలో నుంతురు. అక్కడిభారతీయులు గాంధీమహాత్ముని నేతృత్వమున సత్యాగ్రహం సాగించిరిగదా! ఇటీవల శ్వేతజాతీయుల జాతిద్వేషతత్వము ప్రకోపించినది; కొత్తశాసనములద్వారా రంగుజనుల వ్యక్తిస్వాతంత్ర్యమునుగూడ పలువిధముల అరికట్టుచున్నారు. ఈదుస్థితిలో భారతీయులతో కలసి అక్కడి ఆఫ్రికను నల్లవారును సత్యాగ్రహము నవలంబించినారు; అజ్ఞానులైనను వారుగూడ అహింసాసత్యసూత్రములను సాత్వికనిరోధపద్ధతులను నేర్చుకొని శాంతంగా పాలకవర్గంమీాద సత్యాగ్రహం జయప్రదంగా సాగించుచున్నారు. ఈజాత్యహంకారంలో ప్రవీ

ణులై మలానుప్రధానిత్వమున 'జాతీయపక్షపు' తెల్లవారు ఈయుద్యమము నణచుటకు విశ్వప్రయత్నములు చేయు చున్నారు. వారు ఎన్నిహింసల బెట్టినను సత్యాగ్రహుల ధైర్య దీక్షలు హెచ్చుచున్న వేగాని తగ్గుటలేదు. సహజంగా మన భారతరాజ్యము అక్కడిసత్యాగ్రహముకు సానుభూతినిచ్చి అందుకు విదేశీయుల నైతికామోదమును సంపాదించుచున్నది. ఇటీవల దక్షిణాఫ్రికాలో జరిగిన ఎన్నికలలో మరల మలాను పక్షీయులే అధికారముకు వచ్చినారు. (అక్కడ దాదాపు వోటరులందరు, సభ్యులందరును తెల్లవారే) వారు అక్కడి భారతీయులకు ఆఫ్రికనులకు మధ్య విభేదాలు పుట్టింపజూచిరి; కాని ఆయత్నములు ఫలించలేదు. ఇకముందు శ్వేతజాతీయులకు రంగుజాతులకు మధ్య సత్యాగ్రహ మింకను తీవ్రమగును. శ్వేత సంస్కృతిలో నిజమగుమానవత్వము ప్రేమభావము కలదా అను మహాసమస్య ఇందులో తేలవలెను.

భారతసంస్కృతి నీతిధర్మముల కెక్కువప్రాముఖ్య మిచ్చి నను, రాజకీయంలో లౌకికం (secular)గా ఉండుట సవ్యమే. మనదేశంలో ముఖ్యమగు అన్నిమతములవారు లక్షలకొలదిగ రాజ్యమంతట వ్యాపించియున్నారు. మతభేదములను రాజ్య పాలనలో తెచ్చి సాంఘికమైత్రిని చెడగొట్టుకుంటే సాంఘికకల హములు (హిందువులలోను) మరింత పెరిగిపోయి, కులకక్షలును హెచ్చును; జాతీయైక్యము భగ్నమగును; మరియు ముఖ్య మగు మతములన్నిటి మూలసిద్ధాంతము లొకరీతివే. సంప్రదా

యములు ఆచారములునే పరిసరములబట్టి భేదించును; కనుక అన్నిమతములందు సమభావము సహనశీలతయు ఉంటేనే నిజముగు ధార్మికత సిద్ధించును. అంతర్జాతీయదృష్టిలోను లౌకికతయే ఉచితము. మనదేశపు పొరుగున రెండువైపుల ముస్లింరాజ్యముగు పాకిస్తాను ఉండుటేగాక పడమట ఆఫ్ఘను, ఇరాను, ఇరాకు, టర్కీ, ఈజిప్టు ఇత్యాదులు, ఆగ్నేయప్రాంతములో ఇండోనేషియాయు ముస్లింజనాధిక్యం కలవే. ముస్లిం ద్వేషం పెట్టుకుంటే ఈదేశాలన్నిటితో కలతలు కలుగును. మతసామరస్యంవల్లనే మనరాజ్య మిప్పుడు ఈరాజ్యాలన్నిటితోను మంచిమైత్రిగల్గి మిగతా రాజ్యాల ఆదరమునుగూడ పొందుచున్నది.



# 79. ఐక్యరాజ్యసంఘము

ఆయారాజ్యాలకు జాతులకు మధ్య స్నేహం కలిగించి సమస్యలను తగువులను రాజీగా పరిష్కరించుటకని మొదటి ప్రపంచ యుద్ధంతరువాత 'నానాజాతిసమితి' యేర్పడెను. అది క్రియలో-లోకముకంతగా ఉపయోగించలేదు. దాని నిర్మాణంలోను ఆచరణలోను లోపముండెను. రెండవమహాయుద్ధంతరువాత ప్రపంచమంతటను ఎన్నియో క్రొత్తసమస్యలేర్పడెను. 'ఆయాజాతుల మధ్య సామరస్యం కల్గించి లోకమంతటిని ఒకేమహాసంస్థగ భావించవలె' నని గుర్తించి 'ఐక్యరాజ్యసంఘం' (United Nations Organisation) అనుపేరుతో ఒకలోకసంఘమును స్థాపించినారు. ఈసమాఖ్యలో 60 రాజ్యాలప్రతినిధు లున్నారు. దీని కార్యసమితి 'భద్రతాసమితి' (Security Council) అనబడుచు 11 సభ్యులు కల్గి ముఖ్యరాజకీయసమస్యలను చర్చించును. అయితే సవ్యపరిష్కారము అరుదగుచున్నది. ప్రబలరాజ్యములు ఈసమితిలో సభ్యు లగుట సహజము. వారి పలుకుబడి చాల హెచ్చు. కనుక ఆయాసమస్యను నిష్పాక్షికదృష్టితో విమర్శించుటకు బదులు స్వార్థలాభపుదృష్టితోనే గమనించుట జరుగుచున్నది. ఇప్పుడు ప్రబలములైన ఆంగ్ల-అమెరికాలకే ఐక్యరాజ్యసంఘములోను భద్రతాసమితిలోను ప్రాబల్యము కలదు. వీరికిని కమ్యూనిస్టురష్యాకును మధ్య దృక్పథభేదమును తరుచు పోటీయును కల్గుచున్నది. దీని నిర్మాణం

లోను లోపము లున్నవి. భద్రతాసమితిదే ముఖ్యాధికారము. ఇందులో (లోకమంతటిలో హెచ్చుజనసంఖ్య గాజ్యమగు) చీనాకు స్థిరప్రాతినిధ్య మిచ్చిరి. సరేకాని చీనాభూభాగమంతయు 'కమ్యూనిస్టు'లనబడు ప్రజారిపబ్లికుచీనారాజ్యముకే ఆస్థానమీయదగియుండగా, వారి నసలే గుర్తించక దేశభ్రష్టుడై ప్రజాదరం పోయిఫార్మోజాలో అమెరికనులఅండను అజ్ఞాతంగా వసించు చయంగుపక్షీయులకే ఐక్యరాజ్యపుసంఘము లన్నిటిలోను స్థానమిచ్చినారు. ఇది కేవలం అక్రమమని రష్యాయే గాక భారతరాజ్యాదులును ఆక్షేపించినారు. కనుకనే కొరియాయుద్ధం మున్నగుసమస్యలు (చీనాసంబంధపువి) పరిష్కరించుట దుర్ఘటమగుచున్నది. ఇట్లే కమ్యూనిస్టులపైన అమెరికను ఇత్యాదులు ద్వేషభరితులగుటవల్ల రష్యా ఇత్యాదులు అసహాకారం చేయుచు భద్రతాసమితిలో నిషేధాస్త్రము (వీటో)ను ప్రయోగించుచున్నారు. ఇంకను స్వతంత్రరాజ్యము లెన్నియో ఐక్యరాజ్యసమితిలో చేరుటకు యత్నించుచున్నవి. కాని అందుకు అమెరికాయో రష్యాయో పాక్షికకారణాలవల్ల అడ్డుకొనుచున్నవి. అణుబాంబునిషేధం విశస్త్రీకరణముగూర్చి ప్రణాళిక లెంతకాలం చర్చించినను తద్వారా లోకారిష్టము తగ్గించుట కెంతమాత్రమును నిశ్చయము జరుగలేదు. కాశ్మీరములో పాకిస్తానువారు అక్రమంగా యుద్ధం పురికొల్పినందుకు పరిశీలించి మందలింపు మని భారతరాజ్యము పెట్టిన తీర్మానముగూర్చి యేండ్లకొలది చర్చించినను భద్రతాసమితివారు నిశ్చయముకు రాలేదు. పాకిస్తానువారు కాశ్మీరపుదాడిలో అక్రమంగా పాల్గొన్నట్లు ప్రత్యక్షపునిదర్శనములు దొరకినను ఆ చర్చాంశ

మును వదలి ఇతరసమస్యలు తెచ్చిపెట్టి భద్రతాసమితివారు కాలయాపన చేయుచున్నారు. ఇట్లే దక్షిణాఫ్రికాలో శ్వేత జాతీయప్రభుత్వంవారు రంగుజాతులపైన సాగించి అమానుష చర్యలు ఐక్యరాజ్యసంఘపు మూలసూత్రములకు విరుద్ధమై జాతిద్వేషమును పెంచుచున్న వని అట్టిప్రవృత్తిని నిరోధించవలె ననియు భారతప్రభుత్వము భద్రతాసమితిని కోరెను. అందులోను విచారణ జరిగినను దక్షిణాఫ్రికాను ప్రభుత్వపు వ్యతిరేకధోరణివల్ల నిర్ణయమేమియు జరుగలేదు. కొరియాను రెండుగ చీల్చుటవల్ల ఈరెంటిమధ్య తీవ్రసమస్యలు కల్గి పెద్ద యుద్ధమేర్పడినది, దక్షిణకొరియాకు ఐక్యరాజ్యసమితి తరపున ముఖ్యంగా అమెరికావారును ఉత్తరకొరియాకు చీనాయును మద్దతుచేసి యుద్ధం సాగించుచున్నారు. కొరియనులకుమాత్రం అపారనష్టము కల్గుచున్నది. అక్కడ యుద్ధవిసర్జనకు దీర్ఘప్రయత్నములు సాగుచున్నవి. ఇటీవల కొంత శాంతిసూచనలు పొడగట్టుచున్నవి. ఇండోచీనాలో యుద్ధమారంభించి అక్కడి 'వీట్మెను' అనబడు ప్రజాపక్షమునకును ఫ్రెంచి అధికారిపక్షముకునుమధ్య తీవ్రయుద్ధముసాగుచున్నది.

ఇట్లు రాజకీయాలలో సంఘర్షముకల్గుచున్నను కార్మిక సమస్యలు, ఆరోగ్యము, ఆర్థికసౌష్ఠవము, సంస్కృతి మున్నగు లోకమంతటికిని వలయుసమస్యల పరిష్కారముకు ఆయా రాజ్యములకు కొంతవరకు ఐక్యరాజ్యసంఘము ఉపయోగించినది. ప్రపంచపు వివిధరాజ్యములమధ్య పరస్పరం సహకారము జరుగుచున్నది; ఇందుకు ఐక్యరాజ్యసంఘపు వేర్వేరు ఉపసమితు లేర్పడి తరుచుసమావేశమై చర్చించుచు సాంకేతిక నిపుణుల

ద్వారా పరికరసహాయంద్వారాను తోడ్పడుచున్నవి. రాక పోకలకు ఆరోగ్యవ్యాప్తికి వెనుకటికన్న సౌకర్యముహెచ్చినది. సంస్కృతిసమన్వయము డాక్టరు రాధాకృష్ణవంటి మహనీయులు ప్రముఖపాత్రవహించి కొంత సఫలత కల్గించినారు.

ధనికవ్యక్తివాదియగు అమెరికాకూటముకు కమ్యూనిస్టువాదియగు రష్యాకూటముకును చేరక స్వతంత్రపక్షమొకటి యేర్పడుట చాలనావశ్యకము ఆయాసమస్యల న్యాయాన్యాయములనుబట్టి చర్చించి నిర్ణయములిచ్చుట కర్తవ్యము. మన భారతదేశంవారు అట్టి ప్రవృత్తి చేపట్టినారు; ఇందుకు ఇండొనేషియా, అరబు ఆసియారాజ్యములును తోడ్పడు చున్నవి. యుద్ధసంఘర్షములను నివారించి పెద్దరాజ్యాల కూటములమధ్య సామరస్యం కల్గించి శాంతివాతావరణం కల్గించుట భారతరాజ్యము ముఖ్యోద్దేశము. ఇప్పుడు భారతదేశము ఐక్యరాజ్యసమితిలో తరుచు తటస్థతవహించుటకు న్యాయదృక్పథమును శాంతిరక్షణాశయు కారణములు. ఈధోరణి ఆసియాలోని చాలదేశములును ఈజిప్టును ఆమోదించినవి. ఈరీతిగ ప్రపంచ యుద్ధభయప్రమాదములు వెనుకబడినవి. ఇందువల్ల శాంతి రక్షితం కావచ్చును. తదనుకూలంగా అమెరికారష్యాల ధోరణియు సుముఖమగుచున్నది.



# 80. సింహావలోకనము

జీవజాతిపరిణామంలో జంతుజాలంవలె నరజాతియు మొదటి వనస్థితినుండి క్రమవికాసము నొందినది; ప్రథమంలో పశుతుల్యులై త్వరలోనే ధీశక్తితోను సంఘీభావంతోను హస్తనైపుణ్యమును సంభాషణశక్తిని అలవర్చుకొని క్రమోన్నతి నొందిరి. ముఖ్యంగా నైలు, యూఫ్రిటీసు, సింధు, గంగా హోయాంగోవంటి నదీతీరాలలో జనులు మంచిసంస్కృతిని సంపాదించిరి. వీరలమధ్య భారతీయులు నాయకమణు లనిపించుకొని భౌతికవిజ్ఞానంలోను ఆధ్యాత్మికవిద్యలోను ప్రముఖులయి, దేశాంతరాలలో నాగరికజనులకును తమ ధార్మికసిద్ధాంతాలను, శిల్పనిర్మాణములను, సాహిత్యరచనలను వ్యాపింపజేసిరి. గ్రీకుల నుండి మనప్రాచీనులు కొంతవిజ్ఞానం నేర్చుకొనిరి. చీనులు, అరబులు భారతీయులనుండి చాలవిషయములను నేర్చుకొని, వాటిని అప్పటినాగరికలోకముకు వెదజల్లిరి. మధ్యయుగంలో భారతీయులు మందగించి సంకుచితభావులై అంతకలహము లలో బడిరి. అప్పుడు అరబుల నేతృత్వమున ముస్లిములు విజృంభించి వ్యాపించిరి. పిమ్మట వారిలోను విశాలదృష్టి తగ్గినది. 17-వ శతాబ్దినుండి శ్వేతజాతీయులగు యూరపియనులు ఉద్యమశీలురై ధైర్యసాహసాలతో ఖండాంతరముల కేగుచుండిరి. వారి నవ్యావిష్కరణలు భౌతికంగా పారిశ్రామికవిప్లవముకు దోహదమిచ్చినవి. బహుళోత్పత్తితో, యాంత్రికనిర్మాణాలతో చౌకనైు జనోపయోగాలగు వస్తువుల నుత్పత్తిచేయుచు, వాటిని మనదేశాలకు తెచ్చుచు వ్యాపారు లయిరి; లోకంలో అవకాశమున్న ఫలవంత

మగు దేశాలలో వలసలు స్థాపించి, ఈ ప్రాంతాల ముడివస్తువు లను తమదేశాలలోని ఫాక్టరీలయం దుపయోగించి, ఆతయారు సరుకులను లోకమంతటఅమ్మియు సామ్రాజ్యస్థాపనద్వారా జనులను కొంత పీడించియు, ధనసంపదను విపరీతంగా వృద్ధిచేసు కొనిరి. ఈ శ్వేతజాతీయులు ఈచర్యలలో పోటీలుపడుచు తమలో కొంత పోరుచున్నను, మొత్తంలో ఆయాదేశాలలోని మన రంగుజాతులవారి నణచియుంచి ప్రాబల్యమొందుటలో తమలో తాము తోడ్పడుచుండిరి. ఆసియాలో జపానీయులు పాశ్చాత్యుల ననుకరించి దీక్షతో పరిశ్రమలు వృద్ధిచేసి శ్వేత జాతీయులవలె నవ్యాయుధములద్వారా సైనికశక్తిని నౌకాది బలమును వృద్ధిచేసిరి; కొరియా మంచూరియా లాక్రమించిరి; చీనాతో స్నేహమును బదులు సామ్రాజ్యకాంక్షతో శత్రుత్వం పెట్టుకొని ఘోరయుద్ధం సాగించి మహాయుద్ధంలో ఆంగ్ల అమె రికనుకూటంతోను ఘోరయుద్ధం సాగించి, తుద కోడి క్రుంగి పోయిరి.

ఈ 20-వ శతాబ్దిలో నరులవిజ్ఞానమును దానితో యాంత్రిక శక్తులును ఆయుధసామగ్రులును విపరీతంగా హెచ్చినవి; విధ్వం సకసాధనాలు అద్భుతంగా పెరుగుచు, అందులో ఆయారాజ్యాల మధ్య తీవ్రమగు పోటీగల్గినది. మానవుని నైతికత్వమును ప్రేమ తత్వమును తగినంతగా వృద్ధికాలేదు. వ్యక్తులకును రాజ్యాల కును స్వార్థపరత పెరిగి, సంఘర్షమును అశాంతిభావమును ప్రబలి నవి. ఈ యాంత్రికనాగరికత ప్రాబల్యంవల్ల ఒకవైపు పుంజీపతి పక్షమును రెండవవైపు కమ్యూనిస్టుపక్షమును బలీయమగుచు, మిగతా మధ్యరకపు రాజ్యాలను జనులను తమప్రాభవంలోకి

ఆకర్షించుచున్నారు. ఈ రెంటిసంఘర్షణవల్లనే ఇక ప్రపంచసంగ్రామము త్వరలో వచ్చునను భీతి లోకమంతట నావరించినది. కొరియా, జర్మనీ, భిన్నాశయపుప్రాంతాలుగ విచ్ఛిన్నమయినవి. కాశ్మీరుతగాదా ఇంకను తీరలేదు; అందులో ⅜ వంతు భాగము పాకిస్తానుఆధిపత్యంలో, మిగతా భారతభాగంగాను ఉన్నవి. మలయా, ఇండోచీనా, బర్మాలలో అంతర్యుద్ధము రగులుచు,మధ్యమధ్య ప్రకోపించుచున్నది. ఇండోనేషియాలో, ఐరానులో కొంతశాంతత కల్గుచున్నది. మొత్తంమీద శాంతి భద్రతలు క్లిష్టంగా ఉన్నవి. మహాయుద్ధము గడచినను ఇట్లు లోకంలో ద్వేషము, హింసాచర్యలు, అసత్యము, అవినీతియు వ్యాపించినవి. ఈకాలంలో, విద్యావ్యాప్తిచే వార్తాపత్రికల ద్వారానే గాక, సినిమా, రేడియో ఇత్యాదులద్వారాను ఒక ప్రాంతపుభావములు వార్తలుగూడ అతిత్వరలో లోకమంతటను వ్యాపించును. స్వార్థలాభమును తత్సాధన కని భౌతికబలసాధనయు వ్యక్తులకు రాజ్యప్రభుత్వములకుగూడ ఆశయములయినవి. వాటిని వినాశకశక్తులకే 'నాగరిక' జాతులవారు ఉపయోగించుచున్నారు. గొప్ప 'నేపాళ'బాంబులు, క్రిమివ్యాప్తియంత్రాలు, బాంబరువిమానాలు, ఇత్యాదులేగాక ఏకకాలమందే మహానగరములగూడ ధ్వంసంచేయు గొప్ప అణుబాంబులు సృజించుచు, మూడవప్రపంచయుద్ధమునకు సన్నద్ధులగుచున్నారు. ముఖ్యకూటము లగు రష్యా అమెరికాల రెంటిమధ్య అవిశ్వాసము పెరిగి లోకమునకు హానికరమగుచున్నది. స్వార్థపరతయు అవినీతియు వ్యాపించి వాతావరణము లోకమంతట విషప్రచారమున కలుషితమయినది. మరల అహింసాభావము, నీతిపరత్వము

ప్రచారితములయి, జనులలో చిత్తశుద్ధి కలుగవలె. అందుకు శాంతిప్రియులు దీక్షతో కృషిచేయవలె. కొందరు అధర్మముకే లోకంలో స్థాన మున్నదని, మరల ప్రపంచయుద్ధము త్వరలో రాగలదని అందు కందరు సిద్ధంగా కార్యక్రమం నడుపుకొనవలె నని భయోత్పాతం పొలగుచున్నారు. ఇట్టి నిరాశాభావము నరికట్టి, నైతికపునర్నిర్మాణము(moral rearmament) ను స్థాపించుటకు యత్నము సాగుచున్నది. శాంతిసంఘులు, పునరుద్ధరణ సమాఖ్యలు నేర్పడుచున్నవి. క్రొత్తమారణసాధనాలు నిర్మితములగుచుంటే, మరొకప్రక్క నవ్యావిష్కరణలద్వారా ప్రయాణ సౌకర్యం, ఆహారోత్పత్తి, ఆరోగ్యరక్షణ, రోగచికిత్స ఇత్యాదులకు అద్భుతమగు క్రొత్తసౌకర్యము లేర్పడుచు ప్రజలకు సుఖావహ మగుచున్నవి. ధార్మికబుద్ధియు వ్యాపించుచున్నది. పరస్పరసమావేశము లిప్పుడు చాలహెచ్చి, అన్యోన్యతయు పెరుగుచున్నది. మానవసౌభ్రాత్రము ఈశ్వరోద్దిష్ట మనుభావమిప్పుడు జనులలో కల్గుచున్నది. మానవుని పురోగతిలో పశుతత్వము అప్పుడప్పుడు ప్రకోపించినను, ఆసురప్రవృత్తిక్రమంగా తగ్గి దైవీప్రవృత్తి ఆదరమునుపొంది ప్రాముఖ్యమునురాగలదు. స్వకీయులను ప్రేమించుటలో అన్యులను ద్వేషించకూడ దని అందరు అంగీకరించుచున్నారు. 'ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకం' అని పెద్ద లందురు. 'సర్వేజనా స్సుఖినో భవంతు' అనుటే ఉన్నతాశయము. వేదకాలపు ఈక్రిందివాక్యము మానవుల ఏకత్వమును స్థాపించును.

'యత్ర విశ్వం భవత్యేకనీడం'.

---

## అనుబంధము - 1

# ముఖ్యవృత్తాంతముల కాలసూచి

రమారమి క్రీ. పూ. 1000 ప్రాంతమున ఆర్యులు స్పెయిను ఇటలీ బాల్కను ద్వీపకల్పములలో స్థిరవాసు లగుచుండిరి. ఉత్తరహిందూస్థానమున అంతకుపూర్వమే వారు స్థిరవాసులైరి. నోసస్ అప్పటికే ధ్వంసమాయెను. మూడవ తాత్మిసు మూడవ అమినాఫేసు, రెండవ రామిశెసులనాటి ఈజిప్టు ఔన్నత్యకాలము మూడు నాలుగు శతాబ్దముల కావలనుండెను. నైలులోయలో 21-వ వంశపురాజులు దుర్బలులైరి. ఇస్రాయిలు మొదటిరాజుల క్రింద ఏకీభవించెను. అప్పుడు సాలో, డేవిడో, సాలమనో, బహుశః పాలింపుచుండియుండును. ఆధునిక ప్రపంచమున కాన్స్టెంటైనుకన్నను అక్కేడియను సుమేరియను సామ్రాజ్యములకు చెందిన మొదటిసార్గను పేరు (క్రీ. పూ. 2750) బాబిలనుచరిత్రలో ప్రాచీనతరముగ నుండెను. అప్పటికి వేయేండ్లుపూర్వమే హమ్మురబి మరణించెను. మహావీరులగు అస్సిరియనులు బాబిలనుకును పాలకులైరి. క్రీ. పూ. 1101-లో మొదటి టిగ్లత్ పిలేసరు బాబిలను నాక్రమించెను. కాని స్థిరజయము కలుగలేదు. అస్సిరియా బాబిలను లింకను వేరురాజ్యములుగనే యుండెను. చీనాలో నూతన 'చౌ' వంశము వృద్ధిచెందుచుండెను. ఇంగ్లండులోని స్టోనుహెంజి అప్పటికే కొన్నివందలయేండ్లకు పూర్వపుదై యుండెను.*

---

*అప్పటికి చాలపూర్వమే భారతదేశమున మహెంజదరో మొదలగుస్థలముల ఆదిమద్రావిడ నాగరికత ఋగ్వేదవృత్తాంతములు, హరిశ్చంద్ర మాంధాతాది చక్రవర్తులపాలనము, శ్రీరామాదుల కోసలసామ్రాజ్యము, కురుపాంచాలాదుల రాజ్యములు, మహాభారతయుద్ధాదులుకూడ గడచెను. భారతదేశమున ననేకరాజ్యములు విలసిలుచుండెను. అదివరకే వేదవాఙ్మయమంతయు నేర్పడెను.

తరువాత రెండు శతాబ్దములలోను, 22-వ రాజవంశమున ఈజిప్టులో నవజీవనము, హిబ్రూలసాలమను చిన్నరాజ్యపు విచ్ఛేదనము, బాల్కనులలో దక్షిణఇటలీ ఆసియా మైనరులలో గ్రీకుల వ్యాప్తి, మధ్య ఇటలీలో ఎట్రస్కనుల ఆధిపత్యము కలిగెను. ఆపిమ్మటి ముఖ్యవృత్తాంతములకు నిర్ధారణ అయిన కాలనిర్ణయ మీక్రింది పట్టికలో నీయబడినది.

క్రీ. పూ.

800. కార్తేజి నిర్మాణము.

790. ఎతియోపియను లీజిప్టును జయించి, 25-వ రాజవంశము స్థాపించిరి.

776. మొదటి ఒలింపికు ఆట.

753. రోముపురపు నిర్మాణము.

745. 3-వ టిగ్లతు పిలేసరు బాబిలను జయించి క్రొత్త అస్సీరియా సామ్రాజ్యం స్థాపించెను

722. 2-వ సార్గను అస్సీరియనులకు ఇనుప ఆయుధముల నిచ్చుట.

721. అతడు ఇస్రాయెలైట్లను ప్రవాసమంపెను.

680. ఎసర్హాడ్డను ఈజిప్టులో 25-వ రాజవంశము తొలగించెను.

* (సుమారు) భారతదేశంలో పాణినిఋషి వసించెను.

664. మొదటి సమెటికను ఈజిప్టును మరల స్వతంత్రముచేసి, 26-వ రాజవంశమును స్థాపించెను.

608. ఈజిప్టు రాజగు నెకో యూదరాజగు జోషియాను మెగిడ్డోయుద్ధమున నోడించెను.

606. చాల్డియనులు మీడులు నినేవాను పట్టుకొనిరి. చాల్డియను సామ్రాజ్యపు స్థాపన.

*605. జొరాష్టరు (పార్సీమతస్థాపకుడు) పారశీకమున వసించెను.

క్రీ. పూ.

604. నెకో యూఫ్రిటీసునదివరకు పోయి, 2-వ నెబూకడ్ నెజ్జరుచే నోడెను; (నెబూకడ్ నెజ్జరు యూదులను బాబిలనుకు గొంపోయెను.)

551. పారసీకుడగు సైరసురాజు మీడుడగు స్యక్షరిసుస్థానమున వచ్చెను; క్రోససును జయించెను; ఆ సుమారున గౌతమబుద్ధుని జీవితారంభము. చీనాలోని కన్ఫ్యూషియసు, లోత్సే ఈకాలముననే జీవించిరి. *జైన మతస్థాపకుడు మహావీరుడు నప్పుడే యుండెను.

539. సైరసు బాబిలనును పట్టుకొనెను; పారసీకసామ్రాజ్యమును స్థాపించెను.

521. మొదటిడెరయసు (పారసీకచక్రవర్తి) పాలనము; సిథియాపైన అతని దండయాత్ర.

490. గ్రీసులో మారథన్ యుద్ధము.

480. థర్మాపిలే, సలమిసు యుద్ధములు.

479. ప్లటియా, మైకేలు, యుద్ధములందు పారసీకుల పరాజయము.

*477. బుద్ధుని మరణము.

474. సిసిలీగ్రీకులు ఎట్రస్కను నౌకాసేనను నశింపజేసిరి.

431. గ్రీకు పెలపనీసను యుద్ధము.

401. "పదివేలసైనికులు" వెనుకకు బోవుట.

359. 'ఫిలిపు' మాసిడనుకు రాజయ్యెను.

338. చరోనియాయుద్ధము.

336. మాసిడోనియాసేనలు ఆసియాదాడి నారంభించెను. ఫిలిపు హత్య.

334. అలెగ్జాండరు జరిగించిన గ్రానికసుయుద్ధము.

333. ఇస్సను యుద్ధము.

331. ఆర్బెలా యుద్ధము.

330. మూడవడెరయసు మరణము.

*327. సింధుప్రాంతంలో అలెగ్జాండరు పోరసులయుద్ధము.

క్రీ. పూ.

323. అలెగ్జాండరు మరణము.

321. చంద్రగుప్తుడు పంజాబును స్వతంత్రమొనర్చెను. మౌర్యసామ్రాజ్యారంభము. కాడైన్ ఫోర్కున్ యుద్ధమున సామ్నైట్లచే రోమను లోడిపోయిరి.

* (సుమారు) కాత్యాయనుని కాలము, చాణక్యుని జీవితము.

281. ఇటలీపై ఫిర్రసు దండయాత్ర.

280. హెరాక్లియా యుద్ధము.

279. అస్క్యులం యుద్ధము.

278. గాలులు ఆసియామైనరుపై దండెత్తి గలేషియాలో స్థిరపడిరి.

275. ఫిర్రసు ఇటలీని వీడెను.

264. మొదటిప్యూనికు యుద్ధము; హిందూస్థానమున అశోకచక్రవర్తి రాజ్యారంభము. (అంతము 237)

260. మైలే యుద్ధము.

256. ఎక్నమసు యుద్ధము.

246. చీనాలో షిహ్వాంగ్టి 'త్సిన్' రాజ్యారంభము.

*255. అశోకుని కళింగాంధ్రదేశ దండయాత్ర. భారతబౌద్ధులవిదేశయాత్రారంభము, చీనాసింహళములలో, బౌద్ధమత వ్యాప్తి కారంభము.

220. షిహ్వాంగ్టి చీనాచక్రవర్తి అయ్యెను.

214. చీనామహాప్రాకారారంభము.

210. షిహ్వాంగ్టి మరణము.

202. జామాయుద్ధము.

146 కార్తేజినాశము.

133. అత్తలసు పెర్గమమును రోమున కిచ్చుట.

క్రీ. పూ.

102. మారియసు జర్మనుల నోడించెను.

100. మారియసు విజయము. చీనులు టారింలోయ జయించిరి.

89. ఇటలీజనులందరు రోమకపౌరులైరి.

73. స్పార్టకసు నాయకత్వమున బానిసల తిరుగుబాటు.

71. స్పార్టకసు ఓటమి, మరణము.

66. పాంపే రోమనుసేనల కాస్పియను యూఫ్రెటిసుప్రాంతములకు నడపి, అలనుల నెదుర్కొనెను.

*57. విక్రమశకారంభము.

48. ఫార్సలసునొద్ద జూలియసు సీజరు పాంపే నోడించెను.

44. జూలియసు సీజరు హత్య.

27. అగస్టసు సీజరు పాలనారంభము.

* ఆంధ్రరాజులు మగధరాజ్యము జయించిరి.

4. నాజరతునొద్ద క్రీస్తుపుట్టిన నిజమగు వత్సరము.

క్రీ. త.

1. క్రైస్తవశకారంభము.

14. అగస్టసు మరణము; టైబీరియసురాజ్యారంభము.

30. క్రీస్తు కొరతవేయబడెను.

41. కలిగ్యులాహత్య; రోమకసేన క్లాడియసును చక్రవర్తిగ చేసెను.

63. నీరో (రోమకచక్రవర్తి) ఆత్మహత్య. గల్బా, ఓథో, విటలసు వరుసగా చక్రవర్తులైరి.

69. విస్పేసియను (రోమకచక్రవర్తి.)

*78. శాలివాహనశకారంభము.

102. పాన్‌చౌ క్రింద చీనారాజ్యము కాస్పియను సముద్ర ప్రాంతము నకు వ్యాపించెను.

క్రీ. శ.

117. ట్రాజను తరువాత హేడ్రియను రోమకచక్రవర్తి అయెను. (సామ్రాజ్యోచ్చదశ).

* 133-154 ఆంధ్రసార్వభౌముడు గౌతమీపుత్ర శాతకర్ణి పాలన సమయము.

138. భారతసిలియనులు భారతదేశమునుండి గ్రీకులను పూర్తిగా పార ద్రోలిరి. *కనిష్కచక్రవర్తి పాలనము.

161. అంటోనియసు పయసు అనంతరము మార్కసు అరీలియసు రోమక చక్రవర్తి అయెను.

164. మహామారి మొదలిడి, అరీలియసు మరణము (180) వరకుండెను; ఆసియాలోగూడ నష్టము కల్గించెను. (రోమకసామ్రాజ్యమున యుద్ధకల్లోలము లారంభించి, రమారమి శతాబ్దివర కుండెను.)

220. చీనాలో హాన్ వంశాంతము. (అందు విభేద మారంభించి, 4 శతాబ్దు లుండెను.)

227. పర్షియాలో అర్సకిడ్ వంశము నంతమందించి, 1-వ అర్దషిరు రాజు సస్సనిడువంశ మారంభించెను.

242. మణిబోధ ఆరంభము.

247. గాతులు డాన్యూబునది దాటి దాడిసల్పిరి

251. గాతుల విజయము. డెసియసుచక్రవర్తి మరణము.

260. సస్సనిడువంశపు రెండవషా (పారసీకరాజు) అగు 1-వ షేపర్ అంటియోక్ పురము పట్టుకొని, వలేరియనుచక్రవర్తిని బంధించెను; ఆసియా మైనరునుండి మరలివచ్చుచో, సాల్మైరావాసియగు ఒడె నాథసుచే హతుడయ్యెను.

277. పర్షియాలో మణి కొరత వేయబడెను.

284 డయోక్లిషియను రోమకచక్రవర్తి అయ్యెను.

క్రీ. శ.

303. డయోక్లీషియను క్రైస్తవుల హింసించెను.

311. గలేరియను క్రైస్తవులహింస మాన్పెను.

312. కాన్స్టంటైను మహాశయుండు చక్రవర్తి అయెను.

*320. భారతదేశమున గుప్తవంశీయుల సామ్రాజ్యారంభము.

323. కాన్స్టెంటైను అధ్యక్షుడై, నిసియాలో క్రైస్తవసభ జరిపెను.

337. కాన్స్టెంటైను మరణించుముందు క్రైస్తవమతము స్వీకరించెను.

* సముద్రగుప్తుడు చక్రవర్తి అయ్యెను.

361-363. క్రైస్తవమతముకు బదులు మిత్రమతము వ్యాపింపచేయ జూలియను యత్నించెను.

392. థియోడోసియసు ప్రాక్పశ్చిమముల చక్రవర్తియయ్యెను.

395. థియోడోసియసు మరణము. హోనోరియసు ఆర్కేడియసులు స్టిలికో అలరికుల రక్షణసహాయముల నొంది, సామ్రాజ్యము పంచుకొనిరి.

410. అలరికునాయకత్వమున విసిగాత్తులు రోమును పట్టుకొనిరి. *రెండవ చంద్రగుప్తుని పాలనము. కాళిదాసీ కాలమున నే వసించియుండ వచ్చును. చీనుడగు ఫాహియాను భారతదేశసంచారము.

* కుమారజీవాదుల చీనాయాత్ర.

425. వండాలుడు దక్షిణస్పెయినులోను హూణులు పన్నోనియాలోను, గాతులు డాల్మేషియాలోను, విసిగాతులు స్వేవులు పోర్చుగలు ఉత్తరస్పెయినులలోను వసింప నారంభించిరి. ఇంగ్లీషువారు బ్రిటనుపై దాడివచ్చిరి.

439. వండాలులు కార్తేజి పట్టుకొనిరి.

451. అత్తిలుడు గాలుపై దాడిసల్పి ఫ్రాంకులు వగైరాలచే ట్రాయెసు నొద్ద నోడెను.

453. అత్తిలుని మరణము.

క్రీ. శ.

455. వండాలులు రోమును దోపిడిచేసిరి.

476. ట్యూటను తెగలరాజగు ఒడోసరు పశ్చిమమున చక్రవర్తి లేడని కాంస్టాంటినోపిలుకు తెలియపఱచెను. పశ్చిమసామ్రాజ్యాంతము.

493. ఆస్ట్రగాతునాయకుడగు థియోడరికు ఇటలీ జయించి, దాని రాజయ్యెను; పేరుకు కాంస్టాంటినోపిలుకు సామంతుడైయుండెను. ఇటలీలో గాతికరాజులు వశపఱచుకొన్న భూములపై గాతులు రక్షకసైనికులుగా నుండిరి.

527. జస్టీనియను (రోమక) చక్రవర్తి.

529. వేయేండ్లుండిన ఆథెన్సులోని పాఠశాలల జస్టీనియను నిలుపుచేసెను. ఆతనిసేనాని యగు బెలిసారియసు నేపిల్సుపురమును పట్టుకొనెను.

531. మొదటి కొస్రోసు రాజ్యారంభము.

543. కాంస్టాంటినోపిలులో మహామారి.

553. జస్టీనియను ఇటలీనుండి గాతుల దొలగించెను.

565. జస్టీనియను మరణము.; రావెన్నా రోముల విడచి, చాలవరకు ఉత్తర ఇటలీని లొంబార్డులు జయించిరి.

570. మహమ్మదు జననము.

579. కొస్రోసు మరణము. లొంబార్డులు ఇటలీలో ప్రబలులైరి.

590. రోములో మహామారి వ్యాప్తి: రెండవ కొస్రోసు పాలనారంభము.

610. హెరాక్లియసు రాజ్యారంభము.

619. రెండవకొస్రోసు ఈజిప్టు జరూసలెం డమస్కసుల పాలించుచు హెలెస్పాంటునొద్ద సేనల నుంచెను. చీనాలో టాంగురాజవంశారంభము.

622 హిజీరా. (తురుష్కులశకారంభం. మహమ్మదు మక్కానుండి మెడీనాకు వెళ్లినసాలు.)

క్రీ. శ.

627. హేరాక్లియసు నినేవాయొద్ద పారసీకుల నోడించెను. చీనాలో తైత్సంగు చక్రవర్తి అయ్యెను.

* భారతదేశమున పులకేశి చాళుక్యరాజ్యవ్యాప్తి.

628. రెండవ కవధు తనతండ్రి కొస్రోసును చంపి రాజయ్యెను. మహమ్మదు ప్రపంచపు రాజులందరికి సందేశలేఖ లంపెను.

629. మహమ్మదు మక్కాకు తిరిగివచ్చెను.

632. మహమ్మదు మరణము. అబూబెకరు ఖలీఫా అయ్యెను.

634. యార్మకుయుద్ధము. ముస్లిములు సిరియా పట్టుకొనిరి. ఓమారు 2-వ ఖలీఫా అయ్యెను.

635. తైత్సంగు నెస్టరు మిషనరీల కాతిథ్య మిచ్చెను.

637. కడెస్సియా యుద్ధము.

638. జరూసలెం ఖలీఫాకు లొంబడెను.

* హర్షవర్ధనుని సామ్రాజ్యవ్యాప్తి

642. హేరాక్లియసు మరణము.

643 ఒత్మాను 3-వ ఖలీఫా అయ్యెను.

655. బైజంటైను నౌకాసేనను మహమ్మదీయు లోడించిరి.

668. కాంస్టాంటినోపిలును మోయిజా (ఖలీఫా) సముద్రముపై ముట్టడించెను.

687. హెర్స్టాలు వాసియగు పెపిను ఆస్ట్రేషియా న్యూస్ట్రియాల నేకము చేసెను.

711. ఆఫ్రికానుండి మహమ్మదీయసేన స్పెయినులోనికి దాడిసల్పెను.

715. ఖలీఫా (1-వ వాలిదు) సామ్రాజ్యము స్పెయినునుండి చీనావరకు వ్యాపించెను.

717-18 వాలిదు కుమారుడు సులైమనుకు కాంస్టాంటినోపిలు లొంగలేదు.

క్రీ. శ.

732. చార్లెసు మార్టెలు తురకల పోయిటీర్సుయొద్ద నోడించెను.

751. పెపిను ఫ్రెంచిరాజుగా నభిషిక్తు డయ్యెను.

768. పెపిను మరణము. సుమారీకాలంలో భారతదేశంలో శంకరాచార్యుల జీవితం.

771. చార్లమను చక్రవర్తి అయ్యెను.

774. చార్లమను లంబార్డీ జయించెను.

786. హారూన్-అల్-రషీద్ బగ్దాదులో ఖలీఫా అయ్యెను. (809 వరకుండెను.)

795. 3-వ లియో పోపయ్యెను. (816 వరకుండెను.)

800. చార్లమనుకు పోపు పట్టాభిషేకము చేసెను.

802. చార్లమనునొద్ద రక్షితుడైయుండిన ఎగ్బర్టు (ఇంగ్లండులోని) వెస్సెక్సుకు రాజయ్యెను.

810. బల్గేరియారాజగు క్రము నిసెఫరసు చక్రవర్తి నోడించి చంపెను.

814. చార్లమను మరణము.

828. ఎగ్బర్టు ఇంగ్లండు కంతకు మొదటిరాజయ్యెను.

843. లూయీ మరణము. కార్లవింగుల సామ్రాజ్య విచ్ఛిత్తి. (962 వరకు క్రమమగు పవిత్ర రోమకచక్రవర్తులు లేరు)

850. ఔత్తరుడగు రురిక (రష్యాలోని) నొవగారడ్ కీఫ్‌లల రాజయ్యెను.

852. బోరిసు బల్గేరియాకు మొదటి క్రైస్తవరాజయ్యెను.

865.
904. } ఔత్తరులగు రష్యనులనౌకలు కాంస్టాంటినోపిలును ముట్టడించెను.

912. దోపిడిదారగు రోల్ఫు నార్మండీ అధిపుడయ్యెను.

919. హెన్రీ ది ఫౌలరు జర్మనీ రాజయ్యెను.

936. హెన్రీ తరువాత 1-వ ఒట్టో జర్మనీ రాజయ్యెను

క్రీ. శ.

941. రష్యానౌకలు మరల కాంస్టాంటినోపిలును ముట్టడించెను.

962. జర్మనీరాజగు 1-వ ఒట్టో పోపుచే మొదటిసార్గను చక్రవర్తిగా నభిషిక్తుడయ్యెను. సుమారీకాలంలో మనదేశంలో శ్రీరామానుజుల జీవితారంభం.

987. హుకాపె ఫ్రెంచిరాజయ్యెను. (ఫ్రెంచి) కార్లవింగువంశాంతము.

1016. ఇంగ్లండు, డెన్మార్కు, నార్వేలకు కన్యూటు రాజయ్యెను.

1043. రష్యానౌకలు కాంస్టాంటినోపిలును ముట్టడించెను.

1066. ఇంగ్లండును నార్మండీ సామంతుడగు విలియము జయించెను.

1071. సెల్జుకు తురుష్కులక్రింద ఇస్లాము బలీయమయ్యెను. మెలాస్గర్డు యుద్ధము.

1073-1085. హిల్డెబ్రాండు (7-వ గ్రెగరీ) పోపయ్యెను.

1084. రాబర్టు గిస్కార్డు (నార్మను) రోమును దోపిడిచేసెను.

1087-99. 2-వ అర్బనుపోపు.

1095. 2-వ అర్బను క్లెర్మంటునొద్ద మొదటి మతయుద్ధ మేర్పాటు చేసెను.

1096. అమతయోధులు హతులైరి.

1099. బోయిలను రాజగు గాడ్ఫ్రే జెరూసలం పట్టుకొనెను

1147. రెండవ క్రైస్తవమతయుద్ధము.

1169. సలాదీను ఈజిప్టు సుల్తానయ్యెను.

1176. పోపు (3-వ అలెగ్జాండరు) సర్వాధికారమును ఫ్రెడరికుబార్బ రోసా (వెనిసునొద్ద) అంగీకరించెను.

1187. సలాదీను జెరూసలెమును పట్టుకొనెను.

1189. మూడవ క్రైస్తవమతయుద్ధము.

క్రీ. శ.

1198. స్థాణీశ్వరమున మహమ్మదుగోరి పృథ్వీరాజు నోడించెను. హిందూ రాజ్య క్షీణతారంభము.

1198-1216. 3-వ ఇన్నోసెంటు పోపయ్యెను. సిసిలీరాజగు (4 ఏండ్ల వయస్సుగల) 2-వ ఫ్రెడరికు పోపు పోషణలో నుండెను.

1202. 4-వ దండు మతయోధులు ప్రాచ్య 'రోమక' సామ్రాజ్యం ముట్టడించిరి.

1204. కాంస్టాంటినోపిలును లాటినులు పట్టుకొనిరి.

1214. చెంగిజ్ఖాను పెకినుపురమును పట్టుకొనెను.

1226. అస్సిసినివాసి అగు సెంటుఫ్రాంసిసి మరణము.

1227. చెంగిజ్ ఖాను కాస్పియనుసముద్రము మొదలు శాంతసముద్రము వరకు పాలించి చనిపోయెను. ఒగ్డైఖాను ఆనంతరాధిపు డయ్యెను.

1228. 2 వ ఫ్రెడరికు 6-వ మతయుద్ధ మారంభించి జెరుసలెం సంపాదించెను.

1240. మంగోలులు కీఫ్పురము నశింపజేసి, రష్యాను వశముచేసుకొనిరి.

1241. సైలీషియాలో లిగ్నిజువద్ద మంగోలుల విజయము.

1250. హోహెన్స్టాఫేనువంశపు చివరరాజగు 2-వ ఫ్రెడరికు పోయెను.

1251. మంగూఖాను మంగోలుచక్రవర్తి యాయెను, కుబ్లైఖాను చీనాకు సామంతు డయ్యెను.

1258. హులగుఖాను బాగ్దాదుపురమును బట్టుకొని నశింపజేసెను.

1260. కుబ్లైఖాను సామ్రాజ్యాధిపుడాయెను.

1216. గ్రీకులు లాటినులనుండి తిరుగ కాంస్టాంటినోపిలుపురమును రాబట్టుకొనిరి.

1273. హాబ్సుబర్గు వంశీయుఁడగు రుడోల్ఫు చక్రవర్తిగా ఎన్నుకొనబడెను. స్విట్జర్లండు ప్రజలు తమ సమిష్టిరాష్ట్రము నేర్పరచుకొనిరి.

క్రీ. శ.

1280. కుబ్లైఖాను చీనాలో యువానువంశరాజ్యము స్థాపించెను.

1292. కుబ్లైఖాను మరణము.

1293. విజ్ఞానసూచకుడగు రోజరుబేకను మరణము.

1348. యూరపులో మహామారిచే అనేకుల మరణము.

1360. చీనాలో మంగోలురాజ్యము పోయి 1644 వరకు మింగువంశ పాలన జరిగెను.

1377. పోపు (11-వ గ్రిగరీ) రోమునకు తిరుగ చేరెను.

1378. క్రైస్తవమతపీఠవిభాగము. 6-వ అర్బనురోములోను. 7-వ క్లిమెంటు అవిగ్నన్‌లోను పోపులైరి.

1398. 'హస్సు' ప్రేగులో విక్లిఫ్ పక్షమతము బోధించెను.

1414-1418. కాంస్టాంటులో మతసభ; హస్సును దహింపజేసి చంపుట (1415)

1417. మతపీఠవిభాగ మంతమొందెను.

*1450-55 యూరపు (జర్మనీ) లో ముద్రణారంభము.

1453. 2-వ మహమ్మదురాజు నాయకత్వమున తురుష్కులు కాంస్టాంటినోపిలుపురము పట్టుకొనిరి.

1480. 3-వ ఇవాను (మాస్కో అధిపుడు) మంగోలులనుండి స్వతంత్రత నొందెను.

1481. ఇటలీపై దాడివెడల బోవుచుండగ 2-వ మహమ్మదు (తుర్కీ సుల్తాను) మరణము.

1486. 'డయజు' దక్షిణాఫ్రికా దక్షిణాగ్రముచుట్టి హిందూమహాసము ద్రము చేరెను.

1492. కొలంబసు అట్లాంటికుసముద్రము దాటి అమెరికా చేరెను.

క్రీ. శ.

1493. మొదటి మాక్సిమిలియను చక్రవర్తి అయెను.

1498. వాస్కోడగామా దక్షిణాఫ్రికా దక్షిణాగ్రముచుట్టి భారత దేశము వచ్చెను.

1499. స్విట్జర్లండు స్వతంత్రరిపబ్లికు అయ్యెను.

1500. 5-వ చార్లెసు జననము.

1509. 8-వ హెన్రి ఇంగ్లండు రాజయ్యెను.

1513. 10-వ లియో పోపయ్యెను.

1515. 1-వ ఫ్రాన్సిసు ఫ్రెంచిరాజయ్యెను.

*1517. జర్మనీలో ప్రొటెస్టంటు మతారంభము.

1550-66 సులైమను మహాశయుండు సుల్తానయి, బాగ్దాదునుండి హంగెరీ వరకు పాలించెను. 5-చార్లెసు చక్రవర్తి అయ్యెను.

1525. భారతదేశమున బాబరు (మొదటి) పానిపట్ యుద్ధము గెల్చి, ఢిల్లీ పట్టుకొని, మొగలు సామ్రాజ్యము స్థాపించెను.

1527. ఇటలీలో జర్మనుసేనలు బోర్బనుసేనాని నాయకత్వమున రోమును కొల్లగొట్టెను.

1529. సులైమాను వియన్నాపురమును ముట్టడించెను.

1530. 5-వ చార్లెసు పోపుచే నభిషిక్తుడయ్యెను. 8-వ హెన్రీ పోపు సంస్థతో కలహ మారంభించెను.

1539. యేసుసమితి స్థాపన.

1546. మార్టిను ల్యూథరు మరణము.

1547. 4-వ 'ఇవాను' 'జారు' (రష్యాచక్రవర్తి) బిరుదు వహించెను.

1556. 5-వ చార్లెసు రాజ్యత్యాగము. ఇగ్నేషియసు మరణము.

1556-1605. హిందూస్థానమున అక్బరు (మొగలుచక్రవర్తి) పాలనము.

1558. 5-వ చార్లెసు మరణము.

క్రీ. శ.

*1565. తాలికోట యుద్ధము: విజయనగరరాజ్యపతనం.

1566. సులైమాను మహాశయుని మరణము.

1603. 1-వ జేమ్సు బ్రిటను రాజయ్యెను.

1620. అమెరికాలోని 'న్యూప్లిమత్'కు 'మేప్లవర్' అను పడవపై ఆంగ్లేయులు వలస మొదలిడిరి. అచట జేమ్సుటవునులో నీగ్రో బానిసల దిగుమతి ఆరంభము.

1625. 1-వ చార్లెసు ఇంగ్లండురాజు.

1626. సర్ ఫ్రాన్సిస్ బేకను (వెర్యులం ప్రభువు) మరణము.

1643. 14-వ లూయీ (ఫ్రాన్సులో) 72 యేండ్ల పాలనారంభము.

1644. చీనాలో మింగువంశము స్థానమున మంచూవంశరాజ్య మారంభించెను.

1640. వెస్ఫేలియాసంధి; అందుచే హాలండ్ స్విట్జర్లండులలో రిపబ్లికు పాలన స్థిరపరుపబడెను; ప్రష్యా ప్రముఖమయ్యెను. ఫ్రాండు యుద్ధము; ఫ్రెంచిరాజు జయము.

1649. 1-వ చార్లెసు (ఇంగ్లీషురాజు) శిరచ్ఛేదము.

1658. ఔరంగజేబు (మొగలు చక్రవర్తి) రాజ్యారంభము. ఇంగ్లండులో క్రామ్వెల్ మరణము.

1660. 2-వ చార్లెసు (ఇంగ్లండు) రాజ్యారంభము.

1674. (అమెరికాలో) న్యూ ఆమ్స్టర్డమ్ బ్రిటిష్వారికి స్థిరపడి, న్యూయార్కు అను పేరొందెను.

*1680. ఛత్రపతి శివాజీ పట్టాభిషేకము; మహారాష్ట్రరాజ్యస్థాపనం.

1683. వియన్నాపై తురుష్కుల కడపటి ముట్టడిని పోలండురాజగు 2-వ జాను ఆపెను.

1689-1725. రష్యాలో పీటరు మహాశయుండు చక్రవర్తిగ పాలించెను.

1701. 1-వ ఫ్రెడరికు ప్రష్యా రాజయ్యెను.

క్రీ. శ.

1707. ఔరంగజేబు మరణము. మొగలుసామ్రాజ్యవిచ్ఛిత్తి కారంభము.

1713. ప్రష్యాలో ఫ్రెడరిక్ మహాశయుని జననము.

1715. ఫ్రాన్సులో 15-వ లూయీ పాలనారంభము.

*1748 మూడవ పానిపట్టుయుద్ధము.

1755-63. అమెరికాలోను భారతదేశమందును అధికారముకై ఇంగ్లీషు ఫ్రెంచివారల యుద్ధము. ఫ్రాంసు, ఆస్ట్రియా, రష్యాలు మిత్రులైరి బ్రిటను ప్రష్యా ఏకమయ్యెను. (ఏడేండ్లయుద్ధము.)

*1757. ప్లాసీయుద్ధము.

*1758. చెందుర్తియుద్ధము. ఆంధ్రదేశపు ఉత్తరసర్కారులు ఫ్రెంచివారి నుండి ఇంగ్లీషువారి వశమయ్యెను.

1759. ఇంగ్లీషుసేవాని "వుల్ఫ్" కనడాలోని క్విబెక్‌ను పట్టుకొనెను.

1760. 3-వ జార్జి బ్రిటిషురాజయ్యెను.

1763. పారిసుసంధి; కనడా ఇంగ్లీషువారికి చేరెను. బ్రిటిషువారు భారత దేశమున ప్రబలులైరి.

1769. నెపోలియన్ బోనపార్ట్ జననము.

*1773. భారతదేశమున బ్రిటిషు గవర్నరు జనరలులపాలనారంభము.

1774 (ఫ్రాన్సులో) 16-వ లూయీ రాజ్యారంభము.

1776. అమెరికా సంయుక్తరాష్ట్రముల స్వాతంత్ర్యప్రకటనము.

1783. బ్రిటనుకు సంయుక్తరాష్ట్రములకు సంధి.

1787. ఫిలడల్ఫియా సభవారు అమెరికా సంయుక్తరాష్ట్రములకు ఫెడరల్ రిపబ్లిక్ పాలనము నిర్ణయించిరి. ఫ్రాంసు దివాలాస్థితి.

1788. న్యూయార్కులో సంయుక్తరాష్ట్రముల కాంగ్రెసు ప్రథమ సమావేశము.

క్రీ. శ.

1789. ఫ్రెంచిప్రజాసభ కూడెను. బాస్టైలుకోటను ప్రజలు పట్టుకొనిరి.

1791. ఫ్రెంచిరాజు వారెన్నుకు పారిపోయెను.

1792. ఫ్రాంసుకు ఆస్ట్రియా ప్రష్యాలతో సమరారంభము. వాల్మీ యుద్ధము. ఫ్రాంసు రిపబ్లికు ఆయెను.

1793. (ఫ్రెంచిరాజగు) 16-వ లూయీకి శిరచ్ఛేదము.

1794. రాబస్పియరు శిరచ్ఛేదము. జాకొబిన్ రిపబ్లిక్ అంతము.

1795. ఫ్రాంసులో డైరక్టర్ల పాలన. విప్లవము నణచి నెపోలియను సేనానాయకుడై, ఇటలీ జయింప వెళ్లెను.

1798. నెపోలియను ఈజిప్టుకయనము; నైలుయుద్ధము.

1799. నెపోలియను వచ్చి, ఫ్రాంసులో సర్వాధికారి అయ్యెను.

1804. నెపోలియను చక్రవర్తి అయ్యెను. 2-వ ఫ్రాంసిసు 1805-లో ఆస్ట్రియాచక్రవర్తి బిరుదు వహించి, 1806-లో 'పవిత్రరోమక చక్రవర్తి' బిరుదు వదిలెను.

1806. జీనాయుద్ధమున నెపోలియను ప్రష్యనుల నోడించెను.

1808. నెపోలియను తనసోదరుడగు జోసెఫ్ను స్పెయినురాజుగా జేసెను.

1810. స్పెయినుపాలనమందలి అమెరికారాజ్యములు స్వతంత్రరిపబ్లికు లయ్యెను.

1812. నెపోలియను మాస్కో దండయాత్రనుండి మరలెను.

1814. నెపోలియను రాజ్యత్యాగము. 18-వ లూయీ ఫ్రెంచిరాజయ్యెను.

1824. 10-వ ఛార్లెసు ఫ్రెంచిరా జయ్యెను.

1825. రష్యాలో 1-వ నికొలసు ప్రభుత్వారంభము. మొదటి రైలు (ఇంగ్లండులో స్టాక్టనునుండి డార్లింగ్టను వరకు.)

1827. నవరినోయుద్ధము.

క్రీ. శ.

1829. గ్రీసు స్వతంత్రమయ్యెను.

1830. లూయీ ఫిలిప్ (ఫ్రెంచిరాజు) 10-వ చార్లెసును తొలగించెను, బెల్జియం హాలండునుండి విడెను. 'సాక్జికోబర్గు గోతా' నాయకుడగు లియోపాల్డు ఆదేశము (బెల్జియం) రాజయ్యెను. రష్యా అధీనమగు పోలండు తిరుగుబాటుచేసినను వ్యర్థమయ్యెను.

1833. లండనులో ఇండియాగూర్చి క్రొత్తచట్టం. రామమోహన మృతి.

1835. 'సాంఘికవాద' ప్రశంసారంభము.

1837. విక్టోరియారాణి పాలనారంభము.

1840. విక్టోరియారాణికి ఆల్బర్టు యువరాజుతో వివాహము.

1852. 3-వ నెపోలియను ఫ్రెంచిరా జయ్యెను.

1854-56 క్రిమియను సమరము.

1856. రష్యాలో 2-వ అలెగ్జాండరు పాలనము.

*1857. భారతదేశమున సిపాయీల యుద్ధము.

*1858. భారతదేశమున బ్రిటిషుప్రభుత్వపు ప్రత్యక్షపాలనారంభము.

1861. విక్టర్ ఇమాన్యుయల్ ఇటలీ రాజయ్యెను. అబ్రహాంలింకను అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్షుడయ్యెను. అచట అంతర్యుద్ధము మొదలిడెను.

1865. అప్పమటక్సునొద్ద అమెరికనుల దక్షిణసేన సంయుక్తపక్షమునకు లోబడెను. జపానుకు ప్రపంచముతో సంబంధ మేర్పడెను.

1870. 3-వ నెపోలియను (ఫ్రెంచిరాజు) జర్మనీపై యుద్ధ మారంభించెను.

1871. పారిసు జర్మనులకు లోబడెను. ప్రష్యారాజు జర్మనుచక్రవర్తి ఆయెను. ఫ్రాంకుఫర్టు సంధి.

1878. బెర్లినుసంధి; అంతట 36 ఏండ్లు పశ్చిమయూరపులో సాయుధ శాంతి.

క్రీ. శ.

*1885. భారతదేశమున జాతీయమహాసభారంభము.

1888. 2 వ ఫ్రెడరికు, తరువాత 2-వ విలియం, జర్మనుచక్రవర్తు లైరి.

*1894-95. చీనా జపాను యుద్ధము.

*1899-1905. భారతదేశమున కర్జను ప్రభువు పాలనము; బోయరు యుద్ధము.

*1900. చీనాలో బాక్సరు తిరుగుబాటు.

1904-5 రష్యా, జపాను యుద్ధము. కొరియా జపానీయుల వశమయ్యెను.

1906. మనదేశంలో జాతీయోద్యమపు దృఢత్వం.

1912. చీనా రిపబ్లికు అయెను.

1913. దక్షిణాఫ్రికాలో గాంధి సత్యాగ్రహపు విజయం.

1914. యూరపు మహాసంగ్రామ మారంభించెను.

1917. రష్యాలో విప్లవములు; అచట బొల్షివికురాజ్యస్థాపనము.

*1918. మహాయుద్ధసమాప్తి.

*1919. భారతదేశమున రాజ్యాంగసంస్కరణము, అశాంతి, వర్సైల్సుసంధి

1920. నానాజాతిసమితి మొదటిసమావేశము. అందు జర్మనీ, అస్ట్రియా, రష్యా, టర్కీలకు స్థానము లేకుండెను. అమెరికా సంయుక్తరాష్ట్రము అందు చేరలేదు.

1921. జాతిసమితిని ధిక్కరించి గ్రీకులు టర్కీపై యుద్ధముచేసిరి.

* భారతదేశమున అహింసాయుద్ధపు అరంభము; టర్కీ రిపబ్లికుస్థాపనము.

1922. ఆసియామైనరులో టర్కీవారు గ్రీకుల నోడించిరి.

* ఐరిషుఫ్రీస్టేటు రాజ్యాంగ మేర్పడెను.

*1923. టోకియో భూకంపము.

1924. (రష్యాలో) లెనిను మరణము.

క్రీ. శ.

*1925. పర్షియాలో, జాతీయసభవారు రష్యుటి షాను తొలగించి, రెజా ఖానును రాజుచేసిరి.

*1926. జపాను షాంఘైనగరమును ముట్టడించెను.

1928. రష్యాలో మొదట అయిదేండ్ల ప్రణాళిక మొదలు.

*1929. ఆఫ్ఘనిస్థాన విప్లవము; అమానుల్లా పదత్యాగము.

1930. జర్మను ప్రజాసభలో హిట్లరు కక్ష ఆరంభము.

* భారతదేశమున సవినయ శాసనభంగము.

*1931. స్పెయిను ప్రజాతంత్ర రాజ్యమాయెను.

జపాను మంచూరియా జహొలులపై దండయాత్ర చేసెను; గాంధీ-ఇర్విను ఏర్పాట్లు, ఇంగ్లండులో 'జాతీయప్రభుత్వా' రంభము.

1932. జర్మనీలో నాజీప్రభుత్వము; హిట్లరుకు అధికారప్రాప్తి.

*'మంచూకో'రాజ్యం జపానీయులు స్థాపించుట.

జపాను జాతిసమితిని వదలెను.

*భారతదేశమున మరల సత్యాగ్రహయుద్ధము.

*1933. హిట్లరు జర్మనీలో సర్వాధికారి ఆయెను. లండనులో ప్రపంచార్థికసభ. అమెరికా సంయుక్తరాష్ట్రమున రూస్వెల్టు పాలనారంభము. జర్మనీ జాతిసమితిని వదలెను.

*1934. భారతదేశమున బీహారులో భూకంపము. జర్మనీలో అధ్యక్షుడు హిండెన్బర్గు మరణము. సోవియట్ రష్యా నానాజాతిసమితిలో జేరెను. యూరపులో ఆయుధనిరోధసభ నిల్చిపోయెను.

*1935. సారుప్రాంతము జర్మనీలో చేరెను. రష్యా ఫ్రాన్సుల సంధి. హిట్లరు వర్సైల్సుసంధిని నిరాకరించెను; జర్మనీయం బహిరంగముగ

క్రీ. శ.

ఆయుధవృద్ధిని ఆరంభించెను. క్వెట్టాభూకంపము.

*అబిసీనియాపై ఇటలీ దండయాత్ర.

1936. అబిసీనియాపైగ ఇటలీవారి దురాక్రమణ.

చీనాలో అంతర్యుద్ధము.

జర్మనీ జపానుల రహస్యసంధి.

స్పెయిను ఎన్నికలలో ప్రజాపక్షజయము; ఫ్రాన్సులో తిరుగుబాటు.

రష్యను వైమానికులు ఉత్తరధ్రువముమీదుగా అమెరికాచేరి మరలి వచ్చిరి.

ఉత్తరఅమెరికా సంయుక్తరాష్ట్రములో రూస్వెల్టు మరల అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను.

*1937. రష్యాలో నూతనరాజ్యాంగనిర్మాణము.

జపాను ఇటలీ జర్మనీల రహస్యసంధి.

స్పెయిను అంతర్యుద్ధములో ఇటలీ జర్మనీలు విద్రోహులకు ప్రత్యక్ష సహాయము చేసిరి. జాతిసమితివారి 'తటస్థత.'

దక్షిణఐర్లండు "ఈర్" అను పేర స్వతంత్రరాజ్యమగుట.

భారతదేశమం దెన్నికలలో కాంగ్రెసు విజయము.

బర్మాను విడదీయుట.

చీనా జపాను యుద్ధారంభము.

పాలస్టైను విభజన; అరబ్బుఅల్లరులు.

షాంఘైపై ముట్టడి.

*1937. బ్రిటిషు ఫ్రెంచివారలు, అబిసీనియాలో ఇటలీ ఆధిపత్య మంగీకరించిరి.

జర్మనీ ఆస్ట్రియాను ఆక్రమించుట. జెకోస్లవేకియాతో తగవు.

బ్రిటిషువారు ఇటలీతో మధ్యధరాసముద్రవిషయమున సంధి.

క్రీ. శ.

*1939. రెండవప్రపంచయుద్ధము ఆరంభం; పోలండు ఆక్రమణ.

*1949. యూరపులో హిట్లరు విజృంభణ; ఫ్రాంసు పతనం. భారతదేశంలో ప్రతిష్టంభం, వ్యక్తిసత్యాగ్రహం.

*1941. రష్యాపైన జర్మనుల ప్రచండసంగ్రామం. ఆగ్నేయాసియాపైన జపాను విజృంభణ.

*1942. బర్మా, ఫిలిప్పైనులను జపాను జయించుట. ఇండియాలో బ్రిటిషు నిరంకుశత, యుద్ధసన్నాహాలు; 'క్విటిండియా' ఉద్యమం.

*1943. సిరియాకు పూర్ణస్వతంత్రత. స్టాలినుగ్రాడురంగంలో రష్యను విజయం. ఇండియాలో అధికారి దౌర్జన్యం.

*1944. జర్మనీపరాజయం, హిట్లరు మరణం, రష్యా అమెరికాల విజృంభణ.

*1945. జపానీయులపైన అమెరికను ఆటంబాంబుప్రయోగం, జపాను లొంగిపోవుట. ఐక్యరాజ్యసంఘుపుస్థాపన. మంగోలియను రిపబ్లికు.

*1946. ఇండోనీషియాలో డచ్చి దౌర్జన్యం, విప్లవం. ఫ్రాంసుకు మరల స్వతంత్రత. ఫిలిప్పైను రిపబ్లికు స్థాపన.

*1947. భారతదేశవిభజన. భారత, పాకిస్థాను, సింహళములలో డొమినియనుస్వరాజ్యపు ప్రారంభం.

*1948. బర్మాలో రిపబ్లికు స్థాపన.
ఢిల్లీలో గాంధీమహాత్ముని హత్య.

*1949. అస్సాం భూకంపం. చీనాలో ప్రజాస్వామిక రిపబ్లికు ప్రారంభం. తూర్పు పశ్చిమజర్మనీల చీలిక. వాటిలో రిపబ్లికుల స్థాపన. ఈరు రిపబ్లికు లగుట. ఇండోనీషియాకు స్వతంత్రత లభించుట.

*1950. భారతదేశంలో ప్రజాతంత్రకరిపబ్లికు స్థాపన. కొరియాలో యుద్ధారంభం.

క్రీ. శ.

*1951. బ్రిటనులో మరల కాంసర్వేటివు ప్రభుత్వం.
టిబెటులో చీనా ఆధిపత్యస్థాపన.
దక్షిణాఫ్రికాలో రంగుజాతుల నణచు క్రొత్తనిబంధనలు.

*1952. అమెరికాసంయుక్తరాజ్యపు ఎన్నికలలో రిపబ్లికను విజయం.
ఈజిప్టులో రాజుకు నిర్వాసనం, నగీబుపేసాని నియంతృత.

*1953. అమెరికాలో ఐసన్హోవరు అధ్యక్షత.
రష్యాలో స్టాలిన్ నియంతమరణం.

---

[ఈపట్టికలో '*' గుర్తుఉంచిన సంగతులు మూలమున లేవు. అవి ఇందు అదనముగ చేర్చబడినవి.]

అనుబంధము-2

# ప్రపంచపుస్థితిగతులు

## ముఖ్య దేశాల వివరణ

| దేశంపేరు. | విస్తీర్ణం. (చదరపు)మైళ్లు (వేలసంఖ్యను) | జనసంఖ్య. (లక్షలు సంఖ్యను) | రాజధాని. |
|---|---|---|---|
| రష్యా,సంయుక్త సోవియటు సమితి. | 8707 | 1944 | మాస్కో |
| ఆశియాఖండం | 16990 | 11500 | |
| చీనామహారాజ్యం | 4300 | 4635 | పీకింగు |
| భారతదేశం (ఇండియా) | 1221 | 3610 | క్రొత్తఢిల్లీ |
| పాకిస్తాను | 366 | 756 | కరాచీ |
| ఫిలిప్పైను | 115 | 200 | క్వెజను |
| జపాను | 682 | 832 | టోకియో |
| మంగోలియా | 1750 | 50 | ఉలన్ బటర్ ఖటో |
| ఇండోనీషియా | 218 | 604 | జకర్తా |
| ఇండోచీనా | 281 | 270 | సైగాన్ |
| సయాం (తాయ్‌లండ్) | 200 | 180 | బాంకక్ |
| మలయా | 50 | 50 | కోలాలంపూరు |
| బర్మా | 254 | 170 | రంగూన్ |
| సింహళం | 25 | 67 | కొలంబో |

| దేశం పేరు. | విస్తీర్ణం. (చదరపు)మైళ్లు (వేలసంఖ్యను) | జనసంఖ్య. (లక్షలు సంఖ్యను) | రాజధాని. |
|---|---|---|---|
| భూతాను | 18 | 3 | పునఖా |
| నేపాలు | 54 | 70 | ఖట్మాండు |
| టిబెతు | 463 | 30 | లాసా |
| ఇరాను (పర్షియా) | 634 | 190 | టహారన్ |
| అఫ్ఘనిస్థాను | 270 | 120 | కాబూలు |
| ఇరాకు | 150 | 30 | బగ్దాదు |
| సౌదీ అరేబియా | | | మెక్కా. |
| తుర్కీ | 300 | 210 | అంగారా |
| ఆఫ్రికాఖండం | 11500 | 1500 | |
| ఈజిప్టు | 383 | 190 | కైరో |
| సూడను | 1000 | 80 | ఖార్టూమ్ |
| దక్షిణాఫ్రికాసమితి | 473 | 120 | ప్రిటోరియా, కేపుటౌను |
| అబిసీనియా | 350 | 150 | అడిస్ అబాబా |
| మొరాకో | 314 | 90 | ఫెజ్ |
| ఉత్తర అమెరికా | 8500 | 1800 | |
| కనడా | 3547 | 138 | ఒట్టావా |
| సంయుక్తరాజ్యం (U.S.A.) | 3027 | 1580 | వాషింగ్టను |
| మెక్సికో | 760 | 253 | మెక్సికో |
| దక్షిణ అమెరికా | 6314 | 838 | |
| బ్రెజిలు | 3300 | 520 | రయోడిజనీరో |
| అర్జెంటినా | 1113 | 170 | బయోనిస్ ఐరిస్ |
| బొలీవియా | 416 | 39 | లాపాజ్ |
| పెరూ | 482 | 84 | లీమా |

| దేశం పేరు | విస్తీర్ణం (చదరపుమైళ్లు) (వేలసంఖ్యను) | జనసంఖ్య (లక్షలు సంఖ్యను) | రాజధాని |
|---|---|---|---|
| వెనెజులా | 363 | 50 | కరాకాస్ |
| చిలీ | 290 | 40 | సాంటియాగో |
| యూరపు | | | |
| ఆంగ్ల దేశం (బ్రిటను) | 95 | 500 | లండను |
| ఈరు (ఐర్లండు) | 26 | 30 | డబ్లిను |
| ఫ్రాన్సు | 213 | 400 | పారిసు |
| జర్మనీ | 181 | 800 | బోన్, బెర్లిన్ |
| స్వీడెను | 173 | 70 | స్టాక్ హోం |
| నార్వే | 125 | 31 | ఓస్లో |
| స్పెయిను | 195 | 283 | మాడ్రిడు |
| పోర్చుగలు | 35 | 85 | లిస్బను |
| ఇటలీ | 131 | 462 | రోము |
| జెకో-స్లవేకియా | 55 | 143 | ప్రేగు |
| పోలండు | 120 | 250 | వార్సా |
| హాలండు | 13 | 75 | హేగు |
| స్విట్జర్లండు | 16 | 47 | బెర్ను |
| బల్గేరియా | 43 | 70 | సోఫియా |
| హంగరీ | 36 | 92 | బుడాపెస్టు |
| యుగోస్లావియా | 100 | 162 | బెల్గ్రేడు |
| ఆస్ట్రియా | 32 | 68 | వియన్నా |
| గ్రీసు | 51 | 79 | అథెన్సు |
| ఆస్ట్రేలియా | 3000 | 75 | కాన్బెర్రా |
| న్యూజీలండు | 105 | 15 | వెల్లింగ్టను |

## ముఖ్యమతములవారు

| మతస్థులు | కోట్లలో |
|---|---|
| క్రైస్తవులు | |
| i. కాతలికులు | 48 |
| ii. ప్రొటస్టంట్లు ఇత్యాదులు | 27 |
| కంఫ్యూషియనులు (చీనులు) | 40 |
| ముస్లిములు | 30 |
| హిందువులు | 30 |
| బౌద్ధులు | 20 |
| ఆదిమజనులు | 15 |
| షింటోలు (జపానులో) | $3\frac{1}{2}$ |
| యూదులు | 2 |
| ఇతరులు | 5 |

## ముఖ్యజాతులు

| జాతులు | కోట్లలో |
|---|---|
| ఆర్యులు | 84 |
| ద్రావిడులు | 9 |
| మంగోలియనులు | 76 |
| మలయనులు | 11 |
| సెమిటికులు | 12 |
| నీగ్రోలు | 12 |
| ఆస్ట్రేలాయిడు ఇత్యాదులు | 16 |



## విద్య, దామాషా ఆయుస్సు, జననమరణములు

| దేశం | అక్షరజ్ఞులు | దామాషా ఆయుస్సు | నూటికి జననం | నూటికి మరణం |
|---|---|---|---|---|
| భారత్ (ఇండియా) | 17 | 30 | 3.3 | 2.7 |
| బ్రిటను | 92 | 63 | 1.8 | 1.1 |
| ఫ్రాన్సు | 94 | 59 | 2.0 | 1.8 |
| జర్మనీ | 98 | 64 | 1.6 | 1.0 |
| అమెరికా | 94 | 65 | 1.8 | 1.1 |
| ఆస్ట్రేలియా | 92 | 60 | 2.3 | 1.0 |
| జపాను | 98 | 52 | 3.4 | 1.2 |
| చీనా | — | 48 | — | — |

---

## మహానగరములు

| నగరం | ఏదేశపుది | జనసంఖ్య లక్షలు |
|---|---|---|
| లండను | ఇంగ్లండు (బ్రిటను) | 88 |
| న్యూయార్కు | అమెరికా సం. రా. | 80 |
| టోకియో | జపాను | 69 |
| బెర్లిను | జర్మనీ | 53 |
| మాస్కో | రష్యా | 41 |
| చికాగో | అమెరికా సం. రా. | 34 |
| షాంఘై | చీనా | 40 |
| ఒసాకా | జపాను | 32 |
| లెనిన్‌గ్రాడు | రష్యా | 32 |
| పారిసు | ఫ్రాంసు | 30 |
| కలకత్తా (విస్తృతం 5 కోట్లు) | ఇండియా | 28 |
| బొంబాయి | ,, | 28 |
| ఢిల్లీ | ,, | 17 |
| మదరాసు | ,, | 14 |
| డెట్రోయి | అమెరికా | 15 |
| హైదరాబాదు | ఇండియా | 12 |



## ఆయాముఖ్యభాషలవారు

| భాష | | కోట్లు |
|---|---|---|
| చీనాభాషీయులు | | 47 |
| ఇంగ్లీషు (అమెరికనుసహా) | | 22½ |
| హిందూస్తానీ | హిందీ | 22 |
| | ఉర్దూ | 4 |
| రష్యను | | 17 |
| జర్మను | | 8 |
| జపానీ | | 8 |
| బెంగాలీ | | 6 |
| ఫ్రెంచి | | 6 |
| జవనీసు (జావా) | | 4 |
| ఇటాలియను | | 4 |
| ఆంధ్రులు | | 3½ |
| అరబ్బీ | | 3 |
| తమిళులు | | 2½ |
| మహారాష్ట్రులు | | 2 |
| గుజరాతీలు | | 1½ |
| కన్నడులు | | 1½ |
| మళయాళీలు | | 1½ |

| | జాతీయాదాయము | తల 1-కి దామాషారాబడి |
|---|---|---|
| ఇండియా | 8710 కోట్లు | రు., 255 |
| అమెరికా సం. రా. | 70000 ,, | రు. 4600 |
| ఆస్ట్రేలియా | 1875 ,, | రు. 2500 |
| బ్రిటను | 1500 ,, | రు. 3000 |

## అనుబంధము-3

# పారిభాషికపదసూచి

అక్షము Axis
అంగభంగము Self-mutilation.
అక్షౌహిణి Host; Huge army.
అగ్నిపర్వతప్రకోపము Volcanic eruption.
అచిత్, నిర్జీవ Lifeless; non-living.
అజీవయుగము Azoic Age.
అజీవశిల Azoic rock.
అణుబాంబు Atom bomb.
అత్యుజ్వలము, ఉజ్వలము Incandescent.
అంతర్జాతీయము International.
అంతర్యుద్ధము Civil War.
అంతశ్శక్తి Latent force or power.
అధినివేశము Dominion.
అన్వేషకులు Explorers.
అమృతత్వము, నిత్యత్వము Immortality.
అమ్మవారిదేవతలు Mother Gods.
అయోమయము Made of iron; Creating confusion.
అరుణుడు Uranus.
అల్పగ్రహములు Planetoids.
అస్థిపంజరము,కంకాళము Skeleton.
ఆత్మశక్తి Soul force.
ఆదిమజ్ఞానము Primitive thought.
ఆనువంశిక Hereditary.
ఆయుధనిరోధము Disarmament.
ఆర్థిక ప్రాబల్యము Economic Domination.
ఆర్యజాతి Aryan race; Nordic race.
ఆవిరిబండి Locomotive.
ఆవిరియంత్రము Steam engine.
ఆవిష్కరణము, ఆవిష్కారము Invention or Discovery by experiments.
ఆసారనిర్ఝరము Torrent formed by down-pour of rain.
ఆస్తిహక్కు Property right; Proprietorship.
ఇతిహాసము History.
ఈతతిత్తి Swimming bladder.
ఉదయనరుడు Eonthropus.
ఉదయశిలలు Eoliths.

ఉపశాఖ Species.
ఉభయచరములు Amphibia.
ఉల్క Meteor.
ఏకేశ్వరత్వము Monotheism.
ఐక్యరాజ్యసంఘం United Nations Organisatior.
ఐతిహ్యము Tradition of stories.
ఐహికబాధలు Mortifications of the world.
ఔత్తరాహులు Northmen.
కక్ష Orbit.
కర్బనకరము Carboniferous.
కర్మకాండ Ceremonial observance.
కర్మాగారపద్ధతి Factory system.
కర్ణకుహరము Ear drum.
కార్మికులు Factory workmen; Labourers.
కల్పము Eon; Period of several ages.
కాలక్రమనిర్ణయము Chronology
కళాదేవతలు Muses. (Gk)
కళాలయము Museum( „ )
కులీనులు Aristocrats.
కూర్మయుగము Coal swamp and Reptile ages.
కూర్మజాతి Newts.
కృత్రిమకళ Artifice.
కృషిరసాయనము Agricultural Chemistry.
కొరతవేయుట Crucifixion.
క్రాంతి Revolution.
క్రాంతివృత్తము Course of the Orbit.
ఖగోళకాంతి Stellar light..
ఖండాంతరసామ్రాజ్యము Overseas Empire.
ఖనిజము Mineral
గచ్ఛన్నరవానరుడు Pithecanthropus Erectus.
గాథామయము Mythological.
గాథలు Chronicles (Biblical).
గోపరాజులు Shepherd kings.
గోళప్రాయము Spheroid.
గౌణము Secondary.
గ్రహకుటుంబము Planetary system.
చరాచరప్రాణులు Animal and vegetable beings.
చాపయోడ Sailing ship.
చిత్; చేతన Living.
చిత్రలిపి; చిత్రాక్షరలిపి Picture writing.
చిత్రాక్షరములు Heiroglyphics; Picture letters.

చిల్లరజనులు Proletariat.
చీడపురుగులు Trilobites.
చోదన Impulse.
జంతుప్రదర్శనశాల Zoological garden.
జలాంతస్తంత్రులు Cables.
జంతుశాస్త్రజ్ఞులు Zoologists.
జాతిశాస్త్రజ్ఞులు Ethnologists.
జాతిసమితి League of Nations.
జాతీయసంపద National wealth.
జాతీయాహంకారము National Egotism.
జీవపరిణామము, జీవవికాసము Organic evolution.
జీవప్రకృతిచరితము Natural History.
జీవప్రకృతిజ్ఞులు Naturalists.
జీవరసాయనజ్ఞుడు Biochemist.
జీవరసాయనశాస్త్రము Organic Chemistry.
జీవాంగతత్వజ్ఞులు Anatomists.
జీవిప్రసవి Viviparous.
జీవ్యంగశస్త్రచికిత్స Vivisection.
జ్ఞానపునర్వికాసము Renaissance.
జ్యోతిశ్శాస్త్రము Astronomy.
తత్వశాస్త్రము Philosophy.
తారతమ్యగాథాశాస్త్రము Comparative Mythology.
తారతమ్యభాషాశాస్త్రము Comparative Philology.
తారతమ్యమతశాస్త్రము Comparative Religion
తార్కికులు Sophists (Gk).
తృణాహారి Herbivorous.
త్రిమూర్తులు Trinity of Gods.
దశకము Decade.
దాస్యపద్ధతి Slave System.
దుర్భిణి Optical glass.
దూరదర్శిని Telescope.
దేవసమన్వయము Theocrasia.
దేవాంశరాజత్వము System of 'God-king'.
దేశద్రోహము Treason.
దేహాంగసామ్యము Anatomical resemblance.
దేహనాళములు; నాళములు Tissues.
ద్రవ్యవిషయములు Financial and monetary matters.
ధర్మము Righteousness.
ధాన్యదేవత Corn God; Harvest God.
ధార్మికజీవితము Religious life.
ధార్మికాందోళనము Religious agitation.
ధ్రువము Pole.

నరతత్త్వజ్ఞుడు Anthropologist.
నరవానరుడు Apeman.
నవజీవయుగము Cainozoic Age.
నవశిలాయుగము Neolithic Age.
నవార్థికవిధానము New Economic Policy.
నారసింహులు Neanderthalers etc.
నిత్యత్వాభాసము Quasi eternal stability.
నిర్జలప్రళయదశ Dry and bitter Age.
నిసర్గవరణము Natural selection.
నీలగోధుమవర్ణులు Brunet people.
నీహారము Nebula.
నైతికపునర్నిర్మాణము Moral rearmament.
పరమహిమము Extreme snow; inscrutable power.
పరమాణువు Atom.
పరిణామము Evolution.
పరివర్తనము Revolution.
పరిశోధనతత్త్వజ్ఞులు Experimental Philosophers.
పరిశోధనశాస్త్రము Experimental Science.
పరిసరము Environment.
పర్వతోత్క్షేపము Mountain upheaval.
పవిత్రరోమకసామ్రాజ్యము Holy Roman Empire.
పాలకవర్గము Bureaucracy.
పురాణజీవయుగము Palaeozoic Age.
పురాతత్త్వజ్ఞులు Archeologists.
పువ్వరలు Gills.
పూర్వశిలాయుగము Palaeolithic Age.
పూర్వార్ధగోళము, పూర్వార్ధప్రపంచము Old World; Eastern Hemisphere.
పుంజీపతులు; పెట్టుబడిదార్లు capitalists.
పొరలు Strata; Layers.
పొలుసులు Scales.
పౌరస్వత్వము, పౌరత్వభావము, Spirit and Rights of Citizenship.
ప్రకృతిశక్తులు, ప్రాకృతికశక్తులు Natural Forces.
ప్రజాసత్తాకము Democratic.
ప్రగతి Progress
ప్రజాతంత్రకము Republic.
ప్రతినిధిప్రభుత్వము Representative Government.
ప్రథమశాఖ Primates.
ప్రధాని Princeps (Roman).

ప్రభుత్వమతపీఠము State Church.
ప్రభుసభ House of Lords.
ప్రమ Accurate knowledge.
ప్రాచీనశిథిలము Archeological remains.
ప్రాతనిబంధన Old Testament.
భద్రతాసమితి Security Council
బృహద్భారతము, భారతవర్షము Greater India.
భావపరిశీలనశాస్త్రము Psycho-analysis.
భావోద్రేకము High Emotion.
భాషాశాస్త్రజ్ఞులు Philologists.
భూతత్త్వజ్ఞులు Geologists.
భూతత్త్వశాస్త్రము, భూగర్భశాస్త్రము Geology.
భూపటలము. భూమిపెచ్చు Earth's crust.
భూతలము Earth's surface.
భౌతికశక్తి Mechanical power
భౌతికశాస్త్రము Physical Science.
భౌతికవిపర్యయము Physical upheaval.
భ్రమ Fetich; Misconception.
మతద్వేషి Heretic.
(క్రైస్తవ) మతపీఠము. మతసంస్థ, Church (Christian).
మతమూర్ఖత Religious intolerance.
మతయుద్ధము Crusade.
మతశాస్త్రము Theology.
మతసంస్కారము Reformation.
మతహింస Religious persecution.
మధ్యజీవయుగము Mesozoic age.
మధ్యధరాప్రాంతము Mediterranean region.
మధ్యకాలము Middle Ages.
మనశ్శాస్త్రము, మనస్తత్త్వము Psychology.
మన్వంతరము Period of several ages.
మహాగ్రీసు Magna Grecia.
మహామారి Pestilence; Plague.
మాంసాహారి Carnivorous.
మిశ్రజాతి Mixed race.
మిశ్రదేశము Egypt.
మురుగుయుగము రొంపియుగము Age of swamps.
మూర్తిపూజ Idol worship.
మృగయులు Hunters.
మోతశక్తి Tonnage.
యవనులు Greeks; Ionians.
యాంత్రికనాగరికత Mechanical civilisation.

యాంత్రికపరివర్తనము Mechanical revolution.
యుగము Age; Cycle.
యుగసంధి Period of change of the Age.
యూదులు Jews.
రసవాదజ్ఞులు Alchemists.
రాక్షసపుటీకలు Dragon flies.
రాజత్వము Monarchy.
రాజవంశము Dynasty.
రాజ్యాంగము Constitution.
రాజ్యాంగవేత్త Statesman.
రాజ్యాంగశాస్త్రము Political Science.
రాద్ధాంతము Speculative theory
లోహతత్వము, లోహవిజ్ఞానము Metallurgy.
వరుణుడు Neptune.
వలస Colonial.
వంశాస్థికజాతి, వెన్నెముకగల Vertebrate class.
వస్తువినిమయము, సాటా Barter.
వాగ్మిత్వము Elocution.
వాస్తుశిల్పి, విశ్వకర్మ Architect.
విజ్ఞులు Experts; Specialists.
విజ్ఞానము Science.
విద్యుత్తంత్రి Electric telegraph.
విద్యుచ్ఛకటము Electric car or train.
విప్లవము Revolution.
విపర్యాసము Convulsion; degeneration.
విశ్వజనీనత Universalism.
విశ్వశక్తులు Forces of the Universe.
వైజ్ఞానికసూత్రము Scientific Theory.
వ్యక్తిమోక్షము Personal salvation.
వ్యాసము Diameter.
శతాబ్ది Century.
శతపదములు Centepedes.
శాస్త్రీయపరిశోధకులు Scientific researchers.
శిలాధాతువులు, శిలాజీవశేషములు Fossils.
శిలాద్రవము Molten rock; lava.
శిలాశాసనము Rock edict.
శిలాశిల్పి Sculptor.
శిలువ Cross. (Xian)
శిష్టసభ Senate; Upper House.
శ్రమణకులు Buddhist monks.
సంఘర్షోష్ణము Frictional heat.
సంఘస్వామ్యము Communism; Bolshevism; Sovietism.

# సవరణపట్టిక

| పుట. | పంక్తి. | ఉన్నది. | ఉండవలసినది |
|---|---|---|---|
| 5 | 1 | పెక్కిలి | మిక్కిలి |
| 17 | 21 | విధ్య | వింధ్య |
| 24 | 4 | మరున | మర్ధున |
| 24 | 20 | మాత్రం | మాత్తం |
| 29 | 5 | యవర | యవసర |
| 34 | 21 | దక్షిణార్యులు | దాక్షిణాత్యులు |
| 44 | 3 | నన్పుడు | నప్పుడు |
| 47 | 10 | లేక భావ | లేకభావ |
| 54 | 9 | సంచరించి | సంచరించిన |
| 71 | 7 | యకునేలు | యనేకులు |
| 72 | 16 | విద్యాంంతులు | విద్యావంతులు |
| 92 | 6 | వైనుండి | వైపునుండి |
| 100 | 22 | 400 | 4000 |
| 105 | 6 | భాకుటుంబము | భాషాకుటుంబము |
| 116 | 15 | వీరి | వీరు |
| 122 | 18 | ప్రదేశము | ప్రవేశము |
| 124 | 14 | నుంచినట్లు | ఎంచినట్లు |
| 178 | 13 | దాని | దానివల్ల |
| 182 | 20 | దాళ్వారము | దాళ్వారులు |
| 185 | 24 | పింపబడి | స్థాపింపబడి |
| 205 | 24 | నమతము | జైనమతము |
| 207 | 25 | హగుద్ద | హద్దగు |

| పుట. | పం_క్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 238 | 17 | దాబీపుందగు | దారగుపుంజీ |
| ·60 | 8 | భావ | భాస |
| ·84 | 5 | 3, 4 వ | 2, 3 వ |
| 84 | 16 | ప్రస్తుతము | లోగడ |
| 84 | 18 | నిప్పుడు | లోగడ |
| 84 | 22 | బడుచున్నది | బడినది |
| 33 | 7 | మహుమతి | బహుమతి |
| 97 | 22 | వతాబ్దా | శతాబ్దా |
| 00 | 23 | 292-296 | 242-246 |
| )6 | 4 | మందుట | మగుట |
| 24 | 24 | పదతి | పద్ధతి |
| 47 | 10 | దశము | దశకము |
| 69 | 10 | ప్రంపంచ | ప్రపంచ |
| 80 | 1 | అనుహా° | అమహా° |
| 00 | 7 | ప్రతర్థి | ప్రత్యర్థి |
| 05 | 4 | కుంట | కుండ |
| 05 | 21 | నోడెను. | రమ్యను లోడిరి. |
| 07 | 6 | విషయము | విషము |
| 10 | 24 | గల్ల | గల్గించి |
| ·16 | 17 | దేశ_క్తి | దేశభ_క్తి |
| ·19 | 20 | నాయంద్ధాంతము | ఆయంద్ధాంతము |
| ·28 | 20 | నిర్ణాత | నిర్ణీత |
| ·29 | 3 | స్వామ్యసంఘ | సంఘస్వామ్య |
| 29 | 23 | 10 | 16 |
| 32 | 6 | నిరంధ | నిర్బంధ |
| 32 | 19 | చున్నాడు | చుండెను |

| పుట. | పంక్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 540 | 9 | కా | స్వతంత్రులుకా |
| 542 | 11 | తట | తటస్థత |
| 544 | 2 | యైచోన | యైనచో |
| 544 | 8 | చంపింపెను. | చంపించెను. |
| 550 | 21 | పుంజపతి | పుంజీపతి |
| 552 | 6 | నావిమర్కణ | నావిష్కరణ |
| 555 | 3 | నిర్వణ్ణులై | నిర్విణ్ణులై |
| 556 | 21 | భిన్నభిన్న | ఛిన్నభిన్న |
| 559 | 7 | మూర్ఘ | మూర్ఖ |
| 569 | 12,13 | అధ్యక్షుని | అధ్యక్షుడు |
| 572 | 23 | మగుదయమను | మగుదమను |
| 578 | 6 | 48 | 46 |
| 580 | 12 | సేనాల | సేనల |
| 581 | 7 | జను | శాసనసభ్యు |
| 582 | 24 | చర్చ | చర్య |
| 583 | 20 | పాకిస్తానుల | పాకిస్తానీల |
| 587 | 15-వ పంక్తి నుండి 588 పుట తుది వరకు | | 584 వ పుట చివర భాగంగా చదువుకొనలెను |
| 590 | 3,4 | మంత్రయు | మంత్రయు పాలించెడు |
| 590 | 9 | ధాస్తము | ధాస్త్రము |
| 591 | 3 | సాగించి | సాగించిన |
| 592 | 3 | సమన్వయము | సమన్వయముకు |

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1953.